ఓమ్.

# శ్రీ దేవాంగపురాణము.

ఆంధ్రతాత్పర్య సహితము.






నెల్లూరుజిల్లా: సంతపేట వాస్తవ్యులగు

గోమేధికం. ఓం. శ్రీ శంకరస్వాములవారి వలనను

---

గోదావరిజిల్లా: పుల్లేటికుర్తివాస్తవ్యులగు

శ్రీమల్లక్ష్మీశ్రేష్ఠి - కాళహస్తి సిద్ధాంతిగారివలనను,



చెన్నపురి: పాతచాకలపేట

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షర శాలాధికారియగు

పమ్మి - త్యాగరాయసెట్టిగారిచే

ముద్రించి ప్రకటింపఁబడియె.

1914.



గోమేధికం. ఓం. శ్రీశంకరస్వాములవారు,

సంతపేట, నెల్లూరు.

ఈ గ్రంథము వెల ౧౮ అణాలు.

శ్రీ ర స్తు.

శ్లో. మహానందీశ్వరస్వామి నామా దేవాంగ వంశజః,
అస్తిశంభు సమఃకశ్చి త్ప్రియసీ యస్యపార్వతీ. ౧
శ్లో. శివకేశవావభిన్నా వితీవ శైవా న్వయోదితోప్యద్ధా,
సూను స్తస్యచకాశే నారాయణ సంజ్ఞ యాససంజీవః. ౨
శ్లో. నారాయణ పయోబ్ధీందుః కామాక్షీ ప్రాణవల్లభః,
శంకర శ్శంకరస్సాక్షా ద్రేజే సద్గుణ శేవధిః. ౩
శ్లో. చాముండా చరణారవింద మకరం దాస్వాదనేం దిందిర,
శ్శ్రీగోమేధిక వంశమౌ క్తిక మణి శ్శిష్యాళి సంసేవితః,
మిత్రోపాసన లబ్ధకీర్తిరస కృత్తీర్థాటనే తత్పరః,
ప్రఖ్యాత స్తనయోస్య శంకరగురుస్వామీ విజేజీయతే. ౪
శ్లో. గంగవర హేమకూటా పీఠౌ తౌ నిత్యమధికృతౌ తేన,
శ్రీదేవాంగ పురాణ ప్రకటన మకరోత్స సమ్ముదేచ సతాం. ౫



శ్లో. గోత్రే బభూవ విమలే కిలకౌశికీయే,
గోమేధికోప పదభూషిత రామనామా,
బాలాచ యస్యరమణీమణి రచ్ఛకీర్తిః,
శ్రీహేమకూట మఠపంజర రాజహంసః. ౧
శ్లో. తస్యావిరాస శశిశేఖర పాదపద్మ,
సంపూజన ప్రవణమానస వృత్తిరిద్ధః,
సంజీవయా తరుణితల్లజ యాసనాథః,
నారాయణ స్సకలశిష్య జనావనాఽర్హః. ౨
శ్లో. తస్యాఽన్వయార్ణవ తుషారమరీచిరార్యః,
నందీశ్వర స్సఖలు నందిత నందికేతుః,
పార్వత్యభూ దసిత పంకజ పత్రనేత్రా,
యస్య ప్రియా సముదితాఖిల సద్గుణాస్య. ౩
శ్లో. తత్పుత్రోఽభూ ద్విమలధిషణాఽధీత సర్వాగమోఽసౌ,
చాముండాయా శ్చరణకమలాఽఽరాధనాఽబద్ధబుద్ధిః,
ఆచార్యత్వేగురునియమితో హేమకూటాద్రిపీఠే,
కామాక్ష్యాస్తు ప్రియసహచర శ్శంకరాచార్యపాదః. ౪

శ్లో. సోయంకాశీ ప్రభృతిషుసదా ఽరాధయామాసదేవం,
పుణ్యక్షేత్రే ష్వమలయశసా భూషయామాసలోకం,
శిష్యేష్వంత స్తమసమఖిలం నాశయామాసశశ్వత్,
హేమ్నఃకూటే గురుభిరమలై ర్వా ర్తయామాసవాసం. ౫

శ్లో. యచ్చాసౌ శిథిలం సమీక్ష్యకృపయా స్వీయం పురాణం మహత్,
శ్రీబ్రహ్మాండ పురాణవారిధికలా పూర్ణేందు బింబాయితం,
తద్దేవాంగ పురాణ మాద్యమధునా ముద్రాపయత్యంజసా,
యావత్కల్పమియం హి శంకరగురోః కీర్తిస్సముజ్జృంభతాం. ౬

ఉ. శ్రీకరమైనవిద్య నుతిసేయ దలంచెద నాదివేల్ప నా,
వాకువశీకరంబు ఘనవశ్యముగాను ప్రసన్నురాలవై,
నాకును జాలసంపదలు నవ్యతరంబుగ నిచ్చిబ్రోవవే,
నీకు నమస్కరించెదను నిత్యకృపాంబుధి చౌడమాంబికా.

శ్లో. సచ్చిదానందకందాయ బిందునాద పరాత్మనే,
ఆదిమధ్యాంత శూన్యాయ గురుణా గురవేనమః. ౧

శ్లో. కంహాళక్షేత్ర రామేశే కామితే ఫలదాయకే,
దేవాంగ గురురిత్యేషాం శివాద్వైత మతఃప్రియః. ౨

శ్లో. రకారం రుద్రరూపంచ మకారం శక్తిరూపకం,
ద్వయం రూపం శివం శక్తి రామాక్షర మయం శివం. ౩

శ్లో. ప్రథమం కాశిక్షేత్రంచ శ్రీశైలంచ ద్వితీయకం,
తృతీయం హేమకూటంచ శోణాచల చతుర్థకం,
పంచమం శంభుశైలంచ పంచశైలం ప్రకీర్తితం,
దేవాంగ గురుపీఠానాం మనుబ్రహ్మం జగద్గురుం. ౪

శ్లో. రేవణో మరుళశ్చైవ పండితో గగనస్తథా,
ఏకోరామ గురుంచైవ పంచాచార్యాః ప్రకీర్తితాః. ౫

శ్లో. శ్రీకంఠాచ్చ్యుత బ్రహ్మేంద్ర సూర్యార్యాణాచ నరాణాం,
ఏతేషాం సూత్రకర్తారం మనుబ్రహ్మాంచ దేవలం. ౬

శ్లో. కైలాసే శంభుశైలేచ స్థితం గాయత్రిపీఠకం,
పాలయంతం మహాత్మానం మనుబ్రహ్మాం జగద్గురుం. ౭

శ్లో. నిగమాగమసద్దేవం నిత్యసత్య ప్రభావం,

సగుణ నిర్గుణరూపం సర్వసుజ్ఞానదీపం,
సర్వసురాసురవంద్యం చారు వేదాంతవేద్యం,
వినుత గుణాగ్రగణ్యం స్వయం దేవాంగమీశం. ౮

శ్లో. ఆచార్యేంద్ర శిరోమణిం గుణనిధిం శ్రీచూడమాంబాసుతం,
గంభీరార్ణవ రామలింగ గురుపాలోత్పన్న చింతామణిం,
వందే వేదవిదోవదంతి మనువంశాంభోధి చంద్రోదయం,
చక్రేశామను సూత్రమేవ దతులం శ్రీయేకోరామా ప్రభుం. ౯

శ్లో. దేవాంగశ్చసదాచారీ పునర్జన్మంతు బ్రాహ్మణః,
తత్రాపి పునర్జన్మంచ జాయతే సప్తనామకః. ౧౦

శ్లో. విద్యాధర శ్చిత్రయోగీ సాదుకో పుష్పదంతకః,
భేతాళ వరరుచిర్దాసో దేవాంగ స్సప్తనామకః. ౧౧

శ్లో. ఏకోరామార్యరచితే సప్తావారేషు దేవలః,
మనుసూత్ర ప్రకారేణ సర్వశాస్త్రేషు సమ్మతం. ౧౨

దేవాంగ విరచితము.

మనుసూత్రము, ఋగ్వేదభాష్యం, మనుస్మృతి, గాయత్రిసూత్రం, మనుజ్ఞానశాస్త్రం, వర్ణాశ్రమనిఘంటు, దేవరాజఛందస్సు, సూత్రనిఘంటు; దేవలోపనిషత్తు, దేవలజైమినిసంవాదం, విద్యాధరవిరచితం, మంత్రశాస్త్రం, మనుకల్పం, వేదాంతకుఠారం, మనుశిల్పి, దేవలజయస్తంభ, శంభుశిఖాసూత్రం, ప్రణవసూక్తం, దేవస్మృతి, దేవలోపాఖ్యానం, గాయత్రీభాష్యం, యజ్ఞోపవీతసూక్తం, పంచయజ్ఞనిర్ణయం, సన్ధ్యాభాష్యం, రుద్రభారతము, దేవీమాహాత్మ్యము, శ్రీగిరిజాకల్యాణం, పుష్పదంతవిరచితం, మహిమ్నస్తోత్రం, సుజ్ఞానదీపిక, ఉత్తరమీమాంసం, అగ్నిసూక్తం, బ్రహ్మోపదేశనిర్ణయం, దేవరాజశేఖరం, వేదాంకుశం, దేవీభాగవతం, దేవరత్నాకరం, మేరుచరిత్ర, భేతాళ విరచితం, భేతాళోపాఖ్యానం, భేతాళ పంచతంత్రి, ధనుశ్శాస్త్రం, చౌషష్టికళాసూక్తం, మదనశాస్త్రం, యంత్రనిఘంటు, భూతసూక్తం, భైరవసూక్తం, మల్లుసాధననిర్ణయం, మంత్రశాస్త్రం, వరరుచి విరచితం, సూత్రనిఘంటు, గణితశాస్త్రం, చంద్రసిద్ధాంతం, సూర్యసిద్ధాంతం, దత్తమీమాంసం, కౌముదీవ్యాకరణం, త్రిలింగనిఘంటు, వస్తుఆయుర్నిర్ణయం, భాగశాస్త్రం, యోని నిఘంటు, పిండోత్పత్తిశాస్త్రం, సంధిసూత్రం, నరపింగతిశా

స్త్రం, న్యాయబోధిని, చందోజ్ఞం, లక్షణశాస్త్రం, స్వరసూత్రం, షట్ సూత్రనిఘంటు, వేదాంగమాల, ఆయుర్వేదము, దైవశాలివిరచితం, దేవకల్పం, ప్రామాణ్యవాదం, ఆత్మదర్పణం, వాదజ్ఞానమంజరి, పూర్వప్రయోగము, అపరప్రయోగము, దేవరహస్యం, జ్ఞానరత్నమాల, సుజ్ఞానదీపిక, జ్ఞానదర్పణము, పంచశిఖానిర్ణయము, దాస్మయ్యవిరచితం, దేవాంగమూలస్తంభం, ప్రభుశిఖారత్నం, శైనాగమము, పండితారాధ్యచరిత్ర, దాస్మయ్యకాలజ్ఞానం, వీరాగమము, శైవసిద్ధాంతము, ఏకవింశతి దీక్షావిధి, లక్షణగ్రంథము, శ్రవణాంకుశం, తంతుసూత్రం, శృంగారబీజనిర్ణయం, అంబాస్తుతి, గురుస్తోత్రము.

శ్లో. మను బ్రహ్మకులేజాతం గర్భబ్రాహ్మణ నిశ్చయం,
శూద్రత్వం నాస్తి తద్వంశం దేవాంగో బ్రహ్మరూపిణే. ౧

శ్లో. మంగళం భగవాన్ శంభో మంగళం వృషభధ్వజః,
మంగళం గిరిజాధీశ స్సర్వత శ్శుభమంగళం. ౨

శ్లో. మంగళం భగవతీదేవీ మంగళం మహిమోదయే,
మంగళం త్రిజగన్మాతః సర్వతో శుభమంగళం. ౩

శ్లో. మహిషఘ్ని మహామాయే చాముండేముండమాలినీ,
ఆయురారోగ్యమైశ్వర్యం దేహి దేవి నమోస్తుతే. ౪

శ్లో. చౌడేశ్వరీ నమస్తుభ్యం రామలింగార్యధీమతే,
నిత్యాయ నిర్వికల్పాయ సచ్చిదానందరూపిణే. ౫
హూం పాహి నమోస్తుతే.

---


పుట. విషయసూచిక.

శ్రీశంకరాచార్యాష్టకము. చిదానందాష్టకము. పంచాక్షరస్తోత్రము. నిర్వాణషట్కము. పరమేశ్వరాష్టకము. మూలస్తంభనము.

౩. దేవాంగసంభవమనునది మొదటియధ్యాయము.

౧౬. చౌడేశ్వరీ వరప్రసాదము, రాక్షసోపాఖ్యానము నన్నది రెండవయధ్యాయము.

౩౨. దేవాంగుడనుపేరుగల దేవలుని పట్టాభిషేక మనునది మూడవయధ్యాయము.

౪౦. సునాభోపాఖ్యానమనునది నాల్గవయధ్యాయము.

౫౦. యక్షోపాఖ్యానమనునది యైదవయధ్యాయము.

౫౭. రాక్షసశాపవిమోచనమనునది యాఱవయధ్యాయము.
౭౧. నేతసామగ్రిని సంపాదించుట, చౌడేశ్వరి యిచ్చిన వస్త్రాభిషయవర ప్రదానము నన్నది యేడవ యధ్యాయము.
౭౭. దేవాంగ దేవలోక వస్త్రప్రదానమన్నది యెనిమిదవయధ్యాయము.
౮౨. దేవాంగ మర్త్యపాతాళలోక వస్త్రప్రదాన మన్నది తొమ్మిదవయ ధ్యాయము.
౮౮. దేవాంగ శంకర వస్త్రప్రదాన నందిధ్వజ సంపాదనమన్నది పదియవ (యధ్యాయము.
౯౯. దేవాంగునికిరంభాశాపప్రదానమన్నది పదునొకండవయధ్యాయము.
౧౦౯. దేవాంగునివివాహమన్నది పండ్రెండవయధ్యాయము.
౧౨౦. దేవాంగరాజ్యపరిపాలనమన్నది పదుమూఁడవయధ్యాయము.
౧౨౫. రాక్షసులయుద్ధసంరంభమన్నది పదునాల్గవయధ్యాయము.
౧౩౧. దేవదానవసేనాయుద్ధమన్నది పదునైదవయధ్యాయము.
౧౪౦. వ్యాఘ్రవక్త్రిమన్నది పదునాఱవయధ్యాయము.
౧౪౭. ధ్వజప్రభావరాక్షసమన్నది పదునేడవయధ్యాయము.
౧౫౩. దేవాంగునియవతారపరిపూర్తియన్నదిపదునెనిమిదవయధ్యాయము.
౧౬౪. విద్యాధరప్రశంసయన్నదిపందొమ్మిదవయధ్యాయము.
౧౭౦. పుష్పదంతోపాఖ్యానము, భేతాళశాపప్రదానము నన్నది యిరువది యవయధ్యాయము.
౧౮౧. చంద్రశర్మోపాఖ్యానమన్నది యిరువదియొకటవయధ్యాయము.
౧౯౦. విక్రమార్కోపాఖ్యానమన్నది యిరువదిరెండవయధ్యాయము.
౨౦౧. విక్రమార్కోపాఖ్యానమునందు బేతాళునిఁ బట్టుకొనుటయన్నదియి రువదిమూఁడవయధ్యాయము.
౨౧౩. బేతాళపంచవింశతికథాకథనమన్నదియిరువదినాల్గవయధ్యాయము.
౨౨౪. బేతాళునిశాపవిమోచనమన్నది యిరువదియైదవయధ్యాయము.
౨౩౬. వరరుచియవతారమన్నది యిరువదియాఱవయధ్యాయము.
౨౭౮. దేవశాలియవతారపరిపూర్తియన్నదియిరువదియేడవయధ్యాయము.
౩౦౫. దేవదాసునియవతార కథాపరిపూర్తియన్నది యిరువది యెనిమిదవ యధ్యాయము.
౩౨౭. దేవాంగవంశకథనమన్నది యిరువదితొమ్మిదవయధ్యాయము.

విషయసూచిక - సమాప్తము.

# శ్రీ శంకరాచార్యాష్టకము.



శ్లో. శ్రీశంకరార్యవరపాదసరోరుహైక సేవాపరో భవతుసచ్ఛివదః ప్రజానామ్,
మిథ్యాప్రపంచబృహదర్ణవమగ్నచిత్త సంతారణైకపరతత్త్వవిచారపోతః.

తా. సంపద్యుక్తులయిన శ్రీశంకరాచార్యులవారి పాదపద్మములను సేవించునట్టివాఁడు, జనులకందఱికిని మంచి బ్రహ్మానందసుఖము నిచ్చువాఁడుగను, మరియు మిథ్యాప్రపంచమనెడి గొప్ప సముద్రమందు మునిఁగినవారి నుద్ధరించుటకు కారణమైన పరతత్త్వవిచారమనెడి నావయను సాధనమును గలవాఁడుగను, అగుచున్నాఁడు. ౧

శ్లో. లసన్మందహాసంసుధామూర్తిభాసం తమోరూపపాపప్రణాశైకహంసమ్,
స్ఫురద్రత్నభూషం సదాభక్తపోషం భజే శంకరాచార్య పీఠప్రపూజ్యమ్.

తా. మందహాస సుందర వదనారవిందముగలిగినట్టియు, చంద్రసమానమైన దేహకాంతికలిగినట్టియు, సర్వపాపములనెడి యంధకారమును పోఁగొట్టుటయందు సూర్యస్వరూపుఁడైనట్టియు, ఎల్లప్పుడును నిజభక్తులను పోషించునట్టి శంకరాచార్యపీఠస్థులయిన, గురుమూర్తులను నేనుసేవించుచున్నాఁడను.

శ్లో. క్షమోత్కృష్టవాసం సదార్చావిలాసం పరబ్రహ్మవిజ్ఞాన విద్యావిశేషమ్,
సుధాస్వాదుభాషం సురేంద్రప్రవేషం భజేశంకరాచార్యపీఠప్రపూజ్యమ్.

తా. భూదేవికన్న నుత్కృష్టమైన యోర్పుగలవారును, సర్వదా శివపూజాతత్పరులును, పరబ్రహ్మ విద్యావిశేషముగలవారును, అమృతమును తిరస్కరించు మాధుర్యముగల మంజుభాషణము గలవారును, సురేంద్రాది వైభవోపేతులును, శంకర పీఠపూజ్యులు నయిన యాచార్యులను సేవించుచున్నాఁడను. ౨

శ్లో. సుశాంత్యాతితోషంవినష్టప్రదోషం సువేదాంతసూత్రప్రబోధాతిశేషమ్,
సదాతీర్థవాసం సురర్షిప్రభాసం భజే శంకరాచార్య పీఠప్రపూజ్యమ్.

తా. మిక్కిలిశాంతి సంతోషముకలిగినట్టియు, దోషమునుపోఁగొట్టునట్టి తపస్సామర్థ్యము కలిగినట్టియు, మంచి వేదాంతసూత్రముల బోధాతిశయము కలిగినట్టియు, సర్వదాతీర్థములయందు వాసముచేయునట్టియు, దేవమునులతో సమానప్రభావముగలయట్టియు, శంకరపీఠాధిపతులను సేవించుచున్నాఁడను.

శ్లో. నృసింహాభిధేశం విశేషప్రకాశం సమాధ్యష్టయోగ ప్రణష్టాతిరోషమ్,
తపోధ్వస్తకామంతమూభూపమానం భజే శంకరాచార్యపీఠప్రపూజ్యమ్.

తా. నృసింహభారతులను నామధేయము గలిగినవారును, మిక్కిలి ప్రకాశము గలవారును, అష్టాంగయోగములచేత కొట్టఁబడిన రోషముగల వారును, తపస్సుచే త్రోయఁబడిన కామముగల వారును, అనేక రాజన్యులచే సమ్మానమును పొందినట్టి వారునగు శంకర పీఠాధిపతులను సేవించుచున్నాఁడను. ౪

శ్లో. సదాధ్యానలోలం నరాచింత్యలీలం విరాజత్కిరీట ప్రభారత్నజాలమ్,
దురాత్మాతికాలం కరాధ్యక్షమాలం భజే శంకరాచార్యపీఠప్రపూజ్యమ్.

తా. నిరంతరధ్యానలోలుఁడును, మానవులకూహింప నలవిగాని లీలలు కలవాఁడును, కిరీట రత్నకాంతులచే భాసమానుఁడును, దుష్టచిత్తులపాలికి కాలరూపుఁడును, కరతలమునందు ప్రకాశించెడి జపమాల గలిగినవాఁడును అగు శంకరాచార్య పీఠాధిపతిని సేవించెదను. ౫

శ్లో. లసద్భూతిఫాలం మనోహారిశీలం కవాటాతికాంత ప్రవక్షోవిశాలమ్,
స్ఫురద్రత్నచేలం వరజ్ఞానలీలం భజే శంకరాచార్య పీఠప్రపూజ్యమ్.

తా. భస్మత్రిపుండ్రాంకిత ఫాలభాగము గలిగినట్టివాఁడును, మనోహరమైన యాచారము గలిగినట్టివాఁడును, కవాటములను బురడించునట్టి విశాల వక్షఃస్థలము గలవాఁడును, ప్రకాశించెడి రత్నచేలము గలిగినట్టివాఁడును, పరబ్రహ్మజ్ఞానముచే పరితృప్తుఁడైనవాఁడు నగు శంకర పీఠాధిపతిని సేవించుచున్నాఁడను. ౬

శ్లో. విశుద్ధాంతరంగం మహాయోగిసంగం నిజానందసింధు ప్రమగ్నస్వచిత్తమ్,
సదాధ్యానపూతం ధరావ్యాప్తకీర్తిం భజే శంకరాచార్యపీఠప్రపూజ్యమ్.

తా. పరిశుద్ధమయినట్టి యంతరంగముగలవాఁడును, మహాయోగిజనుల సాంగత్యముగలవాఁడును, స్వకీయ బ్రహ్మానందాబ్ధియందుమునింగిన చిత్తము గలవాఁడును, నిరంతర నిధిధ్యానముచేత పవిత్రుఁడైనవాఁడును, సర్వదిగంతములయందు విశ్రాంతకీర్తిగలవాఁడును, శంకర పీఠాధిపతియునునైన యాచార్యుని భజించుచున్నాఁడను. ౭

శ్లో. నతాభీష్టపూరం స్తుతారిష్టహారం జనాలోకనేచ్ఛా వివృద్ధప్రకారమ్,

భజేచంద్రమౌళీశ పూజాపరంతం భజే శంకరాచార్య పీఠప్రపూజ్యమ్.

తా. నమ్రులయిన భక్తుల యభీష్టములను పూర్ణముచేయువాఁడును, స్తోత్రముచేయువారి యరిష్టములను పరిహారము చేయువాఁడును, సర్వజనులకు దర్శనేచ్ఛను వృద్ధిపొందించువాఁడును, చంద్రమౌళీశ్వర పూజాతత్పరుఁడును, అగు శంకర పీఠాధ్యక్షుఁడైన యాచార్యుని భజించుచున్నాఁడను. ౮

శ్లో. ఏనం స్తవంతరళభావయుతప్రపోతం
శుద్ధం విధాయకృతినో ముదితాభవంతు,
నోచేద్యదిప్రవిదుషాం సుకృతైకలబ్ధం
స్నేహార్ద్రివల్గుహృదయం సఫలం కథం స్యాత్.

తా. చంచలచిత్తముగల నాచే రచింపఁబడిన ఈ యాచార్యస్తోత్రమును పరిశుద్ధముగాచేసి పుణ్యాత్ములయిన విద్వాంసులు సంతోషచిత్తము గలవారగుదురుగాక, అట్లు లేనిపక్షమందు విద్వాంసులయొక్క హృదయమెట్లు సఫలమగును. ౯

శ్రీ శంకరాచార్యాష్టకము సంపూర్ణము.

# చిదానందాష్టకము.

శ్లో. అకారం ఉకారం మకారం తృతీయం సదానాదబిందూ కళాతీతపూతమ్,
హరిబ్రహ్మరుద్రం పరబ్రహ్మరూపం చిదానందరూపః శివోహం శివోహమ్.

తా. అకార, ఉకార, మకారములతో చేరినట్టి ప్రణవ స్వరూపుఁడును, నాదబిందుకళల నతిక్రమించిన పవిత్రమైనట్టివాఁడును, బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపుఁడును, పరబ్రహ్మరూపుఁడును, చిదానందరూపుఁడునైన శివుడే నేను, శివుఁడేనేను, అని శ్రీశంకరాచార్యులవారు చెప్పిరి. ౧

శ్లో. అనాకాశమాకాశ మాకాశరూపం నిరాకార సాకార ఓంకారగమ్యమ్,
సహస్రారమధ్యస్థబిందుస్వరూపం చిదానందరూపః శివోహం శివోహమ్.

తా. అవకాశములేనట్టియు, ఆకాశమువంటిరూపముకలిగినట్టియు, ఆకాశమువలె వ్యాపకమయినట్టియు, నిరాకారమయినట్టియు, సాకారమయినట్టియు, ప్రణవముచే గమ్యమానమయినట్టియు, సహస్రారకమలముయొక్క మధ్యభాగమందుండునట్టియు బిందుస్వరూపుఁడైన చిదానందరూపశివుఁడునేను.

శ్లో. సుషుమ్నాంతరస్థం పరబ్రహ్మనిత్యం మునిస్వాంతవేద్యం మహాపద్మపీఠమ్,
నిశాంతేదినాంతేఽత్రకాలేవసంతం, చిదానందరూపఃశివోహంశివోహమ్.

తా. సుషుమ్నానాడియొక్క మధ్యభాగమందుండునట్టియు, పరబ్రహ్మరూపుఁడై నట్టియు, నాశములేనట్టియు, మునుల మనస్సుచేత తెలియఁదగినట్టియు, మహాపద్మపీఠమందుండునట్టియు, రాత్రిపగళ్ళయందొక్క విధముగా నుండునట్టియు, చిదానందరూపుఁడయిన శివుఁడు నేను. ౩

శ్లో. అహం నిర్వికల్పో నిరాకారరూపీ విభుత్వాద్ధిసర్వత్ర సర్వేంద్రియాణామ్,
సదాసమ్మతం నవ్యముక్తిప్రబోధం చిదానందరూపఃశివోహంశివోహమ్.

తా. నేను వికల్పములు లేనివాఁడను, నిరాకారమైనవాఁడను, సర్వత్ర సర్వేంద్రియములకు ప్రభువును, సదాసమ్మతుఁడను, నూతనమయిన ముక్తి గలవాఁడను, జ్ఞానస్వరూపుఁడను, చిదానందుఁడు నయిన శివుఁడను నేను. ౪

శ్లో. నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖ్యం
నమంత్ర న్నతంత్రం నదేవా నయజ్ఞాః,
నహం భోజనం నైవభోజ్యం నభోక్తా
చిదానందరూపః శివోహం శివోహమ్.

తా. పుణ్యముకాను, పాపముకాను, సుఖముకాను దుఃఖముకాను, మంత్రముకాను, తంత్రముకాను, దైవతముకాను, యాగములుకాను, భోజనముకాను, భోజ్యముకాను, భోక్తయునుకాను, చిదానందరూపుఁడయిన శివుఁడే నేను. ౫

శ్లో. నగంధం నపుష్పం నధూపం నదీపం ననైవేద్యతాంబూలపుష్పాంజలిశ్చ,
కృతం సద్గురోఃపాదపద్మప్రణామం చిదానందరూపఃశివోహంశివోహమ్.

తా. గంధము నేనుకాను, పుష్పము నేనుకాను, ధూపము నేనుకాను, దీపము నేనుకాను, నైవేద్య తాంబూల పుష్పాంజలులు నేనుకాను, నాచేఁ జేయఁబడిన సద్గురు సాష్టాంగవందనము నేనుకాను, చిదానందరూపుఁడయిన శివుఁడు నేను. ౬

శ్లో. నజాగ్రన్న స్వప్నంచనాహంనసుప్తిర్నజీవాత్మకోయోంతరాత్మాపరాత్మా,
శరీరాభిమానం నతేజోవికారం చిదానందరూపః శివోహం శివోహమ్.

తా. జాగ్రత్తుకాను, స్వప్నముకాను, సుషుప్తికాను, జీవాత్మకాను, అం

తరాత్మకాను, పరాత్మకాను, శరీరాభిమానముకాను, తేజస్సుకాను, వికార ముకాను, చిదానందరూపుఁడయిన శివుఁడు నేను. ౭

శ్లో. చతుష్పాదయుక్తం సరోజంచచిత్తం షడారందశారం స్ఫురద్ద్వాదశారమ్,
దశేద్వంద్వయుక్తం సరోజం స్మరేయం
చిదానందరూపః శివోహం శివోహమ్.

తా. చతుర్దళములతో కూడియుండినట్టి మానస సరోజమును, పద్దళ చక్రమును, దశదళచక్రమును, ద్వాదశదళచక్రమును, ద్విదళచక్రమును స్మరించుచునుండు చిదానందరూపుఁడయిన శివుఁడునేను. ౮

శ్లో. నమేద్వేషరాగౌ నమేలోభమోహౌ మదోనైవమేనైవమాత్సర్యభావః,
నధర్మోనచార్థో నకామోనమోక్షశ్చిదానందరూపః శివోహంశివోహమ్.

తా. నాకురాగద్వేషములులేవు, లోభమోహములులేవు, మదములేవు, మాత్సర్యభావములేదు, ధర్మములేదు, అర్థములేదు, కామములేదు, మోక్షములేదు, చిదానందుఁడైన శివుఁడే నేను. ౯

శ్లో. నాహంప్రాణసంజ్ఞోనవాపంచవాయుర్నదారోసుతోనసప్తధాతుర్నకోశః,
నవాక్పాణిపాదానచోపస్థపాయూ చిదానందరూపఃశివోహంశివోహమ్.

తా. ప్రాణుఁడనివ్యవహరింపఁబడువాయువునేనుకాను, పంచవాయువులు నేనుకాను, దారాపుత్రాదులునేనుకాను, ధనమునేనుకాను, సప్తధాతువులు నేనుకాను, పంచకోశములు నేనుకాను, వాక్పాణి పాదపాయూపస్థలు నేను కాను, చిదానందరూపుఁడయిన శివుఁడు నేను, అని శ్రీశంకరాచార్యులవారు స్వానుభవమును నీయష్టకముచే వెల్లడిచేసిరి. ౧౦

ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత
చిదానందాష్టకం సమాప్తమ్.

# పంచాక్షరస్తోత్రము.

శ్లో. నాగేంద్రహారాయ త్రిలోచనాయ భస్మాంగరాగాయ మహేశ్వరాయ,
దివ్యాదిదేహాయ దిగంబరాయ తస్మై నకారాయ నమశ్శివాయ.

తా. నాగేంద్రుఁడే కంఠహారముగాఁ గలిగినట్టియు, మూఁడు నేత్రములు కలిగినట్టియు, భస్మమే యంగరాగముగాఁ గలిగినట్టియు, జగదీశ్వరుఁడైనట్టి

యు, దివ్యశరీరము కలిగినట్టియు, దిగంబరుఁడై నట్టియు, నకారస్వరూపుఁడై నట్టియు శివునికొఱకు నమస్కారము. ౨

శ్లో. మాతంగ చర్మాంబరభూషణాయ సమస్త గీర్వాణ గణార్చితాయ,
త్రైలోక్యనాథాయ పరాంతకాయ తస్మై మకారాయ నమశ్శివాయ.

తా. గజచర్మమనెడి వస్త్రమే భూషణముగాఁ గలిగినట్టియు, సమస్తదేవబృందముచేఁ బూజింపఁబడినట్టియు, త్రిలోకములకుఁ బ్రభువై నట్టియు, యమునికి శత్రువై నట్టియు, మకారస్వరూపుఁ డయినట్టియు, శివునికొఱకు నమస్కారము.

శ్లో. శివాయ గౌరీ వదనారవింద వీక్షాయ దక్షాధ్వరనాశనాయ,
చంద్రార్క బింబానలలోచనాయ తస్మై శికారాయ నమశ్శివాయ.

తా. మంగళకరుఁడై నట్టియు, గౌరీదేవియొక్క ముఖకమలమును వీక్షించునట్టియు, దక్షబ్రహ్మ యాగమును నాశముచేసినట్టియు, సూర్యచంద్రాగ్నులే నేత్రములుగాఁ గలిగినట్టియు, శికార స్వరూపుఁడయినట్టియు, శివునికొఱకు నమస్కారము. ౩

శ్లో. వసిష్ఠకుంభోద్భవగౌతమాది మునీంద్రవంద్యాయ గిరీశ్వరాయ,
శ్రీ నీలకంఠాయ వృషభధ్వజాయ తస్మై వకారాయ నమశ్శివాయ.

తా. వసిష్ఠాగస్త్య గౌతమ ప్రభృతులగు మునీంద్రులచే వంద్యుఁడయినట్టియు, కైలాసమున కీశ్వరుఁడై నట్టియు, నల్లనైన కంఠము కలిగినట్టియు, వృషభధ్వజము కలిగినట్టియు, వకార స్వరూపుఁ డయినట్టియు శివునికొఱకు నమస్కారము. ౪

శ్లో. యజ్ఞస్వరూపాయ జటాధరాయ పినాకహస్తాయ సనాతనాయ,
జ్ఞానాయ నిత్యాయ శివాయ తస్మై తస్మై యకారాయ నమశ్శివాయ.

తా. యజ్ఞస్వరూపుఁడై నట్టియు, జటాధరుఁడయినట్టియు, పినాకమను ధనుస్సును హస్తమందు ధరించినట్టియు, శాశ్వతుఁడయినట్టియు, జ్ఞానస్వరూపుఁ డయినట్టియు, నిత్యుఁడయినట్టియు, మంగళస్వరూపుఁ డయినట్టియు, యకార స్వరూపుఁ డయినట్టియు శివునికొఱకు నమస్కారము. ౫

శ్లో. పంచాక్షరమిదం స్తోత్రం యః పఠేచ్ఛివసన్నిధౌ,
శివలోకమవాప్నోతి శివేన సహమోదతే.

తా. ఈ శివపంచాక్షరస్తోత్రము నెవఁడు శివసన్నిధానమందు పఠనము చేయునో, వాఁడు శివలోకమునుబొంది శివునితో కలిసి మోదించుచున్నాఁడు.

ఇతి శ్రీశంకరాచార్య విరచిత పంచాక్షరస్తోత్రం సమాప్తమ్.

# నిర్వాణషట్కము.

అవతారిక.— శ్రీమచ్ఛంకరాచార్యులవారు లోకోద్ధరణేచ్ఛగలవారై ముముక్షుజనుల ఉపయోగార్థమై నిర్వాణషట్కమను గ్రంథమును నిజానుభవముచేఁ జెప్పుచున్నారు.

శ్లో. మనోబుద్ధ్యహంకార చిత్తాదినాహం నచశ్రోత్రజిహ్వేనచ ఘ్రాణనేత్రే,
నచవ్యోమభూమిర్నతేజోనవాయుఃచిదానందరూపశ్శివోహంశివోహమ్.

తా. మనోబుద్ధ్యహంకార చిత్తములు నేనుకాను. అనఁగా, అంతఃకరణచతుష్టయము ఆత్మకానేరదని యర్థము, శ్రోత్రము మొదలయిన యింద్రియములు నేనుకాను. పృథివ్యాదిపంచభూతములు నేనుకాను. సచ్చిదానందస్వరూపుఁడైన శివుఁడునేను. శివుఁడునేను అని రెండుమారులు చెప్పుట దార్ఢ్యముకొఱకని భావము.

శ్లో. అహంప్రాణవర్గో నహిపంచవాయుర్నహిసప్తధాతుర్నహిపంచకోశాః,
నవాక్పాణిపాదానచోపస్థపాయూ చిదానందరూపశ్శివోహంశివోహమ్.

తా. ప్రాణాదివర్గము, పంచవాయువులు, సప్తధాతువులు, పంచకోశములు, వాక్పాణి పాదపాయూపస్థలనెడి కర్మేంద్రియములు, ఈ చెప్పఁబడిన వన్నియు నేనుకాను. సచ్చిదానందరూపుఁడైన శివుఁడునేను. ౧

శ్లో. నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం నమంత్రం నతీర్థం నవేదానయజ్ఞాః,
అహం భోజనం నైవకర్తానభోక్తా చిదానందరూపశ్శివోహంశివోహమ్.

తా. పుణ్యపాపములు, వైషయిక సుఖదుఃఖములు, మంత్రతీర్థములు, వేదయజ్ఞములు, భోజ్యపదార్థములు, కర్మకర్తృత్వములు, కర్మఫలభోక్తృత్వము మొదలైనవానిలో నేనేవియుకాను. చిదానందరూపుఁడైన శివుఁడుమాత్రము నేను. ౨

శ్లో. నమేద్వేషరాగౌనమేలోభమోహౌమదోనైవమేనైవమాత్సర్యభావః,
నధర్మోనచార్థోనకామోనమోక్షశ్చిదానందరూపశ్శివోహంశివోహమ్.

తా. ప్రత్యగాత్మయగు నాకు రాగద్వేషములులేవు, మదమాత్సర్యములులేవు, లోభమోహములులేవు, ధర్మార్థ కామమోక్షములు నాకు లేవు, కావున చిదానందరూపియైన శివుఁడే నేను. ౩

శ్లో. నమృత్యుర్నశంకా నమేజాతిభేదాః పితానైవ మేనైవ మాతానజన్మ,
నబంధుర్నమిత్రంగురుర్నైవశిష్యః చిదానందరూపశ్శివోహంశివోహమ్.

తా. నాకు మరణములేదు, సందేహములేదు, జాతిభేదంబులులేవు, నా

కుతల్లిదండ్రులులేరు, నాకుజన్మములేదు, బంధుమిత్రులులేరు, నాకు గురుశిష్యులులేరు, జ్ఞానానందరూపియైన శివుఁడునేను. ౪

శ్లో. అహం నిర్వికల్పో నిరాకారరూపీ విభుత్వాచ్చసర్వత్రసర్వేంద్రియాణామ్,
నచాసమ్మతం నైవముక్తిర్వచోభిః చిదానందరూపశ్శివోహంశివోహమ్.

తా. నేను నిర్వికల్పుఁడ నగుటవలనను, నిర్వికారియగుటవలనను, అంతట వ్యాపించి యుండువాఁడగుటచేతను నన్ను ఇంద్రియంబులు కనజాలవు. వాక్కులు కొనియాడనేరవు. నేను అవాఙ్మానసగోచరుండయిన వాఁడను. చిదానందరూపుఁడయిన శివుఁడునేను. ౫

ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచిత నిర్వాణషట్కం సమాప్తమ్.

# పరమేశ్వరాష్టకము.

శ్లో. పశూనాంపతింపాపనాశం పరేశం గజేంద్రస్యకృత్తింవసానం వరేణ్యమ్,
జటాజూటమధ్యే స్ఫురద్గాంగధారం మహాదేవమేకం స్మరారింస్మరామి.

తా. పశుపతియును, పాపనాశకుఁడును, పరమునకీశుఁడును, గజచర్మమే వస్త్రముగాజేసికొన్న వాఁడును, ఉత్తముఁడును, జటాజూటమునగంగనుదాల్చినవాఁడును, మహాదేవుఁడును, ఒక్కఁడునునైన స్మరారిని స్మరించుచున్నాఁడను.

శ్లో. మహేశంసురేశంసురారాతినాశంవిభుంవిశ్వనాథంవిభూత్యంగభూషమ్,
విరూపాక్షమింద్వర్కవహ్నిత్రినేత్రంసదానందమీడేప్రభుంపంచవక్త్రమ్.

తా. దేవతలకీశ్వరుఁడును, రాక్షసనాశకుఁడును, విభుఁడును, విశ్వమునకు నాథుఁడును, విభూతిని ధరించినవాఁడును, మూఁడుకన్నులు గలవాఁడును, సూర్యచంద్రవహ్నులునేత్రములుగాగలవాఁడును, సర్వదాసంతోషవంతుఁడును, ఐదుముఖములుగలవాఁడును, ప్రభువునునైన మహేశుని స్తుతించెదను. ౨

శ్లో. గిరీశంగణేశం గళేనీలవర్ణం గజేంద్రాధిరూఢం గుణాతీతరూపమ్,
భవంభాస్వరంభస్మనాభూషితాంగం భవానీకళత్రం భజేపంచవక్త్రమ్.

తా. కైలాసపతియును, ప్రమథగణములకుప్రభువును, కంఠమునందునల్పుగలవాఁడును, నందినెక్కినవాఁడును, నిర్గుణరూపియును, ప్రకాశమానుఁడును, భస్మభూషితుఁడును, అయిదుముఖములు గలవాఁడును, పార్వతీపతియునైన భవుని భజించుచున్నాఁడను. ౩

శ్లో. శివాకాంతశంభోశశాంకార్ధమౌళేమహేశానశూలిన్ జటాజూటధారిన్
త్వమేకో జగద్వ్యాపకో విశ్వరూపప్రసీద ప్రసీద ప్రభోపూర్ణరూప.

తా. పార్వతీపతీ! నీవు సుఖమును భరించువాఁడవు, చంద్రునిచేఁదడిసిన జటాజూటముగలవాఁడవు, గొప్పదేవుఁడవు, శూలాయుధధారివి, జడలుగల వాఁడవు, ప్రపంచస్వరూపుఁడవు, పూర్ణస్వరూపుఁడవు, ప్రభువై యున్నావు, కరుణింపుము, కరుణింపుము, నీవొక్కఁడవే జగద్వ్యాపకుఁడవు. ४

శ్లో. పరాత్మానమేకంజగద్బీజమాద్యం నిరీహంనిరాకారమోంకారవేద్యమ్,
యతోజాయతేపాల్యతేయేనవిశ్వం తమీశంభజే లీయతేయత్రవిశ్వమ్.

తా. ఎవ్వనివలన నీప్రపంచము పుట్టుచున్నదో, ఎవ్వనిచే రక్షింపఁ బడుచున్నదో, ఎవ్వనియందు లీనమగుచున్నదో, అట్టి యీశ్వరుండవు. పరాత్మా! లోకకారణా! ఆదిపురుషా! కోరికలులేనివాఁడా! రూపములేనివాఁడా! ప్రణవముచే దెలియందగనవాఁడా! ఒక్కఁడవైనభగవంతుడా! నిన్నుభజించుచున్నాఁడను. ౫

శ్లో. నభూమిర్నచాపోనవహ్నిర్నవాయు ర్నచాకాశమాస్తేనతంద్రానన్రిదా,
నగ్రీష్మోనశీతం నదేశోనవేశో నయస్యాస్తిమూర్తిస్త్రిమూర్తింతమీడే.

తా. ఎవ్వనినిభూమి, నీరు, గాలి, నిప్పు, ఆకాశము, జాగ్రత్తు, స్వప్నము, వేఁడిమి, చల్లన, దేశము, స్థలము, రూపము, అంటకుండునో, యట్టి బ్రహ్మవిష్ణుమహేశ్వర స్వరూపుఁడవైనభగవంతుఁడవగునిన్నుస్తుతించెదను. ౬

శ్లో. అజం శాశ్వతం కారణం కారణానాం శివం కేవలం భాసకం భాసకానామ్,
తురీయం తమఃపారమాద్యంతహీనం ప్రపద్యేపరంపావనం ద్వైతహీనమ్.

తా. జననరహితుఁడును, శాశ్వతుఁడును, కారణములకు కారణమైనవాఁడును, శుభస్వరూపుఁడును, వెలుఁగులను వెలిగించువాఁడును, తురీయుఁడును, ప్రజ్ఞానపారమ్యుఁడును, ఆద్యంతములు లేనివాఁడును, పరుఁడును, పవిత్రమైనవాఁడును,ద్వంద్వశూన్యుఁడునునైనఈశ్వరునిస్తుతించుచున్నాఁడను. ౭

శ్లో. నమస్తే నమస్తే విభోవిశ్వమూర్తే నమస్తే నమస్తే చిదానందమూర్తే,
నమస్తే నమస్తే తపోయోగగమ్య నమస్తే నమస్తే శ్రుతిజ్ఞానగమ్య.

తా. ప్రపంచరూపివైననిభుఁడా! నీకునమస్కారము నీకునమస్కారము. జ్ఞానము, ఆనందము, రూపముగాగలవాడా! నీకునమస్కారము నీకునమస్కారము. తపస్సుచేతను యోగాభ్యాసముచేతను పొందఁదగినవాఁడా! నీకు నమస్కారము నీకు నమస్కారము. వేదవిజ్ఞానముచే సమీపింపఁదగిన దైవమా! నీకునమస్కారము నీకునమస్కారము. ౮

పరమేశ్వరాష్టకం సమాప్తమ్.



శ్రీ ర స్తు.

---

దేవాంగమను బ్రహ్మ ప్రతిపాదక వేదోక్త

# మూల స్తంభము.

సాంబశివంనమస్కృత్య షణ్ముఖో వేదమూలతః। దేవలమతమాహాత్మ్యం తస్మైబ్రూహిసదాశివ ॥ ఈశ్వరః ॥ బ్రహ్మాదిదేవానాం అమేయం దేవలమతం త్వయాపృష్టంతత్రతత్రవేదేవిద్యమానానివాక్యానిగృహీత్వాసర్వేషాంబ్రహ్మ ఋషీణాం దేవఋషీణాంచ మనసోల్లాసార్థం మూలస్తంభనం నామగ్రంథం షణ్ముఖేశ్వరసంవాదరూపం కృతాదియుగత్రయేపి వ్యవహారయోగ్యంభవేత్ భ

---

సాంబశివం-సాంబమూర్తిని,నమస్కృత్య-నమస్కరించి,షణ్ముఖః-కొమారస్వామి,వేదమూలతః-వేదమూలకముగా, దేవలమతమాహాత్మ్యం-దేవలమతమాహాత్మ్యమును, సదాశివ-సాంబమూర్తీ, త్వం-నీవు, మె-నాకు, బ్రూహి-చెప్పు, ఈశ్వరః - ఈశ్వరుడు, బ్రహ్మాదిదేవానాం - బ్రహ్మ మొదలైన దేవతలకు, అమేయం - యంచకూడ నటువంటి, దేవలమతం - దేవలమతమును, త్వయా- నీచేతను, పృష్టం- అడుగబడెను, తత్రతత్రవేదే- ఆయా వేదములయందు, విద్యమానాని- వుండెటటువంటి, వాక్యాని-వాక్యములును, గృహీత్వా-గ్రహించి, సర్వేషాం - సమస్తములైన, బ్రహ్మఋషీణాం - బ్రహ్మఋషులకున్ను, దేవఋషీణాం-దేవఋషులకున్ను, మనసోల్లాసార్థం-మనసోల్లాసముకొరకు,మూలస్తంభనంనామ-మూలస్తంభనమనేపేరుగల, గ్రంథం-గ్రంథమును, షణ్ముఖేశ్వరసంవాదరూపం-షణ్ముఖేశ్వరసంవాదరూపముగా, కృతయుగం-కృతయుగముమొదలైనమూడుయుగములయన్దును, వ్యవహారయోగ్యం-వ్యవహారయోగ్యముగా, భవేత్ -అవును, భవిష్యత్కలియుగే-రాబోయెకలియుగమందు,వ్యాసప్రోక్తబ్రహ్మాండపురాణే - వ్యాసులచేతచప్పంబడిన బ్రహ్మాండపురాణమందు, విద్యమానా- యుండేటటువంటి, దేవాంగపురాణం-దేవాంగపురాణమును, ప్రకటీకరోమి-ప్రసిద్ధంచేస్తూవున్నాను, స్వాయంబువమనౌ-స్వాయంబువమనువుయందు, జ్యోతిః-జ్యోతి, జాయతే- కలిగెను, తజ్జ్యోతౌ- ఆజ్యోతియందు, శక్తిః-శక్తియు, తచ్ఛక్తౌ-అట్టిశక్తియందు, బ్రహ్మావిష్ణుమహేశ్వరాః-

విఖ్యత్కలియుగేవ్యాసప్రోక్తబ్రహ్మాండపురాణవిద్యమాన దేవాంగపురాణంప్ర కటీకరోమి స్వాయంబువమనో జ్యోతిర్ధాయ తేతజ్జ్యోతౌ శక్తిః తచ్చక్త్యా బ్రహ్మావిష్ణు మహేశ్వరాః తేభ్యః ఉత్పత్తిస్థితిలయాః తత స్తేషాం వివాహసమయే సర్వేదే వాఃసూత్రవస్త్రహీనాస్సంతః ఆగతాః తేపిమాం దృష్ట్వా అత్యంతలజ్జయాస హ। సూత్రకర్తార మావశ్యకమిత్యూచుః- తతోహంతు ఋషీన్ దృష్ట్వా- సక లజగన్నిర్మాణ హేతోః బ్రహ్మణః। జగదుత్పత్తికర్తురపి బ్రాహ్మణ్య సంపా దకా సూత్రవస్త్రాది నిర్మాతు మశక్తస్య బ్రహ్మణః నిఖిల లోకోత్పత్తి కా లె-సూత్రవస్త్రయో రనావశ్యకత్వాత్। తదావశ్యకాలె తత్తత్సామగ్ర్యా అభావాత్ కృతయుగే సూత్రకర్తుః దేవలస్య ఈశ్వరేణసాకం సాయుజ్య మగమత్ తస్మాచ్చతేపిత్వమేవ సూత్రకర్తారం నిర్మాయ అస్మాకం దాతవ్య మితి ప్రార్థయామాసుః తతః ఈశ్వరః। దేహాంతస్థితంజ్యోతిః యోగమాయ

---

బ్రహ్మావిష్ణుమహేశ్వరులు, తేభ్యః- వాళ్లవల్ల, ఉత్పత్తిస్థితిలయాః- ఉత్పత్తిస్థితి లయములు, తతః అందువలన, తేషాం-వాళ్లయొక్క, వివాహసమయే-వివాహ సమయమందు, సర్వేదేవాః - సమస్తదేవతలు, సూత్రవస్త్రహీనాస్సంతః - సూత్రవస్త్రములులేనివాళ్లైయుంచున్న, ఆగతాః - వచ్చిరి, తేపి-వాళ్లున్ను, మాం - నన్ను, దృష్ట్వా - చూచి, అత్యంతలజ్జయాసహ - అత్యంతమైనలజ్జ తోకూడుకొన్నవారై, సూత్రకర్తారం - సూత్రకర్తను, ఆవశ్యకమితి-అవ శ్యకమని, ఊచుః- చెప్పిరి, తతోహంతు- పిమ్మటనేనైతేను, ఋషీన్ - ఋ షీశ్వరులను, దృష్ట్వా-చూచి, సకలజగన్నిర్మాణహేతోః-సమస్తజగత్తును పుట్టించడానికిహేతువైన, బ్రహ్మణః - బ్రహ్మయు, జగదుత్పత్తికర్తురపి - జగ త్తును పుట్టించేవారైనప్పటికిన్ని, బ్రాహ్మణ్య సంపాదకా - బ్రాహ్మణ్యమును సంపాదించేటటువంటి, సూత్రవస్త్రాది - సూత్ర వస్త్రములును, నిర్మాతుం- నిర్మించుటకు, అశక్తంచ - శక్తుడు కానటువంటి బ్రహ్మకు, నిఖిలలోకోత్ప త్తికాలె - సమస్తలోకోత్పత్తికాలమందు, సూత్రవస్త్రయోః- సూత్రవస్త్ర ములు, అనావశ్యకత్వాత్ - ఆవశ్యం కాకపోవుటవల్ల, తదావశ్యకాలె - అ దికావలశినకాలమందు, తత్సామగ్ర్యాః-ఆసామగ్రియొక్క, అభావాత్ -లేక పోవుటవల్ల, కృతయుగే - కృతయుగమందు, సూత్రకర్తుః- సూత్రకర్తయై న దేవలబ్రహ్మకు, ఈశ్వరేణసాకం - ఈశ్వరునితోకూడ, సాయుజ్యమగమ త్, సాయుజ్యం-సాయుజ్యమును, అగమత్ -పొందెను, తేపి-ఆదేవతలున్ను,

యాబహిః ప్రకాశం కృత్వా తజ్జ్యోతిద్దృష్ట్వా త్వం శీఘ్రం వివాహసమయ ఏవ సూత్ర వస్త్రాణి నిర్మాయ బ్రహ్మాది దేవానాం దాతవ్యమితి ఆజ్ఞాపయామాస తతః అత్యంతకుతూహల సహితస్సృష్టిస్థితిసంహార కర్తౄణాం బ్రహ్మావిష్ణుమహేశ్వరాణాం వివాహోత్సవసమయే తత్తన్మంత్రపూర్వక సూత్ర వస్త్రాణి దత్వా తత్రైవ సాయుజ్యమగమత్.

సకలజగత్కారణస్స్వయంబు దేవాంగ బ్రహ్మకల్పిత దేవమనుమానవరక్ష యక్షపైశాచికాది భూతబేతాళాపస్మార గ్రహాదీనాం స్వయం సూత్ర కర్తే

---

త్వమేవ నీవె, సూత్రకర్తారం- సూత్రకర్తను, నిర్మాయ- నిర్మించి, అస్మాకం - మాకు, దాతవ్యమితి - యివ్వవలెనని, ప్రార్థయామాసుః - ప్రార్థించిరి, తతః - అటుతర్వాత, ఈశ్వరః - సాంబమూర్తి, దేహాంతస్థితం - దేహమందుండె, జ్యోతిః-జ్యోతిస్వరూపమును, బహిః- వెలపటను, ప్రకాశం-ప్రకాశమును, కృత్వా-చేసి, తజ్జ్యోతి-ఆజ్యోతిస్వరూపమును, దృష్ట్వా చూచి, త్వం నీవు, శీఘ్రం - శీఘ్రముగా, వివాహసమయఏవ - వివాహకాలమందె, సూత్రవస్త్రాణి - సూత్రవస్త్రములను, నిర్మాయ - నిర్మించి, బ్రహ్మాదిదేవానాం- బ్రహ్మమొదలైన దేవతలకు, దాతవ్యమితి - యివ్వవలెనని, ఆజ్ఞాపయామాస - ఆజ్ఞాపించెను, తతః - అటుతర్వాత, అత్యంతకుతూహలసహితస్సృష్టి - మిక్కిలి కుతూహలముతో కూడుకొన్న వాడైనచున్ను, సృష్టిస్థితి సంహార కర్తౄణాం - సృష్టిస్థితిసంహార కర్తలైన, బ్రహ్మ విష్ణు మహేశ్వరాణాం - బ్రహ్మవిష్ణు మహేశ్వరులయొక్క, వివాహోత్సవసమయే - వివాహోత్సవ కాలమందు, తత్తన్మంత్రపూర్వక సూత్రవస్త్రాణి - ఆయామంత్రపూర్వకములైన సూత్రవస్త్రములు, దత్వా- యిచ్చి, తత్రైవ- సాంబమూర్తియందె, సాయుజ్య - సాయుజ్యమును, అగమత్ - పొందెను.

సకలజగత్కారణ స్వయంబుదేవాంగ బ్రహ్మకల్పిత దేవమనుమానవరక్ష యక్ష పైశాచికాది భూత బేతాళా పస్మార గ్రహాదీనాం, సకల - సమస్తములైన, జగత్ - జగతులకు, కారణహేతువై స్వయంబు తనకుతానె పుట్టి, దేవాంగబ్రహ్మకల్పితం- దేవాంగబ్రహ్మముచేత, కల్పిత - కల్పింపబడిన, దేవ-దేవతులకున్ను, మనుమనువులకున్ను మానవ మనుష్యులకున్ను, రక్ష - రాక్షసులకున్ను, యక్ష - యక్షులకున్ను, పైశాచికాది - పైశాచికాదిగణము మొదలైన, భూత - భూతములుకున్ను, బేతాళాపస్మారగ్రహాదీనాం - బేతా

తిఉపనిషద్వాక్య విచారణమహిమ్నా ఉదాహరణమాహ। సదేవో దేవాంగో విశ్వరాట్ । విశ్వకర్తాస బ్రహ్మాసవిరాట్ ఇతిమహోపనిషత్ ప్రతిపాదనాత్ విశ్వంయత్తత్ సర్వవ్యాపీదేవాంగో కృతవానితినిరాలంబోపనిషద్వాక్యదర్శనాత్ సదేవాంగో మనుః । ససూత్రధారీ సశుద్ధ బ్రహ్మేతి జాబాలోపనిషద్దర్శనాత్ తత్వమస్యాది మహావాక్యార్థ విషయత్వాత్ । సఏవ

---

ళుడనె అపస్మారగ్రహములు మొదలైనవాట్లకున్ను, స్వయం - తనకు తానే, సూత్రకర్తేతి - సూత్రకర్తయని, ఉపనిషద్వాక్య విచారణ మహిమ్నా, ఉపనిషత్ - ఉపనిషసంబంధములైన, వాక్య-వాక్యములయొక్క, విచారణ-విచారముయొక్క, మహిమ్నా - మహిమచేతను, ఉదాహరణ- ఉదాహరణమును, అహ- చెప్పుచున్నాడు, సః-ఆ, దేవాంగః- దేవాంగుడు, విశ్వరాట్-విశ్వప్రపంచమునకు, రాట్-ప్రభువు, విశ్వ-ప్రపంచమునకు, కర్తా-కర్తయు, సః-అతడు, బ్రహ్మ-బ్రహ్మము, సః-అతడు, విరాట్-విరాట్టు, ఇతి-ఇట్లనిమహోపనిషత్ప్రతిపాదనాత్, మహోపనిషత్-మహోపనిషత్తుయందు, ప్రతిపాదనాత్ - చెప్పుటవల్లనున్ను, విశ్వం-యత్తత్, యత్-ఏ, విశ్వం-ప్రపంచమును, తత్ - దాన్ని, సర్వవ్యాపీ-సర్వసమస్తములయన్దు, వ్యాపీ-వ్యాపించిన, దేవాంగః-దేవాంగబ్రహ్మము, కృతవానితి చేసినాడు, అనినిరాలంబ-ఉపనిషద్వాక్యదర్శనాత్ -నిరాలంబ-ఉపనిషత్, నిరాలంబ-ఉపనిషత్తుయన్దు, దర్శనాత్ -చూచుటవల్లనున్ను, సః-ఆ, దేవాంగః- దేవాంగుడు, మనుః-మనువు, సః-అతడు, సూత్రధారీ-సూత్రధారి, సశుద్ధ-బ్రహ్మ, సః-అతడు, శుద్ధబ్రహ్మ-మాయతోగూడనిబ్రహ్మ, ఇతి-ఇట్లని, జాబాలోపనిషద్వాక్యదర్శనాత్ - జాబాలోపనిషత్తుయందు చూచుటవల్లనున్ను, తత్వమస్యాది - తత్వమసిఅనేదిమొదలుగాగల, మహావాక్యార్థవిషయత్వాత్ - మహావాక్యవిషయములువల్లనున్ను, సఏవ-ఆదేవాంగుడె, జగత్కర్తా-జగత్కర్తయు, నదేవాంతరః- అన్యదైవము, న-లేదు, తత్కథం, తత్ -అది, కథం-యెట్లుగా, తత్సృష్ట్వా తదేవాను ప్రవిశతీతిదర్శనాత్, తత్ - జగత్తును, సృష్ట్వా - పుట్టించి, తదేవం- ఆజగత్తుయందే, అనుప్రవిశతి - ప్రవేశించినాడని, దర్శనాత్ -చూచుటవల్ల, దేవలఏవ - దేవలబ్రహ్మమే మాయతోగూడుకొన్నవాడౌచున్ను, బ్రహ్మాద్యనేకరూపతయా - బ్రహ్మ మొదలైన అనేకరూపమువుటచేత, భాసతే - ప్రకాశిస్తూవున్నది, తద్బ్రహ్మణి - ఆదేవల బ్రహ్మమందు, మాయావశాత్ - మాయవలను, చౌడేశ్వరీనామచిచ్ఛక్తిర్జాతా - చౌడేశ్వరీ

జగత్కర్తాన దేవాంతరః । తత్కథం తత్సృష్ట్వాత దేవానుప్రవిశతీతి దర్శనాత్ । దేవలపవమాయా విచ్ఛిన్నస్సర్ బ్రహ్మాద్యనేకరూపతయా భాసతేత ద్బ్రిహ్మణి మాయావశాత్ । చౌడేశ్వరినామ చిచ్ఛక్తిర్జాతా సాతుతత్కులాధి దేవతాభూత్ తస్యపుత్రికేతిచవ్యవహ్రియతేతేచ తదుపాసనాంచక్రుః తజ్జాతాశక్తిః తదధిదేవతేతి ముండకోపనిషద్వాక్యదర్శనాత్ సర్వే దేవాఈశ్వరమామనంతి అవస్త్రాః సలజ్జాః దీనాస్సంతః ఆగతాః తాన్ దృష్ట్వా ఈశ్వరఃతదాగమనకారణం జ్ఞాత్వా స్వస్మిన్ వర్తమానాంచిజ్యోతిం బహిరభిముఖంకృత్వాత్వంశీఘ్రిం యజ్ఞోపవీతాదికం నిర్మాయ బ్రహ్మాదీనాం ప్రయచ్ఛే

---

అనేపేరుగల, చిచ్ఛక్తి-ప్రకాశరూపమైన, శక్తిజాతా-పుట్టెను, సాతు-ఆశక్తిఅయితెను, తత్కులాధిదేవతాభూత్ - తత్కులాధిదేవత, తత్కుల-ఆదేవాంగకులమునకు,అధిదేవత-అధిదేవతగా,అభూత్ -ఆయను,తస్య-ఆదేవల బ్రహ్మకు, పుత్రికేతిచవ్యవహ్రియతే, పుత్రికేచ-పుత్రికనిన్ని, వ్యవహ్రియతే - వ్యవహరింపబడుచున్నది, తెచ- ఆదేవాంగవంశస్తులు, తత్ - ఆదేవతయొక్క, ఉపాసనాం-ఉపాస్తిని, చక్రుః-చేసిరి, తజ్జాతాతత్ - దేవాంగబ్రహ్మమందు , జాతా-పుట్టిన, శక్తిః- శక్తి, తదధిదేవతేతితత్ - ఆదేవాంగకులమునకు, అధిదేవతేతి అధిదేవతయని, ముండకోప నిషద్వాక్య దర్శనాత్ - ముండకోపనిషత్, ముండకోపనిషద్వాక్యమును, దర్శనాత్ - చూచుటవల్ల, సర్వే దేవేశ్వరమామనంతి, సర్వే - సమస్తమైన, దేవాః - దేవతలు, ఈశ్వరః - ఈశ్వరుణ్ణే, ఆమనంతి- మన్ననచేతురు, అవస్త్రాః- వస్త్రములు లేనివారుగానున్న, సలజ్జాః - లజ్జతోకూడుకొన్నవారుగానున్న, దీనాస్సంతః - దీనులుగాను, ఆగతాః-వచ్చిరి, తాన్-వాళ్లను,దృష్ట్వా-చూచి, ఈశ్వరః-ఈశ్వరుడు,తదాగమనకారణం, తత్-వాళ్లయొక్క, ఆగమన-రావడంయొక్క, కారణ-కారణమును, జ్ఞాత్వా- గుర్తెరిగి, స్వస్మిన్ - తనయందు, వర్తమాన- ఉంటుండె, చిజ్యోతిం- చిజ్యోతిని, బహిర్ముఖ- బహిర్ముఖంముగా, కృత్వా-చేసి, త్వం- నీవు, శీఘ్రిం-శీఘ్రిముగా, యజ్ఞోపవీతాదికం- యజ్ఞోపవీతంమొదలైనవాటిని, నిర్మాయ - పుట్టించి, బ్రహ్మాదీనాం- బ్రహ్మమొదలైనవారికి, ప్రయచ్ఛేతి ఆజ్ఞాపయామాస- ఇమ్మని ఆజ్ఞాపించెను, సాతు- ఆచిచ్ఛక్తిఅయితెను, కృతయుగే- కృతయుగమందు, బ్రహ్మాదీనాం- బ్రహ్మమొదలైనవాండ్లకు, యజ్ఞోపవీతవస్త్రాదికం-యజ్ఞోపవీతంవస్త్రముమొదలైనవాటిని,తత్ర-ఆసమయమం

తి ఆజ్ఞాపయామాస సాతు సదేహాసతీ కృతయుగే బ్రహ్మాదీనాం యజ్ఞోపవీతవ
స్త్రాదికం దదాతి తత్ర బ్రాహ్మణ క్షత్రియ వైశ్యానాం । యజ్ఞోపవీతం పరమం పద
మితి వేదవాక్యేన యజ్ఞోపవీతాదికం దదాతి తదితరజాతీనాం వస్త్రమాత్రం ద
దాతీతి తాత్పర్యం యజ్ఞాదికర్మ సంపాదనాయ యజ్ఞోపవీతధారణస్య ఆవశ్యక
త్వాత్ బ్రహ్మస్వరూపం త్రిగుణాత్మకం యజ్ఞోపవీతం స బ్రాహ్మణానాం దదాతి
తే క్షత్రియాణాం తే వైశ్యానాం తే శూద్రాణాం తు వస్త్రమాత్రమేవ వేదోక్తకర్మ
నార్హత్వాత్ తస్మాత్ బ్రాహ్మణాధికః కోస ఇతి మంతవ్యః సా చిత్స్వరూపిణీ
త్రిగుణాత్మికా గాయత్రీతి చ వ్యవహ్రియత ఇతి కఠోపనిషద్వాక్య దర్శనాత్ ।
ఈశ్వర స్వరూపస్య చ స్వస్య పంచమముఖే ఉత్పన్నస్య విశ్వకర్మణః జగ

---

దు, బ్రాహ్మణక్షత్రియవైశ్యానాం- బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు, యజ్ఞోపవీతం
యజ్ఞోపవీతము, పరమం - పరమోత్కృష్టమైన, పదమితి - సానమని, వేదవా
క్యేన- వేదవాక్యముచేతను, యజ్ఞోపవీతాదికం- యజ్ఞోపవీతం మొదలైనవాట్ల
ను, దదాతి-యిచ్చెను, తదిరతజాతీనాంతత్ -వాళ్ల కన్నె, ఇతరజాతినాం-ఇతరమైన
జాతులకు, వస్త్రం-వస్త్రమాత్రము, దదాతీతి-యిచ్చెనని, తాత్పర్యం-అభిప్రా
యము, యజ్ఞాదికర్మ సంపాదనాయ-యజ్ఞం మొదలైనకర్మములు సంపాదించుట
కొరకు, యజ్ఞోపవీతధారణస్య యజ్ఞోపవీతం ధరించడం, ఆవస్యకత్వాత్ - ఆవ
స్యకమవుటవల్ల, బ్రహ్మస్వరూపం- బ్రహ్మస్వరూపమైన, యజ్ఞోపవీతం- యజ్ఞోపవీ
తమును, స బ్రాహ్మణానాం - బ్రాహ్మణులకు, దదాతి-యిచ్చెను, తె-ఆ బ్రాహ్మణు
లు, క్షత్రియాణాం - క్షత్రియలుకు, తే వైశ్యానాం- వైశ్యులకు, శూద్రాణాం
తు - శూద్రులుకైతేను, వస్త్రమాత్రమేవ - వస్త్రమాత్రమునే, తేషాం - ఆ
శూద్రులు, వేదోక్తకర్మానర్హత్వాత్ - వేదమందు, ఉక్త - చెప్పబడిన,
కర్మ - కర్మలకు, అనర్హత్వాత్ - యోగ్యులు కాకపోవుటవల్ల, తస్మాత్ -
దానివల్ల, బ్రాహ్మణాధికః - బ్రాహ్మణులుకంటె, అధికః - అధికుడు, సయితి -
దేవలుడుఅని, మంతవ్యః- యంచవలెను, సా- ఆచౌడేశ్వరీ, చిత్స్వరూపిణి ప్ర
కాశస్వరూపురాలును, త్రిగుణాత్మిక - గుణత్రయస్వరూపరాలున్నై, గా
యత్రేతి - గాయత్రిఅని, వ్యవహ్రియతేఇతి - వ్యవహరింపబడుచున్నదని, క
ఠోపనిష ద్వాక్యదర్శనాత్ - కఠోపనిషత్ చూచుటవల్ల, ఈశ్వరస్వరూప
శ్చ- ఈశ్వరస్వరూపుడైన, స్వస్య- తనయొక్క, పంచమముఖే - అయిదోము
ఖమందు, ఉత్పన్నస్య- పుట్టెను, విశ్వకర్మణః- విశ్వకర్మకు, జగన్నానా- జ్ఞా

న్మానజ్ఞానార్థం సూత్రాభావాత్ ఈశ్వరః సూత్రాదికం దేవాంగేన దాపి
తవాన్ తేన తన్మానం జ్ఞాత్వా ఏకస్మిన్ దేశే నిక్షిప్తం తాన్ గృహీత్వా విశ్వక
ర్మణః అమంత్రక యజ్ఞోపవీతధారణేన దగ్ధానిచదగ్ధాని సూత్రాణిదృష్ట్వా అ
తిభయ సహితసన్ ఈశ్వరోపాసనాం కృత్వా తత్ప్రసాదేన తాన్ పునర్ని
మాయ దేవాంగబ్రహ్మణా దత్తవాన్ సతుదగ్ధయజ్ఞోపవీతాన్ మన్వాదీన్
తాన్ దృష్ట్వా అతికరుణయా గాయత్రి మంత్రోపదేశపూర్వకం యజ్ఞోప
వీతం దత్తవాన్ అత ఏవ అమంత్రక యజ్ఞోపవీతధారణ మయుక్తమితిమంత
వ్యం సదేవలో బ్రహ్మచారీ నిర్గుణః నిష్కళంకః నిత్యః నిర్వికల్పః సచ్చిదానం
దస్వరూపః మాయాశూన్యః అకర్తాఅభోక్తా సతుమాయా విచ్ఛిన్నత్వాత్
సగుణః సవికల్పః సూత్రాత్మా త్రిమూర్తి స్వరూపః సదేహీ ఆసీత్ ఓంమి

---

నార్థం, జగత్ - జగత్తును, మానా - కొలుచుటయొక్క, జ్ఞానార్థం- జ్ఞాన
ముకొరకు, సూత్రభావాత్ - సూత్రములేకపోవుటవల్ల, ఈశ్వరః - ఈశ్వరు
డు, సుత్రాదికం- సుత్రంమొదలైనవాట్లను, దేవాంగేన- దేవాంగునిచేతను,
దాపితవాన్- ఇప్పించెను, తేన- దానిచేతను, తన్మానం- జగత్పరిమాణమును,
జ్ఞాత్వా - గుర్తెరిగి, ఏకస్మిన్ దేశే - వకప్రదేశమందు, నిక్షిప్తం - ఉంచబడి
ను, తాన్-వాట్లను, గృహీత్వా- తీసుకొని, వైశ్యకర్మణః-విశ్వకర్మణః- విశ్వ
కర్మకొమాళ్లు, అమంత్రక యజ్ఞోపవీతదారణేన - మంత్రములేని యజ్ఞోపవీత
దారణచేతను, దగ్ధానిచ- దహింపబడిన, సూత్రాణి- సుత్రములను, దృష్ట్వా-
చూచి, అతిభయసహితసన్ - మిక్కిలిభయముతో కూడుకొన్నవారౌటచేత
ను, ఈశ్వరోపాసనాం - ఈశ్వరవుపాస్తిని, కృత్వా - చేసి, తత్ప్రసాదేన -
ఈశ్వరానుగ్రహంచేతను, తాన్ - ఆసూత్రములను, పునః- మళ్లిని, నిమాన్
య - నిర్మించి, దేవాంగబ్రహ్మణః- దేవాంగబ్రహ్మకు, దత్తవాన్ - ఇచ్చెను,
సత్ - ఆదేవలుడు అయితెను, దగ్ధ - దహింపబడిన, యజ్ఞోపవీత న్ - యజ్ఞో
పవీతముగల, మన్వాదీన్ -మనుమొదలైనవాళ్లను, దృష్ట్వా-చూచి, అత్యంత
కరుణయా - మిక్కిలికరుణచేతను, గాయత్రిమంత్రోపదేశపూర్వకం - గాయ
త్రిమంత్రోపదేశపూర్వకమైన, యజ్ఞోపవీతం- యజ్ఞోపవీతమును, దత్తవాన్ -
ఇచ్చెను, అతయేవ- అందువల్లనే, అమంత్రకయజ్ఞోపవీతధారణం- మంత్రము
లేకయజ్ఞోపవీతధారణము, అయుక్తం- అయుక్తమని, మంతవ్యం- యెంచవల
సినది, సదేవలః - ఆదేవలబ్రహ్మ, బ్రహ్మచారి - బ్రహ్మచారిన్ని, నిగుణః -

త్యేకాక్షరంబ్రహ్మ ప్రజ్ఞానంబ్రహ్మ అహం బ్రహ్మాస్మి తత్వమసి అయమాత్మా బ్రహ్మేత్యాదిమహావాక్యలక్ష్యార్థ గోచరో దేవల ఇత్యుపనిషతహరిః ఓం కృష్ణార్పణమస్తు.

త్రేతాయుగే వస్త్రసూత్రాభావాత్ దేవాః శివం దృష్ట్వా ప్రార్థితాః దేవప్రార్థనయా శివస్సంతుష్టస్సన్ స్వాయంబువమనుం ధ్యాత్వా సః శివదేహస్థసహస్రారం త్యక్త్వా బహిరాగత్య బ్రహ్మవిష్ణు మహేశ్వరాణాం దేవానాంచ వస్త్రసూత్రాదికం దత్తవాన్ తతః కాండఋషిరాగత్యతం దేవాంగ మనుందృష్ట్వా మమవస్త్రసూత్రాదికం దాతవ్యమిత్యుక్తవాన్ దేవాంగ బ్ర

---

గుణరహితుడున్ను, నిష్కళంకః - కళంకరహితుడున్ను, నిత్యః - నిత్యుడున్ను, నిర్వికల్పః - వికల్పశూన్యుడున్ను, సచ్చిదానందస్వరూపః - సచ్చిదానందస్వరూపుడున్ను, మాయాశూన్యః - మాయాశూన్యుడున్ను, అకర్తా - అకర్తయున్ను, అభోక్తా - అభోక్తయున్ను, సతు - ఆబ్రహ్మ అయితేను, మాయావిచ్ఛిన్నశ్చేత్ - మాయతోగూడుకొన్నటుఅయితేను, సగుణః - సగుణుడున్ను, సవికల్పః - సవికల్పుడున్ను, సూత్రాత్మా - సూత్రాత్మయున్ను, త్రిమూర్తిస్వరూపః - త్రిమూర్తి స్వరూపుడున్ను, సదేహి - దేహముతో కూడుకొన్నవాడై, ఆసీత్ - ఆయెను.

త్రేతాయుగే - త్రేతాయుగమందు, వస్త్రసు త్రాభావాత్ - వస్త్రసూత్రములు లేకపోవుటవల్ల, దేవాః - దేవతులు, శివం - సాంబమూర్తిని, దృష్ట్వా - చూచి, ప్రార్థితాః - ప్రార్థించిరి, దేవ ప్రార్థనయా - దేవ ప్రార్థనచేతను, శివః - సాంబశివుడు, సంతుష్టస్సన్ - సంతోషించినవాడౌటచేతను, స్వాయంబువమను - స్వాయంబువమనువును, ధ్యాత్వా - ధ్యానముచేసి, సః - ఆ స్వాయంబువమనువు, శివదేహస్థసహస్రారం - సాంబశివుని దేహమందుండెడి సహస్రారమును, త్యక్త్వా - విడిచి, బహిః - వెలపట, ఆగత్య - వచ్చి, బ్రహ్మవిష్ణుమహేశ్వరాణాం - బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు, దేవానాంచ - దేవతులకున్ను, వస్త్రయజ్ఞోపవీతాదికం - వస్త్రయజ్ఞోపవీతములను, దత్వా - యిచ్చెను, తతః - అటువెనుక, కాండఋషిః - కాండఋషీ, ఆగత్య - వచ్చి, తద్దేవాంగమను - ఆదేవాంగమనువును, దృష్ట్వా - చూచి, మమ - నాకు, వస్త్రసూత్రాదికం - వస్త్రసూత్రము మొదలైనవాటిని, దాతవ్యమితి - యివ్వవలెనని, ఉక్తవాన్ - పలికెను, దేవాంగబ్రహ్మణా - దేవాంగబ్రహ్మచేతను, తంప్రతి - అ

హ్మణాతం ప్రతినేదానిం వర్తతే శ్వో దీయతే ఇత్యుక్తం తతః కాండఋషిః కుపితస్సన్ సర్వేషాం దత్వా మమనాస్తీతి భవద్భిః ఉక్తం ఇత్యుక్త్వా త్వం కీటో భవేదితి శాపం దత్తవాన్ తతః మనుబ్రహ్మ కాండఋషిం దృష్ట్వా త్వం గచ్ఛ శ్వఃమదీయగృహం ప్రతిఆగతశ్చేత్ తవదీయతే ఇత్యుక్తంతవాన్ త్వచ్ఛాపం మమజీవనసాధనం భవేదిత్యుక్తవాన్ తంతోస్సర్వం జగదస్సృజదితి వేదవాక్యే నతంతోః మమచాభేదాత్ లోకే కార్యకారణయోరభేదాచ్చ కీటాదీనాం మయా సృష్టజగదంతః పాతిత్వేన సర్వస్యాపి జగతః బ్రహ్మస్వరూపత్వేనచ త్వద్దత్త శాపేన కింప్రయోజనమిత్యుక్త్వా సాంబసదాశివ సహస్రారకమల మగమత్

---

కాండఋషినిగూర్చి, నేదానింవర్తతే-యిప్పుడులేదని, శ్వః-రేపు, దీయతఇతి-యిచ్చెదనని, ఉక్తం-పలుకబడెను, తతః-అటువెనుక, కాండఋషిః-కాండఋషి, కుపితస్సన్ - కోపించినవాడైకొంచున్న, సర్వేషాం - సమస్తమైన వాళ్లకు, దత్వా-యిచ్చి, మమ - నాకు, నాస్తీతి-లేదని, భవద్భి-మీచేత, ఉక్తం- చెప్పబడెను, ఇత్యుక్త్వాఇతి- యీప్రకారము, ఉక్త్వా-చెప్పి, త్వం-నీవు, కీటోభవేదితి పురుగుఅవుదువుఅని, శాపం - శాపమును, దత్తవాన్ - ఇచ్చెను, తతః- అటువెనుక, మనుబ్రహ్మ- దేవాంగమనువు, కాండఋషిం- కాండఋషిని, దృష్ట్వా-చూచి, త్వం-నీవు, గచ్ఛ-పో, శ్వః- రేపు, మదీయగృహం- నాయొక్కగృహమునుగూర్చి, ఆగతశ్చేత్ - వచ్చినట్టాయనా, తవ- నీకు, దీయతఇతి-యివ్వబడునని, ఉక్తం-చెప్పబడెను, తర్హి-అయితే, త్వచ్ఛాపం- మీశాపమును, మమ- నాకు, జీవనసాధనం- జీవసాధనము, భవేదితి-అయేనని, ఉక్తవాన్ - చెప్పెను, తంతోః-తంతువువల్ల, సర్వం-సమస్తమైన, జగత్-జగత్తు, అసృజదితి-పుట్టునని, వేదవాక్యేన-వేదవాక్యంచేతను, తంతోః-తంతువుకున్ను, మమచ-నాకున్ను, అభేదం- భేదములేనందువల్ల, లోకే-లోకమన్ను, కార్యకారణయోః- కార్యకారణములకు, అభేదాచ్చ-అభేదంవల్లనున్ను, కీటాదీనాం- పురుగుమొదలైనది, మయా-నాచేతను, సృష్టా-సృజింపబడిన, జగదంతః-పాతిత్వేన- జగత్తుయందుచేరుటచేత, సర్వస్యాపి- సమస్తమైనజగత్తు, బ్రహ్మస్వరూపత్వేనచ - బ్రహ్మస్వరూపమవుటచేతనున్ను, త్వద్దత్తశాపేన - నీవిచ్చినశాపంచేత, కింప్రయోజనమితి- యేమిప్రయోజనమని, ఉక్త్వా-చెప్పి, సాంబసదాశివసహస్రారకమలం-సాంబశివునిసహస్రారకమలమును, అగమత్ -పొందెను.

వేదములుప్రమాణము మొదల తనకుతానే సన్దేహములేదు స్మృతులున్ను పురాణములున్ను భారతమున్ను మునిశ్రేష్ఠుడావేదస్మృతి విరోధముచ్ఛేతను ప్ర

వేదాః ప్రమాణం ప్రథమం స్వతఏవన సంశయః । స్మృతయశ్చ పురాణాని భారతం మునిపుంగవ । వేదస్మృతివిరోధేన ప్రమాణంనాన్యవర్తత । బ్రాహ్మం పద్మం వైష్ణవంచ శైవం భాగవతాభిదం॥ మార్కండేయంనారదీయం ఆగ్నేయ మితికీర్తితం । భవిష్యద్బ్రహ్మకైవర్తం లైంగ్యం వారాహమేవచ॥ స్కాందం వామనకూర్మాఖ్యం మాత్స్యంగారుడసంజ్ఞకం బ్రహ్మాండాఖ్య పురాణం చసర్వేషా న్నప్రసాదితః॥ శైవం స్కాంధం స్థథాలైంగ్యం కూర్మ వామన సంజ్ఞకం । భవిష్యమత్స్యవారాహం మార్కండేయపురాణకం॥ బ్రహ్మాండమితి విఖ్యాతం ప్రశస్తం శివబోధిని । నారదీయం భాగదేయ గారుడ వైష్ణవాభిదం । ఏతచ్చతుష్టయం విష్ణుం పురాణమికద్యతే బ్రహ్మపద్మద్వయంబ్రహ్మ పురాణమితికీర్తితం । బ్రహ్మకైవర్తమేకంతు పురాణం సూర్యబోధకం ॥ రామాయణం భారతంచ వాల్మీకివ్యాసనిర్మితం । ఇతిహాసాః తత్రతత్ర సత్త్వాదీనాంనిరూపణం॥ షణ్ముఖః॥ దేవాంగసంభవేమానం వదమేకరుణాకర । వేదభావావిరోధేన ఆదిపన్నగభూషణా ॥ ఈశ్వరః॥ దేవలాదిమానిభూతాని జా

---

మాణముకాదు. బ్రాహ్మ్యమున్ను - పద్మమున్ను - వైష్ణవమున్ను - భారతమనే పేరుగలపురాణమున్ను - మార్కండేయమున్ను - నారదీయమున్ను - అగ్నేయమున్ను-భవిష్యపురాణమున్ను-బ్రహ్మకైవర్తమున్ను-లైంగ్యమున్ను-వారాహమున్ను - స్కాందమున్ను- వామనమున్ను- కూర్మమున్ను-మత్స్యపురాణమున్ను-గారుడమున్ను - బ్రహ్మాండమున్ను-యీపదునెనిమిదిపురాణములున్ను సమస్తమైనవాండ్లకున్ను-ప్రమాణములు. శైవమున్ను-స్కాన్దమున్ను-లైంగ్యమున్ను-కూర్మమున్ను-వామనమున్ను-భవిష్యపురాణమున్ను-మత్స్యపురాణమున్ను- వారాహపురాణమున్ను- మార్కండేయ పురాణమున్ను- బ్రహ్మాండపురాణమున్ను - ప్రసిద్ధముగా శైవపురాణములు. నారదీయం - భాగదేయపురాణమున్ను గారుడ పురాణమున్ను- వైష్ణవపురాణమున్ను- ఈనాల్గున్ను విష్ణుపురాణములు. బ్రహ్మమున్ను- పద్మమున్ను- బ్రహ్మపురాణములు. బ్రహ్మకైవర్తమువకటియున్ను సూర్యపురాణము. రామాయణం - భారత వ్యాసనిర్మితములైన ఇతిహాసములుసత్త్వాదినిరూపణం చెప్పుతున్నది. కుమారస్వామి దేవాంగోత్పత్తియందు వేదభావములకు అవిరోధములైన ప్రమాణములునాకుజెప్పుమా- కరుణాకరుడైన ఈశ్వరుడా - దేవలాత్ - దేవలబ్రహ్మవల్లను, ఇమాని- ఈభూతసమూహములు- జాయంతే- పుట్టుచున్నది- దేవలేన-దేవలబ్రహ్మచేతను- జాతాని- పుట్టినభూతములు, జీవంతీ-జీవిస్తున్నవి, యత్ - దేనివల్ల

యంతె దేవలేన జాతానిజీవంతీ । యత్ప్రియం త్యభిసంవిశంతి తద్విజజ్ఞాస్స తద్బ్రహ్మేతి । జన్మాద్యశ్చయతః హిరణ్యగర్భమనువర్తతాగ్రే ॥ స దిం ద్రాత్పటుతరః యత ఇంద్రోవసతిశ్చ రాజా ప్రదమో దేవతానాం అగ్నిరగ్రేప్రథమో దేవతానాం యదగ్నిసర్వే దేవతానాం సూర్యాత్మాజగతత స్తుషశ్చ తత్ర దేవాంగమను బ్రాహ్మణోపి వై భవాంతర దర్శనం దృశ్యతే ఏకోహం వై సూత్ర బ్రహ్మాహమితి దేవాంగో బ్రహ్మాత త్సత్యం పృథ్వీమిథ్యా వా దేవల బ్రహ్మణోసకాశాత్ అవ్యక్తాత్ మహాత్ మహీతో అహంకారః అహం కారా దా కాశః ఆకాశా ద్వాయుః వాయో రగ్ని రగ్నే రాపః అద్భ్యః పృథ్వీ పృథివ్యాం ఓషదయః ఇతి ఉపనిషద్వచనజాతేన ఓంకార రూ

---

ను,ప్రియంత్యభిసంవిశంతి-లయమునుపొందింపుచున్నవో,తత్-దాన్ని,విజజ్ఞాసస్వ- గుర్తెరుగు, మాతత్-అది, బ్రహ్మేతి-బ్రహ్మమని, యతః-ఏబ్రహ్మవల్ల, జన్మాద్యశ్చ ఉత్పత్తి స్థితిలయములు, భవంతి- అవుచున్నవో, అగ్రే-ముందరను, హిరణ్యగర్భ - తేజోరూపమును, అనువర్తత - అనుసరిస్తూవున్నవో, తత్-అది,యింద్రాత్-యింద్రునికంటె,పటుతరః-శ్రేష్టమైనది,యతః-యన్నువల్ల, ఇంద్రః-ఇంద్రుడు, ప్రథమః-మొదలైన, రాజా-రాజుగా, అవసత్-వుండెను,అగ్రే-ముందర,అగ్నిః-అగ్ని, దేవతానాం-దేవతలలోపల, ప్రథమః-మొదటివాడు, యత్-దేనివల్ల, అగ్నిః-అగ్ని, సర్వే దేవతానాం. సర్వే-సమస్తమైన, దేవతానాం-దేవతులకు,ప్రథమః-మొదటివాడు,జగతః-జగత్తుకు, సూర్యాత్మా - ప్రకాశరూపమైన, ఆత్మాచక్షుషశ్చ, నేత్రము, తత్ర-ఆస్థానమందు, దేవాంగమనుబ్రహ్మణోపి - దేవాంగమనుబ్రహ్మకైనను, వైభవాంతర - అన్యవైభవములను, దృశ్యతే - అగుపడుచున్నవి, ఏకోహంవై - ఏకమైననేనైతెను, సూత్రబ్రహ్మ - సూత్రబ్రహ్మమని, దేవాంగః - దేవాంగుడు, బ్రహ్మ-బ్రహ్మము,తత్-అది,సత్యం-సత్యము,పృథ్వీమిథ్యా,పృథ్వీ-భూమి,మిథ్యా-అబద్ధము, దేవలబ్రహ్మణోపి- దేవలబ్రహ్మయొక్క,సకాశాత్-సమీపంవల్ల,అవ్యక్తాత్-అవ్యక్తంవల్ల,మహాత్-మహత్తు, మహతః-మహత్తువల్ల, అహంకారః-అహంకారము, అహంకారాత్-అహంకారమువల్ల, ఆకాశః-ఆకాశము,ఆకాశాత్ ఆకాశంవల్లను,వాయుః-వాయువు,వాయోః-వాయువువల్లను,అగ్నిః-అగ్ని,అగ్నేః-అగ్నివల్ల,ఆపః-ఉదకము, అద్భ్యః-ఉదకమువల్ల, పృథ్వీపృథివ్యాం-భూమియందు, ఓషదయః- ఓషదలు, ఇతి-యీక్రమంగా- ఉపనిషద్వచనజాతేన- ఉపనిషద్వచనసమూహంచాతను, ఓంకారరూపిణః-ప్రణవస్వరూపుడైన,

పిణో దేవలస్య సర్వస్వరూపత్వం దృశ్యతే పురుషోహం వై సూత్ర బ్రహ్మకా మయతే ప్రజాసృజేనేతి దేవలబ్రహ్మణో బ్రహ్మజాయంతే బ్రహ్మణోరుద్రజాయంతే నేహ నానా స్తికించనా॥ ఇమా ప్రజాయంత్యేతి బ్రహ్మోపనిషత్ ॥ సుబాలోపనిషత్ । దివ్యోగ్నిః ఏకో దేవలబ్రహ్మస దేవసౌమ్య ఇదమగ్రఆసీత్ ఆత్మావా ఇదమగ్రఆసీత్ ఇత్యాది శృత్యంతరకారణ కార్యేషు ఉక్తం యో వై తంతు చరో రుద్రః । తద్బ్రహ్మేతి ఈరయామాసుః సోహ మగ్ని తంతు మాసభవత్ విశ్వకర్మణోస ప్తతంతువ్యజీజనత్ బ్రాహ్మీవీణాయ శతతంతుః సోహందేవలః దేవాంగో వై తంతుః తంతుమంతమగ్నింజుహోతిసూత్రోయజ్ఞః । సుచిభఁవతుసూత్రదారో వై బ్రహ్మఅవిచారో సుచిభఁవత్ పరమా

---

దేవలస్వ - దేవలునికి, సర్వస్వరూపత్వం - సమస్తరూపత్వమును, దృశ్యతే-అగుపడుచున్నది, పురుషోహంవై - నేనుపురుషుడున్ను, సూత్రబ్రహ్మ- సూత్రబ్రహ్మమున్ను, కామయతే - కోరుతూవున్నది, ప్రజాసృజేయేతి-ప్రజలనుసృజించమని, దేవలబ్రహ్మః-దేవలబ్రహ్మవల్ల బ్రహ్మసృష్టికర్తా, జాయతే-పుట్టెను, బ్రహ్మణః - బ్రహ్మవల్ల, రుద్రాః - రుద్రుడు, జాయంతే - పుట్టిరి, నేహనానాస్తికించన. యః - యీప్రపంచమందు, కించన- కొంచమైన, నానా - నానావికారము,నాస్తి-లేదు,ఇమాః-ఈ, ప్రజాః-ప్రజలు, ప్రజాయంతేతి-పుట్టిరని బ్రహ్మోపనిషత్ - బ్రహ్మోపనిషత్తు, దివ్యః - దివ్యస్వరూపుడైన, అగ్ని - అగ్నిస్వరూపుడైన,ఏకః-ఒక్కడైన, దేవలబ్రహ్మ-దేవలబ్రహ్మము,సదేవ-సత్తుగానె, సౌమ్య-సౌమ్యముగానె, అగ్రే-ముందర,ఇదం-ఈప్రపంచము, ఆసీత్-ఆయెను, ఆత్మావా ఇదమగ్రఆసీత్ - ఆత్మావా- ఆత్మస్వరూపము అగ్రే-ముందర, ఇదం-ఈప్రపంచముగా, ఆసీత్ - ఆయెను, ఇత్యాది-ఈమొదలైన, శృత్యంతరకారణకార్యేషు - యితరములైనశ్రుత్యుక్తకారణకార్యములయందు, ఉక్తం- చెప్పబడెను, యోవై -యెవరైతేను, తంతుచరః- తంతుచాతజీవించె రుద్రః-రుద్రుడో,తత్-అది,బ్రహ్మేతి-బ్రహ్మయని, ఈరయామాసుః-చెప్పిరి, సోహం-అనేను, అగ్నితంతు-అగ్నితంతువని, అభవం-అయితిని, విశ్వకర్మణః-విశ్వకర్మకు, సప్తతంతవః-యేడైనతంతువులు, వ్యజీజయత్-ఇచ్చెను, బ్రాహ్మీవీణాయాః-సరస్వతీవీణకు, శతతంతుః- నూరుతంతువులుయిచ్చెను, సోహంవై దేవలః-ఆదేవలుడనేను, దేవాంగోవై తంతుః - జగత్కారణరూపమైన తంతువున్ను, దేవాంగుడె, తంతుమంతమగ్నింజుహోతి - ప్రకాశమైనఅగ్నినిహోమం చేస్తారు,సూత్రోయజ్ఞః-సూత్రమేయజ్ఞము,సుచిభఁవత్-పరిశుద్ధముపుగాత

త్మాఅన్నం సు త్ర మన్నే భావితరత్ అంగా దేవలా ప్రకర్షతే దేవాసూ త్రిణోయజ్ఞకృత్వా యోగ్యా భవేయుః। సర్వేతంతవః జగద్వ్యాపిణో భవ తిచంద్ర మావై తంతుః తంతోత్సర్వం జగదశృజత్ । తంతోవాలఖిల్యాః జాయంతేతేచసూత్రేణ యోగ్యాభవేయుః ఇత్యాదిశృతివాక్యపద్ధతిః । య థాతమ స్తం సదివానరాత్రిః సూత్రబ్రహ్మ సర్వఏవదేవలః తత్సవిత్రువరేణ్యాం భర్గోదేవస్య ధీమహిధియో యోనప్రచోదయాత్ సోహమేతా ప్రజాసృ జంతేతే దేవా రుద్రమప్పృచ్ఛత్ । రుద్రశ్యాంతర్యామి ఓంకార బ్రహ్మ ఏవం సర్వభూతాంతరాత్మా అపహత పాప్మా ఇత్యదివేద శృతిదర్శనాత్॥ య

---

సూత్రదారోవై -బ్రహ్మసూత్ర ధారుడైబ్రహ్మ, హవిచారోసుచిర్భవత్-విచా రించగూడని పరిశుద్ధుడైనాత, పరామాత్మా అన్నం- పరమాత్మస్వరూపము అయినఅన్నమును, సూత్రమన్నే బావితరత్, అన్నె-అన్నమందు, ఇతరత్-ఇత రమైన, సూత్రం- సూత్రము, నభాదిచ-కలగదు, అంగాదేవలాదపకర్షత్ - అంగంవలనె, అపకర్షత్-ఈడ్చుకొనెను, దేవాః-దేవతులైన, సూత్రిణః - సూత్రవంతులు,యజ్ఞం-యజ్ఞమును,కృత్వా-చేసి, యోగ్యః-యోగ్యులై నవా ళ్లుగా, భవేయుః- అయిరి, సర్వే-సమస్తములైన, తంతవః-తంతువులు, జగ ద్రూపిణః-జగద్రూపవంతులుగా, భవంతి-అయినవి, చంద్రమావై తంతుః-చం ద్రుడేతంతువు, తంతోత్సర్వంజగవస్పృజత్, తంతోః - తంతువల్ల, సర్వం స మస్తమైన, జగత్- జగత్తు అశృజత్- కలిగెను, తంతోః- తంతువల్ల, వాల ఖిల్యాః-వాలఖిల్యలు, జాయంతె-పుట్టిరి, తేచ వాళ్లున్ను, సూత్రేణ-సూత్రం చాతను, యోగ్యాః-యోగ్యులుగా, భవేయుః-అయిరి, ఇత్యాదిశ్రుతివాక్య పద్ధతిః-యివిమొదలైనవివేదవాక్యమార్గము, యః-యట్లుగా, తమః-అంధ కారము,తం-ఆబ్రహ్మమును,దివా-పగటియందు, ఏగతం-పొందుదు,సూత్రబ్ర హ్మ-సూత్రబ్రహ్మను, సర్వే-సమస్తమందు, దేవలఏవ-దేవలుడే, తత్సవితు రువరేణ్యాం, తత్- అది, త్సవిత్రువరేణ్యాం- సూర్యతేజస్సు, దేవస్య- దేవుని యొక్క, గర్భః-తేజస్సును, ధీమహి-ధ్యానముచేస్తాను, యః-యవరు, నః- నాయొక్క, ధియూః - బుద్ధిని, ప్రచోదయాత్ - ప్రేరేపించును, సోయం - ఆ యీబ్రహ్మము, ఏతా-యీ, ప్రజాః- ప్రజలను, సృజంతే- సృష్టించుచున్నా రు, తేదేవాః-ఆదేవతులు, రుద్రం - రుద్రుణ్ణి, అప్పృచత్-అడిగిరి, రుద్రస్య- రుద్రునియొక్క, అంతర్యామి - అంతర్యామియైన, ఓంకారబ్రహ్మ-ప్రణవబ్ర హ్మము, ఏవం - ఈప్రకారము, సర్వభూతాంతరాత్మా- సర్వభూత సమస్తభూ

దక్షరమిదం బ్రహ్మ తత్సూత్రమితిధారయేత్ । సూచనా సూత్రమిత్యాహు సూత్రాణాం పరమంపదం । తత్సూత్రంవిదితంయేన తద్విప్రో వేదపారగః॥ ఏతత్సర్వమిదంప్రోక్తం సూత్రేమణిగణా । ఇవతత్సూత్రధారయే ద్యోగియోగ విత్॥ తద్బ్రహ్మరాట్॥ ఏకోదేవోసర్వభూతేషుగూఢః సర్వవ్యాపీసర్వభూతాం తరాత్మాకర్మాధ్యక్షః । సర్వభూతాధివాసః సాక్షీచేతో దేవలోకే నిర్గుణశ్చ ఏకరూపంబహుధాయః కరోతిసోయం దేవాంగోత్రేతాయుగే బ్రహ్మాదీనాంసర్వేషాంలోకానాం కర్మానుష్టానసాధనభూతం యజ్ఞోపవీతం వస్త్రాదికం చద

---

భూతములకు, అంతరాత్మ-అంతరాత్మయైన, అపహత-పోఁగొట్టబడిన, పాప్మా-పాపముగలవాళ్లను, శృతిదర్శనాత్ - శ్రుతులు చెప్పటవలన, యదక్షరమిదం బ్రహ్మ. యె-యది, నాశరహితమైన బ్రహ్మము, తత్-అది, సూత్రమితి- సూసూత్రమని, ధారయేత్-నిశ్చయించవలెను, సూచనా సూత్రమిత్యాహుః-సూచనా-సూచింపబడినవి, సూత్రమిత్యాహుః- సూత్రమని చెప్పిరి, సూత్రాణాం-సూత్రంయొక్క, పదం - వుత్కృష్టమైనపదం, స్థానము, తత్ - అది, ఏన-యవని చేత, సూత్రం-సూత్రమని, విదితం- తెలియబడినదో, తద్విప్రః- ఆబ్రాహ్మణులు, వేదపారగః - వేదపారగులు, ఏతత్సర్వ మితంప్రోక్తం - యీసర్వమును, ప్రోక్తం - చెప్పబడును, సూత్రేమణిగణాయిన - సూత్రమందు మణిసమూహంవలెనే, తత్సూత్రం-ఆసూత్రమును, దారయే-ధరించినవారు, యోగీయోగవిత్ - యోగమును గుర్తెరిగినవారు, తద్బ్రహ్మరాట్-ఆ బ్రహ్మశ్రేష్ఠుడు, ఏకః - వకటియైన, దేవః దేవుడు, సర్వభూతేషు - సర్వభూతములయందు, గూఢః-రహస్యమైనవారు, సర్వవ్యాపి - సమస్తభూతములయొక్క, అంతరాత్మా కర్మాద్యక్షః - అంతరాత్మయైన కర్మాధికారి, సర్వభూతాదివాసః-సమస్తభూతములయందు యుండేవాడు, సాక్షీ- సాక్షియైనవాడు, చేతః- చైతన్యస్వరూపుడు, నిర్గుణశ్చ - గుణరహితుడై నయవర్లు, ఏకరూపం - వకరూపమును, బహుధా- అనేకవిధములుగా, కరోతి- చేస్తున్నాడు, సోయం దేవాంగః - ఆయీ దేవాంగుడు, త్రేతాయుగే - త్రేతాయుగమందు, బ్రహ్మాదీనాం-బ్రహ్మమొదలైన, సర్వేషాం-సమస్తమైన, లోకానాం- లోకులకు, కర్మానుష్టానసాధనభూతం- కర్మానుష్టానమునకు కారణభూతమైన, యజ్ఞోపవీతం-యజ్ఞోపవీతమును, దత్వా-యిచ్చి, తేన-దాని చేతను, సర్వేలోకాః-సమస్తమైనలోకులకు, తుష్టాః-సంతోషమును పొందినవాళ్లుగా, బభూవుః-అయిరి, తస్మాత్ - దానివల్లను, దేవాంగః- దేవాంగబ్రహ్మ, లోకప్రశిద్ధః-లోక ప్రసిద్ధుడున్ను, మానా

త్వాతేన సర్వేలోకాః తుష్టాబభూవుః తస్మాత్ దేవాంగో లోకప్రసిద్ధః మానాభిమానప్రచ్ఛిన్నః గురూణాం గురుతమశ్చ ఓంకారోయం దేవాంగః తస్మాత్రిమూర్తయః తేభ్యోలోకా అజాయంతాతద్బ్రహ్మతత్సత్యంజీమితిసర్వం ద్వాపరయుగే త్రయత్రింశత్కోటి దేవతాః సాంబసద శివం దృష్ట్వా అస్మాకంవస్త్రసూత్రాదికం దాతవ్యమిత్యుక్తవంతః కైలాసాధిపతిః స్వకీయసహస్రారకమలెవిద్యమాన మన్మహాఋషిం దృష్ట్వాఅస్మిన్యుగే దేవతానాంవస్త్రసూత్రాదికం దత్వాపునః మదీయసహస్రార ఏవ స్థాతవ్యమిత్యుక్తవాన్ సః బహిరాగత్య దేవతానాం మంత్రపూర్వకవస్త్రసూత్రాదికందత్వాశివసహస్రారకమలమగమత్.

యస్యాజ్ఞయా బ్రహ్మముకుంద కాలరుద్రాః ప్రభావస్థితి సహృతీనాం।

---

భిమానాప్రచ్ఛిన్నః - మానాభిమానములను కాపాడేవాడున్ను, గురూణాం గురువులలోపలను, గురుతమశ్చ - గురుస్వరూపుడున్ను, ఓంకారః - ఓంకారరూపమైన, అయం- ఈ, దేవాంగః- దేవాంగ బ్రహ్మ, తస్మాత్-ఆయన వల్లను, త్రిమూర్తయః-త్రిమూర్తులు, తేభ్యః-వాళ్లవల్ల,లోకాః-లోకులు, అజాయంతా - పుట్టిరి, తద్బ్రహ్మ, తత్-అది, బ్రహ్మ-బ్రహ్మము, తత్-అది, సత్యం-సత్యస్వరూపము.

ద్వాపరయుగే- ద్వాపరయుగమందు, త్రయత్రింశత్కోటిదేవతాః-ముప్పైమూడుకోట్లుదేవతలు, సాంబసద శివం-సాంబమూర్తిని, దృష్ట్వా-చూచి, అస్మాకం-మాకు, వస్త్రసూత్రాదికం - వస్త్రసూత్రములు మొదలైనవాటిని, దాతవ్యమితి-యివ్వవలెనని, ఉక్తవంతః-చెప్పిరి, కైలాసాధిపతిః-సాంబమూర్తిని, స్వకీయసహస్రారకమలె-తనసహస్రారకమలమందు, విద్యమానం-వుంటుండె, మన్మహాఋషిం-దేవాంగమనువును,దృష్ట్వా-చూచి, అస్మిన్యుగే-యీయుగమందు, దేవతానాం-దేవతులకు, వస్త్రసూత్రాదికం-వస్త్రసూత్రములు మొదలైనవాటిని, దత్వా-యిచ్చి, పునః-మళ్లీ, మదీయసహస్రారఏవ-నాసహస్రారమందె, స్థాతవ్యమితి - వుండవలెనని, ఉక్తవాన్- చెప్పెను, సః- ఆదేవాంగఋషి, బహిరాగత్య - శివుని సహస్రారకమలమువిడిచివచ్చి, దేవతానాం - దేవతులకు, మంత్రపూర్వక వస్త్రసూత్రాదికం దత్వా- మంత్రపూర్వకములైన వస్త్రసూత్రములనుయిచ్చి, శివసహస్రార కమల మగమత్ - శివునిసహస్రారకమలమును పొందెను.

యస్య - యెవనియొక్క, ఆజ్ఞ - ఆజ్ఞచేతను, బ్రహ్మముకుంద కాల

కర్తృత్వమాపుర్జగత స్సమీశం వందే శివంశంకరమాత్మరూపం॥ ౧॥ కైలాస
శిఖరేరమ్యే రత్నసింహాసనస్థితం । ద్వాపరాదౌ శివందృష్ట్వా దేవతాశ్చదిగం
బరాః॥ ౨॥ ప్రణమ్య శిరసాసమ్యక్ ఊచుస్తేమానవర్జితాః । అస్మాకం సూ
త్రకర్తారం స్రష్టవ్యంచయథామతి॥ 3॥ దేవాన్ దృష్ట్వా శివసద్యః ధ్యాత్వాచ
సహస్రారకే । స్వకేస్థితం జ్యోతిరూపం బహిఃకృత్వా స్వమాయయా॥ ౪॥ దే
వానాంత్వం ఋషీణాంచ దత్వాసూత్ర వస్త్రాదికం । శీఘ్రమాగత్య స్వస్థా
నే ప్రవేశయ యథాసుఖం ॥ ౫ ॥ ఇత్యాహ హీశ్వరసాక్షాత్ దేవాంగోసా
యథాక్రమం । తత్రత్యానాంచ సర్వేషాం తత్తన్మంత్రప్రపూర్వకం ॥ ౬ ॥
దత్వావస్త్రాణిసూత్రాణి స్థానం ప్రాప్య యథాసుఖం ॥ ఋషయః ॥ సూత

---

రుద్రాః-బ్రహ్మవిష్ణుకాలరుద్రులు, ప్రభావస్థితిసంహృతీనాం- ఉత్పత్తిస్థితిసంహారములకు, జగత్తు-జగత్తుకు, కర్తృత్వం-కర్తృత్వమును, ఆపుః-పొందిరో, తం-ఆ ఆత్మరూపం - స్వస్వరూపమైన, శంకరం - సుఖంచేసె, ఈశం- ప్రభువైన, శివం-సాంబమూర్తిని, వందే- నమస్కరించుచున్నాను, రమ్యే- రమ్యమైన, కైలాసశిఖరే - కైలాస శిఖరమందు, రత్నసింహాసనస్థితం - రత్నసింహాసనమందుండె, ద్వాపరాదౌ-ద్వాపరయుగమందు, శివం-సాంబమూర్తిని, దృష్ట్వా- చూచి, దిగంబరాః- దిగంబరులైన, దేవతాశ్చ- దేవతలున్ను, శిరసా- శిరసుచేతను, ప్రణమ్య- నమస్కరించి, ఊచుః - పలికిరి, తే-ఆ దేవతలు, మానవర్జితాః - మానవర్జితులై , ఊచుః - పలికిరి , అస్మాకం - మాకు , సూత్రకర్తారం - సూత్రకర్తను , యథామతి - మాయిష్టప్రకారం, స్రష్టవ్యంచ- సృష్టించవలెను, దేవాన్ - దేవతలను, దృష్ట్వా - చూచి, సద్యః - అప్పుడే, ధ్యాత్వా - ధ్యానించి, స్వకే - తనసంబంధమైన, సహస్రారకే - సహస్రారకమలమందు, స్థితం - యుండెటటువంటి, తేజోరూపం- తేజోరూపమును, స్వమాయయా- తనమాయచేతను, బహిః - వెలపట, కృత్వా- చేశి, త్వం - నీవు, దేవానాం - దేవతలుకున్ను , సూతవస్త్రాదికం - సూత్రవస్త్రములను, దత్వా - యిచ్చి, శీఘ్రం - శీఘ్రముగా, స్వస్థానే - నాయొక్కస్థానమందు, యథాసుఖం- సౌఖ్యముగా, ప్రవేశయా- ప్రవేశించు, ఇతి - యిట్లని, సాక్షాత్ - సాక్షాత్తుగా, ఈశ్వరః - యీశ్వరుడు, ఆహ చెప్పెను, అసౌ- యీ, దేవాంగః- దేవాంగుడు, యథాక్రమం- యథాక్రమముగా, సర్వేషాం - సమస్తమైన, తత్రత్యానాంచ - అచ్చటనుండేవాళ్లకు, తత్తన్మంత్రపూర్వకం - ఆయామంత్రపూర్వకముగా, సూత్రాణి- సూత్రములను

సూతమహాప్రాజ్ఞకోయం దేవాంగ సంజ్ఞకః ॥ ౭ ॥ అస్మాకం వదశీఘ్రం తత్ ఇత్యూచుస్తే మహాయశాః ॥ సూతః ॥ పురాత్పార్వతీనాథం నమస్కృత్యచషణ్ముఖః ॥ ౮ ॥ దేవాంగస్వరూపంమేద్య వక్తవ్యమితిజాబ్రవీత్ ॥ ఈశ్వరః ॥ శృణుషణ్ముఖ సర్వజ్ఞత్వం దేవాంగస్వరూపకం ॥ ౯ ॥ ససర్వకార్యకర్తాచ సదా సూత్రాత్మకఃప్రభుః । ననపంచతత్వస్థఃనదివారాత్రితారకః ॥ ౧౦ ॥ నబ్రహ్మవిష్ణురుద్రాశ్చన నవగ్రహసంకులః । కింతు బ్రహ్మస్వరూపంచ దేవాంగో జ్యోతిరుచ్యతే॥ ౧౧॥ తజ్జ్యోతిరాత్మనాంథాతిస్వేతరైర్నప్రకాశితే। స్వయంబు దేవదేవేశః పరంజ్యోతి సదాశుచిః॥ ౧౨॥ నిరాకారసర్వరూపే పంచాం

---

దత్వా-యిచ్చి, స్థానం-స్థానమును, ప్రాప-పొందెను॥ ఋషయః॥ మహాప్రాజ్ఞ-మిక్కిలిబుద్ధిగలవాడా, సూత్ర-సూతుడా, అయం-యీ, దేవాంగసంజ్ఞకః-దేవాంగుడనేపేరుగలవాడు, కః-యవడు, అస్మాకం-మాకు, శీఘ్రం-శీఘ్రముగా, వద-చెప్పు, ఇతి-యిట్లని, మహాయశాః-మిక్కిలికీర్తిగల, తే-ఆఋషీశ్వరులు, ఊచుః-పలికిరి॥ సూతః॥ పురాతు-పూర్వకాలము, పార్వతీనాథం-సాంబమూర్తిని, షణ్ముఖః-కొమారస్వామి, నమస్కృత్య-నమస్కరించి, మే-నాకు, అద్య-యిప్పుడు, దేవాంగస్వరూపం-దేవాంగస్వరూపమును, వక్తవ్యమితి-చెప్పవలెనని, అబ్రవీత్ - పలికెను, సర్వజ్ఞ- సర్వజ్ఞుడైన, హేషణ్ముఖ-ఓకొమారస్వామి, త్వం - నీవు, దేవాంగస్వరూపం- దేవాంగస్వరూపమును, శృణు-వినుము, సః - ఆదేవాంగుడు, సర్వకార్యకర్తాచ - సమస్త కార్యములకు కర్తయున్ను, సదా-యల్లప్పుడున్ను, సూత్రాత్మకః-సూత్రస్వరూపుడున్ను, సః-ఆదేవాంగస్వరూపము, పంచపంచతత్వస్థః - యిరవైయైదుతత్వములలోవుండేవాడు,న-కాదు,దివారాత్రి-పగలురాత్రి,న-కాదు, తారకః-నక్షత్రములు,న-కాదు, బ్రహ్మవిష్ణురుద్రాశ్చ-బ్రహ్మవిష్ణురుద్రులున్ను, న- కాదు, నవగ్రహసంకులః-నవగ్రహసమూహమున్ను, న- కాదు, కింతు-యిఖనేమంటేను, బ్రహ్మస్వరూపశ్చ-బ్రహ్మస్వరూపమైన, దేవాంగః-దేవాంగుడు, జ్యోతిః-జ్యోతిగా, ఉచ్యతే-చెప్పబడెను,తజ్జ్యోతిః-ఆజ్యోతిస్వరూపము,ఆత్మనా-తనచేతను, భాతి-ప్రకాశిస్తున్నది, స్వేతరైః - తనకంటెఅన్యులచేతను, నప్రకాశతే-ప్రకాశించదు, స్వయంభుః- తనకుతానేపుట్టిన, దేవదేవేశః-దేవదేవేశుడైన, పరంజ్యోతిః-పరంజ్యోతిస్వరూపుడైన, సర్వరూపీ-సమస్తరూపమైన, పంచాంగః-పంచాంగములుగల, పంచవర్ణయః-పంచవర్ణమునుపొందిన, ఓంమిత్యేకాక్షరంబ్రహ్మ - ప్రణవస్వరూపమైనబ్రహ్మమే, సదా - యల్లప్పుడు, దేవాంగః - దేవాంగుడు

గో పంచవర్ణబాక్ । ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ దేవాంగో భాసతేసదా ॥ ౧౩ ॥ ససూత్రాత్మ పరబ్రహ్మ ప్రపంచ సృష్టుమైఛత । తే నాహం జాయతే లోకే మాయయాస్సహితసదా॥ ౧౪ ॥ జగద్రూపిణి దేవాంగే తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం । ఆవయోరంత రేనాస్తి భ్రాంత్యాభేదః ప్రకల్పితః॥ ౧౫॥ మేధిష్టానంచ సర్వేషాం రజ్జుస్సర్ప మతేర్యథా । ఆపాద మస్తకంప్రాప భువనానిచ తుర్దశా॥ ౧౬॥ పాదాతస్యాతలంవింద్యాత్ పాదోర్ధ్వంవితలంతథా। జంఘేతుసుతలంచైవతలాతలంచజానుషు॥ ౧౭॥ మహాతలతతోరోభ్యాంగుహ్యాస్థానేరసాతలం । పాతాళం కటిబంధేతు లోకాస్సప్త యథాక్రమం ॥ ౧౮ ॥ అధోభాగేతువర్తంతే తతోర్ధ్వ లోకనామకాః । భూలోకోదరమధ్యేతు

---

గా, భాసతే- ప్రకాశిస్తూయున్నాడు, సః- ఆదేవాంగుడు, సూత్రాత్మ- సూత్రాత్మయై, పరబ్రహ్మ - పర బ్రహ్మయే, ప్రపంచ స్రిష్టి - ప్రపంచ స్రిష్టిని, ఇచ్ఛత - యిచ్ఛయించెను, తేన-దానిచేతను, లోకే-లోకమందు, సదా-యల్లప్పుడున్ను, మాయయా - మాయచేతను, సహితః-కూడుకొని, అహం-నేను జాయతే- కలిగినాను, జగద్రూపిణి- జగద్రూపియైన, తస్మిన్-ఆ, దేవాంగే- దేవాంగునియందు, సర్వం - సమస్తమున్ను, ప్రతిష్ఠితం - వుంటున్నవి, ఆవయోః - మాయిద్దరికి, అంతః- భేదము, నాస్తి-లేదు, భ్రాంత్యా-భ్రాంతిచేతను, భేదః-భేదము, ప్రకల్పితః-కల్పింపబడెను, మే-నాకున్ను, సర్వేషాంచ-సమస్తమైన దానికిని, అధిష్టానం - అదిష్టానము, యథా - యెట్టుగా, సర్పమతేః-సర్పబుద్ధికి, రజ్జుః-త్రాడు, ఆశీత్-ఆయెను, ఆపాదమస్తకం - పాదము మొదలుకొని శిరసు పరియంతము, చతుర్దశ - పద్నాలుగుయైన, భువనాని-లోకములను, ప్రాప - పొందెను, తస్య - ఆదేవాంగునియొక్క, పాదౌ- పాదములు, అతలః-అతలముగా, విద్యాత్-యెరుగవలెను, పాదూర్ధ్వం- పాదంమీద, వితల-వితలముగానున్ను, జంఘేతు-జంఘములయందు,సుతలం-సుతలముగానున్ను, జానేషు - జానువులయందు, తలాతలం- తలాతలముగానున్ను, తతః-అటుతర్వాత, ఊర్వోశ్చ-తొడలయందు, మహాతలం - మహాతలముగానున్ను, గుహ్యస్థానే-గుహ్యస్థానమందు, రసాతలం - రసాతలముగానున్ను, కటిబంధేతు - కటిబంధమందు, పాతాళం - పాతాళముగానున్ను, యథాక్రమం - యథాక్రమముగా, సప్త- యేడైన, అధోభాగే - అధోభాగమందు, లోకాః - లోకములు, వర్తంతే - యుంటున్నవి, తతః-అటుతర్వాత, ఊర్ధ్వ లోక నామకాః - ఊర్ధ్వ లోకముల పేర్లుగలవి,

భువర్లోకస్తునాభిషు॥ ౧౯॥ సువర్లోకో హృదియస్య మహాలోకస్తు కం
ఠజః।జనలోకఃతతోవాచితపోలోకేలలాటకే॥ ౨౦॥ సత్యలోకో స్తతోమూ
ర్ధ్నిభువనానిచతుర్దశ । ఏవంతు దేహమధ్యేహి వర్తంతేతా య్యథాక్రమం॥
మనసాజాయతేచంద్రః చక్షోస్సూర్యోహ్యజాయత । ముఖాదగ్నిమనుశ్చైవ
ప్రాణాద్వాయురజాయత ॥ ౨౨ ॥ నాభ్యాతుహ్యంతరిక్షంచ శిశ్నోద్యౌ
స్సమవర్తత । పద్భ్యాంభూమి ర్దిశశ్శ్రోత్రం తథాలోకానుకల్పితం॥ ౨౩॥
ఈశకోటి స్తుతోత్పన్నా జీవకోటి స్తథైవచ । సర్వేషాం గురుసాక్షాత్తు దేవాం
గో హ్యగ్నిమామనుః ॥ ౨౪ ॥ బ్రాహ్మణో మునిజాతౌతు దేవజాతౌతు క్షత్రి

---

ఉదరమధ్యేతు - ఉదర మధ్యమందు, భూలోకాః - భూలోకమున్ను, నాభిషు - నాభియందు, భువర్లోకస్తు - భువర్లోకమున్ను, యస్య- యవనియొక్క, హృది - హృదయస్థానమందు, సువర్లోకః - సువర్లోకమున్ను, కంఠజః- కంఠమందుండెడి, మహాలోకః-మహాలోకమున్ను, తతః-అటుతర్వాతను, వాచి-వాక్కుయందు, జనలోకః- జనలోకమున్ను, లలాటకే- లలాటమందు, తపోలోకః-తపోలోకమున్ను, తతః - అటుతర్వాతను, మూర్ధ్ని - శిరసుయందు, సత్యలోకః - సత్యలోకమున్ను; ఏవంతు - యీప్రకారముగాను, దేహమధ్యే-దేహమధ్యమందు, యథాక్రమం-యథాక్రమముగా, చతుర్దశ - పదునాల్గుయగున, తాని-ఆ, భువనాని-లోకములు, వర్తంతేహి-యుంటున్నవిగదా, మనసా-మనసుచేతను, చంద్రః-చంద్రుడు, జాయతే-పుట్టెను, చక్షోః - చక్షువువల్ల, సూర్యః- సూర్యుడు, అజాయతేహి- పుట్టెనుగదా, ముఖాత్-ముఖంవల్ల, అగ్నిమనుశ్చేతి-అగ్నిమనువున్ను, ప్రాణాత్-ప్రాణంవల్ల, వాయు - వాయువు అజాయత - పుట్టెను, నాభ్యాత్ - నాభియందైతేను, అంతరిక్షంచ- అంతరిక్షమున్ను, శిశ్నోః- శిశ్నంవల్ల, ద్యౌః- ఆకాశము, సమవర్తత- కలిగెను, పద్భ్యాం-పాదములచేత, భూమిః-భూమిన్ని, దిశ-దిక్కులున్ను, శ్రోత్రః - శ్రోత్రమున్ను, తథా- ఆప్రకారముగానే, లోకాను కల్పితం-లోకాలోకములు, కల్పితం-కల్పింపబడెను,తతః-అటుతర్వాతను, ఈశకోటిః- కోటీశ్వరులు, ఉత్పన్న- పుట్టింపబడెను, తథైవచ-ఆప్రకారముగానే, జీవకోటిః- కోటిజీవులున్ను, సర్వేషాం- సమస్తమైనవాళ్లకు, సాక్షాత్ - సాక్షాత్తుగా, గురుః- గురువైన, దేవాంగః- దేవాంగుడు, అగ్నిమామనుహి- అగ్నిమామనువుగదా, మునిజాతౌతు - మునిజాతియందైతేను, బ్రాహ్మణః - బ్రాహ్మణులు, దేవజాతౌతు - దేవజాతియందైతేను, క్షత్రియః - క్షత్రియు

యః । వైశ్యోహ్యప్సరజాతౌతు శూద్రస్తుయక్షజాతిజః ॥ ౨౫ ॥ చాతుర్వ ర్ణోపదేశేతు కారణం త్వగ్నిమామనుః । గురుర్గురోత్తమశ్చైవ దేవాం గోసూత్రధారకః ॥ ౨౬ ॥ ఏవంమూర్తిధరఃకల్పే లోకానాంహితకామ్యయా। జటామేఖలకౌపీనః భస్మాంగో బ్రహ్మసూత్రకః ॥ ౨౭ ॥ ఆధారో అక్షమా లంచ కమండలుపవిత్రకః । శివముద్రాంకితధరో శోభమానసురార్చితః ॥ ౨౮ ॥ సర్వోపదేశ కర్తాచ సర్వాభిమానతారకః । సర్వకార్యేషు కర్తాహి తథాసూత్రాత్మకప్రభుః ॥ ౨౯ ॥ అంతరంగేష్వహ్యాత్మాతుబహిరంగేజగద్గురుః। సాయుజ్యేతారకబ్రహ్మ దేవాంగో జ్యోతిరుచ్యతే॥ 3౦॥ హంసాభ్యాం పరివృ

---

షు, అప్సరజాతౌతు- అప్సరజాతియందైతేను, వైశ్యః-వైశ్యుడు, శూద్రస్తు- శూద్రుడైతేను, యక్షజాతిజః - యక్షజాతియందుపుట్టినవాడు, చాతుర్వర్ణో పదేశస్తు - నాలుజాతులకుఉపదేశమందైతేను, కారణం - కారణము, అగ్ని మామనః - అగ్నిమామనువు, గురోత్తమశ్చైవ - గురోత్తముడైన, సూత్ర దారకః- సూత్రధారకుడైన, దేవాంగః- దేవాంగుడు, గురుః- గురువు, ఏవం- యీప్రకారముగాను, మూర్తిధరః- మూర్తినిధరించిన, కల్పే- ప్రతికల్పము లను, లోకానాం-లోకులకు, హితకామ్యయా, హిత-హితువుయొక్క, కామ్య యా - కోరికచేతను, జటామేకలకౌపీనః- జటలున్ను! మొలనూలున్ను! కౌ పీనమున్నుగల, భస్మాంగః, భస్మ-భస్మముతో గూడిన, అంగ-అంగములుగల, బ్ర హ్మసూత్రకః- బ్రహ్మసూత్రముగల, ఆధారః- ఆధారభూతుడైన, అక్షమాలః- అక్షమాలయున్ను, కమండలు - కమండలముచేతను, పవిత్రకః - ప రిశుద్ధుడైన, శివముద్రాంకితధరః, శివ - శివునియొక్క అంకితగుర్తులు న్ను, ధరః - ధరించునటువంటి, శోభమాన - ప్రకాశిస్తూయుండేటటువంటి, సురార్చితః, సురా- దేవతులచేత, అర్చితః - పూజింపబడిన, సర్వోపదేశ కర్తాచ, సర్వా - సమస్తమైనవాళ్లకు, ఉపదేశ - ఉపదేశమందు, కర్తాచ- కర్త యైన, సర్వాభిమానతారకః, సర్వ - సమస్తమైనవాళ్లయొక్క అభిమాన మును, తారకః - తరింపచేసేటటువంటి, సర్వకార్యేషు - సమస్తకార్యము లయందు, కర్తాహి-కర్తయైన, తథా - ఆప్రకారముగానే, సూత్రాత్మకప్రభుః- సూత్రరూపప్రభువైన, అంతరంగేషు - అంతరంగములయందు, ఆత్మా - ఆ త్మయైన, బహిరంగే-బహిరంగమందు, జగద్గురుః-జగద్గురువైన, సాయుజ్యే - సాయుజ్యమందు, తారకబ్రహ్మ - తారకబ్రహ్మయైన, దేవాంగః-దేవాంగుడు, జ్యోతిః-జ్యోతిస్వరూపము, కీర్తితః-చెప్పబడెను, హంసాభ్యాం-హంసలచే

తనితకమలే । దివ్యంజగత్కారణం । శశ్వతీర్ణమనేకదేహనిలయం। స్వచ్ఛం దమాకాంక్షయా । తత్వపదార్థ లక్ష్యకథనం । భావీసదీపంకరం । ప్రత్యక్షరవిగ్రహం । గురుపదం ధ్యాయే ద్విభూషాన్వితం ॥ ౩౧ ॥ అగ్నించవిశ్వసంభవం అగ్న్యాగర్భం దధిరేవిరూపస్థానాః । అపస్యగ్శేనా భవంతు ఓంకారో బ్రహ్మవర్ణంతు విశ్వబీజం వివర్ధతే ॥ ౩౨ ॥ మూర్తిత్రయ స్వరూపేతు దేవాంగో సూత్రధారకః ॥ ౩౩ ॥ ఓంమిత్యేకాక్షరంబ్రహ్మ దేవాంగో యతతేస్వయం । ప్రణవోబీజరూపస్తు పరమాత్మాసదాశివః ॥ ౩౪ ॥ ఆత్మత్రయస్వరూపస్తు ఆదిశక్తి సమన్వితః । స్వయంభుర్దేవ దేవేశః దేవాంగో దివ్యమూర్తిభాక్ ॥ ౩౫ ॥ గుణత్రయాత్మకోజ్ఞానిచేతనోభాసతేగురుః చంద్రకో

---

తను,పరివృత-చుట్టబడిన,నిత్యకమలే, నిత్య నిత్యమైన,కమలే-కమలమన్దు,దివ్యం-దివ్యమైన, జగత్కారణం జగత్కారణమైన, సశ్వతి-పలుమారున్ను, కీర్ణం - దాటినటువంటి, అనేక - అనేకమైన, దేహ-దేహములయొక్క, నిలయం-స్థానరూపమైన, స్వఛందం-స్వేఛగా, అకాంక్షయా - కోరికచేతను, తత్వంపథార్థ - తత్వం పథార్థము యొక్క, లక్ష్యకథను - లక్ష్యార్థకవాచకమైన,భావీ-భావించదగిన, సదీపంకరం - సజ్యోతినిచేసేటటువంటి, ప్రత్యక్ష-ప్రత్యక్షముగా, అక్షరవిగ్రహం - ఓంకార స్వరూపుడైన, ద్విభూషాన్వితం - అలంకారముతోగూడుకొనిన, గురుపదం-గురుపదమును, ధ్యాయేత్-ధ్యానం చేయవలెను. విశ్వసంభవం-విశ్వప్రపంచమందు,సంభవం-పుట్టిన, అగ్నించ- అగ్నినిన్ని, అగ్న్యా - అగ్నిచేతను, గర్భం- గర్భమును, దధిరే- ధరించెను, విరూపస్థానాః- విరూపమైనస్థానముగల ఆవుదకములను, శేనా - శేసములుగా, భవంతి - అవుగాక, ఓంకారస్తు- ఓంకారమైతేను, బ్రహ్మవర్ణం - బ్రాహ్మణవర్ణమైన, విశ్వబీజం, విశ్వ-ప్రపంచమునకు, బీజం- బీజముగా, వివర్ధతే-వృద్ధిబొందెను, మూర్తిత్రయ స్వరూపస్తు - మూర్తిత్రయ స్వరూపమైతేను, సూత్రదారక - సూత్రదారకుడనే దేవాంగుడు, ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ - నాశరహితమైన ప్రణవబ్రహ్మమైన, దేవాంగః- దేవాంగుడు, స్వయం - తనకు తానే, ప్రణవః - ప్రణవము, బీజరూపస్తు - బీజరూపమున్ను, పరమాత్మ - పరమాత్మయున్ను, సదాశివః - సదాశివుడున్ను, ఆదిశక్తిసమన్వితః - ఆదిశక్తితోగూడుకొనియుండె, ఆత్మత్రయస్వరూపః - ఆత్మత్రయస్వరూపమేను, స్వయంబు-తనకుతానేపుట్టిన, దేవదేవేశః-దేవదేవేశుడైన, దివ్యమూర్తిభాక్ - దివ్యమూర్తినిపొందిన, గుణత్రయాత్మకః- గుణత్రయగుపుడైన, జ్ఞానీ-జ్ఞాని

టి సమకళః సూర్యకోటి సమప్రభః ॥ ౩౬ ॥ శుద్ధమాయా సమాయుక్తః । బ్రహ్మణానిర్మితోపురా। సూత్రేణరుద్రసంయుక్త ఉపవీతంత్తుధారయేత్ ॥ ౩౭ ॥ సురాసురమనుష్యాణాం తంతుమాంగల్యవేష్టితం । అస్తస్పర్శనమాత్రేణ లోకానాం సఫలంకురు ॥ ౩౮ ॥ కల్పకల్పాంత్తరశ్చైవ ప్రపంచంత్తు ప్రకాశితే । సదాసాయుజ్యపీఠస్తు తంతుగర్భః ప్రకాశితే ॥ ౩౯ ॥ విశ్వవ్యాపీసయోగీబ్రహ్మ విమలఃనిత్యోసదానిర్గుణః । సత్యంబుధిస్సహస్ర పత్రకమలే ప్రత్యక్షరమంటపె । చిత్సాయుజ్యప్రకాశమానమతిమాస్వచందంజగతీతలే। ఆత్మాతస్వమతంప్రవిశ్య చతురస్స్వానంద మావర్తతే ॥ ౪౦ ॥ సురేశఫాల

---

యైన, చేతనః- చేతన్యస్వరూపుడైన, దేవాంగః-దేవాంగుడనే, గురుః- గురువు, భాసతే - ప్రకాశిస్తున్నాడు, చంద్రకోటిసమకలః - కోటిచంద్రులతో సమానమైనకళలుగల, కోటిసూర్యసమప్రభః- కోటిసూర్యులతో సమానమైన కాంతిగల, శుద్ధమాయాసమాయుక్తః - పరిశుద్ధమాయతో కూడుకొనియుండెవాడై కొంచున్ను, పురా - ముందు, బ్రహ్మ - బ్రహ్మచేతను, నిర్మిత - నిర్మింపబడిన, సూత్రిణా - సూత్రం చేతను, రుద్రసంయుక్తః - రుద్రునితో కూడుకొనియుండె, ఉపవీతం - ఉపవీతమును, ధారయేత్ - ధరించెను, సురాసురమనుష్యాణాం - దేవాసుర మనుష్యులకు, తంతుమాంగల్యవేష్టితం - తంతుమాంగల్యముతో కూడుకొనియుండె, ఉపవీతం - ఉపవీతమును, అస్తస్పర్శనమాత్రేణ- హస్తస్పర్శనమాత్రచేతను, లోకానాం- లోకులకు, సఫలం - సఫలమును, కురు- చేయు, కల్పకల్పాంతరశ్చైవ- కల్పకల్పాంతరములకున్ను, ప్రపంచంత్తు - ప్రపంచము, ప్రకాశితే - ప్రకాశిస్తున్నది, సదా - యల్లప్పుడున్ను, సాయుజ్యపీఠస్తు - సాయుజ్యపీఠముగల, తంతుగర్భః - తంతువనే గర్భమందుగల, విశ్వవ్యాపీ-విశ్వమందువ్యాపిస్తూవుండె, యోగీ-యోగియైన, సః- ఆదేవాంగుడు, ప్రకాశితే - ప్రకాశిస్తూయున్నాడు, బ్రహ్మ- బ్రహ్మమైన, విమలః- సచ్ఛమైన, నిత్యః- నిత్యమైన, సదా - యెల్లప్పుడున్ను, నిర్గుణః- నిర్గుణుడైన, సత్యః - సత్యుడైన, బుద్ధిః - జ్ఞానస్వరూపుడైన, ప్రత్యక్షరమంటపె - ప్రణవపీఠమైన, సహస్రపత్రకమలె - సహస్రపత్ర కమలముయందు, చిత్సాయుజ్య ప్రకాశమానమతిమాస్ - చిత్సాయుజ్యమందు ప్రకాశిస్తూయుండెబుద్ధిగల, స్వచ్ఛందం-స్వేఛ్ఛగా, జగతీతలే-జగత్తుయందు, ఆత్మాత్ - ఆత్మస్వరూపమైన, స్వమతం - తనమతమును, ప్రవిశ్య - ప్రవేశించి, చతురః - చమత్కారముగల దేవాంగుడు, స్వానందం - సంతోషముగా, ఆవ

నేత్రేచ అగ్నిమామనురుద్భవః । సూర్యకాంతిశ్చ గోవిందో దేవాంగో భూసురోత్తమః ॥ ౪౧ ॥ బ్రహ్మ సహస్రమధ్యేతు జ్ఞానీతుకులదీపకః । సర్వోపదేశకర్తాచదేవాంగో సూత్రధారకః॥ ౪౨ ॥ వర్ణాశ్రమే తతో ధర్మః వర్ణధర్మే తథైవచ । యక్షరాక్షసగంధర్వ దిక్పాలాదిగణాధిపః॥ ౪౩॥ షణ్ముఖః॥ దేవేశ్వరమహాప్రాజ్ఞ వదమే కరుణాకర । యజ్ఞోపవీత మాహాత్మ్యం దేవాంగ బ్రహ్మణస్య ॥ ౪౪॥ ఈశ్వరః॥తంతుత్రయేణసంయుక్తం ఉపవీతంచకీర్తితం । గాయత్రీత్రిపదా ప్రాజ్ఞసాతు దేవాంగనిర్మితా ॥ ౪౫॥ వదామితస్యమానంతు శృణుపుత్రకౌమారక । దేవాంగబ్రహ్మణో వంశే శూద్రత్వం నాస్తితద్ధ్రువం॥ ౪౬॥ జన్మనాజాయతేబ్రహ్మ దేవాంగో దేవపూజితః । సతుదేవాంగశబ్దే

---

ర్తితే - యుండెను, సురేశఫాలనేత్రేచ - యీశ్వరుని ఫాలనేత్రమందు, ఉద్భవ - పుట్టిన, అగ్నిమామనుః - దేవాంగుడు, సూర్యకాంతిశ్చ సూర్యునితో సమానమైన కాంతిగల, దేవాంగః- దేవాంగుడు, గోవిందః-భూమినికాపాడే వాడుగా నున్న, భూసురోత్తమః - బ్రాహ్మణోత్తముడు గా నున్న, విప్రసహ సమధ్యేతు - వేయి బ్రాహ్మణులమధ్యను, జ్ఞాన - జ్ఞానముగల, కులదీపకః- కులమును ప్రకాశింపచేశే, సర్వోపదేశ కర్తాచ - సమస్తోపదేశమందుకర్తయైన, సూత్ర ధారకః - సూత్రధారకుడైన, దేవాంగః - దేవాంగుడు, తతః - అటుతర్వాతను, వర్ణాశ్రమే - వర్ణాశ్రమయందు, ధర్మః - ధర్మమున్న,తథైవచ-అట్లాగే, వర్ణధర్మ- వర్ణధర్మమందున్న, యక్షరాక్షసగంధర్వదిక్పాలాదిగణాదిపః - యక్షరాక్షస గంధర్వదిక్పాలాదిగణములుకుప్రభువుగా,ఆశీత్-ఆయను ॥షణ్ముఖః॥మహాప్రాజ్ఞః-మంచిప్రజ్ఞగల,కరుణాకర-కరుణాకరుడైనయీశ్వరుడా,మే-నాకు,సదా-యల్లప్పుడున్ను,దేవాంగబ్రాహ్మణః-దేవాంగబ్రహ్మముయొక్క, యజ్ఞోపవీతమాహాత్మ్య - యజ్ఞోపవీతమాహాత్మ్యమును,వద-చెప్పు॥ఈశ్వరః॥తంతుత్రయేణ-తంతుత్రయముచేతను,సంయుక్తం-కూడుకొనియున్నె,ఉపవీతం-ఉపవీతమును, కీర్తితం-చెప్పబడెను,తత్తు-ఆయజ్ఞోపవీతమైతేను, దేవాంగ నిర్మిత - దేవాంగుని చేతనిర్మింప బడిన, త్రిపద - మూడుపాదములుగల, గాయత్రీ-గాయత్రి,అస్తి-యున్నది, తస్యాః-ఆగాయత్రియొక్క,మానన్తు-ప్రయాణమైతేను,వదామి-చెప్పుచున్నాను,పుత్ర-కొమారుడైన, కొమారక-కొమారస్వామి, శృణు-విను, దేవాంగబ్రహ్మణః-దేవాంగబ్రహ్మయొక్క,వంశే-వంశమందు,శూద్రత్వం-శూద్రత్వము, నాస్తి-లేదు,తద్ధ్రువం-అదినిశ్చయము, జన్మనా-పుట్టుకచేతను, దేవపూజితః - దేవతులచేతను

నశుద్ధబ్రహ్మ ప్రతీయతే ॥ ౪౭ ॥ యజ్ఞోపవీతమంత్రంచ తస్యమానం విధీయతే । యజ్ఞోపవీతమాత్రేణ బ్రహ్మత్వం నైవసిద్ధితి॥ ౪౮॥ కింతుజ్ఞానం వినాపుత్ర బ్రహ్మత్వం నాస్తిసర్వశః । ఏతత్సత్యం పరంధీమన్ శ్రోతవ్యమితి నాన్యథా ॥ ౪౯ ॥ ఏతత్ శ్రవణమాత్రేణ భవేన్ముక్తరుదారధీః । తస్మాత్సర్వ ప్రయత్నేన పఠితవ్యం సదాబుధైః॥ ౫౦॥ మంతవ్యంచసదానృణాం మూల స్తంభనమాత్రకం । ఏతత్సత్యం మహాప్రాజ్ఞ మయోక్తం జ్ఞానవేదినా ॥ ౫౧ ॥ చౌడేశ్వరి నమస్తుభ్యం రామలింగాయధీమతే నిత్యాయనిర్వికల్పాయ సచ్చిదానందరూపిణే ॥ ౫౨ ॥ ఇతి మూల స్తంభనం.

---

పూజింపబడిన, దేవాంగః-దేవాంగుడు బ్రహ్మముగా, జాయతే-పుట్టెను, సతు-ఆ బ్రహ్మమైతేను, దేవాంగశబ్దేన-దేవాంగశబ్దముచేతను, శుద్ధబ్రహ్మ-శుద్ధబ్రహ్మము, ప్రతీయతే-చెప్పబడుచున్నది, యజ్ఞోపవీతమంత్రంచ-యజ్ఞోపవీతమంత్రము, మాన-ప్రమాణముగా, విధీయతే-చెప్పబడుచున్నది, యజ్ఞోపవీతమాత్రేణ-యజ్ఞోపవీతమాత్రంచేతను, బ్రహ్మత్వం-బ్రహ్మత్వమునైన సిద్ధికలుగనేరదు, కింతు-యిఘనేమంటెను, పుత్ర-కొమారుడా, జ్ఞానంవినా జ్ఞానంవినాగాను, బ్రహ్మత్వం-బ్రహ్మత్వము, నాస్తి-లేదు, ఏతత్-ఇది, హేధీమన్-ఓబుద్ధిమంతుడా, సత్యం-సత్యమూ, శ్రోతవ్యమితి-వినవలసినది, నాన్యథా-వేరకాదు, ఏతచ్ఛ్రవణమాత్రేణ-దీన్నివిన్నమాత్రంచేతనే, ఉదారః-మిక్కిలిజ్ఞానముగల, ముక్తః-ముక్తుడుగా, భవేత్-అవును, తస్మాత్-దానివల్ల, సర్వప్రయత్నేన-సర్వప్రయత్నముచేతను, సదా-ఎల్లప్పుడు, బుధైః-బుధులచేతను, పఠితవ్యం-పఠించవలసినది, సదా-ఎల్లప్పుడు, నృణాం-మానవులు, మూల స్తంభనమాత్రకం-మూల స్తంభమాత్రము, మంతవ్యం-యంచవలసినది, మహాప్రాజ్ఞ-మహాబుద్ధిగలవాడా, జ్ఞానవేదినా-జ్ఞానమునుగుర్తెరిగిన, మయా-నాచేతను, ఉక్తం-చెప్పబడిన, ఏతత్-ఇది, సత్యం-సత్యము, ధీమతే-బుద్ధిగల, నిర్వికల్పాయ నిర్వికల్పరహితుడైన, సచ్చిదానందరూపిణే-సచ్చిదానందరూపముగల, రామలింగాయ-రామలింగంకొరకు, హేచౌడేశ్వరి-ఓచౌడేశ్వరి, తుభ్యం-నీకొరకు, నమః-నమస్కారము, ఇతి మూల స్తంభనం-మూల స్తంభం ముగిసెను.

---

1

శ్రీ రస్తు.

పురాణములకన్నిటికి మొదట వ్రాయు ధ్యానశ్లోకములు.



అగజాననపద్మార్కం గజాననమహర్నిశం । అనేకదంతం భక్తానామే
కదంతముపాస్మహే ॥ ౧ ॥ యస్యాః పాణితలే సరోజమమలం తస్యాంతరా
ళేరమాదేవీ తన్నికటే పురాణపురుష స్తన్నాభిదే శేవిధిః । తత్కంఠేనిగమా
వళీవిలసనం తేనక్రతూనాం క్రియాః సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష
జాడ్యాపహా ॥ ౨ ॥ శారదాశారదాంభోజ వదనావదనాంబుజే । సర్వదా
సర్వదాస్మాకం సన్నిధి స్సన్నిధింక్రియాత్ ॥ ౩ ॥ శాంతాకారం భుజగశయ

---

పురాణముల మొదట వ్రాయు ధ్యానశ్లోకములయర్థము.

పార్వతిముఖ కమలమునకు సూర్యుడైనట్టియు - ఏనుగుముఖముగల
యట్టియు - సేవించిన వారికి మిక్కిలి యిచ్చునట్టియు - ఒకదంతము గల-
ఆప్రసిద్ధుఁడగు గణనాయకుని - పగలు రాత్రియును - ఉపాసన చేసెదము-
అనగాఁబై నిఁజెప్పినవి శేషణములతోఁగూడిన గణనాథుని గంధాదియందుపా
సనచేసెదమనుట - ౧ - ఏ సరస్వతియొక్క అరచేతియందు నిర్మలమై
న కమలమున్నదో - ఆకమలముయొక్క నడుమను లక్ష్మీదేవియున్నదో -
ఆమె దగ్గర అనాదిపురుషుడైన విష్ణువున్నాడో - అతనికి బొడ్డునందు బ్రహ్మ
యున్నాడో - అతనికంఠమునందు వేదపంక్తి ప్రకాశించుచున్నదో - ఆవే
దపంక్తి ప్రకాశము చేత యజ్ఞములయొక్క వ్యాపారములగుచున్న
వో - సమస్తములైన బుద్ధిమాంద్యములను పోఁగొట్టునట్టియు - షడ్గుణై
శ్వర్య సంపన్నురాలగు ఆ సరస్వతీదేవి నన్ను రక్షించు గాత - అనగా స
ర్వ ప్రపంచమున కాధారమగు కమలమును జేతఁబట్టుకొని యున్న స
రస్వతీదేవి నన్ను రక్షింపవలయునని యభిప్రాయము - ౨ - శరత్కాల క
మలమువంటి మోముగల యట్టియు అన్నిటి నిచ్చునట్టియు శ్రేష్ఠమైన ని
ధియగు సరస్వతి ఎల్లప్పుడు మాయొక్క ముఖకమలము నందు సన్ని
ధానమును చేయు గాత అనగా సమస్తాభీష్టముల నిచ్చు సరస్వతి యెల్లప్పు
డుమావాక్కు నెడఁబాయకుండ వలయునని తాత్పర్యము- ౩ - శాంతమూ

శంపద్మనాభం సురేశం విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం॥ లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం వందేవిష్ణుం భవభయహారం సర్వలోకైకనాథం ॥ ౪ ॥ శివాయ శంకరాయ చిన్మయాయ చంద్రమౌళయే భవాయ ఫాలలోచనాయ పంచబాణహారిణే । మృడాయభక్తపాలనాయ భుక్తిముక్తిదాయినే గిరీశ్వరాయ శంభవేనమోస్తు శూలపాణయే ॥ ౫ ॥ వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేఃపౌత్రమకల్మషం ॥ పరాశరాత్మజంవందే శుకతాతం తపోనిధిం ॥ ౬ ॥

---

తీ- శయనమైనట్టియు శేషశాయియైనట్టియు కమలము బొడ్డునందుఁ గలయట్టియు దేవతా ప్రభువై నట్టియు ప్రపంచ స్వరూపుడై నట్టియు ఆకాశముతో సమానుఁడై నట్టియు మబ్బు వన్నె గలయట్టియు మంచి యవయవములుగల యట్టియు లక్ష్మీకిఁ బెనిమిటియగు నట్టియు కమలముల వంటి కన్నులుగలయట్టియు యోగులు మనస్సున ధ్యానము చేయఁగా వారలకగపడునట్టియు - సంసారభీతిని మాన్పు నట్టియు సమస్తలోకములకుఁ దానొక్కఁడే ప్రభువైన విష్ణువును నమస్కరించుచున్నాను. అనఁగాఁ బైనిఁజెప్పిన లక్షణములుగల విష్ణువునకుఁ బ్రణతియొనరించెదనని యభిప్రాయము- ౪ - శుభరూపుడై నట్టియు మంగళకరుఁడై నట్టియు జ్ఞాన స్వరూపుఁడై నట్టియు చంద్రుడు శిరస్సునఁ గల యట్టియు సమస్తలోకముల యుత్పత్తి కారణమయినట్టియు నొసటఁ గన్ను గల యట్టియు మన్మథుని హరించినట్టియు భక్తులం గాపాడు నట్టియు భోగమును మోక్షమును నిచ్చు నట్టియు కొండకధిపతి యగునట్టియు సుఖాధారుఁడై నట్టియు శూలాయుధమును హస్తమందుధరించియున్న మృడునికొరకు - నమస్కారమగుగాత - అనగా నీలక్షణములుగల శివునికొరకు నమస్కారమగుఁ గాతయని యభిప్రాయము- ౫ - వసిష్ఠునకు మునిమనుమడై నట్టియు శక్తికి గొడుకు కొడుకగునట్టియు - పాపము లేనియట్టియు - పరాశరుని కొడుకగు నట్టియు శుకునితండ్రియగునట్టియు - తపస్సులరాశియైన వ్యాసమహర్షిని- నమస్కరించెదను- అనఁగా వ్యాసుఁడు సమస్త పురాణములకుఁ గర్త కావున నతనియుత్పత్త్యాదులను వక్కాణించి యతనికిఁ గ్రంథ ప్రారంభకాలమందుఁ బ్రణతియొనరింతునని యభిప్రాయము- ౬- ఈపురాణమందుఁ జౌడాంబికామాహాత్మ్యము మిక్కిలి వర్ణింపఁ బడును గనుక నామెకు మొదటఁ బ్రణతియొనర్చెను.

శ్రీరస్తు.

పురాణములకన్నిటికి మొదట వ్రాయు ధ్యానశ్లోకములు.



అగజాననపద్మార్కం గజాననమహర్నిశం । అనేకదంతం భక్తానామేకదంతముపాస్మహే ॥ ౧ ॥ యస్యాః పాణితలే సరోజమమలం తస్యాంతరా శ్రీరమాదేవీ తన్నికటే పురాణపురుష స్తన్నాభిదేశే విధిః । తత్కంఠే నిగమావళీవిలసనం తేన క్రతూనాం క్రియాః సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా ॥ ౨ ॥ శారదా శారదాంభోజ వదనా వదనాంబుజే । సర్వదా సర్వదాస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్ ॥ ౩ ॥ శాంతాకారం భుజగశయ

---

పురాణముల మొదట వ్రాయు ధ్యానశ్లోకములయర్థము.

పార్వతిముఖ కమలమునకు సూర్యుడైనట్టియు - ఏనుగుముఖముగల యట్టియు - సేవించిన వారికి మిక్కిలి యిచ్చునట్టియు - ఒకదంతము గల ఆ ప్రసిద్ధుడగు గణనాయకుని - పవలు రాత్రియును - ఉపాసన చేసెదము- అనగా పైని జెప్పినవిశేషణములతోఁగూడిన గణనాథుని గంధాదియందుపాసనచేసెదమనుట - ౧ - ఏ సరస్వతియొక్క అరచేతియందు నిర్మలమైన కమలమున్నదో - ఆకమలముయొక్క నడుమను లక్ష్మీదేవియున్నదో - ఆమె దగ్గిర అనాదిపురుషుడైన విష్ణువున్నాడో - అతనికి బొడ్డునందు బ్రహ్మ యున్నాడో - అతనిగొంతునందు వేదపంక్తి ప్రకాశించుచున్నదో - ఆవేదపంక్తి ప్రకాశము చేత యజ్ఞములయొక్క వ్యాపారములగుచున్నవో - సమస్తములైన బుద్ధిమాంద్యములను పోఁగొట్టునట్టియు - షడ్గుణైశ్వర్య సంపన్నురాలగు ఆ సరస్వతీదేవి నన్ను రక్షించుగాత - అనగా సర్వ ప్రపంచమునకాధారమగు కమలమును జేతఁబట్టుకొనియున్న సరస్వతీదేవి నన్ను రక్షింపవలయునని యభిప్రాయము - ౨ - శరత్కాల కమలమువంటి మోముగల యట్టియు అన్నిటి నిచ్చునట్టియు శ్రేష్ఠమైన నిధియగు సరస్వతి ఎల్లప్పుడు మాయొక్క ముఖకమలము నందు సన్నిధానమును చేయుగాత అనగా సమస్తాభీష్టముల నిచ్చు సరస్వతి యెల్లప్పుడుమావాక్కు నెడఁబాయకుండ వలయునని తాత్పర్యము- ౩ - శాంతమూ

శ్రీరస్తు.

శ్రీచౌడాంబాయైనమః.

దేవాంగపురాణప్రారంభః.

పురానారదమాసీంద్ర స్సత్యంగత్వాపితామహం । నమస్కృత్యాబ్ర
వీద్వాక్యంలోకానుగ్రహకాంక్షయా ॥ ౧ ॥ నారదఉవాచ - యస్యాజ్ఞయా
బ్రహ్మముకుందకాలరుద్రాః ప్రభావస్థితిసహృతీనాం । కర్తృత్వమాపుర్జ
గతస్తమీశం వందేశివంశంకరమాత్మరూపం॥ ౨॥ యత్పుణ్యం పరమంలోకే
సర్వపాపహరంశుభం । యచ్ఛ్రుత్వా కృతకృత్యాస్స్యుస్తన్మే వదపితామ
హ ॥ 3 ॥ బ్రహ్మోవాచ ॥ శ్రుణునారదవక్ష్యామి దేవాంగచరితంశుభం । ర

---

ఇంక దేవాంగపురాణ ప్రారంభము.

పూర్వ కాలమందు - మునిశ్రేష్ఠుఁడగు నారదుఁడు - సత్యలోకమును పొంది - బ్రహ్మను మ్రొక్కి - లోకమునందు ననుగ్రహమును గోరుటచేత మాటను పలికెను - అనఁగా బూర్వము నారద మహాముని సత్యలోకమున కుఁబోయి బ్రహ్మను మ్రొక్కిఁడి లోకమునకంత క్షేమకరమైన మాట నడిగె నని తాత్పర్యము - ౧ - నారదుఁడడిగినమాట - ఎవనియొక్క యుత్తరవుచేత బ్రహ్మ విష్ణు రుద్రులు ప్రపంచము యొక్క పుట్టుకను నిలకడను ప్రళయమునను - కర్తలగుటనుపొందిరో - ఆప్రభువైనట్టియు శుభకరుఁడైనట్టియు ఆత్మరూపుఁడైన శివుని నమస్కరించుచున్నాను - అనఁగా ప్రపంచముయొక్క సృష్టి స్థితిలయములకుఁ గర్తలైన బ్రహ్మ విష్ణు రుద్రులకు నియామకుఁడైన పురాణపురుషుని నమస్కరించెదననితాత్పర్యము- ౨ - లోకమందు నేది పుణ్యమును గలుగఁ జేయునదియు శ్రేష్ఠమైనదియు సమస్తములయినదురితములను బోఁగొట్టునదియు శుభకరమైనదో - దేనివిని కృతార్థులుగా నగుదురో - ఓ బ్రహ్మా వాని నాకొఱకుఁ జెప్పుము - అనగా విన్న మాత్రమున సమస్త పాపములను బోఁగొట్టి సర్వాభీష్టముల నొసంగునట్టి కథను నాకుఁ జెప్పుమని నారదుడు బ్రహ్మ నడిగెనని తాత్పర్యము - 3 - బ్రహ్మ చెప్పెడిమాట - రహస్యమైనట్టియు సంతోషమును బుట్టించునట్టియు పరిశుద్ధముఁ జేయునట్టియు పాపములను బోఁగొట్టునట్టియు పూర్వ కాలమందైనట్టియు శివమహిమను వర్ణించునట్టియు మంగళకరమైన దేవాంగ మహాముని కథను చెప్పెదను - ఓనారదుడా వినుము - మిక్కిలి యధికమై

హాస్యం హర్షజనకం పవిత్రం పాపనాశనం ॥ ౪ ॥ పురాతనం మహాదేవ
మాహాత్మ్యప్రతిపాదకం । యచ్ఛ్రుత్వానుమహత్పుణ్యం కృతకృత్యోభవి
ష్యసి ॥ ౫ ॥ ఆసీత్సర్వత్ర యశ్శంభుస్సచ్చిదానందవిగ్రహః । శాశ్వతస్సర్వ
లోకేశ స్సర్వవ్యాపీపరాత్పరః ॥ ౬ ॥ అప్రమేయోదురాధర్షో నిర్గుణోని
రుపద్రవః । ఏకదాసమహాదేవః ప్రపంచం స్రష్టుమైచ్ఛత ॥ ౭ ॥ ఇచ్ఛాయాస్త
స్య సంజాతాయాశక్తిస్త్రిగుణాత్మికా । చాద్రాక్షీద్యోగినీం మాయాం జ్వ
లంతీంతాం మహేశ్వరః ॥ ౮ ॥ ఆదిశక్తింభగవతీం యయెదంధార్యతేజగత్ ।
దృష్టమాత్రేణదేవేన శివేనాథమహాజసా॥ ౯ ॥ తస్యారజోవిశిష్టాయా జాతో
హంమునిసత్తమ । సాత్వికాయాస్తతోవిష్ణుర్జాతోనారాయణఃప్రభుః॥౧౦॥
తామస్యాః కాలరుద్రోయం ప్రాదురాసీన్మహాబలః ॥ ౧౧ ॥ నారదః॥ దేవ
దేవజగత్స్వామిన్ పరమేష్ఠిన్పితామహ । తయాప్రకృత్యా జనితోమాయ
యాత్వంతతోనఘ । కించకర్థ త్వయాతాతనిశ్చితం కిం విశేషతః ॥ ౧౨ ॥ క

---

న పుణ్యమైన దేని విని కృతార్థుఁడవుగాఁ గాఁగలవో - అనఁగా వినఁగా
నే సమస్తపాపములను బోఁగొట్టి సుకృతముల నొసంగు కథను జెప్ప మంటివి
గనుక దేవాంగ మహాముని కథయట్టిదిగా నుండును దానిఁ జెప్పెద వినుమ
నెనని తాత్పర్యము - ౪ - ౫ - సర్వ ప్రపంచ వ్యాపకుండును సచ్చిదానంద
రూపుఁడును శాశ్వతుండును ఎల్లలోకములకుఁ బ్రభువును సర్వ ప్రాణి
హృదయ గతుండును పరంబు కంటెఁ బరుండును అప్రమే యుండును దు
రాధర్షుండును నిర్గుణుండును నిరుప ద్రవుండునగు మహాదేవు డొక
కాలమున ప్రపంచమును సృజింపఁగోరెను - ౬ - ౭ - అతనియిచ్ఛవల్లనుండి
జగత్తులకన్నిటి కాధారమగు త్రిగుణాత్మకమైన ప్రకృతికలిగి దివ్యతేజోరూ
పముతో వెలుంగుచుండ నాయాదిశక్తినీశ్వరుఁడువీక్షించెను- ౮- అట్లుమహా
తేజస్వియగు నీశ్వరునివీక్షణ ప్రసారమాత్రమున నాత్రిగుణాత్మక ప్రకృతి
రజోగుణ ప్రధానమైనపుడు నేనును సత్వగుణ ప్రధానయయినపుడు జగద్ర
క్షకుండగు నారాయణుండును - తమోగుణ ప్రధానమైనపుడు కాలరుద్రుం
డునీరీతిని మేముముగ్గురమా ప్రకృతివలననుత్పన్నులమైతిమి - ౧౦ - ఇట్లుబ్ర
హ్మ చెప్పఁగా నారదుఁడు బ్రహ్మ నడుగుచున్నాఁడు - లోకాధీశుఁడవును ఉ
త్కృష్టమగు స్థానమున నివసించిన వాఁడవును దేవ దేవుఁడవు నగు నట్టి
యో బ్రహ్మదేవుఁడా ఆ ప్రకృతివలనఁ బుట్టిన నీవేమి చేసితివి అప్పుడు నీతలం

థం ప్రపంచకర్తృత్వ మాప్తవానై వమహామతే । ఏతత్సర్వం మహాభాగవిస్తరాద్వక్తుమర్హసి ॥ ౧౩ ॥ బ్రహ్మా ॥ సాధుపృష్టం మునిశ్రేష్ఠత్వయా బుద్ధివిశారద । వక్ష్యామిపృష్టం తత్సర్వం శ్రుణునారదతత్వతః ॥ ౧౪ ॥ సోహం తతో వినిశ్చిత్య దేవదేవం మహేశ్వరం । సచ్చిదానందనిలయం పరంబ్రహ్మేతిచధ్రువం ॥ ౧౫ ॥ తప్తవాన్ సుచిరంకాలం శంకరానుగ్రహేచ్ఛయా । తతస్తుష్టో మహాదేవః ప్రససాదజగత్ప్రభుః ॥ ౧౬ ॥ తం ప్రసన్నం శివందేవం శంకరం భక్తవత్సలం । అస్తువం పరమప్రీత్యా హర్షబాష్పాకులేక్షణః ॥ ౧౭ ॥ నమస్తే దేవదేవేశ నమస్తే పార్వతీపతే । నమస్తే నీలకంఠాయ నమస్తే శూలపాణయే ॥ ౧౮ ॥ నమస్తేనాగభూషాయ నమస్తేచంద్రమౌళయే । నిత్యాయనిర్వికారాయ సదానందాయధీమతే ॥ ౧౯ ॥ వేదవేదాంతవేద్యాయ నమస్తేప

---

హేమిగానుండెను - ప్రపంచమునకు నీవెట్లు సృష్టవైతివి - ఈ వృత్తాంతములనెల్ల నాకు విస్తరించి తెలుపుమనెను- ౧౩- బ్రహ్మచెప్పెడిమాట - ఓనారదుఁడా నీవు మిగుల బుద్ధికౌశలము గలవాఁడవు గాన మంచి ప్రశ్న చేసితివి నీవడిగిన విషయమంతయు నిజముగాఁ జెప్పెద వినుము - ౧౪ - పిమ్మట నేను దేవతలకెల్ల దేవుండగు మహేశ్వరుఁడు సచ్చిదానంద రూపుఁడగు పరబ్రహ్మయని నిశ్చయముచేసికొని యాశంకరుని యనుగ్రహమును గోరి తడవుగాఁ దపస్సుచేయఁగా నాతపస్సుచేత సంతసించినవాఁడై జగత్ప్రభువగు నీశ్వరుఁడనుగ్రహించెను- ౧౬- ఇట్లునాకుఁ బ్రసన్నుఁడై నట్టియు - భక్తవత్సలుఁడగునట్టియు - మంగళకరుఁడగు నట్టియు - మంగళాకారుడగు నా శివునిజూచి ప్రీతిచే నానందబాష్పములు కన్నులునిండగా నతనినేస్తుతించితిని - ౧౭ - స్తుతించిన క్రమము - దేవదేవుల కీశుఁడా నీకొఱకు నమస్కారము - పార్వతీకాంతుడా నీకొఱకు నమస్కారము - నల్లనికంఠముగల నీకొరకు నమస్కారము - చేతఁశూలముఁబట్టియున్న నీకొఱకునమస్కారము - ౧౮ - సర్పములనాభరణములుగాధరించిన నీకొఱకు నమస్కారము - నెల్లను దలనుధరించిననీకొఱకునమస్కారము- నిత్యుఁడును వికార రహితుఁడును - ఎల్లప్పుడునానందముగల వాఁడును జ్ఞానము గలవాఁడును - వేదములు వేదాంతములు చదివినవారిచేఁ దెలియదగిన వాఁడును - పరమాత్మస్వరూపుఁడునగు నీకొఱకు నమస్కారము - ౧౯ - ఇట్లు నేను స్తోత్రముచేసిన పిమ్మట సర్వేశ్వరేశ్వరుఁడగు మహాదేవు డావరముతో నాతోఁ జెప్పిన మాటల నీతోజెప్పెద వినవ

రమాత్మనే । ఏవం స్తుతో మహాదేవ శ్శివస్సర్వేశ్వరేశ్వరః॥ ౨౦॥ ప్రోవాచ సాదరం యన్మాం శ్రుణుత్వన్మునికుంజర । శ్రీశివః ॥ సాధుసాధుమహాభాగ ప్రీతోస్మితపస స్తవ ॥ ౨౧ ॥ వరం వృణీష్వదాస్యామి యత్తేమనసిరోచతే । ఏవ ముక్తో భగవతా ప్రహృష్టో హంజగాదతం ॥ ౨౨ ॥ మహాదేవదయాసింధో పురాణపురుషప్రభో । జగత్స్రష్టా భవిష్యామి శంకరాహంతవాజ్ఞయా॥ ౨౩॥ మయాతద్దైవముక్తస్తు మహేశః ప్రా బ్రవీద్వచః । యదుక్తం భవతా బ్రహ్మన్ తత్తథా నభవిష్యతి ॥ ౨౪ ॥ అద్యాదితశ్చతుర్వక్త్ర ప్రపంచం సచరాచరం । సృజానఘజగత్స్రష్టా భవిష్యసిమమాజ్ఞయా ॥ ౨౫ ॥ ఏవమాదిశ్యమాంశంభుస్తత్రై వాంతరధీయత । అథాహం వై ప్రసాదేన దేవదేవస్యశూలినః ॥ ౨౬ ॥ సృష్టవానస్మి సహసా ప్రపంచం సచరాచరం । తతస్సృష్టాః ప్రజాస్సర్వా దేవాద్యా స్సర్వతో ముఖాః ॥ ౨౭ ॥ చేరుర్గోవృత్తివన్నిత్యం వస్త్రహీనాదిగంబరాః । ప్రకాశమాన సర్వాంగా స్త్రీపుంసా మాన వర్జి

---

యా నారదమహామునీయనేను - ౨౦ - శివుండు చెప్పిడిమాట - ఓ మిక్కిలి యదృష్టముగల బ్రహ్మదేవుడా నీతపస్సునకు మిక్కిలి సంతసించితిని లెస్స లెస్స - నీమనస్సున నిష్టమగు వరమును గోరుమిచ్చెదను అని చెప్పఁగా నేను మిక్కిలి సంతసించి యాశివునితో నొకమాటఁ జెప్పితిని- ౨౨- దయాసముద్రుండును - పురాణ పురుషుండును ప్రభువు నగు నో మహా దేవుఁడా నీయాజ్ఞ చేత లోకములను సృజింప వలయునను కోరిక నామనంబునఁ గలుగుచున్నది - ౨౩ - ఇట్లు నేను జెప్పఁగా మహేశుఁడు నాతో నో బ్రహ్మదేవుడా నీవు చెప్పిన ప్రకారమే కాగలదనెను - ౨౪ - ఇదిమొదలుకొని స్థావరజంగమములతోఁ గూడియున్న ప్రపంచమును నీవుసృజింపుము నాయాజ్ఞ చేత నీవుజగత్తునకు స్రష్టకాగలవు - ౨౫ - ఇట్లు నాకానతిచ్చి శివుండచ్చటనే మఱిగిపోయెను - అంత నేను దేవదేవుఁడగు శూలాయుధధరుని యనుగ్రహముచే తస్థావరజంగమములతోడి ప్రపంచమును సృజించితి- ౨౬- అంత నేను సృజించిన ప్రజలు దేవతలులోనగు వారందఱును వస్త్రహీనలై దిగంబరలుగా నన్ని యవయవములు దెలియఁగా మానములేనివారై గోవులవలెఁ దిరుగుచుండిరి - కొన్నాళ్లకు వారలకుఁ దమ యంగముల నాఛాదింపఁ దలంపుగలిగినను వస్త్రములలేమివల్ల చెట్లతొటలను ఆకులను - బొచ్చును దెచ్చి వానిచేఁదమదేహముల నాచ్ఛాదించు కొనుచుండిరి- ౨౭- ఇట్లునిందితలై నయా

తాః ॥ ౨౮ ॥ కేశత్వక్పర్ణవసనా వస్త్రకార్పణ్యకర్శితాః । దృష్ట్వా హం
తాః ప్రజాస్సర్వా నిందితాభృశలజ్జితాః ॥ ౨౯ ॥ అలంకారాయ సర్వేషాం వ
స్త్రనిర్మాణకారణం । బుభుత్సుః పార్వతీనాథం కైలాసమగమంతతః ॥ ౩౦ ॥
తతః కైలాసశిఖరే వజ్రసింహాసనస్థితం । ప్రమథై ర్దేవగంధర్వై స్సేంద్రై
రాక్షసకిన్నరైః ॥ ౩౧ ॥ గరుడై శ్చారణై స్సిద్ధై ర్నాగై ర్విద్యాధరైరపి ।
ఆదిత్యైర్వసుభిశ్చైవ రుద్రై రత్యుగ్రమూర్తిభిః ॥ ౩౨ ॥ కేశత్వక్పర్ణవ
సనై స్సేవ్యమానం మహేశ్వరం । దృష్ట్వా హర్షసమావిష్టః ప్రణమ్య శివ
మవ్యయం ॥ ౩౩ ॥ అస్తువం పరమప్రీత్యా శంకరం లోకశంకరం । నమస్తే దే
వదేవేశ నమస్తే విశ్వమూర్తయే ॥ ౩౪ ॥ నమస్తే జ్ఞానగమ్యాయ నీలకంఠాయ
శంభవే । పురాతనాయ నిత్యాయ నిరాతంకాయ ధీమతే ॥ ౩౫ ॥ ఏవంస్తుతో
మహాదేవ ఇదం వచనమబ్రవీత్ । కుశలంగ తే చతుర్వక్త్ర కుశలం జగతః ఖలు ॥
౩౬ ॥ వినిర్మితస్త్వయా బ్రహ్మన్ ప్రపంచస్సచరాచరః । దృశ్యంతే తత్ర

---

ప్రజలం జూచి నేను మిక్కిలిసిగ్గువడి యందఱకు నలంకారముకలుగ వస్త్రము
లనిర్మింపంగా రణంబును గైలాసనాథు నడిగి దెలియుటకై కయిలాసంబు
నకుం బోతిని - ౩౦ - అక్కడ కైలాస శిఖరమందు వజ్ర సింహాసనంబునం
గూర్చుండి బొచ్చను మ్రాకుల త్రాటను పర్ణములను వస్త్రములుగాం గట్టు
కొనియున్న ప్రమథులచేతను దేవతలచేతను గంధర్వులచేతను ఇంద్రునిచేత
నురాక్షసులచేతం గిన్నరులచేత గరుడులచేత చారణులచేత సిద్ధులచేత నా
గులచేత విద్యాధరులచేత నాదిత్యులచేత వసువులచేత నుగ్రమూర్తులగు
రుద్రులచేతను సేవింపంబడుచున్న యవ్యయుండగు శివునిం జూచి మిక్కిలి సం
తోషమును బొందిన వాఁడనై నమస్కరించి సర్వజగంబులకు శుభకరుండ
గు శివుని స్తుతించితి - ౩౩ - ఆస్తుతి యెట్లనిన - దేవదేవులకుం బ్రభుండా నీకొఱ
కు నమస్కారము - జగదాకారుండా నీకొఱకు నమస్కారము - జ్ఞానము,
చేం దెలియం దగిన నీకొఱకుం నమస్కారము - నల్లనికంఠము గల యట్టియు
శుభములకుం బుట్టుచోటగు నట్టియు - పురాణుం డగు నట్టియు నిత్యుం
డగు నట్టియు నిర్భీతుండగు నట్టియు జ్ఞానవంతుడగు నట్టి నీకొఱకు నమస్కా
రము - ౩౫ - అనియిట్లునేనుస్తుతియింపనామహాదేవు - మున్నుం జూచియో
చతుర్ముఖుండా నీకు క్షేమమా లోకమునకు క్షేమమా నీవుస్థావరజంగమా
త్మకమగు ప్రపంచమును సృజియించితి వందు దేవతలుమొదలగు నెల్ల ప్రజలు

దేవాద్యానగ్న వేషాశ్చకుత్సితాః ॥ ౩౭ ॥ తత స్తేషామలంకారహేతవేఛ్ఛా
దనాయచ । వస్త్రనిర్మాణకర్తారంసృజత్వంచతురానన ॥ ౩౮ ॥ చింతయి
త్వాత్మనోబుద్ధ్యాయతోలోకోజుగుప్సితః । తస్యతద్వచనం శ్రుత్వా మహే
శస్య మహాత్మనః ॥ ౩౯ ॥ నారదేవంజగాదాహంబద్ధాంజలిపుట స్తతః । మ
హాదేవజగన్నాథ నీలకంఠదయానిధే ॥ ౪౦ ॥ చంద్రశేఖరసర్వజ్ఞభోగిరా
డ్భూషణప్రభో । త్వదాజ్ఞయా జగత్సర్వం సృష్టవానస్మి శంకర ॥ ౪౧ ॥ వస్త్ర
నిర్మాణకర్తారం శక్నుయాం నహినిర్మితుం । స్రష్టాపాలయితాహర్తా
త్వమేవజగదీశ్వర ॥ ౪౨ ॥ త్వత్కింకరాణా మస్మాకమసాధ్యం కర్మతాదృ
శం । ఏవం మయిబ్రువాణేతుశంకరః పునరబ్రవీత్ ॥ ౪౩ ॥ ఆశ్చర్యం కిమిదం
బ్రహ్మన్ విశ్వకర్తు ర్మహాత్మనః । అస్మిన్ స్తత్కింతనాశక్యం కథమిత్థం త్వ
యోచ్యతే ॥ ౪౪ ॥ పునర్జగాదశందేవం పార్వతీవల్లభంశివం । మయాకిమ స్తి
వక్తవ్యం సర్వజ్ఞాయామృతాత్మనే ॥ ౪౫ ॥ శక్యాశక్యం మమవిభోభవాన్వే
దనసంశయః । మనుర్వస్త్రప్రదాతాయః పురాసర్గే దివౌకసామ్ ॥ ౪౬ ॥

---

దిగంబరవేషులై నిందితులై యున్నారుగావున వారలు దమయంగములనాఛా
దించుకొని యలంకరించుకొనునట్లు వస్త్రముల నేయువాని నొకని సృజింపు
ము-వస్త్రములులేని యెడలోకము నిందితముగాన నీవునీబుద్ధిచేతనునాలోచిం
పుమని యీశ్వరుఁడుచెప్ప నామాటవిని నేను జేతులమొగుడ్చుకొని మరల
నుత్తరముపలికితి - ౩౯ - నేఁ జెప్పిన యుత్తరమేదన్నను ఓ మహాదేవుఁడా
జగత్తులకు నాథుఁడా నల్లని కంఠము గలవాఁడా దయానిధీ - చంద్రునిదలను
ధరించినవాఁడా - సర్వము దెలిసినవాఁడా - సర్పరాజముల నలంకారముగ
ధరించుకొన్న వాఁడా స్వామీ నీయానతి చేత సర్వ ప్రపంచమును సృజి
యించితి వస్త్రములనేయువాని సృజింపంజాలనైతి సర్వప్రపంచమును సృ
జించువాఁడును గాపాడువాఁడును లయింపఁ జేయువాఁడును నీవే నీకింక
రులగు మాకట్టిపని యశక్యము - ఇట్లు నేను జెప్పుచుండ శంకరుఁడు మగుడ
నుత్తరమునుడివెను - ౪౩ - ఓ బ్రహ్మదేవుఁడా ప్రపంచమునంతయు సృజిం
చిన నీకా ప్రపంచమందేదోయొక పని యసాధ్యమా నీవేల యిట్లుచెప్పెదవి
దియాశ్చర్యముగ నున్నదనఁగానే నాపార్వతీకాంతుఁడగు శివునితో నిట్లంటి
సర్వజ్ఞుండవు నమృతస్వరూపుఁడవగు నీకునేఁజెప్పవలయునది యేమున్నది- నే
ను జేయఁజాలినది చేయఁజాలనిది యంతయు నీవు నిశ్చయముగ నెఱుఁగుదు

సాయుజ్యమాప్త సయత్ర స్త్వయి దేవముని ప్రభుః । తతోపహాయ తంవస్త్ర క ర్తారం చంద్రశేఖర ॥ ౪౭ ॥ సయుజ్యతే న్యం నిర్మాతుం మయూఖలు మహే శ్వర । అమరాదిషు లోకేషు దయాం కృత్వా త్వయా ప్రభో। ౪౮॥ కల్పిత వ్యోవస్త్రకర్తా=శక్యతే నరైర్ హీ=తత్ । ఇత్యుక్త్వా పార్వతీనాథం తూ ష్ణీమాసంచనారద ॥ ౪౯ ॥ తతశ్శివః ప్రసన్నాత్మా చింతయా మాసమానసె । తదా సేవాలయశ్శంభో ర్నిశ్శబ్దో భూత్క్షణం మునె ॥ ౫౦ ॥ ఏవంచింతయత స్తస్య శంకరస్య మహాత్మనః । ఆవిర్భూతం మహాజ్యోతిః క్షణాత్పురుషతాగమాత్ ॥ ౫౧ ॥ జటిలోవల్కలధరో దండాజిన కమండలుః । బిభ్రాణః పటుతేజస్వీ దర్భ=యుక్తాంగుళిః ప్రభుః॥ ౫౨॥ రుద్రాక్షకృత కేయూరహారకంకణశోభితః। వినీతిర్విమలజ్ఞానో మేధావీ విజితేంద్రియః । సూర్యకోటి ప్రతీకాశః తేజసాభా సయ=దిశః యజ్ఞోపవీతం బిభ్రాణః సర్వకర్మసుసాధనం॥ ౫౩॥ ఉదారగుణసం పన్న స్సత్యవాదీ దృఢవ్రతః। చాతుర్యయుక్తినిపుణః కుశలీ కీర్తిభూషణః॥ ౫౪॥

---

వు పూర్వ సృష్టియందు దేవమునీశ్వరుడగు మనువను వాడు దేవతలకు వస్త్రముల నేసియిచ్చుచుండి యతడు నీయందు సాయుజ్యంబు నొందెనా కారణంబున నతనివిడిచి మఱియొక వస్త్రకర్తను సృజింప నాకశక్యంబై యున్నది కావున నదినీకుఁదక్క నితరులకసాధ్యంబు దేవతలులోనగునెల్ల ప్రజలయందు ననుగ్రహించి వస్త్రముల నేయువాని నీవే కల్పింపవలయునని పార్వతీనాథుఁడగు నీశ్వరునితోఁ జెప్పి యూరకుంటివి - ౪౯ - అంత శివుడు ప్రసన్నుఁడై తన మనంబున నాలోచింపుచుండె నపుడా సేవాలయం బొకక్షణము నిశ్శబ్దంబయ్యె నిట్లు చింతించుచుండగా నాశివునివలన జ్యోతి యొకటిబయలు వెడలి క్షణములోఁ బురుషరూపము నొందెను - ఆపురుషుడు జడలుదాల్చుకొని నారచీరలగట్టుకొని దండమును కృష్ణాజినమును గమండలమును ధరించి మిక్కిలి తేజముతో నొప్పి వ్రేళ్ళ దర్భల నిడికొని యెల్లకార్యంబులకు శక్తుండై రుద్రాక్షములచేత హారములను భుజకీర్తులను గంకణములనుధరించి శోభిల్లుచు మిక్కిలినీతిగలిగి నిమలజ్ఞానుఁడై మేధగలవాఁడును గృహీతేంద్రియుండునై కోటిసూర్యులతో సమానుఁడై తన తేజస్సుచేత దిక్కులను చలించుచు శ్రౌతస్మార్తములైన సకలకర్మములకు ముఖ్యమైన యజ్ఞోపవీతమును ధరించుచు గంభీరంబులగు గుణంబులు గలిగి సత్యము బలుకు వాఁడును వ్రతములయందు దృఢనిష్ఠగలవాఁడుగాను చమత్కారముకు యుక్తులుగలవాఁ

పశ్యతాంచైవ సర్వేషాం విసయం జనయన్తదా। తతశ్శివో మహాదేవః శ్రుణ్వత్సు సకలేష్వపి ॥ ౫౫ ॥ అకరోన్నామకరణం దేవలోయం భవత్వితి । తతస్తు దేవలశ్శీఘ్రమగ్రే పురస్స్థిత్వా మహేశితుః ॥ ౫౬ ॥ బద్ధాంజలిః ప్రతుష్టావ సదాశివమనామయం । దేవలః॥ నమస్తే దేవదేవేశ నమస్తే చంద్రశేఖర ॥ ౫౭ ॥ నమస్తే ఫాలనేత్రాయ నమస్తేస్తు కపర్దినె । నమో గంగాధరాయాస్తు నమస్తే నాగకుండల ॥ ౫౮ ॥ నమస్తే నీలకంఠాయ నాగహారాయ తే నమః । ఖట్వాంగధారిణే తుభ్యం నమస్తే శూలపాణయే ॥ ౫౯ ॥ పృథువక్షాయ దివ్యాయ యోగినె దీర్ఘబాహవె । యోగీశ్వరాయ యోగ్యాయ నిత్యాయాజినవాససె ॥ ౬౦ ॥ శుద్ధస్ఫటికరూపాయ సోమసూర్యాగ్ని చక్షుషే । నిర్మలజ్ఞానగమ్యాయ సచ్చిదానందరూపిణే ॥ ౬౧ ॥ నమో వేదాంతవేద్యాయ శంభవె పర

---

గానుకుశలముగలవాఁడుగాను కీర్తిచేనలంకృతుఁడుగానుజూచుచున్నవారలకెల్లనాశ్చర్యమునుబుట్టించుచుండెనుఅంతమహాదేవుండగు శివుండెల్లవారువినుచుండనితఁడు దేవలుఁడగునని యాపురుషునకు నామకరణంబుచేసె నంత నాదేవలుఁడెల్లవారికిఁ బ్రభువగు నీశ్వరునెదుటనిలిచి యంజలిబంధమ్ముసేసికొనియనామయుండగుశివునిస్తుతించె- ౫౬- దేవలుఁడుస్తుతించినక్రమము- దేవదేవుల కీశ్వరుఁడా నీకునమస్కారము చంద్రునిశిరమున ధరించిన వాఁడా నీకొఱకు నమస్కారము నొసటఁ గన్ను గల నీకొఱకు నమస్కారము జటాజూటముగల నీకొఱకు నమస్కారమౌఁ గాత - గంగను ధరించిన నీకొఱకు నమస్కారమౌఁగాత సర్పములను గుండలములుగా ధరించిన నీకొఱకు నమస్కారము నల్లని కంఠముగల నీకొఱకు నమస్కారము పాముల పేరులవాఁడా నీకొఱకు నమస్కారము మంచపు కోడును ధరించిన నీకునమస్కారము శూలమును జేతబట్టియున్న నీకొఱకు నమస్కారము గొప్ప రొమ్ములుగల యట్టియు దివ్యయోగియైనట్టియు నిడుదచేతలుగల యట్టియు యోగి ప్రభుండగునట్టియు యోగ్యుఁడును నిత్యుండును చర్మమును గట్టుకొన్న వాఁడును నిర్మలమగు స్ఫటికమునుబోలిన రూపము గలఁవాఁడును సూర్యుఁడును జంద్రుఁడు నగ్నియు నేత్రములుగాఁగలవాఁడును నిష్కళంకమగు జ్ఞానముచేతఁ దెలియఁదగిన వాఁడును సచ్చిదానంద రూపుఁడును వేదాంతములకేఁ దెలియఁదగిన వాఁడును బరమాత్మస్వరూపుండగునట్టి శంభువు కొఱకు నమస్కారము - ౬౧ - యజ్ఞమున కంగమగునట్టియు యజ్ఞ స్వరూపుఁడ

మాత్మనె । యజ్ఞాంగాయచయజ్ఞాయ యజ్వనె చాష్టమూర్తయె॥ ౬౨॥ నమోస్తుహవ్యవాహాయ పురాణపురుషాయచ । నమోదురితదూరాయసత్యసంధాయతేనమః ॥ ౬౩॥ నమస్తె ధర్మరూపాయ నమస్తె నగకార్ముక । నమస్తెనిగమాశ్వాయ రుద్రాయామితతేజసె॥ ౬౪॥ నమఃపశూనాం పతయె॥ కోటిసూర్యప్రభాయచ । నమస్తే సూక్ష్మరూపాయ నమస్తే నంతమూర్తయె॥ ౬౫॥ నమస్తే పార్వతీనాథ నమస్తేమారఘాతినె । అజ్ఞానఘోరతిమిర భాస్కరాయనమోస్తుతె ॥ ౬౬ ॥ సర్వేశ్వరాయ సర్వస్మై నమస్తే విశ్వమూర్తయె । దక్షయజ్ఞవినాశాయ నమస్తే నిర్మలాత్మనే ॥ ౬౭ ॥ భక్తాధీనాయధీరాయశాంబరాయనమోస్తుతె । పవిత్రమూర్తయెతుభ్యం సర్వగోప్త్రె నమోస్తుతె ॥ ౬౮ ॥ ఇతిస్తుత్వామహాదేవం దేవలోవాక్యమబ్రవీత్ । కిమర్థమ

---

గునట్టియు యజ్ఞకర్తయగు నట్టియు నెనిమిది మూర్తులుగల యట్టియు నగ్నిస్వరూపుఁడై నట్టియుఁ బురాణ పురుషుఁడైన నీకొఱకు నమస్కారము పాపములకు దూరమందున్న వాఁడును సత్యమగు ప్రతిజ్ఞగలవాఁడవగు నీకు నమస్కారము - ౬౩ - ధర్మస్వరూపుఁడైన నీకొఱకు నమస్కారము కొండను విల్లుగాధరించిన వాఁడా నీకు నమస్కారము - వేదములగుఱ్ఱములుగా జేసుకొన్నట్టియు రుద్రస్వరూపుఁడగు నట్టియు మిక్కిలి తేజముగల నీకొఱకు నమస్కారము పశువులకుఁబతియగునట్టియుఁ గోటిసూర్యులుదయమైనపుడెంత ప్రకాశముండునో యంత ప్రకాశముగల నీకు నమస్కారము సూక్ష్మరూపుఁడైన నీకు నమస్కారము కడలేని మూర్తులుగల నీకొఱకు నమస్కారము - ౬౫ - పార్వతీకాంతుడా నీకొఱకు నమస్కారము మన్మథునిఁజయించిన నీకొఱకు నమస్కారము అజ్ఞానమను భయంకరమైన చీకటికివెలుంగగు నీకొఱకు నమస్కారము సర్వమునకుఁ బ్రభువును సర్వస్వరూపుఁడును ప్రపంచమూర్తియునగు నీకు నమస్కారము దక్షుని యజ్ఞమును ధ్వంసముచేసినవాఁడును నిర్మలాత్ముండునగు నీకు నమస్కారము - ౬౭ - భక్తుల కధీనుఁడును ధైర్యవంతుఁడును మాయను జేపట్టినవాఁడు నగు నీకు నమస్కారము పరిశోధకమగు మూర్తిగల యట్టియు సర్వ రక్షకుఁడగు నీకొఱకు నమస్కారము - ౬౮ - ఇట్లుమహాదేవుని స్తుతియించి దేవలుఁడా సాంబమూర్తితో నిట్లనియె - ఓ శంభూ నన్నేలసృజించితివి నాపుట్టుకకుఁగారణమును నేఁ జేయవలసిన కార్యమును నాకుఁ దెలుపుము భక్తుల యందుఁ

సృజశ్శంభో కారణం మమజన్మనః ॥ ౧౯ ॥ కింకార్యంవదదేవేశ భక్తవత్సల శంకర । కిమర్థం కల్పితో దేహో చేతనోమేవినాశభాక్ ॥ ౨౦ ॥ దేహినో హిసదాదుఃఖ మశ్నంతోన సుఖం కదా । పంచభూతాత్మకోదేహః పంచప్రాణసమన్వితః ॥ ౨౧ ॥ దశేంద్రియసమాదిష్టో మనోబుద్ధి తథైవచ । చిత్తమిత్యప్యహంకార శ్చతుర్భిరపిసంభృతః ॥ ౨౨ ॥ చతుర్వింశతితత్వానాం సమష్టిర్దేహఉచ్యతే । పంచవింశతితత్వస్థో జీవోనిత్య స్సనాతనః ॥ ౨౩ ॥ వర్తతేతద్గతీ ఉభౌజీవోవిభురనామయః । షట్చత్తు స్తత్వసంపన్నే హేమజ్ఞోవై భృశంతతః ॥ ౨౪ ॥ అజ్ఞానపాశసంబద్ధ స్సర్వదా దుఃఖమశ్నుతే । అజ్ఞానాదస్యనిర్వాచ్యాదవివేకః ప్రజాయతే ॥ ౨౫ ॥ అభిమానఃప్రజాయేతా వివేకాచ్చసుదుష్కరాత్ । తతోస్మా దరిషడ్వర్గ ఈర్ష్యాద్యా శ్చాపితేదశ ॥ ౨౬ ॥ తేషుకర్తృత్వమాసాద్య క్రియతే కరణైస్త్రిభిః । త్రివిధం కర్మభోక్తవ్యం సమాప్తిస్తస్య యావతీ ॥ ౨౭ ॥ దేహినస్తు నిమగ్నస్య మహాసంసార సాగరే । నాస్తితస్య పరః పారోహ్యా నివార్యేణకర్మణా ॥ ౨౮ ॥ దుష్కరం క

---

ప్రీతిగల యోశంకరుఁడా నాకచేతనమును నశ్వరమునగు దేహము నేలగల్పించితివి- ౨౦ - దేహధారులెల్లప్పుడు దుఃఖపడుచుందురు దేహము పంచభూతాత్మకంబునునైదువాయువులతోఁగూడినదియు బదియింద్రియములచేత వ్యాప్తమును మనోబుద్ధి చిత్తాహంకారములచేత నిండినదియు చతుర్వింశతి తత్వములరాశియే దేహమనఁబడును పంచవింశతి తత్వము జీవుఁడు నిత్యుఁడగుపురాణ పురుషుఁడు అతఁడు జీవుడనియు ననామయుఁడగు నీశ్వరుఁడనియు రెండువిధంబుల నుండు అట్టి యిరువదినాలుగు తత్వముల సమష్టిరూపమగు దేహమం దభిమానియగుటచేత తేజస్వరూపుఁడును జేతనస్వరూపుఁడగుపురుషుఁ డజ్ఞానపాశసంబద్ధుఁడై యెల్లప్పుడు దుఃఖ పడును - ౨౫ - అనిర్వాచ్యమగు నజ్ఞానము వలన నవివేకంబు ననివార్యంబగు నాయవివేకము వలన నభిమానము నాయభిమానమువలనఁ గామక్రోధలోభ మోహ మదమాత్సర్య బులు నీర్ష్యాదులు పదియును బుట్టును వీనిలో మనో వాక్కాయములు కర్తృత్వమునుబూని త్రివిధకర్మము నాచరించునట్టి కర్మము కడవఱకు ననుభవింపఁ దగియుండు - ౨౭ - అనివార్యమగు కర్మసంబంధంబు ననసంసారసాగరమున మునింగిన దేహికిఁ గడయెన్నఁడగపడదు - ౨౮ - దుస్సాధ్యమగు కర్మమునను భవించుచు నొకప్పుడును జీవుఁడుసుఖమనుభవింపఁ

ర్మభుంజామోనకదా సుఖమశ్నుతే । తస్మాజ్జుగుప్సితం దేహం కథం వై సోఢు ముత్సహే ॥ ౨౦ ॥ కర్తవ్యం కిం మయాశంభో నిర్మితః కేనహేతునా ॥ బ్రహ్మా॥ దేవలేనైవముక్తస్తు భగవాన్ఫాలలోచనః ॥ ౨౧ ॥ దేవలంఘనగంభీరం సాత్వయన్నిదమబ్రవీత్ । శ్రీశివః । సకర్తవ్యో మహాభాగ విచారస్తుత్వ యానఘ ॥ ౨౨ ॥ లోకోపకరణార్థాయ మయాసృష్టోసి సువ్రత । దిక్షుకీర్తిం వితన్వానష్షట్సు జన్మసుదేవల॥ ౨౩॥ అథత్వం సప్తమే జన్మన్యాయాస్య సిమమాంతికం । మమ సాయుజ్యమాప్నోషి నాత్రకార్యావిచారణా॥ ౨౪॥ ప్రకృతం యత్తువక్ష్యామి శ్రుణుతన్మునిసత్తమ । నిగమేషుపురాస్మత్తో జాయమానేషుతైస్సహ ॥ ౨౫ ॥ సంజాతాస్తంతవోలోకే యన్మూలాలం క్రియానఘ । విష్ణోస్తు నాభికమలే వర్తంతే తదాదితః ॥ ౨౬ ॥ తతస్త్వం తత్ప్రోభూత్వా గత్వావిష్ణోశ్చసన్నిధిం । తేనసృష్టాం స్తతంతూన్ లోచయన్ కౌశలంతవ ॥ ౨౭ ॥ వేత్వావస్త్రాణిదివ్యాని సర్వేభ్యో దిశసాదరం । రక్షాభిమానం లోకస్య యతస్తే వర్ధతేయశః ॥ ౨౮ ॥ దత్వావస్త్రాణిదేవేభ్యో దే

---

డు గానసిట్టి ని దితమగు దేహమునునేనెట్లుసహింపనుత్సహింతు- ౨౦- ఓ శివుఁడా నేను జేయఁదగినదేమి నన్ను దేనికిఁగా సృజించితివి అని యడిగెనని చెప్పి నారదునితో బ్రహ్మదేవుండు మఱల నిట్లనియె ఇట్లు దేవలుఁడు చెప్పనతని మాటలువిని శ్రీశివుఁడు మేఘగర్జనమును బోలు గంభీరస్వనంబున నతనినూరడించుచు నిట్లనియె - ౨౧ - ఓమహానుభావుఁడా నీవు విచారపడనక్కఱలేదు లోకములకుపకారముఁ జేయ నిన్ను నేను సృజించితిని ఆరు జన్మములలో సమస్త దిగంతముల వ్యాపించిన కీర్తిని సంపాదించుచుండి యేడవ జన్మమున నాయొద్దఁ జేరఁగలవు మఱలనీవునాతో సాయుజ్యమునుబొందుదువు ఈవిషయమున విచారముచేయఁబనిలేదు - ౨౪ - ప్రకృతమును జెప్పెదవినుము మునిశ్రేష్ఠుఁడా పూర్వము నాయందు వేదములు గలుగునపుడు లోకముసకలంకారమూలములగు తంతువులావేదములతోడ నుత్పన్నములై యది మొదలుకొని యవి విష్ణునాభికమలమందున్నవి- ౨౬- కావున నీవాతంతువులనిమిత్తము విష్ణు సన్నిధికిఁబోయి యాతంతువులను గ్రహించుకొని నీనేర్పునందఱకుఁ దెలుపుము మేలుపుట్టంబులనేసి యాదరంబుతో నందఱకిమ్ము లోకము నభిమానమును గాపాడుము ఇట్లు చేసిన నీకు యశంబు వర్ధిల్లును ౨౮ - దేవతలకు వస్త్రములనిచ్చి దేవాంగముల నలంకరింపుము ఓ దేవలా

వాంగాన్యప్యలంకురు । దేవాంగ ఇతి తేనామ భవిష్యతిచదేవల॥ ౮౯ ॥ బ్రహ్మో। ఏవముక్తశ్శంకరేణ దేవలోమునిసత్తమః । బద్ధాంజలిపుటోభక్త్యా వప్రచ్ఛసప్వస్య వర్తనం ॥ ౯౦ ॥ దేవలః ॥ దేవదేవ జగత్స్వామిన్, పార్వతీశదయానిధే । ఇతోమద్వర్తనంయద్ధి తదాచక్ష్వమహేశ్వర ॥ ౯౧ ॥ స్థాతవ్యం కుత్రవిషయె నివాసఃకుత్రవైపురే । కీదృశాః ప్రభవిష్యంతి వంశేమమమహేశ్వర ॥ ౯౨ ॥ కథంతేషాంవర్తనంచతత్సర్వం బ్రూహిశంకర ॥ శ్రీశివః ॥ శృణుదేవలవక్ష్యామి భావియత్తనువర్తనం ॥ ౯౩ ॥ సర్వరత్నమయీసర్వభోగస్యాయతనం మహత్ । అనేకౌషధి సంకీర్ణా నానాద్రుమసమాకులా ॥ ౯౪ ॥ అనేకగోత్రభూయిష్ఠా యతౌనక్షత్రయోర్జితా । వ్యాప్తామహానగాభిశ్చ వసుమత్యబ్ధిమేఖలా ॥ ౯౫ ॥ సప్తద్వీపసమావిష్టా నవఖండసమన్వితా। వర్తతే ఖలుయాభూమి ర్జంబుద్వీపంచ తత్రయత్ ॥ ౯౬ ॥ తత్రాస్తే సర్వదేవానామావాసోమేరుభూధరః । ధుత్తూరపుష్పసదృశో జాంబూనదమయశ్శుభః ॥ ౯౭ ॥ కథ్యతేయస్యవౌన్నత్యందాత్రింశల్లక్షయోజనం । పాతా

---

దానిచేత నీకు దేవాంగుఁడని యొక నామంబు గలుగుననెను - ౮౯ - శంకరుఁడిట్లుచెప్పఁగా ముని శ్రేష్ఠుఁడగు దేవలుఁడంజలి బంధముచేసుకొని తాను నడుచుకొనవలసినరీతినడిగెను - ౯౦ - దేవలుఁడడిగిన దెట్లన్న ఓ దేవదేవుఁడా జగత్స్వామీ పార్వతీపతీ దయానిధీ ఇది మొదలుకొని నేను జేయదగిన కార్యమేమో దాని నాకుఁ జెప్పుము ఓ మహేశ్వరుఁడా నేనేదేశమునను ండవలయు నేపట్టణముననుండఁ దగును నావంశమందుబుట్టెడువారు ప్రభవింతురు వారినడవడి యెట్టిదిగా నుండును అంతయు నాకు దేటపడఁ జెప్పవలయునోయి శంకరుఁడా - ౯౨ - అనగా శివుఁడు చెప్పుచున్నాఁడు - ఓ దేవలుఁడా యింకమీఁద నీనడవడి నడిగితివే చెప్పెద వినుము సర్వరత్నపూర్ణంబును సకల భోగములకు నెలవును సర్వౌషధులచే సంకీర్ణంబును పలుతెఱంగుల వ్రాఁకులచే నొప్పినదియు ననేకపర్వతములచే నిండినదియు నక్షత్రమండలమంటునట్టి పొడవుగలదియు మహానదీవ్యాప్తయును వర్ణపూర్ణయుఁ జతుస్సాగరములలోపల నడఁగినదియు నేడుద్వీపములతోను దొమ్మిది ఖండములతోను గూడిన భూమియున్నదిగదా అందు జంబూద్వీపమని యొకటి యున్నదిగదా అందు సర్వ దేవతలకు నాధారముగా నుమ్మెత్తపువ్వువలెఁ గనకమయమై శుభకరమైన మేరువనుకొండయున్నది- ౯౭- దానిపొడగు ముప్పదిరెండు

శ్రేష్ఠాతితో యైన తత్షోడశలక్షకం॥ ౯౮॥ తస్యైవ దక్షిణే భాగె ఖండెభరత సంజ్ఞికె । వర్తతెనగరోదేశ స్సర్వసౌఖ్య వహాఃఖలు॥ ౯౯ ॥ ఆమోదపట్టణం తత్రవర్తతె బహువిస్తరం । పురందరపురప్రఖ్యం హెమప్రాకార తోరణం॥ ౧౦౦॥ అసూపహర్షజనకం వజ్రవైడూర్యమందిరం । తత్రపట్టాభిషిక్తస్త్వం రాజ్యంపాలయదేవల ॥ ౧౦౧ ॥ యత్పృష్టంతవ వంశస్య వర్ధనం చేతితచ్ఛృణు । ఉదారాస్సత్యసంపన్నాః పరోప కరణోద్యతాః ॥ ౧౦౨ ॥ మెధావినస్సదాచారా దేవబ్రాహ్మణ తత్పరాః । వీర్యవంతశ్చ కుశలాభవెయుస్తవవంశజాః ॥ ౧౦౩ ॥ ఏతత్తేకథితంసర్వం ప్రకృతం యచ్ఛతత్కురు । గచ్ఛశీఘ్రం సకాశంత్వం విష్ణోరమితతేజసః ॥ ౧౦౪ ॥ వేత్వావస్త్రాణి దివ్యానితద్వితీర్ణై శ్చతంతుభిః । అలంకారాయసర్వేషాందేవానాందాతుమర్హసి॥ ౧౦౫॥ బ్రహ్మ॥ ఇత్థం మహేశస్య తతోనియోగాత్స దేవలోబాఢ మితీ

---

యోజనములని చెప్పఁబడును క్రిందఁ ద్రవ్విచూడఁగా నింకఁ బదియాఱులక్షలుండును- ౯౮- దాని దక్షిణపుప్రక్కను భరతఖండమందు సమస్తసుఖంబులఁగలుగఁజేయు నగరమనుపేరుగల దేశమొక్కటిగలదు - ౯౯ - అచ్చటమిక్కిలి వెడలుపుగలిగి యామోదపట్టణమని యొకపురము వర్తిల్లుచున్నది- అదియింద్రుని పట్టణముతో సరియయినది దానికోటలును బహిద్వారములును స్వర్ణమయంబులు- ౧౦౦ - మఱియు నాపట్టణము జలప్రాయముగాను సంతోషకరముగాను వజ్రములచేతను వైడూర్యములచేతను గట్టినయిండ్లుగలదిగానున్నది ఓదేవలుఁడా నీవచటఁ బట్టాభిషేకము నొంది రాజ్యమును బాలింపుము - ౧౦౧ - అనిచెప్పి నీవంశముయొక్క వృద్ధిని జెప్పుమని యడిగితివి గనుక నిఁక దానిఁ జెప్పెదవినుము నీవంశమందుఁ బుట్టినవారు గంభీరమగుబుద్ధికలవారుగాను నిజమాడువారుగాను పరుల కుపకారముఁ జేయఁ బ్రయత్నపడువారుగాను మేధగలవారుగాను మంచి నడవడిగలవారుగాను దేవబ్రాహ్మణ భక్తిగలవారుగాను పరాక్రమము గలవారుగాను చతురులుగానగుదురు- ౧౦౩- నీవడిగిన విషయమంత నీకుఁ జెప్పితి నింక ప్రకృతపుకార్యమునుజేయుము నీవుశీఘ్రముగ మిక్కిలి తేజముగల విష్ణునొద్దకుఁబొమ్ము ఆవిష్ణుడిచ్చు తంతువులచే వస్త్రములనేసి దేవతలకెల్ల నలంకారార్థ మిమ్మనెను- ౧౦౫- ఇట్లీశ్వరుఁడు దేవలునితోఁ జెప్పినవృత్తాంతముఁ జెప్పి మఱల బ్రహ్మచెప్పందొడంగె దేవలుండిట్లుఈశ్వరుండుదనకానతిచ్చిన నల్లెయనిసంతసం

రయన్ముదా । ప్రణమ్య గౌరీరమణం దిదృక్షుర్య యాసుధాబ్ధౌ హరి మప్రమే
యం ॥ ౧౯ ॥ ఇతి బ్రహ్మాండపురాణే - బ్రహ్మనారదసంవాదే - ఉత్తరఖం
డే - దేవాంగసంభవో నామ ప్రథమోధ్యాయః॥

బ్రహ్మా॥ తతశ్శివాం ప్రణమ్యాసౌ దేవలో వాక్య మబ్రవీత్ । దేవి లో
కేశ్వరే భద్రే మాతర్మాం పశ్య సాదరం ॥ ౧ ॥ పయఃపారావార మహాంగ
మిష్యామి సకౌతుకం । అనుగృహ్ణీష్వ మాం నిత్యం సర్వే లోకా స్త్వదాశ్రితాః॥
౨ ॥ ఇత్యుక్త్వా దేవలేనాథ పార్వతీ వాక్య మబ్రవీత్ । గచ్ఛ సౌమ్య సహాయం తే
సమమేకరవాణ్యహం॥ ౩॥ శత్రవో యది బాధంతే త్వాం తదా మాం భవాం
స్స్మరేత్ । తదా సన్నిహితా భూత్వా నాశయిష్యామి తాన్ సహం ॥ ౪ ॥ ఇత్యు
క్తో దేవదేవస్య ప్రియయా సముని స్తదా । గమనాయ మతిం చక్రే తంతుసంగ్ర
హకామ్యయా॥ ౫॥ ❊॥ ఇవి మాతృక పుస్తకమందు లేవు గనుక వీనిలెక్క
గ్రంథములోఁ జేర్చఁబడదాయె॥

---

బున నతనికి మ్రొక్కి యప్రమేయుండగు హరినిఁ జూడఁగోరుచుఁ బాలకడలి
కడకుఁ బోయెను- ౧౯ - ఇది - బ్రహ్మాండ పురాణంబున బ్రహ్మనారదసంవా
దంబున నుత్తరఖండంబున దేవాంగసంభవంబన్నది మొదటియధ్యాయము.

బ్రహ్మచెప్పెడివాక్యము- టీ- అంత దేవలుఁడు పార్వతికి నమస్కారము
చేసి యామెతో నొక వాక్యముచెప్పె నదియేమనఁగా సకలలోక నిర్మాత్రివి
సకలశుభదాత్రివగు నో దేవీ తల్లీ నన్ను దయతోఁ జూడుము- ౧- నేనిపుడుమి
క్కిలి యుత్సాహముతోఁ బాలకడలికిఁ బోయెదను నన్నెల్లప్పుడు ననుగ్రహింప
వలయును ఎల్లలోకములు నీయందు కదా యున్నవి- ౨- దేవలుఁడిట్లు చెప్పఁగా
పార్వతి యాతనితో నిట్లని యుత్తరమిచ్చెను ఓయి మిక్కిలి శాంతి సంపన్నుఁ
డవయిన దేవలుఁడా యట్లె పొమ్ము నీకు సమయమందు నేను సహాయముచే
యుదును - ౩ - నిన్ను శత్రువులెవరైన పీడించిన పక్షమందప్పుడు నీవు నన్ను
స్మరింపుము స్మరణమాత్రమున నేవచ్చుట నీకగపడి నీశత్రువులను సంహరించె
దను - ౪ - దేవదేవుఁడైన యీశ్వరుని భార్యయగు పార్వతి యిట్లు చెప్పఁగా
నే యా దేవలుఁడప్పుడు వస్త్రముల నేయుటకు గారణములైన తంతువులఁ
దేవలయు ననుతలంపుతోఁ బ్రయాణము నునిశ్చయించెను-౫- ❊ ఇవిపుస్తకాం
తరకథల ననుసరించి యేర్పడుపఁబడినశ్లోకములు గనుక వీనిలెక్క గ్రంథము
తోఁ జేర్చఁబడదాయెనని తెలియునది.

సతుగత్వామహాతేజా దేవలఃక్షీరసాగరం । సువర్ణస్యాశ్రమేతస్థౌ తత్తీరేథ మనోహరే॥ ౧॥ రసాలసాలతక్కోల తమాలైర్నారికేళకైః । సప్తపర్ణైఃకురవకైః రర్జునైః పనసైరపి॥ ౨॥ అన్యైరపి మహావృక్షైర్లతాభిరభిశోభితే । భృంగఝుంకార సంకీర్ణే కోకిలారావసంకులె ॥ ౩ ॥ పారావారస్యవీచీనాం ప్రతికోథేద్రుమాకులే । దేవలస్తత్ర వై తప్తుం చక్రేనైశ్చయికీంమతిం ॥ ౪ ॥ అథాపశ్యం స్మహారావ సంకులంక్షీరసాగరం । యస్య ప్రమాణవైపుల్యే దుర్గమె వింధ్యతార్క్ష్యయోః॥ ౫॥ బహుశైవాల సంకీర్ణంస్థలీవిభ్రమకారిణం। పునర్మథనభీత్యేవ మంథానేనసురాసురైః॥ ౬॥ డిండీరైస్తీరపతితైర్వ్యంకతుర్మివోద్యతం । మత్స్యపక్ష సముద్ధూత సభోగత పృషద్గణైః ॥ ౭ ॥ అమరైఃపూజితైర్ముక్తాజాలైరివవిభూషితం । పూర్వమపార్ణ త్కుంభయోని మునీశ గ్రహణేచ్ఛయా ॥ ౮ ॥ ప్రసారయంతమాశాసు బాహుదండానివోర్మిభిః । అత్యాయతాభీరాజంతం రాజ

---

మిక్కిలి తేజముగల యాదేవలుండు పాలకడలికడకుంబోయి దానియొడ్డున సొగసైనబంగారాశ్రమంబున వసియించెను - ౧ - ఆయాశ్రమంబునందియ్యమామిడిచెట్లు నేపిచెట్లునుతక్కోలవృక్షములును కానుగచెట్లునుటెంకాయ వ్రూనులును గోరింటచెట్లు నేడాకుల యరఁటిచెట్లును మద్దిచెట్లును పనస చెట్లును మఱియుఁ బలువిధంబులగు వ్రూనులును పూల తీగెలును మిగుల శోభిల్లుచుండు నలుగడలను దుమ్మెదలు ఝుంకారము చేయుచుండు కోకిలములు గూయుచుండు మఱియు నాయాశ్రమము సముద్రము తరంగములచేతఁ జల్లగా నుండును కావుననది తపస్సున కర్హంబగు స్థానమని దేవలుం డచటఁదపస్సుచేయ నిశ్చయించె- ౪- మఱియు నాక్షీరసముద్రంబులోతును వింధ్యుఁడును గరుడుండును దానివెడలుపింతయని గరుడుండెఱుంగనోపఁడు దానియందంతట నాచుపాచి యుండుగాన నదివచ్చికమొలిచిన నేలయనుతలంపుఁ బుట్టించు దానిగట్టునఁ బడియుండు నుఱుగుదొబ్బలఁజూచిన మఱల దేవదానవులు తన్ను మథింతురనుభీతిచేత సముద్రము తనకొరకొటఁగట్టబూనినట్లుతోచు మత్స్యముల రెక్కల త్రావుడుచేనెగసి యాకాశము నంటఁబోయి మగుడుచున్న యుదకబిందువులజూడ దేవతలు సముద్రముమీఁదఁ బూజార్థము చల్లునట్టిముత్తెములనితోచు మిగులనిడుదలగుదాని యలలఁజూడఁగాబూర్వమగస్త్యుఁడు దన్నుద్రాగెనను కోపంబున నతనిఁబట్ట బాహుదం

హంసనిషేవితం ॥ ౯ ॥ దర్శయద్భిస్తత్ర తత్రమూర్ధ్నస్సార్వ జలజంతుభిః । ఇతోమహాంతివస్తూని నసంత్యేతైర్వినామయి ॥ ౧౦ ॥ ఇతీవ సర్వదేవానాం దర్శయంతం మనోహరం । ప్రహర్ష మతులం లేభే దృష్ట్వాబ్ధిం దేవలస్తదా ॥ ౧౧ ॥ తపస్తేపేసశుద్ధాత్మా మాధవానుగ్రహేచ్ఛయా । యమాదిభిర్దృఢప్రజ్ఞా నిశ్చలోవిజితేంద్రియః ॥ ౧౨ ॥ అనన్య మానస శ్శ్రీమాన్ యోగాసనసమాహితః । తతస్తుష్టో హరిస్తస్మై భగవాన్ ప్రససాదహ ॥ ౧౩ ॥ తంప్రసన్నంజగన్నాథంతుష్టావహరిమవ్యయం ॥ దేవలః ॥ నమస్తే దేవదేవేశనమస్తేభక్తవత్సల ॥ ౧౪ ॥ నమస్తే పుండరీకాక్ష నమస్తేమధుసూదన । నమస్తేమాధవానంత నమస్తేపురుషోత్తమ ॥ ౧౫ ॥ నమస్తే సర్వలోకేశ నారాయణనమోస్తుతే । చతుర్భుజాయదేవాయ శార్ఙ్గచాపధరాయచ ॥ ౧౬ ॥ నమఃకౌస్తుభభూషాయ శంఖచక్రగదాభృతే । నమఃపక్షీశపత్రాయ నమస్తే

---

డంబులఁ జూచుచున్నదోయనితోఁచు- అచ్చటచ్చట జలజంతువులు దమతలలఁగానుపింపఁగా నింతకంటె గొప్పవస్తువులు నాలో లేవని దేవతలకుఁ దనయందున్న వస్తువుల ప్రమాణమును దెలుపునట్లుండు అంతట రాజహంసంబులచేశోభిల్లుచుండు అప్పుడుదేవలు డిట్లొప్పిదంబై యున్న యాసముద్రమునుఁజూచియతులంబగు సంతసంబునుఁబొందెను - ౧౧ - అచ్చోటనతండుదృఢప్రజ్ఞుండు నిశ్చలచిత్తుండును నిగ్రహీతేంద్రియుండునై యోగాసనంబునఁ గూర్చుండి మనస్సునువిష్ణునందునిలిపి యోగశ్రీసంపన్నుండై యమాద్యష్టాంగయోగములచే విష్ణ్వనుగ్రహంబు సంపాదింపఁ దపంబొనర్చె నంత నావిష్ణువుసంతసించి యతనికిఁ బ్రసన్నుండాయెను - ౧౩ - అంత దేవలుండు దనకు బ్రసన్నుండైన హరి నిట్లని స్తుతింపఁదొడంగె దేవ దేవులకుఁ బ్రభుఁడా నీకు నమస్కారము భక్తులయందు బ్రీతిగలవాఁడా నీకొఱకు నమస్కారము తామరపువ్వులవంటి కన్నులుగల స్వామీ నీకునమస్కారము మధువను రాక్షసు నిఁజంపిన స్వామీ నీకునమస్కారము లక్ష్మీపతీ అనంతుడా నీకునమస్కారము పురుషోత్తముఁడా నీకు నమస్కారము సకలలోకనాయకా నీకు నమస్కారము నారాయణుఁడా నీకునమస్కారము నాలుగు భుజములుగల దేవుడా నీకునమస్కారము శార్ఙ్గచాపమును బట్టినవాడా నీకునమస్కారము - ౧౬ - కౌస్తుభాభరణుఁడా శంఖమును జక్రమును గదను ధరించినవాడా నీకునమస్కారము - గరుడవాహనుఁడా నీకునమస్కారము ఆదిశేషునిమీఁదఁ బవ్వళిం

శేషశాయినే ॥ ౧౭ ॥ లక్ష్మీప్రియాయ సేవ్యాయ నమస్తే పుణ్యమూర్తయే ।
నమో దురితదూరాయ దైత్యదర్పప్రహారిణే ॥ ౧౮ ॥ వేదవేదాంతవేద్యాయ
జ్ఞానగమ్యాయ ధీమతే । ఇంద్రనీలప్రతీకాశాయార్తత్రాణపరాయచ ॥ ౧౯ ॥
ముకుందాయ నమస్తుభ్యం భుక్తిముక్తిప్రదాయినే । పరబ్రహ్మస్వరూపాయ
నమస్తే విశ్వమూర్తయే ॥ ౨౦ ॥ ఏవం స్తుతస్తతో విష్ణుర్భగవాన్ ప్రాబ్రవీ
ద్వచః । ఇంద్రనీలాచలోదంచత్కౌముదీశబలస్మితం ॥ ౨౧ ॥ శ్రీహరిః ॥ సా
ధు సాధు మహాభాగ ప్రీతోస్మి తపసస్తవ । వరం వృణీష్వ దాస్యామి యత్తే మనసి
రోచతే ॥ ౨౨ ॥ నారాయణేనైవముక్తో బభాషే దేవలో ముదా । దేవదేవజ
గన్నాథ లక్ష్మీకాంత దయానిధే ॥ ౨౩ ॥ యతః ప్రసన్నో భగవాన్ కృతకృ
తోస్మ్యహం తతః । ఆజ్ఞాపితో మహేశేన నిర్మాతుం వస్త్రసంహతిం ॥ ౨౪ ॥
తంతూన్ దిశ మహాభాగ యదర్థమహమాగతః । త్వద్దర్శనాద్ధృషీకేశ సఫ
లో మన్మనోరథః ॥ ౨౫ ॥ ఇతి పృష్టస్తదా విష్ణుర్దేవలేన యశస్వినా । తథే

---

చువాడా నీకు నమస్కారము లక్ష్మీకాంతుఁడు నెల్లవారికి సేవింప దగినవాఁడు
ను బుణ్యవిగ్రహుఁడునగు నీకొఱకు నమస్కారము పాపములకు దవ్వగునట్టి
యు రాక్షసగర్వమును హరించునట్టి నీకొఱకు నమస్కారము వేదములు వే
దాంతములు చదివి యెఱుఁగఁదగినవాఁడును జ్ఞానముచే నెఱుఁగఁ దగినవాఁడు
నుధీమంతుఁడునగు నీకు నస్కారము ఇంద్రనీలమునుబోలు మేనిచాయగల
వాఁడును దీనరక్షణ కంకణముగట్టినవాఁడును భుక్తిముక్తులనిచ్చు వాఁడునగు
ముకుందుఁడా నీకొఱకు నమస్కారము పరబ్రహ్మ స్వరూపుండును విశ్వాకా
రుండునగు నీకొఱకు నమస్కారము ఇట్లు దేవలుఁడు స్తుతియింప నింద్రనీలపు
కొండమీఁద వెన్నెలయుదయించినట్లు చిరునగవునగుచు దేవలునితో హరియి
ట్లనియె - ౨౧ - లెస్సలెస్స మిక్కిలియదృష్టవంతుఁడ వోయిదేవలుఁడా నీవు
నీతపస్సునకు నేను సంతసించితిని నీయిష్టంబైన వరంబడుగు మిచ్చెదననెను -
౨౨ - ఇట్లునారాయణుండాడిన నాదేవలుం డతనితో నిట్లనియె ఓదేవదేవుఁడా
జగత్స్వామీ లక్ష్మీనాయకుఁడా దయానిధీ నీవు ప్రసన్నుఁడవగుటం జేసి కృ
తార్థుండనైతి సర్వేశ్వరునాజ్ఞచే వస్త్రములనేయఁ దంతువులఁ గొనిపోవ నీ
యొడకు వచ్చితిగాన నాకుఁ దంతువులనిమ్ము ఓ హృషీకేశుఁడా నీదర్శనము
వలన నాకోర్కెసఫలంబు అనియిట్లు దేవలుఁడడుగ విష్ణుఁడట్లకానిమ్మని తన
నాభికమలమందుంచికొనియున్న తంతువులనతనికిచ్చెను - ౨౬ - పిమ్మటఁ గొం

త్యుక్త్వా వదదా తంతూన్ స్థాపితాన్నాభిపంకజే॥ ౨౬॥ చిరకాల మథోవాచ దేవలం మధుసూదనః॥ హరిః॥ జగత్ప్రభవవేలాయాం పురైతే ఖిలుతంతవః॥ ౨౭॥ జాతా స్తవాదితో మానె మయూవై రక్షితాః ఖిలు । వినియోగోద్య సంజాత స్త్వయైషాం ఖిలు దేవల॥ ౨౮॥ కృత్వా వస్త్రాణ్యనర్ఘాణి రోచయన్ కౌశలం తదా । దత్వాఖిలేభ్యో దేవేభ్యో లంకారం కురుమానద ॥ ౨౯ ॥

భవతస్సృష్టా పూర్వ దేవామాయావినః ఖిలాః । మునివేష ధరాభూత్వా కరిష్యంతి హి వంచనాం॥ ౧॥ తంత్వర్థే త్వం జాగరూకో భవ తేషు సదా మునే । ధృఢం విక్రమ్య భవతా హంతవ్యాస్తే నిశాచరాః॥ ౨॥ * ఇది నూతనముగనుక దీని లెక్క ప్రత్యేకమని తెలియవలెను॥

ఇత్యుక్త్వా భగవాన్విష్ణు ర్దేవలాయ మహాత్మనే। చక్రం చక్రాద్వినిష్క్రమ్య దదౌ తస్మై ముదాయుతః॥ ౩౦॥ గృహీతచక్రో దైత్యారేర్దేవలో హర్షపూరితః । బద్ధాంజలిరువాచేదం దేవదేవం జగద్గురుం॥ ౩౧॥ ప్రీతోస్మ్యనుగృహీతోస్మి యదుక్తం శ్రీమతా విభో । త్వత్ప్రసాదాజ్జగన్నాథ రచ

---

తదనంతరము శ్రీమహావిష్ణువు దేవలునిజూచి యీతంతువులు జగత్తుపుట్టినపుడుపుట్టెను నాటినుండి వానినే గాపాడితిని దేవలుఁడా నీచేత వానికిప్పుడు వినియోగంబు గలిగెఁగదా - ౨౮ - వీనిచే వెలలేనివస్త్రములనేసి నీనేర్పునందులుకొనియామనట్లు దేవతలకెల్లనిచ్చియలంకారమును గల్పింపుము - ౨౯ - నీవిచ్చటనుండిపోవునప్పుడు త్రోవలో దుర్మార్గులును మిక్కిలి మాయలు నేర్చినవారునగు రాక్షసులు నీవుకొనిపోవు తంతువుల నిమిత్తము మునివేషములు ధరించుకొని నిన్ను మోసముచేయవత్తురు వారి విషయమందు నీవు పరాకుపడక మిక్కిలి జాగ్రత్తగలిగి మెలఁగి లెస్సగాఁ బరాక్రమించి వారినిసంహరింపవలయును - ౨ - * ఇదినూతనముగనుక దీనిసంఖ్యయు గ్రంధసంఖ్యతోఁజేర్పబడదాయెను

ఇట్లుభగవంతుఁడగువిష్ణువు మహాత్ముఁడగు దేవలునకుఁజెప్పి మిగులసంతోషముతోఁ దనచక్రమునుండి యొకచక్రమునుదీసియతనికిచ్చెను-౩౦-దేవలుఁడువిష్ణునివలనఁ జక్రంబుగైకొని సంతుష్టాంతరంగుండై దోసిలిబిగియించి దేవదేవుండును లోకగురుండునగు విష్ణువుతో నిట్లనియె - ౩౧ - నీవునన్నుగారవించిమాబలాపుటం జేసి మీయనుగ్రహంబువడసి మిగులసంతసించితి మీయనుగ్రహమువలనఁ బటంబులనేసెదను మీరుచెప్పినరీతిగా నెల్లదేవతల కిచ్చె

యిష్యామిచాంబరాణ్ ॥ ౩౨॥ దాస్యామి సర్వదేవేభ్య స్సాదరం భవదాజ్ఞ
యా । ఇత్యుక్త్వా దేవలో భక్త్యా నత్వానారాయణం హరిం॥ ౩౩ ॥ తస్థౌ
నారాయణస్యాగ్రే క్షణంముకుళితాంజలిః । తతోహరి స్తథేత్యుక్త్వా తత్రై
వాంతరధీయత ॥ ౩౪ ॥ తతస్తుదేవలోమౌని ర్జంబూద్వీపంజగామసః । లవ
ణార్ణవ మాసాద్య ద్రాక్షీత్కృత్రిమమాశ్రమం ॥ ౩౫ ॥ రసాలైః పనసై
ర్నింబైః కపిత్థైర్బదరీద్రుమైః । జంబూభిరపినారంగై ర్జంబీరై ర్మధుపు
ష్పకైః॥ ౩౬॥ మాలతీజాతిభిశ్చైవ శిరీషైః కేతకీగణైః । ఫలపుష్ప సమాకీ
ర్ణైః రాజమానం మనోహరం ॥ ౩౭ ॥ దృష్ట్వాతమాశ్రమం దివ్యం విస్మ
యం ప్రాప దేవలః । కస్యాయమాశ్రమోరమ్యో మనోహర్షయతేమమ ॥
౩౮ ॥ తపస స్తస్యమహిమా కీదృశోహి మహాత్మనః । ఇతిమత్వాశ్రమపదం
ప్రవివేశసదేవలః ॥ ౩౯ ॥ దదర్శతత్రమౌనీంద్రం కపటోపాయ సంచయం
అనేకశిష్యైః కపటై స్సేవ్యమానం సదాశుచిం॥ ౪౦ ॥ జపంతం కాపటాన్
మంత్రాన్ భ్రామయన్తక్షమాలికాం । తమువాచతతోమౌనిః కపటోవత్స

---

దననిపలికిదేవలుండు భక్తితో నారాయణునకుం బ్రణమిల్లి యతనియెదుటంజే
తులు మొగుడ్చుకొని కొంతదడవునిలువంగా నంతనావిష్ణుం డట్లకానిమ్మని చె
ప్పియచ్చోటనేతిరోహితుండాయెను - ౩౪ - అంతనాదేవలముని జంబూద్వీప
మునకువచ్చి లవణ సముద్రతీరంబున నొక కృత్రిమంబగు నాశ్రమంబునుగనె
ను - ౩౫ - ఆయాశ్రమంబు పూచిపండియున్న తియమామిడ్లచేతను పనస
వృక్షములచేతను వేపచెట్లచేతను వెలగచెట్లచేతను రేగుచెట్లచేతను నేరేడుచె
ట్లచేతను గిచ్చిలిచెట్లచేతను నిమ్మచెట్లచేతను మఱియు మకరందముతో గూడిన
పువ్వులబూచునట్టి బహువిధవృక్షములచేతను జాజిబండి గురుగింజ మొదల
గుతీగలచేతను దిరిశపుచెట్లచేతను మొగిలిచెట్లచేతను మిగుల వెలుగుచుండె
నట్టిమనోహరమగు నాయాశ్రమంబునుజూచి దేవలముని యీ యాశ్రమం
బెవ్వనిదో తెలియదు దీనివీక్షింపంగా నామనస్సునకు మిగులహర్షము వొడు
గుచున్నది ఈ యాశ్రమముగల మహాత్ముని తపస్సు మహిమయెట్టిదోయని
తలచియాయాశ్రమంబులోపలికిం బ్రవేశించెను - ౩౯ - ఆయాశ్రమంబుచొ
చ్చి యందుకపటోపాయ సమూహముగల యట్టియు మిక్కిలి పరిశుద్ధునివ
లె వేషమువేసుకొని యనేకులగు కపట శిష్యులచే సేవింపం బడుచు చేత జ
పమాలికను ద్రిప్పుచు కపటమంత్రములను జపియించుచున్న యొక కపటము

కోభవాన్ ॥ ౪౧ ॥ కింనామధేయమనఘహేతుశ్చాగమనేత్రకః । తేనపృష్ట స్తతోమౌని ర్దేవలస్తంజగాదహ ॥ ౪౨ ॥ దేవలోహంముని శ్రేష్ఠమానసః పార్వతీపతేః । శివేనాహంసమాజ్ఞప్తో నిర్మాతుం వస్త్రసంతతిం ॥ ౪౩ ॥ విష్ణో స్తంతూన్ సమాదాయా గతోస్మి తపతాంవర । ఏవం సంజ్ఞాపిత స్తేనకుటిల స్తమువాచహ ॥ ౪౪ ॥ సాధుదేవలమానీంద్ర అద్యతిష్ఠమమాశ్రమే । వ్యతీతాయాం రజన్యాంతు శ్వఃప్రభాతేగమిష్యసి ॥ ౪౫ ॥ తథేత్యుక్త్వా దేవలోపి తస్మిన్నా సతవై దినే । తతోర్ధరాత్రౌతచ్ఛిష్యా స్తేనసాకం మహాబలాః ॥ ౪౬ ॥ క్రూరరాక్షసరూపాశ్చ దేవలంహంతు ముద్యతాః । దేవలోథ విదిత్వైషాం కృత్రిమం కుటిలాత్మనాం॥ ౪౭॥ విష్ణుదత్తం దీప్యమానం చక్రం తత్యాజతాన్ ప్రతి । తేనముక్తం తతశ్చక్రం కోటిసూర్యప్రభం మహత్ ॥ ౪౮ ॥ సహస్రారం భృశందైత్య చమూంచిచ్ఛేదసర్వతః । చక్రేణఛిన్నభిన్నాంగా దైత్యాస్తే

---

నింగనె నప్పుడాకపటయముని దేవలునితో నాయనానీవెవ్వఁడవునీపేరేమి నీవిచ్చోటికి రాఁగారణమేమి యని యడుగఁగాఁ బిమ్మట నాదేవలముని శ్రేష్ఠుం డాకపటమునితో నిట్లనియె - ౪౨ - నేనుదేవలుండ పార్వతీనాథుండగు నీశ్వరుని మానసంబునఁ బ్రభవించినాడ నా మహాదేవు నానతిచేతఁ బటసంహతి నిర్మాణంబునకై విష్ణువునొద్దనుండి తంతువుల గ్రహించుకొని యిటవచ్చినాడ నోయి తాపసశ్రేష్ఠుఁడాయని డెలుపఁగా నంత నాకపటముని దేవలమునివర్యునితో మఱల నిట్లనియె - ౪౪ - ఓదేవలమునివర్యుఁడా నీవుపూనినకార్యంబు మిగులమంచిదిగానున్నది యీదినంబు మాయాశ్రమంబుననిలువుము రాత్రిఁగడపిభావిదినంబు ప్రభాతంబున నీవుపోవచ్చుననెను- ౪౫- అంతనాదేవలుం డట్లకానిమ్మని యొడంబడి యాదినమాయాశ్రమంబుననే నిలిచె నటుపిమ్మట నాటిరాత్రి యాకపటమునియు మిక్కిలిబలవంతులగు నతనిశిష్యులును రాక్షస రూపధరులై యా దేవలుని జంపనుద్యుక్తులైరి అంత నాదేవలుండా తులువల చెడుతలంపు నెఱింగికొని విష్ణుప్రసాదలబ్ధంబై తనచేతదీప్యమానంబగుచక్రమ్మువారలమీఁదవిడిచెనంతఁ గోటివేవెలుఁగుల ధిక్కరించునట్టి తేజంబుతోడనున్న యావైష్ణవ చక్రం బొక్కసారికి వేవురశత్రువుల నశింపఁజేయునదిగాన నంత నారాక్షససమూహమధ్యంబునఁజొచ్చి యాసేనయంతయుఁ జిందరవందరలగునట్లు ఛేదింప నంతటి రాక్షసులు గొందఱు చేతులుదెగినవారును గొందఱు గాళ్లువిరిగినవారును గొందఱు బొమ్మలు పగిలినవారునై మిగుల

భృశవిహ్వలాః ॥ ౪౯ ॥ పలాయమానా బహుధామద్రువుశ్చదిశోదిశ । తత స్త్రతాసురాధ్యక్షా మహాసత్వామరాసదాః ॥ ౫౦ ॥ వజ్రముష్టి ధూమ్రవక్త్రోధూమాస్యోథమహాబలః । చిత్రసేనః పంచసేనః పంచైతే దానవాధిపాః ॥ ౫౧ ॥ పునస్సర్వైదైత్యసైన్యస్సంభూయైనమయోధయన్ । సృజంతశ్శరవర్షాణి ఛాదయంతోఖిలాదిశః॥ ౫౨॥ తతస్తుస్వాయకైస్తీక్ష్ణైర్దేవలం కుపితాభృశం । నశశాకతదాచక్రం హంతుం తాన్ దైత్యపుంగవాన్॥ ౫౩॥ తేషాం బాణప్రహారైస్తు దేవలః పీడితోభృశం । తుష్టావచండికాం ప్రీత్యామేదం ధార్యతేజగత్ ॥ ౫౪ ॥ దుర్గాం భగవతీం చండీం రక్తాక్షీంకృష్ణవర్ణినీం । కంఠీరవసమారూఢాం స్తౌమిసర్వేశ్వరేశ్వరీం ॥ ౫౫ ॥ విశ్వేశ్వరీం జగద్ధాత్రీం సృష్టిస్థిత్యంతకారిణీం । ధరాధరేంద్ర తనయాం భీకరాశీకరాంశివాం ॥ ౫౬ ॥ స్తౌమి ప్రచండ దోర్దండాం దైత్యదర్ప ప్రహారిణీం । మహిషాసుర సంహర్త్రీం స్తౌమిదేవీం మహాబలాం ॥ ౫౭ ॥ సురాసు

---

భీతిఁజెందిపలువిధంబులఁబఱుగులుదోలి పదిదిక్కులఁబోయిరి- ౪౯ - అంతకు బిమ్మట మహాబలపరాక్రమ సంపన్నులును దురాధర్షులు నగు వజ్రముష్టి ధూమ్రవక్త్రుఁడు మహా బలుండగు ధూమ్రాస్యుఁడు చిత్రసేనుండు పంచసేనుండను పేరుగల యేవురురాక్షస పతులు మఱల నాదైత్య సైన్యంబుల నెల్లమగుడించుకొనివచ్చి దేవలునితోఁ బోరనారంభించిరి- ౫౧- అప్పుడారాక్షసులతికోపముతో బాణవర్షములఁ గురియించుచుఁ బదిదిక్కుల బాణములచేఁగప్పుచు వేఁడితూపుల దేవలుని యెడలెల్ల చెక్కలై పోవునట్లే యనవుడా విష్ణుదత్తంబగు చక్రం బారాక్షసుల సమయింపఁ జాలదయ్యె- ౫౩- అంతనా దేవలుండా రక్కసుల తూపుల పోటులచే బీడితుండై యోర్వజాలక సకలజగద్ధాత్రియగు చండికనుఁ బ్రీతితోస్తుతియించె - ౫౪ - దుర్గనుషడ్గుణైశ్వర్యముగలదానిని జండిని యెఱ్ఱనికన్నులుగలదానిని నల్లనివన్నెగలదానిని సింహ్వముమీఁదనెక్కి సవారిచేయుదానిని సర్వేశ్వరేశ్వరిని స్తుతియించెద- ౫౫- లోకేశ్వరిని లోకముల ధరించుదానిని లోకములఁ గలుగఁజేసి కాపాడి సమయించుదానిని కొండలరేనికూతును భయంకరురాలిని నాశీర్వదించుదానిని శుభాకారను మిక్కిలి విజృంభించు బాహుదండములుగలదాని దానవుల మదముహరించుదానిని మహిషాసురుని సంహరించుదానిని మహాబలను దేవిని స్తుతియించెద - ౫౭ - సురలయునసురులయు దలలనుంపు మానికంబులుపా

రశిరోరత్న నీరాజితపదాంభుజాం । రక్తకేశీం రక్తదంష్ట్రాం గదాకోదండధా
రిణీం ॥ ౫౮ ॥ పాహిపాహిమహాదేవీ చండికే చారుభూషణే । ప్రసీదపద్మ
పత్రాక్షి దైత్యదర్పవినాశిని ॥ ౫౯ ॥ ఇత్థం సంస్తువతస్తస్య దేవలస్య మహా
త్మనః । ప్రాదురాసీన్మహాదేవీ చండికాభక్తవత్సలా ॥ ౬౦ ॥ తతఃప్రసన్నాం
తాందేవీం తుష్టావసచదేవలః । విశ్వేశ్వరినమస్తేస్తు సర్వలోకైకపూజితే ॥
౬౧ ॥ నమస్తేచండికేదుర్గే శంకరార్ధశరీరిణి । నమస్తే పద్మపత్రాక్షి నమ
స్తేపుణ్యమూర్తయె ॥ ౬౨ ॥ నమస్సర్వేశ్వరేశ్వర్యై నమస్తేదైత్యనాశిని।
జహిమాం పాపినోదైత్యాన్ పాహిమాంభక్తవత్సలె ॥ ౬౩ ॥ తతఃప్రస
న్నాసాదేవీ సాం త్వయంతీజగాదహ । వత్సమాభైషిభద్రంతే ముహూర్తం
పశ్యమద్బలం ॥ ౬౪॥ మమశూలేనమహతా హత్వా దైత్యాన్దురాత్మనః।
విద్రావ్యచదిశస్సర్వా స్తతః పాస్యామిశోణితం ॥ ౬౫ ॥ ఇత్యుక్త్వాచండికా

---

దంబులకు నీరాజనంబుగాఁగ వెలుగునట్టిదానిని యఱ్ఱని వెండ్రుకలుగలదాని
నెఱ్ఱనికోరలుగలదాని గదను వింటెని ధరించినదాని స్తుతియించెద ఓ మంచి
భూషణముల ధరించిన చండికామహాదేవి కాపాడు కాపాడు కమలము రేకు
లవంటి నేత్రములుగల చండికా రాక్షసుల గర్వమును ధ్వంసము చేయుఁగల
యోచండికా నాకుప్రసన్నురాలవుగమ్ము - ౫౯ - ఇట్లు మహాత్ముండగు నాదే
వలుండుస్తుతియింప భక్తవత్సలయగు నాచండికామహాదేవియతనిమ్రోల నా
విర్భూతమయ్యె - ౬౦ - అంతఁబ్రసన్నురాలయిన యాదేవిని దేవలముని శ్రే
ష్ఠుండు మరల నుతింపఁదొడంగె ఎల్లలోకముల వారిచేఁ బూజింపఁ బడునో
లోకనాయకీ నీకునమస్కారము శివుని దేహమందు సగమైన యోదుర్గా చం
డికా నీకునమస్కారము తామరపువ్వు రేకులవంటి కన్నులుగలదేవీ నీకునమ
స్కారము పుణ్యమూర్తియయిన నీకు నమస్కారము సర్వేశ్వరేశ్వరివై
న నీకునమస్కారము దైత్యుల సంహరించునట్టి దేవీ నీకునమస్కారము పా
పాత్ములగు నీరాక్షసులజయింపుము నన్నుఁ గాపాడుమమ్మా భక్తవత్సలురా
లా- ౬౩ - ఇట్లుస్తుతియింప నాదేవియో నాయనా భయపడవలదు ముహూ
ర్తములోపల నాబలము నీకు దెలియవచ్చునని మిగులఁ బ్రీతితో దేవలుని
నూరార్చుచుఁబలికెను- ౬౪- అప్పుడాదేవిచెప్పినదింక నేమనఁగా నాదగు మ
హాశూలముచేత నీదుర్మార్గులగు రాక్షసులనెల్లఁ గొట్టి కొందఱదఱిమి పిమ్మ
టవారలరక్తముద్రావుదును- ౬౫- ఇట్లుచెప్పి నాలుగుభుజములును నిడుదనా

దేవీ అట్టహాసం చకారహ । చతుర్భుజా దీర్ఘజిహ్వా రక్తనేత్రా మహాబ
లా ॥ ౬౬ ॥ శూలచక్రగదాహస్తా భీకరాశీ ప్రహారిణీ । కిరీటకోటిసూర్యా
భం బిభ్రాణా జనమేచకా॥ ౬౭॥ తచ్ఛూలంభ్రామయామాస దైత్యాం
తకరణం మహత్ । తతస్తేదానవాస్సర్వే ఘోరరూపా మహాబలాః॥ ౬౮ ॥
ఆయుధోద్యుక్తహస్తాశ్చ దేవీం దృష్ట్వోగ్ర రూపిణీం । బభూవుర్యుద్ధ సన్న
ద్ధా జఘ్నుస్తాంతో ధచండికాం॥ ౬౯॥ తతో దేవ్యాః కిరీటస్య మయూఖై స్సర్వ
తో ముఖైః । స్తంభితాదానవాస్సర్వే హుంకారేణాసిమూర్ఛితాః॥ ౭౦॥ త
తస్సాశూలధారాభి శ్చండికా ఘోరరూపిణీ । గదాసి చక్రైశ్చా జఘ్నుబ
హూన్ స్తైర్యాత్తదామునే॥ ౭౧॥ అపరేతు భృశం త్రస్తాః కాందిశీకా స్తదా
భవన్ । తతస్స్వాలేస దేవ్యాస్తే పంచదైత్యా విదారితాః॥ ౭౨॥ ఉద్గిరంతో
భృశంరక్తం గతాన్తై వస్వతక్షయం । హతేషుతేషుదైత్యేషు తద్రక్తై పంచవ
ర్ణకే ॥ ౭౩ ॥ నిమజ్జయిత్వా తాన్ తంతూన్ దేవలోధమహామతిః । తంతూ

---

లుకయునురలదై కన్ను లనెలుపుడెద్చు కొనిమహాబలముగల యాదేవియ
ట్టహాసంబుచేసె - ౬౬ - శూలమునుచక్రమునుగదను జేతబట్టినదై భయం
కరములగు నాయుధములుగలదై కాటుకవలె మేచకవర్ణముగలదై కోటిసూ
ర్యుల వెలుంగుగల కిరీటమును దాల్చుచు రాక్షసధ్వంసకంబగు నాశూలము
నుద్రిప్పెను అంత మిక్కిలి బలవంతులును బెట్టిదంపు రూపముగలవారునగు
నాదానవులెల్ల నుగ్రరూపముతోనున్న యీచండికను జూచి యీమహాశక్తి
తోబోరు తమకసాధ్యంబనియెఱుంగక యామెనుసమయింపఁగోరి యెల్లయా
యుధంబులనెత్తికొని యుద్ధమునకు సన్నద్ధులైరి- ౬౯- అంత నామహాదేవి కి
రీటప్రభ లునలుగడలవ్యాపింపనావెలుఁగుచేతనారాక్షసులు స్తంభితులై మహా
దేవిహుంకరింప నాహుంకారంబుచేమూర్ఛిల్లిరి- ౭౦- అప్పుడుమిక్కిలి ఘో
రంబగు రూపంబుఁ దాల్చి యున్న యాచండిక యాశూలము ధారలచేత గ
దాఖడ్గచక్రములను నాయుధములచేతను పెక్కండ్రరాక్షసులఁ గూల్చెను- ౭౧-
కడమవారందఱు నాదేవి యతిస్థిరంబుగ యుద్ధరంగంబున నిలిచి కొట్టుటకు భీ
తింజెంది పేరెంబాడిరి యాదేవి శూలముచే నాదైత్యసేనకు నాయకులగు నై
దుగురురాక్షసులు విదారితులైరి- ౭౨- ఇట్లా యేవురురక్కసులు హతులై
నెత్తురుగ్రక్కుచుయమునింటికి బోవనాదైత్యులరక్తము పంచవర్ణకంబై యుం
డదేవలుండనుదాను లోకములకెల్లఁ బటమునిర్మింప విష్ణునాభి కమలమునం

నాం కల్పయామాస పంచవర్ణాన్ విచక్షణః॥ ౨౪॥ యతశ్చైడైః ప్రభాజా తై స్తంభితాఃఖలురాక్షసాః। తతశ్చైడేశ్వరీనామ్నా ఖ్యాతా త్రిభువనేశ్వరీ॥ ౨౫॥ జగాదవచనం దేవీ ప్రసన్నా దేవలంతతః। గచ్ఛవత్సమునిశ్రేష్ఠయత్రతేరోచతేమనః॥ ౨౬॥ యదాస్మరసిమాంప్రాజ్ఞ తదాయాస్యామి తెంతికం। ఇత్యుక్త్వాసామహాదేవీ తత్రైవాంతరధీయత॥ ౨౭॥ తతస్తుదేవల శ్శ్రీమాన్ జగామామోదపట్టణం॥ నారదః॥ పితామహాసురశ్రేష్ఠ మహాత్మన్ చతురానన ॥ ౨౮ ॥ తేదైత్యాఃవజ్రముష్ట్యాద్యాఃపంచకస్యతనూభవాః। వైష్ణవేనచ చక్రేణ కథం ననిహతాశ్చతే॥ ౨౯॥ ప్రభావఃకీదృశ స్తేషాం తన్మేవదదయానిధే॥ బ్రహ్మా॥ దేవీంధృష్ట్వాసుసంనద్ధాం తేదైత్యాఉగ్రరూపిణీం ॥ ౩౦ ॥ మత్వాశక్యంతయాయోద్ధుమితోమితజనై రితి। రథపత్తిద్విపహయాన్ బహూనథసమాహ్వయన్ ॥ ౩౧ ॥ చతురంగ సుసంయత్తా నానా ప్రహరణోద్యతాః। అజగ్ముర్బహవోదైత్యాయుద్ధోన్మత్తాస్తదామునే ॥ ౩౨ ॥ రాక్షసా

---

డికొనివచ్చినతంతువుల నానెత్తుటందడిపి వానికైదువర్ణంబులఁగల్పించె- ౨౪- త్రిలోకేశ్వరియగు నామహాదేవి కిరీటప్రభలచే దానవులు స్తంభితులగుటవలననాటనుండి దేవికిఁజౌడేశ్వరియనునామంబుగలిగె- ౨౫- అంతనాదేవి ప్రసన్నురాలై దేవలునిఁ జూచి యోపిన్నతాపసవర్యుడా నీయిష్టము వచ్చినచోటికినీవుపొమ్ము నీవెప్పుడుదలచినను నేనప్పుడునీయొద్దకువత్తునని చెప్పి యాదేవియచటనే యంతర్హితురాలయ్యెను- ౨౭ - అంత శ్రీమంతుఁడగు నాదేవలుండా మోదపట్టణంబునకుం బోయెనని బ్రహ్మ చెప్పఁగా నావృత్తాంతమంతయువిని నారదుం డడుగుచున్నాడు దేవతా శ్రేష్ఠుఁడైనట్టియు మహానుభావుఁడైనట్టియు నాలుగు మోములు గలయట్టి యో బ్రహ్మదేవుడా వజ్రముష్టి మొదలగు వారేవురు నేవనికొడుకులు విష్ణుచక్రముచేత వారలెట్లుచావకుండిరి వారలమహిమయెట్టిది యదియంతయునాకు సవిస్తారంబుగాఁజెప్పవలయునయ్య - ౨౯ - ఇట్లునారదమహాముని యడుగ నతనితో బ్రహ్మయిట్లనియె ఆరాక్షసులుబెడిదంపురూపుతో యుద్ధసన్నద్ధురాలైయున్న యాదేవినిఁజూచి మనమల్పజనముతో యుద్ధమునకుఁబోయిన నీదేవితోఁ బోరఁజాలమనియెంచి రథములు కాలుబలము గుఱ్ఱములేనుఁగులనునాలుగు విధంబులసేననురావించుకొని సమస్తములైనయాయుధములతోఁ బదుగురురాక్షసులు యుద్ధమునకువచ్చిరోయి నారదమహాముని - ౩౧ - అప్పుడుయుద్ధోద్యుక్తుల

నాంయుయుత్సూనాం సేనాసుమునిసత్తమ । రథనేమినిస్వనాశ్చకూబరాక్ష
రవాస్తథా ॥ ౮౩ ॥ వాతోద్ధూత పతాకానాం రవాఃకాహళనిస్వనాః । హే
షారవాస్తురంగాణాం కరిణాంబృంహితానిచ ॥ ౮౪ ॥ గర్జితానిచ దైత్యా
నాం ధనురాకర్షణానిచ । త్రిలోకీం బధిరీచక్రుర్వ్యాప్తా స్సర్వత్రవై తదా ॥
౮౫ ॥ తతోంబికాసుసంక్రుద్ధావిలోక్యబలమాసురం । గదయాప్రోథయామా
సబహూంధాచబహూన్రథాన్ ॥ ౮౬ ॥ ఏకద్వైక ప్రహారేణ సాశ్వసారథి కేత
నాన్ । తిలశోవ్యథమద్దైత్యాన్ దశద్వాదశవింశతిం ॥ ౮౭ ॥ గదాఘాతేనమ
హాతా దేవ్యాస్తత్రరణాంగణే । దంతావళా శ్ఛిన్నదంతా భిన్నకుంభా స్తథా
పరే ॥ ౮౮ ॥ పేతుమర్మ్రుమ్రుశ్చబహుళా ఉత్ క్షిపన్తో కీకవ్రజాః । హయా
శ్చగదయామమ్రుః పిండీకృతకశేరుకాః ॥ ౮౯ ॥ శీర్షాణివ్యథమద్దేవీ దాన
వానామనేకశః । యథాబలీభాండసంఘంవిధమెల్లగుడేనతు ॥ ౯౦ ॥ తథా
శీర్షాణిదైత్యానాం వ్యథమద్గదయాంబికా । ద్వేధాత్రేధాహయాన్ ఛిత్వా
నేకధాచబహూన్రథాన్॥ ౯౧ । యంత్రూన్ హత్వా హయాన్ ఛిత్వారథి

---

గునారాక్షసుల సేనలలోబండ్లధ్వనులు నిరుసుమొదలగువానిచప్పుళ్లును గా
లికల్లాడుచున్న టెక్కెపుగుడ్డలశబ్దములును కొమ్ములూదగా వాని నిస్వనం
బులునుగుఱ్ఱములసగిలింపుశబ్దములును గజములబృంహితనాదంబులును దా
నవులబొబ్బలును ధనురాకర్షణధ్వనులును దిక్కుల కడలవఱకు వ్యాపించి
ముల్లోకములనుండువారి శ్రోత్రంబులకును బాధిర్యంబొనర్చె- ౮౫ - అంత
నాయంబిక యారాక్షససైన్యమునుజూచి యలిగినదై గదిచేతఁ బెక్కురథం
బులఁబెక్కువిధంబులఁగొట్టె - ౮౬ - ఒకతూరియొకయాయుధంబుచేఁబదు
గురుపన్నిద్దఱు ఇఱువదుగురురాక్షసులు వారిరథములు వానిగుఱ్ఱములుసా
రథులతోడనువ్వుగింజలంత తునుకలగునట్లుకొట్టెను- ౮౭- అప్పుడాదేవి గద
దెబ్బచేత నాదానవుల సేనయందలి యేనుగులుకొన్ని దంతములు విఱిగినవి
యుఁగొన్ని తలలుపగిలినవియు నేలఁబడిచావగా నాతలలుపగిలినయేనుగులత
లలనుండి ముత్తెములెగయుచుండె గుఱ్ఱములా గదదెబ్బచేత ముక్కలున
లిగిముద్దలుకాఁగాఁబడిచచ్చెను . ౮౯ - ఇట్లుసర్వలోకభయంకరంబగునా
యుద్ధంబున నాదేవి బల్లవంతుఁడొకలాటి కట్టెనెత్తి కుండలఁబగలఁగొట్టుచం
దంబునరాక్షసులశిరఃకపాలంబులప్రక్కలించె - అట్లేనుగులరథముల గుఱ్ఱము
లనొక్కొక్కటి రెండుమూడుగాఁ దునియునట్లుఁగొట్టె యాయంబిక యారా

నస్సాన్యపాతయత్ । శుండాదండాంశ్చ కంఠాంశ్చ కరిణాం చాసినాంబికా॥ ౯౨॥ అపాతయద్గజాంశ్ఛిత్వా పవినేవవృషాచలాన్ । దైత్యాన్విదార్యశూలేనగజానశ్వాననేకశః ॥ ౯౩॥ క్రోధయిత్వా గదాఘాతైశ్చక్రేణ బహుధాచ్ఛినత్ । యథాంతకః ప్రజాస్సర్వా దండపాణి ర్వినాశయేత్ ॥ ౯౪॥ తథావినాశయామాస గదా హస్తాంబికాసురాన్ । వ్యద్రావయత్ఖడ్గపాణిర్వజ్రపాణిరివాసురాన్॥ ౯౫॥ విదార్య దైత్యాన్ శూలేన ప్రళయే భైరవోయథా । ఛిత్వా చక్రేణ దనుజాన్ బహూన్ నీత్వాయమక్షయం॥ ౯౬॥ శేషాన్విద్రావయామాస చండికా ఘోరరూపిణీ । హత్వాత్వనేకథా దైత్యాన్ శూలచక్రగదాసిభిః॥ ౯౭॥ నదీః ప్రస్రావయామాస సాదేవీ దైత్యశోణితైః । పీత్వా చరుధిరం తేషాం ఖాదిత్వాస్త్యానాని చండికా॥ ౯౮॥ ఘోరరూపాభీషయం తీజగర్జ చముహుర్ముహుః । తేహాస్య మానాస్సను రేడుమయారాక్షసామునే॥ ౯౯॥ విపులం భయమాపన్నా దుద్రువుశ్చ దిశోదశ । దేవ్యాహతేషుబహుషుదానవేషుతదారణే ॥ ౧౦౦ ॥ ఆపేతుర్భూతభేతాళ శాకినీ డాకినీ గణాః।

---

క్షసులతలలనుగదచేఁగొట్టెను - ౯౧ - సారథులఁజంపెనుగుఱ్ఱములనరికెను రథికులఁబడఁద్రోచెను యేనుగులతొండములనుమెడలనుగత్తిచేనతికి యింద్రుడు వజ్రాయుధముచేతఁ బర్వతపక్షచ్ఛేదంబొనర్చి యాపర్వతతంబులఁ బడఁద్రోచునట్లాయేనుగులఁబడద్రోచెను-౯౨- దానవులశూలముచేఁజీల్చియేనుగులగుఱ్ఱముల గదదెబ్బచేతగొట్టి చక్రముచేతఁ బలుతెరంగుల నఱకెను కాలుండుదండధరుఁడై ప్రజలసమయించురీతి నాయంబిక గదనుజేతఁగొని యెల్ల రాక్షసుల సమయించె ఖడ్గంబుచేతఁగొని వజ్రముచేతఁ బట్టినయింద్రుని భాతి రాక్షసులనెల్లఁ దోలెను ప్రళయకాలభైరవుని క్రియఁ గొందఱ రాక్షసుల శూలముచే విదారించియుఁ గొందఱఁ జక్రముచేనరికియు ననేకులజమునింటికిఁబంపి కడమవారిని బారదోలెను భయంకరమగు నాకారమును ధరించియున్న యాచండిక యిట్లుశూలచక్రాద్యాయుధములచేతఁ బలుతెఱంగుల దానవులంజంపి వారలనెత్తుటచేత నేఱులంబారించె వారల నెత్తురు బానముసేసె పీనుఁగులఁ బొఁతేను ఇట్లుయుద్ధంబుసలిపి భయంకరమగు రూపముతో గర్జించెనంత నారక్కసులందఱు మహాదేవిచేఁ గొట్టబడి మిక్కిలి భయపడి దిక్కులకువిదిక్కులకుఁ బాఱిపోయిరి- ౯౯- ఇట్లుమహాదేవి యనేకులగు రాక్షసులసంహరింపఁగా మాంసాభిలాషుకంబులగు భూతప్రేత పిశాచ యక్ష శాకినీ డా

యక్షాః ప్రేతాః పిశాచాశ్చ ప్రహృష్టా మాంసలోలుపాః॥ ౧౧ ॥ పిశితానివ సాస్త్రాణా న్యుపభుజ్యాయథేచ్ఛయా । పీత్వారక్తం భూతగణానృత్యం తిస్మము హుర్ముహుః॥ ౧౨॥ హతశేషాస్తుతే దైత్యాః ప్రాణత్రాణపరాయణాః । గత్వాస్వరాజ్ఞాం పంచానాం సర్వంవృత్తం న్యవేదయన్॥ ౧౩॥ తేదైత్యాన వజ్రముష్ట్యాద్యాగతాయమపురంత్విలి । పురాఖిలస్యసర్గస్యప్రళయేసముపస్థితే ॥ ౧౪ ॥ ఆసీజ్జలమయస్సర్వః ప్రపంచస్సచరాచరః । జలప్రళయవేలాయాం భగవాన్ మధుసూధనః॥ ౧౫॥ ఆస్తీర్య శేషమభజద్యోగనిద్రాం హరిః ప్రభుః । నారాయణేతునిద్రాళౌ మహాన్ స్వేదోద్గమోభవత్ ॥ ౧౬ ॥ తస్మాత్స్వేదాత్సముద్భూతాః పంచైతే రాక్షసామునే । వజ్రముష్టి ధూమ్రమవక్త్రౌ ధూమ్రమాస్యోమితవిక్రమః॥ ౧౭॥ చిత్రసేనః పంచసేన ఇత్యాఖ్యా ఘోరదర్శనాః । దృష్ట్వాప్రసుప్తంగోవిందం తేతుహంతుంసముద్యతాః॥ ౧౮॥ తత ఉత్థాయభగవాన్ దృష్ట్వా పంచమహాసురాన్ । బాహుప్రహరణస్తైస్తు యుయుధేచతదాహరిః॥ ౧౯॥ తతస్తద్యుద్ధసంతుష్టా హరిస్త్వావిదమబ్రవీత్ ।

---

కినీగణంబులెల్ల నచ్చటద్రావెలెను- ౧౧- అప్పుడావచ్చిన బూచులగములు పులినీటం దోగియున్న మాంసముల నిచ్ఛవచ్చినట్లు మెక్కి నెత్తురుద్రావి యొడలుమఱచి యాడసాగెను- ౧౨- ఆయుద్ధంబునం జావంగా మిగిలిన రాక్షసులు దమప్రాణముగాపాడుకో నిచ్ఛగలవారై పారిపోయి తమరాజులైన వజ్రముష్ట్యాది రాక్షసులేవురు చండికతోడి యుద్ధంబునమడిసిరను వృత్తాంతమును దమవారికిం జెప్పిరి- ౧౩- పూర్వమీ సృష్టికెల్లం బ్రళయము సంభవించినపుడు సర్వప్రపంచము జలమయమై స్థావరజంగమంబు లొకటియుం గానరాకయుండె నట్లెల్లలోకంబులు జలనిమగ్నంబులైనపుడు భగవంతుండగు మధుసూదనుం డాదిశేషునిం బాన్పుగం జేసుకొని యోగనిద్రనొందె నట్లు నిద్రించుచున్న యద్దేవదేవుని దేహంబుచేమర్చె- ౧౬- ఆచెమటవలన నీచెప్పంబడి నవజ్రముష్టి ధూమ్రవక్త్రుండు ధూమ్రాస్యుండు చిత్రసేనుండు పంచసేనుండను పెరులుగల యైదుగురు రక్కసులు పుట్టిరయ్యా నారదమునివారు మిక్కిలి పరాక్రమంబుగలవారు వారలం జూడ నెట్టివారికిని మేనులువడంకును అట్టియారక్కసులు నిద్రించుచున్న నారాయణునిం జూచి చంప నుద్యోగించిరి- ౧౮ - అంత నాభగవంతుండగు నారాయణుండు నిద్రమేల్కని యారాక్షసులనైదుగుఱంజూచి యప్పుడువారితో నాయుధంబుంబట్టక భుజములచేతనే

విష్ణుః ॥ ప్రీతోస్మి యుష్మద్యుద్ధేన శృణుధ్వం దైత్యపుంగవాః॥ ౧౧౦॥ వరం వృణీధ్వం దాస్యామి యదిష్టం భవతామిహ । తేనైవముక్తాస్తే దైత్యాః ప్రత్యూచుర్హరిమచ్యుతం॥ ౧౧౧॥ దైత్యాః॥ యది తుష్టోసి భగవన్ పద్మనాభ దయానిధే । అస్మాకం తవ చక్రేణ అవధ్యత్వం దిశ ప్రభో॥ ౧౧౨॥ తథేతి భగవాన్విష్ణుస్తదా తేభ్యో వరం దదౌ । తతస్తే రాక్షసాః పంచ స్వపౌరుష ముపాశ్రితాః॥ ౧౧౩॥ కృతపాతాళ నిలయా బభూవూ రాక్షసాధిపాః । అథైకదా తే దనుజా ఆసేదుర్భార్గవాశ్రమం॥ ౧౧౪॥ తత్రాపశ్యన్ శుక్రకన్యాం దేవయానాం యశస్వినీం । బింబోష్ఠీం భృంగచికురాం విద్యుత్కనకసన్నిభాం॥ ౧౧౫॥ యత్నసృష్టాం విధాత్రేవ సుందరీం సుందరాకృతిం । దృష్ట్వా తే తాం దు

---

యుద్ధముసేసెను- ౧౦౯- అప్పుడు వారును దిట్టతనంబున వెనుకకనణుగిడక తనతోఁ బోర నాహరి వారలయుద్ధమునకు మిగుల నానందించి వారలతో నిట్లనియె నో దానవులారా మీయుద్ధముచే నేనుమిగులఁ బ్రీతినొందితి మీకిష్టంబైన వరంబు వేఁడిచ్చెదననెను అంత నాదైత్యులు నారాయణుండిట్లు తమయందనుగ్రహించుటకాశ్చర్యమంది యాభగవంతునితోను త్తరము చెప్పిరి- ౧౧౧- దైత్యులు చెప్పిన యుత్తరము- ఓదయానిధియైన భగవంతుఁడా పద్మమునాభి యందుఁగలవాఁడా మీరుమావిషయమందు సంతోషించిన పక్షమందుమాకునీచక్రముచేతఁ జావులేకుండవరమిమ్ము యామహాప్రభోయనియడిగిరి- ౧౧౨- అంతనాభగవంతుఁడగు విష్ణువు వారుకోరినట్లయగు గాతయని వారికి వరమిచ్చెను అంత నారాక్షసులేగురు తమ పరాక్రమముచేత బాతాళ లోకమందుఁ బ్రవేశించి యక్కడఁ దమకుఁ దగిన నెలవులఁ గల్పించుకొని రాక్షసాధిపత్యమునువహించియుండిరి - ౧౧౩ - ఆరాక్షసు లచ్చటనుండి యొకానొకప్పుడుభార్గవాశ్రమమునకువచ్చిరి - ౧౧౪ - ఆయాశ్రమంబున దొండపండునుబోలు నోష్ఠమును దుమ్మెదలఁ బోలిన తలవెంట్రుకలును గలదియు మెరుపుతోడను బంగారముతోడనుసమానురాలును బ్రహ్మయామెను సృజించుటకుబహుప్రయత్నముచేసి సృజించియుండును నను నట్లు మనోహరముగా నుండునట్టి యాకృతిగల సుందరి యగునట్టిదియు యశముగలదియునగు శుక్రాచార్యుల కూతురైన దేవయానయుండఁగా నామెనుజూచిరి- ౧౧౫- అట్టిదేవయానను జూచినమాత్రమున దుర్మార్గులగు నారాక్షసులు కామవికారమును బొందిన వారై మిక్కిలివినయముతో నామెదగ్గరకుబోయి యొకమాటచెప్పిరి- ౧౧౬-

రాత్మానోరాక్షసాః కామమోహితాః ॥ ౧౧౬ ॥ ఉపాగమ్యా బ్రువన్ వా
క్యంప్రణయేనసమన్వితాః । శ్రుణుసుందరిభద్రంతే స్మాకంచవచనంహితం॥
౧౧౭ ॥ వయంతురాక్షసాధీశా స్త్రిషులోకేషువిశ్రుతాః । పంచానాం నోవ
రారోహే యస్మిన్ స్తేరోచతేమనః ॥ ౧౧౮ ॥ త్వయాసప్రియతాంసుభ్రియ
త స్త్వంసుందరీమణిః। ఇతీరితంతతస్సృత్వాభార్గవీక్రోధమూర్ఛితా॥౧౧౯॥
ఉవాచ పాపినోదైత్యాన్ భర్త్సయంతీ ముహుర్ముహుః । దురాత్మానో
గుహ్యోకన్యాంమాంవిజ్ఞాయేత్థమీరితం ॥ ౧౨౦ ॥ బలదర్పసమావిష్టాః కార్యా
కార్యంనజానథ। హంతబుద్ధిస్సముత్పన్నా కథంమాంప్రష్టుమీదృశం॥ ౧౨౧॥
దుర్బుద్ధయోమాదృశీవోదర్పమేవహరిష్యతి । తయాహతానష్టబలా భూ
యాస్తమమశావతః ॥ ౧౨౨ ॥ ఇత్యుక్త్వాభార్గవీకన్యా జగామస్వాలయం
ప్రతి । తయాశప్తాస్తతోదైత్యాభృశంశమదమాన్వితాః ॥ ౧౨౩ ॥ నియమే
పరమేస్థిత్వా తపసాతోషయన్ శివం । ప్రససాదతత శ్శ్రీమాన్ భగవాన్
ఫాలలోచనః॥ ౧౨౪॥ ఏతేప్రసన్నంతంశంభుంపంచదైత్యాతాయాచిరె । అ

---

వారామెతోఁజెప్పినమాట ఓసొగసైనచిన్నదానా నీకుమేలుగలుగునట్టి మా
టనుమేము చెప్పెద ఇట్టి మామాటనువినుము మేముమూఁడులోకములలోఁ
బేరువడినవారము రాక్షసాధిపతులము మేమైదుగురు మున్నాముగదా మా
లోనెవనియందు నీమనస్సున కిష్టముకలుగునో యట్టివాని నీవుపరింపుము ఓ
సుందరములైన కనుబొమ్మలుగల చిన్నదానా నీవునారీరత్నమవుగదాయనిరి-
౧౧౮-ఇట్లువారలుచెప్పినమాటవిని యాదేవయానమిక్కిలికోపముతోఁగూడి
నదై యాపాపాత్ములగు దైత్యులను బెదరింపుచు నొకమాట చెప్పెను ఓరి
దుష్టులారా నేనుమీగురువుకూతునని మెఱిఁగియుండియు మీరునన్నిట్టిమాట
యాడితిరిగదా- ౧౨౦ - బలగర్వమావేశించియున్న దిగనుక మీరుచేయఁదగి
నదిచేయఁదగినిది మెఱుఁగకపోతిరి అయ్యో నన్నిట్టులడుగవలయునను బు
ద్ధిమీకెట్లుపుట్టెను- ౧౨౧ - ఓరిదుర్బుద్ధులారానావంటిదెమీగర్వమునుహ
రింపఁగలదు నాశాపమువలన నామెచేతఁగొట్టఁబడి బలహీనులగుదురుగాత-
౧౨౨ - ఇట్లుచెప్పి భృగువంశసంభూతురాలగు నాకన్యక దనయింటికిఁబో
యెను అంతనామెచేత శపింపఁబడిన యారాక్షసులు మిక్కిలి శమదమముల
తోఁగూడినవారలై యధికమగు నియమముతోఁదపస్సుచేసి శివునిసంతోషప
ఱచిరి అటుపిమ్మట నొసటఁగన్నుగల శ్రీమంతుఁడైన యాభగవంతుఁడు ప్ర

స్త్రద స్తంజనాస్సర్వేభి ర్యూసురితిసాదరం ॥ ౧౨౫ ॥ తథాభవిష్యతీత్యుక్త్వా శంకరోంతరధీయత । తఏతేకాలయోగేన దేవలంహంతుమాగతాః॥ ౧౨౬॥ దేవ్యావినిహతాస్తత్ర చౌడేశ్వర్యా మహాబలాః । తద్రక్తైః కల్పయామాస దేవలఃపంచవర్ణకాన్ ॥ ౧౨౭ ॥ వరదానం మహేశస్య సఫలంసమజాయత ॥ ఇతిశ్రీ బ్రహ్మాండ పురాణే బ్రహ్మనారద సంవాదే ఉత్తరఖండే దేవాంగచరితే చౌడేశ్వరీ వరప్రసాద రాక్షసోపాఖ్యాన కథనం నామద్వితీయోధ్యాయః.

తతస్స దేవలో హర్షాదామోదంగంతుముద్యతః। వివిధాన్ విషయాన్ పశ్యన్ కాననాన్ దుర్గమాన్ బహూన్ ॥ ౧ ॥ వ్యతీత్యబహుళాన్ శద్రీన్ స్తథా పుణ్యమహానదీః । తతోద్రాక్షీత్పురీం భూయోరమ్యామామోద సంజ్ఞికాం॥ ౨॥ విదిత్వాగమనంచాస్య దేవలస్య మహాత్మనః । తతశ్శివాజ్ఞయాతత్రస్థితాస్సర్వేజనాముదా ॥ 3 ॥ రాజానో మంత్రిపుత్రాశ్చ భటాశ్చైవ మహాబలాః । వణిజోన్యేచబహవో గాయకై ర్నర్తకైస్సహ ॥ ౪॥ వాద్యఘోషే

---

సన్నుండాయెను - ౧౨౪ - అట్లు ప్రసన్నుఁడైన యీశ్వరుని నాదాన వులైదుగురు మానెత్తురు జనులందఱు ధరించునట్లు మాయందనుగ్రహింపవలయునని యాదరముతోఁ బ్రార్థించిరి - ౧౨౫ - అంతనాయీశ్వరుఁడట్లయగు గాతయని చెప్పి యంతర్హితుం డాయెను ఆయారాక్షసులు కాలవశము వలన దేవలునిజంపవచ్చిరి- ౧౨౬- వచ్చియక్కడఁ జౌడేశ్వరీమహాదేవిచేతఁగొట్టఁబడి ఆయా యామహాబలవంతులైన రాక్షసులు వారలరక్తములచేత దేవలుఁడైదువర్ణములఁ గల్పించెనయా అప్పుడు వారి కీశ్వరుఁడిచ్చిన వరముసఫలమాయెను - ౧౨౭ - ఇది బ్రహ్మాండపురాణంబున బ్రహ్మనారద సంవాదంబున నుత్తర ఖండమున దేవాంగ చరితమునఁ జౌడేశ్వరీ వరప్రసాద రాక్షసోపాఖ్యాన కథనం బన్నది రెండవయధ్యాయము.

అంతనా దేవలుం డతిహర్షంబుతో నామోదపట్టణంబునకుఁ బోవఁబయలువెడలి త్రోవయం దక్కడక్కడ మనోహరములగు పలుదేశములను జూరరాని పెక్కడవులను జూచుచు ననేకములగు కొండలను బుణ్యకరముల గుమహానదులనుదాటి యాపిమ్మట నత్యంతరమణీయ్యమగు నామోదమను పట్టణమును మఱలఁ జూచెను- ౨- మహాత్ముండగు నీదేవలుని రాకనెఱిఁగికొని యచ్చటిజనులందఱు శివునాజ్ఞచేత నానందభరితులై యుండిరి - 3 - రాజవంశమందుఁ బుట్టినవారును మంత్రికుమారులును మిక్కిలిబలశాలులైన భ

ణమహతా పురస్కృతపురోధసః । రాజానం ప్రతిజగ్ముస్తే మంగళారావ
పూర్వకం॥ ౫॥ తైస్సమ్యగర్చితస్సర్వై ర్దేవలో హర్షమావిశత్ । త
మూచుర్మంత్రిణస్సర్వే రాజానం సపురోధసః॥ ౬॥ స్వామిన్ భవత్పురీసే
యం భవత్పాల్యాహి దేవల । భవదీయావయం సర్వే త్రాతవ్యాశ్చ వయంత్వ
యా॥ ౭॥ ప్రవేష్టుమర్హసి ప్రాజ్ఞ రమ్యమామోదపట్టణం । ఆదేశస్త్వద్య శోదే
వదేవదేవస్య శూలినః॥ ౮॥ తైరేవం ప్రార్థితోమాత్యైః సపురోధోనృపా
త్మజైః । మహాహర్షసమావిష్టః ప్రవేశాయ మతిం దధే॥ ౯॥ తతశ్శంఖామ
హాభేర్యో మృదంగా ఘనకాహళాః । వాద్యాన్యపి తథాన్యాని నెదుర్వై బ
హు లంతదా॥ ౧౦॥ తేషాం శబ్దో మహానాసీ ద్వ్యాప్తాఖిలదిశాతటః । మాగ
ధస్తుతి భిర్గీతైర్నృత్తైర్వాద్యైశ్చ సంకులం ॥ ౧౧ ॥ ప్రవివేశ తతశ్శ్రీమా
న్పురమానందదాయినీం। ఏకేన చ తథా ద్వాభ్యాం విస్తరాయత శోభితాం॥ ౧౨॥

---

టులును నర్తకులును మఱియు సేనకులును మంగళకరములగు పాటలు పాడించుచును మేళముల వాద్యము చేయించుచును బురోహితుల ముందిడికొని యాటకాండ్రను బాటకాండ్రను బిలిచికొని రాజగు దేవలు నెదురుగ వచ్చిరి - ౫ - ఇట్లు వచ్చినవారిచేత నెల్లం బూజింపంబడినవాడై దేవలుండు మిక్కిలి సంతోషమునుబొందెను అంతనా వచ్చిన మంత్రులును బురోహితులును రాజగు నా దేవలు నిగూర్చి యొకమాట చెప్పిరి - ౬ - ఓస్వామీ దేవలా యీపట్టణము నీయది నీచేతం బాలింపదగినదిగదా మేమందఱము మీవారము మమ్మునందఱ నీవుగాపాడవలయునుగదా - ౭ - ఓమిక్కిలి తెలిసిన దేవలా మనోహరమైన యామోదపట్టణములోపలం బ్రవేశింపం దగును ఓదేవా దేవదేవుండగు శూలాయుధధరుని యాజ్ఞ యట్టిది - ౮ - ఆమంత్రులును బురోహితులును రాజపుత్రులునట్లు ప్రార్థింపంగా మిక్కిలి సంతోషించినవాడై యా దేవలుండు ప్రవేశింపను గోర్కి వహించెను - ౯ - అంతనా దేవలుండు పట్టణములోపలం బోవునపుడు శంఖములు నగారాలును నపుపత్తులు మద్దెలు తుతారులు మఱియు ననేకవిధములగు వాద్యములు మ్రోసెను - ౧౦ - అప్పుడా వాద్యముల నాదమును మాగధులు పొగడునట్టి శబ్దములును గీతములును నృత్తములును గలసి యధికమై యెల్ల దిక్కుల వ్యాపించెను - ౧౧ - అంత శ్రీమంతుండగు నా దేవలుండు విస్తారమునను వెడలుపునను మిగుల శోభించుచు నత్యంతానంద సంధాయియై యున్న యా పట్టణమును బొచ్చెను - ౧౨ - ఆపట్టణంబు బంగారముచేతం గట్టిన కోటలు

హేమప్రాకార నిలయాం స్వర్ణగోపుర రాజితాం । పాతాళవ్యాపిపరిఘాం ర
త్న క్షౌమవిరాజితాం॥ ౧౩ ॥ చలధ్వజ పటోద్ధూత స్వర్ణదీపద్మబంభరాం ॥
వేదండకరసంభిన్న స్వర్ణదీ స్వర్ణపద్మినీం ॥ ౧౪ ॥ నానావిధ వనోద్యాన
తటాకహారిదశోభితాం। రత్నసానుప్రతీకాశాంయత్రరత్నాట్టప జ్త్రయః॥ ౧౫ ॥
భతంతితారానాథస్య విశ్రమాయతనానిచ । యత్ప్రాకార శిఖాజాలై రథ
స్సంఘృష్య తేరవేః ॥ ౧౬ ॥ యదుద్యానా నిరమ్యాణి స్పర్ధంతే నందనేన
హి । యత్రైవ రూపాజీవాభి ర్లావణ్య విజితాభృశం ॥ ౧౭ ॥ నసంచరంతి
మెదిన్యామ ద్యాప్యప్సర సాంగణాః । యాందృష్ట్వా దేవగంధర్వా స్సర్వభో
గాస్పదాంశుభాం ॥ ౧౮ ॥ తత్రైవ వాసమిఛంతి పరిత్యజ్యామరావతీం । ప్ర
తివీధినగస్రాయై వరూధపిహితై రథైః ॥ ౧౯ ॥ రాజితాం సైంధవై రశ్వై

---

నిండ్లను గలదియు నాకాశమునంటుచుండు గోపురమ్ములచేఁ బ్రకాశించునదియుఁ బాతాళలోకమునంటునంతలోతుగల యగడితలుగలదియు రత్నములు కోటబురుజులయందుఁ జెక్కియుండునదియునై యుండు మఱియు నాపట్టణమందు ధ్వజములకుఁగట్టిన పటములాడుచుండుటచేత నాకాశ గంగయందలి కమలములలోవాలియుండు తుమ్మెద లెగిరిపోవుచుండును ఆపట్టణపు ఏనుగులుస్వర్గగంగయందలి బంగారపు కమలములను దొండములచేఁ బెల్లగించి వేయుచుండును- ౧౪- మఱియు నాపట్టణము పలు తెరంగులగువనములచేత నుద్యానవనములచేతను మడుగులచేతను గొలకులచేతను రాజిల్లుచు మేరుపర్వతముతో సమానముగానుండును ఆపట్టణమందు రత్నఖచితములగు మేడల వరుసలు చంద్రునకలుపుఁదీర్చుకొనునిండ్లుగానుండును దానికోటలకొమ్మలవరుసలు సూర్యునియధోభాగమున నొరయుచుండును - ౧౬ - దాని మనోహరములగునుద్యానవనములునందనవనమునుదిరస్కరించుచుండును ఆపట్టణమందలి భోగము వారిచేతఁ దిరస్కరింపఁబడి నేటివఱకు నప్సరస్త్రీ సంఘములుభూసంచరణమును మానియున్నవి సమస్త భోగముల కాస్పదమగు నాపట్టణమునుజూచి దేవతలుగంధర్వులు నమరావతినివిడిచి యాపట్టణమందే వసింపఁగోరుదురు అందున్న వీధులలోను రథగుప్తులచేత నాఛాదితములగు రథములును గుఱ్ఱాపాగాలలో నశ్వములును నిండియుండును - మఱియునాపట్టణమందు పవనములు సంతోషమును గలుగఁజేయుచుండును వానిలోసంపంగి చెట్లు నశోకవృక్షములు పాటల భూరుహములు తియ్యమామిడిచెట్లు నేపిచె

లతాసచ్ఛాలావిరాజితాం । ఆరామైర్హర్షజనకై శ్చంపకాశోకపాటలైః ॥
౨౦॥ రసాలసాలతక్కోల తమాలై ర్నారికేళకైః । పనసైః పిచుమందైశ్చ
మాధవీవకుళై రపి॥ ౨౧॥ పున్నాగైః పారిజాతైశ్చ కాంచనైః కేతకీగణైః ।
స్నిగ్ధగుచ్ఛైః కురవకైః కుట్మలై స్సప్తపర్ణకైః ॥ ౨౨ ॥ జంబీరై రపినారం
గైర్జంబ్వామలకదాడిమైః । జపాశిరీషజాతీభిర్మల్లికాతిలకై శ్శుభైః ॥ ౨౩॥
కోకిలామధురాలాపైః కపోతకలకూజితైః । సుపర్ణైశ్చక్రవాకైశ్చ కౌశి
కై రుగ్రలోచనైః ॥ ౨౪ ॥ క్రౌంచకారండ వాకీర్ణైః పరాగవ్యాప్త భూస్థ
లైః । మధుధారా సమాస్వాద మత్తభృంగాళిఝుంకృతైః ॥ ౨౫ ॥ అన్యైః
పతంగై ర్బహుభిర్ద్రుమైర్గుల్మైర్లతాంగణైః । మనోహరై రనేకైశ్చ
పరివ్యాప్తోపకంఠికాం ॥ ౨౬ ॥ దేవలాయతతో రాజ్ఞే సర్వా భూసురయోషి
తః । నీరాజనాని ప్రదదుర్మంగళా రావసంకులం ॥ ౨౭ ॥ తత్రతత్రచపశ్యం
తః ప్రాసాదేషుసముచ్ఛ్రకైః । వికిరంతిస్మ పుష్పాణి రాజ్ఞే భూసుర కన్యకాః॥

---

ట్లును దక్కోలవృక్షములును జీకటిమ్రాకులును టెంకాయమ్రాకులును పనస చెట్లును పిచుమందభూజములును బండిగురువిందచెట్లును బొగడ మ్రాకులును పొన్నచెట్లును బారిజాతవృక్షములును పసిండివన్నె పూల మొగ్గలను మెఱుగు దేలుచున్న పూగొత్తులుగల గోరింటచెట్లమొగ్గలు నేడాకుల యరటిచెట్లునునిమ్మచెట్లును గిచ్చిలిచెట్లును నేరేడుచెట్లు నుసిరికచెట్లును దాడిమవృక్షములును దాసానిచెట్లును దిరిసెపుచెట్లును జాజిచెట్లును మల్లెలును దిలకవృక్షములును నిండియుండును కోకిలలు మనోహరముగఁ గూయుచుండును పావురాళ్ళవ్యక్త మధురముగ శబ్దించుచుండును గరుడ పక్షులు మెండుగా నిండుకొనియుండును చక్రవాకములుండును బెడిదంపు గ్రుడ్లతో గూబలుండును - ౨౪ - క్రౌంచపక్షులు కారండవములు వ్యాపించి యుండును వనభూమియందంతటఁ బుప్పొడిరాలియుండును తుమ్మెదలు దేనెలఁ ద్రావి మదమెక్కి ఝుంకారములుచేయుచుండును - ౨౫ - ఇంకనేకవిధములపక్షులును వృక్షములు పొదలు తీగలును మిక్కిలి మనోహరములై యానగరముచుట్టు ప్రక్కల వ్యాపించియున్నవి - ౨౬ - ఇట్టియాపట్టణమందలి బ్రాహ్మణజాతి ముత్తైదువలు రాజగు దేవలుఁడు పట్టణప్రవేశముచేయునపుడు మంగళకరములుగఁ బాటలుపాడుచు నారతియెత్తిరి - ౨౭ - మఱియు నాపట్టణమందలి బ్రాహ్మణకన్యకలుపొడవైనమేడలనెక్కి యాయుత్సవమునుజూచుచు దేవలునిమీఁదఁబ

-౨౮॥ అకుర్వన్ వేత్రహస్తాశ్చ పురో రాజ్ఞస్సువిస్తరం । తదానుయాతాస్సర్వే విభూసురాస్స్వస్తిపాఠకాః॥ ౨౯॥ నేత్రోత్పలైః పూజ్యమానః పురస్త్రీణాం స దేవలః । ప్రవిష్టోంతఃపురం శ్రీమాన్ పురోధోభిస్సమంత్రిభిః ॥ ౩౦ ॥ విజయధ్వనిసంకీర్ణం దేవలో హర్షపూరితః । తతః పుణ్యానితీర్థాని చానీయామాత్యపుంగవాః ॥ ౩౧ ॥ సుదినే శోభనే లగ్నే భిషేకం విదధుర్ముదా । తతోభిషిక్తశ్శుభసర్వైః పౌరైస్స దేవలః ॥ ౩౨ ॥ బృందారకైర్యథా సర్వైర్మహేంద్ర ఇవ దేవరాట్ । అభిషిచ్యతు రాజానం సామాత్యా రాజపుత్రకాః ॥ ౩౩ ॥ సర్వే ప్రణమ్య హర్షేణ ప్రదదూ రాజముద్రికాం । స్వవేదయంతతస్సీమాం షట్కోటి స్వర్ణదాయినీం॥ ౩౪ ॥ మర్యాదాయాశ్చ విషయే తాన్వై ప్రోచుర్నృపాయతే । తతోగ్రహారశతకం శైవేభ్యో దత్త్వాన్నృపః॥ ౩౫॥ ధీరఃకోశం సముత్పాట్యాదాయ స్వర్ణాని కీర్తిమాన్ ।

---

మునట్లు పుష్పములజల్లుచుండిరి- ౨౮- రాజగు నాదేవలుని నగరప్రవేశోత్సవమందు బెత్తములచేతబూనియుండు సేవకులతనియెదుట నడ్డమెవరు నిలువకుండవిశాలముచేయుచుండిరి బ్రాహ్మణులందఱు స్వస్తివచనములు చెప్పుచుఁగూడవచ్చిరి - ౨౯ - అప్పుడాపట్టణమందలి స్త్రీలందఱు నితనిఁజూచుచుండఁగా వారికలువలఁబోలినకన్నులకాంతి యతనిమీఁదవ్యాపించుచుండఁగా నతఁడును బురోహితులును మంత్రులు నంతఃపురము ప్రవేశించిరి-౩౦- అప్పుడాయంతఃపురమందు విజయ వాద్యములు మ్రోగఁగా దేవలుఁడు సంతుష్టాంతరంగుండాయెను అంత నామంత్రిశ్రేష్ఠులందఱు దివ్యములగుపుణ్యతీర్థముల నెల్లరావించి దినములగ్నము మొదలగు వానిశుద్ధివిచారించి యతనికభిషేకము నతిసంతోషముతోఁ జేయించిరి ఇట్లుపట్టాభిషేక మహోత్సవము బొందిన యాదేవలుఁడు తనచుట్టునిలుచున్న పౌరులతోఁగూడి యింద్రుఁడు దేవతలతోఁగూడియున్నప్పుడెట్లు ప్రకాశించునో యాప్రకారము ప్రకాశించెను - ౩౨ - ఇట్లారాచకుమారులును మంత్రులును దేవలునకు రాజ్యాభిషేకముచేసి మిక్కిలి సంతోషముతో మ్రొక్కి రాజముద్ర నతనిచేతనిచ్చిరి తరువాత నారాజ్యము సంవత్సరమున కారుకోట్ల వరాలెత్తునని తెలియఁజేసిరి - ౩౪ - మఱియు నాదేశమందలి మర్యాదలను రాజుకొఱకు నారు తెలియఁజేసిరి రాజైన యాదేవలుఁడు తనపట్టాభిషేకమైన వెంటనే యా రాజ్యమందు నూఱగ్రహారములు శివభక్తులకు దానముచేసెను - ౩౫ - మిక్కిలి కీర్తిగలవాఁడును ధైర్యవంతుఁడగు

బ్రాహ్మణేభ్యః పాఠకేభ్యో గాయకేభ్యస్తథైవచ ॥ ౩౬ ॥ జాత్యంధబధిరా
దిభ్యో దత్వా సౌసమతోషయత్ । తతస్సర్వాంత్సమాహూయ స్వదేశ్యాన
ధికారిణః॥ ౩౭॥ ఆశ్వాస్య దేవలః ప్రీత్యా ప్రేషయామాస యత్రతే । తస్య
దేవలరాజస్య చత్వారో మంత్రిపుత్రకాః॥ ౩౮॥ సుబుద్ధిః కార్యదక్షశ్చ నీతి
మార్గ దీర్ఘదర్శనః । ఉదూఢ రాజ్యభారాస్తే రాజ్ఞోహర్షం ప్రచక్రిరే॥
౩౯॥ నారదః॥ ఆమోదపట్టణస్యాభూత్సునాభాఖ్యోహియోనృపః । భద్ర
బాహుసుతఃపూర్వం తేజస్వీ పటువిక్రమః॥ ౪౦॥ కీదృశం తస్య చారిత్రం ప్ర
భావఃకఃపితామహ । కిమర్థం దత్తవాన్రాజ్యం దేవలాయనృపాత్మజః॥ ౪౧॥
అదాపయత్కథంశంభుస్తద్రాజ్యం దేవలాయవై । ఎతద్విస్తరతస్తాత కృ
త్స్నం మేవక్తుమర్హసి॥ ౪౨॥ బ్రహ్మా॥ వక్ష్యామ్యామోదరాజస్య సునా
భస్యకథాం శుభాం । తతస్సునాభో ధర్మాత్మా గత్వాదేవలసంనిధిం॥ ౪౩॥

---

నా దేవలుడు బొక్కసము దెఱచి యందున్న వారల నెత్తుకొని వేదశాస్త్ర
ములు చదువుచున్న బ్రాహ్మణులకును సంగీతము పాడెడువారికి పుట్టు గ్రు
డ్డు వాండ్రకును చెవిటివాండ్రకు నింక దీనులుగానుండు వాండ్రకెల్లనిచ్చి వా
రలసంతోషపఱచెను - ౩౬ - అంతట దనదేశమందధికారములలోనియోగింప
బడియుండు వారినెల్ల రావించి యతిప్రేమముచేత నూరడించి మరల వారు
వారుండు చోట్లకు వారివారి నంపెను ఆ దేవలరాజునకు సుబుద్ధి కార్యదక్షుం
డు నీతిమంతుండు దీర్ఘదర్శనుండని నలుగురు మంత్రిపుత్రులుగలరు వారు
సమస్తరాజ్యకార్యములనెల్ల నతిజాగ్రత్తతో నిర్వహించుచు రాజునకు సం
తోషము కలుగ జేసిరి - ౩౯ - ఇట్లుబ్రహ్మచెప్పఁగా నారదుడడుగుచున్నాడు
ఈదేవలుండు పట్టాభిషేకము నొందక మునుపా పట్టణమందు భద్రబాహు
నికొడుకును నాభుండనువాఁడు మిక్కిలి పరాక్రమముగలవాఁడై తేజస్సుగల
వాఁడై ప్రభుత్వముచేయుచుండెఁగదా - ౪౦ - అతనినడవడియెట్టిది అతనిప్ర
భావమేమాత్రము ఆ రాజపుత్రుఁడు దనరాజ్యమునేల దేవలుని కొఱకిచ్చెను
ఈశ్వరుడెట్లు దేవలునికొఱకా రాజ్యము నిప్పించెను ఈ వృత్తాంతమునెల్ల
సవిస్తరముగ నాకుఁజెప్పుమో బ్రహ్మదేవుఁడా - ౪౨ - అని నారదమహాముని
యడుగఁగా బ్రహ్మచెప్పందొడంగె ఆ మోదపట్టణమునకుఁ బ్రభువుగా ను
న్న సునాభునియొక్క కథనుజెప్పెద విను మది మిక్కిలి మంగళకరము అంత
నారాజగుసునాభుడు దేవలునిసమీపమునకుఁబోయిమిక్కిలిసంతసించిన మన

సంప్రహృష్టమనారాజా రాజానం వాక్యమబ్రవీత్ । స్వామిన్ దేవలభూపాలసర్వజ్ఞామితవిక్రమ॥ ౪౪॥ సాధయా మోవయం దేవాజ్ఞాం మహ్యాం దాతుమర్హసి । ఏవముక్తస్సునాభేన దేవలో విస్మయాన్వితః ॥ ౪౫ ॥ ఉపధావ్యచరాజానమిదంవచనమబ్రవీత్ । కుతోగమిష్యతేరాజన్ సునాభక్షత్రియవర్షభ॥ ౪౬॥ అహోహికిమేతదనఘ స్థాస్యామోవయమత్రవై । మయాసహ మహారాజ వర్తస్యాస్మిన్నృపోత్తమ॥ ౪౭॥ దేవలేనైవముక్తస్తు సునాభః పునరబ్రవీత్ । స్థాతుం నయోగ్యం రాజేంద్ర గమనే రోచతేమనః॥ ౪౮॥ తత్ప్రసాదేన సంతీర్ణో మయాస్తరశ్శాపసాగరః । సాధయామి మహాబాహో అనుజ్ఞాతస్త్వయానఘ॥ ౪౯॥ ఏవముక్తే సునాభేన దేవలో విస్మయంగతః । ప్రపఛతస్యచారిత్రం సునాభస్య మహాత్మనః॥ ౫౦॥ ఆశ్చర్యం మహదాప్నోతి మానసం మేనృపవర్షభ। శప్తః కేన మహాబాహోశాపస్యానుభవఃకుతః॥౫౧॥ తదహం శ్రోతుమిచ్ఛామి వక్తుమర్హసి తత్వతః । ఏవముక్తోదేవలేన సునాభో

---

స్సుగలవాఁడై రాజుగావచ్చిన దేవలునితో నిట్లనియె - ౪౩ - ఓయి సర్వము తెలిసిన మిక్కిలి పరాక్రమముగల దేవలభూమిపాలుఁడా స్వామీ దేవుఁడా మేము పోయెదము నాకు సెలవీయవలయును ఇట్లాసునాభుఁడు చెప్పగావిని దేవలుఁడాశ్చర్యపడి యారాజునకు దగ్గిరఁ బోయి యొకమాట చెప్పెను ఓ క్షత్రియోత్తముఁడవైన సునాభుఁడా యేలపోయెదవు నిర్మలుఁడవగు నీవిపుడు చెప్పెడి విషయ మాశ్చర్యకరముగా నున్నది మనమిక్కడనే యుందము నీవు రాజశ్రేష్ఠుఁడవు మిక్కిలి యదృష్టవంతుఁడవు నాతోగూడ నిక్కడనేయుందము - ౪౭ - ఇట్లు దేవలుఁడు చెప్పగావిని సునాభుఁడు మరలనుత్తరముచెప్పెను- ఓరాజ రాజా యింకమీదనుండఁగూడదు గమనమునే మనస్సుకోరుచున్నది-౪౮- సాంబశివునియనుగ్రహముచేతదాటఁగూడనిశాపసముద్రముదాటఁబడెను కాబట్టి నీవుత్తరువు దయచేసినట్టయినఁబోయివచ్చెదనయా మహాభుజబలవంతుఁడా- ౪౯ - ఇట్లాసునాభుఁడు చెప్పఁగా దేవలుఁడాశ్చర్యపడి మహానుభావుఁడైనయాసునాభునికథను దనకుజెప్పుమని యతనినడిగెను- ౫౦ - ఓ రాజ శ్రేష్ఠుఁడా నామనస్సు మిక్కిలి యాశ్చర్యమును బొందుచున్నది నిన్నెవఁడుశపించెనోయి మిక్కిలి భుజబలముగల వాఁడా శాపమునేల యనుభవింపవలసి వచ్చెను - ౫౧ - దానినంత నేను వినగోరెదను యథార్థము చెప్పవలయును ఇట్లుదేవలునిచేతఁ జెప్పఁబడి యారాజపుత్రుఁడైన సునాభుఁడు తన

నృపనందనః॥ ౫౨॥ స్వపూర్వ వర్తనం రాజ్ఞే తద్వక్తు ముపచక్రమే । సునా
భః॥ శ్రుణుదేవల రాజేంద్ర యత్పృష్టం చత్వయానఘ ॥ ౫౩ ॥ అహంగంధ
ర్వరాజస్య సుతో రుక్మరథస్యతు । వీర్యవాన్ సత్యవాదీచ తేజోరాశి స్తపోని
ధిః॥ ౫౪॥ శ్రీమాన్ మమపితారాజన్ విఖ్యాతో భువనత్రయే । మయూర్యాం
జనితస్యాస్య వసూనామష్టమేనహి ॥ ౫౫ ॥ తస్యా భూత్పట్టణం రమ్యం మ
హేంద్రగిరికందరే । హేమప్రాకారనిలయం వజ్రవైడూర్య మంటపం॥ ౫౬॥
అనూపం సర్వభోగాఢ్యం లక్ష్మీవర్ధనసంజ్ఞికం । తత్రమే పాలయన్నాస్తే పి
తా గంధర్వసత్తమాన్ ॥ ౫౭॥ తస్య రుక్మరథస్యాసీ ద్గృహిణీ పద్మకోమలా॥
పారిజాతాద్రినాథస్య తనయా హేమమాలినః॥ ౫౮ ॥ యం జిత్వా దత్తవాన్
తస్య పుత్రీం మజ్జనకఃప్రభుః । తస్యాం రుక్మరథేనాహం జనితో రాజసత్తమ॥
౫౯॥ సునాభేనైవముక్తేతు దేవలో మునిసత్తమ । చారిత్రం తత్పితుర్హృష్ట

---

మునువటి వృత్తాంతమును రాజయిన దేవలుని కొఱకుఁ జెప్పనారంభించెను సునాభుఁడు చెప్పుట యెట్లనిన ఓరాజ శ్రేష్ఠుఁడైన దేవలుఁడా నిష్కల్మషుఁడా నీవడిగిన దేదికలదో దానిఁ జెప్పెదవినుము- ౫౩- నేను రుక్మరథుఁడను గంధర్వరాజుయొక్క కొడుకను మాతండ్రియైన రుక్మరథుఁడు వీర్యముగలవాఁడును యథార్థముపలుకువాఁడును తేజస్సంపన్నుఁడును తపస్వియును సకల సంపదలు గలవాఁడునని మూఁడులోకములయందు ఖ్యాతిజెందినవాఁడు అష్టవసువులలో నెనిమిదవ వసువులుచేత మయూరియందుఁ బుట్టింపఁబడినవాఁడు మాతండ్రి యట్టిమాతండ్రికిసుందరమైనపట్టణము మహేంద్రపర్వతము యొక్క గుహాయందుండెను ఆపట్టణముయొక్క కోటలిండ్లు బంగారముచేఁ గట్టఁబడినవి మంటపములన్ని వజ్రమణులచేత వైడూర్యములచేతఁ గట్టఁబడియుండును జలప్రాయముగాను సమస్తభోగములు గలదిగాను లక్ష్మీవర్ధనమను పేరుగలదిగానుండు నాపట్టణమందు మాతండ్రి గంధర్వశ్రేష్ఠుల నెల్లఁ బాలించుచుండెను- ౫౭- అట్టిమాతండ్రియైన రుక్మరథునకుఁ బద్మమువలెఁ గోమల దేహము గలుగుటంజేసి పద్మకోమలయనుపేరుగల భార్యయొక తెకలిగియుండెను పారిజాతపర్వతమందుఁ బ్రభుత్వమును బొందియున్న హేమమాలియొక్క కొమారితె యామె ఆ హేమమాలిని జయించి యతని కొమార్తెయైన పద్మకోమలను మాతండ్రి యెత్తుకొనివచ్చెను ఆపద్మకోమలయందు మహాప్రభువైన యారుక్మరథునిచేఁ గలిగినవాడనోయి రాజ శ్రేష్ఠుడా యెను-

శ్లో॥ పితుకామోబ్రవీదిదం॥ ౬౦॥ సాధూక్తం పురుషవ్యాఘ్ర చరితం తే పితుస్త్వహ। పితుస్తే విక్రమం రాజన్ వదరుక్మరథస్యమె॥ ౬౧॥ శ్రోతుమిచ్ఛామితత్సర్వం విస్తరాద్దృష్టమానసః। మయూర్యాం సమహాబాహు ర్వసునాజనితః కథం॥ ౬౨॥ బ్రహ్మ॥ ఇతిపృష్టో దేవలేన సునాభోహర్షపూరితః। కథయామాసతాతస్య చరితం దేవలాయవై॥ ౬౩॥ సునాభః॥ శ్రూయతాం పురుషవ్యాఘ్ర పితూరుక్మరథస్యమె। ఉపాఖ్యానం మహాబాహో మత్తోద్యవై కథయిష్యతః॥ ౬౪॥ ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే - బ్రహ్మ నారదసంవాదే - ఉత్తరఖండే దేవాంగచరితే - దేవాంగపట్టాభిషేకోనామ తృతీయోధ్యాయః.

సునాభః॥ శ్రుణుదేవలరాజేంద్ర యత్పృష్టం చత్వయానఘ। పురాష్టమవసుశ్చైమాన్ సావిత్ర ఇతి విశ్రుతః॥ ౧॥ తేజోరాశి ర్మహాబాహుర్మహేంద్ర సమ విక్రమః। ప్రత్యహంస వసుర్భక్త్యా చంద్రమౌళిముపాసతె॥ ౨॥ సమహాదేవ సేవార్థం కైలాసం ప్రయయౌకదా। స్థ

---

టీ - ఓయినారదమహామునీ సునాభుఁడింతమట్టుకుఁ జెప్పఁగానే దేవలుఁడు సంతోషించి యతనితండ్రి కథనువినగోరి యొకమాటచెప్పెను- ౬౦ - ఓపురుషశ్రేష్ఠుఁడైన సునాభుఁడా యిప్పుడు నీవుమీతండ్రిసమాచారమునుజెప్పితివే యదిమిక్కిలి లెస్సగానున్నది కాఁబట్టి మీతండ్రియయిన రుక్మరథుని పరాక్రమమును నాకుఁజెప్పుమయ్యా - ౬౧ - అతనికథనువినను నాకుమిక్కిలిసంతోషము కలుగుచున్నది కాఁబట్టి యాకథనుసమగ్రముగా వినగోరుచున్నాను మయూరియందా మహానుభావుఁడు వసువుచేత నెట్లుకలిగెను- ౬౨- అని దేవలుఁడడుగఁగాసునాభుఁడుసంతోషభరితుడై తనతండ్రికథను దేవలునికొఱకుఁ జెప్పెను సునాభుడు చెప్పిన దెట్లనిన ఓపురుషశ్రేష్ఠుడా మహాబాహుబలముగలవాఁడా మాతండ్రియైన రుక్మరథుని కథనుజెప్పబోవుచున్నాను పరాకులేక వినవలయును - బ్రహ్మాండ పురాణంబున బ్రహ్మనారద సంవాదంబున నుత్తరఖండంబున దేవాంగచరితంబున దేవాంగపట్టాభిషేకమన్నదిమూడవయధ్యాయము.

ఇట్లాసునాభుఁడు దేవలునకు హెచ్చరిక చెప్పి యో దేవలుడానీవడిగినదానిజెప్పెదవినుమని చెప్పఁదొడంగె పూర్వకాలమం దష్టవసువులలో నెనిమిదవ వసువు సావిత్రుండని సకలలోక ప్రశస్తుఁడుగా నుండెను అతఁడు తేజస్సుల ప్రోవు గొప్పభుజములుగలవాఁడు మహేంద్రునితో సమానమైన పరాక్రమముగలవాఁడు. ఇట్టి యాయెనిమిదవ వసువు ప్రతిదినము మిక్కిలి భక్తిచేతఁ బాల

గితం సర్వరత్నైశ్చ కోటీరం సూర్యసన్నిభం ॥ ౩ ॥ బిభ్రాణో హారకేయూ
రకంకణై రప్యలంకృతః । విమానం వరమాస్థాయ జగామ రజతాచలం॥ ౪॥
తతః కైలాసగోత్రస్య పత్యకాయాందదర్శనః । సరోవరం మనోహారి చం
ద్రపుష్కరనామకం॥ ౫॥ జిఘృక్షు స్తత్రపద్మాని చాయయా హృష్టమానసః
సహస్రపత్రసంకీర్ణం రాజహంస నిషేవితం ॥ ౬ ॥ చక్రకారండ వాకీర్ణం
జలకుక్కుటసంకులం । మరందబిందు సందోహ పానమత్తాళి సంకులం ॥ ౭ ॥
శైవాలచికురాం పద్మ వక్త్రాం పద్మదళేక్షణాం । చక్ర స్తనీం బిసభుజాం సైక
తశ్రోణిశోభితాం॥ ౮॥ వసునారీమివాపశ్య దూర్మిమాలావిరాజితాం । శి
రీషైః పాటలైశ్చైవ చంపకై ర్వకులైశ్శుభైః ॥ ౯ ॥ పున్నాగై ర్మల్లికా
క్రాంత మాధవీశరసాలకైః । పనసై స్సప్తపర్ణైశ్చ పిప్పలీ పారిజాతకైః।
౧౦॥ అన్యైరపిద్రుమైః పుష్పఫల పల్లవశోభితైః । కోకిలాలాప సంకీర్ణైః

---

చంద్రుని దలనుధరించియుండు శివుని సేవించుచుండెను - ౨ - ఇట్టియావసు వొకానొకప్పుడు మహాదేవుని సేవింప గైలాసమునకుఁ బోఁ బ్రయాణమై సమస్తరత్నములుచెక్కి వేవెలుఁగువలెఁ బ్రకాశించుచున్న కిరీటమును ధరించుకొని మెడనుముత్యాలదండను భుజశిరస్సులయందు భుజకీర్తులను జేతులయందుఁ గంకణములనుధరించి యలంకృతుఁడై దివ్యమైనవిమానమునెక్కి వెండికొండకుఁబోయెను- ౪- అట్లుపోయినపిమ్మట నతఁడు కైలాసపర్వతముసమీపమునమనస్సునకింపైన చంద్రపుష్కరమనుశ్రేష్ఠసరస్సునుజూచెను- ౫- అంత నాసరస్సునఁ బద్మములగ్రహింప నిచ్ఛయించి సంతుష్టాంతరంగుండై యాసరస్సుదగ్గిరకుఁబోయెను - ఆసరస్సునందు వేయిరేకులుఁగల తామరపువ్వులమితముగానున్నవి నలుప్రక్కల రాజహంస లీదులాడుచున్నవి చక్రవాకపక్షులు కల్నేటిపక్షులు వ్యాపించియున్నవి నీరుకోళ్లమితముగా నున్నవి తుమ్మెదలందలికమలములలోని మకరందముద్రావి మదించి ఝుంకారములుచేయుచుమూఁగుచుండును- ౭- నాచుపాచి తలవెండ్రుకలవలె నుండును కమలములుముఖమునవలెనుండును కమలముల రేకులు కన్నులవలె నుండును చక్రవాకపక్షులు స్తనములవలెనుండును తామరతూండ్లు భుజములవలె నుండును ఇసుకదిన్నెలు పిఱుదులవలె శోభాకారములుగానుండును అలలె యుంగరములుగాఁ బ్రకాశింపఁజేయుచుండును గాఁబట్టి యాకొలఁకునుజూచినవారికది స్త్రీవలెనొప్పి మిక్కిలిదర్శనీయముగానుండును దానిగట్లయందు దిరిసపుప్రూ

భృంగఝుంకారసంకులైః॥ ౧౧॥ అనేకపక్షినిలయై స్సాంద్రచ్ఛాయ విరాజి
తైః । ఆక్రాంతకూలమత్యంతం కృతదుర్గం మనోహరం॥ ౧౨॥ ఆక్రాంతసౌరభ
స్తస్మిన్ వనే మందానిలో వనే । వసుర్హర్షసమావిష్ట స్తత్తీరే క్షణమాసత॥
౧౩ ॥ తత స్తత్యాజపుష్పాణి బాణాన్యస్మిన్ మనోభవః । తేనవిద్ధ స్సమాశే
ణ ప్రాప్తవాన్ జ్వరముచ్ఛ్రితైః॥ ౧౪॥ విలలాపభృశంతత్ర సావిత్రో దీనచేతనః।
ఆహతోస్మి కుతో మార మాంత్వం ప్రహరపేరుషా॥ ౧౫॥ ఏతేన పల్లవానూనం
నారాచా స్తెసు తేజసః । భృశప్రజ్వలితాంగారా భృంగధూమాకులాశ్శితాః॥
౧౬ ॥ శాణసంఘర్షసంజాత మారబాణ జ్వలత్కణాన్ । పరాగాన్మయికిం
వాయో పాతయత్యదయో భవాన్ ॥ ౧౭॥ బాణాః పుష్పమయా మార నహి

---

కులును పాటలవృక్షములును సంపంగిచెట్లును మనోహరములైన పొగడచె
ట్లును బొన్నచెట్లును మల్లెతీగలు బండిగురుగింజతీగలు నల్లియుండు నేపిచెట్లును
బనసచెట్లు నేడాకుల యరటిచెట్లును బిప్పలవృక్షములును పారిజాతవృక్ష
ములును మఱియుఁ బలు తెఱఁగుల చెట్లు పూచి పండి చిగిరించియుండఁగా వాని
లోఁ గోకిలలు కూయుచుండఁగాఁ దుమ్మెదలు ఝుంకారములు చేయుచుండఁ
గా ననేకపక్షులు గూండ్లుగట్టుకొని వాసముచేయఁదగి దట్టమగు నీడలు గలిగి
యాకొలఁకునం దెవరు దిగుటకు దారిలేకుండ నాక్రమించి యతి మనోహరము
గనొప్పుచుండును- ౧౨- అట్టియావనమందు మిక్కిల పరిమళము నాక్రమిం
చుకొని తెచ్చుచు మందమారుతము విసరఁగా నావసువు సంతోషముతోఁ గూ
డినవాఁడై దానిగట్టున నొకక్షణముండెను - ౧౩ - అంతమన్మథుఁడు వసువు
మీఁదఁ బుష్పమయములైన బాణముల నేయఁదొడఁగెను ఆవసువిట్లు మన్మథు
నిచేత దెబ్బలుపడి యధికమయిన కామజ్వరమును బొందెను- ౧౪- ఇట్లక్కడ
జ్వరమును బొందిన సావిత్రుఁడను వసువు మన్మథుఁడా నన్నేలయింతకోపము
తోఁ బ్రహరించెదవయ్యా చచ్చినవాఁడనైతినని విలపించెను- ౧౫- ఓమన్మ
థుఁడా యీచెట్లలోనుండునవి చిగుళ్లుకావు యథార్థముగా నీబాణములో
యిచక్కఁగామండిన నిప్పులోయి యీతుమ్మెదలు పొగలోయి యతితీక్ష్ణము
లోయి- ౧౬- ఓవాయువా నీవేల యిట్లదయుఁడవై సానయందొరయుటచే
తఁగలిగిన మన్మథబాణములనుండి రాలెడి నిప్పతునుకలైన పరాగములను నా
మీఁదఁ జల్లెదవు- ౧౭- ఓకాముఁడా నీబాణములు పుష్పవికారములని లోకమం
దుఁ జెప్పుకొనుమాట సత్యముకాదోయి యిఁక నేమనఁగా వజ్రమయములు

తేవజ్రసన్నిభాః । భిందంతిమమగాత్రాణి దహంత్యనలవద్భృశం ॥ ౧౮ ॥ ఇత్థం సుసం తపన్ రాజన్ సావిత్రో భృశకామితః । దదర్శబహిర్ణీంతత్ర సంచరంతీమితస్తతః॥ ౧౯॥ తాం శాంబరీప్రభావేణ చక్రేయువతిమాత్మనః । రమతేస్మ తయాసాకం మూఢాత్మా వసురాదరాత్ ॥ ౨౦॥ తస్యాం జాతో మహాతేజాః కుమారోభాసయన్ దిశః । సాపూర్వరూప మాస్థాయ చచార వనమంగనా॥ ౨౧॥ విమానె సతమారోప్య కృతకామోవసుస్తతః । త్రివిష్టపం సమాసాద్యదదౌపత్న్యైస్సుతంముదా ॥ ౨౨ ॥ నామ్నారుక్మరథశ్చేతివిఖ్యాతస్సురాదిభిః । మహేంద్రాద్రిం తపస్తప్తుం జగామసయువాతతః ॥ ౨౩ ॥ తస్మిన్మహేంద్రగోత్రేంద్రె శుచిభూర్త్వా ప్రయత్నతః । బ్రహ్మాణం లోకకర్తారముద్దిశ్యచసతప్తవాన్ ॥ ౨౪॥ నియమేపరమేస్థిత్వా తతోరుక్మరథోబలీ । తపసాకర్శయామాస దారుణే నవవుస్స్వకం॥ ౨౫ ॥ తతః ప్రసన్నోభగవాన్ బ్రహ్మలోక పితామహః । సర్వభూతైరవధ్యంత్వం దదౌ రుక్మరథాయవై ॥

---

నా దేహమునుజించుచునగ్నివలె మిక్కిలి దహించుచున్నవి - ౧౮ - ఓరాజా ఆసావిత్రుఁడీ ప్రకారమా మన్మథబాణములచేత సంతాపమును బొందుచునచ్చటివనమందీవలనావలసంచరించుచున్న యాడనెమలినిఁజూచెను - ౧౯ - ఆవసువు మాయలునేర్చినవాఁడు గనుకఁ దనమాయా ప్రభావముచేత నానెమలిని దనకు యౌవనవతియైన స్త్రీగాఁజేసికొని మూఢబుద్ధిగలవాఁడై యతి ప్రేమమువల్లనా పెతోఁగ్రీడించుచుండెను- ౨౦- అంతనా పెయందుమహాతేజస్సంపన్నుఁడై తనప్రకాశముచేత దిక్కులనెల్ల వెలిగించుచు నొకకొమారుఁడు పుట్టెను ఆపె తనమునుపటిరూపమునుబొంది వనమందుసంచరింపదొడంగెను- ౨౧- అంతనావసువాబిడ్డనియందాసచేత విమానమందాబిడ్డనిఁబెట్టుకొని స్వర్గమునకువచ్చి తనభార్యలకుసంతోషముతోనిచ్చెను- ౨౨- పిమ్మట నాచిన్నవానికి దేవతలుమొదలగువారు రుక్మరథుడని పేరుపెట్టిరి తరువాతనతఁడు పెద్దవాఁడై తపస్సుచేయను మహేంద్రపర్వతమునీదికిఁబోయెను - ౨౩ - ఆమహేంద్రపర్వతమందుఁజేరి మిక్కిలి పరిశుద్ధుఁడై యెల్లలోకములను సృజించునట్టి బ్రహ్మదేవునుద్దేశించి యత్నఁముప్రయత్నముతోఁ దపస్సుచేసెను - ౨౪ - అంతబలశాలియగునారుక్మరథుఁడు చొడ్డనియమమందునిలిచి ఘోరమైనతపస్సుచేతఁ దనదేహమునుశుగునట్లుచేసెను- ౨౫- అంతలోకములకుఁ బితామహుఁడైన బ్రహ్మదేవుఁ డనుగ్రహించినవాఁడై రుక్మరథుని కొఱకేభూతము

౨౬ ॥ చచారసర్వలోకేషు వరదానేనగర్వితః । ఏకదావిశ్వకర్మాణం గత్వా రుక్మరథోబ్రవీత్ ॥ ౨౭ ॥ కల్పయస్వపురం మేధ్య మహేంద్రాదౌమనోహరం । ఇత్యుక్తస్తేనభగవాన్ విశ్వకర్మారుషాకులః ॥ ౨౮ ॥ తిరశ్చకారతద్వాక్యంగర్హయామాసతంతదా । తతఃక్రుద్ధోమహాతేజాస్సావిత్రికోయ్యుద్ధముద్యతః॥ ౨౯ ॥ సచాపియుయుధేతేనవిశ్వకర్మామహాబలః । తతోరుక్మరథత్యక్తబాణైః కులిశసన్నిభైః ॥ ౩౦ ॥ ప్రపీడితో భృశంతంతు నశశాకసబాధితుం ॥ బ్రహ్మణో వరదానంచ జ్ఞాత్వాతస్య సుదుష్కరం ॥ ౩౧ ॥ చకార కిలసౌహార్దం త్వష్టాసావిత్రిణాసహ । మహేంద్రాద్రౌ తదారమ్యం కల్పయామాస పట్టణం ॥ ౩౨ ॥ హేమప్రాకారనిలయంవజ్రవైడూర్యతోరణం । అనూపం సర్వభోగాఢ్యం లక్ష్మీవర్ధన నామకం॥ ౩౩॥ సావిత్రిః పాలయామాస తత్రగంధ

---

లచేతను జావకుండునట్లు వరమిచ్చెను - ౨౬ - అంతనారుక్మరథుండుదనకుబ్రహ్మవరమిచ్చెనని గర్వించి యెల్లలోకములయందు సంచరించుచుండెను - ఒకానొకప్పుడతండువిశ్వకర్మ బ్రహ్మదగ్గరకుబోయి యతనితో నొకమాట చెప్పెను- ౨౭ ( అదియేమనిన నోవిశ్వకర్మా నాకిపుడు మహేంద్రపర్వతమందు సొగసైన పట్టణమొకటి గట్టుమనెను ఇట్లు రుక్మరథుండు చెప్పంగా భగవంతుండగు నావిశ్వకర్మ మిక్కిలి కోపముతోం గూడినవాండై యతనిమాటను దిరస్కరించి యప్పుడతని నిందించెను అంత మహాపరాక్రమసంపన్నుండగు నాసావిత్రవసువు కొడుకుకోపగించినవాండై యుద్ధముచేయనుద్యుక్తుండాయెను- ౨౯- ఆవిశ్వకర్మ మహాబలముగలవాడు గావున నతనితో యుద్ధముచేసెను - తరువాత నారుక్మరథుండేయు బాణములు వజ్రతుల్యములు గావున నా విశ్వకర్మ వానిచేత మిగులనొప్పింపంబడి యారుక్మరథుని దానొప్పింపం జాలండాయెను మఱియు నావిశ్వకర్మ యారుక్మరథున కెట్లెవనికి నసాధ్యుండగునట్లు బ్రహ్మవరమొసంగినదయినమును దెలిసి యంతనాతనితో స్నేహముచేసికొనెను అప్పుడు విశ్వకర్మ బ్రహ్మ యతనికి మహేంద్ర పర్వతమందు మనోహరమైన పట్టణమునుగట్టియిచ్చెను- ౩౨- ఆపట్టణముకోటలు బంగారముతోం జేయంబడిన విబహిద్వారములు వజ్రవైడూర్యములచేతం జేయంబడినవి మఱియు నాపట్టణము జలప్రాయముగాను సర్వ భోగములు కలదిగా నుండెను దానిపేరు లక్ష్మీవర్ధనము- ౩౩- సావిత్రవసువు కొడుకా పట్టణమందుండి గంధర్వశ్రేష్ఠులం బాలించెను అతండుబలముచేతంగావరించియున్న రాక్షసులను యుద్ధము

ర్వసత్తమాః । యేనశూరేణవిక్రమ్యసంగరేబలదర్పితాః ॥ ౩౪ ॥ నిహతా
రాక్షసారాజన్ శతశోథ సహస్రశః । సురా రాక్షస యుద్ధేచ సహాయం
యమునాసతే॥ ౩౫॥ సచైకదా రుక్మరథః పారిజాతంయయౌబలీ । గంధర్వై
ర్బహుభిస్సార్థం మృగయాసక్తమానసః ॥ ౩౬ ॥ తత్రాపశ్య స్మహాభాగ
స్సరోవరమనుత్తమం । దదర్శతస్మిన్ క్రీడంతీం సఖీజనసమావృతాం ॥ ౩౭ ॥
సర్వలక్షణసంపన్నాం నారీంకాం వైద్యుతప్రభాం । దృష్ట్వా రుక్మరథశ్శీఘ్రం
తామాసాద్యమహాబలః॥ ౩౮ ॥ పప్రచ్ఛసాంత్వయన్ తాం వై కాత్వం బాలేసు
లక్షణే । కింనామకస్యదుహితా తన్మమాచక్ష్వసుందరి॥ ౩౯॥ ఇతిపృష్టాతతో
బాలా వ్యాజహారవచోమృదు । అహంగంధర్వరాజస్య తనయా హేమమా
లినః ॥ ౪౦ ॥ అత్రైవ వర్తతేసోయం విలాస నగరేశుభే । శ్రుణుగంధర్వరా
జేంద్ర నామమే పద్మకోమలా॥ ౪౧॥ ఇత్యుక్త్వా సావరారోహా సఖీభిఃప్రయ
యౌపురం । తతోరుక్మరథశ్శ్రీమాన్ తస్యాంసంసక్తమానసః ॥ ౪౨ ॥ అమా

---

దుబరాక్రమించి నూర్లతరబడి వేలతరబడిగాజంపెనోయి దేవలుడా దేవతలు రాక్షసులతో యుద్ధములఁజేయు సమయమం దతనిసహాయముగారమ్మని ప్రార్థింతురు - ౩౫ - బలవంతుఁడైన యారుక్మరథుఁడొకానొకప్పుడు వేటాడ నాసక్తిగలవాఁడై పెక్కు గంధర్వులతోఁ గూడి పారిజాత పర్వతమునకుఁ బోయెను - ౩౬ - అపర్వతమం దదృష్టవంతుడైన యారుక్మరథుడు సరస్సులలోనెల్ల నతిమనోహరముగఁ బ్రకాశించునట్టి కొలఁకునుగనెను అందుచెలులతోఁగూడిక్రీడించుచున్నట్టియుసమస్తములయినశుభలక్షణములతో నొప్పుచున్నట్టియు మెరుపుతళుకుమన్నట్లు వెలుగుచున్న యొకానొకస్త్రీని జూచెను చూచి మిక్కిలి బలముగల యారుక్మథుఁడు శీఘ్రమున నాపెదగ్గిరబోయి యాపెను బుజ్జగించుచునడిగెను అది యెట్లనఁగానో మంచి లక్షణములుగల బాలికా నీవెవతెవు నీపేరేమి నీవెవని కూతురవు నాకీవిషయములను దెలుపవేసౌందర్యవతీ - ౩౯ - ఇట్లతఁడడుగఁగా నాబాలికవిన్న దనముదోఁపఁబలికెను నేను హేమమాలియను గంధర్వరాజుకూతురను - ౪౦ - మాతండ్రియైన హేమమాలి యిచ్చటనే మంగళకరమగు విలాస పట్టణమందున్నాఁడు ఓగంధర్వరాజశ్రేష్ఠుఁడా వినుము నాపేరు పద్మకోమలయందురు- ౪౧- ఇట్లుచెప్పి యాగంధర్వకన్య చెలులతోఁడఁ దనపట్టణమునకుఁ బోయెను అంతనాసకలసంపదలుగల రుక్మరథుఁడుపద్మకోమలయందు దగిలినమనస్సును మరలింపఁ జాల

త్యాన్ప్రేషయామాస సన్నిధిం హేమమాలినః। గత్వావిలాసనగర మమా
త్యాస్తేవిచక్షణాః॥ ౪౩॥ హేమమాలినమాసాద్య వ్యాజహ్రుర్భర్తృభా
షితం। హేమమాలీ తతశ్శ్రుత్వా తద్వాక్య మ్మత్తవిగ్రహః॥ ౪౪॥ ఉవాచగ
ర్హణాయ త్తం వాక్యంతన్మంత్రిణ స్తదా। కుయోనిజస్యయుష్మాకం రాజ్ఞోమే
తనయాంశుభాం॥ ౪౫॥ కథం దాస్యామిచామాత్య దేవగంధర్వకాంక్షితాం।
కథంయుష్మాక సదుర్బుద్ధిః ప్రేషయామాస మేంతికం॥ ౪౬॥ స్వయం వరా
ర్హాంమేకన్యాం నదాస్యామిహకస్యచిత్। ఏవముక్త్వా హేమమాలీ ప్రే
షయామాసతాం స్తతః॥ ౪౭॥ తత స్తేమంత్రిణస్సర్వమూచూరుక్మరథాయవై।
తతఃక్రుద్ధోమహాతేజా వాక్యం రుక్మరథోబ్రవీత్॥ ౪౮॥ విలాసపట్టణంచాద్య
భస్మసాన్మమసాయకైః। కరిష్యామిచగాత్రాణి ఛేత్స్యామిస్వర్ణమాలినః॥
౪౯॥ ఇత్యుక్త్వారథమారుహ్యతత్పురంత్వరితంయయౌ। తతస్సశింజినీనాదం
కృత్వా శత్రుభయంకరం॥ ౫౦॥ సమరాయాహ్వయామాస కుపితో హేమ
మాలినం। తదాగమనమాజ్ఞాయ హేమమాలీరుషాన్వితః॥ ౫౧॥ సంనద్ధోనిర్గ

---

కహేమమాలిదగ్గిరికిఁ దనమంత్రులనంపెను విద్వాంసులగు నామంత్రులా వి
లాస నగరమునకుఁబోయి యాహేమమాలినిఁజూచి యతనితోఁ దమప్రభువు
చెప్పిన సమాచారమునుజెప్పిరి - ౪౩ - కావరించిన యొడలుగల హేమమా
లివారుచెప్పినమాటవిని యామంత్రులతో నిందతోఁగూడినమాట నుత్తరము
పలికెను ఆమాటయేదనిన- ఓమంత్రులారా కుత్సితయోనియందుఁబుట్టినమీ
ప్రభువునకు మిక్కిలిసౌందర్యముగలిగి దేవతలచేత గంధర్వులచేతఁ గోరఁబడి
న నాకూతునెట్లీగలను ఆదుష్టబుద్ధిగల మీప్రభువు మిమ్మునెట్లునాసమీపమున
కుఁబంపెను - ౪౬ - స్వయంవరముచేయుటకుఁదగిన నాకూతునెవ్వనికిని నే
నూరక యీను అని యిట్లుచెప్పి నాహేమమాలివచ్చిన మంత్రులను మరల
వచ్చినత్రోవనుబంపెను- ౪౭- అంత నామంత్రులుపోయి యా సమాచారము
నంత రుక్మథునికొఱకుఁ జెప్పిరి - పిమ్మట మహాపరాక్రమముగల రుక్మరథుఁ
డామాటలకుఁ గోపగించినవాఁడై వారలతోనిట్లనిపలికెను- ౪౮ - ఇప్పుడావి
లాసపట్టణమును నాబాణములచేత భస్మాధీనముగాఁ జేయుదును హేమమా
లి యంగములనుఛేదింతును - ౪౯ - ఇట్లు చెప్పిరథమునెక్కి బిరబిరనాపట్టణ
మునొద్దకుఁ బోయెను అంత శత్రువులకు హృదయభేదముచేయునట్లా రుక్మర
థుఁడల్లెత్రాటిని శబ్దింపఁజేసి కోపగించి యాహేమమాలిని యుద్ధముకొఱకుఁ

తచ్ఛీఘ్రంయుద్ధాయకృతనిశ్చయః । తావుభౌచమహావీర్యౌచక్రతుఃకదనంమ
హత్ ॥౫౨॥తతోరుక్మరథోత్సృష్టైఃకాలదండోపమైశ్శరైః।సంతాపితోహే
మమాలీ మూర్ఛితోనిపపాతహ॥ ౫౩॥ తతస్సతస్మై శైత్యోపచారాన్ చక్రే
మహామతిః । తతోజ్ఞాత్వాహేమమాలీ దృష్ట్వారుక్మరథంస్థితం॥ ౫౪॥ ఉపచా
రాన్ప్రకుర్వంతం హృష్టోవాక్యమథాబ్రవీత్ । సాధుసాధుమహాభాగ తవరు
క్మరథాద్యమే॥ ౫౫॥ పుత్రికాంతు ప్రదాస్యామి గృహాణ సురసత్తమ । ఇత్యు
క్త్వాసస్వర్ణమాలీతం సమాధాయమహామతిః ॥ ౫౬ ॥ పురం ప్రవేశయామాస
హృష్టోరుక్మరథంతతః । దదౌతస్మైకుమారీంతాం ప్రేమ్ణావై పద్మకోమలాం॥
౫౭॥ తతోరుక్మరథఃప్రీతస్తయాసాకంమహాబలః । లక్ష్మీవర్ధనమాసాద్య వర్త
తేపూర్వవత్తలు ॥ ౫౮ ॥ తస్మాద్రుక్మరథాద్రాజన్ సాసాధ్వీ పద్మకోమలా ॥
మాం ప్రాసూత స్వర్ణకేతురితి నామమమాభవత్ ॥ ౫౯ ॥ సోహంకదాచి

---

బిలుపించెను అతని రాకనెఱింగి హేమమాలి కోపగించుకొన్నవాఁడై సన్నా
హముచేసుకొని యుద్ధముచేయ నిశ్చయించుకొని శీఘ్రముగా బయలుదేరి వ
చ్చెను మిక్కిలి పరాక్రమముగల యారుక్మరథ హేమమాలులిద్దరు పెద్దయు
ద్ధముచేసిరి- ౫౨- అంతనారుక్మరథుఁడు కాలదండముతోసమానములైన బా
ణములనేయ నాహేమమాలి యాబాణములచేత సంతాపమునుబొంది మూ
ర్ఛపోయిక్రిందఁబడెను- ౫౩- అప్పుడు మహాబుద్ధిశాలియయిన యాహేమమా
లికారుక్మరథుఁడునకుశైత్యోపచారములుచేసెను అంతనాహేమమాలి మూ
ర్ఛదెలిసి తనకుపచారములుచేయుచున్న రుక్మరథునిఁజూచి సంతసించి యతని
తోనొకమాటచెప్పెను ఓ మిక్కిలి యదృష్టవంతుఁడైన రుక్మరథుఁడా మంచి
మంచి యిప్పుడు నాకూతు నీకిచ్చెద దేవశ్రేష్ఠుఁడా గ్రహింపుము అనియిట్లు
చెప్పిమిక్కిలి బుద్ధికౌశలముగల యాహేమమాలి హర్షించినవాఁడై యత
నిసమాధానపఱచిపట్టణములోపలికిఁ బిలుచుకొనిపోయెను పిమ్మటపద్మకోమల
యను తనకూతునతనికిఁ బ్రీతితోనిచ్చెను- ౫౭- అంతరుక్మరథుఁడుసంతసించి
నవాఁడై యాపెతోఁగూడ లక్ష్మీవర్ధనమనుతనపట్టణమునుబొందిమునుపటివ
లెనేయుండెను - ౫౮ - ఓరాజా - ఆరుక్మరథునివలన నామహాగుణవతియగు
పద్మకోమల నన్నుఁగనెను నాకు స్వర్ణకేతువని పేరుగలిగెను- ౫౯- ఇట్టి నేనొ
కానొకప్పుడు నాభార్యయయిన చిత్రరేఖతోడ విమానమునెక్కి కైలాసపర్వ

భ్రాజేంద్రభార్యయా చిత్రరేఖయా । విమానం వరమాస్థాయగతః కైలాస
భూధరం ॥ ౬౦ ॥ తత్కందరేరహః కేళీ పరావాస్తాం శివావనే । అజ్ఞాత్వా
తదహంతత్ర ప్రవిష్టోవనమధ్యమే॥ ౬౧॥ దృష్ట్వామాం శంకరఃక్రోధా దిదం
వచనమబ్రవీత్ ॥ శ్రీశివః ॥ కిమర్థమిహదుర్బుద్ధే ఆగతోऽస్మదంతికం ॥
౬౨ ॥ మచ్ఛాపాత్త్వం త్యక్తమహిమామానుషంయోనిమావిశ । ఏషాతేగృహి
ణీసాపా త్వత్పత్నీ భవిష్యతి ॥ ౬౩ ॥ ఇతిశప్త శ్శంకరేణ వేపమానో భృశం
తతః । ప్రార్థయన్ పార్వతీనాథమపృచ్ఛంశాపమోచనం ॥ ౬౪ ॥ భగవన్
దేవదేవేశ పార్వతీశ దయానిధే । అస్యశాప సముద్రస్య పారం కల్పయ శం
కర ॥ ౬౫ ॥ కేనవాశామ్యతేశాప వహ్నికీలావదప్రభో । ఇతి సంప్రార్థిత
శ్శంభు మాంజగా దాథదేవల ॥ ౬౬ ॥ శ్రీశివః ॥ లోకోపకరణార్థాయ
యదా చోత్పాద్యతేమయా । దేవాంగ ఇతివిఖ్యాతో మునిరాడ్వీతకల్మషః॥
౬౭॥ సముభూత్వాపురాధ్యక్షో యదాయాస్యతి తేంతికం । తదానిర్ముక్తక

---

తమునపుంబోతిని- ౬౦- ఆపర్వతగుహాయందలి వనమందుఁ బార్వతీపరమేశ్వరులు రహస్యక్రీడసలుపుచుండిరి నేనా వయినము దెలియక యావనమధ్యమునకుఁ జొచ్చినవాఁడనైతిని- ౬౧- శివుడు నన్ను జూచి కోపమువలన నొకమాటపలికెనదియేదనిన- శివుఁడుచెప్పెడిమాటయిది-దుష్టబుద్ధియిప్పుడునాసమీపమునకేలవచ్చితివి- ౬౨- నాశాపమువలననీమహిమనెల్ల విడిచిమనుష్యయోనిని బ్రవేశింపుము నీపెండ్లామైన యీపెయు నట్లేమనుష్యస్త్రీయై నీకుభార్య కాఁగలదు- ౬౩- ఇట్లు శంకరునిచేతను శపింపఁబడినవాఁడనై యంత మిక్కిలి వడఁకుచు పార్వతీపతినిఁ బ్రార్థించుచు శాపము నాకెప్పుడేవిధమునవిడుచునో యానయిన మడిగితిని- ౬౪- భగవంతుఁడా దేవదేవుల కీశ్వరుఁడా పార్వతీపతీ దయానిధీ ఇప్పుడు తాము నన్ను శపించితిరే యీశాపమను సముద్రమున కొకయంతమును గల్పింపుమయా శంకరుఁడా- ౬౫- ఓ సర్వకార్యసమర్థుఁడా యీశాపమను నగ్నిజ్వాల దేనిచేతఁ జల్లాఱునో దానిఁ జెప్పుమయ్యా- అనియిట్లు నేను బ్రార్థింపఁగాఁ దరువాత శంకరుఁడు నాతోఁ జెప్పెనోయి దేవలుఁడా - ౬౬ - శంకరునిమాట- నేను లోకములనుపకారముచేయుటకు నిప్పాపుఁడై దేవాంగుఁడని ప్రసిద్ధికెక్కిన మునివర్యు నెపుడుసృజింతునో అతఁడు నీపట్టణమునకుఁ బ్రభువై యెప్పుడు నీదగ్గిరికి వచ్చునో అప్పుడునీపాపమంతయుఁబోయి నీవీశాపమువలన విమోచనమును బొందగలవు-

లుప శ్శాపాదస్మాద్విమోక్ష్యసె ॥ ౬౮ ॥ ఇత్యుక్త్వా శంకరో దేవ్యా తత్రై
వాంతరధీయత । సోహమామోదరాజెనెందుమత్యాం భద్రబాహునా ॥ ౬౯ ॥
ఉత్పాదితస్సునాభోయ మితినామాకరోత్పితా । ఏషాకలావతీనామ్నా కాశి
రాజస్యనందనీ ॥ ౭౦ ॥ పత్నీమమ మహాబాహో కారితాభద్రబాహునా
ఏతత్తె కథితంసర్వ మాఖ్యానం మమవిస్తరాత్ ॥ ౭౧ ॥ త్వత్ప్రసాదేన భగ
వన్ సంతీర్ణః శ్శాపసాగరః । బ్రహ్మా ॥ సునాభ స్తత ఇత్యుక్త్వా తత్పత్నీచ క
లావతీ ౭౨ ॥ విసృజ్యమానుషాదేహా దివ్యరూపధరావ్రభా । దివ్యం విమా
నమాస్థాయ దివ్యస్రగ్భూషణాన్వితౌ ॥ ౭౩ ॥ ఆశ్వాస్య దేవలం ప్రీత్యాయ
యతుస్తౌ స్వమాలయం । తద్దేహయోర్దేవలోపి కారయామాస సత్క్రి
యాం ॥ ౭౪ ॥ ఏతత్తెకథితంసర్వం సునాభచరితంశుభం । పరంతు యత్తువక్ష్యా
మి శ్రుణుతన్మునిసత్తమ ॥ ౭౫ ॥ ఇతిశ్రీబ్రహ్మాండపురాణే - బ్రహ్మనారదసంవాదే-
ఉత్తరఖండె దేవాంగచరితె - సునాభోపాఖ్యానంనామ చతుర్థోఽధ్యాయః.

---

౬౮ - ఇట్లుచెప్పినమ స్తలోకములకుశుభకరుఁడై శివుఁడు పార్వతితోఁడ నచ్చ
టనేయంతర్హితుఁడాయెను అంతనేనామోదపట్టణమునకుఁ బ్రభువైనభద్ర
బాహువనువానిచేత వానిభార్యయగు నిందుమతియందు జనించితి నాతండ్రి
యయిన భద్రబాహువు నాకుసునాభుఁడని పేరుపెట్టెను కాశిరాజుకూతురై
నకలావతియనునది యీపె మాతండ్రియగు భద్రబాహువీపెను నాకుబెండ్లి
చేయించెను ఇదినావృత్తాంతము నావృత్తాంతమును యావత్తునీతోఁజెప్పితిని-
౭౧ - నీయనుగ్రహమువల్ల నేనుశాపమను సముద్రమునుదాటితిని - సునాభుఁ
డుదేవలునితోనిట్లుతనవృత్తాంతమంతయుఁజెప్పి యంతనాసునాభుఁడతని భా
ర్యకలావతియును మనుష్యదేహములనువిడిచి యిద్దఱు దివ్యదేహములనుధరిం
చి దేవలోకములయందుఁ బోఁదగినవిమానమునెక్కి కల్పవృక్షముల పువ్వుల
దండలచేత నలంకారమును బొంది సంతోషముతో దేవలునకూరటఁజెప్పి త
మనివాసమునకుబోయిరి అంత నాదేవలుఁడును వారల యిద్దఱ దేహములకు
నౌర్ధ్వదైహిక సంస్కారమును జేయించెను - ౭౪ - ఓనారదుఁడా సునాభు
నిచరిత్రమిట్టిది దీనినీకు సాంగముగఁజెప్పితి నిదిమిక్కిలిశుభదాయకము ఇఁకబి
మ్మటివృత్తాంతమేదిగలదో దానిఁ జెప్పెదవినుము - ౭౫ - ఇదిబ్రహ్మాండపురా
ణంబున - బ్రహ్మనారద సంవాదంబున - నుత్తర ఖండమున - దేవాంగచరితం
బున - సునాభోపాఖ్యానమన్నది నాలవయధ్యాయము.

బ్రహ్మ॥ తతస్స దేవలశ్శీఘ్రమార్యా మంత్రీ నాహూయసత్వరం । వస్త్ర నిర్మాణచతుర ఇదం వచనమబ్రవీత్ ॥ ౧॥ మయాతువస్త్రనిర్మాణం కర్తవ్యంశీఘ్రమేవహి । వయనస్యోపకరణాన్యా హార్తవ్యానిమంత్రిణః ॥ ౨ ॥ తదహంమేరుమాసాద్యా గమిష్యామిచ సత్వరం । మహాత్మా తత్రవై త్వాష్ట్రో వర్తతేహిమయఃప్రభుః ॥ ౩ ॥ తేనోప కరణాన్యస్య వయనస్య విచక్షణాః। ఆగమిష్యామిచాదాయ సహసా నీతికోవిదాః॥ ౪॥ దేవలేనైవముక్తాస్తు మంత్రిణో జగదుశ్చతం ॥ మంత్రిణః ॥ వయమప్యాగమిష్యామ స్త్వయాసాకమిహానఘ ॥ ౫ ॥ చతురంగబలోపేతై రస్మాభిశ్చ సహప్రభో । గంతుమర్హసిభద్రంతే అస్మాకం బుద్ధిరీదృశీ ॥ ౬ ॥ నచైకేనత్వయారాజన్ గంతవ్యంహి మహామతే । వయమప్యనుయాస్యామో నాత్రకార్యా విచారణా॥ ౭॥ ఏవముక్తోమాత్యవర్యై ర్దేవలః పునరబ్రవీత్ । నచైవం ఖలువక్తవ్యం శ్రుణుధ్వంభాషితంమమ॥ ౮॥ ఇదం రాజ్యం ప్రశాసంతో వర్తధ్వం నీతికోవిదాః । ఆగతే

---

బ్రహ్మదేవుఁడా పిమ్మటికథను నారదునికిఁ జెప్పుచున్నాఁడు - తరువాత నా దేవలముని వస్త్రములనేయనేర్పరియై యతివేగముతోఁ దనమంత్రులను బిలిచి యిట్లనియెకమాట వారలతోఁ జెప్పెను- ౧- మంత్రులారా నేను వేగిర వస్త్రములనేయవలయునుగనుక వస్త్రమునునేయుటకు సాధనములను దెచ్చికోవలయును- ౨- కాబట్టి నేనుద్వరితముగా మేరుపర్వతమునకుఁబోయి మరలవచ్చెదను విశ్వకర్మకొమారుఁడగు మహానుభావుఁడైన మయుఁడక్కడ ప్రభువై యున్నాఁడుగదా - ౩ - నీతిశాస్త్రపండితులైన యోమంత్రులారా నేనక్కడికిఁబోయి యతనిదగ్గిరనుండి నేయుటకుసాధనములనుదీసికొని శీఘ్రముగ వచ్చిచేరెదను- ౪- ఇట్లు దేవలముని చెప్పఁగా నామంత్రులు మరల నాదేవలమునిని గూర్చి యిట్లనిరి మంత్రులుచెప్పెడిదేమన్నను- ఓనిష్కల్మషుఁడా మేమునునీతోఁగూడవచ్చెదము-౫-ఏనుగులుగుఱ్ఱములురథములుకాలుబలములతోఁ గూడిరాఁగామాతోఁగూడ మీరుపోవలయును అట్లైనమేలు- మాకిట్లుతోచుచున్నది-౬-మిక్కిలిబుద్ధిగలయోదేవలమహారాజామీరుపరివారరహితులరై పోవుటయుక్తముకాదుకాఁబట్టిమేముమీవెంటవచ్చెదము ఈవిషయమందేమియు నాలోచింపఁబనిలేదు- ౭- ఇట్లు మంత్రివర్యులుచెప్పఁగా నామాటలువిని దేవలుఁడువారితో మరలనిట్లనిపలికె-ఇట్లుమీరుచెప్పఁగూడదునామాటవినుఁడు- ౮- మీరురాజనీతియందు మిక్కిలివిద్వాంసులరుకావున నీరాజ్యమునుబాలిం

షు భవత్సవద్య శాస్త్రోకోవాత్రవిద్యతే ॥ ౯ ॥ తస్మాన్నరోచతేహ్యద్య యు
ష్మదాగమనంమమ । అహమాదాయసామగ్రీంవయస్యమహాప్రభోః॥ ౧౦॥
ఆగమిష్యామిసహసాయూయంవర్తధ్యమత్రవై । ఇత్యమాత్యాన్నివర్త్యార్థ
థపరివారాంశ్చదేవలః ॥ ౧౧ ॥ స్వయమేవమహావీర్యో గమనాయ మతిందధే । తతోమహేషుధిం ధృత్వా చాపహస్తః ప్రతాపవాన్॥ ౧౨ ॥ జగా
మసహసామేరు మేకఏవ మహాబలః । తతోదదర్శపథ్యేష గార్గ్యస్యాశ్ర
మముత్తమం॥ ౧౩ ॥ తద్దర్శనోత్సుకశ్శీఘ్రమాససాదతపోధనం । గార్గ్యం
తపస్వినాం శ్రేష్ఠం నిర్మలజ్ఞానభూషణం॥ ౧౪॥ ప్రాప్తం దేవలమాజ్ఞాయ స
గార్గ్యోధర్మవిత్తమః । ఉపసృత్యచరాజానం వాక్యమేతదువాచహ ॥
౧౫ ॥ గార్గ్యః ॥ స్వాగతంతే మహాభాగ కుశలంఖలు దేవల । సుభిక్షంతవ
రాజ్యేచ జనానాంచసుఖంఖలు॥ ౧౬॥ ఇతిపృష్టస్సగార్గ్యేణ దేవలోవాక్య

---

పుచుండును మీరునాతోఁగూడవచ్చినపక్షమందిచ్చటరాజశాసనముజరిగిం
చువాఁడెవఁడున్నాఁడు-౯-కాఁబట్టిమీరాకయిప్పుడు నాకుయుక్తముగాఁదోచ
దాయెను నేనుబోయి మహానుభావుఁడైన మయునివలననేలకువలయుసామగ్రి
నిదీసికొని శీఘ్రముగవచ్చిచేరుదును మీరలిచ్చటనే నిలిచియుండుఁడు అనియి
ట్లుచెప్పిమంత్రులనుబరిజనములనుదనతోఁడరాకుండమరల్చి మహావీర్యుఁడగు
నాదేవలుఁడు తాను మాత్రమే పోవనిశ్చయముచేసెను- ౧౧- అంతఁబరాక్ర
మవంతుఁడగునతఁడు విల్లుచేతఁబట్టుకొని పెద్దయంబులపొదిధరించుకొనిమిగు
లబలముగలవాఁడుగనుక నొకఁడె మేరుపర్వతమునుగూర్చిపోయెను పోవునపు
డతఁడుమార్గమందుగార్గ్యమహాముని యాశ్రమమతిరమణీయముగనుండ
గాదానిఁజూచెను- ౧౩- అంతశ్రీమంతుఁడగు నతఁడా గార్గ్యులజూడనుద్యు
క్తుఁడై తపస్సును ధనమును సంపాదించునట్టియు ఋషివర్యుఁడైనట్టియు ని
ష్కలంకమగు తెలివియేతొడవుగాఁగలగార్గ్యునిఁగూర్చిపోయెను-౧౪- ఇట్లు
పోఁగా నాగార్గ్యుఁడు మిక్కిలి ధర్మము దెలిసినవాఁడు గావున దేవలునిరాక
నెఱిఁగి యాదేవలరాజును జక్కఁగాఁ బూజించి యిట్లనిపలికెను - ౧౫ - గా
ర్గ్యుఁడు చెప్పినమాట- ఓ మిక్కిలి యదృష్టవంతుఁడా నీవువచ్చునపుడు దా
రియందు నీకుక్షేమమా ఓదేవలుఁడా నీకుఁగుశలమేకదా నీరాజ్యమందు సు
భిక్షమేకదా జనులకందఱకు క్షేమమేకదా- ౧౬- ఇట్లు గార్గ్యుఁడడుగఁగా
దేవలుఁడుత్తరము చెప్పెను - ఓ తపస్సనుధనమును సంపాదించిన గార్గ్యుఁ

మబ్రవీత్ । కుశలం నోహిసర్వేషాం త్వత్ప్రసాదా త్తపోధన ॥ ౧౭ ॥ సుభిక్ష
మపిరాజ్యంచ వర్తతేహిసదానఘ । ఇతిశ్రుత్వా తస్యవాక్యం గార్గ్యో వై
హర్షమావిశత్ ॥౧౮॥ తేనపృష్టస్సగార్గ్యోపియథాన్యాయమభాషత।తతః
సప్రచ్ఛగార్గ్య స్తం దేవలంతపతాంవరః ॥ ౧౯ ॥ కుతోగమిష్యతేరాజన్ హే
తుశ్చాగమనేత్రకః । పరిత్యక్తపరీవారో గచ్ఛసిత్వం కుతోనఘ॥ ౨౦॥ ఇతిపృ
ష్టస్సగార్గ్యేణాకథయత్సర్వమేవతత్ । తతోగార్గ్యో దేవలాయచ కారా
తిథ్యమాదరాత్ ॥ ౨౧॥ తత్రాసౌరజనీంనీత్వా ఇష్టాలాపైశ్చదేవలః । కృతా
హ్నికక్రియః ప్రాతః గార్గ్యానుజ్ఞాపితో యయౌ॥ ౨౨॥ వివిధాన్ విషయా
న్నదీ వతిక్రమ్య మహాబలః । ప్రవివేశసకాంతారం ఘోరంనిర్మానుషంతతః॥
౨౩ ॥ సింహశార్దూలభేరుండఖడ్గమృగసంకులం । లులాయద్వీపభూయి
ష్ఠం భల్లూకశరభాకులం॥ ౨౪॥ వారాహగవయాకీర్ణం చమరీ వ్యాఘ్రము
చ్చకైః । కురంగయూథైర్బహుభిర్వ్యాప్తంగోపుచ్ఛసంకులం॥ ౨౫॥ అన్యై

---

డా మీయనుగ్రహమువలన మాకు క్షేమమునకు దక్కువలేదు - ౧౭ - మారాజ్యమును సర్వకాలము సుభిక్షముగానే యున్నదయా మహానుభావా అనియిట్లు దేవలుడు చెప్పగా నాగార్గ్యమహాముని మిక్కిలి సంతోషము నొందెను - ౧౮ - అంత దేవలుడా గార్గ్యుని యోగక్షేమము నడుగగా నతడును దగురీతి నుత్తరముపలికెను పిమ్మట దాపసశ్రేష్ఠుడగు నాగార్గ్యుడు దేవలునినడిగెను- ౧౯- అతడడిగిన దేమనగా ఓరాజా నీవెక్కడనుండియిట వచ్చుటకు గారణమేమి మహానుభావుడా నీపరివారమును విడిచి నీవుమాత్రమేల పోయెదవు- ౨౦- ఇట్లు గార్గ్యుడా దేవలునడుగగా నతడెల్ల వృత్తాంతముల నమ్మునికెఱుగించెనంత నాగార్గ్యమహామునిప్రీతితో నతనికాతిథ్యమొనరించెను- ౨౧- అంతనా దేవలుడతని తోనిష్టములగుసల్లాపములుసలుపుచు నారాత్రిగడపి మఱుచటిదినము ప్రాతఃకాలమం దాహ్నికక్రియల నచ్చటనే చేసికొని గార్గ్యుని సెలవునుబొంది యచ్చటనుండి బయలువెడలిపోయెను- ౨౨- అట్లుపోవునపుడు మహాబలుడగు నతడనేకవిధములగు దేశములను గొండలనుదాటి పిమ్మట భయంకరమును మనుష్యసంచార రహితమగువనమును బ్రవేశించెను - ౨౩ - ఆవనమందు సింహములు పెద్దపులులు ఖడ్గమృగములుగండభేరుండపక్షులు నడవియావులు నెద్దులునులేళ్లునుగుంపులుగానుండును - దున్నపోతులు నడవియేనుగులు నెలుగుబంట్లు శరభములునిం

శ్చబహుభిశ్చైవ శ్వాపదైర్వ్యాప్తముచ్ఛ్రకైః । అనేకద్రుమసంకీర్ణం గు
ల్మకుంజాదిదుర్గమం॥ ౨౬॥ నానాపక్షిగణాకీర్ణం ఝిల్లీరావసమాకులం।
సింహగర్జితవిత్రాసం కౌశికారావభీకర॥ ౨౭॥ తతోగచ్ఛత్తతోమాని మ
హారణ్యేతిదుస్తరే। తతస్సింహో మహాకాయో జ్ఞాత్వా వాయు వశాద
ముం ॥ ౨౮ ॥ సముత్ప్లుత్యోర్ధ్వధృతసటఃక్షిప్త సర్వాలముచ్ఛ్రకైః। గర్జన్ వ్యా
త్తాననోదంష్ట్రా రోచిఃప్లిష్టవిలిరస్వనే ॥ ౨౯ ॥ అభిదుద్రావవేగేనజిఘాంసుర్దే
వలంహరిః। తతోదృష్ట్వా దేవలోపి ధనురుద్యమ్య వీర్యవాన్ ॥ 30 ॥ మృగేం
ద్రం మర్దయామాస సాయకై రగ్నిసన్నిభైః। ఆవిధ్యతంమహేష్వాస స్సిం
హాసింహపరాక్రమః ॥ 3౧ ॥ పునర్వ్యాధభల్లాభ్యాంఫాలదేశే మృగోశితుః।
సోతివిద్ధో బలవతా మృగరాడ్భృశవిహ్వలః ॥ 3౨ ॥ జగర్జాశనిసంపాతం స
ర్వస్మాదతిభీకరం। తతస్సుదేవలః క్రుద్ధశ్శరైస్సున్నతపర్వభిః ॥ 33 ॥ తద్వ

---

ఘకొనియుండును అడవిపందులు గవయమృగమును చమరీమృగములు మిక్కిలివ్యాపించియుండును దుప్పలు మిక్కిలిగానుండును- కొండముచ్చులు మెండుగాఁగలవు మఱియు ననేకక్రూరమృగములు వ్యాపించియుండునా వనమత్యున్నతముగానుండును నానావిధములగు వృక్షములా వనమంతయుఁ గ్రమ్ముకొనియుండును పొదలు పొదరిండ్లు మెండుగానుండును అనేకములగు పక్షిసంఘములచేత వ్యాప్తము ఝిల్లికానాదములచే నితరశబ్దములు వినబడును సింహములుగర్జింపగా గుడ్లగూబలు గూయఁగా భయంకరమైయుండును- ౨౭- ఇట్లు మిక్కిలి భయంకరమగు నామహారణ్యమందా దేవలముని ప్రవేశించెను ప్రవేశించిపోఁగా నందుండు పెద్దసింగమొక్కటి వాసనఁబట్టి యాదేవలుని రాకనెఱిఁగి గంతువేసి మెడమీదిజూలునిగుడదోకపైకెత్తుకొని యావనమంతయు దనకోరలకాంతి వెదచల్లునట్లు నోరుతెఱచి గర్జించెను - ౨౯ - ఇట్లుగర్జించియాసింహము దేవలునిఁజంపనిచ్ఛగలదై వేగముతో నతనిమీదికిఁ బరుగెత్తెను అంత దేవలుఁడునుఁ దానిఁజూచి ధనుస్సునెత్తుకొని పరాక్రమము నవలంబించినవాఁడై నిప్పువంటి బాణములచేత నాసింహమును గొట్టెను ఇట్లుకొట్టి పెద్దధనస్సునుబూని సింహమువంటి పరాక్రమముగల యాదేవలుఁడు మరల రెండుబాణములచేత నాసింహము నొసటఁగొట్టెను ఇట్లు బలవంతుఁడగు నాదేవలునిచేత నాసింహము మిక్కిలి దెబ్బలుపడి దేహమందుబలముడిగి పిడుగుబడి నట్లుల్ని ధ్వనులకంటె భయంకరముగఁ గొప్పెను అంత దేవలుఁడు మిక్కిలి

త్రిం పూరయామాస నిషంగస్థేనవీర్యవాన్ । పునరేకేనభల్లేన కంఠదేశేజఘానహ ॥ ౩౪ ॥ తేనసింహోగతప్రాణ ఉద్గిరన్రుధిరంబహు । శ్రోత్రనేత్రాస్యకుహరైః పపాతధరణీతలే ॥ ౩౫ ॥ తతఃపుష్పకమారుహ్య దివ్యగంధానులేపనః । దివ్యస్రగ్భూషణోపేతో దదృశేపురుషోమహాన్ ॥ ౩౬ ॥ తం దృష్ట్వా విస్మయావిష్టోదేవలోవాక్యమబ్రవీత్ । కోభవాన్ పురుషవ్యాఘ్ర వృత్తాంతఃకిముతేనఘ ॥ ౩౭ ॥ మహాన్మే విస్మయోజాత స్తన్మే వద మహామతే । దేవలేనైవముక్తస్తు సచైనం నిజగాదహ ॥ ౩౮ ॥ సాధుపూతోస్మి రాజేంద్ర వ్యతరంశాపసాగరం । కృతకృత్యోస్మిధన్యోస్మి త్వత్తోహంఖలుపావన ॥ ౩౯ ॥ వక్ష్యామిమమవృత్తాంతం శ్రుణుత్వంరాజసత్తమ । యస్మాచ్చిరం నిమగ్నోహం దుస్తరేశాపసాగరే ॥ ౪౦ ॥ త్వయాహిగమితఃపార మిదానీం పుణ్యమూర్తినా । తస్మిన్నేవం బ్రువాణేతు దేవలఃపునరబ్రవీత్ ॥ ౪౧ ॥ కస్త్వం పురుషశా

---

కోపగించుకొని శ్రేష్ఠములగు బాణముల దానిమోమునిండనేసి మరలఁదనయమ్ములపొదియందొక బాణమునెత్తి దానికంఠమునకుఁ బట్టికొట్టెను- ౩౪- ఆదెబ్బచేత నాసింహము ప్రాణముపోయి చెవులలోను గన్నులలోను నోటను నమితముగానెత్తురుగ్రక్కుచు నేలబడెను- ౩౫- అంత నంతరిక్షమందుఁ బుష్పకవిమానారూఢుఁడై దివ్యమైనస్రక్గంధము దేహమందలఁదికొని దివ్యములగు పూలదండలచేత నలంకృతుఁడై యొకమహాపురుషుఁడుగానఁబడెను - ౩౬ - ఆపురుషునిఁజూచి దేవలుఁడాశ్చర్యమునొంది యతనితోనిట్లని యడిగెను ఓ పురుషశ్రేష్ఠుఁడా నీవెవఁడవు నీసమాచారమేమోయి మహానుభావా - ౩౭ - నిన్నుఁజూడఁగా నాకుమిక్కిలి యాశ్చర్యముకలుగుచున్నది కాబట్టి నీవృత్తాంతమును నాకుఁజెప్పవలయును అనియిట్లు దేవలుఁడడుగఁగా నావిమానమందలిపురుషుఁడు దేవలునిఁగూర్చి యుత్తరము చెప్పెను- ౩౮- ఓరాజశ్రేష్ఠుఁడా లెస్స నేనుబరిశుద్ధుఁడనైతిని - శాపమను సముద్రము నిన్నాళ్లకుదాటితిని ఓ పవిత్రుఁడా నీవలనఁగదా నేను గృతకృత్యుఁడనై ధన్యుడనైతిని- ౩౯- ఓరాజశేఖరుఁడా దేనివలన నేనిన్నాళ్లుగడవఁగూడనిశాపసముద్రమందు మునిఁగియుంటినో యావృత్తాంతమును జెప్పెదవినుము - ౪౦ - మహాపుణ్య శరీరుఁడవగు నీచేతఁగదా నేనాశాపసముద్రమునుగడచితిని అనియిట్లు విమానస్థ పురుషుఁడు చెప్పుచుండగా దేవలుఁడుమరలనతనితోనిట్లనియెను- ౪౧- ఓపురుషశ్రేష్ఠుడా నీవెవఁడవు నీవృత్తాంతమును నాకుజెప్పుము నామనస్సు మిక్కిలి యాశ్చ

దూతలవృత్తాంతం కథయస్వ తే । విస్మయేన సమావిష్టం తం త్వం శీఘ్రం వ్యాహో
హాయ ॥ ౪౨ ॥ స దేవ లేనైవ ముక్త స్స్వ వృత్తాంత మథాబ్రవీత్ ॥ యక్షః ॥
శ్రేణు రాజేంద్ర సర్వంచ ఉపాఖ్యానం మమ ప్రభో ॥ ౪౩ ॥ అహం కుబేరాను
చరో యక్షో నామ్నా కపింజలః । ఏకదాహం మహాబాహో మృగయాస
క్తమానసః ॥ ౪౪ ॥ అనేక యక్షసహితో విశం కాననముత్తమం । అనేక శ్వా
పదాన్ హత్వా సంచరామ్యత్ర కాననే ॥ ౪౫ ॥ కృష్ణసార స్తతో రాజన్ సామీ
ప్యే దదృశే మయా । దృష్ట్వా మాం స మృగస్తూర్ణం దుద్రావ భయపీడితః ॥
౪౬ ॥ కాలేన ప్రేరితో హంచ వేగేనాథ తమన్వగాం । తస్మిన్ ప్రదవతి కాంతారే
నుమద్రావ పునః పునః ॥ ౪౭ ॥ స లక్ష్యం చన బాణస్య లగతి స కథంచన । మయా
విద్రావ్యమాణస్తు దుద్రువే చాతిరంహసా ॥ ౪౮ ॥ తతో రోషేణ మహతా మ
యా ముక్తో మహాన్ శరః । నిఖాత స్తత్రికే బాణ స్స బాణోపి యయౌ పునః ॥
౪౯ ॥ స చాశ్రమం గతః శీఘ్రం గౌతమస్య మహాత్మనః । ఏతస్మిన్నంతరే కాలే

---

ర్యముతోఁ గూడియున్న దని శీఘ్రముగా నాయాశ్చర్యమును బోఁగొట్టవలయు
ను- ౪౨- ఇట్లు దేవలుఁడనుగగా నాయక్షుఁడు దనవృత్తాంతమును జెప్పనా
రంభించెను యక్షుఁడు చెప్పెడుమాట - ఓ రాజరాజా నాకథను జెప్పెదఁ బరా
కులేక వినుమయ్యా- ౪౩- నేనుగుబేరునకు స్నేహితుఁడగు కపింజలుఁడను య
క్షుఁడను- ఒకానొకప్పుడు నాకు వేఁటాడవలయునని యిచ్ఛపుట్టెను- ౪౪- అంత
నేననేకులగు యక్షులతోఁ గూడి యొక పెద్దయడవియందుఁ బ్రవేశించి క్రూరము
లగు పలుమెకములఁ జంపి యాపిమ్మట నాయడవియందింక వేఁటాడ దిరుగుచుంటి
ని- ౪౫- అంత నేను సమీపమందొక జింకను జూచితిని- ఆ మెకము నన్నుఁ జూచి మి
క్కిలి భయపడి శీఘ్రముగఁ బరుగెత్తెను- ౪౬- అంత నేనును దైవగతికిలోఁబడి
బిరబిర దాని వెంబడి తరిమితిని - ఆ యడవియందది పరుగెత్తుచుండగా
నేను వెంబడి విడలక పరుగెత్తితిని- ౪౭- ఎంతదూరము తరిమిన నామృగము నా
బాణము గురికిఁ దగలక తప్పిపోవుచువచ్చెను - నేనుదరమఁగా మిక్కిలి వేగము
తోఁ బరుగెత్తెను- ౪౮- అంత నాకు మిక్కిలి కోపము కలుగఁగా నొక పెద్దబాణ
ము దానిమీద విసరి కొట్టితిని - ఆ బాణముపోయి యాజింక వెన్నెముక క్రింద
నాటఁగా నాబాణముతోఁ గూడి యది మరలఁ బరుగెత్తెను - ౪౯ - అట్లు ప
రుగెత్తి యామృగము శీఘ్రముగా మహామహిముఁడగు గౌతమునియాశ్రమము
నకుఁ బోయెను ఆ సమయమున దాగౌతమమహాముని యచ్చటికి వచ్చెను- ౫౦-

తత్రాయాద్గౌతమో మునిః ॥ ౫౦ ॥ దృష్ట్వామృగం ద్రావ్యమాణం క్షరద్రక్త
మ్భయాతురం । నిఖాతబాణం మాంచైవానుధావంతం సకార్ముకం॥ ౫౧ ॥
దయాసుహృద్దరిణేమునిః క్రోధరక్తేక్షణోబ్రవీత్ । గౌతమః ॥ దురాత్మన్నా
శ్రమమృగమస్మాకం హంతుముద్యతః ॥ ౫౨ ॥ మమాశ్రమగతం బాలం పా
పాత్మన్ననుధావసె । తస్మాత్త్వం ఘోరకాంతారే సింహోభవ దురాస
దః। ౫౩॥ భక్షయన్బహుధా జంతూన్పాపాచారసమాకులః । ఇతిశప్తస్త
స్తేన గౌతమేనామితౌజసా॥ ౫౪॥ దేవలోనె భృశంత్రస్తో యాచేతం ప్రా
ర్థయన్మునిం । భగవన్మునిశార్దూల దయాంకురుమయిప్రభో॥ ౫౫॥ శా
పస్యాంతంవదశ్యామితన్మేవదదయానిధే । ఇత్యుక్తో గౌతమశ్శ్రీమాన్ మాము
వాచతపోనిధిః ॥ ౫౬ ॥ గౌతమః । శివస్యమానసశ్శ్రీమాన్ దేవాంగ ఇతివి
శ్రుతః । రక్షితాచాభిమానస్య తేజస్వీ పటువిక్రమః॥ ౫౭॥ సత్వాం మోచ

---

వచ్చి యాగౌతమముని నాచేఁ దరమఁబడుచు నెత్తురుగారుచు భయపడుచు
బాణము దేహమందు నాటఁబడియున్న యామృగమును దాని వెంబడివిల్లుచే
తఁబూనిదరుముచున్న నన్నుఁజూచి యామృగమందు దయగలవాఁడుగావున
నామీఁదికోపముచేతఁ గన్నులెఱ్ఱఁజేసుకొని నాతోనిట్లనెను- ఓదుష్టుఁడా మా
యాశ్రమ మృగమును జంపఁబూనితివేమిరా- ౫౨- ఓరిపాపాత్ముఁడా మా
యాశ్రమమందుఁ బసిబిడ్డవలె నుండెడి యామృగమును దరుముచున్నావు
గనుకనీవు భయంకరమగు నడవియందు సింహమవై యతిక్రూరముగ నుందు
వుగాక- ౫౩- అట్లుమృగరాజమవై యరణ్యమందలి జంతువులనెల్లఁదినుచుఁ
బాపములకుఁ బాత్రమవై యుండుము- అనియిట్లుగౌతమమునిచే శపింపఁబడి
దేవలమునియగు నతనివలన మిక్కిలి భయపడి యతనిఁ బెక్కుతెఱంగులం
బ్రార్థించి యిట్లనియడిగితిని - ఓమహానైశ్వర్యసంపన్నుఁడవగు మునిశ్రేష్ఠుం
డా నాయందు దయచేయుమయ్యా- ౫౫- ఇప్పుడు తాము శపించితిరే యీ
శాపము నాకెప్పుడుతీరునో దాని నెఱుఁగకయున్నాను దాని నాకుఁ జెప్పవల
యునయ్యా దయానిధీ. అనియిట్లు నేనడుగఁగా దపస్సంపన్నుండగు నాగౌత
ముఁడునాతోనిట్లనియె- ౫౬- గౌతమముని చెప్పినదేమనినను శివునకు మానస
పుత్రుఁడు దేవాంగుఁడని ప్రసిద్ధికెక్కినవాఁడును లోకముల నభిమానమును గా
పాడువాఁడును మహాతేజస్సంపన్నుఁడును మిక్కిలి పరాక్రమశాలియునై క
లఁగఁగలఁడు- ౫౭- అతఁడునిన్ను శాపమునుండితొలగించును. అతనిచేనీవుశా

యుతాశాపా త్తేనశాపాద్విమోక్ష్యసి । ఇత్యుక్త్వా సయయౌమాసీ సోహం సింహో భవంతదా ॥ ౫౮ ॥ చిరరాత్రాయ కాంతారే శాపదగ్ధసితఃఖలు త్వయాహంముక్తకలుషః పూతోస్మి పురుషర్షభ ॥ ౫౯ ॥ ఏతత్తేసర్వమాఖ్యాతం మామకంహిశుభాశుభం । ఇతస్సూత్తరదిగ్భాగేయోజనత్రయసంమితే ॥ ౬౦ ॥ ఆశ్రమో వామదేవస్య వర్తతేసు మనోహరః । ద్రష్టాసితం మహాబాహోతపోనిధిమృషిప్రభుం॥ ౬౧ ॥ ఇత్యుక్త్వాచతతోయక్ష స్తమాశాస్యత్వ నామయం । జగామస్వాలయం శీఘ్రం పరమానందసంకులం ॥ ౬౨ ॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - బ్రహ్మనారద సంవాదే - ఉత్తరఖండే దేవాంగచరితే - యక్షోపాఖ్యానంనామ పంచమోధ్యాయః.

తతస్సనహసాధీరో దేవలో మితవిక్రమః । అతిక్రమ్యచకాంతారం గంగామభజతాదరాత్ ॥ ౧ ॥ త్రిలోకపావనీందివ్యాం దురితాభ్రసమీరణాం। నిటలాక్షజటాజూట వాసినీం విశదప్రభాం॥ ౨॥ వ్యాప్తపాతాళనిలయాం బ

---

పమునుండి తొలఁగింపఁబడఁగలవు- అనియిట్లుచెప్పి యాగౌతమముని పోయెను నేనప్పుడుసింహముగానైతిని- ౫౮ - ఇట్లాశాపముచేతఁజెడి బహుదినములనుండి యీయడవియందుంటిని - ఓపురుషశ్రేష్ఠుఁడైన దేవలుఁడా నేఁడునీచేతనేనుబాపములవిడిచిపరిశుద్ధుఁడనైతిని- ౫౯ - ఇదినామంచిచెబ్బరదీనినంతనీకుఁజెప్పితినిగదా - ఇచ్చట కుత్తరదిగ్భాగమందుమూఁడామడలదూరమున వామదేవఋషి యాశ్రమము మిక్కిలి మనోజ్ఞమైయొప్పుచున్నది నీవటుబోయి నపక్షమునఁదపస్సులగని యగునాఋషిశ్రేష్ఠునిఁజూడఁగలవోయి యాజానుబాహుఁడవగు దేవలుఁడా- ౬౧- అనియిట్లుచెప్పి యాయక్షుఁడు దేవలునియనామయామలఁ దృప్తుఁడై యుండుమని మిగులనానందభరితాంతరంగుఁడై తననివాసస్థానమునుగూర్చివేగిరమునఁబోయెను-౬౨- ఇదిబ్రహ్మాండపురాణంబున బ్రహ్మనారదసంవాదంబున నుత్తరఖండంబున దేవాంగచరితంబున యక్షోపాఖ్యానమన్నది పంచమాధ్యాయము.

అంతధైర్యవంతుఁడై నట్టియు నపరిమితపరాక్రమముగల యాదేవలుఁడువేగముతో నాయడవిదాఁటి యాదరముతో గంగనుబొందెను- ౧- ఆగంగయెట్టిదనినముల్లోకములనుబవిత్రములుగాఁజేయునట్టిదియునాకాశమందుఁగలిగినదియుఁ బాపములను మేఘములకుఁ బెనుగాలివంటిదియు నొసటఁ గన్నుగల సాంబశివుని జడలముడియందునుండునదియు స్వచ్ఛమగుకాంతిగలదియుఁబా

వాయుయాదోగణాకులాం । ఊర్మిభిర్బహుభిః పుష్పహారై రివవిరాజితాం॥
౩॥ దర్శయద్భి స్తత్రతత్ర మూర్ధ్నానం జలజంతుభిః । పవిత్రీకృత పాపానాం
లోకానామితి శంసితాం॥ ౪ ॥ యస్యాస్స్మరణమాత్రేణ జనోనిముక్త కల్మ
షః । యాత్యంతేవైష్ణవంలోకం సర్వసౌఖ్యావహం ధ్రువం॥ ౫॥ యాంప
శ్యేత్పావనీం లోకో వృజినాగ్ని శిఖాం శుభాం । ప్రయాతిపరమంస్థానం సంద
గ్ధవృజినేంధనః॥ ౬॥ యస్యాస్స్నాయాత్సుపుణ్యాంభః పూరేదురితకర్శనే ।
పాతకాన్యతిఘోరాణి బ్రహ్మహత్యాదికానిచ॥ ౭॥ స్పృష్టుం నశక్నువంత్యే
నంతప్తాయః ప్రాణినోయథా । వసేత్త్రిరాత్రి మాత్రంతు యస్యాస్తీరేను
పావనే॥ ౮॥ దహ్యంతే స్నానపానాభ్యాం బహిరంత స్తమోవ్రజాః । నైక
జన్మకృతంపాపం తతోయచ్చకరిష్యతే॥ ౯॥ తత్సర్వం నాశయిత్వాస్య దదా
త్యంతేపరాంగతిం । యస్యాస్తోయైఃపుణ్యమయై స్తర్పయేతపితౄన్యది॥ ౧౦॥

---

తాళలోకమందువ్యాపించినదియు ననేకములగుజలజంతువులచేతవ్యాపింపఁబ
డినదియుఁ బెక్కలలు గట్టుకువిసరుచుండఁగాఁ బూలదండలచేత నలంకరింపఁబ
డినట్లుండునట్టిదియు నచ్చటనచ్చటఁదలలనగపఱచుచున్న జలజంతువులచేతఁ
బాపముచేసిన జనులకీగంగ పరిశుద్ధిని గలుగఁజేయునని చెప్పునట్లున్నదియుఁ
గానున్నది- ౪- మఱియు నాగంగను స్మరించుటచేత నేమనుష్యులు దమ పాప
ములనన్నిటిఁ బోఁగొట్టుకొని దేహావసానమందు సకలసౌఖ్యాకరమై శాశ్వత
మైయుండు విష్ణులోకమునుబొందుదురు- ౫- పాపములకగ్నిజ్వాలవలె నున్నట్టి
యు శుభములకాధారభూతయగు నాగంగనుజూచి నట్టిజనుఁడు తనపాపముల
న్నియు భస్మమయిపోఁగాఁ బరమపదమును బొందును- ౬- పాపములను నశిం
పఁజేయునట్టి యాగంగా పుణ్యోదకప్రవాహమందు స్నానముచేసిన పురుషుని
బ్రహ్మహత్యమొదలగు నతిభయంకరములగు పాపములుగాఁగిన యినుమును
బ్రాణులువలె స్పృశింపఁ జాలవు మిక్కిలి పరిశోధకమగు నాగంగయొడ్డు
నమూఁడురాత్రులు వసింపఁగా నాగంగోదకములను స్నానము పానముచేయు
టచేత బాహ్యాభ్యంతరములగు నజ్ఞానములన్నియు దహింపఁబడిపోవును ఒక
జన్మమందుఁగాక యనేక జన్మములయందుఁ జేసినపాపములను నిఁకమీఁదఁ
బాపములుచేయుబుద్ధిని వీనినన్నిటిని నశింపఁజేయును కడనుబరమమగు గతి
నిగలుగఁజేయును- ౯- పుణ్యవికారములగునట్టి యాగంగోదకములచేతఁ బితృ
దేవతలకుఁ దర్పణముచేసిన పురుషుని పితృదేవతలెల్లను వాని వంశమందుఁ

తద్వంశ్యాః పితరస్సర్వే సఖాయో యేచ బాంధవాః । ఆచార్యా గురవశ్చైవ
స్వామినో యేచ సమ్మతాః ॥ ౧౧ ॥ సహాన్వకీమైరుత్తీర్య దుస్తరం నరకంత
తః । ఆనందభరితాస్సర్వే నృత్యంతో దీప్తతేజసః ॥ ౧౨ ॥ శాంకరం లోకమా
సాద్య జయంతేఖిలునిత్యశః । యామాశ్రిత్య మునిశ్రేష్ఠా యోగినో బ్రహ్మవా
దినః ॥ ౧౩ ॥ వసంతి ముక్తికామాశ్చ గంగాం ధర్మవివర్ధనీం । దృష్ట్వా హ
ర్షసమావిష్టో దేవలో రాజసత్తమః ॥ ౧౪ ॥ కృతాహ్నికక్రియశ్శీఘ్రమార్గ
ప్రయయా సత్వరంతతః । ఆససాదతతో వామదేవస్యాశ్రమముత్తమం ॥ ౧౫ ॥
నానాద్రుమైస్సమాకీర్ణం ఫలపుష్పోపశోభితైః । పద్మినీ హారనిబిడ కాసార
వ్రజసంకులం ॥ ౧౬ ॥ వ్యాప్తం నిర్ముక్తవైరాణాం శ్వాపదానాం గణైర్బ
హు । అనేకపక్షిసంకీర్ణం తపసాముత్తమంస్థలం ॥ ౧౭ ॥ పరిత్యజ్య భయం
వ్యాప్తం చరద్భిహారిణీగణైః । కంహూవినోద నపరాః మృగేంద్రనఖరైర్
మృగాః ॥ ౧౮ ॥ కండూయమానకంఠాంశ్చ వ్యాఘ్రాన్ రురువిషాణకైః,

---

బుట్టినవారును వాని స్నేహితులును బంధువులును ఆచార్యులను గురువులు
ను సమ్మతులగు నధికారులును వారివారితోడఁ గష్టముచేఁ దాటఁదగిన నర
కమునుదాటి యంతనందఱుసంతోషపరిపూర్ణమనస్కులై తమ తేజస్సులతో
వెలుఁగుచు నాడుచు శివలోకమునుబొంది నిత్యము సర్వోత్కృష్టులై యుం
దురుగదా - ౧౨ - యోగనిష్ఠులును బ్రహ్మవిచారము చేయువారును మోక్ష
మునుగోరినవారై యీగంగానది నాశ్రయించి యున్నారుగదా అట్టిధర్మము
నుబెంచునట్టి గంగానదినిజూచి రాజశ్రేష్ఠుఁడగు నా దేవలుఁడు సంతోషపడిన
వాఁడై తనయాహ్నికముల నాగంగానదియందుఁ దీర్చుకొని యంత నతివేగ
ముతోఁబోయెను అట్లుపోయినపిమ్మట సర్వోత్తమమగు వామదేవాశ్రమము
నుబొందెను - ౧౫ - ఆయాశ్రమమందుంను వృక్షములెల్లను బుష్పించిఫలించి
సొగసుగానున్నవి అందుంను సరస్సులయందెల్లఁ దామరలును గలువలునుద
ట్టములుగానున్నవి - ౧౬ - ఆయాశ్రమమందుంను క్రూరజంతువులన్నియు
జాతివైరముమానియున్నవి పక్షులు బహువులుగా వ్యాపించియున్నవి అదిత
పస్సులజేయుట కుత్తమమైనతావుగానున్నది - ౧౭ - ఆయాశ్రమమందు లేఁ
డులగుంపులు క్రూరమృగములవలన భయమునువదలి తిరుగుచున్నవి మృగ
ములు సింహములగోళ్లచేతఁ దమ దేహములందలి దురదపోగొట్టుకొనుచున్న
వి- ౧౮ - మఱియు నచట బులులు దమకంఠములయందు దురదపోవునట్లు జిం

కుంభానారుహ్యకరిణాం నృత్యతస్సింహపోతకాన్ ॥ ౧౯ ॥ సముద్ధృత కరాణాంచ కుంజరాణాంహరేశ్శిశూన్ । ఆధారాదద్రిశృంగేష్వారుహతోమాతృ సన్నిధిం ॥ ౨౦ ॥ భేరుండకంఠాన్ కలభాన్ వేష్టయిత్వా కరైర్ముదా । డోలాక్రీడా పరాన్ దృష్ట్వా చిత్రయన్ దేవలోయయౌ ॥ ౨౧ ॥ సాంగత్యా ద్వామదేవస్య ప్రభావేన మహాత్మనః । ఏకీభావమనుప్రాప్తాన్ శ్వాపదాన్ జ్ఞానినోయథా॥ ౨౨ ॥ ప్రహర్ష మతులంలేభె దృష్ట్వాదృష్ట్వాపునఃపునః । స దదర్శతతఃప్రాజ్ఞోవామదేవం తపోనిధిం ॥ ౨౩ ॥ సంసేవ్యమానం బహుభిశ్శిష్యైస్స్వాధ్యాయపారగైః । వేదవేదాంగ తత్వజ్ఞం పావనం వీతకల్మషం ॥ ౨౪ ॥ వినయాచారసంపన్నం జ్ఞానవిద్యా విశారదం । తేజోరాశిం దురాధర్షం దీప్యమానమివానలం॥ ౨౫ ॥ ప్రణమ్యశిరసాభక్త్యా దేవలోమునిపుంగవం । వామదేవేనసంపృష్ట కుశలఃప్రీతిపూర్వకం ॥ ౨౬ ॥ ఉపవిశ్యతదాది

---

కలకొమ్ములచేతఁ గీరుకొనుచున్నవి సింహపుపిల్లలేనుఁగులకుంభస్థలములనెక్కియాడుచున్నవి- ౧౯- సింహపుపిల్లలు తమతల్లులు పర్వతశిఖరములమీఁదనుండుటవలన వానిదగ్గిరకుఁబోనేనుగులు తొండములనెత్తియుండఁగా వానినాధారముచేసుకొని యెక్కిపోవుచున్నవి- ౨౦- ఏనుఁగులు తనతొండములను గండభేరుండపక్షుల మెడలకుఁజుట్టి యుయ్యాలలూఁగుచున్నవి వీనినెల్లఁ జూచి యాదేవలుఁడాశ్చర్యపడుచుఁ బోయెను - ౨౧ - మహానుభావుఁడగు వామదేవమహర్షియొక్క సాంనిధ్యమహిమవల్ల జ్ఞానవంతులవలె దుష్టమృగములన్నినైక్యమునొందియుండఁగా వాని బలుమాఱు చూచి మిక్కిలి సంతోషపడెను పిమ్మట సకలముదెలిసిన యాదేవలుఁడు తపోనిధియైన యావామదేవునిఁజూచెను - ౨౩ - పెక్కండ్రుశిష్యులు వేదముజదువుచు నయనను జుట్టుకొని సేవింపుచున్నారు మఱియు నావామదేవమహాఋషి వేదముల వేదాంగముల రహస్యములను జక్కఁగాఁ దెలిసినవాఁడును సర్వవిధములఁ బరిశుద్ధిని గలుగఁజేయువారును నిష్కల్మషుఁడును వినయము సదాచారము మెండుగాఁగలవాఁడును జ్ఞానమును వృద్ధిపఱుచునట్టి విద్యలయందు సమర్థుఁడును బ్రహ్మతేజములప్రోవును దర్శింపనశక్యుఁడునై వెలుగుచునుండు నగ్నివలెనుండును- ౨౫- అట్టివామదేవుని నా దేవలుఁడుచూచి భక్తితో మునిశ్రేష్ఠుడగునతనికి సాష్టాంగనమస్కారముచేసి యాయనచేత నతనిప్రీతితోఁ దనక్షేమమునుసడుగఁబడి యతనియుత్తరవుచొప్పనఁ గూర్చుండి యయననుస్తోత్రము

ష్టఃవర్యభూమదృషిప్రభుం । అద్యాహంమునిశార్దూలపవిత్రోస్మి వరంతప ॥
౨౭ ॥ త్వద్దర్శనేనమానీంద్ర ధన్యోస్మి జ్ఞానభూషణ । ఇత్యాదిభిరనేకై స్త
ముపచారైః ప్రపూజయన్ ॥ ౨౮॥ దేవలోవినయావిష్టః పునరిత్థమభాషత॥
దేవలః॥ మహాత్మన్ మునిశార్దూల యుష్మాకం కుశలంఖలు॥ ౨౯॥ సంగఛ
తేతపశ్చర్యా సులభనతపోనిధే । ఏవంపృష్టో దేవలేన మునిరేనమభాషత॥ ౩౦॥
వామదేవః ॥ కిం వక్ష్యామో మహాబాహో దేవలా మితవిక్రమ । ఏతావం
తం వయంకాల మానయామసుఖనహి॥ ౩౧॥ తపస్స్వాధ్యాయ యజ్ఞానాం
వృత్తిభిస్సర్వదానఘ । నజానీమోభయం కస్మాన్నచపీడా కదాచన ॥ ౩౨ ॥
నిష్ప్రత్యూహేనతపసా వ్యతీతో వనరోహిణః । అద్యాస్మాకంతుతపసో విఘా
తస్సమపద్యత॥ ౩౩॥ అస్మాక మాశ్ర మేచాద్య మహాభీతి రజాయత । అద్యా
శ్రమునిపుత్రాణా ముభవత్సు మహావ్యథా॥ ౩౪॥ మృగాణామాశ్రమస్థానాం

---

చేయ నారంభించెను ఓ యంతశ్శత్రువులగు కామక్రోధముల జయించినవా
మదేవమహామునీ మీదర్శనముచేత నిప్పుడునేనునేనుగృతార్థుఁడనైతిగదా-
౨౭ - జ్ఞానమేభూషణముగాఁగల యోమహానుభావుఁడా యిప్పుడునేను నీ
దర్శనముచేత ధన్యుఁడనైతి - ఇట్టిపెక్కుపచారపుమాటలచేత నయనను గౌర
వించుచు మిక్కిలివినయముతోఁగూడినవాఁడై దేవలుఁడు మరలఁ గొన్నిమా
టలు చెప్పనారంభించెను - దేవలుఁడు చెప్పెడుమాట - ఓమహానుభావుఁడైన
ఋషిశ్రేష్ఠుఁడా మీకు క్షేమముగదా - ౨౯ - తపస్సులగనిమైన యోమునీ
మీకుసులభముగాఁ దపస్సులుజరుగుచున్నవా ఇట్లుదేవలుఁడడుగఁగా వామ
దేవముని దేవలునిఁగూర్చి యుత్తరముచెప్పుచున్నాఁడు - ౩౦ - వామదేవము
నిచెప్పుమాట - ఓ మిక్కిలి పరాక్రమవంతుఁడవైన దేవలుఁడా యేమిచెప్పు
దుమోయి యాజానుబాహుఁడా - ఇన్నిదినములు మేముసుఖముగాఁ గాలము
నుగడపితిమి - తపస్సుచేయుటను వేదములఁ జదువుటయును గ్రతువులాచరిం
చుటయు మాకువ్యాపారములుగానుండును - ఎప్పుడు నొకనివలనను మేముభ
యముపడియెఱుఁగము - మాకొకబాధయునులేదు - ౩౨ - ఇంతకాలము తప
స్సులకువిఘ్నములేక యవిచక్కఁగా జరుగుచుండఁగాఁ గాలమునుగడపితిమి-
ఇప్పుడు మాతపస్సునకువిఘ్నము సంభవించెను - ౩౩ - ఇప్పుడు మాయాశ్రమ
మందుఁ బెద్దభయముకలిగెను - ఇప్పుడిక్కడి మునికుమారులకెల్ల మిక్కిలి బా
ధకలిగెను - ౩౪ - మాయాశ్రమములయందుండు మృగములకు వినాశము సంభ

వినాశ స్సముపద్యత ॥ బ్రహ్మా ॥ ఏవముక్తే మునిశ్రేష్ఠే వామదేవేతపోధనే ॥ ౩౫ ॥ ఇతిప్రపృచ్ఛ మానీంద్రం దేవలో వినయాన్వితః । దేవలః ॥ భగవన్ కో హ్యసౌపాపో బాధతేవ స్తపస్వినః ॥ ౩౬ ॥ కుత్రాస్తే కీదృశం నామ తస్యైవద మహామతే । దైత్యో వాయాతుధానోవా బేతాళో వాథమానుషః ॥ ౩౭ ॥ సాయకైర్మేశనిప్రఖ్యై స్తం నయామి యమాంతికం । హత్వాతమద్య పాప్మానం వ్యపనేష్యామివో వ్యథాః ॥ ౩౮ ॥ సువర్ణపుంఖై రిషుభిరగ్నికల్పైః ప్రమర్దమానఘు । దురాత్మనోద్యతస్యాహం శిరశ్ఛేత్స్యామ్య సంశయం॥ ౩౯॥ ఏవముక్తస్తత స్తేన దేవలేనామితౌజసా । ప్రాప్తకామ ఇదం వాక్య మృషిర్దేవలమబ్రవీత్ ॥ ౪౦ ॥ యత్పృష్టం చత్వయాతాత తద్వచ్మి శృణుదేవల । ఇతోర్ధయోజనే క్రూరః కుండికోనామరాక్షసః ॥ ౪౧ ॥ దురాత్మాసు మహానత్పోవర్త తెగిరిగహ్వరె । యత్రస్త్రాసాత్ప్రాణిగణా విద్రవంతే హి యోజ

---

వించెను - తపస్సేధనముగాఁగల మునిసత్తముండైన యావామదేవుఁడిట్లుచెప్పఁగా దేవలుఁడు వినయముతోఁగూడినవాఁడై యామునిశ్రేష్ఠునిఁ బిమ్మటఁ జెప్పఁబోవురీతిని మరలనడిగెను - దేవలుఁడడిగినమాట - తపస్సుచేసికొనుచుండు మిమ్ముబాధించునట్టి పాపాత్ముఁడెవఁడు - ౩౬ - అతఁడెక్కడనున్నాఁడు - అతని పేరేమి యానయునమంతయు నాకుఁజెప్పుమయ్యా మహాబుద్ధిశాలియగు యోమునివర్యుఁడా - అతఁడు దైత్యుఁడా యాతుధానుఁడా బేతాళుఁడా మనుష్యుఁడా - ౩౭ - పిడుగులతోసమానములైన నాబాణములచేత నతనిజమునిదగ్గిరకుఁబంపెదను - ఇప్పుడా పాపాత్మునిఁజంపి మీదుఃఖములనెల్ల మాన్చెదను - ౩౮ - బంగారముచేతఁజేయఁబడిన పుంఖములుగలిగి యగ్నిసమానములై యుండునా బాణములచేత నామరాత్మునిశిరస్సు నిపుడునేనుచ్ఛేదింపఁగలను సందేహపడవలదయా మహానుభావా - ౩౯ - అపరిమితమగు పరాక్రమముగల యా దేవలుఁ డిట్లుచెప్పఁగా నంతనావామదేవమహర్షి తనకోర్కెనిఁ బొందినవాఁడై దేవలునితోమరల నీమీఁదఁజెప్పఁబోవుమాటనుజెప్పెను - ౪౦ - నాయనా యో దేవలుఁడా నీవడిగినసంగతిని జెప్పెదవినుము - ఇచ్చటికి నాలుగు గడియలదూరమందుఁ గఠినహృదయుఁడైనట్టియు దుర్మార్గుఁడగునట్టియు మిక్కిలి బలముగలవాఁడగుకుండికుఁడనురాక్షసుఁడుపర్వతగుహయందున్నాఁడు - వానివలనభయపడిసమస్తజంతువులుచుట్టుయోజనముదూరములోపల సంచరింపక పఱుగెత్తుచున్నవి - ౪౨ - అయిననువానిఁదపోమహిమచేతశిక్షింపనుమాకు

నాత్ ॥ ౪౨ ॥ శిక్షితుంతంవయంశక్తామహిమ్నా తవసోనఘ। భవిష్యతితపో హాని రితిక్షాంతా దురాత్మని ॥ ౪౩ ॥ భూమిపాలో మహావీర్య స్త్వం రాజా సర్వరక్షకః। రాజ్ఞాం బ్రాహ్మణసంతాప హరణం నియతవ్రతం ॥ ౪౪ ॥ నరేంద్ర బ్రాహ్మణత్రాణా త్పరోధర్మోన విద్యతే। ఆర్తానాం బ్రాహ్మణానాంతు దుర్బలానాం తపస్వినాం॥ ౪౫॥ దత్తంచే దభయం రాజన్ పరోధర్మ ఉదీరితః। బ్రాహ్మణాం స్తోషయేద్యస్తు తస్యపుణ్య మనంతరం ॥ ౪౬ ॥ లోకేహి బ్రహ్మహత్యాయాః పరంపాపం నవిద్యతే। పాలనాద్భూసురాణాంతు పరం పుణ్యం నవిద్యతే ॥ ౪౭ ॥ బ్రాహ్మణాన్ ద్వేష్టియఃపాప్మా సర్వదాదుఃఖ మశ్నుతే। భుక్త్వాచ నరకంఘోరం తుఛయోనిం తతోవిశేత్ ॥ ౪౮ ॥ బ్రాహ్మణాన్పాతిధర్మాత్మాభుంజానస్సుఖమైహికం। అనుభూయతతోరాజన్ దివ్యభోగాన్ త్రివిష్టపె ॥ ౪౯ ॥ పునర్ధనీకులీనశ్చ జాయతేచనిరామయః। ఆధారగుణసంపన్న స్సర్వదా సుఖమశ్నుతే ॥ ౫౦ ॥ తర్పయేదీశ్వరప్రీత్యా బ్రా

---

సామర్థ్యముకలదు - తపస్సుక్షయించునవియాలోచించియాదుర్మార్గుని విషయమందోర్పుబొందియున్నాము- ౪౩- నీవుభూమిని బాలించువాఁడవు మిక్కిలిబలముగలవాఁడవు సమస్తప్రజలను రక్షించునట్టిరాజవు- రాజులకు బ్రాహ్మణుల మనోదుఃఖమునుమాన్పుట నియమయుక్తమైనవ్రతముగా నుండును గదా- ౪౪- ఓరాజా బ్రాహ్మణుల రక్షించుటకంటె మిక్కిలియైన ధర్మమొక్కటియులేదు - బాధనొందిన బ్రాహ్మణులకును బలహీనులకును దపస్సు జేయువారికినిఁనభయదానముచేసినపక్షమందది హెచ్చైనధర్మమని చెప్పఁబడుచుండును- ఎవ్వఁడుబ్రాహ్మణులను సంతోషపఱుచునో యట్టివానిపుణ్యమునకు సమమొకటియులేదు - ౪౬ - లోకమందు బ్రహ్మహత్యకంటె మిక్కిలి పాపము లేదు - బ్రాహ్మణులఁ బాలించుటకంటె మిక్కిలి పుణ్యములేదు - ౪౭ - ఎవఁడు పాపాత్ముఁడై బ్రాహ్మణులతో విరోధించునో యతఁడెల్లప్పుడు దుఃఖమునుబొందుచుండును అతఁడనేకదినములు భయంకరమైన నరకము ననుభవించి పిమ్మటఁ దుచ్ఛమగు యోనియందుత్పత్తిని బొందును - ౪౮ - బ్రాహ్మణులనుఁబాలించునట్టి ధర్మాత్ముఁడీలోకమందలి సుఖము నిచట ననుభవించుచుండి తరువాత స్వర్గమందెల్లసుఖముల ననుభవించి మరల ధనవంతుఁడును రోగములేనివాఁడునై శ్రేష్ఠమైన కులమందుఁ బుట్టును ఆధారమగు పుణ్యగుణ సమృద్ధిగలవాఁడు గనుక నతఁడెల్లపుడు సుఖమునుబొందుచుండును- ౫౦- జగదీ

హ్మణాన్ బుద్ధిమాన్ యది । పునరావృత్తిరహితం పరమంపదమాప్నుయాత్ ॥
౫౧ ॥ యస్తర్పయతివిప్రేంద్రాన్ యేన కేనాపి హేతునా । సంతోషం జనయే
త్తేషాంబుద్ధిమాన్ పురుషర్షభ ॥ ౫౨ ॥ తేనైవ దేవతాస్సర్వా స్సంతుష్టా
స్తృప్తిమాప్నుయుః । యోవేదవిద్ద్విజోలోకే తస్యాఙ్గే సర్వదేవతాః ॥ ౫౩ ॥
తిష్ఠంతి సర్వగాత్రేషు పూజనీయో ఖిలైశ్చసః । సర్వాశ్చ దేవతారాజన్ స
ర్వపుణ్యాపగాశ్చవై ॥ ౫౪ ॥ వసంతస్మిన్ వేదవిది తస్మాత్పూజ్యోదినేదినే ।
ప్రత్యహంచ నమస్కార్యా ద్విప్రాన్ వేదవిదోముదా ॥ ౫౫ ॥ ముచ్యతే సర్వ
పాపేభ్యో వందితా స్సర్వదేవతాః । ధర్మంచికీర్షుణారాజన్ కార్యంబ్రా
హ్మణతోషణం ॥ ౫౬ ॥ తస్మాత్పరతరోధర్మో లభ్యతే నకదాచన । బహునా
ప్రకిముక్తేన శ్రుణుచైతన్మహోమతే ॥ ౫౭ ॥ అశ్వమేధసహస్రాణి గంగాస్నా
నానికోటిశః । బ్రాహ్మణానాం రక్షణస్య కలాం నార్హంతిషోడశీం ॥ ౫౮ ॥

---

శ్వరునకుం బ్రీతిగలుగుటకై బ్రాహ్మణులను దృప్తిపఱచునట్టి బుద్ధిశాలియైన్న మనుజులనీలోకమునకు రాకుండునట్టి పరమపదమునుబొందును - ౫౧ - ఎవఁడు బ్రాహ్మణులను దృప్తిపరుచునో యేహేతువుచేతనైన బ్రాహ్మణులకు సంతోషముగలుగఁజేయునోయతఁడుబుద్ధిశాలియోయిపురుషశ్రేష్ఠుఁడా - ౫౨ - అట్లుబ్రాహ్మణులను దృప్తిపఱచుటచేతనే యెల్లదేవతలు సంతోషించి తృప్తిబొందుదురు ఎవడీలోకమందు వేదమునుజదివినవాఁడో యతనియంగములయందెల్లసకలదేవతలు వాసముచేయుచుందురు కాఁబట్టి యతఁడెల్లవారిచేతఁ బూజింపఁదగియుండును ఓరాజా సమస్తదేవతలును సమస్తపుణ్యనదులును వేదముఁ దెలిసిన బ్రాహ్మణుని యందుండును కావుననతఁడు ప్రతిదినము పూజింపఁదగినవాఁడు ప్రతిదినమందును వేదముఁదెలిసిన బ్రాహ్మణులను సంతోషముతో నమస్కరింపవలయును - ౫౫ - అట్లుబ్రాహ్మణుల నమస్కరించుటచేత సమస్తపాపములవలన విడువఁబడును సమస్తదేవతలతనిచే నమస్కరింపఁబడినవారగుదురు ధర్మముచేయఁ గోరినవాఁడు బ్రాహ్మణులను పంతోషపఱపవలయును - ౫౬ - బ్రాహ్మణులయిష్టమును జేయుటకంటె మిక్కిలియైన ధర్మమెప్పుడునులభింపదు ఓ మహాబుద్ధిశాలీ విశేషించి చెప్పఁగానేమి ఫలముముఖ్యమైన సంగతిని జెప్పెద దీనివినుము - ౫౭ - వేయియశ్వమేధములును గోటిగంగాస్నానములును బ్రాహ్మణుల రక్షించుటకుఁ బదియాఱింట నొకపాలునకు సరికావు - ౫౮ - కాఁబట్టి యామహద్భూతుఁడగు రాక్షసునిచేత బా

తస్మాదాత్తాఽవయంతేన రాక్షసేన దురాత్మనా । జహితం పాపకర్మాణం
స్వబాహు బలమాశ్రితః ॥ ౫౯ ॥ హత్వైతం నోమహాబాహో బాధాం
నాశయసత్వరం । సాధూనాముపకారాయోత్పాదితోఽసిపినాకినా ॥ ౬౦ ॥ స
ర్వదా బాధతేసాధూన్ దుర్బలాన్పాపకర్మకృత్ । యోఽభక్షయన్ప్రాణి
కోటింవర్తతేచాకుతోభయః॥ ౬౧॥ జహిదేవలతందైత్యం భద్రమస్తుతవా
నఘ । బ్రహ్మో॥ ఇత్యుక్తోవామదేవేన దేవలోఽథతమబ్రవీత్ ॥ ౬౨॥ అద్యమా
సీంద్రతంపాపం హనిష్యామినసంశయః । భవంతునిర్వ్యథాస్సర్వే తాపసా
యూయమేవచ ॥ ౬౩ ॥ ఇత్యుక్త్వాచాపమాదాయనిషంగీబద్ధకంకటః । వా
మదేవాభ్యనుజ్ఞాత స్సంహంతుం త్వరితోయయౌ॥ ౬౪॥ ఆససాదతతోదై
త్య గహ్వరప్రాంగణంబలీ । కపాలై రస్థిభిఃపూర్ణం మాంసత్వగ్గంధదుర్గ
మం ॥ ౬౫ ॥ వర్చస్కకేశసంకీర్ణంవిషాణఖురపూరితం । పరిత్యక్తాంత్రమా
లైశ్చరుణైశ్ఛిన్నకుక్షిభిః॥ ౬౬ ॥ బద్ధపాదైర్వీతహస్తైర్నికృత్తభుజకం

---

ధితులము మేము నీవు నీభుజబలము నాశ్రయించి యాపాపాత్ముని జయింపు
ము- ౫౯- మిక్కిలిభుజబలముగలయోరాజాశీఘ్రముగానతనిసంహరించిమా
బాధను బోఁగొట్టుము నిన్ను సాంబశివుఁడు సజ్జనుల కుపకారముచేయనేగ
దాసృజించెను - ౬౦ - అతఁడు పాపకర్మములఁ జేయుచు నెల్లప్పుడు సజ్జనుల
బాధించుచున్నాఁడు ప్రాణిసంఘమునెల్లఁ దినుచు నెవనివల్లను భయములేక
యున్నాఁడు - ౬౧ - ఓ దేవలుఁడా యారాక్షసునిజయింపుము నీకుమేలౌఁగా
క- ఇట్లువామదేవుఁడుచెప్పఁగా నటుపిమ్మట దేవలుఁడతనిఁగూర్చి మరలజెప్పె
ను - ౬౨ - ఓ మునిశ్రేష్ఠుఁడా యిప్పుడా పాపాత్మునిఁ జంపఁగలను సందేహ
మువలదు తపోనిష్ఠులగుమీరందఱు బాధలేకయుందురుగాత - ౬౩ - ఇట్లుచె
ప్పి యంబులపొదినిధరించి యురశ్ఛదమునుగట్టికొని ధనుస్సునుదీసికొని వామ
దేవుని సెలవునుబొంది యారాక్షసునిఁజంప నతివేగముతోఁ గూడినవాఁడై బ
యలువెడలిపోయెను - ౬౪ - అంతబలవంతుఁడగునా దేవలుఁడా రాక్షసుండుం
డు గుహద్వారమునఁ బోయెను ఆగుహ సమీపదేశమెట్లున్నదనిన తలకాయ
పుఱ్ఱెలచేత నెముకలచేతనిండినదై ప్రేగులచేత దుర్వాసనవచ్చుచుఁ జేరరాక
యున్నదివర్చస్సములచేతతలవెండ్రుకలచేతనునిండుకొనిమృగములకొమ్మలచే
తగిట్టలచేతబూరింపబడియున్నది-కొన్ని పీనుగులుకడుపుచేదింపబడియందలిప్రే
వులన్నియుదొలగిపోయియున్నవి-కొన్నికాళ్లుకట్టబడినవియునుకొన్నిహస్తము

ధరైః । హీనస్వరై ర్లుఠద్భిశ్చ కించిత్ప్రాణైశ్చనిశ్చలైః ॥ ౬౭ ॥ గతప్రా
ణైస్స్థితప్రాణై ర్మిశ్రితైః కృతరాశిభిః । కాకై ర్ఘూర్ణకైశ్చ గృధ్రైశ్చ జం
బుకైశ్శ్వనికాదభిః ॥ ౬౮ ॥ ఖాదితాంగైః పరివ్యాప్తం మృత్యులోకభయం
కరం । రక్తసేకఖసీభూత దుర్గంధ వ్యాప్తముచ్చకైః ॥ ౬౯ ॥ దృష్ట్వా శో
చన్ దయాసింధుర్దేవలః కుణపవ్రజాన్ । కంపయానో ముహుశ్శీర్షం హా
హేతిచ ముహుర్ముహుః ॥ ౭౦ ॥ ఇద్ధంహి పాప్మనానేన హతాః కతిపయా
బత । ఇతిమత్వా తతశ్శీఘ్రం ధనురుద్యమ్య వీర్యవాన్ ॥ ౭౧ ॥ జ్యాఘాతై ర
శనిప్రఖ్యైః క్షోభయామాసరాక్షసం । శ్రుత్వా తస్య ధనుర్ఘోషం దేవల
స్యోగ్రతేజసః ॥ ౭౨ ॥ సంక్షుబ్ధోరాక్షసశ్శీఘ్రం నిర్గత్యగిరిగహ్వరాత్
రక్తసిక్తం మహచ్ఛూల ముద్యమ్యాంజనసన్నిభః ॥ ౭౩ ॥ తామ్రకేశో దీర్ఘ
దంష్ట్రో మహాకాయో మహాబలః । క్రోధరక్తేక్షణశ్చైవ మభ్యద్రవత రా
క్షసః ॥ ౭౪ ॥ సదేవలో మహాబాహు ర్నిష్ఠురైః ప్రదరైర్భృశం । అభ్య

---

లులేనివియును గొన్ని భుజములు కోయబడినవియునుగానున్న వికొద్దఱుకుట్టూపి
రితో గదలమెదలంజాలక యల్పమగు కంఠస్వరములతో బొర్లుచున్నారు కొన్ని
ప్రాణములుపోయినకళేబరములును గొన్ని ప్రాణములతోనుండు కళేబరములు
నుగలసి ప్రోగులుగానుండగా కాకులును గూబలును గ్రద్దలును నక్కలును డేగలు మొ
దలగునవియును వానియవయవములను భక్షించుచుండగా నట్టి కళేబరముల చేత
వ్యాపింపబడియున్నదిగనుక మృత్యులోకమువలె భయంకరమైయున్నది- రక్తప్ర
వాహము పారి కరుడుగట్టి మిక్కిలి దుర్గంధము కొట్టుచున్నది- దయాసముద్రుడగు
నా దేవలుడట్టి యాచోటఁబ్రవేశించి యాపీనుగుప్రోగులను జూచి దుఃఖపడుచు హా
టిమాటికి దలయూఁచుచు బలుమాఱు హాహాయనుచు నయ్యోయీపాపాత్ము
డీప్రకారమెందఱిఁ జంపెనో యనితలఁచి యంత శీఘ్రముగ ధనుస్సునెత్తి పి
డుగును బోలిన యల్లెత్రాటిశబ్దములచేత నారాక్షసునిఁ గలచెను- ౭౧ - అంతట
భయంకరమగు తేజస్సుగల యాదేవలుని ధనుస్సుఘోషమును విని యారాక్ష
సుఁడు కలఁకఁబారినవాఁడై శీఘ్రముగఁ బర్వతగుహాయందుండి బయలువెడలి
రక్తముచేతఁ దడపఁబడియున్న పెద్దశూలమునెత్తుకొని కాటుకవంటి దేహము
తో నెఱ్ఱనితలవెండ్రుకలతో నిడుపులగు కోరలతోఁ బెద్దయొడలుగలిగి మిక్కిలిబ
లశాలియైయుండు నారాక్షసుఁడు కోపముచేతఁ గన్నులెఱ్ఱగాఁజేసుకొని యా
దేవలునిఁ దరుమసాగెను- ౭౪- అపరిమితమగు ధైర్యముగలిగి మిక్కిలిభుజబల

విధ్యదమేయాత్మా స్త్వయన్ని వనిశాచరం ॥ ౨౫ ॥ సోతివిద్ధో బలవతారాక్షసో
రోషపూరితః । ననాదబహుశః క్రూర స్సశబ్దస్తుములో భవత్ ॥ ౨౬ ॥ తత
శ్శూలం సముద్యమ్య దేవల స్తం జిఘాం సయా । సమీపమభిధావంత మర్ద
యిత్వా త్రిభిర్నృపః ॥ ౨౭ ॥ పున స్త్రిభిః కంకపత్రై స్తచ్ఛూలంచ త్రిధాచ్ఛి
నత్ । నష్టశూల స్తతో దైత్యః పేషయర్ణ దశనార్ భృశం ॥ ౨౮ ॥ సాలముత్పా
ట్య వేగేనగర్జ శ్చిక్షేపభూపతౌ । తమాపతంతంసహసాదేవలో నిశితైశ్శరైః ॥
౨౯ ॥ అనేకై స్తిలశశ్ఛిత్వా దైత్యమేనమథాబ్రవీత్ । నష్టంశూలందురాత్మ
తేవృక్షశ్ఛిన్నో ప్యనేకధా ॥ ౩౦ ॥ ఇతఃకరిష్యస్యధునా కింతత్కురునిశాచర । దు
ర్బలాంస్తాపసార్ జగ్ధ్వాదర్పితో స్యకుతో భయం ॥ ౩౧ ॥ ఆర్జితంహిమహాత్పా
పంతదిత్థం తేసమాగతం । వ్యపనేష్యామి తేదర్పంక్షణేనమమసాయకైః ॥ ౩౨ ॥
ఇతిబ్రువాణే రాజేంద్రే రాక్షసో మర్షపూరితః । మహాశిలాం సముద్ధృత్య చి

---

ముగలిగియుండు నా దేవలుఁడు నవ్వువానివలెనే క్రూరములగు బాణములచేత
నారాక్షసునిమిక్కిలికొట్టెను - ౨౫ - బలవంతులగు దేవలునిచేత మిక్కిలికొ
ట్టబడిన యారాక్షసుఁడు కుపితాంతరంగుఁడై పెక్కుమారులు నాదముచేసెను
క్రూరమగునానాదము సర్వదిశలయందువ్యాపించి సంకులమాయెను - ౨౬ -
అంతనారాక్షసుఁడాశూలమునెత్తుకొని యాదేవలునిఁజంపనిఛచేతసమీపము
నకువచ్చునపుడాదేవలుఁడు మూఁడుబాణములచేతనతనినొప్పించి మరలమూ
డుబాణములచేతనాశూలమునుమూఁడువిధములుగాచ్ఛేదించెను- అంతటశూ
లముపోయిన యారాక్షసుఁడుమిక్కిలి పండ్లుగొఱుకుచు నొకవృక్షమునుశీఘ్రి
ముగాఁ బెల్లగించికొప్పుచు నారాజుమీదవైచెను- ౨౮ - ఆవచ్చుచున్న చెట్టును
శీఘ్రిమున దేవలుఁడుతీక్ష్ణములగు పెక్కుబాణములచేత నువ్వుగింజలంతతునుక
లై పోవునట్లుతెగగొట్టి తరువాతనారాక్షసునిఁగూర్చియిట్లనెను - ఓరిదుర్మార్గుఁ
డా నీశూలముపోయెను వృక్షమును బలువిధములఛేదింపబడియె - ౩౦ - ఇఁ
కమీఁదనేమిచేయఁగలవో దానిఁ జేయవోయిరాక్షసుఁడా - బలహీనులగు త
పస్సుచేసుకొనువారినిదిని కొంచమైన నెవనివలనభయపడక కావరించియుంటి
వి - ౩౧ - మెండుగాఁబాపమునుసంపాదించుకొంటివి - దానిఫలమిట్లునీకను
భవమునకువచ్చెను - నీ క్రొవ్వునంత యొకక్షణములోపల నాబాణములచేత
మాన్పెదను- ౩౨- రాజరాజగు నాదేవలుడిట్లుచెప్పుచుండఁగా నారాక్షసుడు
మిక్కిలి కోపముగలవాఁడై పెద్దరాతిబండనుబెల్లగించి దీనియందుఁ జావుమని

షే పాస్మిన్న రేతిచ॥ ౮౩॥ తామా పతంతీం సహసా ప్రదరై ర్వజ్రసన్నిభైః। ఛిత్వాపునస్తమానర్చ సర్వాంగేషు మహాబలః॥ ౮౪॥ తతః క్రోధ సమావిష్టో రాక్షసోవాక్యమబ్రవీత్ ।గమిష్యసికుతోమూఢ మయాలగ్నోసికాలతః॥౮౫॥ ప్రోథయిత్వా భవం తమ్మే వజ్రసన్నిభముష్టినా । పీత్వా త్వద్రుధిరం చాహం తృప్తిం యాస్యామ్యసంశయం॥ ౮౬॥ ఇత్యుక్త్వా ముష్టిముద్యమ్యాభిధావం తం నిశాచరం । దృష్ట్వా కేనసుతీక్ష్ణేన తస్యబాహుం సమాఛినత్ ॥ ౮౭॥ పున శ్చేకేనభల్లేన సవ్యం చిచ్ఛేద భూపతిః । ఛిన్నబాహు స్తతోదైత్యో గర్జ వ్యాత్తాననోబలీ॥ ౮౮॥ దంష్ట్రాభ్యాం పీడయామ్యేన మిత్యాయాతోథరాక్షసః । అర్ధచంద్రేణతీక్ష్ణేన దేవల స్తచ్ఛిరోహరత్ ॥ ౮౯ ॥ పపాతతచ్ఛిరో భూమ్యాం వజ్రరుగ్ణ ఇవాచలః । తతోవిమానమారుహ్య దివ్యరూప ధరః పుమాన్॥ ౯౦॥ దదృశేదేవలేనా సౌభాసయం శ్చదిశోదశ । పప్రచ్ఛదేవల స్తంతుదృష్ట్వాక స్త్వం వదేత్యసా॥ ౯౧॥ ఇతిపృష్టో దేవలేన సచైనం నిజగాదహ।

---

వై చెను-౮౩- అధికబలశాలియయినయాదేవలుఁడుపైకివచ్చుచున్నయారాతి బండను శీఘ్రముగ వజ్రసదృశములగుబాణములచేతఁ దుత్తునకలుచేసి మరల నారాక్షసునిదేహమంత బాణములచేతముంచెను - ౮౪ - అంత నారాక్షసుఁడు కోపావేశముతోఁగూడి యొకమాటపలికెను- కాలవశమువలన నాచేతఁజిక్కితివిఁక నెచ్చోటికిఁబోఁగలవు- ౮౫- వజ్రాయుధముతో సమానమగు నాపిడికిటిచేత నిన్నుఁ బొడిచి నీనెత్తుటిని నేనుద్రాగితనిసెదను దీనికి సందేహములేదు- ౮౬- ఇట్లుచెప్పి పిడికిలిచక్కఁగా సవరించి చేయెత్తుకొని పైకివచ్చుచున్న యారాక్షసుని దేవలుఁడుచూచి యొకచురుకైన బాణముచేత నతనిభుజమునఁ దెగేను- ౮౭- మరలనొకబాణమునెత్తి యతనియెడమచేతినిఛేదించెను- రెండు చేతులుదెగిన యారాక్షసుఁడంతట నోరుదెఱచుకొని రొప్పుచు బలవంతుఁడుగనుకఁగోరలచేత నీరాజును బాధించెదనని పైకివచ్చెను- అప్పుడు దేవలుఁడువాడియగునర్ధచంద్రబాణమునెత్తి యారాక్షసుని శిరస్సునుహరించెను- ౮౯- వానిశిరస్సువజ్రాయుధముచేతఁ బీడితమైన కొండవలెదిగువఁబడెను - అంతనొకపురుషుఁడు దివ్యసౌందర్యముగలవాఁడు విమానమునెక్కి తనకాంతిచేత దిక్కులనెల్ల వెలిగించుచు దేవలునకగపడ దేవలుడతనిజూచి యోయినీవెవ్వఁడవుచెప్పమనియడిగెను - ౯౧- ఇట్లుదేవలునిచేత నడుగఁబడి యతఁడీదేవలునిఁ గూర్చి యుత్తరముపలికెను - ఓరాజ రాజా లెస్సయాయెను బరిశుద్ధుఁడనైతిని -

సాధుపూతోఽస్మి రాజేంద్ర వ్యతీతశ్శాపసాగరాత్ ॥ ౯౨ ॥ నిర్వాపితశ్శాపవహ్ని స్త్వత్తో ద్యపురుషర్షభ । వక్ష్యామిమమవృత్తాంతం శ్రూయతాం రాజసత్తమ ॥ ౯౩ ॥ అహమిక్ష్వాకుపుత్రస్య విశాలస్య తనూభవః । అగ్రధన్వేతివిఖ్యాతో మహాబలపరాక్రమః ॥ ౯౪ ॥ శాస్తం రాజ్యం మయాసుష్ఠు విశాలాపాలితాపురీ । ఏతస్మిన్నంతరేకాలే వికటోనామ రాక్షసః ॥ ౯౫ ॥ ప్రపీడయన్ జనపదాన్ బాధతేస్మ తపోధనాన్ । విశమ్యాన గ్గ్రంతస్య సర్వోపద్రవకారిణః ॥ ౯౬ ॥ హత్వాతం పాపకర్మాణం వికటం పిశితాశనం । తతోజనపదాన్ సర్వాన్కరోమి స్మగతవ్యథాన్ ॥ ౯౭ ॥ తస్యైవావరజోరాజ న్కర్కశోనామరాక్షసః । మయాశక్తో విక్రమితుం కపటోపాయతత్పరః ॥ ౯౮ ॥ సూపకారోభవద్రాజన్మద్గృహే కుటిలోసురః ॥ అజ్ఞాతస్సమయాన్వేషీ వర్తతే స్మమహాలయే ॥ ౯౯ ॥ కదాచిత్తపతాంశ్రేష్ఠోమద్వాసాగృహమాగతః । భోజనార్థీమహాభాగః ప్రజ్వలన్నివపావకః ॥ ౧౦౦ ॥ తస్మైస కపటోపాయో రాక్షసః

---

శాపమనుసముద్రమునుండితొలఁగితిని - ౯౨ - ఓపురుషశ్రేష్ఠుఁడా నీవలననిప్పుడు శాపమను నగ్నిచల్లారెను - ఓరాజశ్రేష్ఠుఁడా నా సమాచారమును జెప్పెదఁ బరాకులేకవినవలయును - ౯౩ - నేనిక్ష్వాకు మహారాజు కుమారుఁడగు విశాలునికొడుకను - నాపేరగ్రధన్వుఁడని ప్రసిద్ధమైయుండును - నేను మిక్కిలి బలమును బ్రతాపమునుగలవాఁడను - ౯౪ - నాచేతరాజ్యముచక్కఁగాఁ బరిపాలింపఁబడెను - విశాలాపట్టణము పాలింపఁబడెను - అట్లునేను బాలించుచుండు సమయమందువికటుఁడనునొకరాక్షసుఁడు దేశములనెల్ల బాధించుచుఁదపస్సునేముఖ్యధనముగా నెంచియుండు ఋషుల బాధింపఁదొడంగెను - అట్లు సర్వజనులకు నుపద్రవముజేయుచుండు నారాక్షసుని నడవడిని దెలిసి మాంసభక్షకుండై క్రూరకృత్యములుచేయునట్టి పాపాత్ముఁడగు నారాక్షసునిఁజంపి దేశములయందెల్లనుపద్రవములులేకుండఁజేసితిని - ౯౭ - అంతనతనితమ్ముఁడై నకర్కశుఁడను రాక్షసుఁడునాతోఁబరాక్రమమునుఁజూపఁజాలక కపటమార్గముచేత నన్నుసాధింపఁగోరినవాఁడై నాకుగురుతు దెలియకుండునట్లు వంటవాని వేషముతోవచ్చిమాయింటఁబనికిఁగుదిరి యాకుటిలుఁడగు రాక్షసుఁడు ననుఁజెరుప సమయమునువెదకుచునుండెను - ౯౯ - ఇట్లుండఁగాఁ దపస్సులలోనెల్ల శ్రేష్ఠుఁడును మహానుభావుఁడునగుదుర్వాసో మహాముని వెలుఁగుచుండునగ్నివలె మహాతేజస్సంపన్నుఁడై భోజనమునుగోరిమాయింటికివచ్చెను - ౧౦౦ - పాపకృత్యము

పాపకర్మకృత్ । దుర్వాసనే మానుషంవై పర్యవేషయదామిషం ॥ ౧౦౧ ॥ స మునిః కేశసంకీర్ణం దృష్ట్వాపమానుషమామిషం । తత్పరిత్యజ్య రాజేంద్ర తతో మామబ్రవీన్నృప॥ ౧౦౨॥ దుర్వాసాః॥ దురాత్మన్ మానుషంమాంసం దత్తవానసికుత్సిత। ఇత్యుక్త్వా ప్రార్థయంతం మామగణయ్యాత్రినందనః॥౧౦౩॥ యస్మాన్మేమానుషంమాంసం దత్తంవై పాపకర్మణా । తస్మాదేవదురాచారో భవత్వంమనుజాశనః ॥ ౧౦౪ ॥ అనాగసమపీత్యేవం మాంశశాపన్నృపర్షభ। దూయమానోభృశంత్రస్తః ప్రార్థయంచతతోమునిం ॥ ౧౦౫ ॥ భగవన్మునిశార్దూల దయాం కురుమయిప్రభో । అవసానం కల్పయాస్య శాపస్య తపతాంవర ॥ ౧౦౬ ॥ ఇత్యేవంప్రార్థితోమాని ర్మాంపునఃప్రాబ్రవీదిదం । శివస్యమానసశ్శ్రీమాన్ దేవాంగఇతివిశ్రుతః ॥ ౧౦౭ ॥ రక్షితాచాభిమానస్య తేజస్వీపటువిక్రమః । సత్వాం మోచయితా శాపాత్తేనశాపాద్విమోక్ష్యసే ॥

---

లఁ జేయునట్టియుఁగపటవృత్తినవలంబించియుంటు నారాక్షసుఁడా దుర్వాసోమహాముని కొఱకు మనుష్యమాంసమును వండివడ్డించెను- ౧౦౧ - ఆముని వెంట్రుకలతోఁగూడియున్న యామనుష్యమాంసమునుజూచి దానివిడిచి పెట్టిమిక్కిలి కోపముతోఁదరువాతనాతోఁబలికెనయారాజా- ౧౦౨- దుర్వాసోమహామునిచెప్పినమాట - ఓరిదుర్మార్గుఁడా కుటిలుఁడా నాకుమనుష్యమాంసమును బెట్టించితివనిచెప్పినేనుదెలిసిచేయలేదని యెన్నివిధములఁ బ్రార్థించుచుండిననువినకయత్రికుమారుడగునాదుర్వాసోమహాముని నాతోనీవునాకుమనుష్యమాంసమునుబెట్టించితివిగనుకదురాచారుఁడవై మనుష్యులభక్షించుచు రాక్షసుఁడవై యుండుమువుగాకయని తప్పులేని నన్నునిట్లు శపించెనయ్యా రాజశ్రేష్ఠా - అంతనేనుమిక్కిలిభయపడి మనస్సునందు సంతాపమునొందుచు నామునిని వేడుకొంటిని - ౧౦౫ - ఓ షడ్గుణైశ్వర్య సంపన్నుఁడా మునిశ్రేష్ఠుఁడా నిగ్రహానుగ్రహసమర్థుఁడా నాయందు దయచేయుము - తపస్సుచేయువారిలో నుత్తముఁడా యీశాపమునకుఁదుదనుగల్పింపుము - ౧౦౬ - ఇట్లునాచేతఁబ్రార్థింపఁబడినవాఁడై యామునినన్నుఁగూర్చి మరలనీమాటచెప్పెను - శివునిమనస్సునఁగలుగువాఁడు సర్వసంపత్తులతో నొప్పినవాఁడు దేవాంగుఁడని ప్రసిద్ధికెక్కినవాఁడు లోకముయొక్క యభిమానమును గాపాడువాఁడు మహాతేజస్సంపన్నుఁడుదృఢమైనప్రతాపముగలవాఁడు - అతఁడునిన్ను శాపమువలన దొలగించును - అతనిచేతశాపమునుండివిడుపింపఁబడుదువు - ౧౦౭ . ఇట్లుచెప్పి యా

౧౦౮ ॥ ఇత్యుక్త్వాసతయాయామానిస్సాహంద్రైతోౣభవంతతః । చిరరాత్రా యకాంతా శేశాపదగ్ధః స్థితఃఖలు॥ ౧౦౯ ॥ మద్భక్షితానాంజంతూనాంపరిమాణం నవిద్యతే । త్వయాద్యము క్తకలుషః పూతోస్మి నృపకుంజర॥ ౧౧౦॥ ఏతత్తే సర్వమాఖ్యాతం మామకం వర్తనం ప్రభో । సాధయామిమహాబాహో భద్రమస్తుతవానఘ॥ ౧౧౧ ॥ బ్రహ్మ ॥ ఇత్యుక్త్వా పరమామోదస్సయయా త్రిదశాలయం । సదేవల స్తతశ్శూరో వామదేవముపాగమత్ ॥ ౧౧౨ ॥ తేనసత్కారితశ్శ్రీమాన్ప్రియయాకనకాచలం ॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - బ్రహ్మనారదసంవాదే - ఉత్తరఖండే - దేవాంగచరితే - రాక్షస శాపవిమోచనం నామషష్ఠోధ్యాయః.

తతస్సదేవలోధీర ఆసాద్యకనకాచలం । ప్రవిశ్యమందిరంతస్య మయస్యాక్లిష్టకర్మణః ॥ ౧॥ తేనసత్కారితశ్శ్రీమాన్ త్వాష్ట్రేణానందసంకులం॥ తతస్త్వాష్ట్రోమహావీర్యః పప్రచ్ఛ నంజనేశ్వరం ॥ ౨ ॥ కిమర్థమిహరాజేంద్ర ఆగతోసిమహామతే । ఏకఏవమహాబాహో తత్త్వం మెవక్తుమర్హసి॥

---

మునివచ్చి స్వర్గమునకుబోయెను. అంతనేనురాక్షసుఁడనైతిని - శాపముచేతఁ జెడిబహుదినములనుండి యీయడవియందుంటినిగదా- ౧౦౯- నాటనుండి నేను దిన్న జంతువులకులెక్కలేదు - ఓరాజశ్రేష్ఠుఁడా నేనునీచేతఁ బాపమునువిడిచి పరిశుద్ధుఁడనైతిని- ౧౧౦- ఇది నాసమాచారము దీని నీకుసవిస్తారముగాఁ జెప్పితినయా మహాప్రభో - ఇఁక నేనుబోయెదను నీకుశుభముకలుగునయా పుణ్యాత్ముఁడా- ౧౧౧- ఇట్లుచెప్పి మిక్కిలి సంతోషముగలవాఁడై యతఁడు స్వర్గమునకుఁబోయెను- శూరుఁడగు నాదేవలుఁడంత వామదేవునిఁగూర్చివచ్చెను- ౧౧౨- ఆవామదేవునిచేతఁ బూజింపఁబడినవాఁడై సకలసంపదలతోనొప్పిన యాదేవలుఁడు మేరుపర్వతమునుఁ గూర్చిపోయెను - ఇది బ్రహ్మాండపురాణంబున బ్రహ్మనారద సంవాదంబున నుత్తరఖండమున దేవాంగచరితంబున రాక్షస శాపవిమోచనమన్నది యాఱవయధ్యాయము.

అంతధైర్యశాలియగునాదేవలుఁడు మేరుపర్వతమునుబొంది యందుఁ బరిశుద్ధమగు కార్యములుగల మయునిగృహముప్రవేశించి విశ్వకర్మకొడుకగు నామయునిచేత సంతోషముతోఁగూడినట్లు పూజింపబడెను - అంతఁద్వష్టకొడుకును మహాపరాక్రమవంతుఁడునగు నామయుఁ డీదేవలరాజు నొకప్రశ్నచేసెను- ౨- ఓరాజశ్రేష్ఠుఁడా మిక్కిలి బుద్ధికుశలతగలవాఁడా యేకార్యము కో

౩ ॥ ఏవం పృష్టస్తతస్తేన దేవలో వాక్యమబ్రవీత్ ॥ దేవలః ॥ శ్రుణు త్వాష్ట్రి మహాబాహో మదాగమనమవ్యయ ॥ ౪॥ వయనస్యాగతశ్శీఘ్రం మహాత్మా సామగ్రీకాముకః ప్రభో । భవాన్ హి కుశలీ ప్రాజ్ఞస్సమర్థోఽసి మహామతే॥ ౫॥ తత్త్వం నిర్మాయ సామగ్రీం వయనస్యాదిశ ప్రభో । దాతవ్యాని మయా శీఘ్రమంబరాణి మహామతే॥ ౬॥ దేవాదీనాం తతస్తేషాం శీఘ్రం మే దాతుమర్హసి । ఏవ ముక్తో దేవలేన మయో బాఢమితీరయన్॥ ౭॥ సామగ్రీం సకలాం తస్య నిర్మమే క్షణతస్తతః । తతో రమ్యాం వజ్రమయీం వేష్టనీం సచకార హ॥ ౮॥ రత్నస్థగితవైడూర్యఫలకాం వజ్రదంతికాం। సూచికాం సూక్ష్మవిద్యాసు కుశలస్స చకార హ॥ ౯॥ తతో మారకతం పుష్యరాగపుష్పవిరాజితం । గోమేధికకుదం వాయదండం చక్రే మహామతిః॥ ౧౦॥ తురీం గారుత్మతమయీం వజ్రకీలాం చకార హ ఏకైకరత్నవికృతాస్త్వేకైకఫలకాశ్శుభాః॥ ౧౧॥ రాజంతే యత్ర తాం చక్రే

---

అకిక్కడకు వచ్చితివి - నీపరిజనములను విడిచివచ్చితివి - నీరాకకుఁ గారణము నుయథార్థముగా నాతోఁ జెప్పుము- ౩- ఇట్లా మయుని చేత నడుగఁబడి యంత దేవలుఁడు త్తరము చెప్పెను - దేవలుఁడు చెప్పినమాట - ఓ మహాభుజుఁడైన మయుఁడా నా రాకకుఁ గారణమును జెప్పెద నిప్పుడు వినుము- ౪- సకల సంపదలతో నొప్పియుండెడు మయుఁడా - నేతకు సామగ్రిని గోరినవాఁడనై వచ్చితినోయి సర్వకార్యసమర్థుఁడా - మిక్కిలి బుద్ధిగల మయుఁడా నీవు దెలిసినవాఁడవు నేర్పరివి గట్టివాఁడవు- ౫- కాఁబట్టి నీవు నేయుటకు సామగ్రిని నిర్మించియిమ్ము- మిక్కిలిబుద్ధిగలయో మయుఁడా - నేను శీఘ్రముగ నంపఁదగు వస్త్రములనీవలయును - దేవతలు మొదలగువారలకెల్ల నీవలయును గనుకఁ ద్వరితముగ నీవు సామగ్రి నీవలయును - ఇట్లు దేవలుఁడు చెప్పఁగా మయుఁడు మంచిదని యంగీకరించుచు నంతటనొకక్షణమునకే యెల్లసామగ్రి నిర్మించెను- అంతటనతఁడు వజ్రమయమై సుందరమై యుండునట్టి వస్త్రమును జుట్టు సాధనమును నిర్మించెను- ౮- నడుమ రత్నములు చెక్కిన వైడూర్యమణివికారమైన పలకను వజ్రమయమును దంతమయమునై యుండు సూదిని సూక్ష్మవిద్యలయందు నేర్పరియైన యా మయుఁడు చేసెను- ౯- అంత మిక్కిలి బుద్ధిశాలియగు నతఁడు మరకతమణివికారమై పుష్యరాగపు పువ్వులచేత నలంకరింపఁబడి గోమేధికములు కంఠస్థానమందు గలిగి యుండునట్లు నేతకఱ్ఱను జేసెను- ౧౦- గరుడపచ్చతోఁడి నాడెకోవిని వజ్రమయమైన కీలను జేసెను - చుట్టునట్టి యా వజ్రమయమైన కీలయందు నొక్కొక్క పలక

భ్రమణేవజ్రకీలికాం । తథైవకారయామాస విచిత్రాం పరివేష్టినీం॥ ౧౨॥ వ
జ్రముష్టింవజ్రకీలాం రత్నపుష్పవిరాజితాం । చకారచ్ఛురికాంధీమాన్ హేమ
పట్టామయోమయీం॥ ౧౩॥ సప్తోపకరణాన్యస్య వయనస్య మహామతేః । ద
త్వామయోబ్రవీద్వాక్యం దేవలంకుశలీతతః ॥ ౧౪ ॥ ఏతేషాం శృణురాజేం
ద్రప్రభావం హర్షదాయినం । అనేకాన్యప్యంబరాణి వేష్టన్యాం వేష్టయేద్య
ది॥ ౧౫ ॥ పరిపూర్తింనయాత్యేషా ప్రమాణంచాపితాదృశం । ఏషాచసూచ్యతి
కారాజన్ వేమాచైవమనోహరః॥ ౧౬॥ అనుబంధ ప్రమాణేన భవతోనాత్ర
సంశయః ఇచ్ఛానశానికీలాని తుర్యాశ్శ్రిణుమహామునే॥ ౧౭॥ పంచవర్ణేషు
ఖండేషు సంస్యూతేష్వభిమానద । ప్రకృతస్యోపయోగీయః ఖండస్సభ్రిశ్య
తేఖలు॥ ౧౮ ॥ భవేయురపి తేసర్వే ప్రకృతస్యోపయోగినః । పంచభిఃపరివేష్ట
న్యావేష్టితాయాశ్చతంతుభిః ॥ ౧౯ ॥ ఆయాంతి ప్రకృతేనైవ సర్వేచాపిపృథ
క్పృథక్ । భ్రమణం పంచఖండానాం భవేత్సంస్యూతికైకధా॥ ౨౦॥ ఇత్యు

---

యొక్కొకరత్నముచేతఁజేయఁబడినదిగాఁబ్రకాశించునట్లుచేసెను అట్లుచిత్రమ
గువస్త్రములఁజుట్టు సాధనమును నిర్మించెను- ౧౨- వజ్రమయమైన పిడికిటిప
ట్టుగలయట్టి వజ్రమయమైనకీళ్లుగలిగి రత్నపుపువ్వులచేత బ్రకాశించుచున్నట్టి
యుబంగారపుపట్టుగలిగి యుక్కువాదఱగల సురియకత్తిని జేసెను- ౧౩- బుద్ధి
శాలియునేర్పుగలవాఁడునగు నామయుఁడు నేతకేఁడు సాధనములనిర్మించి దేవ
లునకిచ్చి యంత దేవలునిఁగూర్చి యిట్లనిపలికెను- ౧౪- ఓరాజరాజగు దేవలు
డా మిక్కిలి సంతోషకరముగానుండునట్టి యీయాయుధముల మహిమను
జెప్పెదవినుము - ఈవస్త్రములఁ జుట్టుసాధనమున్నదే దీనియందుఁ బెక్కు
వస్త్రములఁజుట్టిన నిదినిండదు నీనిప్రమాణమట్టిది - ఓరాజా యీసూదియు
ను నేతకత్తియును నీయను బంధప్రమాణముచేత హృద్యమైనవిగానుండఁ గ
ల వీవిషయమందుసందేహములేదు - ఓమిక్కిలి బుద్ధిశాలీ ఈనాడెకోవియొ
క్క చీలలు తలఁచినట్లుకాఁగలవు- ౧౭- ఓలోకముల యభిమానమును గా
పాడెడువాఁడా - ఐదువన్నెల తంతువుల కండెలఁజుట్టి యున్నను వానిలో
బ్రకృతోపయోగియగు తంతువే వచ్చుచుండును - మఱియు నైదుతంతువు
లఁజుట్టియున్న యాసాధనమందలి యైదుతంతువులు ప్రకృతమునకుపయోగిం
చునట్లునగును- ౧౯- అన్నియు వేర్వేరఁ బ్రకృతముగుండానే వచ్చుచుండు
ను - ఐదువిధములఖండము లొకమాదిరిగాఁదిరుగుచుండును - ౨౦ - ఇట్లుచె

క్త్వాసమహాశక్తిం దేవలాయతదాదదౌ । హేమపట్టాం వజ్రమయీ మష్టఘం
టావిరాజితాం॥ ౨౧॥ తతస్తుదేవలః ప్రీత్యాభూషయిత్వామయంభృశం। తేన
సత్కారితశ్శ్రీమా నగమత్స్వపురంప్రతి॥ ౨౨॥ అనుబంధం బబంధాథస్వయ
మేవ మహామతిః । యస్యప్రమాణమిచ్ఛాయా వశమాసీన్మనోహరం॥ ౨౩॥
ఋషయః॥ అనుబంధంకింనదదౌ దేవలాయ మయోనఘ । బద్ధోనుబంధశ్చై
తేన దేవలేనేతిభాషితం॥ ౨౪॥ సర్వోపకరణానాంతు అనుబంధస్య బంధనం॥
కఠినంతత్రదక్షస్య దేవలస్య మహామతేః ॥ ౨౫ ॥ మయదత్తాంహిసామగ్రీం కి
మశక్యంహికల్పితుం । స్వయందక్షో మహారాజః కుతస్త్వాష్ట్రిముపాగమత్ ॥
౨౬ ॥ ఏతన్నిబోధయాస్మాకంసూతతత్త్వవిశారద । సూతః ॥ అనుబంధప్రబం
ధస్తు శంకరానుగ్రహాన్మునేః ॥ ౨౭ ॥ సంసిద్ధ్యత్యార్జవేనాస్య దేవలస్య మ
హాత్మనః । సర్వస్యాఅపిసామగ్ర్యాః కల్పనే దేవలః ప్రభుః ॥ ౨౮ ॥ యతోస్మా

---

ప్పి యామయుఁ డప్పుడా దేవలునికొఱకు బంగారపు పట్టగలిగి వజ్రముచేని
ర్మింపఁబడినదై యెనిమిదిగంటలచేతఁ బ్రకాశించుచుండునట్టి పెద్దశక్తినిచ్చె
ను - ౨౧ - అంత దేవలుఁడు మిక్కిలి సంతోషముచేత నామయునిశ్లాఘించి
యతనిచేత మర్యాదచేయఁబడినవాఁడై తనపట్టణమునుగూర్చి బయలువెడ
లెను - ౨౨ - తరువాత మహాబుద్ధిశాలయగునట్టి యాదేవలుఁడను బంధ
ప్రమాణము తనవశముగానుంటంజేసి యట్టి మనోజ్ఞ మగునను బంధమును
దానేకట్టెను - ౨౩ - ఇట్లీకథ సూతుఁడు ఋషులకుఁ జెప్పఁగా ఋషులుసూ
తునడుగుచున్నారు - ఈదేవలుఁడే యనుబంధమును బంధించినట్లు చెప్పితి రే
మయుఁడు దేవలునికొఱకేల ననుబంధమునీఁడాయెను - ౨౪ - అన్ని సాధనము
లఁజేయుటకంటె ననుబంధమును బంధించుటకష్టము - అట్టి యనుబంధమును
బంధించుటకు శక్తుఁడై నమహాబుద్ధిశాలికి మయుఁడిచ్చిన సామగ్రిని నిర్మిం
చుటకష్టమా - లేక తాను సమర్థుఁడుగానే యున్న పక్షమందు మహారా
జగుదేవలుఁడు త్వాష్ట్రినియొద్దకేల పోవలెను - ౨౬ - సర్వ రహస్యము
లదెలిసినయోసూతుఁడా మాకీసందేహమునువారింపుము- అనియడుగగా ఋ
షులనుగూర్చిసూతుఁడుచెప్పుచున్నాఁడు- అనుబంధమును గల్పించుశక్తి దేవ
లమునికి సాంబశివునియనుగ్రహమువలనను దేవలమహాముని మిక్కిలి ఋజు
ప్రకృతికలవాఁడౌటవలనను నతనికిసిద్ధించెను - సాధనముల నన్నిటి గల్పింప
దేవలుఁడుశక్తిగలవాఁడే- ౨౮- బహుదినములనుండి శాపమున మునీంగికడవఁ

ద్భవితవ్యంహి తయోరాక్షససింహయోః । విమోచనంచ శాపస్య చిరకాల
నివిష్టయోః॥ ౨౯॥ తతోపకరణవ్యాజే నాగభస్మయసన్నిధిం। చతురాస్యస
మర్థస్య దేవలస్యమహాత్మనః ॥ ౩౦ ॥ త్రిలోకే ష్వపియత్కించి దసాధ్యంనహి
విద్యతే । సజ్జీకృత్యోపకరణా న్యఖిలాని సదేవలః ॥ ౩౧ ॥ అస్మరచ్చండికాం
దేవీంభక్త్యాచౌడేశ్వరీంతతః । స్మృతమాత్రాభగవతీ దేవలేనమహాత్మనా॥
౩౨ ॥ ఆసాద్య దేవలందేవీబభాషేప్రీతిపూర్వకం । వత్స దేవల కింకార్యం వద
మేపురుషర్షభ॥ ౩౩॥ మమాద్యాగమనంచైవ కిమర్థంకాంక్షితంత్వయా। ఏ
వముక్త స్తతో దేవ్యా దేవలోహర్షపూరితః॥ ౩౪॥ నత్వా స్తుత్వాచ బహుధా
దేవలోవాక్యమబ్రవీత్ । కృతకృత్యోస్మి దేవేశి ధన్యోస్మి తవదర్శనాత్ ॥
౩౫ ॥ త్వత్ప్రసాదాన్మహాదేవీ సఫలోమనసోరథః । శివాజ్ఞయాహం నిర్మా
ణంవస్త్రాణాంకర్తుముత్సహే॥ ౩౬॥ అస్తుతేషాం మత్కృతానా మక్షయో
భక్తవత్సలే । త్రిషులోకేషుసర్వేషాం దాతవ్యాన్యంబరాణిహి॥ ౩౭॥ త్వత్ప్ర

---

జాలకయున్న యా రాక్షసునకును సింహమునకును శాపవిమోచనమీ దేవలు నివలనఁగలుగునట్లువిధియుండుటవలననుపకరణముల దెచ్చువ్యాజమును బెట్టు కొని దేవలమునిమయునిదగ్గిరకుఁబోయెను - బ్రహ్మదేవునితో సరియైనసమర్థుఁ డగు దేవలునకీమూఁడులోకములయందు నసాధ్య మొక్కటియులేదు - ౩౧ - ఆ దేవలుఁడెల్లయుపకరణములనుగూర్చికొని తరువాత చౌడేశ్వరీ మహాదేవిరూ పిణియైనచండికనుస్మరించెను - దేవలుఁడు స్మరించినమాత్రముచేతనే యతఁడు మహానుభావుఁడగుటంజేసి షడ్గుణైశ్వర్య సంపన్నురాలగు నామహాదేవి దేవ లునకుఁబ్రత్యక్షమునవిల్చి ప్రేమతోఁబలికెను - ఓనాయనా దేవలుఁడాయేమి కార్యము నాకుఁ జెప్పెదవో చెప్పుము- ౩౩- ఇప్పుడు నారాకనేకార్యము నుద్దే శించినీవుకోరితివి - ఇట్లా చౌడేశ్వరిచేతజెప్పబడి దేవలుఁడంతట సంతోషభరి తుఁడై యమ్మవారికిమ్రొక్కి పెక్కువిధముల నామెను స్తోత్రముచేసి యామె తో నా దేవలుఁడొకమాటజెప్పెను - ఓదేవతలకెల్లఁ బ్రభువగు నీశ్వరునకుఁబ త్నియగు దేవీ నీదర్శనమువలనఁగృతకృత్యుఁడనై తి ధన్యుఁడనై తిని- ౩౫- ఓమ హాదేవీ నీయనుగ్రహమువల్లనాకోరికసఫలము- శివునాజ్ఞప్రకారమునేనువస్త్ర ములనిర్మాణముచుజేయ నుద్యుక్తుఁడనై యున్నాను- ౩౬- భక్తులయందుఁబ్రీతి గలయో దేవీ నేనునేసిన వస్త్రములు తఱుగకయుండ వలయును - మూఁడులో కములయందుండు వారలకెల్ల వస్త్రములనీవలయునుగదా - ౩౭ - ఓమహా

సాదాన్మహాదేవి వస్త్రాణా మక్షయా స్త్వపి । దేవాదీనాం యథాకామం దత్వావస్త్రాణిచాంబికే॥ ౩౮॥ భూయాసంకృతకృతోఽహం తథాత్వం కర్తుమర్హసి । ఏవం సంప్రార్థితా దేవీ దేవలేనయశస్వినా ॥ ౩౯ ॥ అబ్రవీన్మధురంవాక్యం తోషయంతీతమాదరాత్ । త్వయాయదుక్తంరాజేంద్ర తత్తథైవభవిష్యతి॥ ౪౦॥ ఇదం మత్కంకణందివ్యం బిభ్రాణస్స్వకరేనఘ । వయవస్త్రాణికౌశల్యా న్నానావర్ణానిమానద ॥ ౪౧ ॥ ఏకైకస్యచ వర్ణస్య చైకైకం వయయత్నతః । అక్షయాణిభవిష్యంతి తానిసర్వాణ్యసంశయః॥ ౪౨॥ యాదృశాన్యపివస్త్రాణి కరిష్యంతేత్వయానృప । అక్షయాణిభవిష్యంతి తాదృశానినసంశయః॥ ౪౩॥ రీత్యాప్యేకేకృతేవస్త్రే అక్షయం తద్భవిష్యతి । ఇత్యుక్త్వా సామహాదేవీ దత్వా కంకణమాదరాత్॥ ౪౪॥ సంతోషయిత్వారాజా నంతత్రైవాంతరధీయత । దేవలస్తుతతశ్శ్రీమాన్నారబ్ధుంవయనంకృతీ॥ ౪౫॥ శుభం ముహూర్తం నిశ్చిత్య విప్రైః కార్తాంతికైర్ధ్రువం । సర్వానాహూయ వి

---

దేవీ నీయనుగ్రహమువల్ల వస్త్రములు తఱుగక యుండవలయును - ఓ యంబికా దేవతలు మొదలగువారికి వస్త్రములఁగోరిన రీతినిచ్చి నేనుకృతార్థుఁడనగుదును - కాఁబట్టి నీవట్లనుగ్రహింపవలయును - కీర్తిఁగల యా దేవలునిచేత నాచౌడేశ్వరి మహాశక్తి యిట్లుప్రార్థింపఁబడినదై ప్రీతివలన నతని సంతోషపఱుచుచు తీయనిమాట చెప్పెను - ఓ రాజశ్రేష్ఠుఁడా నీవెట్లు చెప్పితివో యావిషయమట్లెయగుఁగాత - ౪౦ - ఓనిష్కల్మషుఁడా లోకములకు మానమునిచ్చినవాఁడా - ఇది నాచేతి దివ్యమైనకంకణము దీని నీచేతధరించుచు నీ నేర్పువలన ననేకవిధములయిన పటములను నేయుము- ౪౧- నీవు నేయునపుడొక్కొక వర్ణముగల వస్త్రమొకటొకటి ప్రయత్నపడి నేయవలయును - పిమ్మట నవితఱుగనివై పెరుగును సందేహములేదు - ౪౨ - ఓరాజా నీవేమాదిరి వస్త్రముల నేయుదువో యవియన్నియు నక్షయములే యగును సందేహములేదు - ౪౩ - రీతికొకవస్త్రమును నీవునేసిన నావలనది యక్షయమైపెఱుగును - ఇట్లుచెప్పి యామహాశక్తి ప్రీతితోఁ గంకణమునిచ్చి దేవలరాజును సంతోషపఱిచి యక్కడనే యంతర్హితురాలాయెను - అంత సకల సంపదలతోనొప్పుచు మిక్కిలి సమర్థుఁడై యున్న యాదేవలుఁడు నేయనారంభింపను జ్యోతిషికులగు బ్రాహ్మణులచేత శుభకరమగు ధ్రువ ముహూర్తమునునిశ్చయించి బ్రాహ్మణ శ్రేష్ఠులనెల్ల రావించి వారలకు దక్షిణలిచ్చి వారల

ప్రేంద్రాః దక్షిణాభిరతోషయత్ ॥ ౪౮ ॥ కృతస్వస్త్యయనోరాజా ధృవేతస్మిన్ముహూర్తకే । సజ్జీకృతోపకరణో దధానః కంకణంకరే ॥ ౪౭ ॥ వినిర్మమౌనుమహార్ఘాణి వస్త్రాణి సమహామతిః॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - వయనోపకరణ సంపాదన చౌడేశ్వరీ వస్త్రేక్షయ వరప్రదాన వస్త్రనిర్మాణ ప్రారంభానామ సప్తమోధ్యాయః.

శ్రీసూతః॥ తతోసౌదేవలశ్శ్రీమాన్ రోచయన్కౌశలంస్వకం । నానావిధానివస్త్రాణి వయతిస్మమహామతిః ॥ ౧ ॥ నేత్రబంధావళీంచైవ హంస బంధావళీంతథా । హంసపూజావళీం చంద్రావళీం తారావళీం శుభాం ॥ ౨ ॥ చంద్రతారావళీంరమ్యాం చారుమేఘావళీంతథా । ఇత్యాద్యా బహుధారమ్యా నిర్మితాస్తేనవర్ణకాః ॥ ౩ ॥ శుభ్రాణ్యపిచకృష్ణాని పీతానిహరితానిచ॥ రక్తానిచవిచిత్రాణి వేత్వానేత్రాణిదేవలః ॥ ౪ ॥ బహూన్యాదాయకుశలీ జగామహ

---

సంతోషపఱచెను - ౪౮ - దేవలరాజు ముహూర్తమందు బ్రాహ్మణులచే తనాశీర్వచనములు చేయఁబడినవాఁడై యాసాధనములనెల్లఁ జక్కఁజేసుకొని యాచౌడేశ్వరి యిచ్చిన కంకణమును జేతధరించుకొనుచు మిక్కిలి వెలగలిగి మహాశ్రేష్ఠములైన వస్త్రములను సృజించెను- ౪౭- ఇది బ్రహ్మాండపురాణంబున దేవాంగుని చరితంబున వయనోపకరణ సంపాదనము చౌడేశ్వరీ వస్త్రేక్షయ వరప్రదానము వస్త్రనిర్మాణ ప్రారంభము నన్నది సప్తమాధ్యాయము.

సూతుఁడు పిమ్మటికథ నాఋషులకుఁ జెప్పుచున్నాఁడు - అంత సకల సంపదలుగల యాదేవలుఁడు దన నేర్పందఱకు మనోహరమగునట్లు పలువిధములగు వన్నెలుగల వస్త్రములను నేసెను - ౧- నఘమకన్నులవంటి పూలుగలుగువన్నెను హంసవన్నె గల్గియుండు దానిని హంసలవంటి పూజలుగలిగియుండువానిని చంద్రునివన్నెలు గల్గియుండువానిని నక్షత్రములవలె పువ్వులుండువానిని చంద్రునిపూలు నక్షత్రముల పూలును గలిగియుండువానిని సుందరమగు మబ్బువన్నె గలిగియుండువాని నిట్లు మఱియుఁ బలు విధములై మిక్కిలిసొగసుగానుండునట్టి వన్నెలన్నియు నప్పుడా దేవలుఁడుకల్పించెను- ౩- తెల్లనివియు నల్లనివియుఁ బసుపు వన్నెవియు పసురువన్నెవియు నెఱ్ఱనివియు జిత్రవర్ణము లవియు వస్త్రములు దేవలుఁడునేసి యనేకవస్త్రముల నెత్తుకొని మిక్కిలి నేర్పరియగు నా దేవలుఁడు విష్ణువు సమీపమునకుఁబోయి యం

రిసన్నిభం । దత్త్వాథ హారయేరమ్యం పీతాం బరమథాదరాత్ ॥ ౫॥ శుభ్రం
దుకూలంసుస్నిగ్ధం లక్ష్మ్యైదత్వామహామతిః । వసుంధరాయై రుచిరం దత్వా
సౌరక్తమంబరం॥ ౬॥ తత్రస్థితానాం సర్వేషాం వితీర్యచయథేప్సితం । భూష
ణైర్మకుటైర్దివ్యై ర్వాహనై రప్యనేకశః ॥ ౭ ॥ శ్వేతద్వీప స్థితైస్సర్వై
ర్వైష్ణవైఃపరితోషితః । లక్ష్మీనారాయణాభ్యాంచతోషితోమణిభూషణైః॥
౮॥ సత్యలోకం తతోగత్వా బ్రహ్మణే లోకకారిణే । రక్తందత్వా సరస్వత్యై
ధవళం దివ్యమంబరం॥ ౯॥ పీతంచవస్త్రంసావిత్ర్యై గాయత్ర్యై రక్తమంబ
రం । ప్రజాపతేస్తుధవళం పులస్త్యస్యతుహారితం ॥ ౧౦ ॥ గంధర్వాఃకిన్నరా
స్సిద్ధాస్సాధ్యాశ్చైవ మహర్షయః । చారణాద్యాశ్చయేతత్ర స్థితాస్తేషాం
మహాత్మనాం॥ ౧౧॥ దత్వాయథేష్టంవస్త్రాణి ప్రణమ్యచతురాననం। బ్రహ్మా
ణం జగతామీశ మితిపప్రచ్ఛదేవలః॥ ౧౨॥ స్వామిన్నితసురజ్యేష్ఠ మాద్యశా
నాం గిరీశ్వర॥ ౧౩॥ తేషాం కురుమహాభోగ తంతులాభం దయానిధే । ఇత్యు

---

డు బసుపువన్నె దోవతినెత్తి ప్రీతితో విష్ణువుకొఱకిచ్చెను- ౫- మిక్కిలి జ్ఞాన
ముగల యాదేవలుఁడు తెల్లని వస్త్రమునెత్తి మహాలక్ష్మికినిచ్చి భూమికొఱకు
సుందరమైనయెఱ్ఱనిచీరనిచ్చి మఱియునక్కడనుండు వారలకెల్ల వారువారుగో
రినమాదిరి వస్త్రములనిచ్చి యాశ్వేత దీపమందుండు వైష్ణవులచేతనెల్లఁ బె
క్కువిధములగుసొమ్ములచేతను గిరీటములచేతను దివ్యములగు వాహనముల
చేతను సంతోషపఱుపఁబడి లక్ష్మీనారాయణులచేతను రత్నమయములగు
భూషణములచేత సంతోషపఱుపఁబడినవాఁడాయెను - ౮ - అంతట నచ్చ
టనుండి సత్యలోకమునకుఁబోయి లోకనిర్మాతయగు బ్రహ్మకొఱకెఱ్ఱని వ
స్త్రమునిచ్చి సరస్వతికొఱకు మంచి తెల్లనిచీరను సావిత్రియను దేవతకొఱ
కుఁ బసుపువన్నె చీరను గాయత్రికొఱకెఱ్ఱనిచీరను బ్రజాపతికిఁ దెల్లని దోవ
తిని బులస్త్యునకుఁ బసురువన్నెదోవతిని మఱియు నక్కడనున్న గంధర్వులు
కిన్నరులు సిద్ధులుసాధ్యులు మహర్షులు చారణులు వీరలకెల్ల వారువారుగోరిన
వస్త్రములను వారివారికిచ్చి జగత్తులకెల్లఁ బ్రభువును నాలుగుమోములుగల
వాఁడునగు నాబ్రహ్మను నమస్కరించి యాదేవలుఁడిటడిగెను - ౧౨ - దేవ
తలకెల్లఁ బెద్దవాఁడవు సకలమునుసృజింప సమర్థుఁడవగు నోస్వామీ యిఁక
మీఁదమావంటివారికి వస్త్రములు నేయుటకు నూలు కావలయునే యదియె
ట్లుకలుగును - ౧౩ - వారలకు నూలులభించునట్లు చేయుమయా దయానిధీ.

క్తస్తేనలోకేశో దేవలం వాక్యమబ్రవీత్ ॥ ౧౪॥ శ్రుణుదేవలవంశ్యానాం తతః ప్రాప్తింతుతాంతవీం । ఇమెమానన్యభిమానీతి విష్ణునాభిస్థితే స్త్రియో॥ ౧౫॥ సావరాశ్చభవిష్యంతి తంతుసంతానకారణాత్ । తైనైవతంతవోలోకే బహుళాస్స్యుర్నసంశయః ॥ ౧౬ ॥ ఇత్యుక్తో దేవలోహృష్టో బ్రహ్మణా ప్రేషితస్తదా । స్వర్గంగత్వామహేంద్రస్య రక్తంవస్త్రం దదౌనృపః॥ ౧౭॥ శచ్యాః పీతాంబరం దత్వాజయంతస్యచధావళం । వసూనాంతత్రచాష్టానా మాదిత్యానాం తథైవచ॥ ౧౮॥ రుద్రానాముగ్రమూర్తీనాం పృథరత్నయథారుచి । బ్రహ్మర్షిణాంసురర్షీణాం దేవానాంచయథేప్సితం ॥ ౧౯ ॥ గంధర్వాణాం మనోజ్ఞానిదదౌవస్త్రాణి దేవలః । వారణైస్తురగైర్హారై ర్మణిభిర్భూషణైరపి॥ ౨౦॥ అస్త్రైశ్చ వివిధై రాజా తైస్సర్వైః పరితోషితః । సర్వాసామప్యప్సరసాం యథారుచివితీర్యచ ॥ ౨౧ ॥ అన్యేషాం దేవయోనీనాం దత్వావస్త్రాణిసాదరం।తతోగమమత్సువర్ణాద్రిం దేవలోరాజశేఖరః॥ ౨౨॥ దేవావిద్యాధరాశ్చైచ

---

అనియిట్లాదేవలుఁడడుగఁగా లోకములకు ప్రభువగు నాబ్రహ్మ యాదేవలుని గూర్చి యుత్తరముచెప్పెను - ౧౪ - ఓదేవలుఁడా నీవంశమువారికిఁకమీఁద నూలుకలుగువిధమునుజెప్పెదవినుము - వీరిద్దఱు మానియని యభిమానియనియుఁ బేరుగల స్త్రీలు వీరువిష్ణునాభికమలమందున్నవారు - వీరు తంతువులకు విచ్ఛేదములేకుండుటకై భూమియందుఁ జెట్లులుగాఁ గుదురు - అందుచేతఁ బ్రపంచమందుఁ దంతువులధికములగును సందేహములేదు - ౧౬ - అప్పుడా దేవలుఁడు బ్రహ్మచేత నిట్లు చెప్పఁబడి సంతోషించినవాఁడై బ్రహ్మచేతఁ బంపఁబడి స్వర్గమునకువచ్చి యక్కడ మహేంద్రునకెఱ్ఱనివస్త్రము నిచ్చెను - ౧౭ - శచీదేవికిఁ బసుపువన్నెవస్త్రమును జయంతునకుఁ దెల్లనివస్త్రమును మఱియునెనమండ్రువసువులకు ద్వాదశాదిత్యులకు నుగ్రవిగ్రహులగు నేకాదశరుద్రులకు వారల మనస్సునకు సమ్మతములగు వస్త్రములనిచ్చెను - ఇంకను బ్రహ్మర్షులకు దేవఋషులకు దేవతలకు గంధర్వులకు వీరలకందఱకు వారువారుకోరినట్లు మనోహరములగు వస్త్రములను దేవలుఁడిచ్చెను - ౧౯ - అంతటవారందఱుచేత నేనుగులు గుఱ్ఱములు దండలు రత్నములు సొమ్ములు పెక్కుతెఱఁగుల యాయుధములు వీని నెల్లగ్రహించి సంతోషపడినవాఁడై మఱియు దేవతాభేదములకెల్లఁ బ్రీతితోవస్త్రములనిచ్చి యంతనా రాజశ్రేష్ఠుఁడగు దేవలుఁడు మేరుపర్వతమును బొందెను - ౨౨ - ఆమేరు

వగంధర్వాస్సిద్ధచారణాః। సాధ్యాఃకింపురుషాయక్షాః కిన్నరాగరుడా స్తథా॥
౨౩॥స్థితా స్తత్రమహాత్మానో మునయోయేతపస్వినః । తేషాంశుభ్రాణి రక్తా
నినీలానిహరితానిచ॥ ౨౪॥ పీతాన్యపివిచిత్రాణి సర్వేషామంబరాణిచ । ద
త్వాతై స్తోషితశ్శ్రీమాన్ స్తతస్త్వష్టాప్రియధీమతే॥ ౨౫॥ దుకూలాని మనో
జ్ఞానియథాకామంవితీర్యచ । తేనాయుధైరనేకై శ్చభూషణై స్తోషితోభృశః॥
౨౬ ॥ తతోగత్వామహేంద్రాద్రింగంధర్వాణాంమహామతిః । దత్వాంబరా
ణిదివ్యానిసతైరాసందితస్తతః॥ ౨౭॥ మలయాద్రింతతోగత్వా సిద్ధాన్వస్త్రై
రతోషయత్ । తైస్సత్కృత స్తతస్సహ్యావాసినః కిన్నరేశ్వరాన్ ॥ ౨౮॥ సం
తోషయిత్వావస్త్రైర్హిమవంతంజగామహ । కింపురుషాణా మంబరాణి
దత్వాసౌసమతోషయత్ ॥ ౨౯ ॥ చారణాం స్తోషయామాస తతోవింధ్యాద్రి
వాసినః । ఋక్షవంతం సమాసాద్య తతోవిద్యాధరాన్ బహూన్ ॥ ౩౦॥ సం

---

పర్వతమందుండు దేవతలకును విద్యాధరులకును గంధర్వులకును సిద్ధులకును
జారణులకును సాధ్యులకును గింపురుషులకును యక్షులకును గిన్నరులకును
గరుడులకును మఱియు మహానుభావులును దపస్సంపన్నులునగు ఋషులకు
ను వీరలకెల్ల వారువారుకోరినట్లు తెల్లని యెఱ్ఱని పచ్చని నల్లని పసుపువన్నె
వియును నానావర్ణములునగు వస్త్రములనిచ్చి వారలచేత సంతోషపఱుపఁ
బడి తరువాత మిక్కిలిబుద్ధిశాలియగు త్వష్టృనికొఱకుఁగోరిన మంచివస్త్ర
ములనిచ్చియతనిచేతనేకములగు నాయుధములచేతనుసొమ్ములచేతనుసంతో
షపెట్టఁబడెను - ౨౬ - తరువాతనతిబుద్ధిశాలియగు దేవలముని మహేంద్రప
ర్వతమునకుఁబోయి యక్కడిగంధర్వులకెల్ల దివ్యములగుదోవతులనిచ్చియా
గంధర్వులచేత సంతోషపఱుపఁబడెను - ౨౭ - అంతమలయపర్వతమునకుఁ
బోయి యచ్చటి సిద్ధులనెల్ల వస్త్రములచేత సంతోషపఱిచి వారిచేతఁబూ
జింపఁబడినవాఁడై యంతట సహ్య పర్వతమందుండు కిన్నరశ్రేష్ఠుల దివ్య
ములగుపటములచేత సంతోషపెట్టి యక్కడనుండి హిమవత్పర్వతమునకుఁ
బోయెను - పోయి యక్కడికింపురుషులకు దోవతులనిచ్చి వారలఁదుష్టినొం
దించెను- ౨౯- తరువాతనక్కడనుండివింధ్యపర్వతమునకుఁబోయి యక్కడి
చారణులను సన్తోషపఱిచి యంతఋక్షవంతమనుకొండమీఁదికిఁబోయి యచ్చో
టివిద్యాధరులను దనిపిపారిజాతపర్వతమునకుఁబోయి యచ్చటి గంధర్వులకు
నుసాధ్యులకునుకోరినవస్త్రములనిచ్చిమఱియునరణ్యములయందుండితపస్సు

తోష్యపారిజాతాద్రిం తత్రగంధర్వసంహతేః । వితీర్య వస్త్రజాలాని సాధ్యానాంచ యుధేప్సితం॥ ౩౧॥ తపస్వినోపిమునయో యేచాన్యే రణ్యావాసినః । మహాత్మనాంచసర్వేషాంతేషాందత్వాంబరాణిసః॥ ౩౨॥ తత్పత్నీనాంచసాధ్వీనాందత్వావస్త్రాణ్యతోషయత్ । తతోగ్నిపురమాసాద్య దత్వాస్మై శ్రీకృష్ణమంబరం॥ ౩౩॥ తత్సత్కృతో మహారాజో జగామయమపట్టణం। దత్వాస్మై కృష్ణవస్త్రంచతద్భక్తానాంవితీర్యచ ॥ ౩౪ ॥ కోణపస్యాంబరం దత్వా పీతంచ సుమనోహరం। వరుణాలయమాసాద్య తస్మై శుభ్రాంబరందదౌ॥ ౩౫॥ తోషయిత్వాంబరైర్దివ్యైః సర్వాన్ తత్పురవాసినః । తోషితో వరుణేనాసౌ రత్నైర్మహార్ఘైర్మనోహరైః॥ ౩౬॥ వాయుపట్టణమాసాద్య దత్వా తస్మై చ హారితం । తేనసంతోషితశ్శ్రీమా నలకామాససాదహ ॥ ౩౭ ॥ విచిత్రమంబరంతస్మైకుబేరాయదదౌముదా । దివ్యవస్త్రైరనేకైశ్చ తోషయన్నలకూబరం ॥ ౩౮ ॥ సదేవలాయవ్యతర చ్ఛోభనేరత్నకుండలే । కిరీటం కోటిసూర్యా

---

చేసికొనుచు వాడ్నియమనమునుబొందియుండు మహానుభావులకెల్లవలసిన వస్త్రములనిచ్చి యాదేవలుడు వారలభార్యలగు పుణ్యస్త్రీలకు నతిరమణీయములైన వస్త్రములనిచ్చెను-౩౨-అంతనక్కడనుండియగ్నిహోత్రునిపట్టణమునకుఁబోయియతనికినల్లనివన్నెగల వస్త్రములనిచ్చియతనిచేతఁబూజింపఁబడినవాఁడై దక్షిణదిక్కునందుండు యమధర్మరాజుపట్టణమునుగూర్చిపోయెను-పోయియతనికి నల్లనివస్త్రమునిచ్చి యతనిభక్తులకు నట్లేయిచ్చి యచ్చటనుండి యావలనుండు నిర్‌బుతిదగ్గరకుఁబోయి యతనికిఁ బసుపువన్నె దోవతినిచ్చి యక్కడనుండి వరుణునింటికిఁబోయి యతనికిఁ దెల్లని వస్త్రమునిచ్చెను - ౩౫ - తరువాత నావరుణునినగరమందుండు జనులకెల్ల వస్త్రములనిచ్చి వారల సంతోషపఱచి యావరుణునిచేత మణులచేతను మిక్కిలి సుందరములగు దండలచేతను దానుసంతోషపెట్టఁబడి యంతవాయుదేవుని పట్టణమునకుఁబోయియతనికిఁబచ్చనివస్త్రములనిచ్చి యతనిచేతఁబూజింపఁబడి సంతోషించినవాఁడై యక్కడనుండియలకాపట్టణమునుగూర్చిపోయెను - ౩౭ - ఆపట్టణమునకుఁ బ్రభువగుకుబేరునకుఁజిత్రవర్ణమగుదోవతినిచ్చి సంతోషముతోనకములగుసొగసైన వస్త్రముల నతనికొడుకగు నలకూబరునకిచ్చి యతనిసంతోషపెట్టెను - ౩౮ - అంతటమహాబుద్ధిశాలియయిన యాకుబేరుఁడు దేవలునకుమిక్కిలిమనోహరములగు రత్నఖచితములైన కుండలములనుగోటిసూర్య

భంభూషణానిమహామతిః॥ ౩౯॥ తతఈశానమాసాద్యదత్వాస్మైశుభ్రమంబరం। భూతానాంప్రమథానాంచతత్రత్యానాంవితీర్యచ॥ ౪౦॥ అంబరాణిమహార్ఘాణి తైస్సమ్యక్తోషితోనృపః। ఇత్యేవం దేవలోరాజా ధర్మాత్మాకీర్తివర్ధనః॥ ౪౧॥ స్వర్లోకవాసినస్సర్వాన్వస్త్రైర్దివ్యైరతోషయత్। అరక్షదభిమానంహి సర్వేషాం త్రిదివౌకసాం॥ ౪౨॥ మహాత్మనా మృషీణాం చకులపర్వతవాసినాం। సర్వేషాం దేవయోనీనాం దత్వా వస్త్రాణ్యతోషయత్॥ ౪౩॥ దివ్యవస్త్రైరలంకృత్య దేవాంగాని మహాయశాః। దేవాంగ ఇతివిఖ్యాతో దేవలో మునిసత్తమాః॥ ౪౪॥ ఇతిశ్రీబ్రహ్మాండపురాణే దేవాంగచరితే- దేవాంగ దేవలోకవస్త్రప్రదానం నామాష్టమోధ్యాయః.

శ్రీసూతః॥ తతోదేవాంగరాజర్షిరాసాద్యభువమాదరాత్॥ జంబూద్వీపంగతశ్శ్రీమాన్ శోభనం పృథుపాలితం॥ ౧॥ వజ్రపట్టణమాసాద్య పృథవేధరణీభృతే। దదౌ వస్త్రాణ్యనేకాని తత్రత్యేభ్యో యథేప్సితం॥ ౨॥ నా

---

లకెంతవెలుఁగుండునో యంతప్రకాశముగలఁ కిరీటమును మఱియుఁ బెక్కాభరణములనిచ్చెను - ౩౯ - పిమ్మట నాదేవలుఁ డీశ్వరునిదగ్గిరకుఁబోయి యతనికిఁ దెల్లనివస్త్రములనిచ్చి యతనిదగ్గిరనుండు ప్రమథగణములకు భూతములకు మిక్కిలి వెలగలవస్త్రములనిచ్చి వారలచేత లెస్సగాసంతోషపెట్టఁబడెను- ఈప్రకారము ధర్మబుద్ధిగలిగి కీర్తినివృద్ధిఁబొందించునట్టియాదేవలరాజు స్వర్గలోకమందుండు వారలకెల్ల దివ్యములగు వస్త్రములనిచ్చి వారలసంతోషపఱిచెను - స్వర్గలోకమందుండు వారలయందలియభిమానమునురక్షించెగదా- ౪౨ - కులపర్వతములయందుండు మహానుభావులగు ఋషులకును మఱియు దేవతలభేదములకును వలసినవస్త్రములనిచ్చి వారలనెల్లసంతోషపఱిచెను - ౪౩ - ఓమునిశ్రేష్ఠులారా యీప్రకారమా దేవలుఁడు దివ్యములగు వస్త్రములనేసియిచ్చి దేవతలయంగములనలంకరించి దేవాంగుడని ప్రసిద్ధికెక్కెను - ౪౪ - ఇదిబ్రహ్మాండపురాణమందు దేవాంగచరితమందు దేవాంగముని దేవలోకమందు వస్త్రములనిచ్చుటయన్నది యెనిమిదవయధ్యాయము.

సూతుఁడా పిమ్మటికథ నాఋషులకుఁ జెప్పుచున్నాఁడు - అంత న్యాశ్రీమంతుఁడగు దేవాంగముని భూమికివచ్చి ప్రీతితోఁ బృథువనురాజుచేతఁ బాలింపబడి సుందరమైయున్న జంబూద్వీపమునుబొందెను - ౧ - ఆపృథువుండు వజ్రపట్టణమునకువచ్చి రాజగునాపృథువునకనేకములగువస్త్రములనిచ్చియిం

గై ర్హారైర్భూషణై స్తంరాజాపృథురతోషయత్ । ప్లక్షద్వీపంతతోగత్వా
శూరసేనాయభూభృతే॥ ౩॥ దత్వాంబరాణితద్దత్తై స్తోషితోమత్తవారణైః॥
కుశద్వీపంసమాసాద్య తత్రాజ్ఞేకుశినేముదా॥ ౪॥ దత్వాంబరాణి దివ్యాని తే
నాశ్వైఃపరితోషితః । క్రౌంచద్వీపాధిపతయే హేమాక్షాయామితౌజసే ॥
౫ ॥ దత్వావస్త్రాణ్యనేకాని నానావర్ణానిభూపతిః । ముక్తికై రింద్రనీలైశ్చ
హారైర్నాగైశ్చ భూషణైః॥ ౬॥ తేనసంతోషితశ్శ్రీమాన్ శాకద్వీపం జ
గామహ। తస్యరాజ్ఞేభిరామాయాంబరాణి వివిధానిచ॥ ౭॥ దత్వాతేన రథై
ర్యానైశ్చతురంగై ర్మనోహరైః । భూషణై రప్యనేకైశ్చ దేవలో భృశ
తోషితః॥ ౮॥ శాల్మలం ద్వీపమాస్థాయ శాలిహోత్రేమహీక్షితే । దత్వా
వస్త్రాణిదివ్యానితేనాదాయహయాన్బహూన్ ॥ ౯ ॥ పుష్కలద్వీపమగమ
త్తత్రభానుమతేనృపః । మనోహరాణివస్త్రాణి దదౌతస్మైమహామతిః॥ ౧౦॥

---

కనాపట్టణమందలిజనులకెల్లఁ గోరినట్లు దోవతులనిచ్చెను- ౨- అంత నావృ
థువను రాజా దేవలునకేనుఁగులు గుఱ్ఱములు సొమ్ములమితముగానిచ్చి యతని
సంతోషపఱిచెను - అంత నా దేవలముని యక్కడనుండి ప్లక్షద్వీపమునకుఁ
బోయి యక్కడఁ బ్రభుత్వముచేయు శూరసేనుఁడను రాజునకు దోవతులనిచ్చి
యతఁడిచ్చిన మదపుటేనుఁగులచేత సంతోషపడెను- పిమ్మటఁ గుశద్వీపమున
కుఁబోయి యక్కడ ప్రభుత్వమును వహించియుండు కుశియనువానికొఱకు
సంతోషముతో వస్త్రములనిచ్చియతనిచేత నశ్వములనిచ్చి సంతోషపెట్టఁబ
డెను - అంతఁ గ్రౌంచద్వీపాధిపతియగు హేమాక్షుఁడను రాజునొద్దకుఁబో
యి యధిక ప్రతాపవంతుఁడగు నా హేమాక్షునకు నానావర్ణములగు వస్త్ర
ములనిచ్చి యా దేవలరాజా హేమాక్షుఁడుదనకిచ్చుముత్తెములచేత నింద్రనీల
ములచేత గుఱ్ఱములచేత నేనుఁగులచేతఁ దొడవులచేత సంతోషపడి యక్కడ
నుండి శాకద్వీపమునుగూర్చిపోయెను- ౬- పోయి యా శాకద్వీపమునకుఁ బ్రభు
వగునభిరామునికొఱకువివిధములగురత్నములనిచ్చి యతడిచ్చినరథములువా
హనములు సుందరములైన పాలకీలు భూషణములుగ్రహించి మిక్కిలిసంతో
షించెను- ౮- తరువాత శాల్మలద్వీపమునకుఁబోయి శాలిహోత్రయనురాజున
కుమనోహరములగు వస్త్రములనిచ్చి యతఁడిచ్చు ననేకతురంగములను గ్ర
హించికొని యచ్చటనుండి పుష్కలద్వీపమునకుఁబోయి యక్కడనుండు భా
నుమంతుఁడను రాజునకు దివ్యములైన వస్త్రములను మహాబుద్ధికుశలతగల

హయాన్నాగాన్ భూషణాని రత్నానివివిధానిచ । గృహీత్వా తేనసన్మానం దేవలో రాజపుంగవః ॥ ౧౧॥ జంబూద్వీపం తతశ్శీఘ్రమాగాత్ పునరాగాత్సవీర్యవాన్ । మాళవాన్కొంకణాంశ్చైవ ద్రవిడాన్మత్స్యకేకయాన్ ॥ ౧౨॥ కళింగాంశ్చకుళింగాంశ్చ చోళనేపాళమాద్రకాన్ । సింధూన్ యుగంధరాంశ్చైవ విదర్భకురుబర్బరాన్ ॥ ౧౩ ॥ చైత్యాన్ కరూశబంగాళాన్ త్రిగర్తాన్ త్రేంకణాంస్తథామరాటలాటపాంచాలనిషాదాన్ ఘూర్జరాన్ శకాన్ ॥ ౧౪ ॥ సాల్వానంగాంశ్చ వంగాంశ్చ తుండికేరాంశ్చ మల్లికాన్ । ఇత్యాది సర్వదేశానాం రాజ్ఞస్సర్వానతోషయత్ ॥ ౧౫ ॥ అనేకవస్త్రజాలైశ్చ నానావర్ణైర్మనోహరైః । నానాదేశేశ్వరైర్దత్తైర్గజైరశ్వైశ్చభూషణైః ॥ ౧౬ ॥ శిబికాకాంచనైరత్నైర్మౌక్తికైరప్యనేకశః । అన్యైశ్చ మణిభిశ్శస్త్రైర్గోధనైస్స్యందనైశ్శుభైః ॥ ౧౭ ॥ దాసీగణైశ్చ బహుభిర్దాసైర్బహుభిరేవచ । ప్రహర్షమతులంలేభే దేవలోరాజశేఖరః ॥ ౧౮ ॥ బ్రాహ్మణాః క్ష

---

యాదేవలుఁడిచ్చెను - ౧౦ - అంతనారాజశ్రేష్ఠుఁడగు దేవలుఁడాభానుమంతుఁడునకుబహుమతిగానిచ్చునట్టిగుఱ్ఱములనేనుఁగులనుదోడవులనుబలుఁవిధములగురత్నములనుగ్రహించి మరలజంబూద్వీపమునకువచ్చెను - వచ్చి మాళవ కొంకణ ద్రవిడ మత్స్యదేశములను గేకయదేశములను కళింగదేశమును గుళింగదేశమును చోళదేశమును నేపాళదేశమును మాద్రకదేశమును సింధుదేశమును యుగంధరదేశమును విదర్భదేశమును కురుదేశమును బర్బరదేశమును చైత్యదేశమును కరూశదేశమును బంగాళదేశమును త్రిగర్తదేశమును త్రెంకణదేశమును మరాటదేశమును లాటదేశమును పాంచాలదేశమును నిషాదదేశమును ఘూర్జరదేశమును శకదేశమును సాల్వదేశమును నంగదేశమును వంగదేశమును దుండికేరదేశమును జల్లికదేశమును ఇవిమొదలగు నెల్లదేశములనుగూర్చిపోయి యాదేశములరాజులకెల్ల వస్త్రములనిచ్చి వారినిసంతోషపఱిచెను- ౧౫- అప్పుడా రాజశిఖామణియయిన దేవలుఁడు పలుదేశముల రాజులిచ్చినయేనుఁగులచేతను గుఱ్ఱములచేతను సొమ్ములచేతను పాలకీలచేతను ధనములచేతను రత్నములచేతననేకవిధములగు ముత్తెములచేతను మఱియు ననేక విధములగు మణులచేతను పశువులచేతను మనోహరములగు రథములచేతను పెక్కుదాసీసంఘములచేతను పెక్కుపరిచారకులచేతను దీటులేని సంతోషమునుబొందెను- ౧౮- జంబూద్వీపమంతయందు బ్రాహ్మణులను క్షత్రియు

క్షత్రియాశ్చైవ వైశ్యాశ్చశూద్రాశ్చాన్యేచయేజనాః । జంబూద్వీపస్థితాస్తేషాం సర్వే షాంచయథేప్సితం॥౧౯॥ బహూనిదత్త్వావస్త్రాణినిఖిలాంస్సమతోషయత్ । తతస్తుదేవలప్రాప్తా రథవారణవాజినః ॥ ౨౦ ॥ దాసీదాసా గోరథాశ్చ శిబికా శ్చమనోహరాః । అనేకకోటిసంఖ్యాతాబభూవుర్బ్రాహ్మణోత్తమాః॥ ౨౧॥ తేషాంసంఖ్యాం ప్రవక్ష్యామి శ్రూయతాం ధర్మవిత్తమా । కోటిసంఖ్యార థాశ్చాన్సద్ద్విగుణాగోరథాస్తథా॥ ౨౨॥ ద్వికోటయోమత్తగజా శ్చతుష్కో టిహయాశ్శుభాః । యానానిచతురంతాని బభూవుఃకోటిసమ్మితం॥ ౨౩॥ కో ట్యాయుతోనయాదాస్య స్సంఖ్యాతా నైతదర్షయః । షట్త్రింశల్లక్షసం ఖ్యాతా దాసాస్తత్రచకాశిరే॥ ౨౪॥ ఆమోదపట్టణాయైతా న్రథవాజి నరద్వి పాన్ । ప్రేషయిత్వాఖిలాన్రాజా పాతాళం దేవలోయయౌ॥ ౨౫ ॥ భోగి రాజఫణారత్న దీధితివ్యాప్తముచ్చకైః । భోగికన్యాపరివ్యాప్తం భోగాఢ్యం భోగిపాలితం॥ ౨౬॥ తత్రవాసుకిమాసాద్య సర్పరాజం మహాబలం । నానావ ర్ణానివస్త్రాణి దత్త్వాన్ దేవలస్తతః॥ ౨౭॥ చిత్రసేనాయ దివ్యాని వస్త్రాణి

---

లకు వైశ్యులకు శూద్రులకు మఱియు నితరజనులకు నందఱకు నా దేవలుఁడు కోరినరీతిగా వస్త్రములనిచ్చి వారలనెల్ల సంతోషపఱిచెను - పిమ్మట నా దేవ లుఁడు పొందినరథము లేనుఁగులు గుఱ్ఱములు దాసికలు సేవకులు గాడీలుమిక్కి లిసొగసుగానుండు పాలకీలు నివియన్నియు బహుకోట్లసంఖ్యలుగనాయె నో బ్రాహ్మణశ్రేష్ఠులారా- ౨౧- ఓ ధర్మమునుదెలిసిన వారిలో మిక్కిలి యెక్కు డైనవారా వానిసంఖ్యను జెప్పెద వినుఁడు- రథములు కోటి గాడీలు రెండుకో ట్లుమదపుటేనుఁగులు రెండుకోట్లుమంచిశ్రేష్ఠములైనగుఱ్ఱములునాలుగుకోట్లు పాలకీలు కోటిలెక్కగలవియాయెను - ౨౩ - ఓ ఋషులారా - అప్పడాదే వలునకులభించిన దాసికలు తొంబదిలక్షలమంది సేవకులు ముప్పదియాఱులక్ష లమంది ఈరథములనుగుఱ్ఱములనుమనుష్యులనేనుఁగుల నామోదపట్టణమున కుఁబంపి యంతనా దేవలుఁడు పాతాళలోకమునుగూర్చిపోయెను- ౨౫- ఆపా తాళలోకమందుండు సర్పరాజుయొక్క పడగలయందుండు మణులకాంతి పైకి దగదగవెలుగుచున్నది - ఆలోకమందంతట నాగకన్యకలు వ్యాపించియున్నా రు మిక్కిలి సుఖాస్పదమై సర్పములచేతఁ బాలింపఁ బడియున్న యాలోకము నుబొంది యక్కడమహాబలశాలిగా నాసర్పములకుఁ బ్రభువుగానుండు వాసు కినిఁజూచియతనికిదేవలుఁడుపలువన్నెలదోవతులనునలసినంతయిచ్చెను- ౨౭-

వ్యాతరన్నృపః । తక్షకాయమహిభర్త్రేచ రక్తవస్త్రాణ్యదాత్తదా ॥ ౨౮ ॥ అతోషయన్నీలవస్త్రైః దేవలశ్చాపితక్షకం । ఐరావతస్యశుభ్రాణి దత్తవాన్ సమహామతిః ॥ ౨౯ ॥ సారభేయస్యనాగస్య పీతవస్త్రాణి దత్తవాన్ । వైశాలేయాశ్చయేనాగా దదౌతేషాం యథారుచి ॥ ౩౦ ॥ యేచాన్యే సారభేయాశ్చ తాన్వస్త్రైస్సమతోషయత్ । వాసుకిస్తుమహాఘోరాణి రత్నాన్యస్మై దదౌముదా ॥ ౩౧ ॥ తథైవచిత్రసేనాద్యా స్సర్పరాజా మహాబలాః । మణీన్మనోజ్ఞాన్ త్సంప్రీత్యాదత్తైవనం సమతోషయన్ ॥ ౩౨ ॥ తతస్సశేషనిలయం గత్వాతస్మై మహాబలః । నానావర్ణాని శుభ్రాణి కృష్ణపీతాదికానిచ ॥ ౩౩ ॥ అతిచిత్రాణిదివ్యాని వితతారప్రియాన్వితః । తత్పత్నీనాంచైవ సర్వాసామంబరాణియథారుచి ॥ ౩౪ ॥ దత్వాతన్మంత్రిణోయేచ ధృతరాష్ట్రాద్యహీశ్వరాః । తాన్ తోషయిత్వా సద్వస్త్రై స్తత్పత్నీశ్చాప్యతోషయత్ ॥ ౩౫ ॥ యేచాన్యే భుజగాస్తత్ర దదౌతేభ్యోంబరాణిసః । తేహారైర్మణిభిర్దివ్యై ర్భూషణై

---

మఱియు నాదేవలుఁడక్కడనుండు చిత్రసేనునికొఱకు మంచిదోవతులనిచ్చెను అప్పుడా సర్పములకుభర్తయైన తక్షకునికొఱకు నెఱ్ఱనివస్త్రములనిచ్చెను మఱియుఁ గొన్నినల్లనివస్త్రములనుగూడఁ దక్షకునికిచ్చి దేవలుఁడా తక్షకునిసంతోషపఱిచెను - మహాబుద్ధిశాలియైన యాదేవలుఁడైరావతమను సర్పశ్రేష్ఠమునకుఁ దెల్లనివస్త్రములనిచ్చెను - ౨౯ - సారభేయమను సర్పమునకుఁ బసుపువన్నెదోవతులనిచ్చెను - వైశాలేయములను సర్పములెవ్వికలవోవాని కెల్లఁగోరినవస్త్రములనిచ్చెను - ౩౦ - ఇంకను గొన్ని సారభేయములను సర్పములుండఁగావానికెల్లఁగోరినవస్త్రములనిచ్చెను - అప్పుడా వాసుకి మిక్కిలి సంతోషముతో మిక్కిలి వెలగలరత్నములనీదేవలునకుఁగానుకగానిచ్చెను - ౩౧ - అట్లేమిక్కిలిబలముగల చిత్రసేనుఁడు మొదలగు సర్పశ్రేష్ఠములెల్లఁ బ్రేమముతో మనోహరములగు రత్నములతనికిచ్చి యీదేవలుని సంతోషపెట్టెను - అంతమిక్కిలి బలవంతుఁడైన యాదేవలుఁడాదిశేషునింటికిబోయియతనికిచిత్రవర్ణములుగుదోవతులను దెల్లనిదోవతుల నల్లనిదోవతులు పసుపువన్నెదోవతులు మొదలగుపలువన్నెలదోవతులను బ్రేమతోఁగూడినవాఁడై ఇచ్చెను-అతనిభార్యలకెల్లవారువారుకోరినట్టివస్త్రములనిచ్చి యాశేషునిమంత్రులగుధృతరాష్ట్రుఁడుమొదలగుసర్పశ్రేష్ఠములకెల్లమంచివస్త్రములనిచ్చిసంతోషపఱిచివారిభార్యలకును వలయువస్త్రములనిచ్చి వానినిసంతోషపఱిచెను- ౩౫- మఱి

శ్చాప్యనేకశః॥ ౩౬ ॥ సంతోషం జనయామాసు దేవలస్యామితౌజసః। తతః
ఫణీశ్వర శ్శేషసంతుష్టో దేవలేనతు ॥ ౩౭ ॥ అనేకై ర్దివ్యమణిభి స్స్వపు
త్రీం సుమనోహరాం। చంద్రరేఖేతి విఖ్యాతాం దేవలాయదదాముదా॥ ౩౮॥
తాం స్వీకృత్య తత శ్శేషా ద్దేవలః ప్రీతిపూర్వకం। తోషయిత్వాఖిలాన్నాగా
భూలోకం సమపద్యత॥ ౩౯॥ ఇత్థం త్రిలోక్యాం సర్వేషాం దేవాదీనాం మ
హామతిః। అలంకారాయ వస్త్రాణి వితీర్యచబహూనిసః॥ ౪౦॥ రక్షయిత్వా
భిమానాశ్చా మోదపట్టణ మాసదత్। స్వదేశ్యానాంచ సర్వేషాం దదౌ
వస్త్రాణిదేవలః ॥ ౪౧ ॥ తతోదేవలరాజస్య మంత్రిణో బ్రాహ్మణానృపాః।
వైశ్యాశ్శూద్రా స్తథాన్యేచ ధృత్వావస్త్రాణిసాదరం ॥ ౪౨ ॥ ప్రహర్షమ
తులంలేభు దేవాంగాద్రాజకుంజరాత్ ॥ త్రయాణామపిలోకానాం దేవాం
గస్సుమహామతిః ॥ ౪౩ ॥ దత్వావస్త్రాణి ధర్మాత్మా రక్షయిత్వాభిమానకం।

---

యునక్కడనుండుసర్పములనెల్ల నతఁడు కావలసినవస్త్రముల నిచ్చెను - అవి యన్నియు ననేకములగుదండలచేతను మంచిశ్రేష్ఠములైనరత్నములచేతనుదొ డవులచేతను మిక్కిలి తేజోవంతుఁడగునాదేవలునకు సంతోషమునుగలుగఁజేసి రి - అంతనెల్లసర్పములకుఁ బ్రభువైన యాదిశేషువు దేవలునినడవడికి మిక్కిలి సంతోషపడి మిక్కిలిసుందరమైనరూపముతోనొప్పుచుఁ జంద్రరేఖయనిప్రసి ద్ధిఁజెందియున్న తనకూతుననేకములగుదివ్యరత్నములతోడ నాదేవలునికొసఁగి చ్చెను - ౩౮ - అంతనాదేవలుఁడాయాదిశేషునివలననాకన్యను బ్రేమతో గ్ర హించికొనియాసర్పములనెల్ల సంతోషపఱిచి యక్కడనుండి భూలోకమునకు వచ్చెను - ౩౯ - ఇట్లుమహాబుద్ధిశాలియయినయాదేవలుఁడుముల్లోకములయం దుండు వారలకెల్ల నలంకారముకొఱకుఁ బెక్కువస్త్రములనిచ్చి యందఱయభి మానమునుగాపాడి తనదగు నామోదపట్టణమునకువచ్చెను వచ్చియంతఁదన దేశస్థులకెల్లవలసిన వస్త్రములనిచ్చెను- ౪౧- తరువాత నాదేవలరాజు మం త్రులు నతనిపట్టణమందుండు బ్రాహ్మణులును రాజకుమారులును వైశ్యులు ను శూద్రులు మఱియు నితరజాతులవారును బ్రీతితో వస్త్రములను ధరించి రాజశ్రేష్ఠుఁడగు నాదేవాంగమునివలన మిక్కిలి సంతోషమునుబొందిరి - మ హాబుద్ధికుశలతగలిగి సకలసంపదలచేత నొప్పిన యాదేవాంగముని ధర్మబుద్ధి గలవాఁడుగనుక నీప్రకారముమూఁడులోకములవారికి దోవతులు చీరలునిచ్చి యెల్లవారియభిమానమునుగాపాడి సంతోషించినమనస్సుగలవాఁడై కీర్తిగల

సంప్రహృష్టమనాశ్శ్రీమా యశస్వీ దేవలోభవేత్ ॥ ౪౪ ॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - దేవాంగ మర్త్య పాతాళలోక వస్త్రప్రదానం నామ నవమోధ్యాయః.

శ్రీసూతః॥ దేవాంగస్తుతతశ్శ్రీమా న్మహార్ఘాణ్యంబరాణిచ । ఆదాయసహసాశంభుందిదృక్షుః పార్వతీపతిం ॥ ౧ ॥ కైలాసమగమచ్ఛ్రీమాంఛంకరస్యనివేశనం । తతోద్రాక్షీన్మహాబాహుర్దేవాంగోరజితాచలం॥ ౨॥ మందారవిటపిక్రాంతం నానామణివిభూషితం । పాటలీచంపకాశోక పున్నాగవకుళాన్వితం ॥ 3 ॥ కుందచందనమందారమాధవీమల్లికావృతం। కోవిదారాగరుప్లక్ష జాంబూనదవిరాజితం॥ ౪॥ ముక్తాగోమేధవైడూర్య పద్మరాగ విరాజితం । పుష్యరాగాదిరత్నానాంప్రభాభిఃపరివేష్టితం ॥ ౫ ॥ వనైర్మనోహరైరమ్యం కోకిలారావసంకులం । చాంపేయకుసుమా విష్టైర్నిశ్చలైర్భ్రమరైరివ॥ ౬॥ కామారిగిరిమాసాద్యభీత్యాసంచారవర్జితైః । కా

---

వాఁడాయెను - ౪౪ - ఇది బ్రహ్మాండపురాణమున దేవాంగచరితమందు దేవాంగముని మర్త్యలోకమునకుఁ బాతాళలోకములకు వస్త్రములనిచ్చుటయన్నది తొమ్మిదవయధ్యాయము.

సూతుఁడు పిమ్మటికథ నాఋషులకుఁ జెప్పుచున్నాఁడు - అంతసకలసంపదలుగల యాదేవాంగమహాముని శీఘ్రముగా మిక్కిలి వెలగల వస్త్రములనెత్తుకొని పార్వతికినాయకుఁడైన యీశ్వరునిఁజూడఁగోరినవాఁడై యాశివునకుస్థానమైనకైలాసమునుగూర్చిపోయెను - పోయిమహాభుజబలముగలయాదేవలుఁడు వెండికొండనుజూచెను- ౨- ఆకొండ మందారవృక్షములచేతవ్యాపింపఁబడినదియునానావిధములైనరత్నములచేత నలంకరింపఁబడినదియుఁ బాదిరిచెట్లతోడను సంపంగిచెట్లతోడన శోకవృక్షములతోడను పొన్నచెట్లతోడను గడచెట్లతోడనుగూడినది - 3 - ఇంకనుమొల్లతీగలచేతనుశ్రీగంధవృక్షములచేతనుతీగమందారములచేతను బండిగురువిందతీగలచేతను మల్లెతీగలచేతను బరివృతమైగోడ్డంటిచిప్పచెట్లచేతను నగరుగంధపుమ్రాఁకులచేతను బుల్లవెలగచెట్లచేతనువ్యాపింపఁబడియంతటబంగారపుభూములుగలిగియున్నది-౪- ముత్తెములుగోమేధికములువైడూర్యములుకెంపులువీనిచేతఁ బ్రకాశించియున్నది మఱియుఁబుష్యరాగము మొదలగురత్నములకాంతులునలుగడలవ్యాపించుచున్నది - మిక్కిలిసుందరములైన తోటలుగలిగియాతోటలయందుఁగూయుచున్న

సారైర్బహుభిర్దివ్యైః పద్మకైరవశోభితైః ॥ ౭ ॥ హంసకారండ వాకీర్ణై
ర్జలకుక్కుటసంకులైః । మత్తభృంగాంగనాగీత సంకులై స్సుమనోహరైః ॥
౮ ॥ గతపుష్పరసైఃపద్మై స్త్యజ్యమానై శ్చబంభరైః । యూయంవికాసపద్మా
ని కిమర్థంప్రాప్నుథాభయం ॥ ౯ ॥ యుష్మన్మాలేననోరాజా దగ్ధః ఖలుపు
రారిణా । సంత్యజంతుపునర్దర్పంశిక్షయద్భియథాపునః ॥ ౧౦ ॥ చలత్సలిల
కణికైఃపద్మపత్రై ర్మనోహరైః । సూచయద్భిర్వ యన్నద్యాః ప్రపాతం
హారమూర్ధని ॥ ౧౧ ॥ అన్యైశ్చ బహుభీరమ్యైః కాసారై ర్వ్యాప్తముచ్ఛ
కైః । దృష్ట్వాహర్షసమావిష్టో దేవాంగప్రయయాతతః ॥ ౧౨ ॥ తతోవివేశ
సదనం దేవదేవస్యశూలినః । హేమప్రాకార సంశోభి రత్నగోపురరాజితం ॥
౧౩ ॥ అభ్రంలిహైశ్చంద్రకాంత మణిసౌధై ర్విరాజితం । నానారత్నమయై

---

కిలలనాదముచేత వ్యాప్తమైయున్నది - నాగకేసరపుపుష్పములమీఁదనెక్కితు
మ్మెదలు కదలకుండుటనుజూడఁగా మన్మథునకు శత్రువైనశివునికిస్థానము గను
కనక్కడ సంచరింపబయపడి యూరకున్నవిగాఁబో లనునట్లున్నవి - మఱియు
నాకొండయందుఁ గమలములచేతనుగలువలచేతనొప్పుచున్న సరస్సులనేకము
లున్నవి యాసరస్సులయందు హంసలు కల్నేటి పక్షులు నీరుకోళ్లు మెండుగా
నున్నవి - మదించినయాఁడుతుమ్మెదలు ఝుంకారములు చేయుచుండగా నాసర
స్సులు మిక్కిలిసొగసుగానున్నవి- ౮- తేనెయంతయు నమసిన కమలములను
దుమ్మెదలుకొఱకుచుండఁగా నాతుమ్మెదలావికసించిన కమలములను మీనిమిత్త
ముమారాజైనమన్మథుఁడు త్రిపురములదహించిన సాంబశివునిచేతదహింపబ
డెను మీరుభయపడకయున్నారాయని వానిగర్వమడఁగునట్లుశిక్షించుచున్న
విగాఁబోలనునట్లున్నవి- ౧౦- మఱియు నా సరస్సులయందుండు తామరాకుల
మీఁదనుదకబిందువులాడుచుండఁగా నాకాశగంగ సాంబశివునిశిరస్సునఁబడిన
ప్పటిరీతిని దెలియఁజేయుచున్నవి- ౧౧- ఇఁకననేకములైన మిక్కిలి సొగసై
నసరస్సులచేత వ్యాపింపఁబడి పొడవుగానున్న యావెండికొండనుజూచి దేవాం
గముని సంతోషపడినవాఁడై యాకొండమీఁదఁగొంతదూరముపోయెను-౧౨-
అట్లుపోయి యెల్లదేవతలకుదేవుఁడైన శూలాయుధధరుని గృహమునుజొచ్చెను
ఆయిల్లుబంగారుప్రహారిగోడచేతఁ బ్రకాశించుచు మణిమయములైన దర్వాజా
లతో వెలుఁగుచు నాకాశమునంటుచున్న చంద్రకాంతమణులచేతగట్టిన మేడల
చేతనొప్పియున్నది- ఇఁకనుబహువిధములైన రత్నములచేతఁగట్టఁబడిన బురు

రత్నైరాజితం హేమగోపురైః॥ ౧౪॥ ప్రవాళ స్తంభసంయూత వైడూర్యాతు లశోభితే। ఫలకైః పుష్యరాగాణాం ఛాదితే దీప్తిమత్తమే॥ ౧౫॥ గోమేధబద్ధ వలభారత్నస్థగితభూస్థలే। సువర్ణభిత్తిస్థగితనానారత్నాంశుసంవృతే॥ ౧౬॥ ధూపగంధపరివ్యాప్తే కస్తూరీ చర్చితాంతరే। తేజస్త్రయ పరీభావ క్రియా దక్షైర్ఘృణాంశుభిః॥ ౧౭॥ చకాసితేసుగంధాఢ్యేతత్రసేవాలయేశుభే। ఆ శాపాలైస్తథారుద్రై రాదిత్యైర్వసుభిస్సురైః॥ ౧౮॥ సిద్ధచారణ గంధర్వ విద్యాధరమహోరగైః। కిన్నరైర్గరుడైర్యక్షైస్సనకాద్యైస్తపోధనైః॥ ౧౯॥ సాధ్యైఃకింపురుషైశ్చైవా ప్సరసాం నికురుంబకైః। కశ్యపాత్రిభరద్వాజ జాబాలి జమదగ్నిభిః॥ ౨౦॥ వసిష్ఠ శుకహారీత వామదేవ పరాశరైః। కణ్వకుత్సశతానందశైబ్యగౌతమశక్తిభిః॥ ౨౧॥ శాండిల్యచ్యవనోద్దాల భృగ్వగస్త్య పులస్త్యకైః। మార్కండేయార్వదుర్వాసో విశ్వామిత్ర

---

జులచేతను బంగారుదర్వాజాలచేతను ప్రకాశించుచున్నది - ౧౪ - మఱియు బవడపుకంబములయందుఁ జెక్కఁబడిన వైడూర్యమణులచేతఁ సరిలేకుండఁ బ్రకాశించియున్నది - దానికిఁ బైనిఁగప్పియున్నవన్నియుఁ బుష్యరాగమణుల పలకలుగనుకమిక్కిలికాంతిగలిగియున్నది- స్తంభములమీఁది బోదెపీటలన్నియు గోమేధికములచేతఁగట్టఁబడియున్నవిక్రిందవసంతటనవరత్నములు సరపఁబడియున్నవి - బంగారపుగోడలయందుఁజెక్కియున్న పలుతెఱంగులరత్నములకాంతులెల్లెల్ల వ్యాపించుచున్నవి - ౧౬ - వాసనద్రవ్యములచేతఁ బొగలువేయఁగా నాధూపములవాసన యిల్లంతటవ్యాపించియున్నది- ఇంకనుగస్తూరిచేతనలకబడినదిగానున్నది - ఆయింటికాంతులు సూర్యచంద్రాగ్నులనటుంటుమని తిరస్కరింపఁజాలియుండును అట్టికాంతులచేతఁ బ్రకాశించుచున్న యాకచ్చేరి యింటియందాసాంబమూర్తిఁదిక్పాలకులచేత నేకాదశరుద్రులచేతను ద్వాదశాదిత్యులచేత నష్టవసువులచేతను సమస్తదేవతలచేతను సిద్ధులచేతను జారణులచేతను గంధర్వులచేతను విద్యాధరులచేతను రగులచేతను గిన్నరులచేతను గరుడులచేతను యక్షులచేతను సనకుఁడుమొదలుగాగల తపోనిష్ఠులచేతను సాధ్యులచేతను గింపురుషులచేతను దేవవేశ్యా సంఘములచేతను కశ్యపుఁడత్రిభరద్వాజుఁడు జాబాలిజమదగ్ని వసిష్ఠుఁడు శుకుఁడు హారీతుఁడు వామదేవుఁడుపరాశరుఁడు కణ్వుఁడు కుత్సుఁడు శతానందుఁడు శైబ్యుఁడు గౌతముఁడు శక్తిశాండిల్యుఁడు చ్యవనుఁడుద్దాలుఁడు భృగువు అగస్త్యుఁడు పులస్త్యుఁడు మార్కం

పురోగమైః ॥ ౨౨ ॥ అన్యైశ్చమునిభిశ్చైవ సేవ్యమానంమహేశ్వరం । ర
త్నసింహాసనాసీన ముమయా సహితం శివం॥ ౨౩॥ కుమార గజవక్త్రాభ్యాం
వీరభద్రేణ సేవితం । ప్రమథై ర్బహుభిశ్చైవ వేత్రహస్తేననందినా ॥ ౨౪ ॥
దృష్ట్వాశంభుం మహాదేవం దేవాంగో హర్షపూరితః । ప్రణమ్య శిరసాదే
వం తుష్టావపరమేశ్వరం॥ ౨౫॥ దేవలః॥ శివాయ శంకరాయ చిన్మయాయ
చంద్రమౌళయే భవాయ ఫాలలోచనాయ పంచబాణహారిణే । మృడాయ
భక్తపాలనాయ భుక్తిముక్తిదాయినే గిరీశ్వరాయ శంభవేనమోస్తు శూల
పాణయే ॥ ౨౬ ॥ సురాసురేంద్రమౌళి రత్నదీధితిచ్ఛటాల సత్పదాంబుజాయ
పార్వతీప్రియాయ పుణ్యమూర్తయే । రవీందు పావకేక్షణాయ దక్షయజ్ఞ
ఘాతినే ఫణీంద్రకంకణాయతే ననోస్తు కృత్తివాససె ॥ ౨౭ ॥ జగత్త్రితిప్ర

---

డేయుఁడు ఔర్వుఁడు దూర్వాసుఁడు విశ్వామిత్రుఁడు మొదలుగాఁగల ఋషు
లచేతను మఱియు ననేకులగు ఋషులచేతను సేవింపఁ బడుచుఁ బార్వతీదేవి
తోడ రత్నమయమైనగద్దెయందుఁగూర్చున్న సకలలోకశుభకరుఁడగు నామ
హేశ్వరుని గుమారస్వామియు గణపతియు వీరభద్రుఁడును మఱియుం గల
ప్రమథగణములును బెత్తమును జేతఁబట్టుకొన్న నందీశ్వరుఁడును సేవించుచుం
డఁగాఁజూచియాదేవాంగమునిసంతోషభరితుండై యెల్లసుఖములకుఁగారణ
మును దేవతలకెల్ల మహాదేవుఁడునైన యాపరమేశ్వరునకు సాష్టాంగనమస్కా
రముచేసిస్తోత్రముచేసెను- ౨౫- దేవలుఁడుచేసినస్తోత్రము- మంగళరూపుఁడై
నట్టియు శుభమునుగలుగఁజేయునట్టియు జ్ఞానస్వరూపుఁడై నట్టియుఁ జంద్రుని
శిరస్సునందుధరించినట్టియు జగత్తులయుత్పత్తిస్థానమైనట్టియునొసటఁగన్నుగ
లయట్టియు మన్మథునిపశింపఁజేసినట్టియు మృడుఁడనుపేరుగలయట్టియు భక్తు
లనురక్షించునట్టియుభోగమునుమోక్షమునిచ్చునట్టియుఁగొండకుఁబ్రభువైన
ట్టియు శూలాయుధమును జేతధరించియుండునట్టి సాంబమూర్తికొఱకు నమ
స్కారమగుఁగాత - ౨౬ - దేవతల రాక్షసుల ప్రభువులు కాళ్లమీఁదఁబడి
నమస్కారముచేయఁగా వారి కిరీటములయందలి రత్నకాంతుల పరంపరలచే
తఁబ్రకాశించుచున్న పాదకమలములుగలయట్టియుఁ బార్వతికిష్టుఁడైనట్టియుఁ
బుణ్యమును గలుగఁజేయునట్టి దేహము గలయట్టియు సూర్యుఁడు చంద్రుఁ
డునగ్నియుఁ గన్నులుగాఁ గలయట్టియు సర్ప శ్రేష్ఠములఁ గడియములుగా
ధరించినట్టియు దక్షప్రజాపతి యజ్ఞమును జెఱిచినట్టియుఁ జర్మమును వ

ణాళసృష్టి హేతవే త్రివిష్ట పెణ్మకుందపంకజాన నార్చితాయ నిర్మలాత్మనే। పురాంతకాయ కాంచనాద్రి కార్ముకాయజిష్ణవే గజాసుర ప్రమర్దినే నమో స్తుతేకపర్దినే॥ ౨౮ ॥ విశుద్ధచంద్ర కాంతసౌధ రుక్మపీఠ ఖలనాద్రి రాజజావి లాసరమ్యవాక్ప్రియాంతరంగిణే। సుగంధదివ్య చందనప్రసూన మాలికాల సద్దుకూలబద్ధదివ్య విగ్రహాయ తేనమఃపునః॥ ౨౯॥ ధగద్ధగన్మయూఖజాలర త్నభిత్తివిస్ఫురన్ని జాలయోచ్చ వజ్రపీఠ మధ్యభాగ వాసినే। అపర్ణయా యుతాయభూతకోటి సేవితాయ సన్మునీంద్ర సంస్తుతాయ తేనమోస్తు విశ్వ మూర్తయే ॥ ౩౦ ॥ దినాంతనాట్యసంచలజ్జటాకలాప విస్ఫుత్సురాపగావిధా తృహంస వర్షభీతి కారిణే। కిరీటసోమ సాన్ద్రి తచ్ఛిలాట్టవాసి దేవతాంగ

---

స్త్రముగాఁ గట్టుకొన్న నీ కొఱకు నమస్కార మవుఁ గాత - ౨౭ - ప్రపంచముయొక్క యునికికి బ్రళయమునకును సృష్టికిని గారణమైనట్టియు దేవేంద్రునిచేతను మహావిష్ణువుచేతను బ్రహ్మచేతను బూజింపఁబడినట్టియు నిష్కలంకస్వరూపుఁడైనట్టియుఁ ద్రిపురములను నశింపఁజేసినట్టియు మేరుపర్వతమును విల్లుగా ధరించినట్టియు జయశీలుఁడైనట్టియు గజాసురునిఁ గొట్టినట్టియు జటాజూటముగలిగియున్న నీకొఱకు నమస్కారమౌఁగాత- ౨౮ - పరిశుద్ధమైనచంద్రకాంతమణులతోఁ గట్టిన మేడయందు బంగారు పీటమీఁదఁ గూర్చుండియానందించునట్టిపార్వతియొక్క నర్మవాక్యములయందుఁ బ్రేమగలయంతఃకరణముగలయట్టియు మంచిపరిమళ ద్రవ్యములఁ జేర్చుటచేత గమగమాయించుచున్న శ్రీగంధమును దేహమందలఁది దివ్యములగుపుష్పమాలికలచేతఁ బ్రకాశించుచు దివ్యమగు వస్త్రములనుధరించియున్న దివ్యదేహముగల నీకొఱకుమాటిమాటికినమస్కారమవుఁగాత - ౨౯ - ధగధగమని ప్రకాశించుచున్న కాంతులుగల రత్నమయములైన గోడలచేతఁ బ్రకాశించుచున్న తనగృహమందుంను నున్నతమైన వజ్రపుపీటనునుమ నున్నట్టియుఁ బార్వతితోఁగూడినట్టియు భూతసంఘములచేతఁ బొగడఁబడినట్టియుఁ బ్రపంచమువిగ్రహముగా గలనీకొఱకునమస్కారమవుఁగాత - ౩౦ - సాయంకాలమందునృత్తముచేయగాజడలుకదలి వానిలోపలి గంగ ప్రకాశింపఁగా బ్రహ్మ వాహనమైన హంసమునకువర్షమువచ్చునని భయముకలుగుచున్నది దేవతలస్త్రీలు చంద్రకాంతమణుల కోటబురుజులయందుఁ గూర్చుండియుండఁగా నాసాంబమూర్తిశిరస్సునను న్న చంద్రుని కిరణములు ప్రసరించియాచంద్రకాంతశిలలు చల్లఁగానుద

నాశ్రమాపహారిణే నమోస్తుసాంబమూర్తయే॥ ౩౧॥ ఇతిస్తుత్వా మహాదేవం
దేవాంగో వాక్యమబ్రవీత్ । మహాదేవ జగన్నాథ భక్తాభీష్ట ప్రదాయక ॥
౩౨॥ త్వత్ప్రసాదేన దేవేశ వయామి స్తాంబరాణ్యహం । శేషంసూత్రం
చ కర్తవ్యం వదకిం కరుణాకర । శివఃబ్రాహ్మణానాం స్త్రియాం చైవ గా
యత్రీం వేదమాతరం॥ ౧॥ ప్రణవేనసమం కృత్వా త్రిగుణం బ్రహ్మసూత్రకం
నధాయజోపవీతంచ మాంగల్యంచసుసాధనం॥ ౨॥ దాతవ్యమధునాశీఘ్రమ మ
న్యేషాంచ యథావిధి । ఏకంసూత్ర బ్రహ్మచర్యే ద్వితీయంతువివాహకే॥ ౩॥
తృతీయం సోత్తరీయేతు ధాత్యమేవం యథావిధి । నాభ్యోధరమధ్య స్తంత
దూర్ధ్వం నిష్ఫలం భవేత్ ॥ ౪॥ తస్మాన్నాభిసమంకుర్యాదుపవీతం విశేషితః।
బ్రహ్మణో ప్రథమందత్త ముపవీతంచ వైదికం ॥ ౫ ॥ బ్రహ్మసూత్ర విష్ణవేచ
దత్తం సూత్రం శివాయచ । ఇంద్రాద్యష్టదిశాపాలానాం దత్తం సూత్రం య
థాక్రమం॥ ౬॥ బ్రహ్మర్షీణాం సురర్షీణాం గంధర్వాణాం మహామతిః । న

---

కముసుప్రవింపఁగా నాదేవతాస్త్రీ ౧ల శ్రమముమానుచున్నది యట్టి సాంబశి
వునికొఱకునమస్కారమౌఁగాత - ౩౧ - దేవాంగముని యీసాంబమూర్తినీ
ప్రకారము స్తోత్రముచేసి పిమ్మట నాసాంబశివునితో నొకమాట చెప్పెను.౩౨-
[ఓ దేవతలకెల్లఁబెద్దదేవుఁడా జగత్తులకీశ్వరుఁడా భక్తులకోర్కులనిచ్చువాఁడా
మీయనుగ్రహమువల్లనేనును వస్త్రములనేసితిని - మిగిలినసూత్రములనుకరు
ణాకరుఁడా యేమిచేయవలెను చెప్పుమా శివుఁడు దేవాంగునిచూచిచెప్పుచున్నాఁడు
బ్రాహ్మణులకున్ను స్త్రీలకున్ను వేదతమాతయయినగాయత్రిని ప్రణవముతో
సమంగాచేసి గుణత్రయ స్వరూపమైన బ్రహ్మసూత్రమైన యజ్ఞోపవీతమున్ను
మిక్కిలిసాధనమైనమాంగల్యమునకుసూత్రమున్ను శీఘ్రముగాయిపుడేయివ్వవ
లెనూఇతరులకున్ను యథావిధిగాఇవ్వవలెను బ్రహ్మచర్యమందుఒకయజ్ఞోపవీత
మున్ను వివాహమునకు రెండున్ను ఉత్తరీయవిషయమైనమూఁడోదియథావిధిగా
ధరించవలెనూ నాభికిన్ని వుదరమునకున్ను మధ్యమువుండవలెను దానిమీదని
ష్ఫలమౌను దానివలన యజ్ఞోపవీతమునాభికిసమానముగావుండవలెనూ మొ
దట బ్రహ్మకొరకు వేదోక్తమైన యజ్ఞోపవీతమును యిచ్చెను విష్ణువుకు బ్రహ్మ
సూత్రమునిచ్చెను శివునికొరకుసూత్రమిచ్చెను ఇంద్రుఁడు మొదలైన దిక్పాలుల
కొరకుయథాక్రమముగాయజ్ఞోపవీతములనుఇచ్చెను బ్రహ్మఋషులకు దేవఋషుల
కుగంధర్వులకున్ను గొప్పబుద్ధికలవారు ననుగ్రహములకున్ను వేదమాతయైన

పగ్రహాణాంపవౌ.సూత్రంగాయత్రీంవేదమాతరం॥౭॥] ఇతరేషాంతు సర్వేషాం దదౌ.సూత్రంయథావిధి। తతోభూత్ భూసురశ్రేష్ఠాత్ దేవాంగఉత్తమత్సదా ఇత్యుక్త్వాథదుకూలాని చిత్రాణి వివిధానిచ॥ ౩౩॥ భక్త్యా సమర్పయామాస శంకరాయమహాత్మనే। తాన్యంబరాణిదివ్యాని దృష్ట్వాశంభుర్ముదాన్వితః। పరిష్కృత్యచదేవాంగం దధతుః పార్వతీస్వయం। తావలంకృత్యసద్వస్త్రైః పార్వతీపరమేశ్వరౌ। లభతుఃపరమంహర్షం భూషయాంచక్రతుఃపునః। తతోగత్వాగజాస్యాయ దుకూలదివ్యమంబరం॥ ౩౬॥ భృంగ్యాదిభ్యోగణేభ్యశ్చవితతారయథారుచి। అంబరాణిమహార్ఘాణిగృహీత్వా మోదపాలకః॥ ౩౭॥ జగామాంతఃపురమథ దేవాంగ శ్శంకరాజ్ఞయా। భద్రకాళ్యై మహాదేవ్యై దత్తవాన్ లోహితాంబరం॥ ౩౮॥ వ్యాదాత్కుమార పత్న్యైచ దేవసేనాయై సితాంబరం। చౌడేశ్వర్యై తతశ్శ్రీమాన్ స్వదేవ్యై దాతుముత్సుకః॥ ౩౯॥ దివ్యాంబరాణిసస్మార దేవీం భగవతీం హృదా। ఆగచ్ఛత్సహసా

---

గాయత్రినిచ్చెను సమస్తములైన వార్లకున్ను యథావిధిగా యజ్ఞోపవీతములనిచ్చెను దానివలన యెల్లప్పుడున్ను దేవాంగుడు యెప్పటికిన్నియుత్తముడుగా యుండెను-౭-] అనియిట్లుచెప్పి మంచిదివ్యములై చిత్రవర్ణములై యున్నవస్త్రములనునానావిధములైనపటములనుమహానుభావుడగునట్టియాఈశ్వరునికొఅనుభక్తితోసమర్పించెను-౩౩- అంతనాసాంబశివుడుదివ్యములైనయావస్త్రములనుజూచి సంతసించినవాడై యప్పుడాదేవాంగముని నలంకరించితాను పార్వతియు నిద్దరుధరించిరి - పార్వతీదేవియు బరమేశ్వరుడును వారిద్దఱు వస్త్రములధరించియలంకారమునుబొందినవారై మిక్కిలిసంతోషమునుబొంది యాదేవలుని మరల స్తోత్రముచేసిరి - అంత దేవలుడు గణపతియొద్దకు బోయియతనికిదివ్యమైనదుకూలవస్త్రమునుభృంగిమొదలగుగణములకెల్లవారువారుకోరినవస్త్రములనిచ్చెను-౩౬- తరువాతనామోదపట్టణమును రక్షించునట్టి యాదేవాంగరాజు మిక్కిలి వెలగల వస్త్రముల నెత్తుకొని యాసాంబమూర్తియుత్తరువుబొంది యంతఃపురమును జొచ్చినవాడై మహాదేవియయినభద్రకాళీశక్తికెఱ్ఱని వస్త్రమునిచ్చెను- ౩౮- కుమారస్వామి భార్యయయినదేవసేనికొఱకుదెల్లవస్త్రమునిచ్చెను - తరువాత నెల్లసంపదలుగల యాదేవలుడుదనకుముఖ్యదేవతయయిన చౌడేశ్వరికొఱకు వస్త్రముల నీనుత్సాహముగలవాడై షడ్గుణైశ్వర్యములతో నొప్పియున్న యాచౌడేశ్వరీ మ

దేవీ స్మృతమాత్రాముసాతదా॥ ౪౦॥ తామాగతాంతు దేవాంగ స్తుత్వాచబహుధాముదా । బద్ధాంజలి స్తతో దేవీ మబ్రవీద్వినయాన్వితః॥ ౪౧॥ అంబచౌడేశ్వరి శివేత్వత్ప్రసాదేన శంకరి । మయాంబరాణి దివ్యాని రచితాని హ్యనేకధా॥ ౪౨॥ వితీర్ణానిచసర్వేభ్య స్త్రిలోక్యాం భక్తవత్సలే । గృహాణేమాని వస్త్రాణి దివ్యాని వివిధానిచ॥ ౪౩॥ త్వద్దాసనిర్మితాన్యంబత్వం ధారయితుమర్హసి । సమర్పితాని తేనేత్థముక్త్వా వస్త్రాణి చండికా॥ ౪౪॥ జగ్రాహ పరమప్రీత్యా తతశ్చౌడేశ్వరీద్విజాః । ఆశ్వాస్య దేవలం దేవీ తత్రైవాంతరభూత్తతః॥ ౪౫॥ ఋషయః ॥ పార్వత్యై వహిచౌడేశీ జ్ఞాతాస్మాభిరిహానఘ । దత్వాంబికాయై దేవస్య సన్నిధావంబరాణిహ॥ ౪౬॥ దదౌతస్యై పునశ్శస్తాదంబరాణిమహామతిః । భేదేనవాథ ప్రీత్యావా దేవాంగః ప్రదదౌతథా॥ ౪౭॥ ఏతంనస్సంశయంఛింధి సూతతత్వార్థకోవిద ॥ శ్రీసూతః॥ ఏవమే తన్మహాభా

---

హాదేవినిమనస్సునందు దలచెను - అప్పుడాతండు మనస్సునం దలచిన మాత్రముననేయతివేగముతో నామెవచ్చెను - ౪౦ - అట్లువచ్చిన యాచౌడేశ్వరిని దేవాంగముని మిక్కిలి సంతోషముతో ననేకవిధములస్తోత్రముచేసి వినయముతోఁ జేతులుమొగుడ్చుకొని యామెనుగూర్చి పలికెను - ౪౧- అమ్మాచౌడేశ్వరి సర్వలోకములవారికి మంగళములఁ జేయుదానా నీయనుగ్రహము వల్లఁ నేనుబలువిధములవస్త్రములనేసితిని - ౪౨ - మూడులోకములయందెల్ల వారికినిచ్చితిని - భక్తులయందుఁ బ్రేమగలయో దేవీదివ్యములై నానావిధములైయుండునట్టి యీవస్త్రముల నీవుపుచ్చుకొమ్ము - ౪౩ - ఓయమ్మా నేనునీసేవకుఁడనుగనుక నేనునేసిన వస్త్రముల నీవుధరింపఁదగుదువు - అనియిట్లుచెప్పి యతఁడు సమర్పించినవస్త్రముల నాచౌడేశ్వరీ మహాదేవి మిక్కిలి సంతోషముతో గ్రహించెను - అంతనామహాదేవి యాదేవలుని సంతోషపఱిచి యక్కడనే యంతర్ధానమునుబొందె నో బ్రాహ్మణోత్తములారా - ౪౫ - ఇట్లు సూతుఁడు చెప్పగావిని యాఋషులు మరల నతనితో నొకప్రశ్న సేయుచున్నారు - ఓమహానుభావుఁడవైన సూతుఁడా- మేముపార్వతియే చౌడేశ్వరియని తెలుసుకొనియున్నాము - మహాబుద్ధిశాలియైన యాదేవలముని యీశ్వరసన్నిధానమందే యామెకువస్త్రములనిచ్చెనే మరలనేలయిచ్చెను- దేవాంగముని పార్వతికిని చౌడేశ్వరికిని భేదమనియిట్లిచ్చెనా లేక ప్రీతిచేతనిచ్చెనా- ౪౭ - ఓసర్వరహస్యములఁ దెలిసిన సూతుఁడా మాకీసందేహమును బోగొట్టవలయు

గాయుష్మాభిర్భాషితం యథా ॥ ౪౯ ॥ నాస్తిభేద స్తయోర్దుర్గా చౌడే శ్వర్యో ర్నసంశయః । వరదానస్యసంప్రీత్యా దేవాంగస్తు పృథగ్దదౌ॥ ౪౯॥ అద్యాప్యాత్య తయోర్భేదం నదదౌ మునిస త్తమాః । శంకరస్య యతఃపత్నీ తస్మాత్సాశంకరీమతా ॥ ౫౦ ॥ ప్రత్యయార్థావబోధేన అన్యథై తత్కథం భ వేత్ । పార్వత్యేవహిచౌడేశీ సైవపార్వత్య సంశయః ॥ ౫౧ ॥ నహిభేద స్త యోరస్తి పశ్యమానేచతత్వతః । తతో దేవాంగనృపతి ర్దివ్యవస్త్రై ర్యథేప్సి తం॥ ౫౨॥ తోషయామాస మతిమాంస్సర్వాస్సై శైలకన్యకాః । చండప్ర చండయో స్తస్య శివస్య ద్వారపాలయోః॥ ౫౩॥ దేవాంగస్తుతతోవస్త్రైర క్త శుభ్రైరయోర్దదౌ । తతస్సేవాలయం ప్రాప్తః ధ్యాత్వా శంభోరనుజ్ఞయా॥ ౫౪॥ కృతస్థలోర్వశీరంభామేనకాపుంజికస్థలా । తిలో త్తమాద్యప్సరసోనాట్యం చక్రుశ్శివాగ్రతః॥ ౫౫॥ న ర్తనై రంగవిక్షేపై గీతై భావానుబోధనైః ।

---

ను - అనియాబుషులనుగంగా సూతుండు చెప్పుచున్నాండు - ఓమహానుభా వులారా యిప్పుడుమీరు చెప్పినట్లయిది. పార్వతికిని చౌడేశ్వరికిని భేదములే దు - మీరావిషయమం దేమాత్రము సందేహింపబనిలేదు - దేవాంగముని తనకువరమిచ్చిన దేవతయను సంతోషముచేత నామెకు మరల నొకతూరి వ స్త్రములనిచ్చెను - ౪౯ - ఇప్పుడామె పార్వతికంటె వేరని యెంచియాలేద యామెయు శ్రేష్ఠురాలా - శంకరునకు భార్యయగుట చేతనే యామెకు శంకరి యనుపేరుకలిగెను ఆపేరుయొక్క ప్రత్యయార్థమును మనము విచారింపంగా నిపుడీయున్నదే వేరువిధమెట్లౌను - పార్వతియే చౌడేశ్వరి - చౌడేశ్వరియే పార్వతి ఈవిషయమందు సందేహములేదు. ౫౧- యథార్థముగా విచారింప గా వారికేమి భేదములేదు - తరువాత నాదేవాంగరాజాపర్వతమందున్న క న్యకలకందఱకుంగోరినట్లు దివ్యములైనవస్త్రములనిచ్చి వారల సంతోషపఱి చెను - తరువాత నాశివునకు ద్వారపాలకులుగానుండెడి చండుండు ప్రచండు డను వారికిద్దఱకు నొకని కెఱ్ఱనివస్త్రము నొకనికిం దెల్లనివస్త్రము నాదేవాం గుండిచ్చెను - అంత నాశివునిధ్యానముచేసి యాయనయుత్తరముమీంద నాయ నకొలువుకూటమునా దేవలుండుచేరెను - ౫౪ - అప్పుడా సాంబశివునియెదుటం గృతస్థలయునూర్వశియును రంభయును మేనకయుం బుంజికస్థలయుం దిలోత్త మమొదలుగాంగల యప్సరస్త్రీలు నాట్యముచేసిరి - ౫౫ - ఆయప్సరస్సం ఘములు నృత్తముచేయుటలచేతను గులుకులచేత నాయారసభావములకు స

సుస్వరై రప్యభిసమైః ప్రతిలోమానులోమకైః॥ ౫౬॥ సంతోషం జనయామాసు శ్శంకరస్యాప్సరోగణాతతః । నృత్తఃకౌశలేన నాట్యస్యా ప్సరసాంశివః॥ ౫౭॥ దాతుకామోంశుకాన్యా సామపశ్య ద్దేవలాననం । దృష్టమాత్రేణ సశ్రీమాన్ జ్ఞాత్వాతస్యమతంతదా॥ ౫౮॥ దివ్యాన్యతి విచిత్రాణి నానావర్ణాని సత్వరం । వినిర్మమావంబరాణి బహూనిద్విజసత్తమాః॥ ౫౯॥ దృష్ట్వాతదద్భుతం కర్మ దేవలస్య మహాత్మనః । మహాంతంవిస్మయంప్రాపు రింద్రాద్యా దేవతాగణాః॥ ౬౦॥ తాన్యాదాయమహాదేవ ఇంద్రాదిభ్యో యథాక్రమం । దేవేభ్య ఋషిగంధర్వ సిద్ధాదిభ్యో దదౌ తథా॥ ౬౧॥ తతోప్సరోభ్య స్సర్వాభ్యో దత్వావితా శ్చాప్యతోషయత్ । దేవాంగస్యతతశ్శంభు ర్దదౌ ఖడ్గంసుచంద్రకం॥ ౬౨॥ వార్షభంచ ధ్వజం దివ్యం సర్వశత్రువిమర్దనం । భక్త్యాగృహీతం రాజానం పునర్వాక్యం శివో బ్రవీత్ ॥ ౬౩ ॥ ధ్వజేనానేన దేవాంగ సర్వశత్రుప్రహారిణా । త్రిలోక్యాం విజయీభూత్వా సుఖమాప్నుహి సం

---

రియైన మంచి స్వరములుగల పాటలచేతను సహజ వ్యత్యస్తములైన యభినయములచేతను మంగళకరుఁడగు నాశివునకు సంతోషమును గలుగఁజేసిరి - అంతనాశివుఁడా యప్సరస్త్రీలనాట్యకౌశలముచేత సంతోషించినవాఁడై వీరలకువస్త్రములనీఁగోరినవాఁడై దేవలునిమోముచూచెను- ౫౭- చూచుటచేతనే యప్పుడా దేవలుఁడీశ్వరుని యభిప్రాయము నెఱిఁగికొని మేలైనవియు మిక్కిలి చిత్రములైనవియుఁ బలువన్నెలవియునగు వస్త్రముల ననేకముల నతిశీఘ్రమున నేసెనోయి బ్రాహ్మణశ్రేష్ఠులారా - ౫౯ - మహానుభావుఁడగు నాదేవలుని యాయత్యాశ్చర్యజనకమైన కార్యమునుజూచి యింద్రుఁడు మొదలుగాఁగల దేవసంఘములెల్ల మిక్కిలి యాశ్చర్యమును బొందును - ౬౦- అప్పుడు దేవతలకెల్లఁ బెద్దయైన యాశివుఁడా వస్త్రములను గ్రహించి యింద్రుఁడు మొదలగుదేవతలకొఱకు ఋషులు గంధర్వులు సిద్ధులు మొదలగువారికొఱకు వరుసగానిచ్చెను - ౬౧ - తరువాత నప్సరస్త్రీలకెల్ల నిచ్చి వారిని సంతోషపఱచెను - పిమ్మట నాశంకరుఁడు దేవాంగముని కొఱకు మంచి చక్రమునిచ్చెను - ౬౨ - శత్రువులనెల్ల మర్దించుటకు సాధనమైన దివ్యమైన వృషభధ్వజమునిచ్చెను - అంతట నాశివుఁడు భక్తిచేతఁ బరిగ్రహింపఁబడిన యాదేవలమునింగూర్చి మరలఁబలికెను- ౬౩- ఓ దేవాంగముని సకలరిపువులను సంహరించునట్టి యీధ్వజముచేత మూఁడులోకములయందు జ

తతం॥ ౬౪॥ తథాస్త్విత్యనుజగ్రాహ దేవాంగ స్స్వామిభాషితం । తతస్సూ
ర్యం సమాలోక్య శంకరోభక్తవత్సలః॥ ౬౫॥ అబ్రవీన్మధురంవాక్యం భాస్క
రం లోకభాస్కరం । విశ్రుతస్వసాతేద్య దేవదత్తాయశస్వినీ ॥ ౬౬ ॥ రాజ
ర్షయేస్మైసూరాయ దేవాంగాయ ప్రదీయతాం। ఇతిబ్రువాణేదేవేశే సూ
ర్యోహర్ష సమన్వితః॥ ౬౭॥ ఉవాచ శంకరంవాక్యం కంపయాన శ్శిరోము
హుః । భగవన్ దేవదేవేశ యథోక్తం చత్వయానఘ॥ ౬౮॥ తథైవవర్తతే
స్మాకం సర్వేషాం మానసేప్రభో । దేవాంగాయైవ దాతవ్యా దేవదత్తామ
మస్వసా॥ ౬౯॥ ఇత్యేవం ప్రార్థనామేహి సఫలోమన్మనోరథః । ఇత్యుక్తే
తత్రసూర్యేణ సాధువాదోమహానభూత్ ॥ ౭౦ ॥ తతో బ్రవీన్మహాదేవీ సూ
ర్యం కురుతథేతిచ । శ్రుత్వా సూర్యేరితంవాక్యం తుతోష పరమేశ్వరః॥ ౭౧॥
ఇంద్రాద్యాస్సర్వదేవాశ్చ తథైవేత్యబ్రువన్నవిం । దత్వావస్త్రాణి సర్వేభ్యో
భగవాన్నాకుసాన్వినా ॥ ౭౨ ॥ అథోద్ధామోమయాసార్థం శుద్ధాంతం ప్రవి

---

యమగలవాఁడవై సర్వకాలము సుఖమునుబొందును - ౬౪ - ఇట్లు స్వామి
వారుసెలవిచ్చినమాట నాదేవలుఁడు వెంబడియే యట్లయని యంగీకరించెను-
అంతభక్తులయందుఁ బ్రీతిగల యాసాంబశివుఁడు లోకములనెల్లఁ బ్రకాశింపఁ
జేయును మిక్కిలి తేజోవంతుఁడై యున్న సూర్యునిఁ జూచి మనోహరమైన
మాటఁ జెప్పెను ఓ సూర్యుఁడా నీతోడఁబుట్టినది కీర్తివంతురాలైన దేవద
త్తయను కన్యకయున్నదే యామెను శౌర్యముగల యీ దేవాంగిరాజఋషి
కొఱకిమ్ము- అనియిట్లు దేవతా సార్వభౌముడైన సాంబశివుఁడు చెప్పగాఁ ద
లయూఁపించుచు నాసూర్యుఁడుమిక్కిలి సంతోషముతోఁగూడినవాఁడై శివుని
గూర్చి యుత్తరము చెప్పెను - ౬౭ - షడ్గుణైశ్వర్యసంపన్నుడవైన దేవదే
వులకుఁ బ్రభువా యిప్పుడు తామేరీతిని సెలవిచ్చితిరో మామనస్సునందుఁగూ
డనట్లేయున్నది స్వామీ- నాతోడబుట్టినదైన దేవదత్తయనుకన్యక దేవాంగు
నికొఱకేయీఁదగినది - ౬౯ - నాకోరిక యిట్లుండెను- తామిట్లుసంకల్పించు
టవలన నాకోరికఫలించెను - ఇట్లు సూర్యుఁడు చెప్పఁగా నక్కడివారెల్ల లె
స్సలెస్సయని పలికిరి- ౭౦- తరువాత నాపార్వతీదేవి సూర్యునితో నట్లుచేయు
మనిచెప్పెను- అప్పడాసూర్యుఁడు తానుజెప్పినమాట కనుకూలమైన యుత్తర
ముచెప్పఁగానే యామాటను విని పరమేశ్వరుఁడు సంతసించెను - ౭౧ - ఇం
ద్రుఁడు మొదలైన దేవతలందఱు సూర్యునిఁగూర్చి సరిసరియనిపలికిరి - షడ్గు

వేశహ । సేవాయాతా స్తతస్సర్వే జగ్ముర్వై స్వాలయాన్ ప్రతి ॥ ౨౩ ॥ దేవాంగో పితతో రాజా యయావామోదపట్టణం॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - దేవాంగ శంకర వస్త్రప్రదాన నందిధ్వజ సంపాదనం నామ దశమోధ్యాయః.

తతః కైలాసశిఖరా దవతీర్య సదేవలః । ఆమోదపట్టణంగచ్ఛ న్నద్ర స్యైకతవై సరః ॥ ౧ ॥ కైరవై శ్శతపత్రైశ్చ కమలైశ్చ మనోహరైః । పూర్ణంరమ్యం రాజహంసైః క్రీడద్భిర్విమలంశుభం ॥ ౨ ॥ ఫలపుష్పసమాకీర్ణైర్వృక్షై ర్వ్యాప్తం మనోహరం । తత్రాసౌ శివపూజార్థం కృతస్నానో మహీపతిః॥ ౩॥ నివృత్తనిత్యకర్మాచ పూజయిత్వా మనోహరైః । పద్మపుష్పైర్మహాదేవం ప్రార్థయిత్వాతిభక్తితః ॥ ౪ ॥ ఆమోదం ప్రతిభూపాలో గమనాయోపచక్రమే । ఏతస్మిన్నేవకాలేతు రంభా సర్వవిమోహినీ॥ ౫॥ దృ

---

నైశ్వర్య సంపన్నుఁడైన యాశివుఁడు రాక్షసుల విడిచి తక్కినవారి కెల్ల వస్త్రములనిచ్చి యంతటలేచి పార్వతితోడ నంతఃపురమునుజొచ్చెను - తరువాతస్వామి సేవానిమిత్త మచ్చటికి వచ్చినవారందఱు తమతమ యిండ్లకుఁ బోయిరి- ౨౩- అంత నాదేవాంగరాజును దనయామోదపట్టణమునుగూర్చి బయలు వెడలి పోయెను- ఇది బ్రహ్మాండపురాణంబున దేవాంగచరితంబున దేవాంగముని శంకరునకు వస్త్రముల నిచ్చుట నందిధ్వజమును సంపాదించుట యన్నది పదవయధ్యాయము.

అంతనాదేవలముని కైలాసపర్వతముయొక్క కొమ్మునుండిదిగి తనయామోదపట్టణమునుగూర్చిపోవుచు త్రోవలోనొక కొలఁకునుజూచెను- ౧- ఆ సరస్సుకలువలచేతను నూరురేకులుగల తామరపూలచేతను మిక్కిలి సుందరములుగానుండు వేయిరేకులుగల తామరలచేతను నిండి విహరించుచున్న రాజహంసలచేత మనోహరమై నిర్మలోదకముకలిగి మంగళములనెలవై యున్నది- ౨- మఱియునాసరస్సుచుట్టు పండిపూచియుండుమ్రాకులు పెక్కునుం గలవు అట్టియాసరస్సునం దీదేవలరాజు శివపూజఁజేయను స్నానముచేసి తననిత్యకర్మములనెల్ల నెరవేర్చుకొని రమ్యములగుతామరపువ్వులచేత దేవతలకెల్లదొడ్డవాఁడయిన సాంబశివునిఁబూజించి మిక్కిలిభక్తితోఁ బ్రార్థించి యంతనారాజుతనయామోదపట్టణమునుగూర్చిపోవనారంభించెను- ౪- ఈలోఁబూర్వమీ దేవాంగుని సుందరాకారమునుజూచి యతని మోహించి సమయముకాచియు

ష్టైవనం మోహితాపూర్వం దేవాంగం సుందరాకృతిం । నిరీక్షమాణా సము
యమాససాదతదంతికం॥ ౬॥ బింబోష్ఠీ ఖంజరీటాక్షీ పూర్ణచంద్రనిభాననా।
నీలాభ్రకుంతల భరాశష్కులీకర్ణశోభితా॥ ౭॥ పక్ష్మమాలీసజ్జితభ్రూధను
స్తృక్తేక్షణాంబికా । ఆదర్శగండాసుదతీ వజ్రపుష్పానునాసికా ॥ ౮ ॥ అర్ధ
చంద్రాభనిటలా పక్వబింబఫలాధరా । కంబుకంఠీ శాతకుంభ కుంభోపమప
యోధరా॥ ౯॥ నవీనపల్లవకరా ప్రవాళలతికాభుజా । కృశోదరీవభోమధ్యా
కూర్మపృష్ఠచకాసితా ॥ ౧౦ ॥ గంభీరనాభివల్మీక వివరద్రోమమాళిపన్నగా । రం
భోరూసైనకతశ్రోణీ గూఢగుల్ఫవిరాజితా॥ ౧౧॥ కాహాళీవిలసజ్జంఘా పద్మ

---

న్న యెల్లవారిని మోహింపఁజేయునట్టి రంభ యతనిదగ్గిరకువచ్చెను- ౬- ఆరం
భయొక్క పెదవిదొండపండువలెనున్నది - కన్నులు కాటుక పిట్టలవలెనున్నవి
ముఖమునిండుచందురునిబోలియున్నది - కొప్పుకారు మేఘమువలెనున్నది చె
వులు చక్కిలాలవలెనున్నవి - ౭ - రెప్ప లల్లెత్రాడ్ల వలెను గనుబొమ
లు ధనుస్సు వలెను జూపులు బాణములవలెనున్నవి - చెక్కిళ్లద్దముల
వలెనున్నవి - దంతములు సుందరములుగానున్నవి - ముక్కు
నువ్వుపువ్వువలెనున్నది - ౮ - నొసలు సగము చందురునివలెనున్నది-
అధరముపండిన దొండపండువలెనున్నది- మెడశంఖమువలెనున్నది స్తనములు
బంగారపు కలశములవలెనున్నవి- ౯- చేతులు లేత చిగుళ్లవలెనున్నవి- భుజ
ములుపవడపుతీగలవలెనున్నవి - కడుపుడిగియున్నది నడుమాకాశతుల్యము
గానున్నది - వీపు తాఁబేటిచిప్పవలెనున్నది - ౧౦ - లోఁతుగానుండెడుబొడ్డో
కపుట్టరంధ్రమువలె నుండఁగా నూఁగారందుఁ జొచ్చుపాముపలెనున్నది తొ
డలనటికంబములవలెనున్నవి - పిఱుదులిసుకదిన్నెలవలెనున్నవి- చీలమండెలు
తెలియకుండఁ జర్మముబలసి క్రమ్ముకొనియుండఁగాఁ బ్రకాశించుచున్నవి- ౧౧-
పిక్కలుతుతూరలవలె నడుగులుకమలములవలెను బ్రకాశింపఁగా సుందరరూ
పముగలదై యున్నది - దేహము మెఱుముఁతీఁగవలె నుండఁగాఁ గృశాంగియై
మిక్కిలి సంతసమునొందియున్నది - చెవులయందుధరించిన రత్నముల కమ్మల
కాంతులు చెక్కిళ్లయందువ్యాపింపఁగా నాచెక్కిళ్లు తళతళలాడుచున్నవి - బు
లాకితొంగడమునవేసిన ముత్తెముకదలఁగా ముక్కు ప్రకాశించుచున్నది - ఆ
పెకన్నులు కదలుచున్న వేగాని నిశ్చలముగా నొకచోటనుండవు- ౧౧ - చిరున
గవ్వునవ్వఁగా దంతములుదెలిసి వానితెల్లనికాంతి వెన్నెలవలెఁ బ్రకాశింపఁగా

పాదామనోహరా । తటిల్లేఖోపమాతన్వీ పరమానందసంకులా ॥ ౧౩ ॥ ర
త్నతాటంక రుచి భిర్వ్విల సద్గండమండలా । చలన్మౌక్తికసంశోభి నాసికాలోల
లోచనా । చలత్ప్రాలంబసంఘాత స్తనకంపిత మధ్యమా ॥ ౧౪॥ కాంచికలక
లధ్వాన ప్రతిఝుంకృతనూపురా । నీవిచలస్స్వర్ణచేల పింజాగ్రస్యూతమౌక్తి
కా ॥ ౧౫ ॥ ఈషత్త్స్రస్తపరీధాన లక్ష్యమాణపయోధరా । సంమోహయంతీ
సహసాస విలాసైర్వ్విలోకనైః ॥ ౧౬ ॥ దివ్యచందనలిప్తాంగీ దివ్యమాల్యైర
లంకృతా । అపాస్య త్వరితంయానం మందమందముపాగమత్ ॥ ౧౭ ॥ దే
వాంగోవీక్ష్యతాంరంభా మిదంవచనమబ్రవీత్ । కిమర్థమాగతారంభే కింకా
ర్యంవదసుందరి ॥ ౧౮ ॥ సఖీభిర్వ్వర్జితాచేహ గతాసిత్వంకుతోధునా । ప్ర
యోజనంతే కిమిహతన్మే వదవరాననే ॥ ౧౯ ॥ దేవలేనైవముక్తాసా రంభో
వాచనతాననా । సస్మితం విలిఖంతీచ పాదాంగుష్ఠేనభూతలం॥ ౨౦॥ శ్రుణు
రాజేంద్ర దేవాంగ మనోభవ సమాకృతే । త్వయిలగ్నం మానసమ్మే పురై

---

ముఖముమిక్కిలి వెలయుచున్నది- కదలుచున్న హారములయొక్కయు స్తనముల
యొక్కయుభారముచేతనడుముజవజవలాడుచున్నది - ౧౪ - మొలనూలునం
దెలుగూడశబ్దింపఁగానాయందెలధ్వనిమొలనూలుధ్వనికిఁ బ్రతిధ్వనివలెనున్న
ది - వస్త్రమునడుమందు ప్రక్కజారవిడిచిన కుచ్చెలకొనలయందుముత్తెములు
గుచ్చఁబడియున్నవి-౧౫-పయ్యెదకొంచెముతొలఁగుటచేత స్తనములు తెలియు
చున్నవి - బెళుకుచూపులచేతనతిశీఘ్రముగాభ్రమింపఁజేయుచున్నది-౧౬-
దివ్యమైనశ్రీగంధమునుదేహమందలఁదుకొని దివ్యములైన పూలదండలచేతన
లంకరింపఁబడియున్నది - ఇవ్విధంబుననుండెడియారంభ శీఘ్రముగావచ్చున
ట్టినడుపును విడిచి మదముచేతఁ దిన్నగావచ్చెను- ౧౭- అంత నాదేవాంగము
నియారంభనుఁజూచి యిట్లొకమాటపలికెను - ఓరంభానీవేలవచ్చితి వేకార్య
మునుగురించినీవువచ్చితివోదానిఁజెప్పుమోసొగసుకత్తియా - ౧౮ - ఇప్పుడునీ
వుచెలికత్తెలులేక యొంటిగా నిక్కడికి వచ్చుటకుఁ గారణమేమి - నీకిక్కడిరా
కయందుఫలమేమి దానినాతోఁజెప్పుమో సుందరమైనముఖముగల రంభా-
౧౯ - దేవలుఁడిట్లడుగఁగా నారంభతలవంచుకొనిచిరునగవునగుచుఁ గాలిబొ
టనవ్రేలితో నేలనుగాయుచు నతనితో నుత్తరముచెప్పెను- ౨౦- ఓమన్మథు
నియాకారముగల రాజశ్రేష్ఠుఁడైనదేవాంగముని చెప్పెదవినుము - మునుపునీవు
కైలాసపర్వతమందున్నప్పుడేనామనస్సునీయందుదగిలినది - ౨౧ - ఇప్పుడు

వరజతాచలే॥ ౨౦॥ ఆనంగకేళీమధునా మయాంగీ కర్తుమర్హసి । మణిత్తై బాహుభిర్బంధై ః కలాబంధై రనేకశః ॥ ౨౧ ॥ మమైకసురతక్రీడా మను భుంక్ష్వ మహామతే । వ్యూఢోసిత్వం మహాబాహో బాహుభ్యాం తవ భూపతే॥ ౨౨॥ సంఘట్టనంమత్కుచయోః కుర్వాలింగనమాదరాత్ । మనో రథమ్మేసఫలం కురురాజేంద్రమాచిరం ॥ ౨౩ ॥ తయైవముక్తో దేవాంగ స్స్వ్వ్రశ్రకర్ణౌశివేతిచ । జగాదవచనంప్రాజ్ఞో రంభాంసవిజితేంద్రియః ॥ ౨౪ ॥ నాహమేవంహివక్తవ్య స్త్వయారంభేవిచక్షణే । మాదృశా మీదృశం కర్మ నయోగ్యంసర్వదాశుభే॥ ౨౫॥ తత్కార్యం సఫలంకర్తుం శక్ను యాం నైవ కామిని । నజానాసివిరాగంమాం కింత్వయా కామితఃకథం॥ ౨౬॥ నసంతికా ముకాఃకింతే దేవాద్యాస్సుమనోహరాః । ప్రాప్తవ్యంచ సుఖం తేభ్యో స్సూ దృశై ర్విహితంనతే॥ ౨౭ ॥ తేజోహానిఃకర్మలోప ఈదృశేనహికర్మణా । స తాంవై గణికాసంగః పాపాయపరికల్పతే॥ ౨౮॥ దుశ్శీలై రనుభోక్తవ్యా గ

---

నీవునాతో మన్మథక్రీడఁ జేయుటకంగీకరింపవలయును- రతికూజితములతో నుబలువిధములై నబంధములతో నుమతియుఁగలనుగట్టునట్టి కార్యములతో నాయొక్క సురతక్రీడ నొక్క మాఱు నీవనుభవింపుమయ్యా మిక్కిలి బుద్ధిశాలివై న దేవాంగమునీ - ఓరాజా నీవు మిక్కిలి దృఢమైన దేహము గల వాఁడవు గొప్పభుజములుగలవాఁడవు గనుక నీభుజములతో నా స్తనముల నొరియునట్లొకతూరి ప్రేమతోఁ గౌఁగలింపుము - ఓరాజరాజా శీఘ్రముగా నా కోరికనుదీర్పుము - ౨౩ - అనియిట్లారంభ చెప్పఁగాఁ దెలిసినట్టియు నింద్రియములనునిగ్రహించియుండు నా దేవలముని శివశివయనుచుఁ జేతఁ జెవులుమూసికొనుచునారంభనుగూర్చియుత్తరముచెప్పెను - ౨౪ - ఓపండితురాలై నరంభా నన్ను నీవిట్లుచెప్పరాదు-మంగళమూర్తిగలయోరంభా యెల్లప్పుడుమావంటివారికిట్టికార్యముతగదు- ౨౫- కాఁబట్టి నీవు కోరినకోరికను నేనుసఫలముగాఁజేయఁజాలనే కామముగలదానా - నేనుగామములేనివాఁడనని నీవెఱుగవానన్నెట్లుకోరితివి- ౨౬- నీకుదేవతలు మొదలయినవారు మంచిసొగసుకాంక్షుకామముగలవారులేరా - వారివలననీవుసుఖమును బొందవలయును- మావంటివారితోఁబొందుటనీకువిధిచోదితముగాదు-౨౭-ఇట్టికార్యముచేత దేజస్సునకు జేటును సత్కర్మములకులోపమునుగలుగును - యోగ్యులై నవారికి వేశ్యాస్త్రీ సంగమముపాపమునుబెంచును - ౨౮ - వేశ్యాస్త్రీమిక్కిలినిందింపఁబడి

ణికాభృశనిందితా। కదాసద్భిరసద్భిశ్చ భుక్తాయోగణికాభ్రమాత్ ॥ ౩౦॥ ఉ
భయేషాంచపాపానాం తేసర్వేసమభాగినః । యత స్త్వంగణికారంభే త్యక్త
వ్యాహితతోమయా॥ ౩౧ ॥ మయ్యాప్రయోజనంనాస్తి తతోగచ్ఛయథారు
చి। ఆమోదంప్రతిగంతవ్యం శీఘ్రమేవమయాధునా॥ ౩౨॥ గఛనాకంవరారో
హేమయాకింతేమనోరథః ॥ శ్రీసూతః ॥ ఇత్యేవముక్తా సారాజ్ఞా దేవాంగేన
సురాంగనా ॥ ౩౩ ॥ సకోపవిసయోవాచడోలాయ త్తస్వమ స్తకా ॥ రంభా ॥
కిముచ్యతేరాజ చంద్రసాధుమేద త్తము త్తరం ॥ ౩౪ ॥ హంతై వంసచవ క్తవ్యం
త్వయామతిమతాంవర । సాధారణాయథానార్యో ద్రష్టవ్యాస తథాత్వయా॥
౩౫ ॥ రంభాయాం లోకసుందర్యాం పార్థయంత్యాంసమాదరాత్ । ఈదృ
గ్విధానివాక్యాని వ క్తవ్యానిత్వయానను॥ ౩౬॥ గణికాహం నిందితేతి మాం
బ్రవీషిమహామతే । విధినాకృతయజ్ఞానామృషిభిర్గతకల్మషైః ॥ ౩౭ ॥ మ
త్సంభోగఃఫలమితి స్రశుణో ష్యాగమేరితం । మాంమావమంస్థారాజేంద్ర వి

---

నదిమరాచారముగలవారుదానిఁగూడవలయును - తెలియకయోగ్యులై నవా
రునయోగ్యులునుగూడ గణికాస్త్రీనిబొందినపక్షమందు వారల రెంటు తెఱం
గులవారి పాపమును వారందఱనుభవింతురు - ఓరంభా నీవు వేశ్యాస్త్రీవి గ
నుక నేనునిన్నుగ్రహింపఁగూడదు - ౩౧- కాఁబట్టి నావలన నీకులాభములేదు
కోరినచోటికిఁబొమ్ము - నేనునిప్పుడతిత్వరతో నామోదపట్టణమునకుఁ బోవల
యును- ౩౨- సుందరమైనజఘనముగలయోరంభా నాతో నీకోరికయేమిలేదు
నీవుస్వర్గమును గూర్చిపొమ్ము - అనియిట్లా దేవాంగరాజుచేతఁ జెప్పఁబడినదై
దేవతాస్త్రీయయిన యారంభ కోపముతోనుఁగూడి తొట్రుపాటుగలయట్లు తల
యూచుచు దేవాంగునితో మరలమాటలాడనారంభించెను - ఓరాజశ్రేష్ఠుడా
యేమంటివి - నాకుమంచియు త్తరముచెప్పితివి - ౩౪ - అయ్యోబుద్ధిమంతుల
లోనెల్లశ్రేష్ఠుడవై ననీవిట్లుచెప్పఁగూడదు - అందఱుభోగమువారివలెనన్ను నీ
వెంచుకొనియున్నా వట్లెంచఁగూడదు - ౩౫ - ప్రపంచమందుండు వారందఱి
లో నధికసౌందర్యముగలరంభ యెంతో మోహముతోవచ్చి వేఁడుకొనునప్పుడీ
టువంటిమాటలానీవుచెప్పఁదగినవి - ౩౬ - ఓమహాబుద్ధిమంతుఁడా నేనువేశ్య
ను నిందితురాలనని చెప్పితివిగదా - పాపములఁగడచిన ఋషులు శాస్త్రరీ
తిని యజ్ఞములజేసిన పక్షమందా యజ్ఞములకు నాతోసంభోగముచేయుట ఫ
లమనివేదములయందుఁ జెప్పబడియున్నదే దాని నీవువినలేదా - కాఁబట్టినేను

శేషేణసుపావనీం॥ ౩౮ ॥ నవిద్యతేత్రిలోక్యాంచ సదృశీసుందరీమయా । ప
రాశరాత్రిప్రముఖా మునయోగతకల్మషాః ॥ ౩౯ ॥ మద్దర్శనేనవిభ్రిష్టాః ప
రమంభంగమాప్నుయుః । దృఢవ్రతమునీనాంచ దర్శనం మమభంగకృత్ ॥
౪౦ ॥ జితేంద్రియ మహాత్మానో నిరస్తాబహవోమయా । యోగినశ్శుద్ధ చేత
స్కా నిర్మలజ్ఞానభూషణాః ॥ ౪౧ ॥ దర్శనేనైవమే సర్వే భవే యుర్విటశే
ఖరాః । తతాదృగ్రూపసుభగాంపవిత్రాంలోకసుందరీం॥ ౪౨॥ ప్రార్థయం
తీమపిచమాంకింనత్వంస్వీకరిష్యసి । మమభోగ స్సుకృతిభిర్లభ్యతేనేతరైః క
థం॥ ౪౩॥ తాదృశీంమాంకుత్సితేతి త్వయాద్యకథముచ్యతే । ప్రార్థయంతీమి
తిచమాంమావమంస్థానృపర్షభ ॥ ౪౪ ॥ జయంతోరతిరాజశ్చ వసంతనల
కూబరౌ । ఏతేరూపవతాంశ్రేష్ఠానారీణామహమేవహి ॥ ౪౫ ॥ తేలావణ్యేన
తేరాజ న్కలాం నార్హంతి షోడశీం । తస్మాత్త్వద్దర్శనాచ్ఛ్రి మన్మనో

---

మిక్కిలి పరిశుద్ధురాలనే యట్టి నన్నవమానపఱుపకుమోయి రాజవర్యుఁడా ౩౮ - మూఁడులోకములయందుండు స్త్రీలలో నొకతెయైన నాతో సరియైన సొగసుకత్తెలేదు - పరాశరుఁడత్రిమొదలైనపరిశుద్ధాంతరంగులైన ఋషులందఱు నన్నుఁజూడఁగానే మనోనిగ్రహమువలనఁజారి వ్రతభంగమును బొందుదురు- ఎంతదృఢముగా వ్రతములనాచరించుఋషులకునన్నుఁజూడఁగానే యా వ్రతములన్ని యెక్కడనోపోవును - ౪౦ - ఓ యింద్రియములను జయించినదేవలమునీ - పెక్కండ్రుమహానుభావులను నేను జయించియున్నాను - పరిశుద్ధమైనమనస్సుగలిగియుచ్చేములేని తెలివియే తొడవుగాఁగలయోగులందఱునా చూపుచేతనే విటశ్రేష్ఠులగుదురు - అట్టిరూపముచేత మనోహరురాలును పరిశుద్ధురాలును లోకములలోనెల్ల సొగసుకత్తెనగు నన్నుఁబ్రార్థించుదానిని నీవేలపరిగ్రహింపవు- నాతోడిపొందుపుణ్యశాలులకులభించుఁగాకయితరులకు లభించునా- ౪౩- అట్టినన్ను జెడుదాననని నీవెట్లంటివి- నేనునిన్నుఁబ్రార్థించితినని యంతమాత్రముననే యవమానింపకుమోయి రాజశ్రేష్ఠుడా- ౪౪ - జయంతుఁడురతికిఁబెనిమిటియైన మన్మథుఁడువసంతుఁడు నలకూబరుఁడువీరుసొగసుకాండ్రలోనెక్కుడైనవారు స్త్రీలలో నందఱిలో నేనేసొగసుకత్తెను- ౪౫ - ఓరాజా నేనుజెప్పినజయంతాదులు సొగసునందు నీకుఁబదియారింట నొకపాలికైనసరికారు- కాఁబట్టియోయిమిక్కిలి యదృష్టవంతుఁడా నిన్నుఁజూడఁగా నామనస్సు నిలవకయున్నది- ౪౬ - నేనెప్పుడు దేవాంగునిఁజూడఁగలను - దే

వ్యాకులాయితే॥ ౪౬॥ ద్రక్ష్యేకదాహం దేవాంగం కదామాం స్వీకరిష్యతి । త్వదాస్య చంద్రం ద్రక్ష్యా మిలప్స్యతే సమయఃకదా ॥ ౪౭ ॥ త్వామేవచింతయంతీత్థం త్వద్రూపం తవభాషితం । ఏతావత్కాలమనయం స్మారం స్మారం పునఃపునః ॥ ౪౮ ॥ శయనేగమనేస్థిత్యాం భాషణేన్యాశ్చయాఃక్రియాః । సర్వాసుతాసునమయావిస్మృతంత్వయిచింతనం॥ ౪౯॥ అద్రాక్షింత్వాంయదాత్వోహం మనోభూస్తే తదాదితః । లక్ష్మీకృత్యచగాత్రాణి బాధతేప్రదరైర్భృశం॥ ౫౦॥ నమన్యేతస్యకాండాని పౌష్పాణ్యగ్నిమయానిహి । యదుత్సృష్టానియాన్యాస్యత్ జ్వరంమేజనయంతిహి ॥ ౫౧ ॥ పాప్మనస్తస్యబాణానాం మాలక్ష్యంకురుమాంప్రభో । మామంగీకృత్యసహసా సంతాపం మేవ్యపోహయ॥ ౫౨॥ దత్వాధరామృతంమేతు హృంతస్తాపంనివారయ । నార్హసిత్వం తిరస్కర్తుం యాచమానాం దయానిధే ॥ ౫౩ ॥ గాఢాలింగన మాధాయ ఘనబాహువిఘట్టనం । విధేహ్యంగాంగసంశ్లేషంసందష్టాధరపల్లవం ॥ ౫౪ ॥ కలాసం స్పర్శనైర్హాసైః స్వభావైః స్వవిలోకనైః । రమస్వ హిమయా సా

---

వాంగుఁడెప్పుడునన్నుఁబరిగ్రహింపఁగలఁడు - ఎప్పుడునీముఖచంద్రునిఁ జూడబోదును - దీని కెప్పుడుసమయమని నిన్నే మనస్సునందుఁదలఁచుచు నీసొగసును నీమాటలచమత్కారమునుబలుమాఱుతలఁచుకొని యింతకాలమును గడపితిని ౪౮ - పడకయందును నడకయందు నునికియందును మఱియు నితరవ్యాపారములయందన్నిటియందునునీతలఁపునునేనుమఱువనైతిని- ౪౯- నిన్ను నేనెప్పుడుచూచితినో యది మొదలుకొని మన్మథుఁడు నాయంగములను గురిచేసుకొని బాణములచేత నన్ను మిక్కిలి బాధించుచున్నాఁడు- ౫౦- నేనామన్మథునిబాణములు పుష్పములనియెప్పను - మఱియేవనిన నవినిప్పులుగా నుండవలయును అతనిచేతఁబ్రయోగింపఁబడియవినాకుజ్వరమునుగలుగఁజేయుచున్నవి- ౫౧- ఓస్వామి నన్నాపాపాత్ముని బాణములకు గురిగాఁ జేయకుము - శీఘ్రముగా నన్నుఁబరిగ్రహించి నాసంతాపమును మాన్పుము - ౫౨ - నీపెదవియందలి యమృతమునిచ్చి నామనస్సునందలి తాపమునుబోగొట్టుము - దయకునిధియైనయోదేవలా వేచుకొనుచున్న నన్ను నీవునిగ్రహింపదగదు - ౫౩ - దృఢముగా కౌఁగలించుకొని గట్టిభుజములు కదియునట్లన్నియంగములను నాయంగములతోఁజేర్చి పెదవినిగొఱుకుచు నన్నుఁబొందుము- ౫౪- కలాస్థానములనంటుచు నొవ్వోరులంజూచిదంత కాంతులుప్రకాశించునట్లునవ్వుచుశీఘ్రముగానాతో

ర్థంకందర్పసమమాచిరం ॥ ౫౫ ॥ అహోబతతవమనః కృతం వజ్రేణ వేధ
సా । నమ్రదుర్భవసీత్వంహిప్రార్థితోపిమయానృప ॥ ౫౬ ॥ నబ్రవీష్యుత్త
రంకించిత్తూష్ణీంతిష్ఠసిమూకవత్ । త్రిలోకసుందరీరంభా యాచతే దైన్యపూ
ర్వకం ॥ ౫౭ ॥ వింసిష్యతేనవచనం చోచ్యతే నహింభూపతే । అహోతినిష్ఠు
రంమన్యే హృదయం తేనసంశయః ॥ ౫౮ ॥ అస్తినాస్తీత్యుత్తరం వా బ్రూహి
యాస్యామిసత్వరం ॥ శ్రీసూతః ॥ తయైవముక్తోదేవాంగఉవాచవిహసన్నివ ॥
౫౯ ॥ పూర్వమేవమయాసుభ్రుకింనతేదత్తముత్తరం । సర్వథానే దృశంక
ర్మాద్యాస్మాకం రోచతేమనః ॥ ౬౦ ॥ దేహోయం మలమూత్రాణాం మావా
సోభృశకుత్సితః । మేదోమస్తిష్కమాంసాస్థిమజ్జాక్షతజసంచయః ॥ ౬౧ ॥
నవఛిద్రఃపునారోగైః పీడ్యతేబహుభిస్సదా । నానన్యధర్షణీనిత్యశ్చ నకదా
స్యస్థిరంసుఖం ॥ ౬౨ ॥ ఏతదేయేతుచభోగేనకుర్యాన్మతిమాన్రతిం । దైహికే
నైవభోగేన నఖల్వస్త్యచలంసుఖం ॥ ౬౩ ॥ పునఃపాపాయభవతీ తస్మాత్త్యా

---

సురతమునుజేయుమోయి మన్మథునితో సమమైనసొగసుగలవాఁడా- ౫౫- ఓ
హోఅయ్యో - బ్రహ్మదేవుఁడు నీమనస్సును వజ్రముతోఁజేసెను - లేనిపక్ష
మందో రాజా నేనిట్లు ప్రార్థించుచున్నాను నీకుఁ గనికరముతోఁ చకయుంటునా
౫౬ - మూఁడులోకములకు సొగసుకత్తెయయినరంభ పేదపడి వేఁడుకొనుచు
న్నది - నీవొకయుత్తరముచెప్పక మూఁగవలెనూరకున్నావు - ఓరాజా మాఱు
మాటతోఁ జేదాయేమి యుత్తరము బయలువెడలదాయెను- ఓహో నీమన
స్సుమిక్కిలికఠినమనితోఁచుచున్నదిసందేహములేదు- ౫౭- కలదులేదనియైన
జెప్పుము శీఘ్రముగాఁబోనైనఁ బోయెదను - అనియిట్లారంభ చెప్పఁగా నాదే
వాంగమునినవ్వుచు నుత్తరముజెప్పెను - ౫౮ - ఓసొగసైన కనుబొమలుగల
దానానీకునేనుముందేయుత్తరముచెప్పియుండలేదా - ఇప్పుడు మామనస్సన్ని
విధముల నిటువంటికార్యమునుగోరదు- ౬౦- ఈదేహము మలమునకును మూ
త్రమునకును నెలవు మిక్కిలి నిందితము మెదడుమాంసముసస్థులు మస్తిష్కము
నెత్తురువులిసీరు వీనియొక్క ప్రోగు - ౬౧ - దీనికిఁ దొమ్మిదిరంధ్రములున్నవి -
ఇఁకనురోగబాధలెప్పుడీదేహమునకుఁగలవు - అన్యులచేతధర్షింపఁగూడని
దికాదు- నిత్యముకాదుదీనికెప్పుడునుస్థిరమైనసుఖములేదు-౬౨- కాఁబట్టియీ
దేహసంబంధియైన యల్పసుఖమందు బుద్ధిమంతుఁడపేక్షపడరాదు - దేహ
సంబంధియైన యనుభవముచేత స్థిరమయిన సుఖము లేదుగదా - ౬౩-

జ్యోసనసంశయః। స్వస్త్రీం విహాయయమూఢాత్మా యోన్యాంకామయతేఖలః। ౯౪ ॥ నశ్యేయుస్తస్యపుణ్యానిజన్మాంతరకృతాన్యపి। అన్యస్త్రీకాముకోమూఢఆర్జయిత్వాఘసంచయం॥ ౯౫॥ దుస్తరం నరకంప్రాప్య పీడ్యతేయమకింకరైః। ఆలింగత్యంగనాంయోన్యాందుష్ప్రజ్ఞశ్చిత్తవిభ్రమాత్ ॥ ౯౬॥ అస్మాత్పరతరంసౌఖ్యంమత్వానాస్తీతివైతతః। అత్రస్యాత్కర్మవిభ్రష్టః పశ్చాత్తస్య యమకింకరైః॥ ౯౭॥ తప్తాయోనిర్మితానారీరాలింగేతిప్రబాధ్యతే। యోన్యనార్యాఃకరంమోహాత్కరేణాకర్షతేజడః ॥ ౯౮ ॥ బలాన్నాంగీకృతాయాశ్చ మన్వానోపిపరవ్యథాః। ఘూతేవృశ్చికసంపూర్ణే సమాక్షిప్యకరం ముహుః॥ ౯౯॥ వృశ్చికానాహరేత్యేవం పీడ్యతే యమకింకరైః। యశ్చుంబత్యన్యవనితాస్సలగ్నోయమకింకరైః॥ ౧౦౦ ॥ విషపూర్ణాస్తీక్ష్ణదంష్ట్రా వ్యాళీశ్చుంబేతిబాధ్యతే। యఃపశ్యతిచమూఢాత్మాన్యకాంతాః కామమోహితః ॥ ౧౦౧ ॥ సూచీభిస్తస్యభిద్యేతే నేత్రేయమభటైరుషా। అన్యకాంతాను

---

ఇఁకనేమనినమరలఁబాపము పెఱుగుటకుఁగారణముగానుండును- కాబట్టియీదేహమువలని సుఖమును విషువవలయును సందేహములేదు - ఏమష్టుఁడు తెలియని బుద్ధిగలవాఁడై తనభార్యనువిడచిమఱియొక తెనుగోరుచున్నాఁడో అట్టిపురుషుడనేకజన్మములలోఁజేసియున్న సుకృతములన్ని యుడఁగునుఅన్యస్త్రీనిగోరినతెలివిమాలినవాఁడు పాపములనుసంపాదించుకొని దాటఁగూడనినరకమునుబొంది యమధర్మరాజు భటులచేత బాధింపఁబడుచున్నాఁడు- ఎవఁడుదుష్టబుద్ధిగలవాఁడై మోహమును నిలుపఁజాలక యన్యవనితనుగౌఁగలించుకొనునో - అతఁడప్పుడింతకంటె సుఖములేదని యెంచిగదా యీకార్యమును జేయును అట్టిపురుషుఁడీలోకమందుసత్కర్మములకుఁదగనివాఁడగును - తరువాతనాపురుషుని యమభటులుకాచిన యినుముచేతఁజేయఁబడిన స్త్రీలనాలింగనముచేసుకొమ్మనిబాధింతురు - ఏబుద్ధిహీనుడంగీకరింపనియన్యస్త్రీనిఁబరుల దుఃఖముల నాలోచింపక బలిమిచేతఁ జేతఁజేయిపట్టియీడ్చునో - అట్టిపురుషుని బిమ్మటయమకింకరులు తేళ్లచేత నిండియుండు బొక్కయందతనిచేయిత్రోసితేళ్లనీడువుమనిబాధింతురు - ఎవఁడన్యస్త్రీల జుంబనముచేయునో యట్టిపురుషుఁడుయమకింకరులచేతఁదగిలి మెండువిషముగలిగి క్రూరములైన పండ్లుగలయీఁడుసర్పముల ముద్దుపెట్టుకొమ్మని బాధింపఁబడును - ఏ తెలివిలేనివాఁడుకామముచేత మయకమునుబొందినవాఁడై యన్యస్త్రీలనుజూచునో యత

షంగేణ వృద్ధిః పాపస్య జాయతే ॥ ౨౨ ॥ పాపానాం పరమం పాప మన్యస్త్రీ గమనం స్మృతం । తస్మాత్తత్పాపభీరూణా మస్మాకం విహితం నహి ॥ ౨౩ ॥ సురూపా త్రిషు లోకేషు పవిత్రా పుణ్యకర్మణా । అహం భోగో మమ ఫలం విరాగా యతపోధనాః ॥ ౨౪ ॥ అంగీక్రియా సురితి మాం త్వయోక్తం యత్తు సుందరి । విచార్యమాణే తత్తస్మిన్నోచతే నహి భామిని ॥ ౨౫ ॥ దూషితస్యాప్యనిత్యస్య దేహస్య కిము సౌష్ఠవం । కిన్నామ తస్య నిత్యత్వం భోగస్య తవ భామిని ॥ ౨౬ ॥ త్వయా తు భంగం ప్రాప్తానాం కిం సామ్యం మే విచక్షణే । స్వార్జితాని హి కర్మాణి పుణ్యాన్యన్యాని వా తతః ॥ ౨౭ ॥ స్వయమేవానుభుంజంతే గణ్యం తన్నాన్యవర్తనం । బహునాత్ర కిము క్తేన పశ్యామి త్వాం న నైకథం ॥ ౨౮ ॥ అతో న్యాభిః క్రియాభిః కిం కాకథా గఛ భామిని ॥ శ్రీసూతః ॥ ఏవం నిరస్తా సా రాజ్ఞా దేవాంగేనామరాంగనా ॥ ౨౯ ॥ సక్రోధశోకా దేవాంగం భర్త్సయంతీదమబ్రవీత్ । ధిగ్బుద్ధం తవ రే బుద్ధిం హృదయం తన దుర్భిదం ॥ ౩౦ ॥ నిత్యానిత్య వివేకం తే ధి

---

నికన్నులను యమకింకరులు కోపముతో సూదులచేతఁ బొడుతురు - కాఁబట్టి యెన్ని విధములనైన నన్యస్త్రీసంబంధమునవలనఁ బాపమునకు వృద్ధికలుగును - ౨౨ - పాపము గలుగఁజేయు కార్యములయందన్నిటను అన్యస్త్రీలఁ బొందుట యెక్కుడైనదని స్మృతులయందుఁ జెప్పబడియున్నది - కాఁబట్టి పాపమునకు భయపడునట్టి మాకది యుక్తముకాదు - ౨౩ - మూఁడులోకములయందు మంచిసాగసుకత్తెను సుకృతమును గలుగఁజేయు కార్యముచేతఁ బరిశుద్ధురాలను నేను వైరాగ్యమునకు నన్నుఁ బొందుటయే ఫలము తపస్సే ధనముగా నుండు ఋషులందఱు నన్నంగీకరింతురని నీవు చెప్పిన దేదికలదో యది యంతయు నాలోచింపఁగా నాకు రుచింపకున్నది - ౨౪ - అనేకవిధములఁ జెడ్డదై యనిత్యమైన యీ దేహమునకు మంచియేమున్నది - అట్టి దేహముతో నిన్నుఁ బొందఁగాఁ గలుగు సుఖ మెట్టి నిత్యము - ౨౬ - నీచేత సనేకులు వ్రతభంగమును బొందిరంటివి వారితో నాకు సాటియే ల - లోకమందుఁ బుణ్యకర్మమైనఁ బాపకర్మమైనఁ జేసినవారు వారు వారు చేసినకర్మముల ఫలమును వారు వారనుభవింతురు కాఁబట్టి యొకరినడవడి నెంచఁబనిలేదు - అధికముగా మాటలాడి యేమి ఫలము నేనెన్ని విధములనైన నిన్నుఁ జూడను - చూడను గూడ సమ్మతింపను వాఁడ నితరకార్యములు చేయఁబోఁడు గనుక నూరక కథలేల మాటలాడవలయును బొమ్మో రంభా అనియిట్లా దేంవాగమునిచే తనారంభ తిరస్కరింపఁబడి కోపముతోను దుఃఖముతోను గూడినదై యా దేవాం

క్షేజ్ఞానంచమందనీః । కథంమేలపస్య తేభోగ స్త్వయానీరసి కేసతు॥ ౨౧॥ మాం పుణ్యస్య ప్రభావేన లభే ద్రసిక శేఖరః । మందప్రజ్ఞం నవిరసం జ్ఞానామిత్వా హమిమాన్యశం॥ ౨౨ ॥ దైన్యవృత్యా ప్రార్థయంత్యా నాగ్రహీర్వచనంమ మ । తస్మాత్త్వం దైన్యమాపన్న శ్శత్రుభిఃపరివారితః ॥ ౨౩ ॥ తైర్బద్ధోభ వదుర్బుద్ధే మచ్ఛాపాద్వీతపౌరుషః । పంచవర్షసహస్రాణి శూద్రత్వం సమ వాప్స్యసి । తతఃపరం బ్రహ్మవరో భవిష్యసినసంశయః॥ సూతః॥ ఇత్యుక్త్వాసా యయూరంభాతమవాస్యచయత్రవా ॥ ౨౪ ॥ దేవాంగోపితతోరాజా క్షణంత త్రవిచింత్యచ । ఈశ్వరాజ్ఞేతినిశ్చిత్య స్వపట్టణముపాసదత్ ॥ ౨౫ ॥ ఇతిశ్రీబ్ర హ్మాండపురాణే - దేవాంగచరితే - దేవాంగస్య రంభాశాపప్రదానం నామైకా దశోధ్యాయః.

అథసూర్యో మహాతేజా ఉద్వాహంచ స్వసుర్ధ్రువం । కర్తుంప్రా ప్యచలోకేశ మిదం వచనమబ్రవీత్ ॥ ౧॥ నమోస్తుతే చతుర్వక్త్రి సర్వలో

---

గునిబెదరించుచునిట్లనియె - ఓరి తెలివిమాలినవాఁడా నీబుద్ధినినిందింపవలయు ను నీమనస్సతికఠినము - ఓరిమూఢబుద్ధిగలవాఁడా నీనిత్యానిత్య వస్తువివేక మునునీజ్ఞానమును గాల్పవలయును- మిసుఁడైననీకునాతోడి భోగమెట్లుసిద్ధిం చును - ౨౧ - రసికుల కెల్ల శిఖామణిగానుండువాఁడెవఁడో యొకఁడు మిక్కిలి పుణ్యమునాచరించియాపుణ్యప్రభావములవలననన్నుఁబొందును- నేనునిన్నిట్టి బుద్ధిలేనివాఁడవనియు రసికుఁడుకావనియునెఱిఁగను-౨౨- పేదతనమునుబొం దివేఁడుకొనుచున్ననామాటనునీవుగ్రహింపకపోతివిగనుక నీవు శత్రువులచేతఁ జుట్టఁబడి పేదతనమునుబొంది నాశాపమువలనఁ బరాక్రమముచెడి శత్రువుల చేతఁగట్టఁబడుదువు ఐదువేలయేండ్లు శూద్రుఁడవుగానుందువు పిమ్మట బ్రాహ్మ ణోత్తముఁడవగుదువు సందియములేదు అనియిట్లుచెప్పి యారంభయాదేవాం గునివిడిచి యాపెయుండుచోటికిఁబోయెను- ౨౪- అంత నాదేవాంగరాజునా కనిమిషమక్కడఁజింతించియీశ్వరునియాజ్ఞచొప్పున నంతయు జరుగుచుండు ననినిశ్చయించుకొని తనపట్టణమునకుఁబోయెను- ౨౫- ఇది బ్రహ్మాండపురాణం బున దేవాంగచరితంబున - దేవాంగునకు రంభశాపమిచ్చుటయన్నది పదునొ కండవయధ్యాయము.

అంతమిక్కిలిప్రకాశముగలసూర్యుఁడుతనతోఁడఁ బుట్టిన దేవదత్తకు స్థిరముగా వివాహముచేయ నుద్యుక్తుఁడై ప్రపంచమున కంతటికిఁ బ్రభువైన

కైకపూజిత । స్వసారం దేవదత్తాంమే దేవాంగస్యామితౌజసః ॥ ౨ ॥ వివాహం కర్తుమిచ్ఛామి తత్కృతేత్వంమహామతే । స్వసిద్ధాంత ప్రకారేణ సమాలోక్యసుశోభనం॥ ౩॥ ముహూర్తం వదదేవేశ యతోఽస్మాకం ప్రభుర్భవాన్ ।
ఏవముక్తో భాస్కరేణ బ్రహ్మావాక్యం తమబ్రవీత్ ॥ ౪ ॥ అద్యాష్టమదినేసూర్య రాధేపక్షే సితేశుభే । పంచమ్యాం వర్తతేలగ్నం సోమవారేసులక్షణం
౫॥ రజన్యాం సప్తఘట్యూర్ధ్వం ధనుర్లగ్నే మనోహరే । కరిష్యతే యదుద్వాహస్తత్రసర్వ శుభావహః ॥ ౬ ॥ తేనేవంకథితేలగ్నే మార్తండ స్సతథేతిచ । ఉవాచభాస్కరఃప్రీత్యా బ్రహ్మాణం జగతాం పతిం ॥ ౭ ॥ త్వయాసపరివారేణా గంతవ్యం తత్రవైదినే । అవశ్యమితిసంప్రార్థ్య తత్పత్నీశ్చపృథక్పృథక్॥ ౮॥ కైలాస మగమచ్ఛ్రీమాన్ ఛంకరాహ్వానతత్పరః । ఉపాగమ్యమహేశానం దేవదేవం త్రిలోచనం॥ ౯॥ ఇత్యబ్రవీద్దినమణిః పార్వతీస

---

బ్రహ్మాయొద్దకుఁబోయి యొకమాటచెప్పెదను- ౧- సమస్తలోకములయందు బూజింపఁబడిన యోబ్రహ్మదేవుఁడా నీకొఱకు నమస్కారమవుఁగాత - నాతోఁడబుట్టినదైన దేవదత్తను మితిలేనిపరాక్రమముగల దేవాంగునకిచ్చి వివాహముచేయఁ గోరి యున్నాను - ఆవివాహమునకు మీా సిద్ధాంతప్రకారము మంచి శుభకరమైన ముహూర్తమొకటి చెప్పుమయా సర్వ ప్రపంచములకుఁ బ్రభువైనస్వామీా మాకుఁబ్రభువు నీవేగనుక నీతోనే యీాసంగతినిజెప్పు కొంటిని - అనియిట్లుసూర్యుఁడుచెప్పఁగా నతనిఁగూర్చి బ్రహ్మ యుత్తరముచెప్పుచున్నాఁడు - ౪ - ఓసూర్యుఁడా వైశాఖ మాసమందు శుక్లపక్షమందు నేటికెనిమిదవదినమందు పంచమినాఁడు శుభకరమైన సోమవారమునాఁడు మంచిలక్షణములుగలలగ్నమున్నది- నాఁడురాత్రి యేడుఘటికలకుఁ బిమ్మట వివాహముచేయఁబడిన పక్షమందా వివాహము మిక్కిలి శుభప్రదమై యుండును- ౬ - అనియిట్లుబ్రహ్మ లగ్నమును నిర్ణయించిచెప్పఁగానే లోకమునంత ప్రకాశింపఁజేయునట్టి యాసూర్యుఁడు మిక్కిలి సంతోషముతో లోకములకు - బ్రభువైన యాబ్రహ్మనుగూర్చి యట్లేయనిచెప్పెను- ౭ - ఇట్లుచెప్పి యాసూర్యుఁడు బ్రహ్మతో నీవాదినము నీపరివారముతోగూడ నవశ్యమక్కడకు రావలయునని ప్రార్థించి యా బ్రహ్మభార్యలగు సరస్వతి మొదలగువారిని వేరువేరఁబిలిచి శ్రీసాంబశివునిఁ బిలువ నిచ్ఛగలవాఁడై షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన యాసూర్యుఁడు కైలాసపర్వతమునకుఁ బోయెను - దేవతలకెల్ల దేవత

హితంశివం । మహాదేవ జగత్స్వామిన్ వివాహోదేవలస్యహి ॥ ౧౦ ॥ పం
చమ్యాంతత్రగంతవ్యం యువాభ్యామఖిలైస్సహ । ఇత్యుక్త్వా సతతోదేవా
వుక్తవంతౌ తథేతిచ॥ ౧౧॥ ఇభాస్యం షణ్ముఖం చైవ వీరభద్రంచనందినం ।
యేచాన్యేప్రమథాస్తత్ర సర్వాంశ్చాహూయయన్తతః ॥ ౧౨ ॥ శ్వేతద్వీ
పంతతోగత్వావిష్ణుంనారాయణంప్రభుం । సమాసాద్యాబ్రవీద్వాక్యంభాస్క
రోలోకభాస్కరః ॥ ౧౩ ॥ నారాయణ జగన్నాథ వివాహో మే స్వసుఃప్ర
భో । దేవాంగస్య ప్రదాస్యామి పంచమ్యాం సోమవాసరే॥ ౧౪॥ త్వమాగ
చ్ఛమహాభాగ సర్వైరపిసమావృతః । తేనైవముక్తోరవిణా బాఢమిత్య బ్ర
వీద్ధరిః॥ ౧౫॥ తతోలక్ష్మీం సమాహూయ భూమించైవవసుందరాం । పరివా
రాశ్చయేతత్రచక్రిణశ్చక్రధారిణః ॥ ౧౬ ॥ సర్వానాహూయమతిమాన్ స్వ
ర్గంగత్వామరప్రభుం । శచీసహితమాహూయ జయంతం పాకశాసనం॥ ౧౭॥

---

మొదటియు మాసకన్నలుగలయట్టిమహేశ్వరునిసమీపమునకుబోయి యా
సూర్యుడు పార్వతీదేవితోఁగూడనున్న శివునిఁగూర్చి యిట్లనిపలికెను- లోక
ములకునాథుఁడైన మహాదేవుఁడా దేవుఁడా దేవలునకుఁ బెండిలిగదా - ౧౧ -
పంచమినాఁడు ముహూర్తముగనుక నాటిదినమునీరుదంపతులుసకలదేవతల
తోఁగూడ నక్కడవచ్చియుండవలయునని చెప్పి వారుమంచిదనఁగానే గణనా
యకునిఁ గుమారస్వామిని వీరభద్రుని నందీశ్వరుని నింకనక్కడనుండు ప్రమ
థులనెల్లనతిశ్రద్ధతోఁబిలిచిలోకముల కెల్లఁబ్రకాశకరుఁడై వెలుగుచున్నట్టియా
సూర్యుఁ డక్కడనుండి శ్వేతద్వీపమునకుఁబోయి సర్వవ్యాపకుఁడై సర్వనా
థుఁడైన నారాయణునిఁబొంది యతనితో నిట్లనిచెప్పెను - ౧౩ - ఓలోక
ములకుఁబ్రభువైననారాయణుఁడా పంచమీసోమవారమునాఁడునాతోడబుట్టి
నదైనదేవదత్తకుఁ బెండ్లి దేవాంగమునికిచ్చునట్లు నిశ్చయముచేసియున్నాను-
౧౪- నీవు నీపరివారములతోఁగూడినవాఁడవై రావలయునయా మహానుభా
వా - అనియిట్లు సూర్యుఁడుచెప్పఁగా విష్ణువు సరియట్లకానిమ్మని యంగీకరించె
ను - ౧౫ - అంతనాసూర్యుఁడుమహాలక్ష్మిని సమస్తవిధములైన ధనములను
ధరించియుండెడు భూమిని మఱియుఁజక్రాయుధమునుధరించిన యావిష్ణువున
కుఁగల పరిజనులనందఱను బిలిచి యక్కడనుండి స్వర్గమునకుఁబోయి శచీ
దేవితోఁగూడియున్న దేవనాయకుఁడైన యింద్రునిఁబిలిచి యాయింద్రునికొ
డుకగు జయంతునిఁబిలిచి యక్కడనున్నబ్రహ్మర్షులను ద్వాదశాదిత్యులన

తత్రస్థితాంశ్చ బ్రహ్మర్షీ నాదిత్యాం స్త్వసూం స్తథా । రుద్రాన్ దేవాం స్త్వ
గంధర్వాన్ యేచాన్యే దేవయోనయః ॥ ౧౮ ॥ తాన్ సమాహూయనిఖిలాన్
సూర్యస్స్వంలోకమాగమత్ । నందోపనందౌ సూర్యస్యామాత్యౌ తస్యాజ్ఞ
యాతతః ॥ ౧౯ ॥ ఆశాపాలాంశ్చ దేవర్షీన్ బ్రహ్మర్షీన్ సపిసాదరం విద్యా
ధరాద్యాయేచైవ సర్వాంస్తాన్ దేవయోనిజాన్ ॥ ౨౦ ॥ సర్వానాహూ
యసంప్రార్థ్య ఊచతుర్భాస్కరస్యతత్ । దేవాంగస్తు తతశ్శీఘ్రమాం త్సు
బుద్ధిం మంత్రిపుంగవం ॥ ౨౧ ॥ ఆహూయకార్యదక్షంచ జగాదవచనంనృపః ।
భోమంత్రిపుంగవౌయువాం గచ్ఛతాం రవిసన్నిధిం ॥ ౨౨ ॥ నిశ్చిత్య లగ్నంతే
నోక్తమూపేత్యైవసుశోభనం । ఆగంతవ్యంశీఘ్రమేవయువాభ్యాంచ మమా
జ్ఞయా ॥ ౨౩ ॥ ఇత్యాదిష్టౌదేవలేన మంత్రిణౌతౌతథేతిచ । జగ్మతుస్సవితుర్లో
కముభౌపరమసంముదా ॥ ౨౪ ॥ పశ్యంతౌచనిమిత్తాని దివ్యాని వివిధానిచ
సుముహూర్తే మునిశ్రేష్ఠా స్తతసూర్యం ప్రపేదతుః ॥ ౨౫ ॥ ఉభౌవిచక్షణౌ
తౌచతేనసత్కారితావథ । సుబుద్ధిః కార్యదక్షశ్చ సూర్యోప్యై లోకబాంధవః ॥

---

ష్టవసువులను పదునొకండ్రు రుద్రులను దేవతలను గంధర్వులను మఱియు దే
వతలభేదములను వారినందఱుంబిలిచి సూర్యుండు తనలోకమునకువచ్చిచేరెను.
తరువాత నాసూర్యునిమంత్రులైన నందుండుపనందుండను వారతనియుత్తరు
వుచేతం బ్రీతితో దిక్పాలకులను దేవర్షులను బ్రహ్మర్షులను మఱియు వి
ద్యాధరులు మొదలగు దేవతలభేదముల నందఱిని బ్రార్థించి పిలిచివచ్చి యా
సమాచారముసూర్యునకుంజెప్పిరి - ౨౦ - అంతనక్కడ సకలైశ్వర్యములచే
తనొప్పియున్న యాదేవాంగమహారాజు తనమంత్రులలోం జెత్తనగాంజైన సుబుద్ధిని కార్యదక్షునిబిలచి యొకమాటచెప్పెను - ఓమంత్రిశ్రేష్ఠులారా
మీరిప్పుడుసూర్యునిసన్నిధికింబొండు- ౨౨- మీరునాయుత్తరువుప్రకారముపో
యి యాసూర్యుండు వివాహమునకు లగ్న మెప్పుడుచూచియున్నాండో దానిం
దెలుసుకొని నిశ్చయముచేసికొని శీఘ్రముగారావలయును- ౨౩- ఇట్లు దేవ
లునిచేత నానతియ్యంబడిన యామంత్రులిద్దఱట్లేయని మిక్కిలి సంతోషము
తో సూర్యునిలోకమునుగూర్చిపోయిరి - ౨౪ - వారుపోవునప్పుడు దోవలో
మంచిదివ్యములైన శకునములనేకములంజూచుచుంబోయి మంచివేళయందా
సూర్యునిం బొందిరయా ఋషిశ్రేష్ఠులారా- ౨౫- విద్వాంసులైన యాసుబు
ద్ధియుః గార్యదక్షుండు నక్కడఁజేరఁగానే సూర్యుండు వారలకుఁ దగినమ

౨౭॥ తెనోక్యస్యంసమభాషంత వివాహస్యకృతేతతః । సూర్యోక్తం బ్రహ్మని ర్ణీతం లగ్నంనిశ్చిత్యమంత్రిణా॥ ౨౮॥ ఆమోదం పునరాసాద్య దేవలాయో చతుశ్చతత్ । తతోరవిశ్చస్వామాత్యంవీరమార్తాండమబ్రవీత్ ॥ ౨౯॥ వీ రమార్తాండభద్రంతేభవానద్యమమాజ్ఞయా । గత్వా మోదపురంశీఘ్రం చతురంగైశ్చ సంవృతః॥ ౨౯॥ ఇతస్తృతీయదివసే పంచమ్యాం సోమవాస రే । ముహూర్తం దేవలస్యోక్త్వా పరివారాశ్చతస్యయే॥ ౩౦॥ తాంస్సర్వాం శ్చ సమాహూయ ఆగచ్ఛతుమహామతే। భాస్కరేణైవమాదిష్టో మాత్యో బాఢమితీరయన్॥ ౩౧॥ స్యందనైస్తురగైర్నాగైః పాదాతైశ్చాప్యనేకశః । సంవృతస్సహసామోద పట్టణం సజగామహ ॥ ౩౨ ॥ తమాగతంతతోజ్ఞా త్వా దేవాంగో మంత్రిణస్స్వకాన్ । అనేకజనసంకీర్ణం ప్రతిప్రేషయతాద రాత్ ॥ 33॥ ప్రతిసృత్యతతోమాత్యావీరమార్తాండమాదరాత్ । దివ్యదుందు

---

ర్యాదలుచేసెను - అంతట బ్రపంచమునకెల్లఁ జుట్టమైన యాసూర్యుఁడును వా రును వివాహ విషయమునుగూర్చి మాటలాడిరి - అంతనామంత్రులతో సూ ర్యుఁడు బ్రహ్మపెట్టిన లగ్నమును జెప్పఁగా వారుదానినిశ్చయించుకొని మరల నామోదపట్టణమునకువచ్చి యాసమాచారమును దేవలునితో జెప్పిరి- అంతనా సూర్యుఁడును దనమంత్రియైన వీరమార్తాండునిగూర్చి యిట్లనిపలికెను- ౨౯ - ఓ వీరమార్తాండుఁడా నీకు మేలుకలుగుఁగాత - నీవిప్పుడు నాయానతిచొప్పు ననాలుగువిధములదండునుగూడఁబిలిచికొని శీఘ్రముగా నామోదపట్టణమున కుఁబోయి నేటికిమూడవదినముపంచమీసోమవారమునాఁడుముహూర్తమని దేవ లునితోఁజెప్పి యతనిపరిజనములెవ్వారున్నారో వారినందఱఁబిలిచి రావోయి మహాబుద్ధిశాలీ- అనియిట్లు సూర్యుఁడుచెప్పఁగా నామంత్రి సరియని యంగీకా రవాక్యమునుబలుకుచు బహువిధములగురథములతోను గుఱ్ఱములతో నేనుఁ గులతోఁగాలుబలములతోఁగూడినవాఁడై యతఁడతివేగముతో నామోదప ట్టణమునకుఁబోయెను- 3౨- అంతనాదేవాంగముని యాసూర్యుని మంత్రివచ్చి నసమాచారమునుదెలిసి ప్రీతితోఁ దనమంత్రుల ననేక పరిజనములతోడ నెదు రుగాఁబంపెను- 33- అంత నామంత్రులు దివ్యములైన నగారాలు నఫుపత్తులుఢ క్కాలు తప్పెటలు మొదలగువాద్యముల నాదములతోడ నావీరమార్తాండు న కెదురుగాఁబోయి సూర్యుని మంత్రియైన యా వీరమార్తాండునిఁ బట్టణము లోపలికిఁ బిలుచుకొనివచ్చిరి - అంత నా వీరమార్తాండుడు దేవాంగుడున్న

భినిఘోషైః స్తూర్యవాదిత్రనిస్వనైః ॥ ౩౪॥ పురం ప్రవేశయామాస స్వచి
వంతిగ్మదీధితేః । సొంతఃపురం సమాసాద్య దేవాంగేనపరిష్కృతం॥ ౩౫॥ త
తోజగాదవచనం దేవాంగం ప్రతిసాదరం । రాజన్నుపస్థితంలగ్నం తృతీయేహ
నిచాద్యహి ॥ ౩౬ ॥ తస్మాత్త్వం సత్వరోభూత్వా మయాగచ్ఛసహాధునా ।
ఇత్యుక్త్వా స సచివాన్ స్తస్య బ్రాహ్మణాన్ క్షత్రియానథ॥ ౩౭॥ యేచసామా
జికాస్తస్య సర్వాంశ్చ ససమాహ్వయత్ । గమిష్యామోద్య సహసే త్యు
క్తవంతంస దేవలః॥ ౩౮॥ త్వం గచ్ఛాద్యమహాభాగ శ్వఃప్రభాతేఖిలైస్సహ ।
వయమప్యాగమిష్యామ ఇతివాక్యం తమబ్రవీత్ ॥ ౩౯ ॥ తథేతి వీరమార్తాం
డః ప్రయయావాస్వాలయంప్రతి । దేవలాగమనంచాథ సూర్యాయాసౌన్యవే
దయత్ ॥ ౪౦॥ తతోంశుమాలీత్వష్టార మాసాద్య వ్యాజహారహ । భగవన్
దేవదత్తాయావివాహస్సముపస్థితః ॥ ౪౧ ॥ కల్యాణమంటపం తస్య శీఘ్రం
నిర్మాతుమర్హసి । తేనైవముక్తస్సత్వష్టా నిర్మమామంటపంశుభం॥ ౪౨॥
హేమప్రాకారనిలయం ప్రవాళ స్తంభశోభితం । ఛాదితంవజ్రఫలకై స్తంతు
లాభిర్విరాజితం ॥ ౪౩ ॥ రత్నగోపానసీకంచ పుష్యరాగారరైర్వృతం । స్థగి

---

యంతఃపురమునుబొంది యంత దేవాంగునిఁగూర్చి ప్రీతితో నొకమాటపలికె
ను- ఓరాజా లగ్నముసమీపించెను నేటికిమూఁడవదినమేగదా-౩౬- కాఁబట్టినీ
విప్పుడు శీఘ్రముగాఁ బ్రయాణమైనాతోఁగూడరమ్ము - అనియిట్లు చెప్పి యా
దేవలుని మంత్రులను మఱియు నతని సభయందుండు బ్రాహ్మణులను క్షత్రి
యులనందఱనుబిలిచెను- పిలిచి యిప్పుడే ప్రయాణము రండుశీఘ్రముగఁబోవు
దమనియతఁడుచెప్పఁగా దేవలుఁడతనితో మహానుభావుఁడానీవిప్పుడుపొమ్మమే
మందఱము రేపటిదినము ప్రాతఃకాలమునవచ్చెదమని పలికెను - ౩౯ - అంత
నావీరమార్తాండుఁడట్లకానిమ్మని బయలువెడలి తనయింటినిఁగూర్చి పోయె
ను-పోయియతఁడుసూర్యునికొఱకు దేవలునిరాకను దెలిపెను-౪౦- అంతసూర్యు
డుత్వష్టదగ్గరకుఁబోయియతనితోనిట్లనెను- షడ్గుణైశ్వర్యసంపన్నుఁడా దేవదత్త
కువివాహముతటస్థించెను-౪౧- ఆపెండ్లికిఁగల్యాణమంటపమునుశీఘ్రముగా
జేయవలయును - అనియిట్లాసూర్యునిచేతఁ జెప్పఁబడినవాఁడై యాత్వష్టమం
చిశుభలక్షణములతోఁగూడిన కల్యాణమంటపమును నిర్మించెను- ౪౨- ఆ
మంటపమునకుఁజుట్టునున్న ప్రహరీలుబంగారముతోఁ గట్టఁబడియున్నవియం
దలి స్తంభములన్ని పవడములేగనుక నదిమిక్కిలిప్రకాశించియున్నది - వజ్రమ

తం వివిధై రత్నై భూభాగేచాపిభిత్తిషు॥ ౪౪॥ అనేకమంచసంకీర్ణ మనేక
ద్వారశోభితం । సప్తభిఃపంచభిశ్చైవ సహస్రై స్తంభసంఖ్యయా॥ ౪౫॥ చ
కాసితం విశ్వకర్మా కారయామాస మంటపం । మణిదీధితిసంఛన్న నానావర్ణ
సమాకులం॥ ౪౬ ॥ ఏకయోజనమాయామం చతుర్దిక్ష్వతనోత్ప్రభుః । త
న్మధ్యే మౌక్తికంరమ్యం మంటపం కృతవాంస్తతః॥ ౪౭॥ తస్యాధఃకల్పయా
మాస చతురశ్రాంచవేదికాం । కన్యాకుమారయోస్తస్యాం పీటద్వయ మక
ల్పయత్ ॥ ౪౮ ॥ పునఃపీఠాన్యనేకాని బ్రాహ్మణార్థమకల్పయత్ । సింహాస
నానిసర్వత్ర నానారత్నమయానిచ॥ ౪౯॥ ఉన్నతానిచ హ్రస్వాని బహుధా
పర్యకల్పయత్ । దేదీప్యమానం మణిదీప్తిజాలై స్సింహాసనై రత్నమయైర
నేకైః । సేవాలయై రత్నమయైశ్చచిత్రై రాకారయామాసస మంటపం శు
భం॥ ౫౦॥ ద్వారై రనేకై శ్శిఖరై ర్దశితాత్మమార్గై ర్విచిత్రై స్స్వర్ణకుం

---

ములపలకలుపై మూఁతగానున్నది మంచిపూజలతోఁబనితరముగానున్న చట్ట
పుపట్టెలచేతఁబ్రకాశించియున్నది కూచములకొనలు దెలియకుండఁ గప్పియుం
డునట్లుపూజలతో నమర్చునట్టివంకరకొయ్యలన్నియురత్నములుగానేయున్నవి
ఆమంటపపుతలుపులన్నియుఁబుష్యరాగమణులపలకలచేతఁ జేయబడియున్నవి
నేలయందునుగోడలయందును నానావిధములైనరత్నములఁగట్టియున్నది-౪౪
మఱియు నామంటపమందు మెండుసోఫాలున్నవి దానికివాకిళ్లు పెక్కులున్నవి
ఇట్లామంటపమును బండ్రెండువేలకంబములతోఁ బ్రకాశించియుండు దానిఁగా
నావిశ్వకర్మ చేసెను- మఱియు నామంటపమందలి తెలుపెఱుపు మొదలైన వ
ర్ణములన్నియునారత్నకాంతులచేత నాఛాదింపఁబడి తెలియకున్నవి-౪౬- అట్టి
మంటపమేతట్టు చూచినప్పటికి సరిగా నొకయామడ కొలతయుండునట్లామ
హానుభావుడు చేసెను - పిదప దానినడుమ సుందరమైన ముత్యాలమంటపము
నొకదానిఁ జేసెను-౪౭- దానిక్రింద నాలుగుమూలలుగలిగియుండు తిన్నెనుజే
సెను- ఆతిన్నెయందుఁ బెండ్లికుమారుడును గన్యయుఁగూర్చుండ రెండుపీఠము
లనుగల్పించెను-౪౮-మఱియునామంటపమందంతటబ్రాహ్మణులుగూర్చుండను
నానావిధములైన మణులలో సింహాసనపు పీటల నేర్పఱిచెను - అతఁడేర్పఱిచిన
పీటలుకొన్ని పొడగులుగానుగొన్ని కుఱుచలుగానున్నవి-౪౯- అతఁడునిర్మించిన
మంటపమందుఁజెక్కఁబడిన రత్నములకాంతులచేత దగదగమని ప్రకాశించు
చున్నది- అందుమణులచేతఁజేయఁబడిన సింహాసనములు పెక్కులున్నవి రత్న

భప్రకాశైః। తేజోమయైరున్నతై రప్యనేకై ర్ద్వారై రమ్యం నిర్మమాత్మ సృహాత్మా॥ ౫౧॥ ఏవం చిత్రం కౌశలాన్మంటపం సత్వష్టాదివ్యం కల్పయిత్వా విశాలం। జామాత్రే తద్దర్శయామాస హృష్టో దృష్ట్వా చైతద్భాస్కరోప్యస్తువత్తం॥ ౫౨॥ దేవాంగస్తుతతో రాజాగత్వా కైలాసమారాదత్। ఆగంతుం ప్రార్థయిత్వా స్వవివాహాయ శివం ప్రభుం॥ ౫౩॥ విష్ణుమాహూయయత్నేన బ్రహ్మాణం నాకనాయకం। దిక్పాలాన్భూమిపాలాంశ్చ మంత్రిభిస్సైన్యవాస్సమాహ్వయత్॥ ౫౪॥ తతః ప్రభాతే దేవాంగ శ్చతురంగబలైర్వృతః। సుముహూర్తే బ్రాహ్మణౌఘైర్వాదిత్రైః పాఠకైస్సహ॥ ౫౫॥ జగామ పరమ ప్రీత్యా భువనం లోకచక్షుషః। తతో బ్రహ్మాదయోదేవా శ్శివముఖ్యా మహాగణాః॥ ౫౬॥ విష్ణుఃప్రార్వాభాగవతాస్సర్వప్యవసమాగమన్। సూర్యలోకం దేవల

---

ములచేతఁ జేయఁబడినవై యాశ్చర్యకరములై యుండు కొలువు కూటములు పెక్కులున్నవి - వీనిచేత నెల్లమంగళకరమై యుండునట్లా పెండ్లిమంటపము నతఁడు నిర్మించెను - ౫౦ - ఆమంటపముయొక్క దర్వాజాలపై నుండు బంగారు శిఖరముల యందలి కలశముల కాంతిచేత నాద్వారములాఛాదింపఁబడి తెలియఁగూడక యున్నవి - మఱియుఁ బొడవులుగాఁ దేజోమయములై యుండు ద్వారము లనేకములు గలుగునట్లా మహానుభావుడామంటపమును గల్పించెను - ౫౧ - ఇట్లాత్వష్ట తననేర్పువలన నాశ్చర్యమునుగలుగఁజేయునదియును మిక్కిలి శ్రేష్ఠమును వెడలుపు గలదియునగు నామంటపమును సృజించి తనయల్లుఁడైనయా సూర్యునకుదానిఁజూపఁగా నాసూర్యుఁడుదానిఁజూచిసంతసించినవాఁడై యాత్వష్టనుబొగడెను- ౫౨- అంతనక్కడ దేవాంగరాజు ప్రేమముతోఁ గైలాసమునకుఁబోయి తన వివాహమునకురావలయునని లోకనాయకుఁడైన యాసాంబశివుని వేఁడుకొని యక్కడనుండివచ్చి విష్ణువును బ్రయత్నముతోఁబిలిచి బ్రహ్మను స్వర్గమునకు నాథుఁడైన యింద్రునిదిక్పాలకులను భూమినిఁబాలించు రాజులను దనమంత్రులనంపి పిలిపించెను- ౫౪- తరువాతఁ దానువీరమాతాండునితోఁ జెప్పిన ప్రకారము మఱునాడు ప్రాతఃకాలమందు దాదేవాంగరాజు మంచిలగ్నమందు నాలుగువిధములైన దండ్లముగూడఁబిలుచుకొని బ్రాహ్మణ సంఘములతోను వాద్యములతోను సంగీతపాఠకులతోఁగూడ మిక్కిలి సంతోషముతోఁబ్రపంచమునకుఁ గన్నైనసూర్యుని లోకమునకుఁబోయెను- అంతలో బ్రహ్మ మొదలగు దేవతలును సాంబశివుఁడు నతనితోఁగూడఁ బ్రమ

స్య వివాహం ప్రేక్షితుం ముదా॥ ౫౭॥ తతస్సూర్యో మహాతేజా దేవతానిక రాంతికే । ఆనీయ దేవదత్తాంతాం దేవాంగాయ దదౌ ముదా॥ ౫౮॥ త్రిలోక సుందరీబాలా మోహయంతీ జగత్త్రయం । రాకేందు బింబవదనా రాజీవనయ నాశుభా॥ ౫౯॥ తటిత్సన్నిభగాత్రాం భోరుహ పాదాయశస్వినీ । యత్నస్సృష్టిరివాభాతి విధాస్సుమనోహరా ॥ ౬౦ ॥ రరాజ దేవలస్యేయ మింద్రాణీ వబిడౌజసః । తతో బ్రహ్మ ముఖై స్సర్వై ర్దేవై రాజాసమాదరాత్ ॥ ౬౧॥ మాంగల్యసూత్ర కన్యాయా బబంధనృపశేఖరః । అక్షతారోపణం చక్రుర్బ్రాహ్మణామంత్రపాఠకాః ॥ ౬౨ ॥ దదుర్నీరాజనం నార్యో మంగళా రావపూర్వకం । కల్పవృక్షః కామధేను శ్చింతామణి రథాజ్ఞయా ॥ ౬౩ ॥ ఇంద్రస్య భోజనాన్యేషాం సర్వేషాం సమకల్పయత్ । చతుర్ష్వేవం దినేష్వాసీ ద్వైవాహికమహోత్సవః॥ ౬౪॥ తతో దేవాంగ నృపతిః పరమానందసంకులః । ద

---

ధగణములును విష్ణువు మొదలుగాఁగల శివభక్తులునందఱు దేవలుని బెండ్లిఁజూడను త్సాహముతో సూర్యునిలోకమునకువచ్చిరి- ౫౭ - అంత నధిక తేజస్సుగల యాసూర్యుఁడు సమస్తదేవతలకు నెదుటఁ దనచెల్లెలైన దేవదత్తనుదెచ్చి యా దేవాంగునికి యొకసంతోషముతో నిచ్చెను- ౫౮ - ఆబాలయైన దేవదత్త మూడులోకములలోని వారి కందఱికంటె సౌందర్యముగలది మూడులోకములను మోహింపఁజేయునదియుఁ జంద్రబింబమువంటి మోముగలదియుఁ గమలము వంటి కన్నులు గలదియు మనోహరమైనదియు మెరుమువంటి దేహముగలది యుఁగమలములవంటి యడుగులుగలదియుఁ గీర్తిగలదియు మిక్కిలి సుందరియై బ్రహ్మ దేవుని ప్రయత్నపూర్వక సృష్టివలెఁ బ్రకాశించుచున్నది - ౬౦ - అట్టి యాదేవదత్త యింద్రునకు శచీదేవివలె నాదేవలునకు భార్యయై ప్రకాశించెను- పిమ్మట నాదేవలరాజు బ్రహ్మ మొదలగు దేవతలతోడ నతిప్రేమచేత నాదేవదత్తకు మంగళ సూత్రమును గట్టెను - అప్పుడు బ్రాహ్మణులు మంత్రముల జెప్పుచుఁదలఁబ్రాలుపోసిరి - ౬౨ - స్త్రీలు మంగళకరములైన పాటలుపాడుచునారతిపట్టిరి తరువాత నింద్రుని యాజ్ఞచేతఁ గల్పవృక్షము కామధేనువు చింతామణియుమూడునువారలకెల్లభోజనములకుఁదగినద్రవ్యములనిడి భోజనముల జేయించెను - ఇట్లునాలుగుదినములు పెండ్లిమహోత్సవము మిక్కిలిమనోహరముగానాయెను - ౬౪ - అటు పిమ్మట దేవాంగరాజు మిక్కిలి సంతోషభరితుఁడై మొదటఁపార్వతీపరమేశ్వరులకుఁ బెండ్లికట్నపుదోవతులఁజీ

దా వస్త్రాణ్యే త్సవికాన్యాదాతు శివయో స్తదా॥ ౬౫॥ బ్రహ్మవిష్ణ్వాది దేవే
భ్యో దత్వా దివ్యాంబరాణిసః । దివ్యవస్త్రైశ్చ బహుభి ర్దేవాంగో రాజశే
ఖరః॥ ౬౬॥ వైవాహికోత్సవాయాతాన్ త్సర్వాన్ శ్చసమతోషయత్ । వ
స్త్రమేకం తతో దివ్యం భైరవాయన్పృపోదదౌ ॥ ౬౭ ॥ తద్భైరవో నాప్యగ
హ్ణోచ్చ క్రోధామర్షపూరితః । కంపయానస్తుమూర్ధానం దేవలంభైరవో
బ్రవీత్ ॥ ౬౮ ॥ రాజన్మయి పరామర్శోద్య సంజాతశ్చిరాయతే । దత్వావ
స్త్రాణిసర్వేభ్యో వ్యతాషీః శ్శేషమద్య మే॥ ౬౯॥ దాతవ్యం కిన్ను దేవాంగ
పూర్వమేతన్న మేత్వయా । దత్తశేషం నగృహ్ణామినయోగ్యం మమతన్నృప॥
సుందరో భైరవశ్చాసౌ ఆగత్యచావివేకతః । స్వస్యాపిదత్తం వస్త్రంచ శిథిలీ
కృత్వానేకతః॥ శమీవృక్షంచనిక్షిప్య హ్యావదశ్చవిశేషతః । దాతవ్యమేకం

---

రలనిచ్చెను- ౬౫ - పిమ్మట కెల్లరాజులకు శిరోభూషణముగానుండునట్టి యా దేవాంగరాజు బ్రహ్మవిష్ణువు మొదలుగాఁగల దేవతలకొఱకు దివ్యములైనవస్త్రములనిచ్చి యింక నావివాహమహోత్సవమునకు వచ్చినవారికంతయు ననేకములైనమంచివస్త్రములనిచ్చి వారినందఱ సంతోష పఱిచెను - పిమ్మట నారాజు మంచి శ్రేష్ఠమైనదోవతిని భైరవునికొఱకిచ్చెను - ౬౭ - దాని భైరవుడుగ్రహింపఁడాయెను - అసూయతోఁ గూడుకొన్నవాఁడై యాభైరవుఁడుకోపించుకొనెను- తలయూఁచుచు దేవలునిఁగూర్చి భైరవుఁడిట్లనెను-౬౮- ఓరాజా తిన్నఁగానింత సేపటికి నీకు నామీఁద జ్ఞాపకముకలిగెనా - అందఱకు వస్త్రములనిచ్చి మిగిలిన వస్త్రముసు నాకొఱకిచ్చితివి - ౬౯ - ఈ వస్త్రమును నీవు ముందు నాకీఁ దగదటోయి దేవాంగుడా - అందఱకీఁగా మిగిలినవస్త్రమును నేనుదీసికొనను ఓరాజా యదినాకుదగినదికాదు- అనిసుందరుడైనభైరవుడు అవివేకమువల్లవచ్చి తనకుయిచ్చిన వస్త్రమునుచించి జమ్మిచెట్టుమీాదవేసి నాకుదివ్యమైన వస్త్రము వకటియివ్వవలెనని చెప్పెనూ - యప్పటికిన్ని శుచిగానుండెడి దేవాంగుడు తిరిగి చూచి అతని దుర్మార్గముచేతను నేనిచ్చినవస్త్రమును యీాప్రకారముచేస్తివి అనిపల్కెను - కాబట్టినీకు వస్త్రమునుయీాకూడదుపోవోయి నీమనసుకొద్దిపోయనిచెప్పెను ఆదుష్టుడైనభైరవుడు గౌరీపతియైన శంకరునిపొంది అతని పాదములకు నమస్కరించి గొప్పమాటచెప్పెనుసమస్తదేవతులకున్ను యథాప్రకారము వస్త్రములనిచ్చి నన్ను మరచెనూ- అనిచెప్పగానుసాంబమూర్తి దేవాంగునిచూచి స్వచ్ఛమైనదిగామున్న దివ్య

వస్త్రంచ దివ్యం స్వచ్ఛం సదాసుచిః॥ దృష్ట్వావపుశ్చ దేవాంగః తస్యదుర్మాగ్గచింతయా । ఏవం కృత్వా దత్తవస్త్రం దేవాంగోహ్య బ్రవీద్వచః॥ దాతుంనశక్యతేతుభ్యం గచ్ఛశీఘ్రం యథామతిం । సభైరవోసాదుష్టాత్మాగౌరీశం ప్రాప్యశంకరం ॥ తస్యపాదౌ నమస్కృత్య సోబ్రవీ ద్వచనం మహత్ । దేవతానాంచసర్వేషాం దత్వావస్త్రం యథాక్రమం ॥ తమాంసం స్మృత్యదేవేశ ఇత్యాహవచనంమహత్ । దృష్ట్వాస శంభుర్దేవాంగం భైరవస్య యథాసుఖం॥ దాతవ్యమేకం వస్త్రంచ దివ్యం స్వచ్ఛం యథావిధి । పురాతంహంభైరవస్యదివ్యం మోహాకరం సదాదదౌ వస్త్రంచదేవేశ ద్రష్టవ్యంచ కుజోపరి । దృష్ట్వేవశంభై రవశ్చాథ హ్యబ్రవీత్సార్థకంవచః॥ సదత్తవస్త్రం దేవేశ నాహముత్సహతే సదా । శమీవృక్షేచతద్వస్త్రం ఛేదం కృత్వాతివేగతః॥ నిక్షిప్య తేమయాసాధు హ్యుగ్రమూర్తి స్సదాసుచిః । దృష్ట్వాతు శంభురీశానో గత్వాత్వం కుమతీసదా కుజస్యాథ ప్రదేశేతు వసతిస్తేచసర్వదా - మవబంధురనాగేంద్రాన్ తురంగాన్వాయురంహసః ॥ ౨౨ ॥ భూషణానీ విచిత్రాణి బహూన్ దాసీ గణాక్రవిః । స్వస్వసుర్దేవ దత్తాయా వ్యతార్షీత్పారితోషికం ॥ ౨౩ ॥ బ్రహ్మావిష్ణు మహేశశ్చ జగ్ముర్వై స్వాలయాన్ప్రతి । ఇంద్రాది దేవతాస్సర్వా యేచన్యే దేవయోనయః॥ ౨౪॥ బ్రహ్మర్షయోన్యేసర్వేపి జగ్ముస్స్వ స్వాలయాన్ప్రతి । దేవాంగోపి తతోరాజా భార్యయా

---

మైనదిగా యథావిధిగా యివ్వవలెనూ - ముందునేనుభైరవునికి దివ్యమైనట్టియుమోహాకరమైనట్టియు ముందునేసిన వస్త్రమునిచ్చితిని ఈశ్వరుడా దానిచించిజమ్మిచెట్టుమీదవేశెనుచూడుడీ- ఆభైరవుడుసాంబమూర్తినిచూచి సార్థకమైనవచనమునుపల్కెను ఓసాంబమూర్తీ అతడిచ్చినవస్త్రమునుజించి జమ్మిచెట్టుమీదవేస్తివిగదా-యిప్పటికిన్ని శుచియైనయుగ్రమూర్తియైనసాంబమూర్తీ ఆభైరవునిచూచి శీఘ్రముగా నీవుపోయి జమ్మిచెట్టుక్రింద వసతియేర్పరచుకొనియుండమని శపించెను అప్పుడుసూర్యుఁడు మదపుటేనుంగులను గాలితో సమానమైనవడిగలగుఱ్ఱములను విచిత్రములైనతొడవులను బెక్కుపరిచారికలనుదనచెల్లెలైనదేవదత్తకు సంతోషముతోఁగానుకగానిచ్చెను- ౨౩- అంతనా పెండ్లికి వచ్చియున్న బ్రహ్మదేవుడు విష్ణువు నీశ్వరుడును దమతమ యిండ్లకుఁబోయిరి మఱియు ఇంద్రుఁడు మొదలైన దేవతలందఱును బ్రహ్మర్షులును దక్కినవారందఱునువారివారియిండ్లకుఁబోయిరి అంతనా దేవాంగరాజును సూ

స్వబలైస్సహ ॥ ౭౫॥ ఛాయాభాను సమాజ్ఞప్తో జగామా మోదపట్టణం
సపట్టణం సమాసాద్య పాలయనాజ్యముత్తమం॥ ౭౬॥ ఆనందయన్ప్రజా
స్సర్వా భార్యయా దేవదత్తయా । రమతేస్మచిరంకాలం పౌలోమ్యేవ పురం
దరః ॥ ౭౭ ॥ దేవాంగస్య వివాహామేన సుఖలం యశ్శ్రావయేద్భక్తితః ప్రీ
త్యాయశ్శృణుయాద్భవంతిసకలా సిద్ధానిలబ్ధానిహి । యెవస్త్రాణిదదత్య
లంచనృపతే ర్వైవాహికే మంగళంసూత్రం సర్వసుఖానితైరతి చరాంకారు
తశ్శ్యాలినః ॥ ౭౮ ॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - దేవాంగ వి
వాహోనామ ద్వాదశోధ్యాయః.

శ్రీసూతః ॥ అథ దేవాంగరాజర్షిః ప్రశశాసవసుంధరాం ॥ ప్రజానాంజ
నయన్హర్ష మసమానపరాక్రమః ॥ ౧ ॥ యథైవ సర్వదేవానాం దేవరా
జేమరావతీం । గాంచాస్మిన్ పాలయత్యేవం ప్రజాఃపుత్రానివౌరసాన్ ॥ ౨ ॥
ప్రపద్యపరమానందం ప్రజావవృధిరేభృశం । సర్వసస్య ఫలాఢ్యాసా రాజ

---

ర్యునిచేతనతనిభార్యయైన ఛాయాదేవిచేతనుసెలవుతీసుకొని తనభార్యయైన దే
వదత్తనుగూడఁబిలుచుకొనితనసేనలతోడనామోదపట్టణముకుఁబోయెను - అ
తఁడుపట్టణముపకుఁబోయిక్షేమమైనతనరాజ్యమునుబాలించుచుఁ బ్రజల సం
తోషపెట్టుచుశచీదేవితోనింద్రుఁడువలెఁదనభార్యయైనదేవదత్తతో బహుకా
లము క్రీడించెను - ౭౭ - ఈదేవాంగుని వివాహకథనెవ్వఁడు సమగ్రముగానతి
భక్తితో వినిపించునో యెవ్వఁడుసంతోషముతో వినునో వారికిద్దఱకు సన్ని
కోర్కులుసిద్ధించును - మఱియు నీదేవాంగరాజు వివాహకథను జదివినప్పుడు
వస్త్రములనెవరిత్తురో మంగళసూత్రమును జేయించి యెవరుదానము చేయు
దురో వారలకుసాంబశివునిదయవలన సుఖములధికముగాలభించును - ౭౮ - ఇ
దిబ్రహ్మాండ పురాణంబున దేవాంగచరితంబున దేవాంగ వివాహమన్నది పం
డ్రెండవ యధ్యాయము.

తరువాతవృత్తాంతమునాఋషులకుసూతుఁడుచెప్పుచున్నాఁడు - పిమ్మ
టసరిలేనటువంటిప్రతాపముగల యాదేవాంగమహారాజు ప్రజలకు సంతోషమును గ
లుగఁజేయుచుభూమినిబాలించెను-౧- సమస్తదేవతలకుఁ బ్రభువై నయింద్రుఁ
డు స్వర్గమును బాలించురీతి నీదేవలుఁడు భూమినిబాలించుచుండఁగా జనులం
దఱు నౌరసపుత్రులనుబొందినట్లు సంతోషించి మిక్కిలివృద్ధిబొందిరి- భూమిస
మస్తములైనపయిర్లతోనుపంటలతోనొప్పినదై పతివ్రతయైన స్త్రీగుణవంతుఁ

తేస్మ వసుంధరా॥ ౩॥ గుణవంతం సమాసాద్య పతిం సాధ్వీవసుందరీ । నాతివ
ర్షాతిపర్జన్యో నానావృష్టిః కదాప్యభూత్ ॥ ౪ ॥ నపీడాపక్షిసత్త్వేభ్యో నచశ
త్రుకృతంభయం । కాలేవర్షాతిపర్జన్యస్సర్వౌషధిసమాకులా॥ ౫॥ సంపూర్ణ
ఫలదాపృథ్వీ ప్రజాస్సానందకందళాః । సర్వవిద్యాసు కుశలా వినయాచారత
త్పరాః॥ ౬॥ తపస్వినశ్చయజ్వానో బభూపుర్బ్రాహ్మణాస్తదా । క్షత్రియా
వీర్యసంపన్నాః కలావంతోయశస్వినః ॥ ౭ ॥ సుశీలాస్తేవ వృధిగేతస్మిన్పా
లతిమేదినీం। గోపోషణపరానిత్యం ధనధాన్యార్ఘశోభనాః॥ ౮॥ సదాచార
సమాయుక్తాయశో వినయభూషణాః । పురాణ శ్రవణోద్యుక్తా స్సతతజ్ఞాన
కాముకాః॥ ౯ ॥ ఆర్యపూజా లబ్ధవర్ణా ఆర్యావవృధిరేతదా । శూద్రాశ్శుశ్రూ
షణపరాస్సతాం ధర్మవివర్ధనాః ॥ ౧౦ ॥ కృషీవలావవృధిరే మహాధాన్య వి

---

డైన పెనిమిటినిబొంది యెట్లుప్రకాశించునో యాప్రకారము ప్రకాశించెను - వ
ర్షదేవత యధికముగావర్షింపఁడు - ఎప్పుడును వానలేకయుండుటలేదు - ౪ -
పక్షులవలనను జంతువులవలనను బాధలేదు - శత్రువులుచేయునట్టి భయములే
దు - వానదేవుఁడు కాలముతప్పక వానకురియును - భూమిసమస్తములైన యో
షధులచేత బూర్ణమైసమగ్రములయిన పంటలనిచ్చునదియైయుండెను - అప్పు
డుజనులందఱుసంతోషముతో గూడినవారుగాను సకలవిద్యలయందుఁ జాతు
ర్యముకలవారుగాను వినయమునాచారమునుగలవారుగానుండిరి - ౬ - అప్పు
డు బ్రాహ్మణులందఱు తపస్సుచేయువారుగాను యజ్ఞములుచేసిన వారుగానుం
డిరి - ఆదేవాంగరాజు భూమినిబాలించునపుడు క్షత్రియులు పరాక్రమము గల
వారుగాను సకలశిల్పములు నేర్చినవారుగాను గీర్తిగలవారుగాను మంచి న
డవడిగలవారుగానువృద్ధిఁబొందిరి - అప్పుడువైశ్యులెల్లప్పుడునావులబోషించు
టయందాసక్తికలవారుగాను రొక్కమునకు ధాన్యముతీయుట ధాన్యమును
రొక్కమునకమ్ముట యీబేరములుచేయువారుగాను మంచి నడవడిగలవారు
గాను గీర్తియువినయమునలంకారముగాఁగలవారుగానుబురాణములనువినఁ
బ్రయత్నముగలవారుగా నెప్పుడు జ్ఞానమునుగోరువారుగాను బెద్దలఁబూజసే
యుటయందుఁదెలిసినవారుగానువర్ధిల్లుచుండిరి - శూద్రులుసత్పురుషులకుశ
శ్రూషచేయుటయందాసక్తికలవారై ధర్మమునుబెంచువారై కృషిచేసికొ
నిదానివలనవిశేషముధాన్యములఁబండించుకొనుచువృద్ధిఁబొందుచుండిరి-సమ
స్తప్రజలకు నానందమునుబెంచుచున్న యాదేవలునిరాజ్యమందుఁ గాళ్లులేని

వృద్ధయః । నపంగవోనబధిరానాంధానైవసదామయాః॥ ౧౧॥ నైవధూర్తా
నఖిన్నాశ్చనవిరూపా జనా స్తదా । తస్యరాష్ట్రే దేవలస్య జనానందవివర్ధనే॥
౧౨ ॥ నైవానివాపసంకించిత్స్థవిరాణాంచపశ్యతాం । స్త్రియశ్చశీలసంప
న్నానైవాసంగతభర్తృకాః ॥ ౧౩ ॥ నవంధ్యానైవదుశ్శీలా నచవిభిన్నదా
హృదాః । రాజంతేస్మతదానార్యః పతిభక్తిసమన్వితాః॥ ౧౪॥ నాపాసీత్తు
త్రకలహో నమాత్సర్యంచకుత్రచిత్ । కృపణాశ్చాపినైవాస న్తత్రరా
ష్ట్రేమనోహరే ॥ ౧౫ ॥ నాకస్మికభయంకించిద్విద్యతేస్మకదాచన । అన్యో
న్యస్నేహసంయుక్తా స్సదాసంతుష్టమానసాః॥ ౧౬ ॥ వినయాచారసంపన్నా
ధర్మయత్నపరాయణాః । యథా స్వవృత్తయస్సర్వే జనా స్తత్రచకాశిరే॥ ౧౭॥
సర్వౌషధిసమోపేత సంపూర్ణఫలదాయినీ । భూమి స్తదారాజతేస్మ జనానం
దవివర్ధనీ॥ ౧౮॥ ఏవంప్రశాసతో భూమిం దేవాంగస్యామితౌజసః। అజాయం
తతతఃపుత్రా స్త్రియస్త్రితాగ్నివర్చసః ॥ ౧౯ ॥ దివ్యాంగో విమలాంగశ్చధ

---

వారులేరు - చెవిటివాండ్రులేరు కన్నుగానని వారులేరు - ఎల్లప్పుడు రోగముగ
లవారులేరు - మోసగాండ్రులేరు - దుఃఖపడ్డవారులేరు - వికృతరూపముగ
లజనులులేరు- ౧౨- ముసలివారుచూచుచుండఁగాఁ బాలురకుఁబైతృకకృత్య
ములుజరుగుటలేదు - స్త్రీలందఱు మంచి నడవడిగలవారై దీర్ఘసుమంగ
లులుగానుండిరి - అప్పుడు స్త్రీలలో గొడ్రాలులేదు - చెడునడతగలదిలేదు -
కోరికదీరనిదిలేదు - స్త్రీలు తమ పెనిమిట్లయందుభక్తిగలవారై ప్రకాశించు
చుండిరి- ౧౪- ఎక్కడనుజగడములేదు- ఒకరిమీఁదనొకరికి మత్సరములేదు-
మిక్కిలి సొంపైయున్న యీ రాజ్యమందు దరిద్రులును లేరు - ౧౫ -
ఆరాజ్యమందెప్పుడు నహేతుకమైనభయముకలగదాయెను- అక్కడిజనులం
దఱునొండొరులయందుఁ బ్రీతిగలవారును సర్వకాలమును దనిసియున్న మన
స్సులుగలవారును వినయమునాచారము నధికముగాఁగలవారును ధర్మమును
జేయబూనికగలవారును దమతమవర్ణముల నడవడితప్పనివారై యుండిరి-౧౭-
అప్పుడుభూమిసమస్తౌషధులతోఁగూడిసకలవిధములైనధాన్యములఁబండుచు
సకలజనులకు సంతోషమును బెంచునదియై ప్రకాశించెను- ౧౮- ఈప్రకార
ము భూమినిఁబరిపాలించుచున్న మహాపరాక్రమశాలియయిన యీ దేవాంగ
రాజునకుఁబిమ్మటమూఁడగ్నులవంటి తేజస్సులుగల ముగ్గురుకొడుకులుపుట్టిరి-
దివ్యాంగుఁడు విమలాంగుఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడైన ధవళాంగుఁడు

వళాంగోతివీర్యవాన్ । ప్రపేదు స్తేతతోవృద్ధింత్రయోపిస్త్రాఇవాగ్నయః॥ ౨౦ ॥
లేభతుఃపరమంతోషంపుత్రైస్సైఃపితరౌతదా । జయంతేనతనూజేన యథేం
ద్రాణీపురందరౌ ॥ ౨౧ ॥ కందర్పేణరమావిష్ణూకుమారేణయథాశివౌ । దేవ
దత్తాచదేవాంగ స్తైర్దేవాసయతాంసదా॥ ౨౨॥ అనన్యమానసౌకాలమానం
దభరితౌచతౌ । తేషాంపితాతుపుత్రాణాం దేవాంగఃకాలఏవచ ॥ ౨౩ ॥ జాత
కర్మాదిసంస్కారా నకరోద్విధివత్తతః । సర్వ ప్రవీణాస్తేసర్వాయుధ శాస్త్ర
విశారదాః ॥ ౨౪ ॥ ధర్మత్రాణపరాశ్చైవబభూవుఃప్రాప్తయౌవనాః । తత
స్సూర్యసుతాస్తిస్రస్త్రయోవిద్యా ఇవోజ్వలాః ॥ ౨౫ ॥ స్వర్ణప్రభాచపద్మా
క్షీచపలాక్షీతినామతః । తేషాంవివాహమకరోత్పుత్రాణాందేవలోముదా ॥
౨౬ ॥ దేవదత్తాచదేవాంగస్స్నుషాభిర్హర్షమాపతుః । దివ్యాంగస్తుతతఃపి
త్రాయౌవరాజ్యే ప్రతిష్ఠితః॥ ౨౭॥ శాసతిస్మ స్వయం రాజ్యం మంత్రిభిస్స

---

ననునాముగ్గురుకొడుకులు నగ్నులువెలుగునట్లువృద్ధిబొందిరి- ౨౦- అప్పుడాకొ
డుకులచేతఁ దల్లిదండ్రులైన దేవదత్తయు దేవాంగమహారాజును జయంతునిచే
తశచీదేవియు నింద్రుఁడు నెట్లుసంతోషమునుబొందిరో యట్లు పరమానందము
నుబొందిరి- ౨౧- మన్మథునిచేతమహాలక్ష్మియు మహావిష్ణువునువలెను- గుమా
రస్వామిచేతఁ బార్వతీ పరమేశ్వరులు వలెను దేవదత్తయును దేవాంగుఁడునా
కొడుకులచేత సంతోషమునుబొందినవారై మనసునందొండుచింతలేక కాల
మునుగడపిరి - పిమ్మటవారితండ్రియైన దేవాంగమహారాజా కొడుకులకుఁ గా
లమతిక్రమింపకయే శాస్త్రరీతిగా జాతకర్మాది సంస్కారముల నన్నిటిని జే
సెను - వారికియౌవనమువచ్చునంతలో నన్నిటియందు నేర్పరులుగాను సమ
స్తములైన యాయుధములనుబ్రయోగించుట మొదలగువానిదెలుపునట్టి శా
స్త్రములనెల్లఁ జదివినవారుగాను ధర్మమును గాపాడుటయే ముఖ్యముగానెం
చువారుగానైరి - అంతస్వర్ణప్రభయనియుఁ బద్మాక్షియనియుఁ జపలాక్షియ
నియుఁ బేరులతోసూర్యునికిముగ్గురుకూతులు మూడువేదములవలెఁబ్రకాశిం
చుచుండఁగా వారల నాదేవాంగుఁడు దనకొడుకులకుఁ దీసి పెండ్లిచేసెను -
౨౬ - ఇట్లుపెండ్లిచేసి దేవదత్తయును దేవాంగుఁడు నాకోడండ్రచేతసంతో
షపడిరి - అంతమహాబుద్ధిశాలియైన యాదివ్యాంగుఁడు తండ్రిచేత యౌవ
రాజ్యమందుఁ బట్టాభిషేకముచేయంబడి తానుమంత్రులతోడ రాజ్యమును
బాలించెను - ఓబ్రాహ్మణులారా తరువాత నాదేవాంగరాజాదిశేషుని కూ

హాబుద్ధిమాన్ । దేవాంగ శ్చంద్రరేఖాయాం శేషపుత్ర్యాం తతో ద్విజాః॥
౨౮॥ తనయం జనయామాస సర్వలక్షణసంయుతం । సుధర్మ ఇతివిఖ్యాతం ధ
ర్మశీలం మహాబలం॥ ౨౯॥ సపుత్రో వవృధే శ్రీమాన్ శుక్లపక్ష ఇవోడురాట్ ।
తతః కరూశాధిపతి శ్శూరసేనో మహాబలః ॥ ౩౦ ॥ దేవాంగ రాజ్యమఖిలం
క్షోభయామాస దర్పితః । దేవాంగస్తు తతశ్శ్రుత్వా విప్రియం తేనకారితం॥
౩౧॥ సూరసేనం బలిం హత్వా పౌరుషేణ రణాంగణే । తద్రాజ్యే స్థాపయా
మాస సుధర్మం ధర్మవర్ధనం॥ ౩౨॥ సోభిషిక్త స్తతః పిత్రా పుండరీకపురే శుభే।
తద్రాజ్యం పాలయామాస పితృవద్ధర్మవిత్తమః॥ ౩౩॥ తతః కరూశాధిపతేస్సు
ధర్మస్స్వామితౌజసః । అవంతి రాజతనయాం పుష్కలాం విశదప్రభాం॥ ౩౪॥
ఉద్వాహమకరోచ్ఛ్రీమాన్ దేవాంగ స్తనయస్యసః । సతయా రమమాణ
స్తు సుధర్మో తులవిక్రమః॥ ౩౫॥ కారూశంచ స్వకం రాజ్యం శాసన్నాస్త తతో
ముదా । దేవాంగోపి మహీపాస్వో రాజా తులితవిక్రమః॥ ౩౬॥ పాలయన్ శ్చ

---

తురైన చంద్రరేఖయందు సకల సాముద్రికలక్షణములతోఁ గూడినట్టియు ధ
ర్మాచరణ బుద్ధిగలయట్టియు మిక్కిలిబలముగల సుధర్ముఁడని ప్రసిద్ధికెక్కిన
కొడుకును బుట్టించెను - ౨౯ - సకలసంపదలుగలయాకుమారుఁడు శుక్లపక్ష
మందుఁ జంద్రుఁడువలె వృద్ధిఁబొందెను - అంతఁ గరూదేశములకుఁ బ్రభువైన
ట్టియు మిక్కిలియు క్రూరుఁడైన సూరసేనుఁడనురాజు గర్వించినవాఁడై దే
వాంగుని రాజ్యమునంత దల్లడింపఁజేసెను - అంత నాదేవాంగుఁడా శూరసే
నుఁడుచేసిన యపకారమునువిని బలవంతుఁడైన యాశూరసేనుని యుద్ధరం
గమందు సంహరించి ధర్మమును బెంచునట్టి తనకొడుకైన సుధర్ముని నారాజ్య
మందుఁ బట్టాభిషిక్తుంజేసి నిలిపెను - ౩౨ - సకలధర్మములు దెలిసినవారిలో
మిక్కిలి శ్రేష్ఠుఁడైన యాసుధర్ముఁడు తనతండ్రిచేత శుభకరమగు పుండరీక
పురమందుఁ బట్టాభిషిక్తుఁడై తండ్రివలె నారాజ్యమును బరిపాలించెను- ౩౩ -
అంతనా దేవాంగుఁడు తనకుఁగొడుకైనట్టియుఁ గరూదేశములకుఁ బ్రభువైన
మహాపరాక్రమశాలియైన సుధర్మునకు నవంతిరాజుకూతురైన స్వచ్ఛమైన
దేహకాంతిగల పుష్కలయను కన్యకనుదెచ్చి వివాహముచేసెను - తరువా
తసరిలేని శౌర్యముగల యాసుధర్ముఁడా పుష్కలతోఁ గ్రీడించుచు దనకరూశ
దేశమును జక్కఁగాఁ సంతోషముతోఁ బరిపాలించుచుండెను - గొప్పధనుస్సు
గలయట్టియు సరిలేని పరాక్రమముగల యాదేవాంగుఁడును దనకొడుకులతో

స్వకంరాజ్యం వర్తతేస్మ సపుత్రకః ॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - దేవాంగ రాజ్యపరిపాలనంనామ త్రయోదశోధ్యాయః.

తతస్తురాక్షసాస్సర్వేదివ్యవస్త్రైరలంకృతాన్ । విలోక్య దేవగంధర్వాన్ హాసతర్నాన్వశ్చభూసురాః ॥ ౧ ॥ స్వభర్త్రే వజ్రదంష్ట్రాయ వ్యాచఖ్యుర్దేవవర్తనం । తేషాం తద్వచనంశ్రుత్వావజ్రదంష్ట్రోనిశాచరః॥ ౨॥ అసోఢుకామస్తచ్ఛ్రియో దేవానాం పూర్వమత్సరాత్ । జిత్వాతానఖిలాన్ దేవాన్వినిర్జిత్య పురందరం ॥ 3 ॥ అహమేవత్రిలోకేశో భూయాసం విగతజ్వరః। ఇతిమత్వాచదుర్బుద్ధిర్వజ్రదంష్ట్రిస్సవసోదరాన్ ॥ ౪ ॥ వ్యాఘ్రవక్త్రింసర్ప జిహ్వామాహూయేదం జగాదహ । శ్రుతంహిభ్రాతరావద్య యువాభ్యాం నిర్జరోచ్ఛ్రియః॥ ౫॥ అలంకృతాదివ్యవస్త్రై రటంతేభృశదర్పితాః । అస్మానవస్త్రాన్ దృష్ట్వాచ హాసంతి బహుధాసురాః॥ ౬॥ దేవాంగో వస్త్రకర్తాచ తానేవాన్వగమన్నృపః । దత్వారాజా సురాదిభ్యో వేత్వా వస్త్రాణి సాదరం ॥ ౭ ॥ నరాణామురగాణాంచ దత్వానేకాని దేవలః । దత్తవాన్ఖలునాస్మ

---

డుఁ దనరాజ్యమును బాలించుచుండెను- ౩౬- ఇది బ్రహ్మాండపురాణంబున - దేవాంగచరితంబున - దేవాంగుఁడు రాజ్యమును బాలించుట యన్నది పదమూడవయధ్యాయము.

ఓ బ్రాహ్మణులారా పిమ్మట రాక్షసులందఱు దేవతలును గంధర్వులను మంచిశ్రేష్ఠములైన వస్త్రములచేతనలంకరించుకొని తమ్ముఁ బరిహాసముచేయుచుండఁగాఁ జూచి యాదేవతలకార్యమును దమకురాజైన వజ్రదంష్ట్రునికొఱకుఁ జెప్పిరి - వజ్రదంష్ట్రుఁడను రాక్షసుఁడు వారుచెప్పిన యామాటనువిని పూర్వద్వేషమువల్ల దేవతలకుఁ గలిగిన యాశ్రేయస్సును సహింప నిష్టములేనివాఁడై యాదేవతలనందఱ నింద్రుని జయించి మనోవ్యథలేక నేనేమూఁడులోకములకుఁ బ్రభువునయ్యెదను- అనియిట్లుతలఁచి తెలివిలేనియతఁడు తనతమ్ములైన వ్యాఘ్రవక్త్రుని సర్పజిహ్వునిఁ బిలిచి యిట్లనెను - ఓ తమ్ములారా యిప్పుడు దేవతలకుఁగలిగిన మేలిమినిమీరువింటిరిగదా- ౫- మంచిశ్రేష్ఠములైనవస్త్రములచేతనలంకరించుకొని మిక్కిలి కావరించితిరుగుచున్నారు- వస్త్రములులేని మనలఁజూచియాదేవతలు పలువిధములఁబరిహాసముచేయుచున్నారు - ౬ - వస్త్రములనేసిన దేవాంగరాజును వారినే యనుసరించెను - ఆదేవాంగరాజుపటములనేసి ప్రీతితో దేవతలుమొదలగు వారికొఱకిచ్చి మనుష్య

భ్యం దర్పం తస్య హిపశ్యతం॥ ౮ ॥ సేవాలయే శంకరోపి నాస్మభ్యం దత్త వాక్ఖలు । వినాస్మాభిర్జనాలోకే సర్వేవస్త్రైరలంకృతాః ॥ ౯ ॥ దేవానలంకృతాన్ దృష్ట్వావస్త్రై శ్శ్రేస్వర్ధ తేసమనః । అపౌరుషా ఇవవయం హాస్యమానాశ్చతైర్భృహుః ॥ ౧౦ ॥ తూష్ణీం స్థాతుం తతోస్మాకం నోచిత ఖలుసోదరా । వినాశయిత్వా దేవానాం ప్రారంభం విక్రమోద్ధతాః। ౧౧॥ ఇంద్రం జిత్వా ద్రావయిత్వా చాలయిత్వా త్రివిష్టపాత్ । వయమేవత్రిలోకేశా భూయామగతశాత్రవాః॥ ౧౨॥ ఏవం కృతే ఖిలేలోకే నైభవో స్మాకమేవహి । తేనైవముక్తౌజ్యేష్ఠేన భ్రాతరౌతమూచతుః॥ ౧౩॥ యదుక్తంభవతాభ్రాతర్వజ్రదంష్ట్రమహామతే । అస్మాన్ దేవాహసంతీతి తత్సత్యం నాత్రసంశయః॥ ౧౪॥ అన్యద్వచోదుష్కరంతు శ్రుణుత ద్దైత్యవల్లభ । పరాజితేతుదేవేంద్రే అస్మాభిర్విక్రమోద్ధతే ॥ ౧౫ ॥ తదవస్థాం తతోజ్ఞాత్వా యాతీచక్రధరోహరిః ॥

---

లకు సర్వములకునిచ్చి మనకొఱకీఁడాయెనుగదా - అతని గర్వమును జూడుఁడు- ౮- శివుఁడు తన కొలువుకూటమందు దేవాంగునిచేతి వస్త్రములనుదీసి తానందఱకిచ్చునపుడతఁడును మనకీకపోయెనుగదా- మనముతప్ప లోకములందుండు తక్కినజనులకందఱు వస్త్రములచేత నలంకరింపఁబడిరి- ౯ - వస్త్రములచేతనలంకరింపఁబడిన దేవతలఁజూడఁగా నామనసోర్వలేదు- మనము పౌరుషములేనివారివలె వారిచేతఁ బలుమాఱు పరిహాసము చేయఁబడుచున్నాము- ౧౦- కాఁబట్టి మనమూరకుండుట యుక్తముకాదుగదా పరాక్రమముచేత నతిశయించి యాదేవతలకార్యములను జెఱచి యింద్రుని జయించి స్వర్గము నుండి యతనిఁగదలించి తరమి శత్రునాశనము చేసినవారమై మనమే మూఁడులోకములకుఁ బ్రభువులమగుదము- ౧౨- ఇట్లు చేసినపక్షమందు సమస్తలోకములయందు నైశ్వర్యము మనకేగాని యితరులకుఁగలుఁగదుగదా- అని యిట్లతఁడుచెప్పఁగా నతనితమ్ములతనిఁగూర్చి యుత్తరముచెప్పిరి - ౧౩ - ఓయన్నా మహాబుద్ధిశాలియైన వజ్రదంష్ట్రుఁడా నీవుదేవతలు మనలఁ బరిహాసము చేయుచున్నారనిచెప్పిన దేదిగలదో యదియథార్థమా విషయమందు సందేహములేదు - ౧౪ - నీవుచెప్పిన రెండవమాటయున్నదే యదిమాత్రముకష్టసాధ్యము - ఎట్లనినఁజెప్పెదమువినుము - పరాక్రమముచేతనతిశయించియున్న దేవేంద్రుఁడుమనకోడిపోఁగానే యతనుదశనువిని మహావిష్ణువుచక్రాయుధమునుధరించివచ్చును - అతఁడు శత్రువులనోర్చువాఁడు బెదరింపఁగూడని వాఁడు

అమిత్రసాహందుర్ధర్షం దైత్యారిం రణమూర్ధని ॥ ౧౬ ॥ అశక్యంజేతుమ
స్మాభి శ్శార్ఙ్గధన్వా నమచ్యుతం । వినై కేవత్రిలోకేషు హరిణా రాక్షసర్షభ ॥
౧౭ ॥ యోద్ధానవిద్యతేస్మాభి స్తం సోఢుం దుష్కరంరణే । ఇత్యుక్తవంతౌతౌ
దృష్ట్వా భ్రాతరౌరాక్షసాధిపః ॥ ౧౮ ॥ వజ్రదంష్ట్రో బ్రవీద్వాక్యం పునరా
లోచనాన్వితః । పూర్వమేవయువాంవిష్ణోర్బిభేతోభ్రాతరోబత॥ ౧౯ ॥ శక్రే
తుధావితేస్మాభి స్తతోయాస్యతిచక్రభృత్ । హసతోస్మానిమాన్ దేవాన్
దేవరాజంరణాంగణే ॥ ౨౦ ॥ పీడయిత్వాశరైస్తీక్ష్ణైరస్మత్కైర్భృశం
తతః । పలాయన పరాన్ సర్వాన్ కరవామదిశోదశ ॥ ౨౧ ॥ అస్మాకంకుర్వ
తాంతేషామవమానందురాత్మనాం । సమీచీనాభవేచ్ఛిక్షా మమస్యైవమనో
రథః ॥ ౨౨ ॥ హంతవ్యాస్సర్వథాదేవా మతమే తన్మమాధునా । విద్రావ్య
పీడయిత్వాతాన్ స్తథలేమన్మనోరథే ॥ ౨౩ ॥ ద్రక్ష్యామోతస్తు విష్ణుంవా జి
ష్ణుంవాయోద్ధుమాగతం। తత్కాలస్యోచితంయోగం ద్రక్ష్యామోదైత్యపుం
గవా॥ ౨౪॥ తస్మాచ్చకింయువామాదౌ విష్ణురిత్యాప్లుక్షోభయం। నియమం

---

రాక్షసులకుశత్రువు శార్ఙ్గమనుధనుస్సును ధరించియుండునావిష్ణువును యుద్ధ
రంగమందు జయించుట మనకుసాధ్యముకాదు- ఓ రాక్షసశ్రేష్ఠుఁడా మూఁడు
లోకములయందు నావిష్ణువుతప్ప మఱియెవ్వరునుమనతో యుద్ధముచేయఁజా
లినవారులేరు విష్ణువునుజయించుటకష్టము - అనియిట్లుచెప్పినయా తనతమ్ము
లనుజూచి రాక్షసులకు ప్రభువైన వజ్రదంష్ట్రుఁడు మరల నాలోచనముచేసి
వారితో నిట్లనిచెప్పెనో తమ్ములారా మీరుముందే విష్ణువువలన వెఱచుచు
న్నారేయయ్యో - ౧౯ - దేవేంద్రునిమనముకొట్టి తరిమిన తరువాతగదా వి
ష్ణువుచక్రమునెత్తుకొని రాబోవును - మనలఁ బరిహాసము చేయుచున్న యీ
దేవతలను దేవేంద్రుని మనము విసరిన చురుకైన బాణములచేతఁ జక్కఁగా
యుద్ధరంగమందు నొప్పించి వారందఱు పదిదిక్కులఁబడి పఱుగెత్తునట్లుచే
యుదము - ౨౧ - ఇట్లుచేసిన మనకవమానము చేయుచున్న యాదుష్టబుద్ధిగ
లవారికి మంచిశిక్షయగును- అదేగదా నాకోరిక - ౨౨ - ఎన్నివిధములనైన
దేవతలఁ గొట్టవలయు నిదినాకిపుడిష్టము - వారినందఱను దరిమికొట్టి నాకోరి
క నెరవేరిన తరువాత విష్ణువు యుద్ధముఁజేయవచ్చినను జిష్ణువుయుద్ధము చేయ
వచ్చినను జూడఁగలము - ఓరాక్షస శ్రేష్ఠులారా యప్పటికిఁ దగినయుపాయ
ము నప్పుడాలోచింతము- ౨౪- కాఁబట్టిమీరు మొదటనే యబ్బావిష్ణువేయ

పరమాస్థాయతపస్త్వ్యమశ్శివమవ్యయం ॥ ౨౫ ॥ తేనలబ్ధవరాభూత్వా శంక
రేణమహాత్మనా । జిత్వా శేంద్రాన్ సురాన్ సర్వాన్న్వ్యపనీతేథదూషణే॥ ౨౬ ॥
ఆయాస్య త్తచ్చపశ్యామ తతఃకార్యం హిసోదరా । తత స్త్వ్రమిహాస్మాభి ర్గం
తవ్యంవదతంచతత్ ॥ ౨౭ ॥ శ్రుత్వాతుభ్రాతరౌతస్యవజ్రదంష్ట్రిస్యభాషి
తం । తథేతిచవినిశ్చిత్య భ్రాతౄ తేనసమన్వితౌ॥ ౨౮॥ వ్యాఘ్రవక్త్రిస్సర్ప
జిహ్వ ఉభౌరాక్షసపుంగవౌ । తప స్తప్తుం మహేశానం యయతుస్థానముత్త
మం ॥ ౨౯ ॥ నియమేపరమేస్థిత్వా రాక్షసాస్తుతత స్త్రయః । తపసాకర్శయా
మాసు ర్దేహాన్ స్వాన్దారుణేనతే ॥ ౩౦ ॥ తతఃప్రసన్నో భగవాన్న్రబ్రవీత్తా
న్వచశ్శివః । సాధుప్రీయోస్మి తపసా భవతాం రాక్షసర్షభాః ॥ ౩౧ ॥ యది
ష్టంభవతామద్యవృయతాందీయతేమయా । ఏవముక్తాభగవతా శంకరేణా
సురాస్త్రయః॥ ౩౨ ॥ మందభాగ్యతయాదేవం తేవరంతం యయాచిరే । దై
త్యాః । భగవన్ దేవదేవేశ యదితుష్టోసిశంకర ॥ ౩౩ ॥ ఆదిత్యస్య ప్రభాలో

---

నియేలభయపడెదరు - శ్రేష్ఠమైన నియమము నవలంబించి యవ్యయుండైన శివునిఁగూర్చితపస్సుచేయుదము- ౨౫ - మహానుభావుండైన శివునిచేతవరము నుబొందినవారమై దేవేంద్రునితోఁ గూడ సకలదేవతలను జయించి మనకువచ్చినయవమానమునుబోఁగొట్టుకొన్న పిమ్మటనేకార్యమువచ్చునో యప్పుడు దానికిఁ దగినకార్యమునుజూతము - ఓతమ్ములారా కాఁబట్టి యిప్పుడుమనము శీఘ్రముగాఁ దపస్సునకుఁ బోవలయును మీరేమిచెప్పెదరోచెప్పుఁడు - ౨౭ - అనియిట్లువజ్రదంష్ట్రుఁడు చెప్పఁగా నతనితమ్ములామాటవిని యట్లేయనినిశ్చయించుకొనియాయన్నతోఁగూడినవారై వ్యాఘ్రవక్త్రుఁడును సర్పజిహ్వుఁడునను నారాక్షసశ్రేష్ఠులిద్దఱు సర్వేశ్వరుఁడైన సాంబశివునిఁగూర్చి తపస్సుచేయనుశ్రేష్ఠమైనచోటికిఁబోయిరి - ౨౯ - అంతనాముగ్గురురాక్షసులును శ్రేష్ఠమైననియమమందునిలిచి కఠినమైనతపస్సుచేతఁ దమదేహములనుడిగించిరి- ౩౦- అంత భగవంతుఁడైన సాంబశివుఁడనుగ్రహమును బొందినవాఁడై యారాక్షసులనుగూర్చి యొకమాట చెప్పెను - ఓరాక్షసశ్రేష్ఠులారా లెస్స మీతపస్సుచేతనేనుమీకిష్టుఁడనైతిని - ౩౧ - మీకిప్పుడేదికావలయునోదానిగోరుఁడునేనిచ్చెదను - షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన యాసాంబశివుఁడిట్లుచెప్పఁగా నాముగ్గురురాక్షసులు నదృష్టహీనులగుటచేత నాశివునినొకవరమువేడిరి - రాక్షసులువేఁడుకొనుట - దేవదేవులకందఱకు నియామకుఁడును షడ్గుణైశ్వర్య

కే వినాశం యాతుసర్వదా । అస్మాకమీప్సితంచైత త్తత్తథాకర్తుమర్హసి ॥
౩౪ ॥ ఏవముక్త స్తతశ్శంభు స్తైఃపునః ప్రాబ్రవీద్వచః॥ శ్రీశివః ॥ దురాసదో
వరోదైత్యా వృతో యుష్మాభిరద్యవై ॥ ౩౫ ॥ తమహంనైవదాస్యామి కింత్వ
న్యోవ్రియతాంవరః । త్రిమూర్తిరయాపోమార్తండస్సర్వదేవాత్మకశ్చసః॥ ౩౬॥
జగద్విలోచనఃకర్మ సాక్షీగోప్తా సఏవహి । సఏవ కర్తాహర్తాచ పరధర్మ ఫల
ప్రదః ॥ ౩౭ ॥ సఏవ పరమంస్థానం లోకేసుకృతినాంరవిః । క్రియంతేసర్వకర్మా
ణితస్మిన్నేవోదితేజనైః ॥ ౩౮ ॥ లోకాజాగ్రతిసంజాతే సూర్యేస్తేతుస్వపంతి
చ । తస్మిన్గతప్రభేలోకేభాస్కరేలోకచక్షుషి ॥ ౩౯ ॥ ఉదయాస్తమయకా
తస్యాజ్ఞానానా జనతాసురాః । గాఢాంధకారత్రస్తాచ కథంస్థేయాత్కథం
చరేత్ ॥ ౪౦ ॥ కర్మణాంపరిశుద్ధానాం కాగతిశ్చభవిష్యతి । ఈదృశోహ్య
విచారేణ వరోవ్రీతో నిశాచరాః॥ ౪౧ ॥ జగన్నాశోభవేద్యేన సకథందీయతే
మయా । తస్మాదన్యంతుదాస్యామి తంవో యోవాస్తురోచతే॥ ౪౨॥ ఇత్యేవ

---

సంపన్నుడునైన యోశంకరుడా నీవుసంతోషించితివా - ఎల్లప్పుడుసూర్యు
నిప్రకాశములోకమందులేకపోవలయును - ఇదిమాకోరికగనుకదీనినిట్లుచేయ
దగుదువు - ౩౪ - ఆరాక్షసులిట్లుచెప్పగానామాటవినియాశివుడు వారితో
మరల నుత్తరముచెప్పెను - శివుడుచెప్పెడునుత్తరము - ఓరాక్షసులారామీ
రిప్పుడుకోరినవరముపొందశక్యముకానిది - కాబట్టియావరమునునేనీను మఱి
యొకవరమును గోరుడు సూర్యుడు బ్రహ్మవిష్ణుమహేశ్వర స్వరూపుడు స
కలదేవతాస్వరూపుడు జగత్తునకంతయు నేత్రరూపుడు కర్మములజూచువా
డు రక్షించువాడునతడే శ్రేష్ఠములైనధర్మములకెల్లఫలములనిచ్చువాడున
తడే - ౩౭ - లోకమందు బుణ్యమునాచరించిన వారికి శ్రేష్ఠమైనపొందదగి
నచోటతడేగదా- అతడుదయింపగానేగదా జనులుసర్వకర్మములనుజేయు
చున్నారు - సూర్యుడుదయింపగాజనులుమేలుకనుచున్నారు-అతడస్తమిం
చిననిద్రపోవుచున్నారు - ఓరాక్షసులారా లోకమునకు గన్నైనయాసూర్యు
డుప్రకాశింపనివాడైన లోకమందుండు జనసమూహమతని యుదయాస్తమ
యములనెఱుగనిదై గాఢమైనచీకటివలన భయపడియెట్లునిలుచు నెట్లుసంచ
రించును - ౪౦ - తరువాతబరిశుద్ధములైన శ్రౌతస్మార్తక్రియలకన్నిటికేమిగ
తియగును - ఓరాక్షసులారా తెలియక యిట్టివరమునువేడితిరి - ౪౧ - ఇట్టివ
రమును మీకిచ్చినపక్షమున లోకమంతయుజెడునే యట్టివరమును నేనెట్లిత్తు

ముక్తస్తేనై తే విషణ్ణా ఊచిరేసురాః । భగవన్ త్వహిదేవేశ ప్రభాజాలస్య భాస్వతః॥ ౪౩ ॥ ఏకాబ్దమప్రకాశత్వం కురుత్వంభక్తవత్సల । తేషాం తద్వచనంశ్రుత్వా విచింత్యక్షణమీశ్వరః॥ ౪౪॥ తథాభవిష్యతీత్యుక్త్వా తత్రైవాంతరధీయత । తతోంధకారంబ్రహ్మాండే వ్యాప్తమంజనమేచకం ॥ ౪౫ ॥ విరేజుర్గిరయస్సర్వే ఛాదితాఃకజ్జలైరివ । అంధకారపరివ్యాప్తే ప్రపంచేసచరాచరే ॥ ౪౬ ॥ వజ్రదంష్ట్రస్తతో దైత్యో వీరమాహేంద్రపట్టణం । ఆసాద్యత్వరితో దూతాన్ వాక్యమేతదువాచహ ॥ ౪౭ ॥ గచ్ఛంత్వద్యభవంతస్తు చతస్రస్సహసాదిశః । అస్మదీయాయత్రయత్ర వసంతిరజనీచరాః ॥ ౪౮ ॥ సర్వేషాం యోగముక్త్వాచ తేషాం యుద్ధాయనిర్జరైః । సతస్సంభూయత్తైరేవాదైవాగచ్ఛంతుకింకరాః ॥ ౪౯ ॥ ఏవం ప్రచోదితాస్తేన తతోదూతావినిర్యయుః । సమాసాద్యాంతికంతేషాంరాక్షసానాం మహాజవాత్ ॥ ౫౦ ॥ తేభ్యస్సర్వేభ్య ఉక్త్వాచ రాక్షసేశ్వరభాషితం । తైస్సన్నద్ధై స్తతస్సర్వై స్త

---

ను - కాఁబట్టియదితప్పమక యేవరముమీకిష్టమైనదికోరినని చ్చెదను - ౪౨ - ఆ సాంబశివునిచేత నిట్లుచెప్పఁబడి యారాక్షసులు వ్యసనమునొందినవారై మరలనాశివునితోనిట్లుపలికిరి - ఓషడ్గుణైశ్వర్యసంపన్నుఁడవై దేవతలకెల్లఁ బ్రభువైనస్వామీభక్తులయందుప్రీతిగలవాఁడా అట్లైనపక్షమందొక సంవత్సరము సూర్యుని ప్రకాశము లేకుండునట్లొనఁ జేయుము - అనియిట్లా రాక్షసులడుగఁగా నామాట విని యీశ్వరుఁడు క్షణముసేపాలోచించి యట్లే యగునని చెప్పి యక్కడనే మఱుగుపడెను - అంతఁ గాటుకవలె నల్లని చీకటి బ్రహ్మాండమందంతటనువ్యాపించెను - ౪౫ - స్థావర జంగమములతోఁ గూడిన ప్రపంచమంతయు నంధకారము క్రమ్ముకొనఁగాఁ గొండ లన్నియుఁ గాటుకలచేతఁ గప్పఁబడినవి వలెఁ బ్రకాశించెను - ౪౬ - అంతనావజ్రదంష్ట్రుఁడను దానవుఁడుత్వరితముగా వీరమాహేంద్రపట్టణమునకుఁబోయి దూతలనుగూర్చి యిట్లనిపలికెను - ౪౭ - మీరుత్వరితముగా నిప్పుడునాలుగుదిక్కులకుఁబోయి మనవారైన,రాక్షసులెక్కడ నెక్కడనున్నారో వారలంద ఱొకటిగాఁజేరి దేవతలతో యుద్ధముకొఱకు రావలయునని చెప్పి యంతటవారితోఁగూడుకొనినేఁ డేరావలయు నోయి కింకరులారా - ౪౮ - ఇట్లతనిచేతఁ బంపఁబడిన వారై యంతనాదూతలుబయలు వెడలిరి - మిక్కిలివేగముతోనారాక్షసులదగ్గరకుఁ బోయి రాక్షసులకెల్ల రేఁడగు నావజ్రదంష్ట్రుఁడుచెప్పిన మాటనువారలకం

స్మిన్నేవాగమద్దినే ॥ ౫౧ ॥ సర్వేయుద్ధాయ సన్నద్ధా రాక్షసా భృశదర్పితాః । సుపర్వభిర్ధుర్వంచక్రుః ప్రయాణంత్రిదశాలయం ॥ ౫౨ ॥ ఇతిశ్రీబ్రహ్మాండ పురాణే - దేవాంగ చరితే - రాక్షస యుద్ధ సంరంభో నామ చతుర్దశోధ్యాయః.

శ్రీసూతః ॥ అథతేరాక్షసాస్సర్వే సంభూయపటువిక్రమాః । ఆజ్ఞయా వజ్రదంష్ట్రస్య స్వపురాచ్చ వినిర్యయుః ॥ ౧ ॥ వజ్రదంష్ట్రోరాక్షసేశ శ్చతురంగబలైర్వృతః । నిశ్చిక్రామాథనగరా ద్యుద్ధాయకృతనిశ్చయః॥ ౨॥ వ్యాఘ్రవక్త్రస్సర్పజిహ్వా భ్రాతరౌ రాక్షసేశ్వరౌ । తతోనిర్యయతు స్తస్య బహుసైన్యసమావృతౌ॥ ౩॥ సూర్యకోపశ్చాగ్నికోపో వజ్రదంష్ట్రసుతావుభౌ । అనేకబలసంయుక్తౌ పితరం చాన్వగచ్ఛతాం॥ ౪॥ భాగినేయౌ మహావీర్యౌ రాక్షసేశస్యతస్యవై । ధూమ్రనేత్రః ఖడ్గజిహ్వా రథపత్త్యశ్వ వారణైః॥ ౫॥ బహుభిసంవృతౌ యోద్ధు మాయాతాం రాక్షసైస్తదా । ప్రస్థాన

---

దలఁకుఁజెప్పి యుద్ధమునకుసన్నద్ధులైన యారాక్షసులతోఁ గూడ నాదినమందే వచ్చిరి - ౫౧ - మిక్కిలి కావరించిన యారాక్షసులందఱు దేవతలతో యుద్ధముచేయను దయారైనవారై స్వర్గమునుగూర్చి ప్రయాణమునునిష్కర్షచేసిరి - ౫౨ - ఇదిబ్రహ్మాండపురాణంబున దేవాంగచరితంబున రాక్షస యుద్ధసంరంభమన్నది పదునాలవయధ్యాయము.

సూతుఁడు పిమ్మటికథ నాఋషులకుఁ జెప్పచున్నాఁడు - అటుతరువాత మిక్కిలి పరాక్రమముగల యారాక్షసులందఱు చేరి వజ్రదంష్ట్రుని యానతిచొప్పనఁదమపట్టణమువలననుండి వెడలిరి - ౧. అంతరాక్షసులకునాథుఁడైనయావజ్రదంష్ట్రుఁడు నాలుగంగములుగల సేనలచేతఁ జుట్టఁబడినవాఁడై యుద్ధముకొఱకునిశ్చయముచేసుకొని పట్టణమునుండి బయలు వెడలెను - ౨ - అంతనతని తమ్ములు రాక్షసులకుఁబ్రభులగు వ్యాఘ్రవక్త్రుఁడును సర్పజిహ్వుఁడును పలుసేనలతోఁగూడి కొన్నవారు బయలువెడలిరి - ౩ - సూర్యునివంటికోపముకలుగుటవలనను సూర్యకోపుఁడు నగ్నికోపుఁడను పేరులుగల యావజ్రదంష్ట్రుని కొడుకులిద్దఱు పెక్కు సేనలతోఁ గూడిన వారై తండ్రిని వెంబడించిపోయిరి - ౪ - మిక్కిలిబలముగలవారగు నారాక్షసనాథుని మేనల్లురు ధూమ్రనేత్రుఁడు ఖడ్గజిహ్వుఁడును రథములచేతఁ గాలుబలములచేత గుఱ్ఱములచేత పెక్కు రాక్షసులచేతఁ జుట్టబడినవారై యప్పుడుయుద్ధముచే

భేర్యోబహుళాశ్చ భృహస్యంతవై తతః ॥ ౬॥ జగ్ముస్సర్వే ద్విజాదైత్యా నాకం ప్రతియుయుత్సయా । అనేకసైన్యసంయుక్తా రాక్షసాస్తే మహాబలాః॥ ౭॥ కుర్వంతోధమరారావా న్గర్జంతశ్చ భయావహం । పరివృత్యదివంతస్యా స్సర్వద్వారాణ్యరాత్సిషుః॥ ౮॥ తథాగమనమాజ్ఞాయ రాక్షసానాం దివౌకసః । బహవోయుద్ధసన్నద్ధాః యుయుధిరేచతైః ॥ ౯ ॥ వివ్యధుర్బహుధాదైత్యాశ్చిచ్ఛిదుఖృశిరాంసిచ। చూర్ణీచక్రూరథానశ్వాన్గజాన్పత్తీన్యపాతయన్ ॥ ౧౦ ॥ ససూతాన్ త్సరథాన్ త్సాశ్వాన్ త్సాయుధా న్రథినోసురాన్ । ఛిత్వాన్యపాతన్దేవాః కాలదండోపమైశ్శరైః ॥ ౧౧ ॥ సహస్తినో హస్తికాంశ్చహత్వాన్యేచాభిదుద్రువుః । అన్యేహత్వా శ్వికాన్ త్సాశ్వాన్స్వతానచ్యావయన్సురాః॥ ౧౨॥ అన్యేవిదార్యపాదాతా నగ్నికల్పైశ్శరోత్కరైః । ఛిత్వాగాత్రాణిబహుధాదేవాఃక్రుద్ధాన్యపాతయన్ ॥ ౧౩ ॥ తతస్తైరర్దితాదేవై రాసురీపృతనర్షభయః । దుద్రావభృశసంక్షుబ్ధా త్యక్త్వా ద్వా

---

యనువచ్చిరి - అంతనసేకములైన రణభేరులు వాయింపఁబడెను- ౬- ఓబ్రాహ్మణులారా మిక్కిలి లావరులగు నారాక్షసులందఱు యుద్ధముచేయ నిచ్ఛచేతబహుసైన్యములతోఁ గూడినవారై స్వర్గమునుగూర్చినడచిరి- ౭- వారుధనుస్సులయల్లెలను టంటమ్మనిశబ్దింపఁ జేయుచు వినువారిగుండె లవియునట్లుగొప్పచు స్వర్గమునుజుట్టుకొని యాస్వర్గమువాకిళ్ల నెల్లనడ్డగించిరి - ౮ - ఆప్రకారమా రాక్షసుల రాకను దెలిసికొని దేవతలు పెక్కండ్రు కోపగించినవారై యుద్ధమునకుఁ దయారై యారాక్షసులతో యుద్ధముచేసిరి - ౯ - రాక్షసులను బలుతెఱంగులగొట్టిరి యనేకుల తలలునరికిరి - తేఱులఁబొడిసేసిరి గుఱ్ఱములనేనుగులఁ గాలుభలములఁబడగొట్టిరి- ౧౦- దేవతలుసారథులతోఁ గూడనురథములతోఁగూడనుగుఱ్ఱములతోఁగూడనాయుధములతోఁగూడను రథికులైన రాక్షసులను యమునిదండముతోసమానములైన బాణములచేతఁ గొట్టి పడఁద్రోసిరి- ౧౧- మఱికొందఱు దేవతలుగజసైన్యముల నాయకులనేనుఁగులతోఁగూడఁగొట్టితఱిమిరి- మఱికొందఱు దేవతలు గుఱ్ఱముల సేనలకు మొనగాండ్రైనశత్రువులను గుఱ్ఱములతోఁగొట్టితఱిమిరి- ౧౨- మఱికొందఱు కోపగించిన దేవతలు నిప్పులఁబోలిన యంపప్రోగులచేతఁ గాలుబలములనుజీల్చి దేహములను బెక్కువిధములఛేదించి పడఁద్రోసిరి - ౧౩ - ఓమునులారా అంతనా దేవతలచేత నారాక్షస సేన యీప్రకారము బాధింపఁబడి

రాణివై దివః ॥ ౧౪ ॥ తతోనుద్రుద్రువుర్దేవా దైత్యాన్ స్థానపరాజితాన్ ।
భృశంసంపీడయామాసూరథవాజ్యసురద్విపాన్ ॥ ౧౫ ॥ తతోదేవై ర్మహే
ష్వాసైః క్రుద్ధైః కాలాగ్ని సన్నిభైః । శరైర్దందహ్యమానాసా సురీసేనా
తుభూసురాః ॥ ౧౬ ॥ పలాయనపరానున్నా చార్తనాదవసమాకులా । వ్యత్యో
భతతదాసర్వాభిన్నా నౌరివసాగరే ॥ ౧౭ ॥ విద్రావ్యమాణంతత్సైన్యంవిలో
క్యదనుజేశ్వరః । వజ్రదంష్ట్రిస్తతస్సర్వాన్ దానవాన్ త్సమయోజయత్ ॥
౧౮ ॥ తేహన్యమానాస్సమరేదేవై రమితవిక్రమైః । చోదితావజ్రదంష్ట్రిణా
రాక్షసాస్సు మహాబలాః ॥ ౧౯ ॥ అభ్యద్రవంత సహసా పునర్దేవాన్ యు
యుత్సవః । వజ్రదంష్ట్రి స్తతః క్రుద్ధో భ్రాతృపుత్రైర్మహాబలైః ॥ ౨౦ ॥ సం
వృతోభాగినేయాభ్యాం షడ్భిస్తైరుగ్రవిక్రమైః । యోధయామాస దైత్యేం
ద్రోదేవై రమితవిక్రమః ॥ ౨౧ ॥ తతస్సమభవద్యుద్ధం దేవదానవసేనయోః
ఏకీభావమనుప్రాప్య పరస్పరజయేషిణోః ॥ ౨౨ ॥ రథారథైర్హయైరశ్వా

---

మిక్కిలికలంగినదై స్వర్గముయొక్క వాకిళ్లను విడిచి పఱుగెత్తెను - ౧౪ - స్థానమందా రాక్షసులోడఁగానే యంతనా దేవతలు వారిని వెంబడించి తఱిమి తేజులను గుఱ్ఱములను రాక్షసుల నేనుఁగులను మిక్కిలినొప్పించిరి- ౧౫- ఓ ఋషులారా గొప్పధనుస్సులు గల యా దేవతలు కోపగించినవారై ప్రళయ కాలపుచిచ్చుతో సమానములైన యమ్ములఁ బ్రయోగింపఁగా నారాక్షససేన వానిచేత దహింపఁబడుచుఁ దఱుమఁబడిపఱుగెత్తుచు దీనధ్వనులతోఁగూడినదై సముద్రమునఁ బగిలిన యోడవలె నంతయుఁ గలకఁబాఱెను - ౧౭ - అంతనీప్రకారముదఱుమఁబడుచున్న యాసేనను రాక్షసులకు నాయకుఁడైన వజ్రదంష్ట్రిఁడుచూచి రాక్షసుల నందఱిఁ గూర్చెను - ౧౮ - మిక్కిలిపరాక్రమముగల దేవతలచేత యుద్ధమందుఁ గొట్టఁబడుచున్న మెండులావరులగు నా రాక్షసులు వజ్రదంష్ట్రినిచేతఁ బ్రేరేపింపఁ బడినవారై యుద్ధముచేయ నిచ్ఛతో నతిశీఘ్రముగ మరల దేవతలనెదుర్కొని తఱిమిరి - అంతనధికమయినపరాక్రమముగల వజ్రదంష్ట్రిఁడు మిక్కిలికోపముగలవాఁడై యధిక బలముగల యట్టియు భయంకరమైన పరాక్రమముగల తమ్ములచేతను గొడుకుల చేతను మేనల్లురచేతను నారుగుఱిచేతను జుట్టుకొనఁబడిన వాఁడై దేవతలతో యుద్ధముచేసెను - ౨౧ - అంతనొకటిగాఁగలుసుకొని యొకరినొకరు జయింపఁగోరుచున్న యా దేవతలరాక్షసుల సేనలకు రెంటికినియుద్ధమాయెను-౨౨- తేజు

స్సంనికృష్య గజై ర్గజాః । పత్తిభిః పత్తయ శ్చైవ రథినో హాస్తికై స్సహ॥ ౨౩ ॥ అశ్వారోహాశ్చ రథిభిః పాదాతై రథినః పునః । హాస్తికాశ్చాశ్వికా ర్జఘ్నుః పత్తయో హాస్తికాం స్తథా ॥ ౨౪ ॥ హాస్తికా రథినో జఘ్ను రాశ్వికాన్పత్తయ స్తథా । రథాశ్వేభపదాతాశ్చ పత్త్యశ్వరథవాజినః ॥ ౨౫ ॥ రథపత్త్యశ్వమాతంగా మహద్యుద్ధం ప్రచక్రిరే । పట్టసై ర్ముసలై శ్శూలై ర్భిండివాలైః పరశ్వధైః ॥ ౨౬ ॥ ముద్గరై ర్యష్టిభిః ప్రాసై ర్మహోల్కాభిశ్చ శక్తిభిః । గదాభిః పరిఘైః కుంతైః క్షురప్రాద్యై ర్మహాయుధైః ॥ ౨౭ ॥ నిఘ్నంతశ్చ నికృంతంతః ప్రోథయంతః పరస్పరం । భిందతః పాతయంతశ్చ యుయుధు ర్దేవదానవాః॥ ౨౮॥ బహూనేకో హనద్వీర ఏకంచ బహవో హనన్ । ఏవం ప్రవృద్ధే తద్యుద్ధే తుములే రోమహర్షణే ॥ ౨౯ ॥ రథనేమిస్వనా శ్చైవ కరిణాం బృంహితానిచ । హేషారవా స్తురంగాణాం భటానాం గర్జితానిచ ॥

---

లతోఁ దేజులు గుఱ్ఱములతో గుఱ్ఱములు నేనుఁగులతో నేనుఁగులును గాలుబలములతోఁ గాలుబలములును గదిసికొన్ని ప్రక్కల రథములమీఁది వారేనుఁగుల సేనల వారితోను గుఱ్ఱములమీఁది రౌతులు తేజులమీఁది వారితోను రథములమీఁదివారు కాలుబలములతోను గదిసి యేనుఁగులవారు గుఱ్ఱములవారిని గాలుబలము లేనుఁగులవారిని నట్లే యేనుగులవారు తేజులమీఁదివారిని గుఱ్ఱములమీఁది రౌతులను గాలుబలములు నబ్బినవారబ్బినట్లు కొట్టిరి- ౨౪- రథములు గుఱ్ఱములు నేనుఁగులు కాలుబలములును గాలుబలములు గుఱ్ఱములు తేజులు గుఱ్ఱములు కొన్ని ప్రక్కలను తేజులు కాలుబలములు గుఱ్ఱా నేనుఁగులును జేరి దొడ్డజగడము చేసెను - పట్టాకత్తుల చేతను రోకండ్లచేతను శూలములచేతను గడ్డపారలచేతను గండ్రగొడ్డండ్ల చేతను గజ్జలచేత నినుపలోగండ్ల చేతనీటెల చేతను నిప్పులుగ్రక్కుచున్న శక్తులను నాయుధముల చేతను గదలచేతను బరిఘముల చేతను గత్తెరల చేతను మఱియు ననేకములయిన గొప్పయాయుధముల చేతను నొకరినొకరు కొట్టుచు నఱుకుచుఁ గ్రుచ్చుచుఁ జీల్చుచుఁ బడఁద్రోయుచు దేవతలును రాక్షసులును యుద్ధము చేసిరి - ౨౮ - ధైర్యవంతుఁ డొక్కఁడే పెక్కండ్రను గొట్టెను మిక్కిలి బలశాలిగా నుండువాని నొకని పెక్కండ్రు గొట్టిరి - తెలియఁ గూడక యొడలుగ గురించు నట్లే ప్రకారము పెఱిగిన యాయుద్ధమందు రథముల చక్రముల యంచుల రాపిడివలన గలిగిన చప్పుళ్లును గజముల యార్పులును గుఱ్ఱముల సగిలింపు చప్పుళ్లును సిపాయీ

౩౦ ॥ భుజాస్ఫాలనశబ్దాశ్చ ధనురాకర్షణానిచ । భేరీశంఖనిదాశ్చాప్య న్యవాదిత్రనిస్వనాః ॥ ౩౧ ॥ కాహళీతూర్యనినదాస్సింహనాదా స్తథాపరే । ఆ పన్న జగత్త్రియవ్యాప్తా లోకాశ్చ బధిరీకృతాః ॥ ౩౨ ॥ తిథిముస్సాగరాస్స ర్వే బభ్రిముః కులపర్వతాః । తతో మహత్యంధకారే సైన్యైరాయుధవిదీప్తిభిః ॥ ౩౩॥ జఘ్నుర్దృష్ట్వారయ శ్శత్రూ నన్యేమకుటదీప్తిభిః । సంఘట్టితా యుధా నాంతు దీప్తిభిర్జఘ్నిరేపరాః ॥ ౩౪॥ తతోదైత్యైర్మహాసత్వై స్సక్రోధై ర్దృఢకార్ముకైః । హన్యమానా భృశం క్షుబ్ధా దేవాస్సర్వే పరాఙ్ముఖాః ॥ ౩౫ ॥ విద్రావ్య వివిశుశ్శీఘ్రం తతస్స్వర్గపురంభియా । పరాజిత్యాఖిలాన్ దే వాన్ రాక్షసా ఘోరవిక్రమాః ॥ ౩౬॥ అద్యైతిమత్వాలం యుద్ధం మహాహ ర్షసమన్వితాః । ప్రయయుర్వీరమాహేంద్రం వజ్రదంష్ట్రిపురోగమాః ॥ ౩౭॥ తతస్సర్వే సురాఃఖిన్నా రాక్షసై భృశపీడితాః । ఉపాగమ్యేంద్ర మాలో చ్యసహాతే నద్విజోత్తమాః ॥ ౩౮॥ ప్రాప్తుంతం శరణం శంభు మగమన్ జ

---

లబొబ్బలును వీరులుభుజముల నప్పళించుశబ్దములును ధనుస్సుల టంకారనా దములును నగారాలుగొట్టుశబ్దములును చిందములూదుమ్రోతలునుదుతారల ధ్వనులును డోళ్లశబ్దములును మఱియు ననేకములగు నితర వాద్యములయొ క్క ధ్వనులును వీరభటుల సింహనాదములును మూడులోకములను వ్యాపింప గా జనులందఱు చెవుడు పట్టినవారుగాఁ జేయఁబడిరి - ౩౨ - సముద్రముల న్నిపొంగినవాయెను - కులపర్వతములు గిరగిరఁ దిఱిగెను - అంత నాగాఢాం ధకారమందుఁ గొందఱుతమయాయుధముల తళతళలచేత శత్రువులఁ గనుగొ ని యాశత్రువులఁగొట్టిరి మఱికొందఱు కిరీటముల కాంతులచేత నిఁకఁగొంద ఱొఱసికొన్న యాయుధముల మిఱుఁగురులచేతను శత్రువులఁజూచి కొట్టిరి - ౩౪ - అంతమిక్కిలిలావరులును గోపముతోఁ గూడినవారును గట్టివింట్లుగల వారునగు రాక్షసులచేత దేవతలందఱు కొట్టఁబడి మిక్కిలి కలఁకఁబారినవా రై వెనుకకుఁదిఱిగి పరుగెత్తి యంతటభయముతో స్వర్గపట్టణమునుజొచ్చి రి - భయంకరమగు పరాక్రమముగల రాక్షసులు దేవతలనెల్ల నోడించి నేఁ డికయుద్ధముచాలుననితలఁచి మిక్కిలిసంతోషముతోఁగూడినవారై వజ్రదం ష్ట్రుఁడు ముందు నతనివెనుకఁ దక్కినవారును వీరమాహేంద్ర పట్టణమునకు బోయిరి - ౩౭ - ఓ బ్రాహ్మ శ్రేష్ఠులారా - అంత దేవతలందఱు రాక్షసుల చేత మిక్కిలిబాధింపఁబడినవారై ఖేదమునుబొంది యింద్రుని దగ్గిరకుఁబోయి

తాచలం । తత్ర కైలాసశిఖరే ప్రవిశ్యశివమందిరం॥ ౩౯॥ దృష్ట్వాశివం మహా
త్మానం ప్రసన్నవదనంశుభం । ప్రణమ్య పార్వతీనాథం సేంద్రాస్సర్వే మరా
స్తదా॥ ౪౦॥ తుష్టువుర్బహుధావాగ్భి ర్దేవదేవం జగత్పతిం॥ దేవాః॥ నమ
స్తేదేవదేవేశ నమస్తేపరమాత్మనే॥ ౪౧॥ నమస్తేజ్ఞానగమ్యాయ నమస్తేభక్త
వత్సల । నమస్తేసర్వవంద్యాయ నమస్తేనంతమూర్తయే॥ ౪౨॥ ఇత్యాదిభిరనే
కైస్తైర్వచోభిస్తుష్టువుశ్శివం । తతశ్శివో మహాదేవ స్తాన్సురానబ్రవీద్వచః॥
౪౩॥ యుష్మాకంకుశలందేవాఃకుశలంతేశతక్రతో । దంభోళికేళిదైత్యానాం
కించుచైత్యాప్రహారిణీ॥ ౪౪॥ ఏవంపృష్టాభగవతాదేవాదేవంతతోబ్రువన్ ।
కుశలంసర్వథాదేవప్రసాదాత్తవనఃప్రభో ॥ ౪౫ ॥ కింతుదైత్యోవజ్రదంష్ట్రో
దురాత్మాస్మాన్ప్రబాధతే । పూర్వేద్యుస్సంగరేతేన భృశం సంపీడితావయం॥

---

యతనితో నాలోచించి యాప్రసిద్ధుఁడైనసాంబశివుని రక్షకునిఁగా బొందను గైలాసపర్వతమునకుబోయిరి-ఆకైలాసపర్వతమునకుఁబోయి యందు శివునింటిలోఁజొచ్చి యనుగ్రహముగల ముఖముగలయట్టియు క్షేమములఁ గలుగఁజేయునట్టియు మహానుభావుఁడైనట్టియుఁ బార్వతికిఁగాంతుఁడైన యాశివుని జూచి యింద్రునితోఁగూడ నాదేవతలందఱు మ్రొక్కి యప్పుడు దేవతలకు దేవుఁడును లోకములకునాథుఁడగు నాశివునిఁబలువిధములగు వాక్కులచేతస్తోత్రముచేసిరి - ౪౦ - దేవతలు చేసినస్తోత్రము - దేవతలకెల్ల నీశ్వరుఁడైనస్వామీనీకునమస్కారము - పరమాత్మస్వరూపుఁడైన నీకునమస్కారము - జ్ఞానముచేతఁ దెలియదగిన నీకొఱకు నమస్కారముభక్తులయందుఁ బ్రేమగలవాఁడా నీకొఱకు నమస్కారము - సకలమైన వారిచేత నమస్కరింపఁదగిన నీకొఱకునమస్కారము - కడలేనిమూర్తిగలనీకొఱకునమస్కారము- ౪౨- ఇవిమొదలగునేకములైన వాక్యములచేత నాదేవతలుశివునిఁబొగడిరి - అంతఁబొడ్డదేవుడైనయాశివుఁడాదేవతలనుగూర్చిమాటలాడెను - ౪౩ - ఓదేవతలారా మీకు క్షేమమా ఓ నూరశ్వమేధములఁజేసి స్వర్గమున కధిపతియైనయింద్రుఁడానీకు క్షేమమా - వజ్రాయుధముయొక్క క్రీడరాక్షసుల మేడలను గొట్టకయున్నదాయేమి - ౪౪ - ఇట్లుషడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన యాశివునిచేత నడుగబడి దేవతలంత నాశివునితో మరలనుత్తరముచెప్పిరి- స్వామీతమయనుగ్రహమువల్లమాకన్ని విధములను క్షేమముకలదు - ౪౫ - ఇఁకనేమనఁగా దుర్మార్గుఁడైనవజ్రదంష్ట్రుఁడనురాక్షసుఁడు మమ్ముబాధపెట్టుచున్నాఁడు - నిన్నటిదినము పె

నిరుంధతాస్వర్గపురం బహుస్సైన్యేనరక్షసా । త్వా మద్యశరణం ప్రాప్తాః పాహ్యస్మాన్కరుణానిధే ॥ ౪౭ ॥ నశక్ష్యామ స్తేనయోద్ధుం వయం దైత్యేన శంకర । తస్యోపాయంవినాశస్యరాక్షసశ్యవదప్రభో ॥ ౪౮ ॥ భ్రాతరౌతస్య దనుజౌ మహాసత్వౌదురాసదౌ । వ్యాఘ్రవక్త్రిం సర్పజిహ్వాం కస్సహేత రహాంగణే ॥ ౪౯ ॥ పుత్రౌతస్యదురాధర్షావజ్రదంష్ట్రస్యరక్షసః । సూర్యకోపంచాగ్నికోపంకాలాంతశయమోపమౌ ॥ ౫౦ ॥ భాగినేయౌధూమ్రనేత్రఖడ్గజిహ్వౌ మహాబలౌ । నశక్ష్యామోవయంసోఢుంసంగరేతాన్దురాసదాన్ ॥ ౫౧ ॥ తేషాంవినానాశనోపాయం సంచింతయమహామతే । వినాశయిత్వా తాన్ దైత్యాన్ త్రాహ్యస్మాన్భక్తవత్సల ॥ ౫౨ ॥ త్వామేవ శరణంప్రాప్తాశ్చానన్యశరణావయం । ఇతిసంప్రార్థితోదేవైర్మహాదేవ స్తతశ్శివః ॥ ౫౩ ॥ కంపయిత్వాశిరోధ్యాత్వా క్షణం సమ్యగితీరయన్ । దేవాంగ ముఖమాలోక్యజగాదేదం వచోనృపం ॥ ౫౪ ॥ దేవాంగత్వం మహాబాహో సదేవస్య

---

క్కు సేనలతోవచ్చి స్వర్గపట్టణమును ముట్టడివేసి యారాక్షసుఁడు యుద్ధమందు మమ్ముమిక్కిలి బాధపెట్టెను - అతనిచేత బాధపడఁజాలక నిన్నిష్టమురక్షకునిఁగాఁ బొందితిమి దయాసముద్రుఁడా మమ్ముగాఁపాడుము - ౪౭ - ఓశుభ మునుగలుఁగజేయుస్వామీయతనితో యుద్ధముచేయనుమాకుశక్తిలేదు - సర్వ కార్యములయందుసమర్థుఁడాయారాక్షసునిచావునకుపాయముచెప్పుము- ౪౮- మిక్కిలిబలముగలవారును దగ్గిరఁజేరరాని వారగు నతని తమ్ములను వ్యాఘ్రి వక్త్రుఁడుసర్పజిహ్వుఁడనురాక్షసులను యుద్ధరంగమందెవఁడు సహింపఁగలఁడు - ౪౯ - బెదరింపఁగూడనియుఁగాలాంతకునితోడనుయమునితోడనుసమానులైనయావజ్రదంష్ట్రుఁడను రాక్షసునికొడుకుల సూర్యకోపునినగ్నికోపునిమిక్కిలిబలముగలవారుసతనిమేనల్లురునగు ధూమ్రనేత్రునిఖడ్గజిహ్వుని నెవఁడు సహింపఁగలఁడు - దగ్గిరజేరరాని యారాక్షసులను యుద్ధమందు మేముసహింపఁజాలము- ౫౦- మిక్కిలిబుద్ధిమంతుఁడైనస్వామీ వారిజంపనుపాయమునాలోచింపుము - భక్తులయందుఁ బ్రీతిగలవాఁడా - ఆరాక్షసులనుజంపి మమ్ముగాపాడుము - ౫౧ - మేము వేరేరక్షించువాదులేనివారై నిన్నేరక్షకునిఁగాఁ బొందితిమి - అనియిట్లుదేవతలచేతఁ బార్థింపఁబడి దొడ్డదేవుఁడైన యాశివుడంతఁదలయాడించి లెస్సయని చెప్పుచుగొంచెముసేపు ధ్యానముచేసిదేవాంగమహారాజుముఖమునుజూచియారాజుతోనిట్లనిపలికెను - ౫౨ - దొడ్డభుజబ

శచీపతేః । నిశాచరాణాంసమరే సహాయం కర్తుమర్హసి ॥ ౫౫ ॥ చతురంగ
బలోపేత స్సపుత్ర స్త్వంనృపర్షభ । సేంద్రోదేవగణోపేతస్తాన్ దైత్యాన్ జ
హిమాచిరం॥ ౫౬ ॥ ఇత్యాదిష్టో మహేశేన బాఢమిత్యబ్రవీన్నృపః। తతశ్శివో
జగాదేదం సహస్రాక్షం పునర్వచః ॥ ౫౭ ॥ దేవాంగేనాముచానాశక్ర గచ్ఛ
త్వంయోద్ధుముద్యతః । నిర్జితా స్తేభవిష్యంతివజ్రదంష్ట్రముఖాసురాః ॥ ౫౮ ॥
ఇత్యుక్తశ్శంకరేణేంద్రః ప్రహృష్టస్తమువాచహ । తథాభవతు దేవేశ త్వద్వా
క్యేనగిరీశ్వర ॥ ౫౯ ॥ భూయాసూర్న్నిర్జితా దైత్యాబాధంతేయేసదాహినః।
ఇత్యుక్త్వాశివమానమ్య సదేవోమఘవాతతః ॥ ౬౦ ॥ వినిర్యయానృపతినా
తేనాజ్ఞప్త స్తదాలయాత్ । దేవాంగస్తుతతోవాక్యం పురందరమువాచహ ॥
౬౧ ॥ శతక్రతోత్వంత్రిదివం గచ్ఛదేవైస్సహాధునా । ఆగమిష్యామ్యనుపదం
చతురంగబలాన్వితః ॥ ౬౨ ॥ ఇత్యుక్తోదేవరాజోథశీఘ్రమాగమ్యతామితి।

---

లముగలయోదేవాంగుఁడాదేవతలతోఁ గూడినయింద్రునకు రాక్షసులయుద్ధ
మందునీవుసహాయముచేయవలయును - ౫౫ - ఓరాజశ్రేష్ఠుఁడానీవునాలుగం
గములుగలసేనలతోఁగూడినీకుమారులతోడఁగూడికొనిఇంద్రునితోనుదేతల
సంఘములతోనుగూడుకొనిశీఘ్రముగానారాక్షసులనుజయింపుము-౫౬-మ
హేశ్వరునిచేత నిట్లుచెప్పఁబడినవాఁడై యాదేవలరాజు మంచిదని యంగీకా
రవాక్యమునుజెప్పెను - అంతనాశివుఁడు వేయికన్నులుగల యింద్రునిఁగూర్చి
మరలనిట్లనిపలికెను-౫౭- ఓయింద్రుఁడానీవుయుద్ధముచేయనుద్యుక్తుఁడై యీ
దేవాంగమునితోఁగూడఁబొమ్ము - ఆవజ్రదంష్ట్రుఁడు మొదలయినరాక్షసులంద
ఱు జయింపఁబడినవారుకాఁబోదురు - ౫౮ - ఇట్లాశివునిచేతఁజెప్పఁబడినవాఁ
డై యింద్రుఁడుసంతోషించి యాశివునిఁగూర్చి యిట్లనెను - కైలాసపర్వతము
నకునాథుఁడాదేవతలప్రభుఁడామీమాటచేతనన్లెయగును- ౫౯ - ఏరాక్షసులు
మమ్మునెల్లప్పుడుబాధించుచున్నారో వారోడిపోదురు - అనిచెప్పి దేవతలతో
గూడనాయింద్రుఁడు శివునకుమ్రొక్కి యంత నయనచేతసెలవుదీసికొని యా
కొలువుకూటమునుండి దేవాంగమహారాజుతోఁ గూడఁబయటవచ్చెను- తరు
వాతనాదేవాంగమునియింద్రునిఁగూర్చియిట్లనిచెప్పెనుగదా - ౬౦ - ఇంద్రుఁ
డానీవిప్పుడు దేవతలతోఁగూడ స్వర్గమునకుఁబొమ్ము- వెనుకనే నేనునాలుగంగ
ములుగలబలములతోఁగూడుకొనివచ్చెదను-౬౧- ఇట్లుచెప్పఁగానేయంతనా
దేవేంద్రుఁడు దేవాంగునిఁగూర్చి బిరాన రావలయునని చెప్పి సంతోషించిన

దేవాంగముక్త్వాసహసురోయయావాప్తస్త్రివిష్టపం ॥ ౬౩॥ దేవాంగోపితతో
రాజా మోదపట్టణమాసదత్ । బలానాం చతురంగాణాం సర్వేషాంఫణిహా
రకైః ॥ ౬౪ ॥ జ్ఞాపయిత్వాతతోయోగంసమితేరసురైస్సహ । రథవారణప
త్త్యశ్వైస్సగణైస్తైఃకోటికోటిభిః॥ ౬౫॥ వాదిత్రతూర్యనినదై రాజాపుత్రసమ
న్వితః । సమాసదత్తతస్స్వర్గందేవాంగోమితవిక్రమః॥ ౬౬॥ తతఃపురంద
రస్తస్యదేవాంగస్యామితౌజసః । తత్సహాయా నృపతయో యేచాన్యే పటువి
క్రమాః॥ ౬౭ ॥ ఆతిథ్యం కారయామాస తేషాంచైవయథేప్సితం । తస్మిన్నహా
నిదేవేంద్రోయుయుత్సూనాంచరక్షసాం॥ ౬౮॥ అనాగమనమాజ్ఞాయానయ
త్తాంరజనీంసుఖం । తతఃప్రభాతేసర్వేషాం మహేంద్రోమరవల్లభః ॥ ౬౯ ॥
యోగముచ్చారయామాస దేవానాంఫణిహారకైః । తతోభేర్యోప్యహాస్యం
తప్రస్థానస్యాభిసూచకాః ॥ ౭౦ ॥ కృతప్రత్యూషకృత్యాస్తేదేవాఇంద్రముపా
గమన్ । సక్షత్రియశ్చదేవాంగోమహేంద్రంసముపాగమత్ ॥ ౭౧ ॥ యో
గమాజ్ఞాపయామాస సర్వేషాం దేవరాట్నృపః । తతస్సర్వైశ్చ సంభూయ

---

వాఁడై దేవతలతోఁగూడస్వర్గమునకుఁబోయెను- ౬౩- అంతనా దేవాంగరా
జు నామోదపట్టణమునకు వచ్చెను - వచ్చిబంట్రౌతులచేత నప్పుడు రాక్షసుల
తోయుద్ధమునకుఁ జతురంగములను జేర్పవలయునని యాయాకార్యముల య
ధ్యక్షులకుఁదెలిపి లెక్కింపబడనిపరాక్రమముగల దేవాంగమహారాజుతన కొ
డుకులతోఁగూడుకొన్న వాఁడై కోటిరథములతోడనన్ని యేనుఁగులతోడనన్ని
కాలుబలములతోడనన్ని గుఱ్ఱాలతోడనుబయలుదేరి యనేకవాద్యములు వా
యింపఁగా వానినాదములవినుచు స్వర్గముసకుఁబోయెను- ౬౬ - తరువాతనీ
ప్రకారమా దేవాంగరాజుపోయి స్వర్గముచేరఁగానే దేవేంద్రుఁడతనికిని మఱి
యునతనికిఁదోడుగావిచ్చిన మిక్కిలిశౌర్యముగలరాజులకును గోరినపదార్థము
లన్ని తెప్పించి విందుచేయించెను- నాటిదినము దేవేంద్రుఁడు యుద్ధముచేయఁ
గోరురాక్షసులరామినిదెలిసికొని యారాత్రిని సుఖముగాగడపెను - అంతమ
ఱునాఁడు దేవతలకుఁబ్రభువైనయాయింద్రుఁడు వార్తాహరులచేత నెల్లదేవత
లకు నందఱొకటిగాఁజేరవలయునను సమాచారమును జెప్పి యనిపెను - అం
తఃబ్రయాణమునుదెలుపునట్టి నగారాలును వాయింపబడెను - ౭౦ - ఆదేవత
లందఱుప్రాతఃకాలమందు జేయవలయునాహ్నిక క్రియలంజేసికొని వచ్చియిం
ద్రునిదగ్గిరఁజేరిరి - క్షత్రియులతోఁగూడిన యాదేవాంగుఁడునువచ్చి యింద్రు

వజ్రదంష్ట్రపురోగమాః॥ ౨౨॥ ఆగత్య దేవతానీకై స్తుములం చక్రిరేరణం। దానవాశ్చ సురాశ్చైవ తేన్యోన్యం సమజఘ్నిరే॥ ౨౩॥ నానావిధైః ప్రహరణై రథపత్త్యశ్వవారణైః। దేవై శ్శూరై ర్మహేష్వాసై ర్దానవా భృశ తాడితాః॥ ౨౪॥ అభీయయుర్వ్యాఘ్రవక్త్రం ప్రేప్సంత శ్శరణం తదా॥ ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - దేవదానవ సేనాయుద్ధం నామ పంచ దశోధ్యాయః.

శ్రీసూతః॥ విద్రుతేచబలేతస్మిన్ హన్యమానే సమంతతః। మహాబలం మహాప్రాజ్ఞం దేవలం శత్రుతాపనం॥ ౧॥ అభాష్యచైనం మధురమభిసృత్య హ్యభీతవత్। ప్రాహప్రహరతాం శ్రేష్ఠ స్స్మితయుక్తం సమాహ్వయత్॥ ౨॥ రాజన్కమల పత్రాక్ష ప్రధానాయుధవాహన। వజ్రసంహననాచింత్య ప్రధానబలపౌరుష॥ ౩॥ ముష్టి స్పష్టాంగుళిభ్యాంచ వ్యాయతాభ్యాం మహద్ధ

---

నిదగ్గిరఁజేరెను - ౨౧ - అంత దేవేంద్రుఁడు మరలనందఱు చేరవలయునని దండోరావేయించెను-ఇంతలోనావజ్రదంష్ట్రుఁడు మొదలగురాక్షసులన్దఱితో గూడుకొనివచ్చి దేవతలతో సంకులమగు యుద్ధమునుజేసిరి - ఆరాక్షసులును దేవతలునొకరినొకరుకొట్టుకొనిరి- రథములమీదనున్నట్టియుఁగాలుబలములైనట్టి యుగుఱ్ఱపురౌతులైనట్టియు నేనుగులమీఁదనున్నట్టిగొప్పధనుస్సులుగల దేవతలచేతఁబలు తెఱంగులగునాయుధములచేతఁగొట్టఁబడినవారై రాక్షసులునిలువజాలక యప్పుడురక్షకునిఁగోరుచువ్యాఘ్రవక్త్రునిఁగూర్చిపోయిరి - ౨౪ - ఇది బ్రహ్మాండపురాణంబున దేవాంగచరితంబున దేవదానవ సేనలయుద్ధమన్నదిపదియేనవయధ్యాయము.

సూతుఁడు తరువాతికథ నాఋషులకుఁ జెప్పుచున్నాఁడు- ఆసేనకొట్టఁబడుచు నలుప్రక్కలఁ బరుగెత్తఁగా యుద్ధమందుఁ గొట్టెడువారిలో మిక్కిలి శ్రేష్ఠుడై నయాఁరాక్షసుఁడు మిక్కిలిబలముగలయట్టియు మిక్కిలి తెలిసినట్టియు శత్రువులనుదపించునట్టి దేవలునిమృదువుగాఁబిలిచి భయపడనియట్లు సమీపమునకుఁబోయి - చిరునగవుతోఁగూడఁ బిలుచుచునిట్లనిచెప్పెను- ౨-ఓతామరపూరేకులవంటికన్నులుగల రాజా శ్రేష్ఠమైన యాయుధములు వాహనములుగలఁవాఁడా వజ్రమువలె దృఢమైన దేహము గలవాఁడా యెంచగూడని శ్రేష్ఠమైనలావును మగంటిమియుగలవాఁడా- పిడికిలి పట్టుటచేత స్ఫుటముగాఁ దెలియుచున్న వ్రేళ్లుగలనిడుదలై నభుజములచేతఁ బెద్దధనుస్సును డంకా

నుః । దోర్భ్యాం విస్ఫారయన్భాసి మహాజలదవద్భృశం॥ ౪॥ శరవర్షైర్మ
హావేగై రమిత్రానభిధర్షతః । నదన్యంనానుపశ్యామి ప్రతివీరంమహాహవే॥
౫॥ రథద్విరదపత్త్యశ్వా నేకశ్చ ప్రోథయేద్బహూన్ । మృగసంఘా నివార
ణ్యేవిభీర్భీమబలోహరిః॥ ౬॥ మహతారథఘోషేణదివంభూమించనాదయన్ ।
వర్షాంతేసస్య గాం భూమిం భాభిరాదీపయన్నివ॥ ౭॥ సంస్పృశాన శ్శరాం
స్తీక్ష్ణాన్ స్తూణాదాశీ విషోపమాన్ । మయ్యేవై కేనయుధ్యస్వ త్ర్యంబకేనాం
ధకోయథా॥ ౮॥ ఏవముక్త స్తథేత్యుక్త్వా ప్రహస్యైనం సపార్థివః । ఖ
డ్గేనదైత్యరాజంతం వివ్యాధవృషభధ్వజః॥ ౯॥ తం మర్మభేదిభి స్తీక్ష్ణైర్బా
ణై రగ్నిశిఖోపమైః । మర్మస్వభ్య హనత్క్రుద్ధో దేవలం రాక్షసేశ్వరః॥
౧౦ ॥ అథైనంపునరాజఘ్నే నవత్యానిశితైశ్శరైః । సర్వమర్మాణిసంప్రే
క్ష్యమర్మజ్ఞోలఘుహస్తవాన్ ॥ ౧౧ ॥ సగరేంద్రస్సమాకీర్ణో దైత్యేనని

---

రముచేయుచు పెద్దమేఘమువలెమిక్కిలి ప్రకాశించుచున్నావు - ౪ - మిక్కిలి వడిగల బాణవర్షములచేత శత్రువులను దిరస్కరించుచున్న నీకుయుద్ధరంగమందు సరియైనప్రతివీరుని నన్నుఁదప్ప నీకనెవనిఁగాననైతిని - ౫ - తేజులను గాలుబలముల నేనుగుల గుఱ్ఱములనొకఁడై ననేకములయుద్ధమందుఁగొట్టవచ్చును - అట్లుకొట్టుటయరణ్యమందు భయంకరమైన బలముగల సింహము భయపడకయితరమృగములను గొట్టుటవంటిది- ౬ - తేజుయొక్కగొప్పధ్వనిచేత భూమినినాకాశమును శబ్దింపఁజేయుచు వర్షాకాలము వెడలిపోయిన పిమ్మటఁబైరుగలిగియుండు భూమిని గాంతులచేతఁ బ్రకాశింపఁజేయుసూర్యునివలెనంబుల పొదివలన నుండి సర్పములతో సమానములై తీక్ష్ణములై యుండుబాణములను విడుచుచునీశ్వరునితో నంధకాసురుఁడువలెనాతోనొకనితోనే యుద్ధముచేయుము - ౮ - ఇట్లారాక్షసుఁడు చెప్పఁగానే నందిధ్వజముగల యాదేవలుఁడట్లాయనినవ్వి యారాక్షసరాజును ఖడ్గముచేతఁ గొట్టెను - ౯ - అంతనారాక్షసరాజు కోపగించుకొని మర్మస్థానములను జీలుచునట్టియుఁజురుకులై యగ్నిజ్వాలలతోసమానములై యుండుబాణములచేత నాదేవలరాజునుగొట్టెను- ౧౦- మర్మములనుగుర్తెఱిగినట్టియు చేవడిగలయారాక్షసుఁడుమరల నీదేవలునిమర్మస్థానముల నెల్లజూచి తొంబదితీక్ష్ణములైన బాణములచేఁగొట్టెను - ౧౧ - శ్రీమంతుఁడునుసగరాధీశుఁడునగు నాదేవలుఁడారాక్షసుఁడేసినచురుకైన బాణములచేతఁగప్పఁబడి యుద్ధమందుసూర్యుఁడు తనకిర

శితైశ్శరైః । రరాజసమరేశ్రీమాన్రశ్మిమానివభాస్కరః ॥ ౧౨ ॥ తతశ్శరస
హస్రేణ సుప్రయుక్తేన దేవలః । వ్యాఘ్రవక్త్రముపచ్ఛాద్య సింహనాదమ
థావదత్ ॥ ౧౩ ॥ శరైశ్శరాం స్తథాదైత్య స్సంవార్యయుధిదేవలం । లలా
టేభ్యహనత్క్రుద్ధో నారాచేనస్మయన్నివ ॥ ౧౪ ॥ లలాటస్థంతతోబాణం
ధారయామాస దేవలః । యథాశృంగంవనేదృప్తః ఖడ్గోధార యతేద్విజాః॥
౧౫ ॥ తతోదైత్యంరథేరాజా యతమానంపరాక్రమే । త్రిభిర్విద్వ్యాధనారా
చైర్లలాటేవైస్మయన్నివ ॥ ౧౬ ॥ లలాటస్థైస్త్రిభిర్బాణై ర్వ్యాఘ్రవ
క్త్రోవ్యరాజత । ప్రావృష్యపయసాసిక్త స్త్రిశృంగ ఇవపర్వతః ॥ ౧౭ ॥ దై
త్యోథశరసాహస్రైశ్ఛాదయామాసదేవలం । నచైనం కంపయామాస మా
తరిశ్వేవపర్వతం॥ ౧౮॥ తథైవదేవలోయుద్ధే రాక్షసం బహుభిశ్శరైః । నా
కంపయతసంహృష్టో వాయ్వోఘఇవపర్వతం ॥ ౧౯ ॥ తావన్యోన్యం శరైర్ఘో
రైశ్ఛాదయంతౌ మహారథౌ । రథచర్యాగతౌ వీరౌ రేజతుఃపార్థివాసురౌ॥

---

ణములచేతప్రకాశించినట్లుప్రకాశించెను - తరువాతవేయిబాణములనుజక్కగా
ప్రయోగించి యాదేవలుడావ్యాఘ్రవక్త్రునిఁగప్పి యంత సింహనాదముచేసె
ను - ౧౩ - తరువాతరాక్షసుఁడు బాణములచేతనాబాణములనువారించి ద్రో
సికోపగించియుద్ధమందునగునట్లే యాదేవలుని ముఖమందు నారసముచేతఁ
గొట్టెను - ౧౪ - అంతనాదేవలుఁడుముఖమందుంచు నాబాణమునుగానన
మందుఁగావరించిన ఖడ్గమృగము కొమ్మునుధరించినట్లు ధరించెను యాబుషు
లారా - ౧౫ - పిమ్మట రథమందుశత్రువు నాక్రమింపఁబ్రయత్నము చేయుచు
న్న యారాక్షసుని నాదేవలరాజు నగునట్లే మూడునారసములచేత నొసటఁ
గొట్టెను - ౧౬ - నొసటనున్న యా మూడుబాణములచేతఁ నావ్యాఘ్రి
వక్త్రుఁడు వర్షాకాల మందలి యుదకముచేతఁ దడపఁబడిన మూడు
శిఖరములుగలకొండవలెఁ బ్రకాశించెను - ౧౭ - అంతనారాక్షసుడు వేలతర
బడిబాణములచేత నీదేవలుని గప్పెను- అవియన్నియు వాయువు కొండనుగద
లింపలేనియట్లితనిఁగంపింపఁజాలకపోయెను - ౧౮ - అట్లెసంతోషించియున్న
యాదేవలుఁడును బెక్కుబాణములచేత నారాక్షసునిజలప్రవాహము పర్వ
తమును గదలింపఁజాలనితెఱంగునఁ గదలింపఁజాలఁడాయెను - ౧౯ - మహా
రథికులైనట్టియు శూరులైనయారాజును రాక్షసుఁడును రథముమీఁదనుండిరథ
మునీవలనావలఁ బరుగెత్తింపుచు నొకనిమీఁదనొకఁడు పెక్కుమ్ములనేసి కప్పు

౧౦ ॥ ఆదిత్యా వివసందీప్తౌ లోకక్షయకరావుభౌ । స్వరశ్మిభిరివాన్యోన్యం తాపయంతౌశరోత్తమైః ॥ ౧౧ ॥ కృతప్రతికృతేయత్నం కుర్వాణౌచ మహారథౌ । కృతేకృతం ప్రచక్రాతే శరసంఘైరభీతవత్ ॥ ౧౨॥ వ్యాఘ్రావివచ సంగ్రామే చేరతుస్తౌనృపాత్మజౌ । శరదంష్ట్రౌ దురాధర్షౌ చాపహస్తౌభయంకరౌ॥ ౧౩॥ అభూతాం తావదృశ్యౌచ శరజాలైస్సమంతతః । మేఘజాలైరివచ్ఛన్నౌ గగనే చంద్రభాస్కరౌ॥ ౧౪॥ ప్రకాశౌచముహూర్తేన తత్రైవాస్తామరిందమౌ । విముక్తౌ మేఘజాలేన శశిసూర్యౌయథాదివి॥ ౧౫॥ అపసవ్యం తతశ్చక్రే దైత్యేశస్త్రత దేవలం । కిరన్ శరశతైరుగ్రైర్ధారాభిరివ పర్వతం॥ ౧౬॥ సతుతన్మమృషేరాజా శత్రోర్విజయలక్షణం । ప్రతిచక్రేతతో విప్రా శ్శత్రోర్విజయలక్షణం ॥ ౧౭ ॥ దేవలోపితథాచక్రే రథంజాప్యపసవ్యతః । మండలానాం విభాగేషు గతప్రత్యాగతేషుచ॥ ౧౮ ॥ బభూవతుములం

---

చుఁ బ్రకాశించిరి- ౧౦- లోకములను ధ్వంసముచేయును దహించి తమకిరణములచేత నెండకాయు రెండుసూర్యబింబములవలె వారిద్దఱు తీక్ష్ణములైన బాణములచేత నొకని నొకఁడు తపింపఁజేయుచుండెను- ౧౧- మహారథికులైన వారిద్దరొకరు చేయుకార్యమున కొకరు బదులుచేయఁబూనుచు బాణసమూహములచేత నొకనికొకఁడు భయపడక బదులుచేసిరి- ౧౨- పులికోరలవంటి బాణములుగలిగియదలింపగూడనివారు చేతవిల్లులఁబూని భయంకరులై యుండునారాజును రాక్షసరాజును యుద్ధమందుఁ బెద్దపులులవలె సంచరించిరి- ౧౩- ఒక్కొకసారి వారిద్ద ఱొకనిమీఁద నొకఁడు ప్రయోగించిన బాణపరంపరలచేతఁగప్పబడియఁగపడకుండునపుడు మబ్బులచేతఁగప్పఁబడియగపడకుండు చంద్రుఁడును సూర్యుఁడువలెనుండిరి- ౧౪- ఆకాశమందు మేఘపఙ్క్తిచేత విడువబడి ప్రకాశించుసూర్యుఁడు చంద్రుడువలెనే యాయుద్ధరంగమందు బాణములకప్పువిచ్చినప్పుడు వారిద్దఱు ప్రకాశించుచుండిరి- ౧౫- అంతనచ్చటనారాక్షసరాజు నూర్లతరబడిగా బాణములనేసి పర్వతమును ధారావర్షముచేతఁ దడిపినట్లుకప్పుచు నా దేవలుని సప్రదక్షిణముగాఁజుట్టెను- ౧౬- ఆరాజైన దేవలుఁడుతనకుశత్రువైనయారాక్షసుడుజయించుటకు గురుతైనయాపనినిజేయఁగాఁ దానినోర్చి తానునతనికి బదులుగా విజయలక్షణమునుజేసెను- ౧౭- దేవలుఁడు నా రాక్షసుడు చేసినట్లె తనరథముచుట్టు నప్పుడును రాకపోకలయందు నా రాక్షసునకప్రదక్షిణముగా వచ్చునట్లుచేసెను- ౧౮- ఆరాక్షసునకును దేవల

యుద్ధం తయో స్తత్రమహామ్మృధే। చలిత్వా వివిధాన్మార్గా న్మండలస్థానమేవ చ॥ ౨౯॥ శరైః పూర్ణాయతోత్సృష్టై రన్యోన్యమభిజఘ్నతుః। అన్యోన్యస్య వధేయత్నం చక్రతుస్తౌ మహారథౌ॥ ౩౦॥ ఇయేషతుశ్చ విరథం కర్తుమన్యోన్యమాహవే। తతోదైత్యో మహాస్త్రాణి ప్రాదుశ్చక్రే మహాస్త్రవిత్॥ ౩౧॥ తాన్యస్త్రై ర్దేవసమరే ప్రతిజఘ్నే సదేవలః। తతోఘోరం తయోర్విప్రాశ్చాస్త్రయుద్ధమవర్తత॥ ౩౨॥ గ్రహయుద్ధం మహాఘోరం ప్రజానాం హరణేష్వభూత్। తేబాణాస్సమసజ్జంత క్షిప్తాస్తాభ్యాం మహాహవే॥ ౩౩॥ ద్యోతయంతోదిశస్సర్వా స్తీక్ష్ణాస్సైన్యం సమంతతః। బాణసంఘావృతం ఘోరమాకాశం సమపద్యత॥ ౩౪॥ ఉల్కాపాతావృతం యద్వత్ప్రజానాం సంక్షయేద్విజాః। బాణఘాతాచ్చ సంజజ్ఞే తత్రభీకరపావకః॥ ౩౫॥ సవిస్ఫులింగోదీప్తార్చి ర్యోదహద్వాహినీద్వయం। తత్రసిద్ధా మునిశ్రేష్ఠా సంప్రతీతా వచోబ్రువన్॥ ౩౬॥ అతియుద్ధానిసర్వాణి యుద్ధమేతదవర్తత। సర్వాయుద్ధా

---

రాజునకును సంకులమైన యుద్ధమాయెనట్టి యాపెద్దయుద్ధమందు ననేకవిధములైన సర్పగతులను మండలాకారమైన నిలుపులనుజేసి వారిద్దఱు నిండ నాకర్షించి విడువఁబడిన బాణములచేతఁ బరస్పరము కొట్టుకొనిరి - మహారథికులైన వారిద్దఱొకరినొకరు చంపఁ బ్రయత్నముచేసిరి - ౩౦ - యుద్ధమందొకనినొకఁడు రథములేనివానింగాఁ జేయ నిచ్ఛయించిరి - అంత గొప్పయస్త్రములఁ దెలిసిన యారాక్షసుఁడు మహాస్త్రములను గల్పించెను - ౩౧ - ఆదేవలుఁడా మహాస్త్రములనెల్లఁ దన యస్త్రములచేతనే కొట్టివేయుచు వచ్చెను - అంతవారికిద్దఱకు భయంకరమైన యస్త్రయుదయమాయెన యా బ్రాహ్మణోత్తములారా - ౩౨ - అంత నభశ్చక్రమందు జనుల నాశమునకు సూచకమైన గ్రహయుద్ధముకలిగెను. ఆగొప్పయుద్ధమందు వారిద్దఱు వేసినబాణములొకటితోనొకటి పెనుచుకొనెను - ౩౩ - ఆ బాణములాసేనకుఁ జుట్టును దిక్కులకెల్లఁ బ్రకాశముగలుగునట్లు వెలుగుచుండును - అప్పుడాకాశ మాబాణపంక్తులచేతఁ గప్పఁబడి భయంకరమై ప్రజానాశ విషయమై యాకాశమందుఁ గొఱవికట్టెలు కనుపడఁగా నెట్లుండునో యట్లుండెనో బ్రాహ్మణులారా - అక్కడ బాణములొకదానితోనొకటియొఱయుటవలన భయంకరమైన నిప్పుపుట్టెను - ఆనిప్పుకణములెగురుచు మండిజ్వాలలుగలదై రెండుదండ్లనుగాల్చెను - అక్కడసిద్ధులు ఋషిశ్రేష్ఠులు యోగదృష్టిగల వారందఱు నిట్లనిపలికిరి - ౩౬ -

నిచ్చై తస్య కలాంనార్హాంతిషోడశీం ॥ ౩౭ ॥ నై తాదృశం పునర్యుద్ధం భవిష్య
తికదాచన । అహోహోజ్ఞానేనసంయుక్తావుభావుగ్రపరాక్రమౌ ॥ ౩౮ ॥ అహోహో
ధైర్యేణ సంయుక్తౌ వుభౌ పార్థివరాక్షసౌ । ఆహవే యోర్బలంయుద్ధే అ
హోహోఅపికృతాస్త్రతా ॥ ౩౯ ॥ అహావీర్యస్య సామర్థ్య మహోహోసౌష్ఠవ
మేతయోః । స్థితావేతౌహిసమరే కాలాంతకయమోపమౌ ॥ ౪౦ ॥ రుద్రా
ద్వావివసంభూతౌ యథాద్వావివభాస్కరౌ । యమావా విక్రమోద్దామౌ
ఘోరరూపావిమౌరణే ॥ ౪౧ ॥ శ్రూయంతే హీతివై వాచ స్సిద్ధానాం వై ము
హుర్ముహుః । సింహనాదశ్చ సంజజ్ఞే దానవానాందివౌకసాం ॥ ౪౨ ॥ అద్భు
తంచాప్యచింత్యంతద్దృష్ట్వాకర్మ తయోర్మృధే । తౌశూరౌసమరేఘోరావ
రస్పరకృతాగసౌ ॥ ౪౩ ॥ పరస్పరము దీక్షంతౌ క్రోధాదుత్ఫుల్లచక్షుషీ । క్రో
ధరక్తేక్షణౌతౌతు క్రోధ ప్రస్ఫురితాధరౌ ॥ ౪౪ ॥ క్రోధ సందష్టదశనౌ తథైవ

---

మిక్కిలి యుద్ధములనేకములు జరిగినవి యీయుద్ధమునుజరిగెను - అన్నియుద్ధములునీయుద్ధమునకుఁ బదియారింట నొకపాలితోఁ సరిగావు - ౩౭ - ఇఁకమీఁద నెప్పుడునిట్టియుద్ధముకాఁబోదు - ఆహాహా - ఇద్దఱుతెలిసినవారు - ఇద్దఱుభయంకరమైన పరాక్రమముగలవారు - ౩౮ - ఓహోరాజును రాక్షసుఁడు నిద్దఱుధైర్యముగలవారు - వాహ్వాయుద్ధమందేమి వీరిద్దఱిబలము - ఏమివీరిద్దఱియస్త్రప్రయోగకౌశలము - ౩౯ - వాహ్వా వీరిప్రతాపమెంతగట్టిది - వీరిద్దఱు నెంతబుజువైనవారు - వీరిద్దఱు నిలిచియుండఁగా యమునిసంహారించునట్టివాఁడును యముఁడును వలెనే యున్నారు - ౪౦ - ఇద్దఱురుద్రులుపుట్టినట్లుఇద్దఱుసూర్యు లుదయించినట్లున్నారు - యుద్ధమందు భయంకరమైన రూపమునుధరించియుండెను వీరుయములు విక్రమించినట్లున్నారు - ౪౧ - ఆకాశమందుసిద్ధులీప్రకారముమాటలాడుకొనుచుండఁగా నామాటలుపలుమాఱు వినఁబడుచుండెను - ఆశ్చర్యకరమై యిట్టిదనిచింతింపఁగూడని కార్యముల నాయుద్ధమందు వారుచేయఁగా దానిఁజూచి యాకాశమందు రాక్షసులును దేవతలును సింహనాదములుచేసిరి - యుద్ధమందు శూరులును భయంకరులునైన యీయిద్దఱొకరొకరి కపకారము చేసినవారై యొకరి నొకరు కోపముచేత గ్రుడ్లురిమి చూచుచుఁగోపముచేత నెఱ్ఱనికన్నులుగలవారై కోపముచేత నదురుచున్న పెదవులుగలవారై పెదవులఁగొఱుకుచుఁబండ్లఁగొఱుకుచునొకనిమీఁద నొకఁడు బాణవర్షముగురిసి యాబాణవర్షముచేత నాచ్ఛాదిం

దశనచ్ఛదౌ । అన్యోన్యం ఛాదయంతౌ స్మ శరవృష్ట్యా మహాబలౌ ॥ ౪౫ ॥ అన్యోన్యం చహయాంశ్చాపి బబాధాతే పరస్పరం । అథరాజాతు దేవాంగః శ్రీప్రహస్తః ప్రతాపవాన్ ॥ ౪౬॥ ఛిత్వైకేనాస్యయంతారం ధ్వజం ద్వాభ్యాంన్యపాతయత్ । రథ్యాంశ్చచతురోహత్వా చతుర్భిర్భువ్యపాతయత్ ॥ ౪౭॥ అర్ధచంద్రేణబాణేన దైత్యస్యధనురాచ్ఛినత్ । అథైనం ఛిన్నధన్వానం వ్యాఘ్రవక్త్రింసురద్విషం ॥ ౪౮ ॥ జఘానసనిశితైర్బాణైస్త్రిశతైరగ్నిసంనిభైః । సమ్యగావిద్ధ్యదైత్యంతం యతమానం పరాక్రమే ॥ ౪౯ ॥ సుతీక్ష్ణేనాథభల్లేన పూర్ణకృష్టేనభూపతిః । తద్బృహద్వ్యాఘ్రవక్త్రస్య శిరఃకాయాదపాతయత్ ॥ ౫౦॥ వ్యభ్రామిచతతశ్శీర్షం దైత్యస్యసు మహత్తరం । రత్నకుండలసందీప్తం సశిరస్త్రాణకంతథా ॥ ౫౧ ॥ నభోమధ్యాదవపత ద్భానుబింబమివాద్భుతం । తమాలోక్యతతో దైత్యా వ్యాఘ్రవక్త్రింతదారణే ॥ ౫౨॥ భీతాః ప్రదుద్రువుర్దేవాస్తత్వసురానభిదుద్రువుః । సింహనాదశ్చసంజజ్ఞే దే

---

చుచుండిరి - ౪౫ - ఒకరిగుఱ్ఱముల నొకరు మిక్కిలిబాధపెట్టిరి - అంతచేవడిగలిగి ప్రతాపముగలిగియుండు నా దేవాంగరాజొకబాణముచేత నీరాక్షసునిసారథినినటికి రెండుబాణములచేతఁ గొడిస్తంభమును బడఁగొట్టెను నాలుగుబాణములచేత రథమునకుగట్టియున్న గుఱ్ఱములనాల్గింటెనినటికి సామియందుఁబడఁద్రోచెను - ౪౭ - అర్థచంద్రబాణముచేత నారాక్షసుని వింటినినటికెను - పిమ్మటనటికబడిన విల్లుగల యావ్యాఘ్రవక్త్రుఁడను రాక్షసుని మిక్కిలిమెఱుకుగా నిప్పవలె నుండునట్టి మున్నూరు బాణములచేత నా దేవలుఁడు కొట్టెను - శత్రుజయమందుఁ బ్రయత్నముచేయుచున్న యా వ్యాఘ్రవక్త్రినిఁ జక్కఁగాఁగొట్టె పిమ్మటనా దేవలుఁడు చుఱుకైనయొకబాణముచేతఁ బెద్దదైన యావ్యాఘ్రవక్త్రునితల నతని శరీరమువలననుండి పడఁగొట్టెను- ౫౦- అంతమిక్కిలిపెద్దదైనట్టియు మణిమయములైన కుండలములచేతఁ బ్రకాశింపఁజేయఁబడినట్టియుఁ గిరీటముతోఁగూడినట్టి యారాక్షసుని శిరస్సు నభోభాగమువలననుండిపడుచు సూర్యబింబమువలెఁ బ్రకాశించుచు నాశ్చర్యకరముగాఁదిరిగెను - తరువాతరాక్షసులందఱుయుద్ధమందు దేవలునిచేతఁగొట్టఁబడినయావ్యాఘ్రవక్త్రునిఁ జూచిభయపడి పఱువెత్తిరి - దేవతలు రాక్షసులఁదరిమిరి- దేవతలలోమిక్కిలిగొప్పసింహనాదముకలిగెను - ౫౩- సమర్థమైనపరాక్రమముగల యాదేవాంగుని దేవేంద్రుఁడుగొప్పచేసెను - ఇది బ్రహ్మం

వేషు సుమహత్తరః॥ ౫౩॥ అపూజయద్దేవరాజో దేవాంగంపటువిక్రమం॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే- దేవాంగచరితే-వ్యాఘ్రవక్త్రవధోనామషోడశోధ్యాయః.

శ్రీసూతః ॥ హతేతతోవ్యాఘ్రవక్త్రే రాక్షసేశే మహాబలే । రాక్షసామర్దితాస్తేన దేవాంగేనామితౌజసః॥ ౧॥ విపులం భయమాపన్నా వజ్రదంష్ట్రముపాగమన్ । భ్రాతరం నిహతం దృష్ట్వా వజ్రదంష్ట్రోసురేశ్వరః॥ ౨॥ విద్రావ్యమాణంసైన్యంచ దేవలేనతపోధనాః । శోకక్రోధసమావిష్టో భ్యధావత్సగరేశ్వరం॥ ౩॥ దేవాంగోపి తతో రాజా వజ్రదంష్ట్రం సమభ్యయాత్ । తయోస్సమభవద్యుద్ధంఘోరరూపంజయైషిణోః ॥ ౪ ॥ మహేంద్రవృత్రయోర్యద్వ త్ఖరరాక్షససింహయోః । వవర్షబహుధాదైత్య శ్శరవృష్టిం మహీశ్వరే॥ ౫॥ దర్శయన్కౌశలం యుద్ధే ప్రావృషీవపయోధరః । నాకంపయతరాజానంవాత్యోఘ ఇవపర్వతం॥ ౬॥ తాంబాణ వృష్టింసహసా వ్యపోహ్యసగరేశ్వరః । వివ్యాధనిశితైర్బాణై రాక్షసంతంహసన్నివ ॥ ౭ ॥ సోతివిద్ధో

---

డ పురాణంబున దేవాంగచరితంబున వ్యాఘ్రవక్త్రుని జంపుట యన్నది పదియారవయధ్యాయము.

సూతుఁడు పిమ్మటికథ నాఋషులకు జెప్పుచున్నాఁడు - తరువాతమిక్కిలిబలవంతుఁడైన యావ్యాఘ్రవక్త్రుఁడను రాక్షస శ్రేష్ఠుఁడు కొట్టఁబడఁగానే యాదేవాంగరాజుచేత మిక్కిలి పరాక్రమవంతులైన రాక్షసులందఱుకొట్టఁబడి మిక్కిలి భయపడినవారై వజ్రదంష్ట్రునినాశ్రయించిరి - ఓబ్రాహ్మణులారా - అంతనా వజ్రదంష్ట్రుఁడు చచ్చిన తనయన్నను దేవాంగునిచేతఁదరమఁబడుచున్న సేననుజూచి దుఃఖముతోడను గోపముతోడను గూడినవాఁడై సగరేశ్వరుఁడైన యాదేవలునిఁ దరమెను - ౩ - అంతనాదేవాంగరాజును వజ్రదంష్ట్రాసురు నెదురించెను - ఒకనినొకరు జయింపఁగోరుచున్నవారిద్దఱకుభయంకరమైన యుద్ధమాయెను - ౪ - వారియిద్దఱి యుద్ధము వృత్రాసురునకింద్రునకును జరిగినయుద్ధమువలెను ఖరాసురునకు సింహమునకుజరిగిన యుద్ధమువలెనుండెను - అప్పుడా రాక్షసుఁడుదేవలరాజునందుఁ బెక్కువిధముల బాణములనుగురిసెను - ౫ - వానకాలమందు మేఘమువర్షించినట్లు యుద్ధమందునేర్పు నగుపఱుచుచున్న యారాక్షసుఁడు పర్వతమును జలప్రవాహము కదలింపఁజాలనియట్లు దేవలునిగదలింపఁజాలకపోయెను - సగరేశ్వరుఁడైన యాదేవలుఁడా బాణవర్షమును శీఘ్రముగాఁ దొలఁగఁద్రోసి

బలవతాశుశు భేరుధిరోక్షితః। వర్షాసు నిర్ఝరసాన్వో మహీధ్ర ఇవభాసురాః॥
౯॥ తతః క్రుద్ధో మహావీర్యో రాక్షసో భృశతాడితః। ప్రత్యవిధ్యస్స దేవాంగం
శరైరాశీవిషోపమైః॥ ౯॥ అనేకైస్సారథిం ద్వాభ్యాం ధ్వజమేకేన చాహనత్।
పునర్వ్యద్వాస్యనిటలం త్రిభిర్బాణైరథానదత్॥ ౧౦॥ లలాటస్థై స్త్రిభిర్బా
ణైశ్శుశుభే సగరేశ్వరః। సనిర్ఝరః క్షరద్రక్త స్త్రికూటఇవపర్వతః॥ ౧౧॥
తతః క్రుద్ధో మహేష్వాసో మండలీకృతకార్ముకః। వివ్యాధ నృపతిశ్చైనం త్రిస
ప్తత్యా శరోత్తమైః॥ ౧౨॥ ధనురేకేన చిచ్ఛేద ధ్వజమేకేన పత్రిణా। చతుర్భి
శ్చతురో వాహాన్ శక్త్యా తస్య దురాత్మనః॥ ౧౩॥ అర్ధచంద్రేణ స శిరో యాతు
కాయాదపాతయత్। పునశ్శరశతైర్దివ్యై స్తిలశో వ్యధమద్రథం॥ ౧౪॥ పు
నర్వివ్యాధ సహసా చాగ్నికల్పైశ్శరోత్తమైః। సచ్ఛిన్నధన్వా విరథో భగ్నా

నవ్వుచున్న యట్టిచుఱుకైన బాణములచేత నారాక్షసునిఁ గొట్టెను- ౭- ఓబ్రా
హ్మణులారా - బలవంతుఁడైన యా దేవలునిచేత నారాక్షసుఁడు మిక్కిలి కొ
ట్టఁబడినవాఁడై నెత్తుటిచేతఁ దడపఁబడి వానకాలమందు సెలయేటి ప్రవా
హముగల పర్వతమువలెఁ బ్రకాశించెను - ౮ - అంతమహాబలముగలయారా
క్షసుఁడు మిక్కిలి కొట్టఁబడి కోపగించినవాఁడై సర్పములతో సమానములైన
యనేక బాణములచేత దేవాంగుని మరలఁ గొట్టెను - ౯ - రెండుబాణములచే
త సారథిని నొకబాణముచేత ధ్వజమును గొట్టుచు మరల మూఁడుబాణముల
చేత నితని నొసటిని గొట్టి తరువాత సింహనాదము చేసెను - ౧౦ - అట్లతనిచే
తనాటంబడిన మూఁడు బాణములు నొసటియందుండఁగా నా బాణములతో నెత్తు
రుగారుచున్న దేవాంగుఁడు సెలయేటి ప్రవాహముతోఁ గూడిన మూఁడుకొ
మ్ములుగల పర్వతమువలెఁ బ్రకాశించెను- ౧౧- గొప్ప ధనుస్సులుగలయా దేవాం
గరాజు నంతగోపించుకొన్నవాఁడై ధనుస్సును వలయాకారముగా వంచి డె
బ్బదిమూఁడు బాణములచేత నీరాక్షసుని గొట్టెను - ౧౨ - మఱియుం దన సా
మర్థ్యముచేత నాదుర్మార్గుని ధనుస్సు నొకబాణము చేతను ధ్వజము నొక
బాణముచేతను నాలుగు బాణములచేత నాలుగు గుఱ్ఱములను నఱికెను- ౧౩-
అర్ధచంద్రబాణము చేత నారాక్షసుని శరీరమునుండి తలను బడవేయక మర
ల శ్రేష్ఠములైన నూరు బాణముల నతని రథమును నువ్వుగింజంత తునియలౌన
ట్లు కొట్టెను - ౧౪ - మరల శీఘ్రముగా నిప్పువంటి శ్రేష్ఠములైన బాణముల
చేత గొట్టెను - ఆరాక్షసుఁడు నఱకఁబడిన ధనుస్సు గలవాఁడై రథములేనివాఁ

శ్చాహతసారథిః ॥ ౧౫ ॥ భృశంవిద్ధోరక్తసిక్తస్సపుష్పఇవకింశుకః । చకంపే
దానవోవిప్రావాతధ్వస్తఇవద్రుమః ॥ ౧౬ ॥ తతోరోషసమావిష్టో వజ్రదం
ష్ట్రోమహాబలః । అభ్యధావద్గదాపాణిర్దండపాణిరివాంతకః ॥ ౧౭ ॥ తమా
యాంతంగదాహస్తంప్రవిధ్యనిశితైశ్శరైః । తతోవజ్రమయైర్బాణైర్ముష్టిమా
త్రావశేషితాం॥ ౧౮॥ ఛిత్వాగదాంరణశ్లాఘీ దృప్తసింహఇవానదత్ । జ
గర్జురమరాస్సర్వే నెదుర్వాద్యగణాస్తతః ॥ ౧౯ ॥ సదానవోనష్టగదో దృ
ష్ట్వాదిక్షునిరాయుధః । ఉత్పాట్య హేమకూటస్య ఘనశృంగం మహాబలః॥
౨౦॥ హస్తేధృత్వాచరాజాన ముపాగమ్యాబ్రవీదిదం । భోభోరాజన్ తిష్ఠ
తిష్ఠక్షణంమాగాఃపురోమమ॥ ౨౧॥ నిర్ఘాతకోటితుల్యస్యశృంగస్యాస్యమహీ
యసః । అమోఘక్షేపణాద్ఘోరాత్ కుశలోసినృపర్షభ॥ ౨౨॥ ప్రోథయిష్యా
మిశృంగేణ సరథం సానుయాయినం । ఇంద్రస్తవసహాయేన యోస్మానోపి
భయతీహవై ॥ ౨౩॥ నిర్భయ స్సహగీర్వాణై స్సభయ స్సపలాయతాం । హ

---

డై గుఱ్ఱములుపోయి సారథిపోయి మిక్కిలికొట్టఁబడి పూచినమోదుగుచెట్టు
వలెనెత్తుటిచేతఁ దడపఁబడి గాలిచేతఁగొట్టబడిన చెట్టువలె వడఁకెను - ౧౬ -
అంతమిక్కిలిబలముగల యావజ్రదంష్ట్రుఁడుకోపముతోఁగూడినవాఁడై గదను
జేతఁబట్టుకొని దండమును జేతఁబూనినయముఁడువలెఁ బైఁబడెను- ౧౭- అం
తయుద్ధమునుశ్లాఘించునట్టియాదేవలుఁడు గదనుజేతఁబూనివచ్చుచున్న యా
రాక్షసునిఁ దీక్ష్ణములైన బాణములచేతఁ జక్కఁగాఁగొట్టి యంత వజ్రమయ
ములైనబాణములచేత నారాక్షసునిచేతిగదను బిడికిటఁబట్టుకొన్న మట్టుకు మి
గులునట్టునఱికి క్రొవ్విసింహమువలెగర్జించెను - అంతదేవతలందరు గర్జిం
చిరి - వాద్యములన్ని మ్రోసెను - ౧౮ - అధికబలవంతుఁడైన యారాక్షసుఁ
డుగదపోయినవాఁడై యాయుధములేనివాఁడై దిక్కులఁజూచి హేమకూట
పర్వతముయొక్క పెద్దశిఖరమును బెఱికి చేతఁబట్టుకొని రాజుదగ్గరకుఁబోయి
యిట్లనిపలికెను - ఓరాజా పోకుము పోకుము క్షణముసేపు నాయెదుటనిలువు
ము- ౨౧- ఓరాజశ్రేష్ఠుఁడా కోటిపిడుగులతోఁసమానముగా గొప్పదైనయీశి
ఖరమున్నదే దీనినేను విసరుదును- అట్లువిసరుట వ్యర్థముపోదిప్పుడు గదా నీనే
ర్పుచూడవలయును- ౨౨- ఇప్పుడునీరథము నీపరివారమంతటితోఁగూడ నిన్ని
శృంగముచేతఁ బొడిచెదను - నీసహాయముచేత నింద్రుఁడిప్పుడిప్పుడు దేవత
లతోఁగూడినవాఁడై భయములేక మమ్ముఁబొడుచుచున్నాఁడుగదా - అతఁడు

త్వావిజయమాపన్నో వ్యాఘ్రివ క్త్రిం మమానుజం॥ ౨౪॥ ప్రాప్తవా న్నివపు లంగర్వంవ్యపనేష్యామితంతవ । భ్రాతుర్వ్యసనమగ్నోహం హత్వాత్వామి హసంగరే॥ ౨౫॥ విశల్యశ్చభవామ్యద్య ప్రహృష్టో భీషయన్ సురాన్ । వ స్త్రిణి నాదదోస్మాకం లగ్నేస్మాభిః కుతోవ్రజేః॥ ౨౬ ॥ భవంతం రక్షితాకో మేపురః క్వేతోగమిష్యసి । ఇత్యుక్త్వాదానవశ్శృంగం చిక్షేపాస్మిన్మహత్తతః॥ ౨౭॥ హాహాకారోమహానాసీ త్తదాసైన్యే దివౌకసాం । స్వస్త్యస్తు దేవలా యేతితదాసిద్ధాబభాషిరే॥ ౨౮॥ రాజాతదభ్రివిధ్యాయద్దృష్ట్వాశీఘ్రింమహా మతిః । వజ్రబాణాన్ స్తతస్తస్మిన్ స్తత్యాజపటువిక్రమః॥ ౨౯॥ చూర్ణీకృత్య శరైర్దివ్యైః క్షణేనోర్వ్యాం న్యపాతయత్ । తస్య దృష్ట్వాద్భుతం కర్మ స శ్వేతత్రసురాద్విజాః॥ ౩౦॥ విస్మయం పరమం ప్రాపు స్సాధు సాధ్వితిచాబ్రు వన్ । శృంగం విష్టభ్యతద్రాజా శరై రాశీవిషోపమైః॥ ౩౧॥ విద్వ్యాథదానవం ధీరస్సర్వాంగేషుహసన్నివ । యేచతస్యానుగాదైత్యా స్సర్వాన్ స్తాన్సమతా

---

భయపడి పరుగెత్తిపోవును జూచుము - నాతమ్ముఁడైన వ్యాఘ్రివక్త్రినిఁజంపి జయమునుబొందినవాఁడవై మిక్కిలి గర్వించితివి ఆగర్వమును నీకునేనుబోఁ గొట్టఁగలను - తమ్ముఁడు చచ్చిన వ్యసనమందు మునిగియున్నాను నేనునిన్ను యుద్ధమందుఁజంపి సంతోషించి దేవతలను భయపఱుచుచు మనోవ్యథలేని వాఁడనుగాఁగలను నీవుమాకుదోవతులనీవైతివి గదా - ఇప్పుడుమాచేతఁ జి క్కితి వింకనెక్కడపోఁగలవు - ౨౬ - నాయెదుటనిన్ను రక్షించువాఁడెవ్వఁ డు - ఇక్కడనుండి యెక్కడఁబోగలవు - ఇట్లుచెప్పియంతనారాక్షసుఁడా పెద్ద శిఖరము నితనిమీఁదవేసెను - ౨౭ - అప్పుడు దేవతలయొక్క సేనయందలి వారందఱు గట్టిగా హాహాయనిరి - అప్పుడుసిద్ధులు దేవలునికొఱకు శుభము గలుగవలయునని పలికిరి - ౨౮ - మహాబుద్ధిశాలియైన యాదేవలరాజాశ్శృం గమాకాశమార్గమందువచ్చుచుండఁగాజూచి యంతఁదానియందు వజ్రమయ ములైన బాణములనుబ్రయోగించెను- ౨౯- ఇట్లనేకములైన బాణములను బ్రయోగించి వానిచేత నాశ్శృంగమునుబొడిచేసి భూమిమీఁదఁద్రోసెను - ఓ బ్రాహ్మణులారా యప్పుడా దేవతలంద ఱతని యాయాశ్చర్యకరమైన కా ర్యమునుజూచి మిక్కిలి యాశ్చర్యమును బొంది లెస్సలెస్స యనిరి - దేవల రాజా శ్శృంగమునుబాణములను బోలుబాణములచేతఁ దిరస్కరించినప్పుడునే యారాక్షసుని దేహమందన్ని యంగములయందుఁగొట్టెను . మఱియునతనికి

డయత్ ॥ ౩౨॥ భారవాహం ధనుర్ధృన్వన్కాలాంతకసమాకృతిః । అలాతచక్రప్రతిమం భ్రామయ న్స్యందనంనృపః॥ ౩౩॥ సంచ్ఛాద్య గగనం బాణైః శ్ఛిత్వాశీర్షాణ్యనేకశః । స్వర్ణపుంఖై శ్శిలాధౌతైః కంకపత్రైర్మహాబలః॥ ౩౪॥ దైత్యా న్విద్రావయామాస దిక్షుసర్వాసుభూసురాః । శార్ఙ్గశాపధరోవిష్ణుర్యథైవ ద్రావయేద్యుధి ॥ ౩౫ ॥ తథైవ సమహేష్వాసో ద్రావయామాస దానవాన్ । తేహన్యమానాస్సమరే దానవా భృశవిహ్వలాః॥ ౩౬॥ ప్రాణత్రాణపరాస్సర్వే దుద్రువుశ్చదిశోదశ । వజ్రదంష్ట్రస్తురాజా నమశక్తో యోద్ధుమాహవే॥ ౩౭॥ కల్పయిత్వా మహామాయాం పీడయామాస దేవతాం। అద్రివృష్టిం మహాఘోరా మవర్ష ద్దేవతాబలే॥ ౩౮॥ అతినీలా మహామేఘా బహువిద్యుద్గణాకులాః । గాఢాంధకారం కుర్వంతః ప్రాదురాసన్రణాంగణే॥ ౩౯ ॥ వవర్షు ర్బహుళాంవృష్టిం పాషాణాశనిభీకరాం । మహోల్కాభి శ్శోషయంతి గర్జంతశ్చభయంకరం॥ ౪౦॥ అవిచ్ఛిన్నానిచాంబూని వవర్షుస్తేమహాఘనాః । తదాంధకారస్సుమహాన్ సంజజ్ఞే చామరాంగణే॥ ౪౧॥ ప్ర

---

సహాయులైన రాక్షసులెవరున్నారో వారినందఱను గొట్టెను - ౩౨ - భారమునువహించునట్టి దృఢమైన యాకృతిగలవాఁడై కొరవికట్టెల చక్రమువలె రథమునుద్రిప్పుచు నారాజు పెక్కుబాణములచేత నాకాశమునుగప్పి బహుశిరస్సులను నఱికి బంగారుపుంఖములుగలిగి కపూరశిలాజిత్తువలెఁ దెల్లఁగాఁ దళతళలాడుచున్న బాణములచేత రాక్షసులనందఱ నన్నిదిక్కులకుఁ దఱమెనో బ్రాహ్మణులారా - శార్ఙ్గధనుస్సును జేతఁబూనిన విష్ణువుయుద్ధమందు రాక్షసుల నేరీతినిదోలునో యారీతినా దేవలుఁడు రాక్షసులనందఱను దఱమెను- ఆరాక్షసులందఱు యుద్ధమందుఁగొట్టఁబడుచు మిక్కిలిపరవశులై ప్రాణములను గాపాడుకొనుటయం దాసక్తులై పదిదిక్కులఁబడి పఱుగెత్తిరి - వజ్రదంష్ట్రుఁడా యుద్ధమందు దేవలరాజును నిగ్రహింపఁజాలని వాఁడై గొప్పమాయనుగల్పించి దేవతలను బీడించెను - మిక్కిలిభయంకరమైన కొండలవానను దేవతలదండునందువర్షించెను- ౩౮- అప్పుడాయుద్ధరంగమునందుమిక్కిలినల్లనివియు పెక్కుమెరుపులగుంపులతో గూడినవియు కటికిచీకటిని జేయుచున్న మబ్బులగపడెను - ౩౯ - ఆమబ్బులురాలచేతనుపిడుగులచేతను భయంకరమైనయధికవర్షమును గురిసెను - భయంకరమగు నట్లురుముచుగొప్పకొరవికట్టెలచేత నాసేనలశోషింపజేయుచుండెను - ౪౦ - ఆగొప్ప మేఘములె

కంపయన్ సురానీకం వవౌవా యుర్భయానకః । ఉల్కాభిరశనీపాతైర్ద్రా
నవస్యది వాకసః ॥ ౪౨ ॥ ఆర్తనాదాన్ భృశంచక్రుర్దీనా స్తత్రరణాజిరే । శ్రు
త్వాతదా ర్తవచనా న్యసురో బహుధానదన్ ॥ ౪౩॥ అదృశ్యః పీడయామాస
మాయయాతాన్ముహుర్ముహుః । దేవాంగోథ నృపశ్రేష్ఠో మాయాంధౌమజ్జత
స్సురాన్ ॥ ౪౪ ॥ ఉజ్జిహీర్షురదృశ్యంతంజిగీషుర్దానవంఖలం । శివదత్తంచ
శత్రుఘ్నం ధ్వజం దైత్యేష్వపాతయత్ ॥ ౪౫॥ సధ్వజస్తా వసురీంసేనాం ప్రా
విశత్తేనచోదితః । వ్యపోహ్యమాయాం దైత్యస్య జఘానబహుధాసురాన్ ॥
౪౬॥ ఆజఘ్నుర్దానవాన్ తత్ర వృషభాఃకోటికోటయః । ఖురైర్విషాణైర్లాం
గూలైర్ద్రావయంత స్తతోద్విజాః॥ ౪౭॥ పర్వతాశ్చ మహాసర్ప సింహవ్యా
ఘ్రీభయంకరాః । మహోగ్రా అపి భేరుండా శ్శరభావ్యా మహామృగా ॥
౪౮ ॥ ఉల్కాశని మహాపాతా భీషణాభూతసంహతిః । ప్రవిశ్యదానవీం సే
నాం ఘోరరూపామహాబలాః॥ ౪౯ ॥ అదంతో భర్త్సయంతశ్చ దహంతశ్చ

---

డతెగని నీళ్లను వర్షించెను - అప్పుడాకాశమందు మిక్కిలి చీకటికలిగెను-
౪౧ - అప్పుడు భయంకరమైనవాయువు దేవతల సేనలనెల్ల గదలింపుచు విస
రెను - దేవతలందరునాయుద్ధరంగమునందు నారాక్షసునిచేత గలిగిన కొరవిక
ట్టెలచేతనుపిడుగులచేతను భయపెట్టబడినవారై దీననాదములజేసిరి - ఆరా
క్షసుడువారల ఆయార్తనాదమును విని పెక్కువిధముల సింహనాదములు జే
యుచుతానువారల కగపడకమాయచేత వారల బలుమారు బాధపెట్టెను -
అంతనారాజశ్రేష్ఠుడగు దేవాంగుడు మాయాసముద్రమునందు మునుగుచు
న్న దేవతలనుద్ధరింపదలచినవాడై కానరాకున్నయాదుష్టాత్ముడగు రాక్షసుని
గెలువదలచినవాడై శివునిచేతనీబడినదియు శత్రువులధ్వంసముజేయునదియ
గుధ్వజము నారాక్షసులమీదవిడిచెను - ౪౫ - ఆదేవలునిచేత ప్రేరేపింపబడి
నయాధ్వజము రాక్షసులసేనను బ్రవేశించి- ఆరాక్షసునిమాయనుబోగొట్టి రా
క్షసులను బెక్కువిధములగొట్టెను- ౪౬ - ఆధ్వజమునందు గొట్లకోట్లవృషభ
ములు పుట్టిగిట్టలచేతనుకొమ్ములచేతనుతోకలచేతను రాక్షసుల దరమితరిమి
గొట్టెనయా బ్రాహ్మణులారా - ౪౭ - మరియు నాధ్వజమునందు గొప్పసర్ప
ములచేతను సింహములచేతను పెద్దపులులచేతను భయంకరములైన పర్వత
ములును - అత్యుగ్రరూపములైన గండభేరుండములును - శరభములుమొద
లగు గొప్పమృగములును - కొరవికట్టెలు పిడుగులు మొదలగు మహోత్పాత

సమంతతః । దశంతస్తాపయంతశ్చ ప్రోథయంతో సురాన్బహూ॥ ౫౦॥ వినాశం ప్రాపయామాసు వృషభధ్వజసంభవాః । హతశేషాస్తతో దైత్యావజ్రదంష్ట్రేణవై సహ ॥ ౫౧ ॥ భీతావిద్రావ్యసర్వేపి స్వపట్టణముపాగమన్ । హతపుత్రో హతామాత్యోమృతానీకో హతానుజః॥౫౨॥ దైత్యశ్శోకభయావిష్టస్సోపలాయతభూసురాః । దేవాంగస్తుతతో రాజా సేంద్రో హర్ష-సమాకులః॥ ౫౩॥ సపుత్ర స్స్వబలైర్దేవై రాగత్య త్రిదివాలయం । మహేంద్రేణాభ్యనుజ్ఞాత ఆమోదపురమాసదత్ ॥ ౫౪॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - ధ్వజప్రభావ రాక్షసపరాభవో నామ సప్తదశోధ్యాయః.

శ్రీసూతః॥ తతో దైత్య పతిర్వజ్రదంష్ట్రశ్శోకభయాకులః। శ్వసన్మహాహివద్దీర్ఘం విలలాపసుతాన్ప్రతి ॥ ౧ ॥ విలప్య బహుధాపుత్రా న్భ్రాతౄన్బంధూం స్తతోసురః । అసహ్యమానో దైత్యశ్చవిలపన్ రోషమావిశత్ ॥ ౨॥

---

ములును - భయంకరమైన బూచులగుంపు నివి యన్నియుగలిగి యారాక్షససేననుజొచ్చిమిక్కిలిబలముగలవై భయంకరములైన రూపములుగలవై యాసేననుదినుచునుగాల్చుచు నంతటగొరుకుచు నుడికించుచు రాక్షసులను మిక్కిలిపాడుచుచు నాశమును బొందించెను- ౫౦- తరువాత జావగా మిగిలినరాక్షసులువజ్రదంష్ట్రునితోడగూడి భయపడినవారై పరుగెత్తి అందరుతమపట్టణమునకుబోయిరి- అంతనావజ్రదంష్ట్రుడనురాక్షసుడు కొడుకులును మంత్రులునుసేనలును దమ్ములునుజావగా దుఃఖముతోడను జయముతోడను గూడినవాడై పరుగెత్తెనోయి బ్రాహ్మణులారా - అంత నా దేవాంగ మహారాజు మిక్కిలిసంతోషపడినవాడై యింద్రునితో గూడినవాడై తన కొడుకులతోను దనసేనలతోనుగూడికొని దేవతలతో గూడ స్వర్గమునకువచ్చి యాదేవేంద్రునితో నేనునాపట్టణమునకుబోయెదనని చెప్పి యతనిసమ్మతిపరచి యామోదపట్టణమునకుబోయిచేరెను- ౫౪ - ఇది బ్రహ్మాండపురాణంబున దేవాంగచరితంబున ధ్వజమహిమచేత రాక్షసులోడుటయన్నది పదియేడవయధ్యాయము.

సూతుడుపిమ్మటికథనాఋషులకుజెప్పుచున్నాడు - అంతదానవులకెల్ల బ్రభువగు నావజ్రదంష్ట్రుడు దుఃఖముతోను భయముతోను గూడినవాడై గొప్పసర్పమువలె నిట్టూర్పువిడుచు కొడుకులగూర్చి దుఃఖించెను - ౧ - కొడుకులనుదమ్ములను చుట్టాలను గూర్చియేడ్చి అంత నారాక్షసుడు సహింపనివాడై కోపమునుబొందుచు తన బావమరదియగు విద్యుత్కేశుని యింటికి దాను

స్యాలస్యవిద్యుత్కేశస్యస్వయంమందిరమాగమత్ । తమాగతంతతోదృష్ట్వా విద్యుత్కేశస్ససత్వరః ॥ ౩ ॥ ప్రత్యుత్థాయాసనం చార్ఘ్యం దత్వా సముపవేశయత్ । ఉపవిష్టోవిషణ్ణాస్యః క్షణం ధ్యాత్వాచదానవః ॥ ౪ ॥ ఆలోక్యవిద్యుత్కేశస్యవదనం చేదమబ్రవీత్ । విద్యుత్కేశ ప్రియసఖా సురశ్రేష్ఠ మహాబల ॥ ౫ ॥ కుర్యాసన్వేకకంకార్య మిత్యుక్తోథసరాక్షసః । అబ్రవీద్విస్మయావిష్టో దైత్యేశంతంతపోధనాః ॥ ౬ ॥ స్వామిన్ యదుచ్యతేస్మాకం త్వయా భర్త్రాసురేశ్వర । తద్వయంకరవామైవ హ్యాజ్ఞాపయితుమర్హసి ॥ ౭ ॥ ఏవ మాభాషితస్తేన వజ్రదంష్ట్రస్తతోసురః । తహీనసుష్ఠ్వితిచబ్రూత్వా పునరేవమువాచహ ॥ ౮ ॥ మయైకముచ్యతేద్యాహో శ్రూయతా మసురర్షభ । జ్ఞాతం ఖలుపురావృత్తం యత్తదేవత్వయాసఖే ॥ ౯ ॥ దేవాంగేన కృతం సర్వం భవాన్వేదహ్యసంశయం । వ్యాఘ్రవక్త్రోసురశ్రేష్ఠ స్సర్పజిహ్వశ్చవీర్యవాన్ ॥ ౧౦ ॥ సూర్యకోపశ్చాగ్నికోపో ధూమ్రనేత్రో మహాబలః । మకరాక్షః ఖడ్గజిహ్వో

---

బోయెను - అంతనావిద్యుత్కేశుడు తనయింటికివచ్చిన యావజ్రదంష్ట్రునిజూచి యతిత్వరతోలేచి యెదురుగబోయి పిలిచికొనివచ్చి మంచిపీఠమునిచ్చి కూర్చుండబెట్టెను - ఆయాసనమందు గూర్చున్న యావజ్రదంష్ట్రుడు దుఃఖపడుచున్న ముఖముగలవాడై క్షణముసేపు ధ్యానముజేసి తనమరదియగు విద్యుత్కేశుని మొగమునుజూచి యిట్లనిపలికెను- ౪- ఓయినాకు ప్రియస్నేహితుడవైన విద్యుత్కేశుడా రాక్షసశ్రేష్ఠుడా మిక్కిలి బలముగలవాడా ఒకకార్యముజేయుము-అనియిట్లుచెప్పగానారాక్షసుడువిస్మయముతోడగూడినవాడై దానవనాయకుడగు నావజ్రదంష్ట్రునిగూర్చియుత్తరముజెప్పెనయా తపస్సేధనముగాగల ఋషులారా - ౬ - మహాప్రభో రాక్షసరాజా మాకుప్రభువగు నీవేదిజెప్పుచున్నావో దానిమేముజేయుదుము కాబట్టి సెలవీవచ్చును- ౭- ఇట్లాతనిచేజెప్పబడినవాడై యంతనావజ్రదంష్ట్రుడను రాక్షసుడట్లయిన మేలనిజెప్పి మరలనిట్లనిపలికెను - ౮ - ఓయిరాజశ్రేష్ఠుడా నేను నేనొక మాటజెప్పెదను వినుము ముందుజరిగిన సమాచారమేదిగలదో యదియంతయు నీకుదెలిసినదే గదా- ౯- దేవాంగుడుచేసినకార్యమంతయు నీవుసందేహములేక యెరుగుదువుగదా రాక్షసశ్రేష్ఠుడగు వ్యాఘ్రవక్త్రుడును- బలవంతుడగు సర్పజిహ్వుడును - సూర్యకోపుడు నగ్నికోపుడును - మిక్కిలిబలముగల ధూమ్రనేత్రుడును మకరాక్షుడును - ఖడ్గజిహ్వుడును - వీరందరు యుద్ధరంగమందు బర్రాక్రమిం

నిహతాస్సమరాంగణే॥ ౧౧॥ దేవాంగేనచ విక్రమ్య తత్పుత్రై ర్విక్రమోద్ధ
తైః। యజ్ఞాంతకశ్చనిహతో యుద్ధోన్మత్తోరణోత్సుకః॥ ౧౨॥ యేచాస్మాకంప్ర
వీరాస్తేసర్వేచవినిపాతితాః। పుత్రాన్భ్రాతౄన్ హతాన్దృష్ట్వా శోకోమ
ర్మాణికృంతతి ॥ ౧౩ ॥ అహం కృతశ్చవిరథ స్తాడితశ్చభృశంరణే। రాజ్ఞాపహా
సితశ్చైవ దేవానామగ్రత స్తదా॥ ౧౪॥ ధ్వస్తమాయోనష్టబలో దేవలస్యో
గ్రతేజసః। వార్షభేణ మహోగ్రేణ ధ్వజేనోత్పాతకారిణా ॥ ౧౫ ॥ ప్ర
వామిస్మరణాద్భీత స్సింహాద్దుష్టమృగోయథా। ఇంద్రస్తువిజయంప్రాప్య దే
వాంగస్య సహాయతః॥ ౧౬ ॥ హృష్టోదృప్తశ్చనిఖిలై ర్దేవైస్స్వర్గపురం య
యౌ। మహానసదృశోవజ్రీ ఆశ్రిత్యనగరేశ్వరం ॥ ౧౭ ॥ అజేయోభూదిహా
స్మాభి ర్మహాబలపరాక్రమైః। హంతదైవకృతంయత్నం లంఘితుం కేనశక్య
తే ॥ ౧౮ ॥ ఇంద్రస్యవిజయోయుద్ధే స్మాకంతేనపరాజయః। శోచామిభోః
కింకరోమి తావేవానుస్మరన్ముహుః ॥ ౧౯ ॥ దైవమేవ పరం మన్యే ధిక్పౌరుష

---

చిన దేవాంగునిచేతజయింపఁబడిరి- పరాక్రమముచేతగర్వించియున్నయతనికొడుకులచేత యజ్ఞాంతకుడును కలహమందుత్సాహముగలయుద్ధోన్మత్తుడును- వీరిద్దరుచంపఁబడిరి- ౧౨- మరియు మనలో మిక్కిలి వీరులుగా నుండువారెవరుగలరోవారందరుచంపఁబడిరి - కొడుకులచావును దమ్ములచావునుజూడగా గలిగినదుఃఖమునాహృదయమర్మములనుగోయుచున్నది - ౧౩ - నేనురథములేనివాడనుగా జేయబడితిని - యుద్ధమందుమిక్కిలికొట్టబడితిని - దేవతలయెదుట నప్పుడా రాజుచేత నపహాసము జేయబడితిని భయంకరమగు పరాక్రమముగలదేవలునియొక్క మిక్కిలిభయంకరమై మహావిలయమునుజేయుచున్న వృషభధ్వజముచేత నామాయయెల్లధ్వంసమాయెను- నాసేనయంత నాశమునొందెను- ౧౫- దానిస్మరింపగానే భయపడి నేనుదుష్టమృగము సింహముజూడగా భయపడిపరుగెత్తునట్లు పరుగెత్తుచున్నాను - ఇంద్రుడో యనిన - నతఁడు దేవాంగమహారాజుతోడ్పాటువలన గెలుపునుబొందిసంతసించి గర్వించినవాడై యల్లదేవతలతోడగూడి స్వర్గపట్టణమునకుబోయెను - ఇంద్రుఁడుదొడ్డవాడతనికెవడును సరిగాడు - నగరేశ్వరుఁడగు దేవలుని నాశ్రయించి మిక్కిలి బలము పరాక్రమముగల మనకిచట గెలువరాని వాడుగానాయెను - అయ్యోదైవముచేసినయత్నము నతిక్రమింపనెవనికిశక్తియున్నది- ౧౮- యుద్ధమం దింద్రునకుగెలుపు నతనిచేతమనకు బరాజయమునుగలిగెనని యారెంటినిదలచియేమ

మనర్థకం । త్రిలోకవిజయీశూరోవ్యాఘ్రవక్త్రో మమానుజః ॥ ౨౦ ॥ నిపాతి
తోయతస్తేన దేవాంగేనరణేబత । తస్మాదప్యస్య సర్గస్య వ్యసనస్య సుహృద్వ
ర ॥ ౨౧ ॥ అస్తిప్రతిక్రియాకాచిద్ఘటనీయాత్వయైవసా । అస్మాకమస్య శోక
స్య దేవలోమూలమేవహి ॥ ౨౨ ॥ కథంవిశకలీకార్య స్సఏవదనుజోత్తమ । వి
నాస కపటోపాయా దసాధ్యస్సార్వలసర్వథా ॥ ౨౩ ॥ సతుధ్వజ ప్రభావేనా
స్మాభిర్నసులభాయతే । అవాచ్యఃశంభుదత్తస్య ధ్వజస్య మహిమారణే ॥ ౨౪ ॥
వినాతస్మా త్క్రియాన్నైవ రథేచసదేవలః । ఉపాయేనాపహర్తవ్యః కా
పటేనధ్వజస్సఖే ॥ ౨౫ ॥ తస్మిన్నపహృతేస్మాభి ర్వధ్యఏవసదేవలః । తస్మాత్త్వం
కౌశలేనైవమాయాయాదనుజోత్తమ ॥ ౨౬ ॥ తంధ్వజం నగరేశస్య శీఘ్ర
మాహర్తుమర్హసి । ఏవం కృతేకృతంసర్వ మస్మాకంతు ప్రయోజనం ॥ ౨౭ ॥
ఇత్యుక్తోవజ్రదంష్ట్రేణ విద్యుత్కేశ స్తథేతిచ । ఆజిహీర్షు ర్ధ్వజం దైత్యో

---

లునూరుదుఃఖపడుచున్నాను యేమిచేయుదును- ౧౯- దైవమే దొడ్డదనితలవ
బడును ప్రయోజనములేనిపురుషప్రయత్నమునుగాల్పనా యెందువలననగాని
ప్పుడుదైవబలముచేతగదా మూడులోకములనుజయించునట్టిశూరుడైననాత
మ్ముడువ్యాఘ్రవక్త్రుడు యుద్ధమందు నా దేవాంగునిచేతగొట్టబడెను అయ్యో
ఓయి స్నేహితశ్రేష్ఠుడా - అట్లయిన నిప్పుడు మనకు క్రొత్తగాగలిగిన యీ
వ్యసనమునకు నొకప్రతీకారమున్నది యదినీచేతనేకాదగినది మనకీదుఃఖమున
కుమూలము దేవలుడేగదా- ౨౨- ఓయిరాక్షసశ్రేష్ఠుడా యెట్లయిన నతనినే
ఛేదింపవలయును - ఓ బావమరదీ అన్నివిధములటక్కులుజేసి యతనిసాధింప
వలయునేగాక మఱియొకవిధమున నతనిసాధించుటమనకుగష్టము- ౨౩- అత
నిదగ్గరనుండుధ్వజముయొక్క మహిమచేత నతనిసాధించుటమనకు సులభము
గాదు ఈశ్వరునిచేతనీబడిన యాధ్వజమునకు యుద్ధమందుగలుగు ప్రభావమిం
తయంతయని వచింపగూడనిది- ౨౪- అదిలేకున్న రెండురథములనెక్కివచ్చిన
డా కపటోపాయముచేతనాధ్వజము నపహరింపవలయును దాని నపహరింప
గానే యప్పుడె దేవలుడు మనచేత గట్టబడినవాడే కాబట్టి యోరాక్షసోత్తము
డా నీపునీమాయయొక్క నేర్పుచేత నానగరనాథుని ధ్వజమును దేవలయును
ఇట్లుచేసినమన కార్యములన్నియుగూడివచ్చుచు- ౨౭- వజ్రదంష్ట్రుచేనీప్రకార
ముచెప్పబడినవాడై యావిద్యుత్కేశుడట్లయనియొప్పుకొని ధ్వజమునందేనిశ్చ
యించినవాడై యాదేవలుడుండు నామోదపట్టణమునకుబోయి దేవలమహారా

యత్రస్థాపిసదేవలః॥ ౨౮॥ ఆమోదపురమాసాద్య దేవలం వాక్యమబ్రవీత్।
భోదేవలనృపశ్రేష్ఠ దయాళోమితవిక్రమ ॥ ౨౯ ॥ దేవరాజస్యదూతోహం
నమస్తే సగరేశ్వర । ఆజ్ఞయాతస్యశక్రస్యా గతోస్మి హాతవాంతికం॥ ౩౦॥ అ
సంఖ్యతాంగతైర్దైత్యై ర్వజ్రదంష్ట్రో మహాసురః । ఆగత్యపునరద్యాస్మా
న్యోధయత్యకుతోభయః ॥ ౩౧ ॥ పూర్వేద్యుర్భవదీయస్య బలస్యభృశదా
రుణే । ప్రాప్తశ్రమస్యసమరే రాక్షసై రుగ్రవిక్రమైః ॥ ౩౨ ॥ మావైతవశ్ర
మఇతిస్వయమేవశతక్రతుః । జగామసాకసార్ధం యోద్ధుమమరైస్సహభూ
పతే ॥ ౩౩ ॥ అనేకబలసంయుక్తం వజ్రదంష్ట్రం నిశాచరం । వజ్రీసంయుధ్య
మానోమాం ప్రేషయామాసతేంతికం ॥ ౩౪ ॥ దహంతం శాత్రవాన్యుద్ధే క
శానివహుతాశనం । వార్షభంతేధ్వజంరాజన్ నానయేతిత్వయానఘ॥ ౩౫॥
తత్తం ధ్వజం మహారాజ శీఘ్రం మేదాతుమర్హసి । యేనధ్వస్తాభవేయుస్తే
దానవాయుద్ధదుర్మదాః ॥ ౩౬ ॥ మహిమ్నాతస్యపూర్వేద్యుర్ధ్వజస్యచమ

---

జునుగూర్చి యిట్లనిపలికెను- ఓరాజశ్రేష్ఠుడైన దేవలుడా- మిక్కిలిదయగల
వాడా - మితిలేని పరాక్రమము గలవాడా - సగరేశ్వరుడా - నేనుదేవేంద్రు
నిదూతుడను - నీకున్రమొక్కెదను ఆదేవేంద్రునియుత్తరవు చొప్పున నేనునీ
దగ్గరకువచ్చినవాడనైతిని - ౩౦ - ఆవజ్రదంష్ట్రుడను గొప్పరాక్షసుడు లె
క్కలేని రాక్షసులను గూడదోడుకొని మరల నిప్పుడువచ్చి యెవనివలననూ
భయములేనివాడై మామీద యుద్ధముజేయుచున్నాడు నిన్నటిదినముమిక్కి
లి భయంకరమైన యుద్ధమందు నీసేనయంతయు భయంకరమైన పరాక్రమ
ముగలరాక్షసులచేత శ్రమపడియున్నది నీవును యుద్ధశ్రమమును బొందియు
న్నావు కాబట్టి నీకుమరల శ్రమమును గలుగజేయగూడదని దేవేంద్రుడు రా
క్షసులతోగూడ యుద్ధముజేయను దానేపోయెనయారాజా - ౩౩ - బహుసే
నలతోగూడినవజ్రదంష్ట్రుడను రాక్షసునితో యుద్ధముజేయుచు నింద్రుడు న
న్ను నీదగ్గరకుబంపెను - ౩౪ - ఎండుపొదలను నిప్పుకాల్చినట్లు శత్రువులను
గాల్చునట్టి నీధ్వజమును నీచేత దీసికొనిరమ్మని యింద్రుడుచెప్పెనయా మహా
నుభావా - ౩౫ - కాబట్టి యోదేవలమహారాజా ఆధ్వజమును త్వరితముగా
నాకీవలయును అట్టిచ్చిన యుద్ధమందు చెడుక్రొవ్వుబట్టిన యా రాక్షసులంద
రు దానిచేత ధ్వంసముచేయబడి పోవుదురు - ౩౬ - నిన్నటిదినమా మిక్కి
లి మహిమగలధ్వజముయొక్క ప్రభావముచేత గతసచిత్తులును మాయల నే

హతాత్మనః । నిహతాబహవో దైత్యాః క్రూరా మాయావినః ప్రభో ॥ ౩౭ ॥ హతశేషాః కుమతయో వజ్రదంష్ట్రిం సుదుర్మతిం । పురస్కృత్యాగమన్యోద్ధుం పునరస్మాన్నృపర్షభ ॥ ౩౮ ॥ సర్వేపి తే పరిధ్వస్తా భవేయుర్యేన సంయుగే । దేహి మే సత్వరం రాజన్ ధ్వజ స్తమరిసూదనం॥ ౩౯॥ ఇత్యాకర్ణ్య రితం వాక్యం దూతేన కుటిలేన తు । సత్యమేవేతి నిశ్చిత్య దేవాంగో దైవయోగతః॥ ౪౦॥ దదౌ ధ్వజం తత స్తస్మై వజ్రిణః ప్రియకామ్యయా । తమాదాయ తతో రాజ్ఞో ధ్వజం హృష్టో నిశాచరః॥ ౪౧॥ కపటస్సహసా వీరమాహేంద్రం సముపాగమత్ తమానీతధ్వజం విప్రా వజ్రదంష్ట్రో సురేశ్వరః॥ ౪౨॥ తోషయామాస వచనైః ప్రహృష్టః ప్రణయాన్వితైః । శ్రావయిత్వా తతో యోగం సమితే రాక్షసేశ్వరః॥ ౪౩॥ సర్వేషామపి దైత్యానాం చతురంగబలాన్వితం । నిర్యాధ్య నాకద్వారాణి దేవేంద్రం యోద్ధుమాహ్వయత్ ॥ ౪౪॥ తదా గమనమాజ్ఞాయ దేవేంద్రోమర్షపూరితః । అసురైస్సురః క్రుద్ధో యోధయన్మునిపుంగ

---

ర్చిన వారునగు రాక్షసులు పెక్కండ్రు చంపబడిరయా మహాప్రభో - ౩౭- చావగా మిగిలిన దుష్టబుద్ధిగల వారందరు తెలివిమాలిన యావజ్రదంష్ట్రుని- ముందుజేర్చుకొని మరలమాతో యుద్ధము జేయవచ్చిరయా రాజవర్యుడా- ౩౮- ఏధ్వజముచేత యుద్ధమందా రాక్షసులందరు ధ్వంసముచేయబడి పోగలరో అట్టి శత్రునాశకరమైన ధ్వజమును శీఘ్రముగానాకిమ్మయా రాజా- ౩౯- ఇట్లా కపటదూతునిచే జెప్పబడినమాటను దేవాంగమహారాజు విని దైవగతివలన నిజమేయనియెంచి యింద్రుని కిష్టమును జేయు కోరికచేత నాధ్వజము నతనికొరకిచ్చెను- అంతనా కపటదూత వేషదారియయిన రాక్షసుడు దేవలమహారాజుయొక్క ధ్వజమునుదీసుకొని సంతోషించినవాడై శీఘ్రముగా వీరమాహేంద్రపట్టణమునకుబోయెను - అంతనాధ్వజమును దెచ్చిన యారాక్షసునిజూచి వజ్రదంష్ట్రాసురుడు మిక్కిలిసంతోషించినవాడై ప్రీతితో గూడినవాక్యములచే తనతని సంతోషపరిచెనయా బ్రాహ్మణులారా - ౪౨ - అటుపిమ్మట నారాక్షసనాథుఁ డెల్లరాక్షసులకు యుద్ధమునకు నాలుగంగములసేనలు నొకటిగాఁ గూడవలయునను సమాచారమును వినిపించి స్వర్గముయొక్క వాకిళ్ల నన్నిటి నడ్డగించి దేవేంద్రునియుద్ధముచేయఁ బిలిచెను - ౪౪ - అతనిరాకను దెలిసి దేవేంద్రుఁడు కోపమతిశయించినవాడై దేవతలతోఁ గూడ నారాక్షసులతో యుద్ధముచేసెనయా ఋషిశ్రేష్ఠులారా - ౪౫ - అప్పుడా దేవేంద్రుఁడు దేవ

వాః॥ ౪౫ ॥ దేవలాగమనార్థీచ దూతమామోదపట్టణం । ప్రేషయామాసస
హసా సగత్వా తత్కృతంతతః॥ ౪౬॥ కథయామాసనాకేశ వ్యాదిష్టం దేవ
లస్యతత్ । దేవాంగనృపశార్దూలయుద్ధంభవతిదానవైః ॥ ౪౭ ॥ ఇంద్రస్య
ప్రేషయామాస సమామద్యతవాంతికం । శ్రుత్వైవమన్మఖాదేత చ్ఛీఘ్రి
మాగమ్యతామితి॥ ౪౮॥ విలంబోనైవ కార్యస్తు శీఘ్రమాగంతుమర్హసి। ఇ
తీరితంతద్దూతేన సందేశమమరేశితుః॥ ౪౯॥ శ్రుత్వాచవిస్మయంప్రాప్య మ
న్యేచాత్మగతంనృపః । కిమిదంజిష్ణునాపూర్వం ధ్వజఆనీయతామితి॥ ౫౦॥ ఆగ
మ్యతామితీదానీం దూతస్సంప్రేషితఃకుతః । అమందాయతవాతస్యధ్వజస్య
మహిమారణే॥ ౫౧ ॥ అహ్వాసాస్వాదాసదనోన్వా దేవరాజం మమధ్వజః॥
నిర్జిత్యాపహృతోదేవాః కిన్నుదైత్యైర్మహాబలైః॥ ౫౨॥ సందిహన్నితిదే
వాంగస్సపుత్రస్సబలంతతః । జగామసహసాధీరో యత్రవజ్రీసనిర్జరః ॥ ౫౩ ॥
ఏతస్యాగమనాత్పూర్వం దేవలస్యమహీపతేః । తత్ర దేవైర్వజ్రదంష్ట్రోయో

---

లుఁడువచ్చిన నీరాక్షసులనందఱయుద్ధముననతిసులభముగాజయింపవచ్చునుగనుక నతఁడు రావలయునను కోరికగలవాఁడై యామోదపట్టణమునకు దూతనుబంపెను- ఆదూతపోయి యారాక్షసుఁడువచ్చిచేసినకార్యమును దేవేంద్రుఁడుచెప్పినదాని నాదేవలునితోఁ జెప్పెను - ఓరాజశ్రేష్ఠుఁడైన దేవాంగమహారాజా యిప్పుడింద్రునకు రాక్షసులతో యుద్ధమగుచున్నది- ఆయింద్రుఁడిప్పుడు నన్ను నీయొద్దకుఁబంపెను - నానోటివలన నీమాటవినఁగానే యాలస్యముచేయక రావలయునని చెప్పెనయా యింద్రుఁడు - ౪౮ - ఇప్పుడాలస్యముచేయగూడదు శీఘ్రముగారావలయునయాస్వామీ - ఇట్లా యింద్రునిదూత చెప్పిన యింద్రునిసమాచారమువిని దేవాంగమహారాజు తనలోఁదాను మిక్కిలియాశ్చర్యపడెను - ఇదియేమి యింద్రుఁడు ముందుధ్వజమునుదెమ్మనెను - ఇప్పుడు నన్ను రమ్మని దూతనుబంపెనే దీనికిఁగారణ మేడిగానుండును - మిక్కిలి యధికమైన యాధ్వజముయొక్క శక్తియుద్ధమందు జబ్బుపడిపోయనా - లేక ధ్వజమునాదుగాని యింద్రునిదిగాదు గనుక నతనిబొందకపోయెనా - మిక్కిలిబలవంతులైన రాక్షసులొకవేళ యింద్రునిజయించి ధ్వజము నపహరించుకొని పోయిరేమో - అనియీప్రకారమా దేవాంగమహారాజు సంశయపడుచుఁ దనకొడుకులతోఁగూడినవాఁడై మిక్కిలిధైర్యవంతుడుగనుక సేనలతోఁ గూడనింద్రుడు దేవతలతోఁ గూడినవాఁడై యెక్కడనుండెనో యక్కడికిఁబోయెను- ౫౩-

ధయిత్వాసదానవః॥ ౫౪॥ ధ్వజం తత్యాజ సైన్యేషుదేవానాం పాపకర్మకృత్ ।
సధ్వజఃపూజితోయేన ముక్తబంధో భవేద్యుధి॥ ౫౫॥ నిహంతి శత్రూన్ స్త
స్యైవ ప్రజాదండధరోయథా । వజ్రదంష్ట్రిణ సంప్రార్థ్య పూజితో విధివ
ద్ధ్వజః॥ ౫౬॥ ముక్తబంధోనిలింపేషు క్షోభయామాసతాన్ సురాన్ । తతో
భీతాఃపలాయంత ధ్వజధ్వస్తా స్సురాద్విజాః ॥ ౫౭ ॥ విద్రుతేషుచ సేంద్రేషు
మర్దితేషు సురేష్వథ । దేవాంగఃప్రావిశద్రాజా సబల స్తద్రణాంగణం॥ ౫౮॥ ధ్వ
జంతముపసంహృత్య దైత్యేశే గంతుముత్సుకే । దృష్ట్వాతంకుపితోరాజా శర
వర్షైరవాకిరత్ ॥ ౫౯॥ తతస్సర్వే దైత్యగణాః పరివృత్యచదేవలం । నానా
విధప్రహరణైస్సమంతాత్పర్యవారయన్ ॥ ౬౦ ॥ అముంచద్వజ్రదంష్ట్రిస్తం
ధ్వజం సైన్యేషుభూపతేః । సముక్తబంధ స్తత్సైన్యం దదాహమునిపుంగవాః॥
౬౧ ॥ భీషయన్ద్రావయామాస క్షత్రియాంశ్చదిశోదశ । తేహన్యమానా స్సమ
రేధ్వజేనక్షత్రియాభృశం॥ ౬౨॥ భీతాఃప్రదుద్రువుస్సర్వే కుపితేనైవమృత్యు

---

ఈదేవలరాజు రాకకంటె ముందే యావజ్రదంష్ట్రిసురుఁడక్కడ దేవతలతో
యుద్ధముచేసి పాపకృత్యములఁజేయునట్టి యారాక్షసుఁడు దేవతల సేనలమీఁ
దనాధ్వజమునువిడిచెను - ఆధ్వజ మెవనిచేతఁ బూజింపఁబడి యుద్ధమందు వి
డువబడునో యతనిశత్రువులనే జనులను యమధర్మరాజు సంహరించినట్లు సం
హరించును - అట్టియాధ్వజమును వజ్రదంష్ట్రిఁడు పూజావిధాన ప్రకారము
పూజించి దేవతలమీఁదవిడిచెను గనుకనాదేవతలనందఱిని గలతపఱచి యనే
కవిధములఁ గష్టపెట్టెను - తరువాతనాదేవతలందఱు నాధ్వజముచేతఁగొట్టఁబ
డినవారై పఱుగెత్తిరయా బ్రాహ్మణులారా- ౫౭- ఇంద్రునితోఁగూడిన యాదే
వతలందఱు కొట్టఁబడి పఱుగెత్తినవారుకాఁగా నటుపిమ్మట నాదేవాంగరాజు
తనసేనలతోఁగూడ నాయుద్ధరంగమునుజొచ్చెను- ౫౮. ఈలోపల నారాక్ష
సరాజు ధ్వజమునుపసంహరించి పోనిచ్ఛగలవాఁడుకాఁగా నతనిఁజూచి యా
దేవలరాజుకోపగించుకొని బాణములనతనిమీఁదవర్షించెను- ౫౯- అంతనా
రాక్షస సంఘములన్నియు నాదేవలునిఁజుట్టుకొని పలుతెఱఁగుల యాయుధ
ములచేతనలుప్రక్కలగప్పిరి- ౬౦- అంతనావజ్రదంష్ట్రిఁడారాజు సేనలమీఁద
నాధ్వజమునువిడిచెను - ఆధ్వజ మతనిచేత విడువఁబడినదై యాదండునంత
యుగాల్చెనోయి ఋషిశ్రేష్ఠులారా - ౬౧ - ఆధ్వజము క్షత్రియుల నందఱి
నుబెదరింపుచుఁ బదిదిక్కులలోఁబడి పఱుగెత్తునట్లుతఱిమెను - యుద్ధమందా

నా। ఏకమేకోనచాపశ్యత్ పలాయంతదిశోదశ॥ ౬౩॥ దవానలాదివమృగాః
ప్రాణత్రాణపరాయణాః। తతస్సర్వప్రయత్నేన పరివృత్యచదేవలం॥ ౬౪॥ స
ర్వాయుధానిదేవాంగేజహ్రుస్సర్వే నిశాచరాః। భర్త్సయంతో భృశంక్రుద్ధా
వజ్రదంష్ట్రపురోగమాః॥ ౬౫॥ రథమారురుహుః కేచిదభీశూన్జగృహుః పరే।
బబంధుస్సారథించాన్యే జఘ్నుశ్చైవ యుగంధరం॥ ౬౬॥ అపరే జగృహు
ర్దైత్యా దేవాంగస్యమహీభుజః। చాపంబభంజురన్యేతు తూణీంచాన్యేనిశా
చరాః॥ ౬౭॥ ఆయుధానిచసర్వాణి చిక్షిపుస్సర్వతస్తథా। అపరే ప్రోథయా
మాసుర్హయానపి యుగంధరం॥ ౬౮॥ నిగృహీతస్తదా దైత్యై ర్దేవాంగస్తు
మహాబలైః। విమోచయితుమాత్మానం నశశాకసభూసురాః॥ ౬౯॥ నావై
క్షతతదైకంహి స్వంవీరంసమరస్థలే। తతో బధ్వా భృశంచైనం వజ్రదంష్ట్రో
రథేస్వకే॥ ౭౦॥ ధ్వజంతముపసంహృత్య సంభూయాఖిలదానవైః। విజయం

---

ధ్వజముచేత మిక్కిలికొట్టంబడుచున్నవారై యాక్షత్రియులు మృత్యువునకుఁ
గోపమువచ్చినపక్షమం దెట్లుభయపడుదురో యాప్రకారము భయపడి పఱు
గెత్తిరి - ఒకనినొకఁడు చూడలేదు పదిదిక్కులకుఁ బఱుగెత్తిరి- ౬౩- కారుచి
చ్చురవులుకొన్నప్పుడు మృగములన్నియుఁ దమప్రాణములఁ గాపాడుకొనుట
యందెంత యాసక్తిగలవై యుండునో యాప్రకారము దమ ప్రాణముల ద
ప్పించుకొనుటయందాసక్తులై యుండిరి - అంతనారాక్షసులందఱన్నివిధములై
న ప్రయత్నములచేతను దేవలునిఁ జుట్టుకొని యాదేవలునియందుఁ దమయా
యుధములనన్నిటినిఁ బ్రయోగించిరి - వజ్రదంష్ట్రుఁడు మొదలగు నారాక్షసు
లందఱు బెదరింపుచు మిక్కిలి కోపపడినవారై కొందరా దేవలునిరథమునెక్కి
రి - మఱికొందఱా రథముపగ్గములనుబట్టుకొనిరి - ఇఁకఁగొందఱు సారథినిఁబ
ట్టిరి కొందఱు దండెకొయ్యను విరఁగొట్టిరి - ౬౬ - కొందఱా దేవాంగరాజు
యొక్కధనుస్సునుదీసికొనిరి - మఱికొందరు దానిఁబట్టివిరిచిరి - ఇఁకగొందఱం
బులపొదులనుబెఱికిరి - ౬౭ - అట్లే కొందఱతని యాయుధములనన్నిటినిదీసి
నలుప్రక్కల విసరివిసరివేసిరి - మఱికొందఱు గుఱ్ఱములను దండెకొయ్యను
బొడిచిరి - ౬౮ - అప్పుడా దేవాంగమహారాజా మిక్కిలిబలముగలరాక్షసు
లచేతఁ దిరస్కరింపఁబడినవాఁడై తన్నువిడుపించుకొనుట శక్తిలేనివాఁడాయె
నయాబ్రాహ్మణోత్తములారా - ౬౯ - అప్పుడా యుద్ధరంగమందా రాజునకు
దనవాఁడైన వీరుఁడొకఁడైనన గపడలేదు - అంతనావజ్రదంష్ట్రాసురుఁడితనిఁ

పరమంలబ్ధ్వా స్వపురం ప్రయయౌముదా॥ ౨౧॥ దివ్యాంగస్తు మహాబాహు ర్నిమగ్నోదుఃఖసాగరే। చింతయన్బంధనంఘోరం దేవాంగస్యామితౌజసః॥ ౨౨॥ సభ్రాతృక స్తతస్సైన్యైస్స్వైరామోదపురం యయౌ। దివ్యాంచమాతరం ప్రాజ్ఞోదేవదత్తాం యశస్వినీం॥ ౨౩॥ ఆశ్వాసయ్య ప్రజాస్సర్వా యత్నేనాస్తసమంత్రిభిః। వీరమాహేంద్రమాసాద్య వజ్రదంష్ట్రోథసాసురః॥ ౨౪॥ సన్మానం కారయామాస దేవాంగస్యైవభోద్విజాః। తతోదైత్య పతిర్భూపం దేవాంగం వస్త్రకారిణం॥ ౨౫॥ సమాధాయవచోభిశ్చ మంత్రిభిస్సహకౌశలైః। సఖ్యం కృత్వాతేనసాకం దేవలాయస్వపుత్రికాం॥ ౨౬॥ పద్మినీం ప్రదదౌతస్మై సుందరీంచసులక్షణాం। తాంజగ్రాహాగ్నివచనా ద్దేవాంగఃపటువిక్రమః॥ ౨౭॥ అగ్నిదత్తేతి విఖ్యాతా పద్మినీసాయశస్వినీ। తస్యాముత్పాద

---

జక్కుఁగాఁ దనరథమునకుఁ గట్టివేసి యాధ్వజము నుపసంహరించి యెల్లరాక్షసులతోఁగూడి శ్రేష్ఠమైనగెలుపునుబొందినవాఁడై సంతోషముతోఁదనపట్టణమునకుఁబోయెను- ౨౧- అంతమిక్కిలి భుజబలముగల యాదివ్యాంగుఁడు దుఃఖమను సముద్రమందుమునిఁగినవాఁడై యమితమైనపరాక్రమముగల దేవాంగునియుద్ధమందు శత్రువులు పట్టికట్టుటను దలఁచుకొనుచుఁ దనతమ్ములతోఁగూడినవాఁడై తనసేనలతోడ నామోదపట్టణమునకుఁబోయెను- పోయి మిక్కిలి దెలిసిన యాదివ్యాంగుఁడు మహాకీర్తివహించిన దివ్యమగు దనతల్లిదేవదత్తనుబ్రజలనందఱనూరడించి మంత్రులతోఁగూడజాగ్రత్తతోనుండెను- అంత నావజ్రదంష్ట్రాసురుఁడు రాక్షసులతోఁగూడ వీరమాహేంద్రపట్టణమునకుఁ బోయి దేవాంగునకు మిక్కిలి సన్మానము చేయించెనయా బ్రాహ్మణులారా- అంత నా రాక్షసరాజు వస్త్రములనేయునట్టి యాదేవాంగ మహారాజును మిక్కిలిచతురులగుతనమంత్రులతోఁగూడననేకములైన ప్రియపుమాటలుచెప్పి సమాధానపఱచి యా దేవలునితో స్నేహముచేసినవాఁడై సౌందర్యముగలదియుమంచిభాగ్యసూచకములగు లక్షణములుగలదియుఁ బద్మినీజాతి స్త్రీయునగు తనకూతు నా దేవలుని కొసఁగిచ్చెను- అంత నగ్నిహోత్రుఁడు నాపెనుగ్రహింపుమని యాదేవాంగ మహారాజుతోఁ జెప్పఁగా నధికపరాక్రమవంతుఁడైన యాదేవాంగుఁ డాకన్యకనుగ్రహించెను- ౨౭- అంతగీర్తిగల యాపద్మినియగ్నిదత్తయని ప్రసిద్ధివహించెను ఆదేవలుడాపెయందు శ్యాలుడని హలుడనిబలుబనిపేర్లుగల ముప్పూరుకోటుకుల దగదగప్రకాశించుచున్న తేజస్సు

యామాస స్త్రీః పుత్రాన్ సుతేజసః॥ ౭౮॥ శ్యాలో హాలో బలశ్చేతి వర్ధంతేతే దినేదినే। తేషాంచ వాయనం కర్తా భ్యాసయామాస దేవలః॥ ౭౯॥ తైరేవ పుత్రైర్వస్త్రాణి రాక్షసానామదాపయత్। దేవలస్తుతతశ్శ్రీమాన్ ధ్వజమాదాయ వీర్యవాన్॥ ౮౦॥ ప్రేషితో రాక్షసేనస్వ స్వపట్టణముపాగమత్। తతః కైలాసమగమ ద్దేవలః సేవితుం శివం॥ ౮౧॥ శివోదృష్ట్వావచుకోపాస్మి న్దేవలే పార్వతీప్రియః। దుర్బుద్ధేత్వం ధ్వజం దివ్యం దానవాయవితీర్యమే॥ ౮౨॥ దేవానహింసీర్నిఖిలానవివేకసమాహితః। తస్మాత్త్వంత్యక్తమహిమా గచ్ఛవిద్యాధరోభవ॥ ౮౩॥ ఇతిశప్తశ్శంకరేణ దేవాంగస్తుతతో ద్విజాః। ఆమోదపురమాసాద్య స్వవృత్తాంత మథావదత్॥ ౮౪॥ తతో దేవాంగరాజస్య దేహోహా లింగమభూత్తదా। ఆమోదపట్టణేఖ్యాతో రామలింగేశ్వరాజయా॥ ౮౫॥ దేవాంగతనయశ్శ్రీమాన్ దివ్యాంగోసుతవిక్రమః। పూజయన్ రామలింగేశం పాలయామాస మేదినీం॥ ౮౬॥ ఇతిశ్రీ బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - దేవాంగావతారపరిపూర్తిర్నామాష్టాదశోధ్యాయః.

---

గలవారిని బుట్టించెను - వారుదినదినానకు వృద్ధిబొందుచుండిరి తరువాతనా దేవలుడు వారలకునేతపనిని జక్కగానేర్పెను ఆకొడుకులు నేసిన వస్త్రములనే రాక్షసులకిప్పించెను - తరువాత సకలసంపదలుగలిగి పరాక్రమముగల యాదేవలుడు తనధ్వజమునుదీసికొని యారాక్షసునితోజెప్పి యతనిచేతఁబంపబడినవాడై తనపట్టణమునకువచ్చెను- తరువాతనాదేవాలుడు శివునిసేవింపను గైలాసపర్వతమునకు బోయెను - ౮౧ - పార్వతీకాంతుడగుశివుడా దేవలుని జూచి యతనిమీదమిక్కిలికోపగించెను - ఓదుష్టబుద్ధిగలవాడా నీవువివేకము మాలినవాడవై దొడ్డదగు నాధ్వజమును రాక్షసుని కొరకిచ్చి దేవతలనెల్లగష్టపెట్టితివికాబట్టి నీవు నీమహిమము పోగొట్టుకొని విద్యాధరుడవవుదువుపొమ్ము అని యీప్రకారము సకలలోకశుభకరుడగు నీశ్వరునిచేత నాదేవలుడు శపింపబడినవాడై యంతనామోదపట్టణమునకువచ్చి తన సమాచారమును జెప్పెనోయి బ్రాహ్మణులారా- అంతనప్పుడా దేవాంగరాజు దేహమక్కడలింగమాయెను యిప్పుడు నా యామోదపట్టణమునందు రామలింగేశ్వరుడని ప్రసిద్ధికెక్కియొక దేవుడున్నాడు- ౮౫- తరువాత నాదేవాంగునికొడుకును మితిలేని ప్రతాపముగలవాడును సకలసంపదలుగలవాడునగుదివ్యాంగుడా రామలింగేశ్వరునిబూజించుచు భూమినిబాలించెను- ఇది బ్రహ్మాండపురాణంబున దేవాంగచరితంబున దేవాంగునియవతారపరిపూర్తియనునదిపదునెనిమిదవయధ్యాయము.

శ్రీసూతః ॥ అథమేరోరుత్తరస్మి న్దేశః పాంచాలసంజ్ఞకః । రాజాభూత్సత్యసంధాఖ్య స్తస్యామితపరాక్రమః॥ ౧ ॥ దయాళుఃకీర్తిమాన్ప్రాజ్ఞ స్తేజస్వీసర్వసమ్మతః । తస్యాభూత్తనయాతన్వీ న్దుముఖ్యాఖ్యాసులక్షణా॥ ౨॥ కృతరాశిరివాభాతి యాలావణ్యాస్య సంహతేః । ఏకదా సుందరీసాతు సఖీజనసమావృతా॥ ౩॥ ఉద్యానమగమత్సుభ్రూః క్రీడార్థంప్రాప్తయౌవనా । తత్రారామేతత స్తస్యాం రాజపుత్ర్యాం సఖీజనైః ॥ ౪ ॥ చరత్యాం తరుమూలేషు వ్యాప్తగంధానిలేశుభే । దృష్ట్వావిద్యాధరస్త్వేనాం సుందరీంకామితోభవత్ ॥ ౫॥ అవేక్షమాణస్సమయంతయాసంభావితుంతదా । అతిష్ఠత్తత్రతాంత్యక్త్వాసగంతుం నాశకత్తదా॥ ౬॥ సఖీజనైరదృష్టస్స స్తస్యావిద్యాధరస్తతః । దర్శయామాస చాత్మానం తస్యాజిజ్ఞాసురంతరం ॥ ౭ ॥ సాపిదృష్ట్వా రాజపుత్రీందుముఖీతం దివౌకసం । కామితాభూద్భృశంవిప్రాః పంచబాణ మివాప

---

సూతుఁడు పిమ్మటికథ వాఋుషులకుఁ జెప్పుచున్నాఁడు - మేరుపర్వతమునకుత్తరమునఁ బాంచాలమని యొకదేశముగలదు ఆదేశమునకు మితిలేని పరాక్రమముగల సత్యసంధుడనువాఁడు రాజుగానుండెను- ౧- అతఁడు దయగలవాఁడు యశముగలవాఁడు తెలిసినవాఁడు పరాక్రమముగలవాఁడు జనులకందఱికిష్టుఁడు - అతనికిపంచిలక్షణములుగల యిందుమతియను నొకకూతురుగలిగెను- ౨- ఆచిన్నది కాంతివిశేషముల గుంపునంతను బ్రోగుచేసినట్లు ప్రకాశించుచుండెను - ఆపెకు యౌవనమువచ్చినపిమ్మట నొకనాఁడు సౌందర్యముగలయాచిన్నది తనచెలికత్తెలతోఁగూడ నుద్యానవనమునకుఁబోయెను - గమగమమని సువాసనగలిగి మిక్కిలి రమణీయముగా నుండు నాయుద్యానవనమందాపెతనచెలులతోఁగూడి చెట్లక్రిందసంచరించుచుండగా నచ్చటనొకవిద్యాధరుఁడీ చిన్నదాని సౌందర్యమునుజూచి యాపెయం దపేక్షగలవాఁడాయెను - ౫ - అప్పుడతఁడు సమయము దొరికినప్పుడాపెతో మాటలాడి యాపెతోడి సఖ్యమును సంపాదింపవలయునని యక్కడనే నిలిచియుండెను గాని యాపెనువిడిచి యావలఁబోను వానికిఁ గాలాడదాయెను- ౬- తరువాతనావిద్యాధరుఁ డాపెచెలికత్తెలకుఁ దనరూపము దెలియకుండ నాపెమాత్రముతనరూపమునుజూచిన నాపె యభిప్రాయమును దాను దెలియవచ్చునని యారీతిని దనరూపము నాపెకగపఱిచెను- ౭- ఆరాజుకూతురైన యిందుముఖియు రెండవమన్మథునివలెనున్న యావిద్యాధరునిఁజూచి మిక్కిలికామము

రం ॥ ౮ ॥ జ్ఞాత్వాచతదభిప్రాయం నివర్త్యస్వ సఖీజనం । కంచిత్ప్రదేశమా
సాద్యతమిదం వాక్యమబ్రవీత్ ॥ ౯ ॥ ఇందుముఖి॥ కోభవాన్పురుషవ్యాఘ్ర
నామకింకుత్రవర్తనం । తథ్యమ్మేబ్రూహితత్సర్వం గోపనీయ్యం నతుత్వయా॥
౧౦ ॥ ఇతిపృష్టస్తయారాజ పుత్ర్యా విద్యాధరోబ్రవీత్ । మన్వానఃప్రాప్త
కామం స్వంపరితుష్టోద్విజోత్తమాః॥ ౧౧॥ విద్యాధరఃపద్మభువః పుత్రస్యామి
తతేజసః । పుత్రోవిద్యాధరేశస్య వజ్రమాళేశ్వరాననే॥ ౧౨॥ హేమవర్ణశ్శు
భేనామ్నా యస్మాత్త్వంపరిపృచ్ఛసి । దృష్ట్వాత్వాంపద్మపత్రాక్షిలగ్నంత్వయి
మనోమమ ॥ ౧౩ ॥ కటాక్షైస్సించమాంసాద్రైః స్వవిలాసైర్విలాసిని । ఇ
త్యుక్తాసారాజపుత్రీ ప్రోద్యద్రాగాంకురాతతః॥ ౧౪॥ ద్విగుణం పీడితాకామ
బాణై రంగీచకారతం । ఆభాష్యభాషితవ్యానివాక్యాన్యన్యానిసాదరం॥ ౧౫॥
ఉచ్చారయిత్వాప్రామాణ్యం తేనవిద్యాధరేణసా । ఇతీత్థం కథయామాస సం

---

గలదామెనోయిబ్రాహ్మణులారా - ౮ - అంతనాయిందుముఖి యావిద్యాధ
రుని తాత్పర్యమును దెలిసికొనినదై దనచెలులనందఱను వెనుకకుఁ బొమ్మని
యొకప్రదేశమందతని దగ్గిరకుఁదానుబోయి యతనితోనిట్లుచెప్పెను - ౯ - ఇం
దుముఖిచెప్పెడుమాట - ఓపురుషులలోనెల్ల దొడ్డవాఁడా - నీవెవఁడవు- నీపే
రేమి - నీయునికియెక్కడ దీనినంతయు యదార్థముచెప్పుమయా నాతోనీవు
చెప్పక దాచఁగూడదు - ౧౦ - ఈప్రకార మారాజుకూతు రడుగఁగా నావి
ద్యాధరుఁడు తనకోరిక సిద్ధించెననితలఁచి సంతోషపడినవాఁడై యామెతో
నుత్తరము చెప్పెనయా బ్రాహ్మణులారా - ౧౧ - ఓసుందరమైన ముఖముగల
దానా మిక్కిలి తేజస్సుగల బ్రహ్మదేవునికొడుకైన వజ్రమాళియనువిద్యాధర
శ్రేష్ఠునియొక్క కొడుకగు విద్యాధరుండనునేను - ౧౨ - ఓశుభరూపముగల
దానా నాపేరు హేమవర్ణుఁడు - నీవు నన్నడిగితివి గనుక నావృత్తాంతమును
యావత్తు సవిస్తారముగాఁ జెప్పితిని - తామర పూరేకులవంటి కన్నులుగల
యోచిన్నదానా నిన్నుఁజూడఁగా నామనస్సు నీయందుఁదగిలెను- ౧౩ - ఓకు
లుకులాడీ నీచల్లనిబెళుకుచూపులతో నన్నుఁజూచి నాదేహతాపమును మా
న్పుము - ఇట్లాతనిచేతఁ జెప్పఁబడినదై యంత నారాజుకూతు రుదయించుచు
న్నయనురాగముగలదై యతనికంటె రెండంతలు మన్మథబాణములచేతబా
ధింపఁబడినదై యతనినంగీకరించెను - ఆరాజుకూతురు ప్రేమతో నీకమాట
లాడ వలసిన మాటలను మాటలాడి యావిద్యాధరుని చేత యదార్థ

కేతం తస్యసుందరీ॥ ౧౬॥ శృంగారపురరాజస్య సత్య సంధస్యనందనా । అహం తస్యాలయస్యోచ్చై రుత్తరస్మిన్శశిప్రభే ॥ ౧౭ ॥ హర్మ్యేమేవ సతిశ్శ్రీమత్ భోగస్యాయతనేశుభే । సఖిమాత్రవృతాయామే హర్మ్యం తదతిసుందరం॥ ౧౮॥ అద్యాగచ్ఛరజన్యాంత్వం భావియత్తద్భవిష్యతి । ఇత్యుక్త్వావ్రాజపుత్రీసా సఖిభిస్స్వపురంయయౌ ॥ ౧౯ ॥ తతస్సుకృతసంకేతో హేమవర్ణో ద్విజోత్తమాః । రమతేస్మ చిరంకాలం రాజపుత్ర్యాతయాముదా ॥ ౨౦ ॥ తావన్యోన్యం సక్తరాగా వజ్ఞాతావితరైర్జనైః । రేమాతే వత్సరం రాజపుత్రీ విద్యాధరౌముదా॥ ౨౧॥ ఏతస్యాంజనయామాస హేమవర్ణస్తపోధనాః । ఇందుముఖ్యాం రాజపుత్ర్యాం తనయం తేజసాంనిధిం॥ ౨౨॥ కమలాక్షఇతిఖ్యాతఃసపుత్రస్సర్వలక్షణః । వవృధేబాలకశ్శ్రీమా న్ప్రాతరుత్థ ఇవాంశుమాన్॥ ౨౩॥ అజ్ఞాపిత స్తయామాత్రా స్వపిత్రోర్హార్మ్యమధ్యమే । మాసత్రయం

---

మనిపించి యటుపిమ్మట నతనితోసంకేతము నిట్లని చెప్పెను- ౧౬- శృంగారపట్టణమునకుఁ బ్రభువైన సత్యసంధునికిఁ గూతురనునేను - ఓయి సకలసంపదలుగలవిద్యాధరుఁడా యాసత్యసంధుని యింటికుత్తరపుప్రక్కను జంద్రునివంటి కాంతిగల యత్యున్నతమైన మేడయందు నాయునికి- ఆమేడయందే భోగము కావలయునన్నను గొదవయుండదు - మిక్కిలి సుందరమైన యామేడయందు నేను నాచెలికత్తెలతోఁగూడనుందునుగాని మఱి యెవ్వరుండరు- ౧౮- ఈదినము రాత్రినీవక్కడకురమ్మా పిమ్మటఁ గావలయునవి యెల్లనగును . ఇట్లుచెప్పి యారాజపుత్రిక తనచెలులతోఁగూడఁ దనపట్టణమునకుఁబోయెను- ౧౯- అంత నీరీతిగాసంకేతమాపె యేర్పఱిచెనుగనుక నావిద్యాధరుఁడు బహుకాల మాపెతోఁగూడి సకలవిధములసంతోషముతోఁ గ్రీడించుచుండెనయా బ్రాహ్మణులారా - ౨౦ - ఇట్లారాజుకూతురును విద్యాధరుఁడు నొకరియందొకరు దృఢముగాఁ దగిలిన యనురాగముగలవారై యితరులకుఁ దమసమాచారము దెలియకుండ సంతోషముతో నొకసంవత్సరము విహరించిరి - ౨౧ - ఓబ్రాహ్మణోత్తములారా - అంత నాహేమవర్ణుఁడను విద్యాధరుఁడీ రాజపుత్రియైన యిందుమతియందుఁదేజస్సులనిధియైన కొమారుని నొకనిఁబుట్టించెను- ౨౨- సమస్తశుభలక్షణములుగల ఆకొమరుడు కమలాక్షుడను పేరునువహించి ప్రాతఃకాలమందుదయించిన సూర్యునివలె వృద్ధిబొందెను- ఆబాలకుడు తనతల్లియైన యాయిందుముఖిచేత నాపెతల్లితండ్రులకుఁ దెలుపబడక నెవరిచేతనెప్పుడును

వర్తతేస్మావిదితః కైః కదాపిచిత్ ॥ ౨౪॥ అథైకదా ప్రియంసంత మిందుముఖ్యబ్రవీదిదం। హేమవర్ణ మహాబాహో శృణుమత్ప్రాణవల్లభ॥ ౨౫॥ యదుచ్యతేమయాశ్శ్రీమ న్వాక్యం హేత్వర్థసంయుతం। కృతకామావితోన్యోన్యమావామ హ్యావ మహామతే॥ ౨౬॥ నస్థాతవ్యం త్వయాగచ్ఛ యత్రతేరోచతేమనః। ఇత స్త్వేదావయోశ్చే దపవాదోమహాన్భవేత్॥ ౨౭॥ కమలాక్షమిమంపుత్ర మాదాయ ప్రాణనాయక। గంతుమర్హసిభద్రంతే చింతాకార్యాసచత్వయా॥ ౨౮॥ ఏతావదావయోస్సఖ్యం దైవయోగాదవర్తత। నస్థాతవ్యమితోగచ్ఛ నైవశోచితుమర్హసి॥ ౨౯॥ కమలాక్షమిమంపుత్ర మాదాయైవమహామతే। తయేత్యుక్తోహేమవర్ణ స్తథేత్యుక్త్వాశుచన్భహు॥ ౩౦॥ ఆదాయతం శిశుం స్వర్గం కమలాక్షం యయౌతతః। సపాత్రిప్తయావనోబాలః సర్వవిద్యావిశారదః॥ ౩౧॥ బభూవానందయన్సర్వా న్కమలాక్షః కలావతః। షడ్దర్శనేసుకుశలః కలాశాస్త్రవిచక్షణః॥ ౩౨॥ మేధావీ గానవిద్యాసు

---

దెలియబడక నామేడనమమ మూడునెలలుండెను - ౨౪ - పిమ్మట నొకకాలమందుఁదనప్రియుడైనయావిద్యాధరునిగూర్చి యిందుముఖియిట్లనిపలికెను మిక్కిలి భుజబలముగలయో హేమవర్ణుడా నాప్రాణములకుబ్రియుడా సకలసంపదలుగలవాడా నేనిప్పుడు సహేతుకముగ నేమాటనుజెప్పుదునో దానినీవువినుము-ఇంతవరకుమనమిద్దరమొకరియన్దొకరుకామములజేయుచునుంటిమి.౨౬-ఓమిక్కిలిబుద్ధిశాలి నీవికమీదనిచటనుండరాదు నీకెచటికిబోవలనని మనస్సునవిష్టమున్నదోయచటికిబొమ్ము - ఇకమీదనీవచ్చటనుంటివా మనకిద్దరకుదొడ్డయపవాదముకలుగును - ౨౭ - నాప్రాణేశ్వరుడా యీకొడుకైన కమలాక్షునివేసికొనిపోవలయునునీకుమేలుగలుగునునీవుచింతపడవలదు- ౨౮ - ఇంతవఱకుమనకిద్దరికు జెలిమిదైవఘటనవలనగలిగెను - ఇకమీదనీవిచటనుండరాదు - ఇచటనుండిపొమ్ము - చింతపడదగదు - ఓమిక్కిలిబుద్ధిగలవాడా - ఈనీకొడుకైన కమలాక్షుని బిలుచుకొనియేపొమ్ము- ఇట్లాపెచెప్పగా నాహేమవర్ణుడట్లేయనిచెప్పి మిక్కిలిదుఃఖపడుచు నాబాలకుడగు కమలాక్షునిబిలుచుకొనియంతటస్వర్గమునుగూర్చిపోయెను- అంతనాబాలుడగు కమలాక్షుడుయావనమును బొందినవాడై సకలములైన విద్యలయందు బాండిత్యముగలవాడునైవిద్యావంతులనందఱ నానందపరచుచుండెను - అతడారుశాస్త్రములయందు బండితుడు - కలాశాస్త్రమందు జక్కని తెలివిగలవాడు - ౩౨ - సంగీతవిద్య

మాంత్ర భారతశాస్త్రయోః । ధర్మశాస్త్రేషు నిపుణో నీతిశాస్త్రేషు బుద్ధి
మాన్॥ ౩౩॥ సాంగాయాఃకుశలస్త్రయ్యాం విద్యాయాంచ తపోధనాః । జా
గరూకోధ్యాత్మవిద్యా స్వైంద్ర మాహేంద్రజాలయోః॥ ౩౪॥ పరకాయప్ర
వేశేచభైషజ్యేచ విశారదః । ఇత్యాద్యాసుచతుష్షష్టి విద్యాసుచ విచక్షణః॥
౩౫॥ కురుతే నిఖిలై ర్వాదం కలావద్భిస్స సర్వదా । కదాచిత్సన్నిధౌశంభోః
కమలాక్షో మహామతిః॥ ౩౬॥ సేవమానేషు సర్వేషు దేవాదిషువిచక్షణః । ఆ
విశ్చకారస్వావిద్యా విద్యాధర శిరోమణిః ॥ ౩౭ ॥ సర్వేముముదిరేతత్ర ద్వి
ద్యాశ్రవణేనతే । దేవబ్రహ్మర్షయోదేవా యేచాన్యేదేవయోనయః॥ ౩౮ ॥
తదాతుభగవాన్సాంబు స్తూష్ణీమా స్తద్విజేశ్వరాః । ఏవం ప్రతిదినంతత్ర సన్ని
ధౌశూలినఃప్రభోః॥ ౩౯॥ విద్యాస్స్వాశ్శ్రావయన్నా స్తేహేమవర్ణసుతఃకృతీ। భ
క్తోంబికాయా విద్యావా న్వివిత్సుర్నామబుద్ధిమాన్ ॥ ౪౦ ॥ కమలాక్షేణావ
మానమితో విద్యాధరేశ్వరః । పార్వతీం ప్రార్థయామాస శమనాయాస్యవై

---

లయందు మేథగలవాడు - మంత్రశాస్త్రమందును భరతశాస్త్రమందును ధర్మశాస్త్రములయందును జతురుడు - నీతిశాస్త్రములయందు జ్ఞానముగలవాడు - ౩౩ - ఓతపస్సేధనముగాగల ఋషులారా అతడు మూడువేదములయందును వానియంగములయందును నేర్పుగలవాడు ఆత్మవిషయములైన విద్యలయందు నింద్రజాల మహేంద్రజాలములయందును జాగ్రత్తగలవాడు - ౩౪ - పరకాయ ప్రవేశమందును వైద్యమందును గట్టివాడు - ఇవిమొదలగు నరువది నాలుగువిద్యలయందునుబండితుడై యెల్లప్పుడునతడువిద్యఁజదివినవారితో నెల్లప్రసంగముఁజేయుచుండును - మహాబుద్ధిశాలియగునట్టియు బండితుడగునట్టియు విద్యాధరుల కెల్లశిరోభూషణమగు నాకమలాక్షుడొకానొకప్పుడు శివుని సన్నిధియందు దేవతలుమొదలగు వారందరు సేవించుచుండగా దనవిద్యలనగపరిచెను - ౩౭ - అచట నుండు దేవఋషులు బ్రహ్మర్షులు దేవతలు మరియు దేవతలలోభేదములు నందరతని విద్యనువిని సంతోషించిరి - ౩౮ - అప్పుడుషడ్గుణైశ్వర్య సంపన్నుడగు నాయీశ్వరు డూరక యుండెనోయి బ్రాహ్మణోత్తములారా - ఇట్లునిత్యము నచ్చట సకలలోకనాయకుఁడగు నాయీశ్వరుసన్నిధానమున బుద్ధిశాలియగు నాహేమవర్ణునికొడుకు తనవిద్యల వినిపించుచుండెను- ఇట్లుండ బార్వతికిభక్తుడగునట్టియు మిక్కిలి బుద్ధిశాలియగునట్టియు విద్యలనెల్లదెలసినట్టివివిత్సుడనువిద్యాధరోత్తముడీ కమలాక్షునిచేత నవమాన

తతః॥ ౪౧॥ నమోస్తుతేంబికేదేవి నమస్తే భక్తవత్సలే । కమలాక్షేణవిద్యా
యాఃపరీభావం చిదాప్నువర్ణ॥ ౪౨॥ కథంశమయతం దేవి మత్కృతేభక్తపా
లికే । ఇతిసంప్రార్థితా దేవీ తేనవిద్యాధరేణసా॥ ౪౩॥ తథేత్యుక్త్వాకరోమిా
తితోషయామాసతంతథా। అథైకదాశివస్యాగ్రే కమలాక్షస్తపోధనాః॥ ౪౪॥
గోష్ఠీభిస్తోషయామాస సర్వానపివిపశ్చితః । తదాశివస్తు భగవా న్నకించిన్న
ననందవై ॥ ౪౫॥ అప్రహృష్టంతతోదృష్ట్వా శివందేవ్యబ్రవీదిదం । నమోదసే
కుతస్స్వామి న్కమలాక్షస్యవిద్యయా॥ ౪౬॥ నతాదృశఃప్రవీణోహి విద్వాన
స్తిమహేశ్వర । ఏవం పృష్టస్తయాశంభుః వాక్యమేతదువాచహ॥ ౪౭॥ కమ
లాక్షస్యసదృశో విద్యాభిర్నాస్తిసుందరీ । కింత్వయంనచిరస్థాతా నతుష్టోహం
తతశ్శుభే॥ ౪౮॥ సభావీపుష్పదంతాఖ్య స్త్యక్త్వాదేహమముంపురా । ఏవం
బ్రువాణే దేవేశే భక్తపోషణతత్పరా ॥ ౪౯ ॥ పార్వత్యనుసరంతీత ద్వాక్యం

---

మునొందింపబడెను- అంతనాతడితని నణచుటకై పార్వతినిబ్రార్థించెను-౪౧-
ఓయంబికాదేవీ నీకునమస్కారమగుగాక భక్తులయందు బ్రీతిగలయమ్మా నీ
కునమస్కారము కమలాక్షునిచేత నావిద్యకుదిరస్కారమును బొందితినిగదా-
౪౨ - భక్తులనుబాలించునట్టియోయమ్మా నాకొరకునెట్లినతనినణచివేయ
వలయును - ఇట్లావిద్యాధరుడు ప్రార్థింపగా నాపార్వతీదేవి అట్లెకానిమ్ముచేసె
దనని చెప్పియతనినప్పుడు సంతోష పఱచెను- అటుపిమ్మట నొకానొకప్పుడా
కమలాక్షుడుశివునియెదుట నందరబండితులనువిద్యావినోదములచేత సంతో
షపరిచెనయాతపసులారా- అప్పుడు షడ్గుణైశ్వర్యసంపన్నుడగునాశివుడుమా
త్రముకొంచెమైన సంతోషింపడాయెను- ౪౫ - అంతసంతోషింపక యున్న
యాశివునిజూచిపార్వతియిట్లనిపలికెను - ఓస్వామీమిా రేలగమలాక్షుని విద్య
చేత సంతోషింప కున్నారు - ౪౬ - ఓ మహానుభావా అట్టి సమర్థు
డగు పండితుడు లేడుగదా అనియిట్లా పార్వతి యడుగగా శివుడుత్తర
మిట్లు పలికెను - ౪౭ - ఓసాగసైన పార్వతీ విద్యలచేత గమలాక్షునకు
సమానుడు లేడు వాస్తవమే - ఇక నేమనిన నితడు నిండుదినములిచటనుం
డు వాడు గాడు కావున నేను సంతోష పడనైతిని - ౪౮ -
ఓశుభాంగీ అతడీదేహమును విడిచియికమిాద బుష్పదంతుడనుపేరుగలవాడు
గా నగును - అనియిట్లుదేవతా నాయకుడగు నీశ్వరుడుచెప్పుచుండగానప్పు
డుభక్తులబోషించుటయందా సక్తిగలపార్వతియాయీశ్వరునిమాటననుసరిం

శంభోస్తదాద్విజాః । పశ్యంతీప్రాబ్రవీద్వాక్యం కమలాక్షముఖం తతః॥ ౫౦॥
కమలాక్షమహాభాగ సర్వవిద్యాధరేశ్వర । భవితవ్యః పుష్పదంత స్త్వమిత
శ్శంకరాజ్ఞయా॥ ౫౧॥ తస్మాత్త్వం మానుషేలోకే పుష్పదంతోభవవ్రజ । ఏవ
ముక్త స్తయాదేవ్యా కమలాక్షస్తు విహ్వలః ॥ ౫౨ ॥ శివం ప్రణమ్యాలయం
స్వం ప్రయయావథభోద్విజాః॥ ఇతి శ్రీబ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - వి
ద్యాధర ప్రశంసానామ నవదశోధ్యాయః.

శ్రీసూతః ॥ తతోయుగంధరేదేశే హేమవత్యభిధేపురే । శ్రుతకీర్తే
స్సోమవత్యాం రాజర్షేరమితౌజసః॥ ౧॥ జాతోసౌ పుష్పదంతాఖ్యః కమలా
క్షస్తపోధనాః । సింధురాజస్యసదనే విరూపాక్షస్యధీమతః॥ ౨॥ సంజాతాగృ
హిణీతస్య దేవదత్తాయశస్వినీ । తస్యాస్తుజాతమాత్రాయా అశరీరీసరస్వతీ॥
౩॥ నామాస్యాఃక్రియతాం దేవదత్తేత్యేవమువాచహ । తథేతిపితరౌతస్యాశ్చ
క్రతుర్నామపౌర్వకం ॥ ౪ ॥ శ్రుతకీర్తిస్తతోరాజా విరూపాక్షస్యనందనాం ।

---

చుచు గమలాక్షుని ముఖముఁ జూచుచు నిట్లనెను మిక్కిలి అదృ
ష్టవంతుఁడును విద్యాధరులకెల్ల ప్రభువునగు కమలాక్షుఁడా నీవిక సాం
బమూర్తి యాజ్ఞచొప్పున బుష్పదంతుడవు కాదగినవాడవు - ౫౧ - కాబ
ట్టి నీవు మనుష్య ప్రపంచమందు బుష్పదంతుడవుగమ్ము పొమ్ము - ఇట్లా పా
ర్వతీదేవిచేత జెప్పబడినవాడై కమలాక్షుఁడు దుఃఖముగలవాడై శివునినమ
స్కరించి యంతటదనయింటికి బోయెనో బ్రాహ్మణులారా-౫౨- ఇది బ్రహ్మాం
డ పురాణంబున దేవాంగచరితంబున విద్యాధరప్రశంస యన్నది పందొమ్మి
దవయధ్యాయము.

సూతుఁడు పిమ్మటికథ నాఋషులకుఁ జెప్పుచున్నాఁడు-అంతయుగంధర
మను దేశమందు హేమవతియను పేరుగలపట్టణమందమితి లేనిపరాక్రమముగల
శ్రుతకీర్తియను రాజర్షికిఁ సోమవతియను భార్యయందు నీ కమలాక్షుఁడు
పుష్పదంతుఁడను పేరు గలవాడై పుట్టెనో బ్రాహ్మణోత్తములారా - సింధు
దేశపురాజగు బుద్ధిశాలియయిన విరూపాక్షునియింట నాపుష్పదంతునకు భా
ర్యయగు కీర్తిగలదేవదత్త పుట్టెను - ఆపెపుట్టినతోడనే యశరీరవాక్కిట్లన్న
దానికి దేవదత్తయని పేరుపెట్టవలయునని చెప్పెను - ఆపెతల్లితండ్రులట్లేయ
నియంగీకరించి మొదట నాపెకాపేరుతో నామకరణముచేసిరి- అంతనాశ్రుత
కీర్తియనురాజు విరూపాక్ష రాజుకూతురైన కీర్తిగలదేవదత్తను దీసితనకొడుక

పుత్రస్యపుష్పదంతస్య దేవదత్తాం యశస్వినీం॥ ౫॥ ముదాపరమయాకర్తా వై వాహికమకారయత్ । విన్యస్తరాజ్య భారస్సన్ శ్రుతకీర్తి స్తనూభవే॥ ౬॥ దాంతోరసేశ్వరః పత్న్యాయయావథతపోవనం । ప్రాప్యసింహాసనం పిత్ర్యం పుష్పదంతోనృపాత్మజః॥ ౭॥ తద్రాజ్యం పాలయామాస పితృవత్పటువిక్రమః। ఏకాదశసహస్రాణి దివ్యలింగానిసత్తమాః॥ ౮॥ సోపూజయిత్వానజలం పిబత్యపిదినేదినే । రుద్రాక్షకృతకోటీర హారకంకణశోభితః॥ ౯॥ ఆస్తేభసితదిగ్ధాంగశ్శివభక్తిపరాయణః । శృణ్వన్సదాశైవకథా శ్శివధ్యానపరస్సదా॥ ౧౦॥ తతస్సకారయామాస పుష్పారామమనేకధా । మాలతీమల్లికాశోక పాటలీకుట్మలానిచ । నందివర్ధనపున్నాగ కాంచనాహ్వయచంపకాన్ । శిరీషాన్ పారిజాతాంశ్చ కరవీరాన్ జపాశ్శుభాః॥ ౧౨॥ పిచండిలా మల్లికాశ్చ చామంతీ నాగకేసరాన్ । అన్యాశ్చబహుళాఃపుష్ప ద్రుమగుల్మలతాశ్శుభాః ॥ ౧౩ ॥ క్షేపయిత్వాప్రయత్నేన హేలయా తాపసోత్తమాః । కారయిత్వాలవాలాని

---

గుపుష్పదంతునికి మిక్కిలి సంతోషముతో వివాహకార్యమును జేయించెను తరువాత నాశ్రుతకీర్తితన రాజ్యపరిపాల నాధికారమును గొడుకునకొప్పగించి యంతఁదానింద్రియములనిగ్రహించి తపోవనమునకుఁబోయెను - అంతనారాజుకొడుకైన పుష్పదంతుఁడుతనతండ్రిదైన సింహాసనమునుబొందితండ్రివలెమిక్కిలి పరాక్రమముగలవాఁడై యారాజ్యమును బాలించెను - ఓమునిశ్రేష్ఠులారా - అతఁడుపదునొకండువేల దివ్యములైన శివలింగములనర్చింపకప్రతిదినమునుగంగనుద్రాగఁడు - ఆరాజు రుద్రాక్షములచేతఁగిరీటమునుహారములనువలయములనుజేసి వానిధరించియలంకరింపఁబడిన దేహముగలవాఁడై దేహమందంత భస్మము పూసికొని శివునియందు భక్తిదృఢముగాఁ గలవాఁడై యెల్లప్పుడు శివకథలువినుచునెల్లప్పుడుశివుని ధ్యానమునందాసక్తుఁడై యుండెను - ౧౦ - తరువాతనారాజుబహువిధములఁ బూలతోటనొకదానింబెట్టించెను - అందుజాజిమల్లెయశోకము పాదిరిచెట్లు కుట్మలవృక్షములు- నందివర్ధనములు పొన్నచెట్లు బంగారుసంపెంగలు దిరిసెపుచెట్లు - పారిజాతవృక్షములుగొరింటచెట్లు సుందరములైన దాసానిచెట్లు బొండుమల్లెచెట్లు సామంతినాగకేసరములు మఱియుననేకములగు పూలచెట్లుపొదలుతీఁగలు - వీనినెల్ల మిక్కిలిప్రయత్నముతోనాటించి వానికిఁ బాదులు సేయించి నిత్యమువిలాసముతోనాపాదులనిండ నీళ్లుకట్టించి యంతనారాజా తీఁగలు మొదలగు వాని కెల్ల

సేచయిత్వాదినేదినే॥ ౧౪॥ తేషామాకారయత్కర్మ సరాజాదోహదంతతః। తేష్వాఖిలేషు గుల్మేషు కృతదోహదకర్మసు॥ ౧౫॥ పుష్పదంతస్యజనయన్ హర్షం పుష్పోద్గమోఽభవత్ । పుష్పదంత స్తతస్తాని పుష్పాణ్యాహృత్యయత్నతః॥ ౧౬॥ ప్రత్యహంపూజయన్నాస్తే శివంతైర్భక్తిపూర్వకం । తతోరాజామునిశ్రేష్ఠా శ్శివరాత్రౌ శివాలయం ॥ ౧౭ ॥ గత్వాప్రపూజయామాస దేవదేవం మహేశ్వరం । ద్వాత్రింశతామహాదేవం శ్లోకైస్తుష్టావశంకరం॥ ౧౮॥ తతస్తుష్టో మహాదేవ స్తత్స్తోత్రేణ స్తవప్రియః । ప్రాదుర్భూత్వా పురస్తస్య దివ్యతేజోమయశ్శివః॥ ౧౯॥ పుష్పదంతం వ్యాజహార వరోద్యవ్రియతామితి। సప్రహృష్టః ప్రసన్నంతం ప్రణమ్యశిరసాశివం॥ ౨౦॥ యయాచే పుష్పదంతో సౌశంకరంలోకశంకరం । భగవన్ యదిమేతుష్టః పార్వతీశదయానిధే ॥ ౨౧ ॥ దినేదినేదర్శనంతే తథా కురుభవేద్యథా । కుర్యాస్వావాం దంపతీతే దర్శనం ప్రత్యహంవిభో॥ ౨౨॥ ఏతావంతం వరంచైవ దిశమేకరుణానిధే । తస్మిన్నే

---

దోహదముచేయించెను- ౧౪- ఆపాదలు మొదలగునవియెల్లను దోహదములం జేయఁబడినవి కాఁగాఁ బుష్పదంతునకు సంతోషమును గలుగఁ జేయుచుఁ బుష్పముల పుట్టుక కలిగెను - అంతఁ బుష్పదంతుఁడా పుష్పములనెత్తి వానిచేత శివుని భక్తితో నిత్యము మిక్కిలి యత్నముతోఁ బూజించుచుండెను - ఓ ఋషిశ్రేష్ఠులారా అంతనారాజు శివరాత్రినాఁడు శివాలయమునకుఁ బోయి యందు అను దొడ్డవాఁడును దేవతలకెల్ల దేవుఁడునగు సాంబమూర్తినిఁ బూజించెను- పూజకాఁగానే ముప్పదిరెండు శ్లోకముల చేత శుభమును జేయునా దొడ్డదేవుని స్తుతించెను - ౧౮ - అంత స్తోత్రప్రియుఁడైన యాశివుఁడతని చేత స్తోత్రము చేయఁబడినవాఁడై దివ్యమయిన తేజస్సుగలవాఁడుగాను మంగళకరుఁడుగా నతని యెదుటనావిర్భవించి యాపుష్పదంతునితో నిష్టమువరము వేఁడుమనిపలికెను - అంతనాపుష్పదంతుఁడు సంతోషించినవాఁడై తనయందనుగ్రహము కలిగియుండు నాశివునకు సాష్టాంగముగ మ్రొక్కి లోకములకెల్ల మేలుగలుగఁ జేయునాశంకరుని పుష్పదంతుఁడు ప్రార్థించెను - ఓ షడ్గుణైశ్వర్య సంపన్నుఁడా పార్వతీనాయకుఁడా దయానిధీ నావిషయమై మీరు సంతోషపడితిరా - ౨౧ - ప్రతిదినము మీదర్శనమెట్లు కలుగునో యట్లను గ్రహింపవలయును- మేము దంపతులము నిత్యము తమదర్శనము చేయవలయును యాస్వామీ - ౨౨- ఓ కారుణ్యమునకుఁ గనియైన సాంబమూర్తీ యింతమాత్రము వరమును నా

వంయాచమానే దత్వాతస్యవరంతథా॥ ౨౩॥ తోషయిత్వా నృపంశంభు స్త త్రైవాంతరధీయత । ప్రసాదేన తతశ్శంభోః పుష్పదంతోనరేశ్వరః॥ ౨౪॥ గ త్వాసజానిః కైలాసం సేవతేతం దినేదినే । హారాన్నానావిధైః పుష్పైః కృ త్వాచూడామనోహరాన్ ॥ ౨౫ ॥ కంతుకానివిచిత్రాణి కంకణాని సభూప తిః । తస్యాతిభక్త్యాశివయోః పత్నీచార్పయత స్తయోః॥ ౨౬॥ పుష్పేషువై రిణః పుష్పదంతః పుష్పాణిభూపతిః । అర్పయన్ దృఢయాభక్త్యా వివిధానిది నేదినే॥ ౨౭॥ తత్పత్నీ దేవదత్తాసా తత్పత్న్యైభూమిభృద్భవః । ప్రత్యహం బహుపుష్పాణిఅర్పయత్యతిభక్తితః॥ ౨౮॥ అథైకదాపుష్పదంతఃపుష్పాణ్యా దాయభూసురాః । కైలాసంశివయోరాజాతయోరర్పయితుంయయౌ॥ ౨౯॥ రాత్రౌ రహస్థితౌ జ్ఞాత్వా పార్వతీ పరమేశ్వరౌ । ప్రదాతుకామఃపుష్పాణి ద్వార్యతిష్ఠన్నరేశ్వరః॥ ౩౦॥ రహస్థితా తదాగౌరీ కేళీషు స్వసఖీజనైః । పృ ష్టాగుహ్యాంకథాంన స్త్వంకథయేతిద్విజోత్తమాః॥ ౩౧॥ నిర్జనంతత్రదృష్ట్వావ

---

కిమ్ము - అనియిట్లా పుష్పదంతుఁడు ప్రార్థింపఁగా నతనికాప్రకారము వరమి చ్చి యారాజును సంతోషపఱిచియటుతరువాత సాంబశివుఁడక్కడనే యంత ర్ధానమునొందెను - అంత సాంబమూర్తియొక్క యనుగ్రహము చేతఁ బు ష్పదంతుఁడనురాజు భార్యతోఁగూడ నిత్యము కైలాసపర్వతమునకుఁబోయి శి వుని సేవించుచుండెను - పలు తెఱంగులపువ్వులచేత సిగయందుఁజుట్టుటకు మ నోహరములుగా నుండు దండలను నాశ్చర్య కరములైన చెండ్లను గంకణ ములను జేసి యా రాజు నతని భక్తి చేత నతని భార్యయు నిద్దరు పార్వతీ పరమేశ్వరులకు సమర్పించుచుండిరి - ౨౬ - పుష్పదంతభూ పాలుఁడు పుష్పబాణునకు శత్రువైన సాంబశివునకనేకవిధములైన పుష్పము లను నిత్యముదృఢమైనభక్తిచేత సమర్పించుచుండెను - అతనిభార్యయగు దే వదత్తయు నాసాంబశివుని భార్యయయిన పార్వతికిమిక్కిలి భక్తితోనిత్యము పెక్కుపువ్వులనుసమర్పించుచుండెను - ౨౮ - ఓబ్రాహ్మణులారా తరువాత నొకప్పుడు పుష్పదంతుఁడు పువ్వులనెత్తుకొని యాపార్వతీ పరమేశ్వరుల క ర్పింపనుగైలాసపర్వతమునుగూర్చిపోయెను - ౨౯ - రాత్రియందాపార్వతి యుఁబరమేశ్వరుఁడును రహస్యముగానున్నారని తెలిసి యారాజుపువ్వులనీని చ్ఛగలవాఁడై వారుండునింటివాకిట నిలుచుండెను - ౩౦ - అంతకుముందా పార్వతితనచెలులతోడ విలాసముగానుండు నపుడాచెలులచేత మాకు నీవొక

తుశంకరం కాళీకాబ్రవీత్ । మహేశ్వర మహాభాగ సర్వజ్ఞ సకలేశ్వర॥ ౩౨॥
అజ్ఞాతామఖిలై ర్గుహ్యాం కథాం వదమమాధునా । ఏవము క్త స్తతశ్శంభుః
పార్వత్యామితవై భవః ॥ ౩౩ ॥ తస్యాః కథామకథయత్తాదృగ్భూతాం మ
హేశ్వరః । తాం శ్రుత్వా పుష్పదంతో౽పి ద్వారితిష్ఠ న్కథాం నృపః॥ ౩౪॥ తత
స్సమయమాలోక్య గత్వా దేవస్య సన్నిధిం । అర్పయిత్వాచపుష్పాణి స్వపు
రం పునరాయయౌ॥ ౩౫॥ ఆగతే స్వగృహంతస్మి న్పుష్పదంతే నృపర్షభే । మ
హా న్వ్యతిక్రమోజాత స్తస్యారాత్యా స్తదాదినే ॥ ౩౬ ॥ మహిషీ దేవదత్తా
సా భర్తురాగమనం భృశం । నిరీక్ష్యక్వగతో౽జార ఇతినుష్వాపమందిరే॥ ౩౭॥
తత స్తమాగతం జ్ఞాత్వా ప్రేయాం సంకోప సంకులా । భర్త్సయామాస బహు
ధా జారో౽సీతితపస్వినః॥ ౩౮॥ తథావిదూషయంతీంతాం ప్రేయసీ మబ్రవీన్నృ
పః । కింతాదృశో౽హం సుశ్రోణివచనం కింతదుచ్యతే॥ ౩౯॥ మాం మావమం స్థా

---

రహస్యమయిన కథను జెప్పుమని యడుగఁబడియుండెను గనుక నప్పుడు ర
హస్యమందున్నదై యక్కడ నెవరు జనులు లేకుండఁ జూచి సాంబశివుని
తో నిట్లనెను - ఓ మహేశ్వరుఁడా మహానుభావుఁడా సమస్తము దె
లిసిన వాఁడా యెల్ల వారికి నాయకుఁడా - ౩౧ - ౩౨ - ఇప్పు
డెల్లవారిచేత నెఱుఁగఁ బడక యతిరహస్యముగా నుండు కథను నాకుఁ జె
ప్పుము - అనియిట్లా పార్వతిచేతఁ జెప్పఁబడినవాఁడై మితిలేని విభవముగ
ల యామహేశ్వరుఁడట్లే కానిమ్మని యామెకట్టికథను జెప్పెను - ద్వారమం
దున్నయాపుష్పదంతరాజునాకథనువిన్నవాఁడై తరువాతసమయమునుజూచి
యాసాంబమూర్తిసన్నిధానమునకుఁబోయి తాను దెచ్చిన పువ్వులనుసమర్పిం
చి మరలఁబట్టణమునకువచ్చెను. ౩౫ - రాజశ్రేష్ఠుఁడైనయాపుష్పదంతుఁడుద
నయింటికివచ్చునంతలో నాఁడు రాత్రిమిక్కిలి కాలమతిక్రమించిన దాయెను
౩౬ - ఈలోపల నాతని భార్యయయిన యాదేవదత్తతన పెనిమిటి రాకనుబ
హుకాలమెదురుచూచి యెక్కడజారుఁడై పోయినాఁడోయని యింటఁబండు
కొనినిద్రపోయెను - ౩౭ - తరువాతవచ్చినయాతనప్రియునిఁజూచిమిక్కిలికోప
ముగలదై నీవు జారుఁడవై తివని యనేకవిధముల బెదిరించె నోయి తపస్సు
లారా - ౩౮ - ఆప్రకారముదన్ను నిందించుచున్నయాప్రియురాలినిగూర్చిపు
ష్పదంతరాజిట్లనెను - ఓసుందరములైన పిరుదులుగల ప్రియురాలా నేనట్టి
వాఁడనా యేమి యట్టిమాటచెప్పెదవు - ౩౯ - ఓనాప్రియురాలా - ఊరక నీవు

స్తూష్ణీం త్వం శ్రుణువాక్యం ప్రియే మమ । తదా ర్పణాయ పుష్పాణాం
నాయం సమయ ఇత్యహం । ద్వారి స్థితోంబికా దేవం గూఢాం పప్ర
చ్ఛవైకథాం ॥ ౪౧ ॥ పృష్టా గూఢ కథాం పూర్వం కథయేతి సఖీజనైః ।
జగాద సమహా దేవ స్తస్యా గుహ్య తమాం కథాం ॥ ౪౨ ॥ శ్రుత్వా
తామప్యహం సుభ్రు దత్వా పుష్పాణివై తయోః । అద్యాగత స్తతఃకాల
ఏతావాన్సమజాయత॥ ౪౩॥ ఇతిత్యాజితసందేహా దేవదత్తా ప్రియేణసా । ఇ
తిపప్రచ్ఛభర్తారం కథాం తాం కథయస్వమే ॥ ౪౪ ॥ ఏవముక్తఃపుష్పదంతఃప
త్న్యామోహా సమాశ్రయాత్ । తస్యాస్తాం కథయామాస గోపనీయాం స్వ
యోషితః॥ ౪౫॥ తతఃప్రాతఃపుష్పదంతో దేవదత్తాచతావుభౌ। కైలాసం య
యతుఃప్రీత్యా సేవార్థం శివయో స్తయోః॥ ౪౬॥ సఖీనాం పృష్టపూర్వాయాం
గౌర్యాంగూఢతమాంకథాం । బ్రువంత్యాంకథయామీతి దేవదత్తాబ్రవీదిదం॥
౪౭॥ శ్రుణ్వంతువచ్మ్యహంసఖ్యో భవత్యస్తాదృశీం కథాం । ఇతిశ్రుత్వేరితం

---

నన్నవమానపఱుపకుము నామాటవినుము - నేఁడు పార్వతీపరమేశ్వరులు వా
రింట రహస్యక్రీడయం దాసక్తులై యుండిరి - ౪౦ - అప్పుడు నేను బువ్వులనుస
మర్పింపనిది సమయముకాదని వాకిటనుంటిని - అప్పుడు పార్వతి యీశ్వరుని
రహస్యకథను జెప్పుమని యడిగెను - ౪౧ - అంతకుముందామె చెలులామె
నొకరహస్యకథను జెప్పుమని యడిగియుండిరి గనుక వారికై యామె యీశ్వ
రునడుగఁగా నాయీశ్వరుఁ డామెకు మిక్కిలి రహస్యమైన కథను జెప్పెను -
౪౨ - ఓసుందరములైన కనుబొమలుగలప్రియురాలా నేనాకథనువిని పిమ్మట
వారికిద్దరకుఁ బువ్వులనిచ్చి యిప్పుడు వచ్చితిని - కాబట్టి యింతప్రొద్దుపోయెను-
౪౩ - ఈప్రకారము ప్రియుఁడుచెప్పఁగానే యాదేవదత్త తనకుఁ బ్రియునియం
దుఁగలిగినసందేహమునువిడిచితనభర్తయైన యాపుష్పదంతుని నాకథను దన
కుఁజెప్పుమనియడిగెను - ౪౪ - ఇట్లుభార్యచేతనడుగఁబడిన యాపుష్పదంతుఁ
డాపెయందుఁ దనకుఁగల మోహామువలన నెవ్వరితోను జెప్పకదాఁచఁదగిన
యాకథనా దేవదత్తకుఁజెప్పెను - ౪౫ - అంతమఱునాఁడుతెల్లవారి యాపుష్ప
దంతుఁడు నాతనిభార్యయయిన యాదేవదత్తయు నిద్దరు నాపార్వతీపరమేశ్వ
రులనుసేవింపనుప్రేమముతోఁ గైలాసమునకుబోయిరి- ౪౬ - అప్పుడుపూర్వ
ము చెలులచేతనడుగఁబడిన పార్వతియారహస్యకథను జెలులకుఁజెప్పుచుండఁ
గా నీదేవదత్తదీనినేను జెప్పెదననెను - ౪౭ - ఓచెలులారా అట్టికథనునేను జె

వాక్యం పార్వతీ దేవదత్తయా ॥ ౪౮ ॥ అబ్రవీత్కథయేత్సర్తి దేవదత్తేవదేతి తాం । దేవ్యాజ్ఞప్తా దేవదత్తా కథయామాసతాం కథాం॥ ౪౯॥ యాదేవ్యా ఈరితారాత్రౌ శంకరేణ ద్విజోత్తమాః । దేవీకోప సమావిష్టా కథితాం దేవదత్తయా॥ ౫౦॥ కథాం శ్రుత్వా మహేశాన ముపాగమ్యాబ్రవీదిదం । సాధు శంకరసర్వజ్ఞోస్యనృతం సమ్యగుక్తవాన్॥ ౫౧॥ మమోక్తాం వా కథాం గూఢా మనన్యవిదితేతిహా । సఖీనాం దేవదత్తామే కథయత్తాం కథామిహ॥ ౫౨॥ హాహం తత్వమపిస్వామి న్ననృతం వక్షివై కథం । ఇత్యుక్తోంబికయా శంభు ర్విస్మయక్రోధమూర్ఛితః ॥ ౫౩ ॥ ఆహూయ దేవదత్తాం తా మిత్యపృచ్ఛద్ద్విజేశ్వరాః । తవకః కథయామాస దేవదత్తే కథామిమాం ॥ ౫౪ ॥ తేనపృష్టా శివేనేయం దేవదత్తాబ్రవీదితిః । పుష్పదంతో మమపతిః ప్రాబ్రవీత్తాం కథాం ప్రభో॥ ౫౫॥ తస్యాస్తద్వచనం శ్రుత్వా పుష్పదంతం శివోబ్రవీత్ । పుష్పదంత శ్రుతా కేనకథేయమితి మేవద ॥ ౫౬ ॥ ఇతిపృష్టశ్శివేనాథ పుష్పదంతోన రేశ్వరః । వేప

---

ప్పచున్నాను మీరువినుండు - అని దేవదత్త చెప్పఁగా నామాటను బార్వతీదేవి విని యట్లైన నో దేవదత్తా చెప్పుమాకథను జెప్పుమనెను - పార్వతీ దేవిచేత నానతియీఁబడినదై దేవదత్తయాకథను జెప్పెను - ౪౯ - అప్పుడా దేవదత్త చెప్పినకథ ముందరిరాత్రియందా పార్వతీదేవికి సాంబశివుఁడు చెప్పిన కథగా నేయుండెనోయి బ్రాహ్మణోత్తములారా - దేవదత్తచేతఁ జెప్పఁబడిన కథను విని యాపార్వతీదేవి కోపముతోఁ గూడినదై సాంబమూర్తియొద్దకుఁ బోయి యయనతో నిట్లనెను - ఓశంకరుఁడా లెస్సగానున్నది సర్వము తెలిసినవాఁడవు గనుకఁ జక్కఁగానబద్ధము చెప్పితివి - ౫౧ - ఈకథనెవ్వరు నెఱుఁగరని రహస్యకథయని నాకునీవుచెప్పినకథ నిప్పుడు నాచెలికత్తెల కందఱకు దేవదత్త యిక్కడఁజెప్పెను- ౫౨- ఆశ్చర్యమయ్యోస్వామీ నీవుగూడ నీప్రకారమబద్ధమెట్లు చెప్పితివి - అనియిట్లా పార్వతిచేతఁ జెప్పఁబడినవాఁడై యాసాంబమూర్తియాశ్చర్యముచేతనుగోపముచేతను మూర్ఛనొందినవాఁడై యాదేవదత్తనుబిలిచియిట్లనియడిగెనోయి బ్రాహ్మణశ్రేష్ఠులారా - ఓదేవదత్తా యీకథనునీకెవఁడుచెప్పెను - ౫౪ - అనియిట్లా సాంబశివునిచేత నడుగఁబడినదై దేవదత్తయిట్లనిచెప్పెను - ఓస్వామీ యాకథనునాకునా పెనిమిటియైన పుష్పదంతుఁడుచెప్పెను - ౫౫ - ఇట్లాదేవదత్తచెప్పినమాటనువిని యంతటనాశివుఁడుపుష్పదంతునిఁగూర్చి యిట్లనెనో పుష్పదంతుఁడా నీవీకథ నెవనివలన వింటి

మానో భృశం త్రస్తో హీనస్వర మువాచహ ॥ ౫౭ ॥ నజానామిమహాదేవ మ
యాసా దుర్థియాకథా । పుష్పార్పణాయపూర్వేద్యు ర్నిశిద్వారి స్థితేనవః॥
౫౮ ॥ శ్రుతాథకథితాదేవ దత్తాయైచ దయానిధే । అహమేవాపరాధీచ దం
డనీయోమహేశ్వర ॥ ౫౯ ॥ అనాగాస్సామమవిభో పత్నీ నార్హాతిదండితుం
తస్మిన్నేవం బ్రువాణేతు శంకరః క్రోధవిహ్వలః॥ ౬౦॥ శశాపైనం పుష్పదం
తం తత్పత్నీం తాపసోత్తమాః। ధిఙ్మూఢతవకేబుద్ధింనీచాత్మన్కామమోహిత॥
౬౧ ॥ రహస్యాన్యావయోర్వాక్యా న్యశ్రుణోరవివేకతః । కథాం తామప్య
కథయోజాయాయై మోహవిభ్రమాత్ ॥ ౬౨॥ తస్మాత్త్వం ఘోరరూపేణ బే
తాళోభవదుర్మతే । సఖిజనానాం పార్వత్యా యావమానం చకారసా॥ ౬౩॥
దుష్టాతవైషాగృహిణీ హరిణీచ భవిష్యతి । శపంతమితి దేవేశం పుష్పదంతో
భయాకులః ॥ ౬౪ ॥ సజానిరబ్రవీద్వాక్యం శోచన్ భూసుర శేఖరాః । దేవ

---

వో నాకుఁజెప్పుము - ౫౬ - ఈప్రకారము సాంబశివునిచేత నడుగఁబడినవా
డై యంతనాపుష్పదంతరాజుగడగడవడఁకుచుమిక్కిలిబయపడి హీనమైనస్వ
రముతోఁజెప్పెను - ౫౭ - స్వామినాకుఁదెలియదు నిన్నరాత్రి పువ్వుల సమ
ర్పింపవచ్చిదుష్టబుద్ధిగల నేనుమీరహస్య గృహమువాకిటనిలిచియుండి యాక
థనువింటిని - తరువాత దేవదత్తకొఱకుఁజెప్పితిని దయాసముద్రుడవైన స్వా
మీ నేనేతప్పుచేసినవాఁడను దండింపఁదగినవాఁడను - ౫౯ - ఓస్వామీ నాభా
ర్యయయిన యాదేవదత్తయందుఁ దప్పులేదు కాఁబట్టి యామె దండనార్హురా
లుగాదు- అనియాపుష్పదంతుఁడుచెప్పుచుండఁగా సాంబమూర్తి కోపముచే
తఁబరవశుఁడై యీపుష్పదంతుని నతనిభార్యను శపించెనోయి బ్రాహ్మణో
త్తములారా - ఓకామముచేత మయకమును బొందిన నీచ స్వభావము గల
వాఁడా మూఢుఁడా నీబుద్ధి నేమిచెప్పవలయును- ౬౧ - మేము రహస్యము
గామాటలాడుకొనుమాటలను వివేకములేక వింటివి - మోహముచేతభ్రమ
పడి యాకథనుభార్యకొఱకుఁగూడఁ జెప్పితివి - ౬౨ - కావున నోదుష్టబుద్ధి
గలవాఁడా నీవుభయంకరమైన రూపముతో బేతాళుఁడవుకమ్ము - పార్వతి
యొక్క చెలులకవమానము కలుగఁ జేసెను గనుక యా నీభార్యమిక్కిలి దు
ర్మార్గురాలు - ఈమె యాడులేడిగా గండు ఈప్రకారము శపించుచు
న్న యాదేవదేవునిఁగూర్చి పుష్పదంతుఁడుభయముచేతఁ బొర్లుచుచు భా
ర్యతోఁగూడినవాఁడై దుఃఖపడుచు నిట్లనెనోయి బ్రాహ్మణవర్యులారా - ద

దేవ దయాసింధో పాహిమాం భక్తవత్సల॥ ౬౫॥ శాపస్యాంతం నపశ్యామి దయాం కురుమయిప్రభో । అవసానం కల్పయాస్యావ యో శ్శాపస్యశంకర॥ ౬౬ ॥ తరేవయేనశాపాబ్ధి మపారం దుస్తరం ప్రభో । ఇతిసంప్రార్థిత స్తేనా బ్రవీత్తం శంకరోద్విజాః ॥ ౬౭ ॥ భవేద్దివాతే హరిణీ పత్నీరాత్రౌతు యక్షిణీ । యదాభవిష్యత్యన్యోన్యం దర్శనం యువయో స్తదా ॥ ౬౮ ॥ ముక్తౌభవేతాం మచ్ఛాపాద్దుష్కరాచ్చయువాముభౌ । ఇతఃకలౌయుగే రాజా విక్రమాదిత్య సంజ్ఞకః ॥ ౬౯ ॥ దయాళు స్సత్యసంధశ్చ తేజస్వీ పటువిక్రమః । ఉత్పత్స్యతే మహాబాహు స్తేన సర్వం భవిష్యతి ॥ ౭౦ ॥ ఇత్యుక్త్వాతం తతశ్శంభు రవరోధం వివేశసః । పుష్పదంతః పరిత్యక్త రాజవేష స్తతఃక్షణాత్ ॥ ౭౧ ॥ ముసలం ముద్గరం చైవ భిండివాలం పరశ్వధం । పట్టసం తోమరం ఖడ్గం గదాంకుంతంతథైవచ ॥ ౭౨ ॥ లగుడం శింజినీయుక్తం ధనుర్బాణాన్ భయంకరాం । క్షురికాంచంద్రహాసంచ తోమరం శత్రుదారణం ॥ ౭౩ ॥ ఇత్యాద్యా

---

యకుసముద్రుఁడా దేవతలకెల్ల దేవుఁడా భక్తులయందుఁ బ్రీతిగలవాఁడా స్వామీనన్నురక్షింపుము - ౬౫ - తామిచ్చిన శాపమునకుఁదుదదెలియకయున్నది స్వామీ నాయందుదయజేయుము - ఓశుభమునుజేయుస్వామీ యిప్పుడు దాముమాకిద్దఱకిచ్చిన యీశాపమునకంతమునుగల్పింపుము - ౬౬ - దాఁటఁగూడక గట్టులేకయుండునీశాపమను సముద్రము నేరీతిగదాఁటుదుము - అనియిట్లాపుష్పదంతునిచేతఁ బ్రార్థింపఁబడియంతనాతనిఁగూర్చి యాశివుఁడిట్లనెనయా బ్రాహ్మణులారా - ౬౭ - నీభార్య పగలు లేడిగా నుండి రాత్రియక్షకన్యక యగును - ఎప్పుడునీవును నీభార్యయునొకరొకరినిఁ జూచుట గలుగునో యప్పుడుకష్టమైన నేనిచ్చిన యీ శాపమునుండి మీరువిడువఁ బడినవారగుదురు - ఇఁకమీఁదగలియుగమందు విక్రమార్కుఁడనుపేరుగల యొకరాజుమిక్కిలి దయగలవాఁడును సత్యప్రతిజ్ఞగలవాఁడును దేజోవంతుఁడునుమిక్కిలిపరాక్రమముగలవాఁడును బుట్టఁగలఁడు - అతఁడు మిక్కిలి భుజబలముగలవాఁడతనిచేతనీచెప్పినదెల్ల జరుగఁగలదు - ౭౦ - ఇట్లాపుష్పదంతునిఁగూర్చి చెప్పి యంతనాసాంబమూర్తి యంతఃపురమును జొచ్చెను - అంతనాపుష్పదంతుఁడొకక్షణములో రాజవేషముతొలఁగి భయంకరమైన రూపముతోనరణ్యమందు ముసల ముద్గర భిండివాల పరశ్వధములనున్ను పట్టసతోమర ఖడ్గగదాకుంతలమునున్ను లగుడమునున్ను శింజినియుక్తమైన ధనుస్సునున్ను భయం

యుధజాలాని వహన్ హస్తే మహాబలః । ఆధర్వణానాం మంత్రాణాం గురు
భూత్వా స్వయంతువై ॥ ౨౪॥ సర్వేషాం రాజ బృందానాం శిక్షకశ్శత్రుభీ
షణః । శతుష్షష్టికళాపూర్ణః స్సర్వకర్మ విశారదః ॥ ౨౫ ॥ భూతప్రేతపిశా
చాది శాకినీడాకినీప్రభుః । వక్రతుండో వక్రపాదో హ్రస్వపాణిః కృశోదరః॥
౨౬ ॥ తీక్ష్ణదంష్ట్రో బకగళః కంటకశ్మశ్రులోభృశమ్ । తీక్ష్ణదంతో విశాలా
స్యః ఘోరరూపో భయావహః ॥ ౨౭ ॥ దీర్ఘనాసో దీర్ఘకర్ణః భీషణా
క్షో మహాబలః । బృహన్నిటలసంయుక్తః సర్వేషాంభీషణాకృతిః॥ ౨౮ ॥ ఘో
రైశ్చ లక్షణైర్యుక్తః భూత బృందాధిపోజటీ । సర్వస్య రాజబృందస్య ఖడ్గ
యుద్ధోపదేశకః ॥ ౨౯ ॥ ధనుర్వేదోపదేష్టాచ బేతాళ స్సబభూవహ । ఉజ్జ
యిన్యాఃపురఃప్రాచ్యాం విద్యమానాంసుశోభితాం॥ ౩౦॥ మహాటవీం ప్రవి
శ్యాథ సింహవ్యాఘ్రైః సుసేవితాం । వానరై రచ్ఛభల్లైశ్చ గోలాంగూలై

---

కరములైన బాణములనున్ను మంగిల కత్తినిన్ని చంద్రహాసమునున్ను తో మరమునున్ను శత్రువులను భేదించెడి యివిమొదలైన ఆయుద సమూహములను హస్తమందువహించుచున్న మహాబలశాలియున్న తానుఆధర్వణమంత్రములకు గురువై సకలరాజ సమూహములకు శిక్షచెప్పెడివాడై చతుష్షష్టికళాపూర్ణుడై భూతప్రేత పిచాచశాకినీడాకినీగణములకు ప్రభువై వంకర ముఖముగలవాడై వంకరపాదములు గలవాడై కురుచచేతులు గలవాడై కృశించిన ఉదరముగలవాడై తీక్ష్ణములైన కోరలుగలవాడై కొంగయొక్క కంఠముువంటి కంఠముగలవాడై ముల్లువంటి మీసముగలవాడై మిక్కిలి తీక్ష్ణములైన దంతములు గలవాడై వెడల్పైన నోరుగలవాడై భయంకరమైన రూపముగలవాడై భయమునుకలుగఁజేసెడివాడై దీర్ఘమైన ముక్కుగలవాడై దీర్ఘములైన చెవులుగలవాడై భయంకరములైన నేత్రములు గలవాడై మిక్కిలి బలముగలవాడై పెద్దదిగానుండెడి ఫాలతలము గలవాడై అందరికిన్ని భయంకరమైన ఆకారము కలవాడై మరియును ఘోరములైన లక్షణములతోకూడుకొనిభూతబృందములకుఅధిపతియై జటాధారియైసకలరాజబృందమునకు ఖడ్గయుద్ధము నుపదేశించుచు ధనుర్విద్య నుపదేశించుచు బేతాళుడుగా ఆ పుష్పదంతుడు ఆయెను ఉజ్జయినీ పట్టణమునకుముందర తూర్పుదిక్కునందునుండు నటువంటిన్ని సింహవ్యాఘ్రాదులచేత - సేవింపబడి నటువంటిన్ని వానరులచేతనున్ను - ఎలుఁగుగొడ్లచేతనున్ను కొండముచ్చులచేతనున్ను

శ్చసేవితాం ॥ ౮౧ ॥ వృకసంఘాతచరితాం శివారుత విభీషణాం । గజబృం
దసుసంకీర్ణాంపద్మినీబృందశోభితాం ॥ ౮౨ ॥ అనేకైః పక్షిసంఘైశ్చ నివా
సితమహీరుహాం । కోకిలారావ సంఘుష్టాం పాషాణై ర్దంతురాంతరాం ॥
౮౩ ॥ తత్రైకంవటవృక్షంతు సదదర్శ మహాబలః । శతయోజన విస్తీర్ణం
తద్ద్వయోన్నతిశోభితం ॥ ౮౪ ॥ మహాశాఖా సమాయుక్తం సూర్యరశ్మి
నివారకం । తస్యవృక్షస్య పూర్వస్మిన్ భాగేపత్ర సమాకులాం ॥ ౮౫ ॥ ఏ
కాంశాఖాంసమాశ్రిత్య బేతాళోహి రరాజసః । తస్యభార్యా దేవదత్తా పు
ష్పిణీతిచ విశ్రుతా ॥ ౮౬ ॥ ఈశ్వరస్య చపార్వత్యాశ్శాపేన హారిణీత
నుం । అవాప్యసుందరాంగీసా తస్మిన్నేవ మహావనే ॥ ౮౭ ॥ ఇతస్తతశ్చ ధా
వంతీ హరిణీభిస్సమన్వితా । సర్వాదిశో వీక్షమాణా స్వచ్ఛాయాంచ ము
హుర్ముహుః ॥ ౮౮ ॥ శిర ఉన్నమ్యసాదేవీ భీతభీతాదినే తథా । దర్భాం
కురాన్ భక్షయంతీ తథాబాల తృణానిచ ॥ ౮౯ ॥ మృగతృష్టాం జలభ్రాంతిం

---

సేవింపబడినట్టువంటిన్ని వృకసమూహములచేత సంచరింపబడి నట్టువంటిన్ని నక్కలయొక్క ధ్వనులచేత భయంకరమైనట్టిన్ని గజసమూహరులచేత వ్యాపింపబడినట్టిన్ని తామరతటాక సమూహములచేత ప్రకాశింపఁజేయబడి నట్టువంటిన్ని అనేకపక్షి సమూహముల చేత వసింపబడిన వృక్షములు గలిగినట్టిన్ని కోకిల ధ్వనులచేత ఘోషింపబడినట్టిన్ని రాళ్లచేత మిట్టపల్లముగానుండు మధ్యప్రదేశము గలిగినట్టిన్ని మిక్కిలి ప్రకాశించుచున్న పెద్దఅడవిని ప్రవేశించి అచ్చట నూరుయోజనదూరము విస్తారముగానున్న ఇన్నూరు యోజనదూరము ఔన్నత్యముచేత ప్రకాశించినదియును పెద్దశాఖలతో కూడుకొన్నదియును సూర్యకిరణములను నివారించెడు నొకానొకమఱ్ఱిచెట్టును ఆబేతాళుడు చూచెను ఆవృక్షముయొక్క పూర్వభాగము నందు ఆకులతో నిండిన ఒకకొమ్మను ఆశ్రయించి ఆబేతాళుడు ప్రకాశించుచు నుండెను అతనిభార్య దేవదత్తయుపుష్పిణియనెడుపేరుచేత ప్రసిద్ధినొందినది- ౮౬- సౌందర్యవంతమైన శరీరముగల దేవదత్తయు పార్వతీపరమేశ్వరుల యొక్క శాపముచేత లేడిశరీరమునుబొంది ఆమహావనమందే అంతట పరుగెత్తుచున్ను - లేళ్లతోకూడుకొనిసమస్తదిక్కులనుచూచుచున్ను తననీడనుమాటిమాటికిచూచుచున్ను తలపైకెత్తుకొని ఆదేవియుపగటియందు భయపడుచున్ను దర్భమొలకలనుభక్షించుచున్ను లేతగడ్డలనుభక్షించుచున్ను జలభ్రాంతిచేతపూట్టి

త్వా ధావమానా ముహుర్ముహుః । హరిణీ గణమాలోక్య తేనసాకం త
థావసత్ ॥ ౯౦॥ రాత్రౌతు యక్షిణీ భూత్వా నృత్తగీతవిశారదా । షడ్జాది
స్వరసంయుక్తం తంత్రీలయ సమన్వితం ॥ ౯౧ ॥ శ్రోతౄణాం శ్రోత్రమధు
రంశివస్తుతిసమన్వితం । సంగీతంగాయమానాస్మ వత్సతేతత్రసావనే॥ ౯౨ ॥
ఇతిశ్రీ బ్రహ్మకృతే బ్రహ్మాండ పురాణే - ఉత్తరఖండే - దేవాంగచరితే - పు
ష్పదంతోపాఖ్యానే - బేతాళ శాపప్రదానంనామ వింశోధ్యాయః.

శ్రీసూతః॥ తతఃకలియుగే భూమ్యాం సంప్రవృద్ధేతిదారుణే । వేద
నారాయణపురేవిష్ణుశర్మాబభూవహ ॥ ౧ ॥ తస్యపుత్రాస్తు చత్వారః బభూ
వురతితేజసః । యజ్ఞ నారాయణాఖ్యశ్చ వేదనారాయణాభిధః ॥ ౨ ॥ వీర
నారాయణశ్చైవ చంద్రశర్మా తివిశ్రుతః । కనీయసం వినాసర్వే సర్వశా
స్త్రవిశారదాః ॥ ౩ ॥ సర్వేవై నీతినిపుణాః వ్యవహారేషుకోవిదాః । ఆలోచ
నే మహాప్రజ్ఞాః బభూవు ర్గుణవత్తరాః ॥ ౪ ॥ తేసర్వేస్వస్వ పాండిత్యైః

---

మాటికి మృగతృష్ణనుగూర్చిపరుగెత్తుచున్న లేళ్లసమూహమును చూచిదాని
తో ఆప్రకారము వాసముచేయుచు నుండెను ॥ ౯౦ ॥ ఆదేవదత్తయు రాత్రికా
లమందైతే యక్షస్త్రీగాఅయినదై నృత్తగీతములయందుసమర్థురాలుగను
క షడ్జాదిస్వరములతో కూడుకొన్నట్టుగానున్న తంత్రీలయముతో కూడు
కొన్నట్టుగానున్న వినువారియొక్క చవులకుమధురముగా శివస్తుతితోకూ
డుకొనినసంగీతమును గానముచేయుచుఆవనమందుండెను - ౯౨ - ఇదిబ్ర
హ్మస్వరూపమైన బ్రహ్మాండ పురాణమందు ఉత్తర ఖండమందు దేవాంగ చరి
త్రమందు పుష్పదంతోపాఖ్యానమందు - బేతాళశాప ప్రదానమైన యిరువ
దవ అధ్యాయముముగిసెను.

సూతపౌరాణికుడు ఋషులకు బేతాళునిచరిత్రయందు విష్ణుశర్మోపాఖ్యా
నము చెప్పుచున్నాడు-అనంతరముభూమియందు మిక్కిలిభయంకరమైనకలియు
గము వృద్ధిపొందియుండగా వేదనారాయణపురమందు విష్ణుశర్మఅనెడు బ్రాహ్మ
ణుండుండెను- ౧- అతనికి యజ్ఞనారాయణుడనిన్ని వేదనారాయణుడనిన్ని
వీర నారాయణుండనిన్ని చంద్రశర్మ అనిన్ని పేళ్లుగలిగి మహాతేజస్సం
పన్నులయి నలుగురు పుత్రులుపుట్టిరి కడపటి వానినితప్ప అందరున్ను సకల
శాస్త్రములయందు సమర్థులు - ౩ - అందరున్ను నీతిశాస్త్రముల యందు
నిపుణులు వ్యవహారములయందు మహాసమర్థులు ఆలోచనయందు మహా

సభాయాం బహుమానినః । శుశ్రూషాయాం నియుక్తాస్తైః కనీయానతిమందధీః ॥ ౫ ॥ విద్యాహీనస్తుతేషాంవై శుశ్రూషాం కురుతేస్మహి । ఏవం కాలే హ్యతిక్రాంతే శుశ్రూషాయాం విరక్తిమాన్ ॥ ౬ ॥ చింతాక్రాంత స్తదనుజః చింతయామాసతాపసః । విద్యాహీనం సోదరామాం శుశ్రూషార్థం నియుంజతే ॥ ౭ ॥ కథం విద్యామహం లోకే ప్రాప్నుయామితిచాసకృత్ । ఆలోచ్యసకనీయాం స్తుదైవేనైవ ప్రచోదితః ॥ ౮ ॥ స్వాభిప్రాయం చనోక్త్వావై తేషాంగే హాద్వినిర్గతః । అర్ధరాత్రే స వర్ణీతు మార్గచారీ బభూవహ ॥ ౯ ॥ ఉదితేచతతస్సూర్యే వేగద్దూరమతీత్యసః । పశ్చిమాద్రా లంబమానే మందరశ్మౌ దివాకరే ॥ ౧౦ ॥ అగ్రహారస్య చైకస్య సమీపే సుస్థితాంనదీం । ఆలోక్యోపాసితుంసంధ్యాం సంయతాత్మాయంతనీంవటుః ॥ ౧౧ ॥ అవగాహ్య నదింతాంతు సంధ్యోపాసన తత్పరః । జపన్నాస్తేస్మగాయత్రీం సావిత్రీం వేదమాతరం ॥ ౧౨ ॥ తదాత త్తీరజేశ్వత్థే వృక్షేవ్యోమగశాఖిని । చి

---

ప్రజ్ఞగలవారు మిక్కిలిగుణవంతులుగా నుండిరి - ౪ - వారందరున్ను తమతమ పాండిత్యములచేత సభయందు బహుమానమును జెందిరి - వారలచేత మిక్కిలి మందబుద్ధిగల కడపటివాడు విద్యాహీనుడు గనుక శుశ్రూషయందుని యోగింపబడి వారలకు శుశ్రూష చేయుచునుండెను - ఇట్లుకొంతకాలము అతిక్రమింపగా నతడు శుశ్రూషయందు విరక్తిచెందెను - ౬ - ఈప్రకారము వారలతమ్ముడు చింతాక్రాంతుడై యోబుద్ధులారా వాడుఆలోచించెను - విద్యాహీనుడనుగనుక నన్ను సహోదరులుశుశ్రూషార్థము ఆజ్ఞాపించిరి - నేను లోకమందు విద్యను ఎట్లు పొందుదునని మాటిమాటికి వారల యొక్క తమ్ముడైన అతడు దైవముచేతనే ప్రేరేపింపబడి వారలకు తనఅభిప్రాయము చెప్పకయే అర్ధరాత్రి కాలమందు ఇంటినుండి బయలువెడలి బ్రహ్మచారిగానుండు నతడుమార్గమందు సంచారిగా ఆయెను - అనంతరము సూర్యోదయమయినతర్వాత బహుదూరము అతిక్రమించిపోయి యస్తమయ కాలమందు సూర్యుడు మందకిరణము గలవాడై పశ్చిమాద్రి యందు వ్రేలుచు నుండగా ఒక అగ్రహారముయొక్క సమీపమందుండెడు నదిని చూచి సాయం సంధ్యను చక్కగా ఉపాసించుట కొరకు ఆనదినిదిగి సంధ్య నుపాసించుచున్ను వేదమాతయున్ను సూర్యదేవతాకమయిన గాయత్రిని జపము చేయుచు నుండెను - ౧౨ - అపుడు ఆనదీతీరమందు పుట్టినట్టిని ఆకాశమును వ్యాపించినశాఖలుగల అశ్వత్థవృక్షమునందు బహుకాలముగా వర్తించుచు

రాదవ్యస ద్బ్రహ్మరక్షః దృష్ట్వా తం వర్ణినం ముదా ॥ ౧౩ ॥ ఆగత్య బ్రాహ్మ
ణాకారీ చంద్రశర్మాణ మబ్రవీత్ । కస్త్వం భో కుతఆయాసి కుత్ర గంతా
వటోవద ॥ ౧౪ ॥ ఇతిపృష్ట స్తదా తేన చంద్రశర్మా కుతూహలీ । విప్రాకారం బ్ర
హ్మరక్షః తన్మత్వా బ్రాహ్మణోత్తమం॥ ౧౫ ॥ తద్గ్రామస్థం తతశ్శీఘ్రం అవో
చద్వచనం వటుః ॥ చంద్రశర్మా॥ వేదనారాయణ పురే విష్ణు శర్మేతి విశ్రు
తః ॥ ౧౬ ॥ ద్విజోభూత్తస్య తనయాః చత్వారః బ్రాహ్మణోత్తమ । తేషాం
తుమాం కనీయాంసం విద్ధి విద్వన్మహామతే॥ ౧౭॥ అహంతు విద్యామాదాతుం
ఆగతోస్మి మహాగురోః। ఇత్యుక్తవతి తస్మింస్తు బ్రహ్మరక్షో బ్రవీత్తదా ॥ ౧౮ ॥
అహం దదామి తే విద్యాః వేదవేదాంగ సంయుతాః । అభ్యాసం కురు తాసాం
వై యది తే రోచతే మనః ॥ ౧౯ ॥ ఇత్యాకర్ణ్య వచస్తస్య సవటుః ప్రముమో
దహ । తథైవకరవాణీతి వాక్యం చైతదువాచహ ॥ ౨౦ ॥ తత్సంకల్పం
సమాకర్ణ్య బ్రహ్మరక్షో వదత్తదా ॥ ౨౧ ॥ పశ్య రూపం మమవటో మాభై

---

న్న బ్రహ్మరక్షస్సు ఆ బ్రహ్మచారిని చూచి సంతోషముతో బ్రాహ్మణాకారముగలదై ఆచంద్రశర్మనుగూర్చి నీవెవ్వడవు ఎక్కడనుండి వచ్చుచున్నావు ఎచ్చటికి బోవుచున్నావు ఓ బ్రహ్మచారీ చెప్పుమని అడిగెను - ఈ ప్రకారముగా ఆ బ్రహ్మ రక్షస్సుచేత అడుగబడి చంద్రశర్మ కుతూహలము గలవాడై బ్రాహ్మణా కారముగా నుండెడు బ్రహ్మరక్షస్సును ఆ గ్రామమందువసించుచున్న బ్రాహ్మణోత్తమునిగా తలచి శీఘ్రముగా ఆ బ్రహ్మ రక్షస్సును గూర్చి వచనమును పలికెను - ఓ బ్రాహ్మణుడా వేదనారాయణ పురమందు విష్ణుశర్మయని యొక బ్రాహ్మణుడుగలడు అతనికి నలుగురు పుత్రులు విద్వాంసులైన బ్రాహ్మణోత్తముడా ఆనలుగురిలో నన్ను కడపటివానిగా నెఱుగుము- ౧౭- నేనైతే పూజ్యగురువునుండి విద్యను గ్రహించుటకై వచ్చినవాడను అని అతడు పలుకుచు నుండగా అప్పుడు ఆ బ్రహ్మరక్షస్సు చెప్పెను నేను వేదవేదాంగములతో కూడుకొనిన విద్యలను నీకిచ్చుచున్నాను నీకుమనసురుచించినట్లైతే ఆ విద్యల యొక్క అభ్యాసమును చేయుమా అనిన నా బ్రహ్మరక్షస్సు యొక్క వచనమువిని ఆచంద్రశర్మ అను బ్రహ్మచారియు ప్రమోదమును చెందెను మరియును ఆప్రకారమే విద్యలను అభ్యసింతునని వాక్యమును పలికెను అపుడా బ్రహ్మరక్షస్సు అతని నిశ్చయ సంకల్పమునువిని అప్పుడు చెప్పినదియేమనిన ఓ బ్రాహ్మణ పుత్రుడా నారూపమునుచూడుము నీవు భయపడకుము

షీ బ్రహ్మపుత్రక । ఇత్యుక్త్వాతం బ్రహ్మరక్షో దర్శయత్ స్వాకృతింతదా॥ ౨౨॥ బ్రహ్మరక్షస్స్వరూపం తత్ చంద్రశర్మావిలోక్యచ । దృష్టింపిధాయబహుశోభిభేతిస్మభృశం ముహుః ॥ ౨౩ ॥ తత్ క్షణే బ్రహ్మరక్ష స్తత్ పూర్వవద్బ్రాహ్మణాకృతి । భూత్వాతస్య వటోర్భీతిం జహారమునిపుంగవాః॥ ౨౪॥ తత స్తమశ్వత్థతరో రూర్ధ్వదేశం ప్రణీయసః । విద్యా అపాఠ యత్సర్వాః నిద్రాహార వివర్జితం ॥ ౨౫ ॥ షట్సుమాసే ష్వతీ తేషు బ్రహ్మరక్ష స్తదబ్రవీత్ । భోవటోసుందరాకార విద్యా దత్తామయాఖిలాః॥ ౨౬ ॥తుభ్యం మే శాపమోక్షశ్చ జాత ఏ వనసంశయః । ఇతఃపరం శీఘ్రమేవ గచ్ఛస్వీయంపురంప్రతి॥ ౨౭॥ అహం కాశీం గమిష్యామి గచ్ఛసౌమ్య స్వకంగృహం తవశ్రేయో భవేదేవ నాత్రకార్యావిచారణా॥ ౨౮॥ చత్వార స్తే భవిష్యంతి పుత్రా స్తే గుణవ త్తరాః । సామ్రాజ్యం తేపి సంప్రాప్య పాలయిష్యంతిమేదినీం॥ ౨౯॥ ఇత్యాశీర్వచనంతస్మై । దత్వాగంతుమియేషసః । తతశ్చచంద శర్మావై బ్రహ్మరక్ష స్తదబ్రవీత్ ॥ ౩౦ ॥ భోభో గురువరశ్రీమన్ వేద

---

అని చెప్పి తనఆకారమును చూపెను అప్పుడు ఆచంద్రశర్మ బ్రహ్మ రక్షస్సుయొక్కస్వరూపమునుచూచి మిక్కిలికన్నులుమూసికొని మాటిమాటికిభయము చెందెను - ఆక్షణమే ఆబ్రహ్మరక్షస్సు మునుపటివలెనే బ్రాహ్మణాకృతిఅయెను - ౨౩ - ఆబ్రహ్మరక్షస్సు బ్రాహ్మణాకృతివై ఆ బ్రహ్మచారియొక్కభయమును పోగొట్టెనో ఋషులారా - అనంతరం బ్రాహ్మణా కృతిగానుండెడియాబ్రహ్మరక్షస్సు అతనినాయశ్వత్థవృక్షముపైకి తీసికొనిపోయి నిద్రాహారములులేకయే సకలవిద్యలనుచదివించెను ఆరునెలలుగడచినపిమ్మట ఆబ్రహ్మరక్షస్సు ఆబ్రహ్మచారిని కూర్చిపలికెను ఓసుందరాకారుడైన బ్రహ్మచారీ నీకొరకుసకలవిద్యలును నాచేతనియ్యబడ్డవి- నాకుశాపవిమోక్షమాయెను అందుకు సందేహములేదు - ఇకమీద శీఘ్రముగానే స్వకీయ పట్టమును కూర్చిపొమ్ము - నేనుకాశినిగూర్చిపోవుచున్నాను - నీవింటికిపొమ్ము - నీకుశ్రేయస్సు కలుగును ఆవిషయమై యోచింపవద్దు - మరియును నీకుమిక్కిలి గుణవంతులైన నలుగురుపుత్రులుకలుగపోవుచున్నారు- ౨౮ - ఆపుత్రులుసామ్రాజ్యాధిపత్యమునుపొంది భూమినిపాలింపగలరు - అని ఆశిష్యునికొఱకు ఆశీర్వదించి అతడుకాశికిపోవుటకై యిచ్ఛయించెను - అనంతరమాచంద్రశర్మ ఆబ్రహ్మరక్షస్సునుగూర్చి పలికెను - ఓయప్రైశ్వర్యముగల గురుశ్రేష్ఠుడా నీవు వేద

వేదాంగపారగ । సర్వశాస్త్రార్థ తత్వజ్ఞో భవాన్నైవ నాత్రసంశయః॥ ౩౧॥ బ్రహ్మరక్షస్త్వ మే తతే । కుత ఆయాత మద్యవై । తన్మోచనం కథం జాతం సమ్యక్త్వం వక్తుమర్హసి ॥ ౩౨ ॥ ఏతద్వచనమాకర్ణ్య బ్రహ్మరక్షస్తదాబ్రవీత్ । శ్రుణు వక్ష్యామితే బ్రహ్మన్ శాపం తన్మోక్షణం చమే ॥ ౩౩ ॥ పురాకృష్ణానదీతీరే అగ్రహారో మహానభూత్ । సరస్వతి పురాఖ్యస్తు విద్వన్ మండలమండితః ॥ ౩౪ ॥ తత్రాహ మవసం సర్వ వేదశాస్త్ర విశారదః । విద్యార్థీ కశ్చిదా గత్య నమస్కృత్యచ మాం పునః ॥ ౩౫ ॥ ప్రార్థయామాసహేవిద్వన్ విద్యామేదేహిసాదరం । మయాకించి దధీతం వై నతు సమ్యగ్గురూత్తమ॥ ౩౬॥ ఇతితస్య వచశ్శ్రుత్వా సగర్వ మహమబ్రువం । కస్మైచిదపి లోకేస్మిన్ విద్యావేదాదికాద్విజ॥ ౩౭॥ నాహం వచ్మితతశ్శీఘ్రం గఛగఛేతిచాబ్రువం । తతస్స బ్రాహ్మణ శ్రేష్ఠోమా మువాచక్రుధాన్వితః ॥ ౩౮ ॥ విద్యా సర్వా స్సాధయామి చానస్మాద్వై గురోరహం । త్వయి తిష్ఠం తుతే

---

వేదాంగ పారగుడవు సకల శాస్త్రార్థముల వాస్తవ్యము తెలిసిన వాడవు ఈవిషయమందు సందేహములేదు - ఈబ్రహ్మరక్షస్త్వము నీకెవనివల్ల వచ్చెను - ఇప్పుడు అందుకు మోచనమెట్లుకలిగెను నాకుచక్కగా తెలుపవలెనని చెప్పిన నామాటనువిని యాబ్రహ్మరక్షస్సు చెప్పినది యేమనగా నోబ్రాహ్మణుఁడా నాకువచ్చిన శాపమునున్ను శాపమోక్షణమునున్ను నీకు తెలియ చెప్పెదను పూర్వకాలమునందు కృష్ణానదీ తీరమునందు సరస్వత పురమని పేరుగలదియును విద్వన్మండలముచేత నలంకరింపబడినదియును మిక్కిలి పూజ్యమైన అగ్రహారము కలదు ఆయగ్రహారమునందు సకల వేదశాస్త్రములయందుసమర్థుఁడైన నేనువసించితిని - ౩౪ - ఒకవిద్యార్థి వచ్చి నన్ను గూర్చి నమస్కరించి యోవిద్వాంసుడా నాకొరకు విద్యయిమ్మని ఆదరణతో నన్నుప్రార్థించెను - మరియునాచేత కొంచముచదువుకోబడ్డది చక్కగా చదువుకో బడలేదు ఓగురు శ్రేష్ఠుడా నాకు విద్యాదానము చేయుమా అని ప్రార్థించిన యతనివచనమునువిని నేనుగర్వముతో పలికితిని . ఓ బ్రాహ్మణుఁడా వేదాదికమైన విద్యను నేనెవనికిని జెప్పను కాఁబట్టి నీవు శీఘ్రము గఁబొమ్మంటిని - అనంతర మాబ్రాహ్మణశ్రేష్ఠుడు కోపముతోఁ గూడుకొన్నవాడై నన్ను గూర్చి పలికెను - ౩౮ - ఏమంటే వేరేగురువువల్లనుండి నేనుసకల విద్యలనున్ను సాధింపు చున్నాను ఓబ్రాహ్మణాధముఁడా నిష్పలములై

విద్యాః నిష్ఫలా బ్రాహ్మణ బ్రువ ॥ ఇత్యుక్త్వా ప్రమాంశ శాపాశు బ్రహ్మర క్షో భవేతిసః । తత స్తంభయసంభ్రాంతః యయాచే శాపమోచనం॥ అనుగృ హ్ణీష్వమాం బ్రహ్మన్ కృపాం కురుమయిప్రభో । మయైవం ప్రార్థితో విప్రః సో౽బ్రవీ న్మామధోముఖ ॥ ౪౧ ॥ కాలేతీతే కతిపయే చంద్రశర్మా గమిష్య తి । విద్యాగ్రృహీతుం సకలాః అన్యదేశా త్త్వాంతికం ॥ ౪౨ ॥ సమాగమస్తు భవితా కృష్ణాతీరేతవద్విజ । తేనసాకం తదాతస్మై సర్వవిద్యాదిశద్విజ ॥ ౪౩ ॥ గంగాస్నానం కురుతతః శాపాన్ముక్తో భవిష్యసి । ఇత్యుక్త్వామాంస విద్యార్థిస్స్వేష్టదేశం జగామహ ॥ తతో౽భూత్వా బ్రహ్మరక్షో వస మస్మిన్ మహీరుహే।త్వదాగమనమన్వీక్ష్యదై వయోగాత్త్వమాగతః। ఉపదిష్టాఖిలా విద్యామయాశిష్యాయతేవటో । అహం గంగాజలేస్నాతుం గచ్ఛామి ద్విజ పుంగవ ॥ భద్రమస్తు సదాతుభ్యం జయీభవసుఖీభవ । ఇత్యుక్త్వా తద్బ్ర హ్మరక్షఃతంప్రాప యృభునం ద్రుమాత్ ॥ ఆపృచ్ఛ్యచ గతో గంగాం స్నాతుం

---

స నీవిద్యలు నీయందె యుండనిమ్మని నన్నుగూర్చి పలికి నీవు బ్రహ్మరక్షస్సు కమ్మని నన్నుశీఘ్రమున నతడుశపించెను - అనంతరమునేను భయసంభ్రాం తుడనై శాపమోచనమునుగూర్చి యతని యాచించితిని - ఓబ్రాహ్మణుడా నాయందు కరుణింపుము నన్ను ననుగ్రహింపుమని ప్రార్థించితిని ఈప్రకారం నాచేతప్రార్థింపబడి అధోముఖుడై నన్నుగూర్చిపలికెను - ఏమంటెకొం తకాల మతిక్రమించిన పిమ్మట చంద్రశర్మ అను బ్రాహ్మణవిద్యార్థి యన్య దేశమునుండి సకలవిద్యలనుగ్రహించుటకై నీసమీపమునుగూర్చి రాబోచు న్నాడు కృష్ణాతీరమునందు అతనితో నీకుసమాగమము కలుగబోచున్నది అ పుడు అతనికొఱకు బ్రాహ్మణుడా నీవు సకలవిద్యలను నిమ్మా అనంతరముగం గాస్నానమును గురించి పొమ్మా నీవు శాపమునుండి విడువ బడుదువు అనిన న్నుగూర్చి ఆవిద్యార్థిపలికి తనకిష్టమయిన దేశమును గూర్చిపోయెను అ నంతరము అతనిశాపమువలన నేను బ్రహ్మరక్షస్సై ఈ యీవృక్షమునందు వ సించితిని నీరాకను నిరీక్షించుచు వసించుచుండగా దైవయోగమువలన నీవు వచ్చితివి - ౪౪ - ఓబ్రహ్మచారీ శిష్యుడైన నీకొరకు సకలవిద్యలును నాచేత నుపదేశింపబడినవి - నేను గంగాజలమందు స్నానము చేయుటకై పోవుచు న్నానోయి బ్రాహ్మణ శ్రేష్ఠుడా నీకొరకు సార్వకాలమున్ను మంగళముగ లుగుగాక నీవుజయముకల్గి సుఖముగలిగియుండుమూ అని ఆబ్రహ్మరక్షస్సు వ

పాపాపహారిణీం । తతస్తు చంద్రశర్మాపి విద్యా పారంగతోముదా ॥ ౪౮ ॥ స్వపురంగంతుమిచ్ఛన్వై యయామార్గాంతరేణసః । తతఃప్రవిశ్యోజ్జయినీం మహాప్రాకారశోభితాం ॥ ౪౯ ॥ వేశ్యాగృహం సమాసాద్య నిద్రాహార వివర్జితః । శ్రమేణాక్రాంతదేహస్సన్ । కృత్యాకృత్య వివర్జితః ॥ ౫౦ ॥ బ్రాహ్మణాగార బుద్ధ్యైవతస్య గేహస్య కుట్టిమం । అంతరం ప్రాప్య వసనం కటం కృత్వాతి కోమలం ॥ ౫౧ ॥ నిదద్రౌ సమహాప్రాజ్ఞః దేహజ్ఞాన వివర్జితః । తం సౌందర్యవతీనామ్నీ వేశ్యాకన్యావిలోక్యవై ॥ ౫౨ ॥ అయం స్యాన్మమ భర్తైవ సింహాసంహనసోయువా । ఇతినిశ్చిత్య మనసిమాతరం సాజగాదహ ॥ ౫౩ ॥ మాతర్విలోకయపతిం మమచేతోప హారిణం। నిద్రాణం కుట్టిమే రమ్యే సాక్షాన్మన్మథరూపిణం ॥ ౫౪ ॥ సుతాయాభాషితం శ్రుత్వా తన్మాతాశీఘ్రమాగతా । దృష్ట్వాతం బ్రాహ్మణశ్రేష్ఠం భూష

---

లికి అతనినిచెట్టునుండిభూమినిగూర్చిదించి అతనియొద్దసెలవుపుచ్చుకొని సకలపాపమును పోగొట్టెడు గంగనుగూర్చి స్నానము సేయుటకై వెళ్లెను అనంతరము చంద్రశర్మ అను బ్రాహ్మణుండును విద్యాపారంగతుడై సంతోషముతో తనపట్టణమునుగూర్చిపోవుటకై ఇచ్ఛయించుచు త్రోవతప్పివేరేమార్గముతో వెళ్లెను- ౪౮ - అనంతరము అతడు శ్రేష్ఠములైన ప్రాకారములచేత ప్రకాశింపజేయబడిన యుజ్జయినీ పట్టమును ప్రవేశించి ఆరునెలలునిద్రాహారములు లేనివాడు గనుక బడలికచేత నాక్రమింపబడిన దేహము కలవాడగుచు కృత్యాకృత్యములు లేనివాడై బ్రాహ్మణ గృహమనెడు బుద్ధిచేతనే వేశ్యాగృహమునుబొంది ఆగృహముయొక్క లోపలనుండెడి తిన్నెను పొంది మృదులమైన తనవస్త్రమునే చాపగా జేసికొని మహాప్రాజ్ఞుడుగానుండినను దేహజ్ఞానము లేనివాడై నిద్రపోయెను - ౫౧ - అతనినిసౌందర్యవతియనెడుపేరుగల వేశ్యాకన్యకచూచి శ్రేష్ఠములైన అవయవములతోకూడుకొనిన యితడేనాకుభర్తకావలెనని మనసునందు నిశ్చయించి ఆవేశ్యకన్య తల్లినిగూర్చిపలికెను - ఓతల్లీ నామనస్సు నపహరించెడి నాపతిని జూడుమా రమ్యమైన తిన్నెయందు నిద్రబోవుచున్నాడు సాక్షాత్తు మన్మథ స్వరూపిగానున్నాడు- ౫౪- అనిపలికినకొమార్తెమాటనువిని దానితల్లి శీఘ్రముగవచ్చినదై ఆబ్రాహ్మణశ్రేష్ఠునిజూచి భూషణాదులు లేక నిద్రబోవుచున్న అతనినితనుదరిద్రుడనితలచికోపముతోకూడుకొన్నదై పుత్రికనుగూర్చికోపగిం

ణాదివివర్జితం॥ ౫౫॥ స్వపంతంసా దరిద్రోయమితి మత్వారుషాన్వితా। చుకోపపుత్రికాం పుత్రి తవవై సదృశఃపతిః ॥ ౫౬ ॥ నాయం దరిద్ర స్తస్మాత్త్వం వృణీష్వాన్యం శ్రియఃపతిం ఇత్యుక్తవత్యా మాతుస్సా వచనం నా శ్రుణోత్తదా॥ ౫౭॥ మమభర్తాయ మేవేతి మాతరం సాబ్రవీత్పునః। అభిప్రాయం స్వదుహితుః వేశ్యాసాప్య న్వమోదత ॥ ౫౮ ॥ ఆషణ్మాసం తురాహిత్యాత్ సనిద్రాహారయో స్తదా। అచలత్పాణి పాదస్సన్ నిదద్రౌ తత్రకుట్టిమే॥ ౫౯॥ దివారాత్రం తథాభూతం వేశ్యా సావీక్ష్య సత్వరం। రాజ్ఞే నివేదయామాస తంవృత్తాంతమ శేషతః। ధ్వజకీర్తి రాజరాజః శ్రుత్వా వేశ్యావచ స్తదా। అత్యాశ్చర్యమనావైద్యాన్ శీఘ్రంధాతుపరీక్షకాన్॥ ౬౧॥ ఆహూయోవాచ హే వైద్యాః యూయం గఛ సత్వరం। నిద్రాణం బ్రాహ్మణం దృష్ట్వా సమ్యగ్ధాతుంపరీక్ష్యచ॥ ౬౨॥ తథాభూతసునిద్రాయాః హేతుం విజ్ఞాయశాస్త్రతః ఆగంతుమర్హథక్షిప్రమితిరాజ్ఞాప్రచోదితాః॥ ౬౩॥ తేవేశ్యాగృహమాగత్యదృష్ట్వా బ్రాహ్మణపుంగవం। నిద్రయాక్రాంతమనిశం తస్యధాతూన్ పరీక్ష్యవై॥

---

చుకొనెను మరియును ఓకొమార్తె యితడుదరిద్రుడుగాన నీకుతగినసతికాడు అన్యునిసంపత్కరుడై నవానిని వరింపుమనెను - ఇట్లుచెప్పిన తల్లి వచనము నాకొమార్తెవినక మఱియునుతల్లినిగూర్చి నాకితడే భర్తయని పలికెను- ౫౬ - అప్పుడు ఆవేశ్యయు తనకొమార్తె యభిప్రాయమును తానునుఅనుమోదించెను - ఆరునెలలపర్యంత మతడు నిద్రాహారములులేక పోవుటవలన కదలని హస్తపాదములు గలవాడగుచు అతిన్నెయందు నిద్రపోయెను- అప్రకారము అహోరాత్రము నిద్రపోవుచున్న యతని నావేశ్యచూచి రాజుకొరకావృత్తాంతమున శేషమును శీఘ్రముగ నెరుకచేసెను - అప్పుడు ధ్వజకీర్తి యనురాజాధిరాజు వేశ్య చెప్పిన వృత్తాంతమును విని అత్యాశ్చర్యముతో గూడుకొనిన మనస్సు గలవాడై ధాతుపరీక్ష తెలిసిన వైద్యులను శీఘ్రముగా రప్పించి ఓవైద్యులారా మీరు శీఘ్రముగాపొండు నిద్రపోవుచున్న బ్రాహ్మణునిచూచి లెస్సగా ధాతువును పరీక్షించి అట్లు సంభవించిన నిద్రకు కారణమును శాస్త్రమువల్ల తెలిసికొని శీఘ్రముగారండీ యని చెప్పెను- ౬౩- ఇట్లారాజుచేతపంపబడి ఆవైద్యులు వేశ్యాగృహమునుపొంది ఆబ్రాహ్మణశ్రేష్ఠునిఁజూచి సార్వకాలమును నిద్రచేత నాక్రమింపబడియున్న యతని ధాతువులనుపరీక్షచేసి అతని వృత్తాంతమంతయు నాదిమొదలుకొని రాజుకొరకెరుక

రాజ్ఞే నివేదరామాసుః తస్య వృత్తాంతమాదితః । అసౌ బ్రాహ్మణ దాయాదః నిద్రాహారవివర్జితః॥ ౬౫॥ కస్మాద్ధేతోర్హి ష ణ్మాస పర్యంతం స్థితవాన్ ప్రభో । తత్ర హేతుం న జానీమః చికిత్సాం క్రియతామియం॥ ౬౬॥ అముష్య విప్రవర్యస్య దేహ స్త్వన్నేన లిప్యతాం । దధి సంమిశ్రితేనైవ పేషితే నచ భూపతే ౬౭॥ ఏవముక్త్వాతు రాజానం తేజగ్ముః స్వస్వమందిరం । తతః పరం స వై ద్రోక్తాం చికిత్సాం విప్రపుంగవైః॥ ౬౮॥ నిద్రితస్య వటో స్తస్య కారయామాస భూపతిః । చికిత్సిత స్తథా విప్రః షణ్మాసానంతరం వటుః॥ ౬౯॥ నిద్రాం త్యక్త్వా సముత్తస్థౌ । చింతయామాస చ స్వయం। క్వాహం నిద్రాం తు కృతవాన్ । కస్యేదం వేశ్మ సుందరం॥ ౭౦॥ కేయం కన్యా చ చార్వంగీ త్యేవం జల్పన్ పునః పునః। స్వ మార్గ మనుసృత్యైవ గంతుమిచ్ఛన్ జగామ హ॥ ౭౧॥ వేశ్యా కన్యాతు సా దృష్ట్వా గచ్ఛంతం తం నిరుధ్య చ । గృహీత్వా తస్య చేలాంతం పాణినా వాక్యమ

---

చేసిరి ఓ మహా ప్రభువుగా నుండెడి రాజా ఈ బ్రాహ్మణుడే హేతువువలననో ఆరునెలలవరకు నిద్రాహారములు లేనివాడుగా నుండినాడు - ఆవిషయమైన కారణమును మేమెరుగము - ఇతనికి చికిత్స చేయవలెను విప్ర శ్రేష్ఠుడైన యితని దేహము పెరుగుతో సంమిశ్రితమై పిసుకబడిన అన్నముచేత లేపనము చేయబడుగాక - ఓరాజా యీప్రకారము చికిత్స చేయింపుమని రాజునుగూర్చి యెరుకచేసి వారివారియింటినిగూర్చి ఆవైద్యులు వెళ్లిపోయిరి - అనంతరమారాజు వైద్యులచేత చెప్పబడిన చికిత్సను బ్రాహ్మణశ్రేష్ఠులచే నిద్రపోవుచున్న యాబ్రహ్మచారికి చేయించెను- ఆప్రకారము చికిత్సచేయఁబడిన యాబ్రహ్మచారి యారునెలలకు తరువాత నిద్రనువిడిచి తనంతట తానేలేచి యాలోచించెను - ౬౯ - నేనెచ్చట నిద్రపోతిని సుందరమైన యీ గృహమెవనిది ఈకన్యకసుందరమైన యవయవములుకలిగియున్నది యిదియెవతెయని మాటిమాటికిపలుకుచున్న తనత్రోవననుసరించిపోవుటకై యిచ్ఛయించుచు బయలువెడలెను - అపుడుపోవుచున్న యతనిఁజూచి యావేశ్యకన్యకయు నడ్డగించి తనహస్తముచేత నతని వస్త్రముకొనను గ్రహించుకొని యొకవాక్యమునుపలికెను - ఓనాయకుడా నన్నువిడిచి యెచ్చటికిఁబోయెదవు ఆరునెలలపర్యంతము నీదేహమునకు శుశ్రూషచేయుచు భక్తిపూర్వకముగా నీవే పెనిమిటివియని తలచుకొని నీలేచుటను నిరీక్షించుకొని నీవే భర్తయని మనస్సునందునిశ్చయించుకొని యుంటిని గనుక నీహస్తముచేత నాహస్తమును గ్రహిం

బ్రవీత్ ॥ ౨౨ ॥ హేపతేత్వం క్వగంతాసిమాం విహాయమహామతే । ఆషణ్మాసం విప్రవటోత్పదుద్ధాన నిరీక్షణా ॥ ౨౩ ॥ తవదేహస్య కుర్వాణా శిశ్రూషాం భక్తిపూర్వకం । మమభర్తా త్వమేవేతి నిశ్చిత్య మనసిప్రియ ॥ ౨౪ ॥ తస్మాత్ మమమహాబాహో పాణిం గృహ్ణీష్వపాణినా । అన్యథా జీవితమహం త్యక్ష్యామితవపశ్యతః॥ ఇతిశ్రీ బ్రహ్మోక్తే బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే- చంద్రశర్మోపాఖ్యానం నామైకవింశోధ్యాయః.

శ్రీసూతః॥ ఇతితస్యావచశ్శ్రుత్వా బ్రాహ్మణాస్తాముపాచహ। క్వాహం బ్రాహ్మణదాయాదః క్వశూద్రాత్వంవరాననే॥ ౧॥ సంఘటేతకథంసుభ్రు మమత్వత్పాణిపీడనం । ఇత్యుక్తవంత మపితం సాకన్యానముమోచహ॥ ౨॥ తత్రత్యాస్తం జనాస్సర్వే రాజ్ఞేవృత్తాంతమబ్రువన్ । తచ్ఛ్రుత్వా రాజశార్దూలస్తావాహూయ కృపాన్వితః॥ ౩॥ సమాధానంతయోః కర్తుమశక్తో చింతయత్తదా । తతోవిప్రాన్ సమాహూయ తం వృత్తాంతం నివేద్యచ॥ ౪॥ బ్రూహిధయూాయం సమాధానమితి భూపతిరబ్రవీత్ । రాజ్ఞోవచనమాకర్ణ్య తేశాస్త్రాణివిచార్యచ॥ ౫॥ రాజ్ఞేనివేదయామాసుః విధింతుస్మృతిచోదితం । ఆదౌ

---

చివివాహముచేసుకొమ్మటుగాని పక్షమున నేనునీయెదుట ప్రాణములను విడిచెదనని చెప్పినది ఆమె - ౨౩ - ఇది బ్రహ్మస్వరూపమయిన బ్రహ్మాండ పురాణమందు - దేవాంగ చరిత్రయందు - చంద్రశర్మయొక్క యుపాఖ్యానమందు ఇరువదియొకటవ యధ్యాయము ముగిసెను.

సూతుఁడు పిమ్మటికథ నా ఋషులకుఁ జెప్పుచున్నాఁడు - ఈప్రకారమా వేశ్యాకన్య చెప్పినమాట విని యా బ్రాహ్మణుఁడు మరల నాపెకుఁ జెప్పిన యుత్తరమేమనఁగా నోసుందరమైన మోముగల చిన్నదానా బ్రాహ్మణపుత్రుఁడనైన నేనెక్కడ శూద్రురాలైన నీవెక్కడ నాకునిన్ను వివాహముచేసికొనుటకు నెట్లుసరిపడును అనియటుచెప్పిన నాబ్రాహ్మణుని నాకన్యక విడువదాయెను- ౨- అంతనక్కడనున్న జనులందఱు నా సమాచారమును రాజునకుఁ జెప్పిరి - దానివిని యారాజశ్రేష్ఠుఁడు దయతోఁగూడినవాఁడై వారినిద్దఱను పిలిపించి - తాను వారిద్దఱను సమాధానపఱుపఁజాలక యప్పుడుకొంతసేపూరక యాలోచించినవాఁడై పిమ్మట బ్రాహ్మణులను పిలిపించి యాసమాచారమునంతను వారికిఁ దెలియునట్లుచెప్పి ఈవిషయమునందు మీరుసమాధానము చెప్పవలయునననెను - వారు రాజు చెప్పిన మాటవిని శాస్త్రార్థ

తువిప్రకన్యాయా వివాహో బ్రహ్మణః స్మృతః॥ ౬॥ తతః క్షత్రియకన్యాయా ఉద్వాహస్తుతతఃపరం । వైశ్యాశూద్రాత్మజోద్వాహః క్రమేణ విధిచోదితః ॥ ౭ ॥ ఏవంబ్రువత్సువిప్రేషుముముదేరాజశేఖరః । చంద్రశర్మాపివిప్రేంద్రాస్తేవై జగ్ముర్యథాగతం ॥ ౮ ॥ తతోరాజా సమాలోచ్యసులగ్నే చంద్రశర్మణే । పురోహితస్యతన్యాంతుదాపయామాసవైముదా ॥ ౯ ॥ తతస్స్వకన్యాం ప్రదదావపత్న్యర్థంచంద్రశర్మణే । తతోవైశ్యస్య కన్యాంచశూద్రకన్యాంతథైవచ ॥ ౧౦ । దాపయామాస రాజేంద్రఃవిధిమంత్రపురస్కృతం । తతోరాజాస్వజామాత్రేచతురంగబలైర్యుతం ॥ ౧౧ ॥ అర్ధరాజ్యం ప్రదాయాశు నిర్వవౌచంద్రశర్మణే । చంద్రశర్మాపి విప్రేంద్రఃభార్యాభిస్సహితస్సుఖీ ॥ ౧౨ ॥ అవసత్తత్రవైపుర్యా ముజ్జయిన్యాంమహాతపాః । ఏవంకతిపయేకాలె గతేసతి మహీపతిః ॥ ౧౩ ॥ ధ్వజకీర్తిస్తనుం త్యక్త్వాస్వర్గలోకంజగామసః । తదామంత్రిప్రభృతయఃసమాలోచ్యపరస్పరం ॥ ౧౪ ॥

---

ములనాలోచించి స్మృతులయందునిర్ణయింపఁబడినవిధిని రాజుతోనిట్లనిచెప్పిరి- బ్రాహ్మణునకు మొదట బ్రాహ్మణకన్యకావివాహముస్మృత్యుక్తము- ౬ - పిమ్మట క్షత్రియకన్యకా వివాహము జరుగవలసినది అటుపిమ్మట వైశ్య కన్యనంతకావల శూద్రకన్యను బ్రాహ్మణుఁడు క్రమముగా వివాహము చేసికొనవచ్చును - ౭ - ఇట్లాబ్రాహ్మణులు చెప్పఁగా నామాటలకు రాజును జంద్రశర్మయుమిక్కిలి సంతోషపడిరి ఆబ్రాహ్మణు లంతట వారివారి తావులకుఁ బోయిరి - ౮ - అంతనారాజాలోచించి మంచిలగ్నమందుఁ దనపురోహితునికూతు నాచంద్రశర్మకొఱకిప్పించి వేడుకగా వివాహముచేయించెను - ౯ - పిమ్మటతనకొమార్తె నతనికిచ్చి పెండ్లిచేయించి తరువాత నొకవైశ్యకన్యనావల నాశూద్రకన్యను నాతనికిప్పించి శాస్త్రీయ విధి ప్రకారము వివాహము నారాజుచేయించెను - పిమ్మట నారాజు తన యల్లుఁడైన యాచంద్రశర్మకుఁ దనయొద్దనున్న దండునందు సగముదండును నర్ధ రాజ్యమునిచ్చి సుఖముగా నుండెను - బ్రాహ్మణోత్తముఁడైన యా చంద్రశర్మయు నా నలుగురు భార్యలతోఁగూడుకొని సుఖించుచున్నవాఁడై చక్కఁగాఁ దపస్సు చేసికొనుచు నాయుజ్జయినీపట్టణముననే యుండెను - ఇట్లుకొంతకాలముగడవఁగా నాధ్వజకీర్తిమహారాజు దేహముచాలించి స్వర్గలోకమును బొందెను - అప్పుడుమంత్రులు మొదలగు వారందఱొకటిగాఁగూడి యాలోచించి

చంద్రశర్మాణమేవైనం రాజానంచక్రురంజసా । తతఃసుతా స్సమభవన్
చత్వార శ్చంద్రశర్మణః॥ ౧౫॥ బ్రాహ్మణ్యాం వై వరరుచిః క్షత్రియాయాం
మహాబలః । విక్రమార్క స్సమభవత్ సర్వరాజనమస్కృతః॥ ౧౬॥ భట్టి
నామమహామంత్రీ వై శ్యాయామపి తత్తనూభవః । భర్తృహర్యభిధోవిద్వాన్
శూద్రాయాం సమజాయత॥ ౧౭॥ చంద్రశర్మణ సుతా ఏతే చత్వారో బుద్ధి
మత్తరాః । సర్వవిద్యావినిపుణాః బభూవు ర్నీతికోవిదాః॥ ౧౮॥ తేషాం మ
ధ్యే చంద్రశర్మా విక్రమార్కం మహాబలం । సాహసాదిగుణై ర్యుక్తం దాన
శౌండవిలోక్యసః॥ ౧౯॥ ధ్వజకీర్తే రయం రాజ్ఞః దౌహిత్ర ఇతిచింతయన్ ।
పట్టాభిషేచనం కృత్వా తస్యవై మంత్రపూర్వకం ॥ ౨౦ ॥ సర్వదేశస్య రా
జానం తంచకారముదాన్వితః । తతోస్య మంత్రిణం చక్రే భట్టిం వై శ్యాత్మజా
త్మజం॥ ౨౧॥ తృతీయం స్వస్యపుత్రంతు సర్వలోకస్య సన్నిధౌ । తతస్సవి
క్రమార్కస్తు మహాకాళీం వరప్రదాం॥ ౨౨॥ ఉద్దిశ్య సుచిరందేవీం తపశ్చక్రే
సుదారుణం । కాళికాతేనసంతుష్టా వరం ప్రాదాన్ మహీభుజే॥ ౨౩॥ సహ

---

యా చంద్రశర్మనే రాజుగా నేర్పఱిచిరి - పిమ్మట నాచంద్రశర్మకు నలు
గురు కొడుకులు పుట్టిరి - ౧౫ - బ్రాహ్మణ స్త్రీయందుఁ బుట్టినవాఁడు వ
రరుచి సమస్త రాజబృందముచేత నమస్కరింపఁబడిన విక్రమార్కుఁడు క్షత్రి
యకన్యయందుఁబుట్టిన వాఁడాయెను - ౧౬ - భట్టియను నతఁడుమహాబుద్ధి
బలముగలవాఁడై మంత్రిత్వమున కర్హుఁడైన వాఁడు వైశ్య కన్యయందు
నుపండితుఁడైన భర్తృహరియను వాఁడు శూద్రకన్యకయందును బుట్టిరి -
౧౭ - చంద్రశర్మ కొడుకు లీనలుగురును మిక్కిలి బుద్ధి కుశలతగలవారై యె
ల్లవిద్యలయందునేర్పుగలవారును నీతిశాస్త్రమందుఁ బండితులునై రి - ౧౮ -
వారిలోమిక్కిలి బలము గలవాఁడై సాహసాది గుణములతోఁగూడి నెరదా
తగానున్న యా విక్రమార్కుని నా చంద్రశర్మ చూచి యితఁడు ధ్వజకీర్తి
మహారాజునకు దౌహిత్రుఁడుగదాయని యాలోచించి మంత్రములతో నతని
కారాజ్యమును బట్టాభిషేకముచేసి సంతోషముతో గూడినవాఁడై యతని
సమస్తదేశమునకు రాజుగాజేసెను - పిమ్మటఁ దనకు మూఁడవ కొడుకైన
యావైశ్యకన్యాసుతుఁడగు భట్టి నందఱ సమక్షమున నావిక్రమార్కునకు
మంత్రిగాజేసెను - తరువాత నావిక్రమార్కుఁడు వరముల నిచ్చునట్టి మహా
కాళినుద్దేశించి దీర్ఘకాలము ఘోరమైన తపస్సు చేసెను - ఆ తపస్సుచేతఁ

ప్రాయుర్భవమహీం పాలశాధి వసుంధరాం । సహస్రం వత్సరాన్ రాజన్ శ
త్రుబృందవివర్జితః॥ ౨౪॥ శాలీవాహం వినాకోపి శత్రుర్నాస్తి మహీతలే ।
ఇతిదత్వావరంతస్మై తత్రైవాంతరధీయత॥ ౨౫॥ తతోవేశ్మ సమాసాద్య
విక్రమార్కోమహీపతిః । సహస్రాయుఃప్రదానంతు కాళీదత్తంసమాదరాత్॥
౨౬॥ జగాదమంత్రిణేతుష్టః సోపిమంత్రీతమబ్రవీత్ । రాజన్ మయా దీయతే
చవరస్త్వాదృక్ గృహాణతం॥ ౨౭॥ ఇత్యుక్తవంతం భట్యాఖ్యం మంత్రిణం భూప
తిస్స్వయం । ఆక్షిప్యోవాచరాజేంద్రః కథం మే దీయతేత్వయా॥ ౨౮॥ సహ
స్రాయుర్భవేత్యేవం తతోమంత్రీతమబ్రవీత్ । త్వంతు షణ్మాస పర్యంతం స్వ
రాజ్యం పరిపాలయన్॥ ౨౯॥ సింహాసనమధిష్ఠాయ వసవై స్వస్యపట్టణే । త
తఃషణ్మాస పర్యంతం భూసంచార పరోభవ ॥ ౩౦ ॥ ఏవం కృతవతస్తేద్య స
హస్రాయుర్నసంశయః । ఇత్యుక్తవంతం తం భట్టిం వీక్ష్యరాజాకుతూహలీ ॥
౩౧॥ ఉవాచవాక్యం మేధావీ యుక్తిగ్రహణతత్పరః । యుక్తియుక్తం వచో

---

గాళికాదేవి సంతసించినదై యా విక్రమార్క మహారాజు కొఱకు వరముని
చ్చెను - ౨౩ - ఎట్లనఁగా - ఓరాజా వేయిసంవత్సరము లాయువుగలవాఁడ
వుకమ్ము వేయిసంవత్సరములు శత్రువులు లేకుండ నీభూమిని పాలింపుము -
శాలివాహనునిఁదప్ప నింకొక్కఁడు నీకు శత్రువులేఁడు అని చెప్పి యాకాళికా
దేవి యచ్చటనే యంతర్ధానమాయెను - ౨౫ - అంత నా విక్రమార్క మ
హారాజింటికి వచ్చి తనకుఁ గాళికాదేవి వేయిసంవత్సరము లాయుస్సొసఁగి
న సమాచారమును సంతోషించినవాఁడై తనమంత్రియయిన యాభట్టితో
చెప్పెను- అంత నామంత్రి యాతనితో నోయిరాజా నేను నట్టి వరమొకటి
నీకిచ్చెదను దానిని నీవుగ్రహింపుమని చెప్పెను- ౨౭ - ఇట్లుచెప్పినయాభట్టి
యనుమంత్రి నావిక్రమార్క మహారాజాక్షేపించి నాకునీవు వేయి సంవత్స
రములాయుస్సు కలుగునట్టి వరము నెట్లిత్తు వనెను అంతనామంత్రి యతని
కిమరలనుత్తరము చెప్పుచున్నాఁడు - ఓరాజా నీవు సంవత్సరమున కారునెల
లుసింహాసనమందుగూర్చుండి రాజ్యమును బాలించుచు నీపట్టణమందుండు
ము - పిమ్మటనారునెలలుభూమిమీఁదఁదిరుగు చుండుము - ౩౦ - ఇట్లుచేసిన
పక్షమందు నీకు రెండువేలసంవత్సరము లాయుస్సగును సందేహము లేదు -
ఇట్లుచెప్పిన యాభట్టినిఁజూచి రాజు సంతోషము గలవాఁడై మిక్కిలి బుద్ధిగ
లవాఁడునుయుక్తిని గ్రహించుటయందాసక్తుఁడును గనుక నామంత్రినిగూర్చి

వాదీః మంత్రిణాం ప్రవరోహ్యసి॥ ౩౨॥ త్వయాయదుచ్యతేభట్టి తత్కర్త్వే
హం నసంశయః । ఏవంసంమాన్యతం విక్రమార్కో రాజ్యమపాలయత్ ॥ ౩౩॥
ఏకదావిక్రమార్కస్తు నిష్క్రమ్యభవనాత్స్వకాత్ । ఆదిత్య ఇవతేజస్వీ సా
హసీ ధైర్యవాన్వశీ॥ ౩౪॥ విక్రమాక్రాంతభువనః చతుష్షష్టి కలాకృతీ । శ
త్రుసంఘమహారణ్య దావానలసమప్రభః॥ ౩౫॥ నిర్భయో ధృతిమాన్ శూ
రఃవీరబృందనిసేవితః । సత్యసంధుశ్చోజ్జయినీ పుర్యలంకారనాయకః॥ ౩౬ ॥
రాజరాజశ్చక్రవర్తీ లక్షణై రతిశోభితః । రాజసంఘైర్మిత్రబృందైః మంత్రి
భిశ్చ కవీశ్వరైః॥ ౩౭॥ వందిమాగధ బృందైశ్చ విద్వద్భిర్గాయకైస్తథా ।
స్త్రీభిరిందుముఖీభిశ్చ భటవీరైశ్చ శోభితాం॥ ౩౮ ॥ శ్రేష్ఠముక్తాఫలైశ్చ
వనవరత్నైర్విరాజితాం । విభుధేంద్రసమాయుక్తాం సుధర్మామివరాజతీం॥
౩౯॥ సభాం ప్రవిశ్యతత్రత్య మింద్రదత్తం మహాప్రభం । దుష్ప్రాప్య మితరై
ర్భూపైః నవరత్న విభూషితం॥ ౪౦ ॥ సింహాసనమధిష్ఠాయ వందిమాగధ

---

యిట్లనెను - మంచియుక్తిగలమాటచెప్పితివి మంత్రులలోనంతయును శ్రేష్ఠుడ
వైతివిగదా-౩౨-ఓయిభట్టీ నీవేదిచెప్పుచున్నావో దానిని నేనవశ్యము తప్ప
కచేయుదును అనిచెప్పి యతని గౌరవించి యా విక్రమార్కుడు భూమినేలు
చుండెను - ౩౩ - సూర్యునివలెఁ దేజసంపన్నుఁడయినట్టియు సాహసము
గలయట్టియు ధైర్యముగలయట్టియు నింద్రియ నిగ్రహము గలయట్టియు ద
నపరాక్రమముచేత లోకములనెల్ల నాక్రమించినట్టియు నరువదినాలుగుఁ కలల
యందు నేర్పరియైనట్టియు శత్రువులనెడు నడవులకుఁ గార్చిచ్చైనట్టియు భ
యములేనట్టియు ధైర్యముగలయట్టియు శూరుఁడైనట్టియు వీరులసమూహ
ముచేత సేవింపఁబడినట్టియు సత్యప్రతిజ్ఞ గలయట్టియు నుజ్జయినీపట్టణమునకలం
కార మణియైనట్టియు రాజరాజైనట్టియుఁ జక్రవర్తియైనట్టియు మిక్కిలి
మంచి లక్షణములుగల యట్టియు ధీరోదాత్తులలో మిక్కిలి గుణాధికుఁడైన
యావిక్రమార్కమహారాజొకానొకప్పుడు తన యింటినుండి బయలువెడలి
రాజులచేతను మంత్రులచేతను స్నేహితులచేతను కవీశ్వరులచేతను స్తుతి
పాఠకులచేతను బండితులచేతను సంగీత పాఠకులచేతను జంద్రునివంటి మో
ములుగల స్త్రీలచేతను వీరభటులచేత నలంకరింపఁబడి ముత్యములచేతను
మఱియు ననేకరత్నముల చేతను సింగారింపఁబడి యింద్రునిచేత నధిష్ఠితమైన
సుధర్మవలెఁ బ్రకాశించుచున్న సభను బ్రవేశించి యక్కడనున్నట్టియు నిం

సంస్తుతః । తత్ర తైశ్చ జనైస్సర్వైస్స్తూయమానాపదానకః ॥ ౮౧॥ రాజ
కార్యాణి సర్వాణి సమాలోక్య విచార్యచ । ఆస్తే స భట్టినా సాకం ధీరోదా
త్తగుణోత్తరః॥ ౮౨॥ తదాసమాగతః కశ్చిత్ జటాజూజసుశోభితః । భస్మో
ద్ధూళిత సర్వాంగః స్ఫటికాక్షలసత్కరః॥ ౮౩॥ ఘంటాయుతమహాదండః వ్యా
ఘ్రచర్మాంబరావృతః । దంతపాదుకయాయుక్త పాదద్వయ సమన్వితః ॥
౮౪॥ కింకిణీజాలవిలసత్ కటీతటవిరాజితః । రుద్రాక్షమాలాభరణః కాలపూ
రుషనామకః॥ ౮౫॥ సిద్ధశ్రేష్ఠో యోగివరః రాజానమవలోక్యచ । దీర్ఘాయు
ష్మాన్ భవవిభో విజయీభవభూపతే॥ ౮౬॥ ఇత్యాశీర్వచనం దత్వా విక్రమా
ర్కాయధీమతే । ప్రాదాత్ఫలం దాడిమస్య కుతూహల సమన్వితః॥ ౮౭॥ దినే
దినేత్వేవమేవ దత్తవాన్ ఫలముత్తమం । రాజ్ఞే సింహాసనస్థాయ యోగిరాడ్వి
నయాన్వితః॥ ౮౮॥ దినేదినేయోగివర్యాత్ విక్రమార్క మహీపతిః । య
ద్యత్ఫలం ప్రగృహ్ణాతి తత్ఫలం సత్వరం తదా॥ ౮౯॥ కోశాధ్యక్షాయ దత్వావై

---

ద్రుమిడిచ్చినది గనుక మిక్కిలి తేజస్సుగలదై యితరరాజులకుఁ బొందరానిదై
ననవరత్నఖచితమైన సింహాసనము నెక్కి కూర్చుండి వందిమాగధులందఱు
తన్ను స్తుతింపఁగా మఱియు నక్కడనుండు నితర జనులును దానుచేసిన కా
ర్యములనుగ్గడించి స్తుతింపఁగా భట్టితోఁగూడ రాజకార్యములను జూచుచు
విచారించుచుండెను- ౮౨- అప్పుడొక్కఁడు జడలుధరించుకొన్న యోగీశ్వరుఁ
డు కాలపురుషుఁ డనువాఁడచ్చోటికివచ్చెను - మఱియు నాసిద్ధవరుఁడు విభూ
తిదేహమంతయుం బూసికొని స్ఫటికమాలను హస్తమందుధరించినవాఁడై గం
టలుగట్టిన దండము కలవాఁడై వ్యాఘ్రచర్మమును గప్పికొని రెండుకాళ్ల
యందుదంతపుపావుకోళ్లు తొడిగినవాఁడై మొలనుజిఱుగంటలుగట్టుకొని రు
ద్రాక్షమాలికలనె సొమ్ములుగా ధరించుకొని యుండెను - ౮౫ - అట్టి యా
యోగీశ్వరుఁడువచ్చి విక్రమార్కునిఁజూచి యోరాజా నీవు దీర్ఘాయుష్మం
తుఁడవగుము జయము కలవాఁడవగుమని బుద్ధిశాలియయిన యా విక్రమా
ర్కునకాశీర్వాదముచేసి సంతోషముతో నొక దాడిమఫలమునిచ్చెను- ౮౭-
సింహాసనమందుఁ గూర్చున్న యావిక్రమార్క మహారాజున కాయోగీశ్వ
రుఁడు నిత్యము నీప్రకార మొకదాడిమఫల మిచ్చుచువచ్చెను- ౮౮- ప్రతిదిన
మాయోగీశ్వరుఁడిచ్చు నాపండ్లను రాజు తీసికొని బొక్కసపు కాపుచేత ని
చ్చి వీనిభద్రముగాఁ గాపాడుమని చెప్పెను - అట్లు యా బొక్కసపు కాపా

రక్షైతదితిచాబ్రవీత్ । తథైవతత్ఫలంసర్వం కోశాధ్యక్షేణరక్షితం॥ ౪౦॥ పునరప్యేకదివసే సిద్ధయోగీ సమాగతః । రాజ్ఞే సింహాసనస్థాయ దాడిమస్య ఫలందదౌ॥ ౪౧॥ యదృచ్ఛయా తదా కశ్చిత్ కీశరాజ ఉపాగతః । తం వానరేంద్రముద్వీక్ష్య విక్రమార్కో మహీపతిః॥ ౪౨॥ ప్రాదాత్తస్మై తత్ఫలంతు కుతూహలసమన్వితః । తద్గృహీత్వా వానరేణ దంతైర్విదళితం యదా॥ ౪౩॥ ఉత్పాటితాత్ఫలాత్తస్మాత్ అనర్ఘ్యాణి మహాంతిచ । ముక్తాఫలాని రత్నాని పేతుర్ఝడితిభూతలే॥ ౪౪॥ తానిదృష్ట్వా విక్రమార్కః మహాశ్చర్య సమన్వితః । కోశాధ్యక్షం సమాహూయ బభాణప్రీతిపూర్వకం॥ ౪౫॥ ప్రదత్తానిమయాయాని దాడిమస్య ఫలానివై । మహాంతితానిసర్వాణి కోశాధ్యక్షసమానయ॥ ౪౬॥ ఇత్యాజ్ఞప్తో మహీపేన కోశాధ్యక్షస్సమానయత్ । ఫలానితాని సర్వాణి రాజా దళయదాశువై॥ ౪౭॥ దళితేషు తదా తేషు ముక్తాజాలాన్యలోకత । రత్నజాలానిచ తథా విక్రమార్కో ననందచ॥ ౪౮॥ అవాప్య చమహానందం యోగిరాజమథాబ్రవీత్ । కుత్రలబ్ధాని యోగీంద్ర ఫలానీమానికాననే॥ ౪౯॥ ఆహోస్విన్నందనవనే వదచైత్రరథేథవా । త్వయాకిమర్థం దత్తాని ఫలానీమానిమేవద॥ ౫౦॥ కింనామ తే యోగి వరకింకర్తవ్యం

---

పండ్లను గాపాడెను - ౪౦ - మరల నొకదినమున నాయోగివచ్చి సింహాసనమందుఁ గూర్చున్న యారాజుకొకొక దాడిమఫలము నిచ్చెను- ౪౧- అప్పుడొకకోతి యక్కడికి వచ్చెను ఆవిక్రమార్క మహారాజు కోతిని జూచి వేడుకగానాపండునాకోతికిచ్చెను ఆకోతియునాపండునుదీసికొని పండ్లతోఁ గొఱకఁగానే పగిలినయాపండువలననుండి మిక్కిలి వెలగల ముత్యములు రత్నములును భూమిమీఁదరాలెను - ౪౪ - వానివిక్రమార్కుఁడుచూచి యత్యాశ్చర్యమునొందినవాఁడై బొక్కసపు కాపునుబిలిచి ప్రేమతోనిట్లనెను- ౪౫- ఓయి బొక్కసపుకాపా నేను నీదగ్గిరనిచ్చిన దాడిమ పండ్లనన్నిటిని దెమ్ము - అనిరాజు చెప్పఁగానే యాబొక్కసపు కాపా పండ్లనన్నిటినిదెచ్చె నంతనారాజు త్వరితముగా వానినన్నిటిని బగులఁగొట్టెను - ౪౭ - ఇట్లు వానిఁబగులఁగొట్టఁగానే వానిలోనున్న ముత్తెములను రత్నములను విక్రమార్కమహారాజు చూచి సంతసించెను- ౪౮- మిక్కిలి సంతోషపడి యావిక్రమార్కుఁడు సిద్ధవరునితో నిట్లనెనోయి యోగిశ్రేష్ఠుఁడా యీపండ్లెతోపునఁదొఱికినవి - నందనవనముననుండెనా కుబేరుని యుద్యానమున నుండెనా యిట్టి పండ్లు తెచ్చి నీవు నాకేల

మయానఘ । సూర్యకోటి ప్రతీకాశ దివ్యతేజ స్సమన్విత॥ ౬౧॥ వాసస్థలం తేస్యత్రాస్తి యోగివర్యవదాధునా । యత్కర్తవ్యం మయాబ్రహ్మన్ కృతమి త్యవధారయ॥ ౬౨॥ ఇతిబ్రువంతం రాజానం యోగీ వచనమబ్రవీత్ । దేవ ప్రసాదాల్లబ్ధానిఫలానీ మానిభూపతే॥ ౬౩॥ మహత్కార్యం సముద్దిశ్య తా నిదత్తానితేప్రభో । కాలపూరుషనామాహం నివాసః పితృకాననే॥ ౬౪॥ కం దమూలఫలాహారః పర్వతేషువనేషుమే । అహం శిష్యోస్మిరాజేంద్ర మత్స్యేం ద్రస్యమహాత్మనః॥ ౬౫॥ రహస్యంకార్యమేతత్తునజానీయుర్యథాజనాః। తత్క ర్తవ్యం త్వయై వాశుభవతా రాజవల్లభ । ఏకోనోన్యైవ త్రికార్యంచేత్ సర్వలో కావిదంతితత్ । కార్యస్యచమహాభంగః స్యాదేవాత్రనసంశయః॥ ధ్వజకీర్తేర్భ వాన్ పౌత్రః పుత్రోవై చంద్రశర్మణః । త్వయాతుల్యో మహీపాలః నాస్తి నాస్తిమహీతలే॥ ౬౬॥ అనేకేభూమిపతయఃమయాదృష్టామహీతలే । తేషాం త్వద్గుణలేశోపి నాస్త్యేవహినసంశయః॥ ౬౯॥ ఇంద్రదత్తం మహద్దివ్యం మ ణికాంచనశోభితం । సింహాసనమధిష్ఠాయ రాజసే రాజసత్తమ॥ ౭౦॥ సూర్య

---

యిచ్చితివీ వివరమంతయునాకుఁజెప్పుము - ౬౦ - ఓయోగీశ్వరుఁడా నీపేరే మి నేనునీకుఁజేయవలసినపనియేమి నీవుకోటిసూర్యులతో సరియయినతేజస్సు తోఁగూడియున్నావు నీవుండు తావేది చెప్పుమోయోగీశ్వరుఁడా నీకుఁజేయఁ దగిన కార్యమేదిగలదో యదియయినదనే యెంచుకొమ్ము- ౬౨- అనిచెప్పు చున్న రాజునుగూర్చి యాయోగిచెప్పుచున్నాఁడు - ఓరాజా యీపండ్లు దే వతానుగ్రహముచేత దొఱికినవి - గొప్పకార్యము తలపెట్టుకొని వానిని నీకి చ్చితిని నాపేరుకాలపురుషుఁడు నేనుశ్మశానమందుందును- ౬౪- కొండలయం దు నడవులయందునుండెడు గడ్డలు వేళ్లు నాకాహారము నేను మత్స్యనాథసిద్ధు నిశిష్యుఁడను - ౬౫ - ఓయిరాజప్రియుఁడా యిదిరహస్యమైన కార్యము కాఁ బట్టి నీవీకార్యము నెవ్వరెఱుఁగకుండునట్లు త్వరితముగాఁ జేయవలయును - ఇ తరుఁడొకఁడు తెలిసికొనెనా యప్పుడే యందఱకుఁ దెలియును - అట్లు తెలియఁ గానే కార్యముచెడిపోవును దీనికెంతమాత్రము సందేహములేదు - ౬౭ - నీవు ధ్వజకీర్తిమహారాజు మనుమఁడవు చంద్రశర్మ కొడుకవు - ఈభూమి యందు నీతో సరియైన రాజెవ్వఁడును లేఁడు - నేనీభూమియం దెందఱు రా జులనోచూచితిని వారికి నీగుణములలో లేశమైనను లేదు- ౬౮- ఇంద్రుడిచ్చి ననవరత్నమయమైన యీబంగారు సింహాసనము మీఁదఁ గూర్చుండి ప్రకా

దత్తం మహద్దివ్యం నవరత్నైశ్చశోభితం । బిభర్షి రాజరాజేంద్ర కర్ణయోః
కుండలద్వయం॥ ౨౧॥ ఉదయాద్రిం సమారుహ్య అభేద్యం కవచం నృప । బి
భర్షి రాజరాజేంద్ర సూర్యదత్తం మహాప్రభం ॥ ౨౨ ॥ రవిణామానితస్స
మ్యగ్భూలోకం సమవాప్యచ । ధర్మేణ పాలయన్ భూమిం విభాసినృపస
త్తమ॥ ౨౩॥ త్వమేవ సాహసీశూర స్సర్వ విద్యా విశారదః । ధృతిమాన్ నీ
తిమాన్ సర్వగుణైరసదృశోభువి ॥ ౨౪ ॥ తస్మాద్వక్ష్యామి మత్కార్యం స
న్నిధౌ తేమహాబల । ఏకాకినా త్వయారాజన్ నితఃపంచదశేహని ॥ ౨౫ ॥ ఆ
గంతవ్యం నిశీథిన్యాం శ్మశానేమన్నివాసితే । తత్రకార్యం ప్రవక్ష్యామితత్
క్షిప్రం కురుభూమిప॥ ౨౬॥ ఇత్యుక్తవతి యోగీంద్రే విక్రమార్కః కృపాన్వి
తః । తథైవ కరవాణీతి వాక్యమాహస్మతంప్రతి॥ ౨౭॥ రాజవాక్యం సమాక
ర్ణ్య యోగీ సంతుష్టమానసః । శ్మశానమాజగామాశు మానితస్తేనభూభు
జా॥ ౨౮॥ రాజాపిరాజకార్యాణి విచార్య తదనంతరం । రమణీయం స్వభవ
నం వివేశనృపవందితః॥ ౨౯॥ తతఃపంచదశేరాజా దివసే యోగిభాషితే । భ

---

శించుచున్నావు- ఇదిగాక యీరాజరాజా సూర్యుఁడిచ్చిన రత్నమయమైనబం
గారుకుండలములను జెవుల ధరించుచున్నావు - ౨౧ - ఉదయ పర్వతమునె
క్కి సూర్యుని సంతోషపఱిచి యతఁడిచ్చిన దివ్యమై యెవరికి భేద్యముగానిక
వచమును ధరించియున్నావు - ౨౨ - సూర్యునిచేత గారవింపఁబడి యక్క
డనుండి భూమినిబొంది ధర్మముతో భూమినేలుచు మిక్కిలి యొప్పుచున్నా
వోయి రాజశ్రేష్ఠుఁడా - భూమిలో నీవే సాహసము గలవాఁడవు శూరు
డవు నెల్లవిద్యలు దెలిసినవాఁడవు ధైర్యముగలవాఁడవు న్యాయము గలవాఁ
డవు సమస్తగుణములచేత సరిలేనివాఁడవు - ౨౪ - కాఁబట్టి నా కార్యము
నునీతోఁజెప్పెదను నేటికిఁ బదునేనవదినమున నేనుండు శ్మశానమునకుఁ నీవొ
క్కఁడవుగారావలయును - అక్కడ నేనొకకార్యము చెప్పెదను దానిని శీ
ఘ్రముగాఁజేయుమోయి రాజా - ౨౬ - ఇట్లా యోగీశ్వరుఁడు చెప్పఁగా ద
యతోఁగూడిన యావిక్రమార్కుఁడట్లేచేసెదననెను - ౨౭ - రాజుమాటవిని
యాయోగీశ్వరుఁడు సంతసంచినవాఁడై రాజుచేత సన్మానింపఁబడి తాను
డు శ్మశానమునుగూర్చిపోయెను - రాజును రాచకార్యములను విచారించి పి
మ్మట నందఱు రాజులచేత మ్రొక్కఁబడినవాఁడై తనయింటికి బోయెను - పి
మ్మట నాయోగిచెప్పిన పదునేనవ దినమం దావిక్రమార్కమహారాజు మం

ట్టినామంత్రిణాసాకం సభ్యైర్నీతివిశారదైః ॥ ౧౦॥ సభాం ప్రవిశ్య సర్వాం
శ్చవ్యవహారాన్విచార్యచ । తతస్స్వభవనం రమ్యం ప్రవివేశ మహామనాః॥
౧౧ ॥ సంజ్ఞాఛాయాపతిశ్శ్రీమాన్ సర్వలోక నమస్కృతః । సూర్యోప్యస్త
స్తాద్రిమగమద్ వారుణీ మివ సేవితుం॥ ౧౨॥ అస్తాద్రిమవలంబ్యాపి రవిఃక
రసహస్రకైః । సోపతత్ పాశ్చిమాబ్ధౌతుకాలోహి దురతిక్రమః ॥ ౧౩ ॥ అ
నవేక్ష్యస్వభర్తారం పద్మినీపద్మలోచనా । విరహాగ్ని మోహాయుక్తేవతదాము
కుళితాభవత్ ॥ ౧౪॥ తమోబృందం ప్రవవృధే సర్వనేత్రపిధానకం । కులటా
జనసందోహ నందదానచణంసదా॥ ౧౫॥ కోకీనాంవిరహాగ్నినాం ధూమజాల
మివాబభౌ।తమోబృందంతదాలోకనేత్రవైయర్థ్యకారణం॥౧౬॥నక్షత్రహార
సంయుక్తారే జేకుముదలోచనా । విచిన్వంతీవభర్తారం సర్వతస్సానిశావధూః॥
ఇక్షుధన్వా పుష్పబాణాన్ ముమోచ యువతీజనే । మలయాచల సంభూ
త మారుతస్యం దన స్థితః ॥ ౧౮ ॥ మద నాఖ్యస్తు మృగయుః కా ముకీ
హరిణీగణం । పంచభిఃపుష్పబాణైస్తైః హంతుమారభతేస్మసః ॥ ౧౯ ॥
ఏవం ప్రవృత్తేత మసి నిశీథే రాజసత్తమః । నిద్రాం ప్రాప్తేషు సర్వేషు

---

త్రియయిన భట్టితోను నీతిశాస్త్రవివక్షణులైన సభికులతోనుగూడ సభకువ
చ్చి సకల వ్యవహారములను విచారించి యావల మనోహరమైన తనయిల్లు
ప్రవేశించెను - ౧౧ - సమస్త జనులచేత నమస్కరింపఁబడినట్టియు సంజ్ఞా
ఛాయాదేవుల పెనిమిటియైన సూర్యుఁడును వారుణిని సేవింపనువలె నస్తమ
యపర్వతమును బొందెను - ౧౨ - వేయికరములతో నస్తమయపర్వతమును
బట్టుకొన్నా నాసూర్యుఁడు పడమటి సముద్రమందుఁ బడెను - కాలమెట్టి
వారికినిదప్పఁగూడదుగదా- ౧౩- అంత సకలజనుల దృష్టులను గప్పునట్టియు
వ్యభిచారిణుల కానందమును గలుగఁజేయునట్టిచీకటి వృద్ధిబొందెను - ౧౫- జ
నులకుఁగన్నులుండినను వాని ప్రయోజనమును గలుగనీని యాచీకటి యాడు
చక్రవాకపక్షులవిరహాగ్ని పొగవలె నొప్పెను- ౧౬- ఆరాత్రియందు వెలఁది
నక్షత్రమాలికయనుహారముతోఁగూడినదై వికసించిన కలువల కన్నులు గల
దై యంతట భర్తను వెదకుచున్నట్లు ప్రకాశించెను- ౧౭- మలయ వాయు
వను రథమునెక్కి మన్మథుఁడు యావనవతులమీఁద బాణములనేసెను- ౧౮-
మన్మథుఁడనునావేటకాఁడు కామముగల స్త్రీలనులేండ్లను దనయైదుబాణము
లతోను గొట్టనారంభించెను- ౧౯- ఈప్రకారము చీకటి వ్యాపింపఁగా నం

జనేషు స్వయముత్థితః ॥ ౯౦ ॥ సిద్ధవాక్యం సమాలోచ్య శ్మశానం గంతు ముద్యతః । దివ్యాంబరధరశ్శ్రీమాన్ దివ్యాభరణ భూషితః॥ ౯౧॥ కవచీ కుండలీ స్రగ్వీ బద్ధకచ్ఛః ప్రతాపవాన్ । శృంగారవేష సంయుక్తః ధైర్యసాహస సంయుతః ॥ ౯౨ ॥ పాదుకా ద్వయ సంయుక్త పాదద్వయ విరాజితః । మహాంతం ఖడ్గమాదాయ రిపుబృంద భయంకరం॥ ౯౩॥ జ్వలంతం తేజసా స్వస్య భాసయంతం దిశోదశ । విక్రమార్కో మహీపాలః ప్రతస్థేరుద్రభూమికాం ॥ ౯౪ ॥ గఛన్మార్గే మహాబాహుః అజ్ఞాత ఇతరైర్జనైః । రుద్రావాసం భీకరంచ సంప్రాప పితృకాననం ॥ ౯౫ ॥ ప్రాప్తేతు రాజశార్దూలే భూతప్రేత పిశాచకాః । శాకినీ డాకినీనాంచ గణాస్తత్రసహస్రశః ॥ ౯౬ ॥ సర్వేచ మిళితాభూత్వా సంహర్తుం రాజశేఖరం । సమాజగ్ముస్తదారాజా విక్రమార్కః పరాక్రమీ ॥ ౯౭ ॥ చిచ్ఛేద నాసికాస్తేషాం కంఠాన్ కర్ణాన్ కరాంస్తథా । ఖడ్గేనశితధారేణ శత్రుసైన్యవిదారిణా॥ ౯౮॥ తతోభూతపిశాచాద్యా విక్రమార్కేణ తేనవై । ఖడ్గేనశితధారేణఛిన్నాభిన్నా స్సహస్రశః॥ ౯౯॥ ఆర్తనాదాన్ వి కుర్వాణాః పాహిపాహీతివాది

---

దఱు నిద్రబోయిన పిమ్మట సగమురాత్రి యపుడా రాజు తాను లేచి సిద్ధుఁడు చెప్పినమాటను స్మరించుకొని శ్మశానమునకుఁ బోనుద్యుక్తుఁడై మంచివస్త్రములను సొమ్ములను ధరించుకొని కవచముదొడిగికొని చెవులలోఁ గుండలములను మెడనుదండనుధరించినవాఁడై దట్టిగట్టుకొని ప్రతాపవంతుఁడై సొగసైనవేషముతోఁ గూడినవాఁడై ధైర్యముతోను సాహసముతోను గూడినవాఁడై రెండుకాళ్లయందుఁ బావుకోళ్లను దొడిగికొని శత్రువులకు భయమునుగలుగఁజేయునట్టియుఁ బ్రకాశించుచున్నట్టియుఁ దన వెలుతురుచేతఁ బదదిక్కులను బ్రకాశింపఁజేయుచున్న ఖడ్గమునెత్తుకొని శ్మశాన భూమికి బయలువెడలి పోయెను- ౯౪- మిక్కిలి భుజబలముగల యావిక్రమార్కుఁడు దారిలోఁ బోవునపు డితరుల కెవ్వరికగపడకయే రుద్రునకు వాసస్థానమును భయంకరమునైన శ్మశానమును చేరెను - ౯౫- ఈరాజశ్రేష్ఠుఁడక్కడఁ జేరఁగా భూతప్రేతపిశాచములు శాకినీ డాకినీ గణములు వేలతరబడిగాఁ జేరుకొని యారాజశ్రేష్ఠునిఁ జంపవలయునని పైఁబడెను - అప్పుడు పరాక్రమముగల యావిక్రమార్కుఁడు ఖడ్గముతో వాని ముక్కులను గొంతులను జెవులను జేతులను దరిగెను- ౯౮- ఈప్రకార మవి యావిక్రమార్కునిచేత ఖడ్గముతో ఛేదింపఁ

నః । గర్వాహంకారహీనాశ్చ జగ్ముకేవ యథా గతం ॥ ౧౦౦ ॥ గతేషుతే షురాజేంద్రః ఆహ్వానంతస్యయోగినః । చకారోచ్చైస్సిద్ధయోగిన్ కాలపూరుషనామక ॥ ౧౦౧ ॥ క్వవావ ససిహే కాల పురుషేతి ముహుర్వదర్ । విచినోతిస్మతం సిద్ధం తత్రవై పితృకాననే॥ ౧౦౨ ॥ తత్రా దృష్ట్వా సయోగీంద్రం చింతయామాసమానసే । మార్గాంతర గతోవాహం నేదం వా స్మిశ్మశానకం॥ ౧౦౩॥ యద్వా సిద్ధస్సబధిరః సుప్తోవా యత్రకుత్రచిత్ । ఇత్థం విచారయన్ రాజా ప్రావద ద్వాక్యముచ్చకైః॥ ౧౦౪॥ ఆగతోహం యోగివర్యతేవాక్యాత్ పితృకాననం । సత్యసంధోభవామ్యద్య నాత్రకార్యా విచారణా॥ ౧౦౫॥ నవర్తసేత్వం యోగీంద్ర చైతస్మిన్ పితృకాననే । యద్వా మానీవర్తసేవా యత్రకుత్రాపిమాయిక॥ ౧౦౬॥ అసత్య సంధం త్వాం మన్యేగచ్ఛామిమమమందిరం । ఇత్యుక్తవతిరాజేంద్రే యోగీ ప్రత్యక్షతాంగతః॥ ౧౦౭॥ ఇతిశ్రీ బ్రహ్మోక్తే - బ్రహ్మాండపురాణే - దేవాంగచరితే - విక్రమార్కోపాఖ్యానంనామ ద్వావింశోధ్యాయః.

శ్రీసూతః॥ శ్రుణుధ్వం మునిశార్దూలా స్తతోయోగివిచేష్టితం । వేత్ర

---

బడినవై యేచ్చుచు రక్షింపుమనిపలుకుచు నహంకారమునుగర్వమును విడిచివచ్చినత్రోవనుబోయెను - ౧౦౦ - అవన్నియుంబోయిన పిమ్మటనారాజు గట్టిగానాయోగినిబిలిచెను - ఓ కాలపురుషుండను యోగీశ్వరుండా యెక్కడనున్నావు కాలపురుషుండా కాలపురుషుండాయని పలుమారుపిలుచుచు నాశ్మశానమందా యోగినివెదకెను - ౧౦౨ - ఆయోగి యక్కడ నగపడకపోగా నావిక్రమార్కుండిట్లనియాలోచించెను - నేనుదారితప్పితినా యిదిశ్మశానముకాదా- లేక యాయోగికిఁజెవుడా యెక్కడనైనను నిద్రఁబోయెనా అని యిట్లారాజాలోచించుచు గట్టిగా నొకమాటచెప్పెను - ౧౦౪ - ఓయోగిశ్రేష్ఠుండా నేను నీమాట ప్రకారము శ్మశానమునకువచ్చితిని నాబదనామి నేనుదీర్చుకొంటిని విషయమందికవిచారింపఁబనిలేదు ఓయోగీశ్వరుండా నీవీశ్మశానమందులేవు లేక యెక్కడనైన మాటలాడక యున్నావా మోసగాండా - నీ వసత్యము పలుకువాఁడవని యెంచెదను నేనింటికిఁ బోయెదను అని యారాజుచెప్పఁగా నాయోగి రాజునకగపడెను - ఇది బ్రహ్మస్వరూపమగు బ్రహ్మాండపురాణమందు - దేవాంగచరితమందు - విక్రమార్కోపాఖ్యాన మన్నది యిరువదిరెండవ యధ్యాయము.

సూతుండు పిమ్మటికథ నాఋషులకుఁ జెప్పుచున్నాఁడు - ఓఋషులా

పాణిస్సయోగీతు రాజ్ఞస్సవిధమాగతః । సపాణినా ప్రగృహ్యాశు తం రాజకుల భూషణం । ఉవాచయోగీ హేరాజన్ త్వత్పరీక్షార్థమేవహి॥ ౨॥ మానీసన్నవ సంహ్యత్ర మన్యుంమా కురుమాకురు । త్వమేవ రాజరాజోసి సత్యసంధోన సంశయః॥ ౩॥ అతీవసాహసీత్వం హి మహాశూర స్త్వమేవచ । మత్కార్య కరణేరాజన్ సమర్థ స్త్వం నసంశయః॥ ౪॥ మమకార్యం ప్రవక్ష్యామి శ్రుణు త్వం రాజసత్తమ । ఇతోస్తి యోజనే దూరే వటవృక్షో మహాతరుః॥ ౫॥ శాఖాభిఃస్వస్యగుర్వీభిః ఆలిఖ న్నివచాంబరం । తత్రాస్తేసు మహాకాయః మహాబలపరాక్రమః ॥ ౬ ॥ భూతప్రేత పిశాచానాం శాకినీనాం తథైవచ । డాకినీనాం తథాబృందైః కోటికోటిభిరావృతః ॥ ౭ ॥ మత్తపో విఘ్నకారీచ మహామాయాసమన్వితః । పర్వతానాం సముద్ధర్తా తేజసాశంకరోపమః॥ ౮॥ జటాధారీచనిర్భీకః సర్వ శత్రు నిబర్హణః । తం జిత్వాతం మహాకాయం ఆనయాశుమమాంతికం॥ ౯॥ అహంతు విక్రమార్కేహ కాళికాలయమాశ్రి

---

గా తరువాత నాయోగీశ్వరుని సమాచారమును జెప్పెద వినుండు - ఆయోగీశ్వరుండు బెత్తమును చేతఁబట్టుకొన్నవాఁడై యారాజు సమీపమునకు వచ్చెను - ౧ - వచ్చి యారాజవంశశ్రేష్ఠుఁడైన విక్రమార్కుని దనచేతబట్టుకొని యాయోగియిట్లనెను - ఓయి రాజశ్రేష్ఠుఁడా నిన్నుఁ బరీక్షింపవలయుననియే నేనిచ్చోటఁ బలుకకయుంటిని దీనికి నీవుకోపగింపవలదు - నీవే రాజశ్రేష్ఠుడవును సత్యప్రతిజ్ఞ గలవాఁడవును సందేహములేదు - ౩ - మిక్కిలి సాహసముగలవాఁడవు నీవే దొడ్డశూరుడవు - నాకార్యమును జేయను నీవుశక్తుఁడవు సందేహములేదు - ౪ - నాకార్యమును జెప్పెదను వినుమోయి రాజశ్రేష్ఠుఁడా - ఇక్కడికి నామడదూరమందొక గొప్పమఱ్ఱిచెట్టున్నది - దానికొమ్మలాకసము నంటునట్లుండును - ఆచెట్టునందొకఁడున్నాఁడు - అతఁడు గొప్పదేహముగలవాఁడును మిక్కిలిబలమును ప్రతాపమును గలవాఁడును - అతనిఁ బెక్కులైన భూతములు ప్రేతములు పిశాచములు శాకినీడాకినీ గణములు పరివేష్టించియుండును - అతఁడు నాతపస్సున కంతరాయములఁ జేయువాఁడు మిక్కిలి మాయలునేర్చినవాఁడు పర్వతములను బెల్లగింపఁగలవాఁడు శివునితో సమమైనతేజస్సుగలవాఁడు - జడలుధరించియుండు నతనికి భయములేదు శత్రువులనందఱ ధ్వంసముచేయువాఁడు నీవతని జయించి త్వరితముగా నాయొద్దకు దేవలయును- ౯- ఓయి శత్రునాశకుఁడవైన విక్రమార్కుఁడా నేనిచ్చటగా

తః । నివసామితమానేతుం గచ్ఛశీఘ్రమరిందమ॥ ౧౦॥ ఇతిద్వచనం శ్రుత్వా విక్రమార్కోముదాన్వితః। ఖడ్గపాణిర్యయౌదేశంయత్రాస్తేవటభూరుహః॥౧౧॥ తం దదర్శమహావృక్షం వటం వింధ్యాద్రిసన్నిభం । దివం భూమించ సంవ్యాప్య తిష్ఠంతంచభయావహం॥ ౧౨॥ భూతప్రేతపిశాచాదిగణానాం స్థానముత్తమం। దిశశ్చవిదిశశ్చైవ వ్యాప్నువంతం దినేదినే ॥ ౧౩ ॥ తత్రాపశ్యత్స బేతాళం లంబమానమధోముఖం । భూతప్రేత పిశాచానాం నరమాంసాశినాం తథా॥ ౧౪॥ శాకినీనాం డాకినీనాం గణైః పరివృతంతథా। ఘోరదంష్ట్రంఘోరరూపం జటాజూట ధరం నృపః ॥ ౧౫ ॥ అథాబ్రవీద్విక్రమార్కః భూతప్రేత పిశాచకాన్ । శాకినీ డాకినీ సంఘాన్ విలోక్యస నృపోముదా॥ ౧౬॥ అహంతు విక్రమార్కోస్మి లోకేశత్రుభయంకరః । భవతాం ప్రభుమానేతు మాగతస్సిద్ధ వాక్యతః॥ ౧౭॥ బేతాళంతుగృహీత్వాహం గచ్ఛామ్యత్రనసంశయః। యూయంవోరక్షతప్రాణాన్ పలాయతపిశాచకాః॥ ౧౮॥ అహం శ్మశానే బహు

---

ళికాదేవి గుడియందుండెదను నీవతనిఁదేను త్వరితముగాఁ బొమ్ము - అనియా యోగిచెప్పఁగా నామాటవిని విక్రమార్కుఁడు మిక్కిలి సంతోషముతో ఖడ్గ మునుజేతఁబట్టుకొని యామఱ్ఱిచెట్టున్నచోటికిఁ బోయెను- ౧౧- అక్కడనా మఱ్ఱిచెట్టును జూచెను - అది వింధ్య పర్వతముతో సమానముగా నాకాశము ను భూమినిగమ్ముకొనియున్నది గనుకఁ జూచెడు వారికి భయమును గలుగజే యుచున్నది - భూతప్రేతపిశాచాది గణములన్నియు నాచెట్టుమీఁదనున్నవి - మఱియు నాచెట్టు దినదినము పెరిగి దిక్కులను విదిక్కులను వ్యాపించుచున్న ది- ౧౩- ఆచెట్టునందుఁ దలక్రిందుగ వ్రేలుచున్న బేతాళుని నారాజుచూచె ను ఆబేతాళుని ననేకములైన నరమాంసమును దినునట్టి భూత ప్రేత పిశాచ ములను శాకినీ డాకినీ గణములును జుట్టుకొనియున్నవి - మఱియు నాబేతా ళునికోరలు మిక్కిలి భయంకరములుగా నున్నవి యతని రూపమంతకంటె భ యంకరముగానున్నది - తలయంతయు జడలుగానున్నది - అంత నావిక్రమా ర్కుఁడు భూతప్రేత పిశాచాదులనుజూచి సంతోషముతో నిట్లనెను- ౧౬. నే ను విక్రమార్కుఁడను నాపేరు వినఁగానే శత్రువులందఱు నడలు చుందురు - యోగీశ్వరునిమాటవలన మీరాజును గొనిపోను వచ్చితిని - కాబట్టి నేనాబే తాళునిఁ గొనిపోవుచున్నాను సందేహములేదు మీరు మీప్రాణములను గా చుకొండు పఱుగెత్తుఁడు- ౧౮- నేను శ్మశానమందనేకములైన భూతము

శః భూతప్రేతపిశాచకాన్ । శాకినీ డాకినీశ్చైవ భిత్వా హత్వాచవై భృశం॥
౧౯॥ సమాగతోహమత్రత్వాన్ యుష్మాన్ సంహర్తుమాగతః । తస్మాద్ర
క్షతవః ప్రాణాన్ యూయంగచ్ఛతదూరతః॥ ౨౦॥ ఇత్యుక్తవంతం రాజానం
ప్రత్యూచుస్తేపిశాచకాః । గర్వయుక్తం వదసిభో రాజన్ సల్పబలోహ్యసి॥
౨౧ ॥ రక్షప్రాణాన్ సుదయితాన్ అస్మత్తోగచ్ఛమాచిరం । నోచేద్భవంతం
హత్వా శుభక్షయామోనసంశయః॥ ౨౨ ॥ రుద్రోసివాథ విష్ణుర్వా బ్రహ్మా
వాకిం నృపాధమ । నిర్భర్త్సయసిసర్వాన్నః దుర్బుద్ధే గచ్ఛదూరతః॥ ౨౩ ॥
క్వాసిత్వంక్వాస్థిభేతాళః క్వహస్తీ మృగరాట్ క్వను । క్వమార్జారః క్వను
వ్యాఘ్రః గచ్ఛశీఘ్రం నృపాధమ॥ ౨౪॥ తవకంఠం సముత్పాట్య పీత్వారు
క్తంసఫేనకం । నృత్యామోయావ దేవాశు గచ్ఛగచ్ఛనృపాధమ॥ ౨౫॥ తవ
పాదౌచపాణీచ ఊరూరస్థల మేవచ । ఛేత్స్యామ స్తిలశస్సర్వే వయం గచ్ఛ
నృపాధమ॥ ౨౬॥ ఇత్యాభాష్య నృపం సర్వే భూతప్రేత పిశాచకాః । పరి

---

లనుబ్రేతములను బిశాచములను శాకినులనుడాకినులను బ్రచ్చిచంపి యిక్కడ
నున్న మిమ్ముఁజంపనే తెంచితిని కాఁబట్టి మీప్రాణములను గాపాడుకొంచు మీ
రుదూరముగఁ బొండు- ౨౦- అని యిట్లతఁడు చెప్పఁగా నాపిశాచము లుత్త
రముచెప్పెను - ఏమోయి రాజా మిక్కిలి గర్వముగా మాటలాడెదవు నీబల
మెంతమాత్రము - నీకుఁ బ్రాణములు మిగుల నిష్టములు కాఁబట్టి వానిమా
వలనఁ గాపాడుకొమ్ము త్వరలో దూరముగఁబొమ్ము లేనిపక్షమందు నిన్నుఁ జం
పి త్వరితముగాఁ దించుము సందేహములేదు- ౨౨- ఓయధముఁడైన రాజా
నీవేమి రుద్రుఁడవా లేకవిష్ణువా బ్రహ్మవా మమ్ముబెదిరించెదవు చెడుబుద్ధిగ
లవాఁడా దూరముగఁబొమ్ము - నీవెక్కడ బేతాళుఁడెక్కడ - ఏనుగెక్కడ
సింహమెక్కడ - పిల్లెక్కడ పులెక్కడ - అధముఁడైన రాజా త్వరగాఁబో -
౨౪ - నీగొంతుచీల్చి నురుగుతోనున్న నెత్తురు త్రాగి యాడుదుము ముందే
పొమ్ము- ౨౫- నీకాళ్లను జేతులను దొడలను ఱొమ్మును మేమందరమునువ్వు
గింజలంతలుగా ఛేదింతుము త్వరితముగాపో - అనిచెప్పి యా భూతప్రేత పి
శాచములు విక్రమార్కునిఁ జుట్టుకొని మాంసములను నెత్తుళ్లను జల్లెను- ౨౭-
అస్థిమాత్రములనుమలములను తాలనుజెట్లను గొండలశిఖరములను గోపము
తోనవిపిసరెను - అప్పుడా విక్రమార్కుఁడు చేత భుజముఁ దట్టి సింహముచి
ల్లరమృగములమీదఁ బడునట్లు వానిఁజంపుటకుఁ దఱుమనారంభించెను - సిం

వార్యాథవవృషుః మాంసా నిరుధిరాణిచ॥ ౨౭॥ తథామూత్ర పురీషాణి పాషాణాంశ్చ మహీరుహాన్ । తథాపర్వతశృంగాణి చిక్షిపుస్తే క్రుధాన్వితాః॥ ౨౮ ॥ తదాస విక్రమాదిత్యః భుజావాస్ఫాల్యపాణినా । ధావతిస్మ చతాన్ హంతుం సింహః క్షుద్రమృగానృథా॥ ౨౯॥ సింహనాదం వికుర్వాణః గర్జం శ్చైవ ముహుర్ముహుః । ఖడ్గేన శితధారేణ ఛిన త్తిస్మ సతాన్ బహూన్ ॥ ౩౦ ॥ భూతప్రేతపిచాచాదీన్ శాకినీ డాకినీ గణాన్ । తేషాం కేచిత్ కృత్తనాసాః కేచిద్బాహువివర్జితాః ॥ ౩౧ ॥ కేచిద్భూతాః కృత్తకంఠాః కేచిన్నేత్రేషుతాడితాః । ఖడ్గేనశితధారేణ విక్రమార్కేణ మహీభుజా ॥ ౩౨ ॥ కేచిత్పీడితాః కృత్తపాదాః కేచిత్ కృత్తశిరోరుహాః । కేచి త్పిశాచా భగ్నాస్యాః కృత్తకర్ణా స్తథైవచ॥ ౩౩ ॥ శాకినీ డాకినీ సంఘా స్సర్వావయవతాడితాః । ఖడ్గేన శిత ధారేణ విక్రమార్కేణ భూభుజా ॥ ౩౪ ॥ కేచిదార్తధ్వనీంశ్చక్రుః పిశాచాస్తాడితాభృశం । కేచిద్భూతా ముమూర్ఛుశ్చ కేచిత్పేతుర్మహీతలే॥ ౩౫॥ మృగసంఘం యథా సింహః విక్రమార్కో మహీపతిః । వ్యనాశయద్భూతసంఘం గర్జం శ్చైవ ముహుర్ముహుః॥ ౩౬॥ ఛాగసంఘం యథాద్వీపీ భీతభీతంతుదుర్బలం । తథాస పురుషవ్యాఘ్రః ప్రేతసంఘం వ్యనాశయత్॥ ౩౭॥ ఏవం పిశాచసంఘంచ శాకినీ డాకినీగణం । హ

---

హానాదముచేయుచుమాటిమాటికిగర్జించుచుఁ దీక్ష్ణమయిన యంచుగలకత్తిచేత వానిఁబెక్కిటిని ఛేదించెను- ౩౦ - ఇట్లునరుకగా నాభూతప్రేతాదులలో గొన్ని ముక్కులు తెగినవై కొన్ని చేతులుపోయినవై కొన్ని మెడలు తెగినవై కొన్ని కన్నులలో దెబ్బలుతగిలినవై మిక్కిలిబాధనొందెను - మఱియు నావిక్రమార్కునిచేతఁ బదునుకత్తితో నరుకఁబడిన ప్రేతములకుఁ గొన్నిటికిఁ గాళ్లునుగొన్నిటికిఁ దల వెండ్రుకలును బోయెను - కొన్ని పిశాచములకుఁ గన్నులుపోయెను - కొన్నిటికిఁజెవులుపోయెను - శాకినీడాకినీ గణముల కావిక్రమార్కునికత్తిదెబ్బ యన్నియవయవములకుఁదగిలెను- ఇట్లులెస్సగాఁగొట్టబడిన పిశాచములు కొన్ని యేడ్చెను - కొన్ని మూర్ఛపోయెను - కొన్ని నేలను బడెను- ఇట్లావిక్రమార్కుఁడు మాటిమాటికిఁబొబ్బపెట్టుచు సింహము మృగముల గుంపును జంపునట్లాపిశాచముల గుంపునుజంపెను - ౩౬ - మిక్కిలి భయపడుచు బలహీనమైయుండు మేకలగుంపును బులిచంపునట్లా ప్రేతసంఘముల నాపురుషశ్రేష్ఠుఁడుచంపెను - ౩౭ - ఈప్రకారము పిశాచముల గుంపును శాకినీ డాకి

త్వాహత్వావిక్రమార్కః ఖడ్గేనస ముహుర్ముహుః ౩౯॥ వినదన్ సింహ వద్వీరః విరరాజమహీపతిః । యథాదాశరథీరామో హత్వా రావణమాహవే॥ ౪౦॥ ఏవం విజిత్య సర్వాన్ వై విక్రమార్కో మహీపతిః । జగామ వటవృ క్షంతం భేతాళస్థానముత్తమం॥ ౪౧॥ భేతాళం తం సమాలోక్య వాక్యం భూ పతిరబ్రవీత్ । భేతాళ తవసైన్యాస్తు సర్వే వినిహతామయా॥ ౪౨॥ ఖడ్గేన శితధారేణ సింహేనేవ యథాగజాః । గృహీత్వాత్వా మహాంగంతు మాగ తోస్మి తవాంతికం॥ ౪౩॥ కాలపూరుషనామ్నే త్వాం బధ్వా దాతుమిహాగతః। తస్మాదాగచ్ఛశీఘ్రంత్వం భేతాళాద్య మహాంతికం ॥ ౪౪ ॥ ఇతిరాజ్ఞో వచ శ్శ్రుత్వా గర్వయుక్తం సభూతరాట్ । స్వాన్ మంత్రిణ స్సమాహూయ భీ తోవాక్యమువాచహ॥ ౪౫॥ అయంతువిక్రమాదిత్యః మమసైన్యాని మంత్రి ణః । హత్వాసర్వాణిఖడ్గేన మాం బధ్వా నేతుమాగతః॥ ౪౬॥ కుబేరోవా యమింద్రోవా బ్రహ్మావా చతురాననః । విష్ణుర్వా కాలరుద్రోవా నజా నేహంతుమంత్రిణః॥ ౪౭॥ కింకరోమికవ్వగచ్ఛామి కోనాశరణమద్యమే । ఇత్థం వాదిని భేతాళే భేతాళా స్సప్తమంత్రిణః॥ ౪౮॥ రాజాన మబ్రువన్ సర్వే

---

నులగుంపునుజంపి యావిక్రమార్కుఁడు సింహమువలె గర్జించుచు యుద్ధ మందు రావణునిఁజంపిన రామునివలెఁ బ్రకాశించెను - ౪౦ - ఈ ప్రకారము వాని నన్నిటినిజయించి యావిక్రమార్కుఁడు బేతాళుఁడుండునట్టి యామఱ్ఱి చెట్టుదగ్గిరికిఁబోయెను - ౪౧ - ఆబేతాళునిఁజూచి రాజిట్లనెను - ఓయిబేతా ళుఁడా నీసేనలన్నిటిని సింహమేనుఁగులఁ జంపునట్లు నేను జంపితిని - నిన్నె త్తికొనిపోవుటకు నీయొద్దకువచ్చితిని - ౪౩ - నిన్నుఁ గట్టితీసికొనిపోయి కాల పురుషున కిచ్చుటకు నేనిచ్చటికి వచ్చితిని - కాఁబట్టి శీఘ్రముగా నాదగ్గిరికి రమ్ము- ఇట్లావిక్రమార్కుఁడు గర్వముతో జెప్పిన మాటనువిని యాబేతాళుఁడు భయపడి తనమంత్రులనుబిలిచి యిట్లనిపలికెను - ౪౫ - ఓమంత్రులారా యీ విక్రమార్కుఁడు నాదండులన్నిటిని ఖడ్గముతోఁజంపి నన్నుఁగట్టితీసుకొని పో నువచ్చెను - ౪౬ - ఇతఁడుకుబేరుఁడో యింద్రుఁడో నాలుగుమోములుగల బ్రహ్మయో విష్ణువో కాలరుద్రుఁడో నేనెఱుగనోయి మంత్రులారా- ౪౭- ఏ మిచేయుదు నెక్కడికిఁబోదు నా కిప్పుడు రక్షకుఁడెవఁడు - అని యాబేతాళుఁ డుచెప్పఁగా నతనిమంత్రులైన యేడుగురుబేతాళురు పండ్లుకటకటకొఱికి తమ రాజుతో నుత్తరముచెప్పిరి - ఓహో రాజా యీయథముఁడైన రాజువల

దంతాన్ కటకటాప్యచ । అహూహ్రాప్రభో కిమర్థంత్వం । బిభేష్యస్మా న్నృపాధమాత్ ॥ ౪౯ ॥ త్వదాదేశ కరాస్సర్వే వయంతిష్ఠా మహేప్రభో । బలేన విష్ణుసదృశః ధైర్యేణ నగరాట్సమః ॥ ౫౦ ॥ కోపేనరుద్రతుల్యోసి సంహారేణాంతకోపమః । త్వన్నామోచ్చారణేనైవ భీతం స్యాద్ భువనత్రయం ॥ ౫౧ ॥ అస్మాన్ ప్రేషయభేతాళ సంహర్తుం తం నృపాధమం । క్రియాన్ బేతాళరాజుస్తు సకియాన్ మానవాధమః ॥ ౫౨ ॥ ఇత్థంస్తు వత్సురాజానం బేతాళేషు మహాబలః । బేతాళరాజోప్యథతాన్ ప్రత్యువాచకుతూహలీ ॥ ౫౩ ॥ శీఘ్రం గచ్ఛతయూయం నైతం హత్వారాజ శేఖరం । నివర్తధ్వం విజయినః సర్వే యుద్ధవిశారదాః ॥ ౫౪ ॥ ఇతిరాజ్ఞా సమాదిష్టాః బేతాళా స్సప్తమంత్రిణః । విక్రమార్కం సమాసాద్య గర్వయుక్తం వచోవదన్ ॥ ౫౫ ॥ రుద్రతుల్యం మహానాదం కాలాగ్ని సదృశంప్రభుం । అస్మాకంబద్ధుమానేతుం కాలేశక్తిర్నృపాధమ ॥ ౫౬ ॥ హత్వాత్వం ప్రాకృతాన్ రాజన్ భూతప్రేత పిశాచకాన్ । గర్వం బిభర్షి నవయం తాదృశా ఇతిచింతయ ॥ ౫౭ ॥ గిరీంద్రాణాం ప్రభేత్తా

---

న నీవేలయిట్లుభయపడియెదవు - ౪౯ - ఓరాజా నీయాజ్ఞను జేయువారము మేమందఱమున్నాము నీవుబలమున విష్ణువుతోసమానుఁడవు ధైర్యమున హిమవత్పర్వతముతో సరియైనవాఁడవు- కోపమున రుద్రునితో సమానుఁడవు - చంపుటయందు యమునితోసమానుఁడవు నీపేరుచెప్పినమాత్రమున నేమూఁడులోకములు భయపడును- ౫౧- ఓయి బేతాళరాజా ఆయధముఁడైన రాజునుజంపను మమ్ముఁబంపుము - బేతాళరాజనఁగా నెంతటివాఁడు - మనుష్యమాత్రుఁడైన యావిక్రమార్కుఁ డెంతటివాఁడు - అని యీప్రకారమామంత్రులు స్తోత్రములుచేయఁగా నప్పుడా బేతాళరాజు నుత్సాహముగలవాఁడై వారితోనిట్లనెను- ౫౩- యుద్ధమందు సమర్థులైన మీరందఱు త్వరితముగాఁబొండు- ఆరాజశ్రేష్ఠునిజంపి జయమునుబొంది మరలిరండు- అనియిట్లు రాజైన బేతాళుఁ డాజ్ఞాపింపఁగా నామంత్రులైన బేతాళుడేడుగురు నావిక్రమార్కునొద్దకువచ్చి గర్వముతో నిట్లనిపలికిరి - ౫౫ - ఓయల్పుఁడైన రాజా మిక్కిలి బలముగలిగి సాంబశివునితో సమానుఁడుగాను గాలాగ్నితో నీడుగానుండు మాప్రభువునుగట్టి గొనిపోను నీకు శక్తియక్కడిది - ఓరాజా సాధారణమైన భూతప్రేతాదులనుఁజంపి నీవుగర్వపడుచున్నావు మేమట్టివారమని తలవకుము- మేము భుజశక్తిచేతఁ గొండలనుబెల్లగించువారము- యుద్ధమున మాయెదుట

రోవయం బాహుపరాక్రమైః । అస్మాకమగ్రతః స్థాతుం యుద్ధేశక్తిః కుత స్త
వ॥ ౫౮॥ ఇత్యుక్త్వా వీరవాదాం స్తే భేతాళ స్సహమంత్రిణః । యోద్ధుకా
మాబభూవుశ్చ విక్రమార్కేణభూభృతా॥ ౫౯॥ తతస్స విక్రమాదిత్యః తా
నపశ్యన్ మహాబలాన్ । యోద్ధుకామాంశ్చ భేతాళాన్ సింహఃక్షుద్రమృ
గానివ॥ ౬౦॥ కుర్వాణ స్సింహనాదాంశ్చ గర్జనంశ్చైవ ముహుర్ముహుః।
భ్రామయంశ్చ మహాఖడ్గం వజ్రాయుధ సమప్రభం ॥ ౬౧ ॥ గిరీంద్రా
ణాం ప్రభేత్తారం రిపుబృంద భయంకరం । యోద్ధు కామో భవద్రాజా
భేతాళై స్తాదృశై స్సహ ॥ ౬౨ ॥ తతః ప్రవవృతే యుద్ధం తుములం రో
మహర్షణం । విక్రమార్కస్య రాజేంద్రోః భేతాళై స్సహమంత్రిభిః॥ ౬౩॥
అభూతపూర్వం తద్యుద్ధం ద్రష్టుకామాస్సమాగతాః । దేవాస్సర్వే మహేం
ద్రాద్యాః గంధర్వాః కింనరా స్తథా॥ ౬౪॥ విద్యాధరాశ్చయక్షాశ్చ ఋషయః
పన్నగా స్తథా । నారద స్తుంబురుశ్చైవ తథా చాప్సరసాంగణాః॥ ౬౫॥ వి
మానై స్సూర్యసంకాశైః ఆచ్ఛాద్యచనభ స్తలం । వ్యతిష్ఠన్ విక్రమార్కస్య
రాజ్ఞో విజయకాంక్షిణః॥ ౬౬॥ దేవసంఘం తథాభూతం దృష్ట్వాతి వవృధే

---

నిల్వను నీకుశక్తియెక్కడిది- ౫౮- ఆయేడుగురు బేతాళురు నిట్లు వీరనాదము
లుపలికి యావిక్రమార్క మహారాజుతో యుద్ధముచేయను సన్నద్ధులైరి - పి
మ్మట నావిక్రమార్కుఁడు యుద్ధముచేయఁగోరుచున్న మిక్కిలి బలవంతులై
నయాబేతాళురను సింహము క్షుద్రమృగములనుజూచినట్లు చూచెను- ౬౦-
అప్పుడా విక్రమార్కుఁడు సింహనాదములు చేయుచు మాటిమాటికి ఱొప్పు
చు వజ్రాయుధముతో సమమైన కాంతిగలయట్టియుఁ బర్వతములనుబగల్చునట్టి
యు శత్రువులకు భయంకరముగానుండెడి తన ఖడ్గమునుద్రిప్పుచు నాబేతాళు
రతో యుద్ధముచేయ నుద్యుక్తుఁడాయెను - పిమ్మట రాజచంద్రుడైన యావి
క్రమార్కునకు నాబేతాళమంత్రులతో గగ్గురుపాటు పుట్టించునట్టి సంకులయు
ద్ధమాయెను - ౬౩ - అదివఱకెన్నఁడు జరుగని యాయుద్ధమును జూడఁగోరి
వచ్చినవారై దేవేంద్రుఁడుమొదలగునెల్ల దేవతలును గంధర్వులును గిన్నరులు
ను విద్యాధరులును యక్షులును ఋషులును సర్పములును నారదుఁడును
దుంబురుఁడు నప్సరసలును సూర్యునితో సమానముగాఁ బ్రకాశించుచున్న
విమానములచేత నాకాశమునుగప్పి విక్రమార్క మహారాజునకు జయమును
గోరుచుండిరి- ౬౬- ఇట్లు వచ్చియున్న దేవతల గుంపునుజూచి యావిక్రమా

నృపః । పూర్ణచంద్రం సమాలోక్య పర్వణీవ మహార్ణవః॥ ౧౭॥ వర్ధమానం తథాయుద్ధే విక్రమార్కం మహాద్యుతిం। ఆచ్ఛాదయితుమాజగ్ముః స ర్వే భేతాళరాహవః॥ ౧౮॥ ఖడ్గైః పరశ్వథై ర్దివ్యైః తోమరై ర్ముసలై స్తథా । లగుడై ర్భిండివాలైశ్చ రిపు సంఘ ప్రభేదనైః॥ ౧౯॥ సర్వైరాయుధజాలైశ్చ రాజానం సర్వతోముఖం । ఖడ్గపాణిం చరంతంతం ప్రాహరన్ భూతనాయకాః ॥ ౨౦ ॥ తై రాహతస్తు బేతాళైః క్రోధ సంరక్తలోచనః । విక్రమార్కో మహాతేజా స్సింహ వద్వినదన్ముహుః॥ ౨౧॥ ఖడ్గేన సితధారేణ శత్రుసంఘ ప్రభేదినా । యక్షరాక్షససంఘానాం మహాభీతిప్రదాయినా॥ ౨౨॥ చిచ్ఛేదనాసికాస్తేషాం భేతాళానాం మహాబలః । తథాపాణీంశ్చ పాదాంశ్చ భుజాంశ్చాతులవిక్రమః॥ ౨౩॥ వజ్రాయుధ సమానేన కాలదండ సమాజసా । కుబేరఖడ్గతుల్యేన ఘంటాబృందవినాదినా॥ ౨౪॥ తేనఖడ్గేన రాజేంద్రః తేషాం భేతాళమంత్రిణాం । సప్తానాం వై శిరాంస్యాశుచిచ్ఛేదసపరాక్రమీ॥ ౨౫॥ ఏవం హతేషు సర్వేషు భేతాళేషు మహాత్మనా । విక్రమార్కేణ

---

క్కమహారాజు పున్నమనాఁడుసముద్రముపొంగినట్లుప్పొంగెను- ౧౭- ఈప్రకారము యుద్ధమందు వృద్ధిఁబొందుచున్న మిక్కిలి కాంతిమంతుఁడైన విక్రమార్కునిఁజూచి యాబేతాళురందఱు రాహువు చంద్రునాచ్ఛాదించు నట్లతనినాచ్ఛాదింపవచ్చిరి- ౧౮- అప్పుడు ఖడ్గమును జేతఁబట్టి నలుప్రక్కలఁ జూచుచుం దిరుగుచున్న యావిక్రమార్కమహారాజు నాబేతాళురు ఖడ్గములతోను గండ్రగొడ్డండ్లతోను రోకళ్లతో నీటెలతోను లాటీకట్టెలతోను మరియు శత్రుసమూహములనుభంగపఱుచుచునెల్ల యాయుధములతోనుగొట్టిరి- ౨౦- ఈప్రకారమాబేతాళురచేతఁగొట్టఁబడి యా విక్రమార్కుఁడు కోపముచేతఁ గన్నెఱ్ఱనైనవాఁడై మహా తేజస్సంపన్నుఁడు గనుక సింహమునవలె గర్జించుచు శత్రుసమూహమును ఛేదించునట్టియు యక్షులకును రాక్షసులకును భయంకరమైనట్టి మిక్కిలి పదునుగల తనఖడ్గముతో నాబేతాళురముక్కులను జేతులనుగాళ్లను భుజములను దెగవ్రేసెను - ౨౩ - మఱియు వజ్రాయుధముతో సమానమై కాలదండముతోసమమైన పటిమగలిగి కుబేరుని ఖడ్గముతో సరియై ఘంటలచేత మ్రోయుచున్న యా ఖడ్గముచేతఁ పరాక్రమముగల యారాజు ఏడుగురు బేతాళుర తలలను త్వరితముగా నరికెను - ౨౫ - ఇట్లు మహాబలశాలియైన విక్రమార్కుఁడు శత్రుసమూహములను మథించునట్టి తనఖడ్గము

ఖడ్గేన రిపుసంఘ ప్రమాథినా॥ ౭౬॥ సర్వేము ముదిరే దేవాః సహితా స్సిద్ధ చారణైః । దేవదుందుభయోనేదుః పుష్పవృష్టిశ్చ ఖాచ్యుతా॥ ౭౭॥ జగుః కలంచగంధర్వానన్నృతుశ్చాప్సరోగణాః । విజయీభవరాజేంద్రే త్యేవం దేవా వచోబ్రువన్॥ ౭౮॥ నారదః కలహానందీ దృష్ట్వా తద్యుద్ధమద్భుతం । బభూ వపరమానంద వార్ధిసం మగ్నమానసః ॥ ౭౯ ॥ తతః సర్వే సమాసాద్య రాజానం దేవతాగణాః । వరం వృణీష్వ రాజేంద్రే త్యేవం వచనమబ్రువన్ ॥ ౮౦ ॥ తతో దేవగణం దృష్ట్వా వరదం రాజ శేఖరః । వ్యజ్ఞాయపత్సవినయం స్వాభీష్టంస కుతూహలః ॥ ౮౧ ॥ యదితుష్టాస్థ హేదేవాః వరోయం దీయ తాం మమ। అసౌ భేతాళరాజస్తు వశగోస్తు సదామమ॥ ౮౨॥ ఇత్యుక్తవం తం రాజానం అబ్రువన్ దేవతాగణాః । తథాస్త్వితి తతస్సర్వే జగ్మురేవయ థాగతం॥ ౮౩॥ తతోసౌ విక్రమార్కస్తు ప్రాప్యతం వటభూరుహం । ఉవాచ వాక్యం భేతాళం సప్త భేతాళనాయకం ॥ ౮౪ ॥ త్వయాయే ప్రేషితాయో ద్ధుం భేతాళా స్సప్తసాయుధాః । మయాయుద్ధేవినిహతాః దర్పస్తే విగతోధు

---

చేత నాబేతాళురను జంపఁగా దేవతలును సిద్ధులును జారణులును సంతసించిరి - దేవతల దుందుభిధ్వనులుచెలఁగెను - ఆకాశమునుండి పూలవానగురిసెను - ౭౭ - గంధర్వులు మధురముగాఁ బాడిరి యప్సరసలాడిరి - దేవతలందఱు ఓరాజా జయముగలవాఁడవగుమని చెప్పిరి - కలహముచే సంతోషించునట్టి నారదుఁ డాశ్చర్యకరమైన యాయుద్ధమునుజూచి పరమానందమను సముద్రమునమునిఁగిన మనస్సు గలవాఁడాయెను - ౭౯ - పిమ్మట నాదేవతలందఱు విక్రమార్కుని యొద్దికివచ్చి యోరాజ రాజా వరము గోరుమనిరి - అంతనా విక్రమార్కుఁడు దనకు వరమీనచ్చియున్న యాదేవతలనుజూచి యుత్సాహముతోఁ గూడినవాఁడై వినయముతోఁ దనకోరికను దెలిపెను - ఓదేవతలారా మీరు నావిషయమున సంతోషించిన పక్షమున నీబేతాళరాజెల్లప్పుడు నాకు స్వాధీనుఁడై యుండునట్లు వరమీవలయును- ౮౨- ఇట్లు చెప్పిన విక్రమార్కునితో నాదేవతలందఱట్లెయగునని చెప్పి వచ్చినత్రోవను మరలఁ దమతమనివాసములకుఁబోయిరి - అంత నీ విక్రమార్కుఁడు బేతాళుఁడుండు మఱ్ఱిచెట్టుదగ్గిరికిఁబోయి యేడుగురుబేతాళురకు నాయకుఁడైన యాబేతాళునితో నిట్లనెను- ౮౪- నీచేతఁబంపబడి యాయుధములతో నామీఁదికియుద్ధమునకువచ్చిన బేతాళురందఱు నాచేతఁ జంపఁబడిరి నీగర్వమిప్పుడు పోయెను - ఇట్లుచెప్పి

నా॥ ౮౫॥ ఇత్యుక్త్వా రాజశార్దూలః తమారుహ్యా మహాతరుం । భేతాళం తం ప్రజగ్రాహ ఖడ్గపాణిర్జటాసువై ॥ ౮౬ ॥ బధ్వా ఘోరతరైః పాశైః అవరుహ్యాతత స్తరోః । అగచ్ఛద్యత్రయోగీంద్రః తం దేశంప్రతిభూపతిః॥ ౮౭॥ మార్గమధ్యే సభేతాళః అంతర్ధానం చకారహి । అంతర్హితంతమాలోక్య విక్రమార్కో మహామతిః॥ ౮౮॥ సంప్రాప్యవటవృక్షంతం ఆరుహ్యా బహుశాఖినం । పునర్గృహీత్వా భేతాళం అవరుహ్యాతత స్తరోః॥ ౮౯॥ జటాధరం॥ మహామాయతం బధ్వా తీక్ష్ణరజ్జుభిః । అగచ్ఛద్యత్రయోగీంద్రః తం దేశం ప్రతి రాజరాట్॥ ౯౦॥ నీయమానస్సభేతాళః పునరం తర్ధిమా ప్తవాన్ । క్షిప్రం జగామసా్వ వాసభూరుహం బహుమాయికః॥ ౯౧॥ పునరం తర్హితం దృష్ట్వా విక్రమార్కో మహీపతిః । వటవృక్షం సమాసాద్య భేతాళం తమథాబ్రవీత్ ॥ ౯౨ ॥ రేరే భేతాళదుర్బుద్ధే మహామాయోసి సంప్రతి । తవమాయా మహం వేద్మి క్వగమిష్యసిసాంప్రతం॥ ౯౩॥ ఇంద్రలోకం గతోవాత్వం బ్రహ్మలోకం గతోపివా । విష్ణులోకం గతోవాత్వం శివలోకమథాపివా॥ ౯౪॥ విశాధవాత్వం పాతాళం దితిగర్భమథాపివా । నముంచామి నముంచామి

---

ఖడ్గము జేత ధరించియున్న యారాజశ్రేష్ఠుఁడా మఱ్ఱిచెట్టునెక్కి యాబేతాళుని జడలలోఁ బట్టుకొనెను - పట్టుకొని దృఢమైన త్రాళ్లతోఁగట్టి యాచెట్టుదిగి యాయోగీశ్వరుఁడున్న చోటికిఁబోను బయలుదేరెను ఇట్లు బయలుదేరి పోవునపుడు నడిత్రోవలో నాబేతాళుఁడు రాజునకు నగపడఁడాయె సంతనారాజు మరల నా మఱ్ఱిచెట్టు దగ్గరికివచ్చి పెక్కుకొమ్మలుగల యామఱ్ఱిచెట్టునెక్కి తిరిగి బేతాళునిఁ బట్టుకొని యాచెట్టునుండిదిగి జడలధరించుకొని బహుమాయలునేర్చియున్న యాబేతాళునిఁ జురుకైన త్రాళ్లతోఁగట్టి యారాజరాజు యోగీశ్వరుఁడున్న తావునకు వచ్చుచుండెను - ౯౦ - ఇట్లు వచ్చునప్పుడా బేతాళుఁడు మరల నంతర్ధానమును బొందఁగా నారాజది తెలిసికొని యామఱ్ఱిచెట్టుదగ్గరికిఁబోయి యాబేతాళునిఁగూర్చి యిట్లనిపలికెను - ౯౨ - ఓరి బేతాళుఁడా చెడుబుద్ధిగలవాఁడా మిక్కిలి మాయలు గలవాఁడవయితివి నేనిప్పుడు నీమాయలనుదెలిసికొంటి నీకెక్కడఁబోయెదవు - నీవింద్రలోకమునకుఁ బోయినను బ్రహ్మలోకమునకుఁ బోయినను విష్ణులోకమునకుఁ బోయినను శివలోకమునకుఁ బోయినను పాతాళమునుజొచ్చినను దితికడుపుజొచ్చినను నిన్నువిడువనోయి బేతాళరాజా - ౯౫ - నీవు మాటిమాటికీమఱ్ఱిచె

త్వాంతు భేతాళనాయక॥ ౯౫॥ పునఃపునరవాప్నోషి. త్వమేతం వటభూరు హం। తస్మాదేనం సముత్పాట్య త్వాం నేతు మహాముత్సహే॥ ౯౬॥ ఇత్యు క్తవంతం రాజానం అతిసాహస సంయుతం। ధీరధీరం మహాప్రాజ్ఞం భేతా ళోవాక్యమబ్రవీత్ ॥ ౯౭॥ పంచవింశతి సంఖ్యాకాః కథ్యం తేయా మయా కథాః। తాసాం యదిసమాధానం జ్ఞాత్వా వక్ష్యసిభూమిప॥ ౯౮॥ తదానీ మహామాయత్తో భవేయం తేనసంశయః। ఇత్యుక్త్వాసమహీపాలం వృక్షా గ్రే నిర్భయోవసత్॥ ౯౯॥ పునరప్యాహ భేతాళో విక్రమార్కనృపం ప్రతి। శ్రుత్వాతదుత్తరం నేత్వం నపదేశ్చ స్మహామతే॥ ౧౦౦॥ జ్ఞాత్వాపితవ రాజేంద్ర శిరోభిశ్శ్యత్యనేకధా। ఇత్యుక్తవంతం భేతాళం సరాజా పునరబ్ర వీత్॥ ౧౦౧॥ జ్ఞాతాయా ఉత్తరం తావ త్కథాయా వచ్మ్యహంధ్రువం। ఏ వముక్త్వా గృహీత్వాతం భేతాళం సత్వరం నృపః॥ ౧౦౨॥ స్వకం పృష్ఠం స మారోప్య గమనాయోపచక్రమే॥ ఇతిశ్రీ బ్రహ్మోక్తే - బ్రహ్మాండపురాణే - ఉత్తరఖండే - దేవాంగచరితే - విక్రమార్కోపాఖ్యానే - భేతాళగ్రహణంనామ త్రయోవింశోధ్యాయః.

---

ట్టుమీఁదఁ జేరుచున్నావు కాఁబట్టి నేనీమఱ్ఱిచెట్టును బెల్లగించి తీసికొనిపోవల యునని యాలోచించెదను - ఈప్రకారము చెప్పి యతిసాహసముతోఁగూడి మిక్కిలి తెలిసినవాఁడుగాను ధైర్యశాలిగానున్న యా విక్రమార్కునిఁగూర్చి యాబేతాళరాజిట్లనిపలికెను - ౯౭ - నే నిరువదియైదు కథలుచెప్పెదను- వానిలో నేనడిగెడు ప్రశ్నల కుత్తరము తెలిసి చెప్పితివా యప్పుడు నేనునీకువ శ్యుఁడనగుదునోయి రాజా దీనికి సందేహములేదని యారాజుతోఁజెప్పి యా బేతాళుఁడా చెట్టుమీఁద భయములేకయుండెను - ౯౯ - మఱియు నావిక్ర మార్కునితో నాబేతాళుఁ డిట్లనిచెప్పెను నీవు నేనుచెప్పిన కథనువిని దానికు త్తరము నెఱిఁగియుండి చెప్పకపోతివా నీతల పలువ్రక్కలగును - అనియిట్లు చెప్పినబేతాళునితో రాజు తిరిగి పలికెను - నేనుగు త్తెఱిఁగినకథకు నేను నిశ్చ యముగా నుత్తరము చెప్పెదనని చెప్పి యారాజు త్వరితముగా నాబేతాళునిఁ బట్టుకొని తన వీఁపుమీఁద నెక్కించుకొని బయలుదేరెను- ౧౦౨- ఇది బ్రహ్మ స్వరూపమైన బ్రహ్మాండ పురాణమందు త్తరఖండమున దేవాంగచరితమున విక్రమార్కోపాఖ్యానమందుఁ బేతాళునిఁ బట్టుకొనుటయన్నది - యిరువది మూడవ యధ్యాయము.

శ్రీసూతః॥ తతో భేతాళరాడాద్యా మతివిస్మయదాయినీ। కథామేవం నృదేవాయ ప్రవకుముపచక్రమే॥ ౧॥ భేతాళః॥ ఆసీత్పురా కృతయుగే విశాలాఖ్యాం పురంశుభం। తస్య రాజా సత్యవాదీ నామ్నా వీరమహేశ్వరః॥ చిరాయ తస్యసంజాతా పుత్రీపద్మావతీతిచ। పితా తాం పరమప్రీత్యా సర్వశాస్త్రవిశారదాం॥ కారయిత్వాస్వకాంపుత్రీం రాజావీరమహేశ్వరః। కస్మై దేయేతిసంచింత్య పుత్రీపద్మావతీమమ॥ ౪॥ సచివం స్వకమాహూయ వాక్యమే తదువాచహ॥ రాజా॥ మంత్రిన్ పద్మావతీపుత్రీ మమా భూత్ప్రాప్తయౌవనా॥ ౫॥ తస్యాః పాణిగ్రహః కార్య స్తదితో నీతికోవిద। త్వం విచార్యవరంరమ్యం సమాహ్వాయితుమర్హసి॥ ౬॥ తేనేత్యుక్తస్స సచివో బాఢమిత్యేవ మబ్రవీత్। వ్యాదిదేశైవ మేవాసౌ రాజా చస్వ పురోధసం॥ ౭॥ స్వయం పరామృశన్నేవ తత్రతత్రాస్తవై పరం। తతోరాజా స్వయం పుత్ర్యై వరమేకముపాహ్వయత్। ౮॥ ప్రధానోప్యా హ్వాయామాస స్వస్యోక్తత్వాత్సకంచన। పురోహితోపితస్యైకం వరమాయాపయత్తదా॥ ౯॥ త్రయోవరా శ్చాహ్వా

---

సూతపౌరాణికుఁడు పిమ్మటికథ నాఋషులకుఁ జెప్పుచున్నాఁడు - అంతనా బేతాళరాజు మిక్కిలియాశ్చర్యకరమైన యాకథలలో మొదటికథ నావిక్రమార్కుని కొఱకుఁ జెప్పనారంభించెను పూర్వము. కృతయుగమందు మిక్కిలి మనోహరమైన విశాలయను పట్టణ మొకటియుండెను - దానికి యథార్థము పలుకునట్టి వీర మహేశ్వరుఁడను రాజు ప్రభువై యుండెను - ౨ - కొన్ని దినములకా రాజునకుఁ బద్మావతియని యొకకొమార్తె గలిగెను - వీరమహేశ్వరుఁడను రాజా కొమార్తెకు సకల మయిన విద్యలను జెప్పించి యటుపిమ్మట నాకూతురగు నీపద్మావతి యెవనికీఁదగినదని యాలోచించి తనమంత్రిని బిలిచి యతనితో నిట్లని యొకమాటచెప్పెను - ఓమంత్రీ నాకొమారితయగు పద్మావతికి యౌవనమువచ్చెను - ౫ - ఆమెకుఁ బెండ్లి సేయవలయును కాబట్టి నీతిశాస్త్రముదెలిసిన యోమంత్రీ నీవుమంచి వరునివిచారించి పిలుచుకొనిరావలయును- ౬- ఇట్లా రాజుచెప్పఁగా నామంత్రి యట్లేచేసెదనని పలికెను - అంత నీరాజు తనపురోహితునిఁబిలుపించి యతనితో నిట్లేచెప్పెను- ౭- తానుసక్కడనక్కడవిచారించుచునేయుండెను - అంతనారాజు తాను దనకొమార్తెకొకవరునిఁ బిలుచుకొని వచ్చెను- ౮- మంత్రియును రాజు తనతోఁ జెప్పియున్నందునఁ దా నొకవరునిఁ బిలుచుకొని వచ్చెను - పురోహితుఁడు నా కన్యకకొక వరునిఁ బిలుచు కొని వచ్చెను - ౯ - రాజుచేతను మం

యితౌ నృపమంత్రిపురోహితైః । సేనాభిర్బహుభిస్సార్ధం పురోపాంతేష్వవాతరన్॥ ౧౦॥ తతస్తానాగతాన్ జ్ఞాత్వా వరాన్వీరమహేశ్వరః । సత్యబద్ధోభృశంకస్మై దేయాపుత్రీ త్యచింతయత్॥ ౧౧॥ ఏతస్మిన్నంతరేకాలే మహిషీతస్యభూపతేః । స్వభ్రాతృవ్యమహీపాల మాహ్వయామాసపత్వరం॥ ౧౨॥ పుత్రీంపద్మావతీంతుభ్యందాస్యామ్యాగమ్యతామితి।సచాగమత్పరంప్రీత్యాతత్పురం స్వబలైర్వృతః॥ ౧౩॥ తస్యాగమనమాజ్ఞాయ స్యాలపుత్రస్య భూపతిః । కార్యాధీనస్స్వమహిషీం భర్త్సయిత్వాబ్రవీదిదం ॥ ౧౪ ॥ అయి దుష్టేకుతస్త్వేద్య భ్రాతృవ్యస్సముపాగతః । పురమావృత్యతిష్ఠత్సు వరేషుత్రిషుతేషుమే॥ ౧౫॥ సకథ చత్వయాహూతో వ్యాకులేమయికర్కశే । భర్త్రైవముక్తాసారాజ్ఞీ దుశ్శీలాప్రత్యువాచహ॥ ౧౬॥ యదిమే భ్రాతృపుత్రస్య నదదాసిసుతామిమాం । ఉపభుజ్యవిషంతేగ్రేహం మరామినసంశయః॥ ౧౭॥ ఇత్యుక్తవత్యాం జాయాయాం సభూపాలోతి కాముకః । తస్యాస్తు యస్మితంప్రేమ్ణాం గీచకారమహీపతే॥ ౧౮॥ తథైవలోకేపురుషాస్సర్వే స్త్రీవశగాశ

---

త్రిచేతను బురోహితునిచేతను బిలుపింపఁబడిన యాముగ్గురు వరులు పెక్కు సేనలతోవచ్చి యాపట్టణమునకు సమీపప్రదేశములయందు దిగిరి- ౧౦- అంతవారందఱు వచ్చినవయినను నావీరమహేశ్వర రాజెట్లెఁగి సత్యముచేతఁగట్టబడినవాఁడై యాముగ్గురిలోఁ దనకూతు నెవరికీవచ్చునని చింతించెను ౧౧- ఈసమయమున నారాజునకుఁబట్టపు దేవియగుభార్య తనయన్నకొమారుడగురాజును కూతురగు పద్మావతినిచ్చెద నతిశీఘ్రముగారమ్మనిచెప్పిపంపి పిలుపించెను- అతఁడును మిక్కిలిసంతోషముతోఁదనసేనతోఁ గూడియాపట్టణమునకు వచ్చెను - ౧౨ - అంతనారాజుతనబావమఱదికొడుకైన రాజువచ్చినసమాచారమును దెలిసికార్యమునకుఁ బరవశుఁడై తనభార్యమీఁదఁ గోపించుకొనియిట్లనిపలికెను - ౧౩ - ఓసిదుర్మార్గురాలా - ముగ్గురువరులువచ్చి పట్టణమునకుఁ జుట్టునున్నప్పుడు నీయన్నకొమారుఁడేలవచ్చెను - ౧౪ - నేనేమితోఁచక తొక్కటపడుచున్నప్పుడతని నీవెట్లు పిలిచితివే కఠినురాలా - అని ఇట్లు తనపెనిమిటియనఁగాఁ నాదురాచారురాలు ప్రత్యుత్తరముచెప్పెనోయీ రాజా - ౧౫- నాయన్నకొడుకునకీకూతునునీవీకపోతివా నేనునీయెదుట విషమునుదినిచచ్చిపోయెదనుసందేహములేదు - ౧౬- ఇట్లాపెచెప్పఁగా నారాజుమిక్కిలి కాముకుఁడుగనుక నెట్లోయొకవిధముగా నాపెయందలి మక్కువచేత నాపెయిష్టమునే

ఖలు। త్యజంతిసత్యంధర్మంచ జహత్యాత్మజబాంధవాన్॥ ౧౯॥ త్యజంతాలి
ర్యాన్గురూన్ శ్చైవ భజంతేయోషితోజనాః। తతోరాజావిహాయైతాన్ త్రీన్
వరానాత్మజాం స్వకాం॥ ౨౦॥ స్యాలజస్యైవదాస్యామీ త్యకరోద్ధృవమా
పరాన్। తతోరాజమతంజ్ఞాత్వా తేనరాఃకుపితాస్త్రయః॥ ౨౧॥ యుద్ధాయ
యత్తాస్స్వబలైః పౌరుషం స్వముపాశ్రితాః। రాజ్ఞస్సమాదిశన్నార్జన్ స్యా
లపుత్రస్యతస్యచ॥ ౨౨॥ ఆయోధనేవిజిత్యాస్మాన్వివాహోథ భవత్వితి।
సతిష్ఠతుపురాయోద్ధుం శీఘ్రమాగమ్యతామితి॥ ౨౩॥ శ్రుత్వాదూతముఖాత్తే
షామభిప్రాయం సభూపతిః। మంత్రిణాహూయతైర్మంత్రం విధాతుముపచక్ర
మే॥ ౨౪॥ విచార్యమంత్రిణస్తేవై మంత్రంనిశ్చిత్యకంచన। రాజానమబ్రువన్ని
జన్సర్వేవీర మహేశ్వరం॥ ౨౫॥ మంత్రిణః॥ స్వామిన్నియంతవసుతాక
స్మైదేయేతిసుందరీ। నైవవిజ్ఞాయతేస్మాభిర్వదేమకథముత్తరం॥ ౨౬॥ అస్మా
కం నాస్తిసామర్థ్యం యోద్ధుంతైరుగ్రవిక్రమైః। తథాప్యేకంవయం బ్రూ

---

యంగీకరించెనోయి విక్రమార్కమహారాజా- ౧౮- అట్లేలోకమందుఁ బురు
షులందఱు స్త్రీలకుస్వాధీనులై యథార్థమును ధర్మమును దనబిడ్డలను బంధు
వులను విడుతురు - ౧౯ - పూజ్యులను గురువులను విడుతురు జనులు
స్త్రీలనుబొందుదురు - అంత నారాజా ముగ్గురివరులనువిడిచి తనకూతును దన
భార్య యిష్టముచొప్పునఁ దనబావమఱఁది కొడుకునకే యిచ్చునట్లు నిశ్చయిం
చెను - అంత నావచ్చినవరులుముగ్గురు రాజునభిప్రాయమునెఱిఁగి కోపగించిన
వారై తమపౌరుషము నాశ్రయించి తమ సేనలతోఁగూడి యుద్ధసన్నద్ధులై
రాజునకు నతనిబావమఱఁది కొడుకునకుఁజెప్పి పంపిరోయి విక్రమార్కమహా
రాజా- ౨౨-యుద్ధమందుమమ్ముజయించిపిమ్మటఁబెండ్లిచేసికొనవలయునుగాఁబ
టివివాహమటుండుగాక ముందుమాతో యుద్ధమునకు బయలుదేరి రావలయు
నని వారు చెప్పిపంపిన యభిప్రాయమును దూతవలనఁ దెలిసికొని యారాజు
మంత్రులనుబిలిచి యాలోచనముసేయ నారంభించెను- ౨౪- ఓవిక్రమార్క
మహారాజా- అంతనామంత్రులందఱు నాలోచించి యొకవిధమైన యాలోచన
మును నిశ్చయించి యందఱొకటిగా నావీరమహేశ్వరుఁడను రాజునుగూర్చి
యిట్లనిచెప్పిరి- ౨౫- మహాప్రభో- మిక్కిలిసౌందర్యవంతురాలై నయీనీకూ
తురెవని కొఱకీఁదగినదో మాకుఁ దెలియలేదు మేమెట్లుత్తరము చెప్పుదుము-
౨౬ - ఈవచ్చి యున్న మిక్కిలిపరాక్రమముగలరాజులతో యుద్ధము సేయను

మోరాజన్ స్తేమంత్రమాజనవం ॥ ౨౭ ॥ అనాత్తకోప స్తం త్రయా యాశ్శక్యతే
స్మాభిరీరితుం । ఇత్యుక్తో మంత్రిభీ రాజా సాంత్వయన్నిదమబ్రవీత్ ॥ ౨౮ ॥ యు
ష్మాకం రోచతేమత్యాం య త్తన్మేకిం సరోచతే మాభై ష్టబ్రూతయుష్మాభిః కృ
తామాలోచనాం మమ॥ ౨౯॥ తేనేత్యుక్తాః ప్రధానా స్తే కథయామాసురస్య
తాం। పురస్యాస్యబహిర్దేశే కుండం ప్రజ్వాల్య వై మహాన్ ॥ ౩౦॥ తత్ర్వర స్థాపయ
సుతాం వరాన్ శ్చ చతురోప్యథ। నివేశయ చతుర్దిక్షు సమ్మితేషు స్థలేషు చ ॥ ౩౧ ॥
ఏవం కృత్వా వరాన్ బ్రూహి చతురస్తానథ ప్రభో । యోవా ద్రుతముపాగమ్య
కరం పుత్ర్యా గ్రహీష్యతే హవై ॥ ౩౨॥ గృహ్ణీయాత్తస్య దాస్యామి త్యేవం కురుమ
హామతే॥ చేతాళః॥ ఏవముక్తో నృపో మాత్యై ర్యథోక్తమకరోత్తథా ॥ ౩౩ ॥
ప్రజ్వాల్య సుమహత్కుండం పురాద్బహిరథాత్మజాం । భూషాదిభిరలంకృత్య
సన్నివేశ్య మహీపతిః॥ ౩౪॥ సమస్థలగతాన్ దిక్షు చతస్ర స్స్థాపితా న్వరాన్
గృహ్ణీధ్వమేవం కుండస్థాం వ్యాదిదేశ నృపర్షభః ॥ ౩౫ ॥ రాజ్ఞా చైవం సమా

---

మాకుశక్తిలేదు - అయిన నోయి రాజా మీకు మేము చక్కని యాలోచన మొకటిచెప్పెదము- ౨౭- తామకోపమునుబొందక దానివినునట్లైన మేముచెప్పఁగలము - అనిమంత్రులుచెప్పఁగా నారాజు మంత్రులతోఁ దిన్నని మాటలాడుచునిట్లనెను- ౨౮- మీమనస్సునకుసరియనితోచినది నామనస్సునకుసరిగానుండదా యేమి - కాబట్టిభయపడవలదు మీరుచేసినయాలోచనమునునాతోఁ జెప్పుఁడు- ౨౯ - ఆరాజిట్లు చెప్పఁగా నామంత్రులాయాలోచనము నారాజుతో నిట్లనిచెప్పిరి - ఓదొడ్డవాఁడైన రాజా యీపట్టణమునకు వెలపల నొకగుండము నుద్రవ్వించి దానియందగ్నిని జక్కఁగాఁ బ్రజ్వలింపఁజేసి యాగుండముముందర నీకూతునునిలిపి యంత నావరుల నలుగురిని బిలిచి నాలుగుదిక్కులయందు సమమైనదూరములలో నిలుపుము- ౩౧- ఓరాజా యిట్లుచేసి యంత నానలుగురువరులనుగూర్చి మీలోనెవడతివేగముతో వచ్చి నాకూతునిచటఁ బాణియంబుఁ బట్టుచున్నాఁడో వానికి నాకూతునిచ్చెదనని చెప్పుము- ఇట్లుచేయుమయ్యా బుద్ధిశాలీ - అనియీప్రకారమామంత్రులుచెప్పఁగా నారాజు వారుచెప్పిన రీతిగానే చేసెను- ఆరాజుపట్టణము వెలపల హోమగుండము నొకదానిద్రవ్వించి యంతదనకూతునకు సొమ్ములు మొదలగువానినెల్ల దొడగియలంకరించియాగుండముదగ్గిరనిలిపి యాగుండమునకునాలుగుదిక్కులయందు సమమైన చోట్లయందున్న యావరులనుబిలిచి యాగుండముదగ్గిరనున్న యాతనకూతునుగ్రహింపుడ

దిష్టా స్తేహం పూర్వికయావరాః। జగృహుస్సహసాగత్యా థైకదైవ నృపా
త్మజాం॥ ౩౬॥ ఆకర్షణాంతత స్తన్వీం తే మమేతిమమేతిచ। తేషామాకర్ష
ణం బాలా శోధుకామహంతిదుఃఖితా॥ ౩౭॥ నిపపాత తదాకుండే మహాజ్వలన
సంకులే। తతస్తాం నిహతాం దృష్ట్వా శలభామివపావకే॥ ౩౮॥ చత్వారోరా
జపుత్రా స్తేశోకమాపుఃపరంతథా। హాసుందరిహతాసీతి తేషామేకోతిసాహసీ॥
౩౯॥ తస్మిన్దీప్తానలేకుండే నిపపాత నృపర్షభ। తస్యాం మోహాత్పరో
రాజన్ స్తీర్థయాత్రా పరోయయౌ॥ ౪౦॥ అపరో భిక్షుకోభూత్వా దేశ
భ్రమణతత్పరః। భిక్షాశనోపీతరాగో వివిధా న్విషయాన్యయౌ॥ ౪౧॥ చతు
ర్థోన్యఃపురేతస్మిన్నటన్భిక్షాశనన్నృపః। కృత్వాతుమంటపంతస్యకుండస్యో
పరిశోభనం॥ ౪౨॥ ఆకారయిత్వాపుష్పాణామారామంతత్సమీపతః। తస్మిం
టపేశివామేకాం ప్రతిష్ఠాప్యా స్తపూజయన్ ॥ ౪౩॥ తతస్సభిక్షుకోరాజ న్వి
షయభ్రమణోద్యతః। కాళీంకదాచిదాసాద్యకంచిత్కాలంనినాయసః॥౪౪॥

---

నిపలికెను-ఆరాజుచేతనీరీతినిజెప్పబడిన యావరులందఱునేనుముందునేనుముం
దనిపఱుగెత్తుచువచ్చి యేకకాలమందేయందఱునారాజుకూతునుబట్టుకొనిరి-
౩౬-అంతనానలుగురునాచిన్నదాని యీపెనాదినాదనిపట్టియీడ్చిరి-ఆబాలిక
వారియీడ్పునుసహింపఁజాలక మిక్కిలిదుఃఖపడినదై యగ్ని మిక్కిలిదగదగ
మనిమండుచున్న యాగుండమందుఁబడెను - అంతనిప్పునందుఁబడిన మిడుతవ
లెమృతిబొందినయాబాలికవిషయమందారాజపుత్రులునలుగురు మిక్కిలిదుః
ఖమునుబొందిరి - వారిలో మిక్కిలి సాహసకృత్యముగలవాఁడొకఁడో సౌంద
ర్యముగలచిన్నదానాచచ్చితివాయని యామండుచున్న గుండమందుఁబడెనో
యి రాజశ్రేష్ఠుఁడైన విక్రమార్కుఁడా - మఱియొకఁడాపెయందుఁ దనకుఁ
గలిగియున్న మోహముచేత నాపెచావఁగా దీర్ఘయాత్రలుచేయనుద్యుక్తుఁడై
పోయెను - ౪౦ - మఱియొకఁడుబిచ్చగాఁడై దేశములఁదిరుగుచు నొకపదార్థ
మందపేక్షలేనివాఁడై భిక్షమెత్తిన యన్నమునుదినుచు కొన్నిదేశములనుండి
మఱికొన్నిదేశములకుఁ బోవుచుండెను - ౪౧ - వారిలో నాలవవాఁడగు మఱి
యొకఁడాపట్టణమందేబిచ్చమెత్తియాయన్నముతినుచు నాకుండముమీఁదసుం
దరమైనమంటపము నొకదానిగట్టుకొని దానిదగ్గర నొకపూలతోటవేయించు
కొని యామంటపమందొక గౌరిని బ్రతిష్ఠచేసి పూజించుచుండెను- ౪౩- తరు
వాత నాదేశములుదిరుగనుద్యుక్తుఁడైన భిక్షుకుఁడొక కొన్నాళ్లకుఁ గాశీపట్ట
ణమునకుఁబోయి యక్కడ గొన్నిదినములఁగడపెను- ౪౪- తరువాత నొకప్పు

ఏకదాసక్షుధాతో౽సౌ తస్యాం విప్రస్యదుర్గతేః । గత్వాసద్మాస్యగృహిణీమా
తిథ్యం సమయాచత॥ ౪౫॥ సాసాధ్వీపూజయిత్వైన మాదరాద్భూసురాంగ
నా । అభావాత్సర్వగృహేకించి త్పరార్థస్యాబ్రవీదిదం॥ ౪౬॥ భోబ్రహ్మన్మమ
భర్తాద్య యాచ్ఞార్థం విపణిం గతః । గృహేకిమపినాస్తీహ తాజనస్య తవా
నఘ॥ ౪౭॥ తస్యాగమనపర్యంతం తిష్ఠభుంక్త్వాగమిష్యసి । ఇత్యుక్తస్సతయా
భిక్షు రబ్రవీత్క్షుధితఃపరం॥ ౪౮॥ తావచ్ఛక్ష్యామి నస్థాతుం తాత్రీబ్రాజా
యతేమమ । పతిస్తేయావదాగచ్ఛే ద్యాచకస్సపతివ్రతే॥ ౪౯॥ ఉక్తం నాస్తీతి
చేద్యామి నోచే ద్దేహీహ భోజనం । తస్మిన్నేవం బ్రువాణేతు సాగత్వాన్య
గృహాంతతః॥ ౫౦॥ ఆజహారమహారాజతండులాన్రుణమంజసా । కుర్వంత్యాం
సత్వరం తస్యాం పాకం తస్యారుదచ్ఛిశుః॥ ౫౧॥ రుదో౽ధతం తతో౽మాతా త
స్యాం చుల్ల్యామపాతయత్ । భిక్షోరస్యాథ భుక్త్వైతి తదన్నం పర్యవే
షయత్॥ ౫౨॥ దృష్ట్వాసశోచక్ష తత్కర్మహాహేత్యుక్త్వాబ్రవీదితి । అప
శ్యం కర్మహాహంత నాహం శివశివేదృశం॥ ౫౩॥ ప్రక్షిప్తఃపావకేబాలో౽న్నం

---

డతండాపట్టణమందు మిక్కిలి యాకలి గొన్నవాఁడై యొక దరిద్రునింటికిబో
యి యతనిభార్యను దనకాంతిథ్యమిమ్మని యడిగెను- ౪౫- పతివ్రతయైన యా
బ్రాహ్మణస్త్రీ మిక్కిలిప్రీతితో నాభిక్షుకునిఁబూజించి తనయింట నేమియులే
కుండుటవలన నతనితోనిట్లనెను- ౪౬- ఓబ్రాహ్మణుఁడా నాపెనిమిటి యిప్పు
డుయాచింపనంగడివీధికిఁబోయియున్నాఁడు - నీకునన్నదానముచేయుట కిప్పు
డిక్కడ నింటియం దేమియు లేకున్నది మహానుభావుఁడా- ౪౭- ఆయనవచ్చు
నంతవరకుఁ దాముండి భోజనముచేసిపోవలయును - అనియాపెచెప్పఁగా మి
క్కిలి యాకలిగొనియున్న యాభిక్షుకుఁడు మరలనాపెతోనిట్లనెను- ౪౮- ఓ
పతివ్రతా నీపెనిమిటి యాచనకు బోయినవాఁడేవేళకు వచ్చునో యంతవఱకు
నేనుదాళఁజాలను నాకాకలి మిక్కిలి యధికమైబాధించుచున్నది- ౪౯- లేదం
టివాపోయెదను- అటుగానిపక్షమందిప్పుడన్నముపెట్టుము- అనియాయనయా
ప్రకారముచెప్పఁగా నంతనాపె మఱియొకరింటికిఁబోయి శీఘ్రముగా బియ్య
మప్పుతెచ్చెనోయి రాజా - అట్లు తెచ్చిన బియ్యము నాపె వంటచేయుచు
న్నప్పుడా బిడ్డమిక్కిలి యేడ్చుచు నాపెకుం బనికడ్డముగారాఁగా నంత దల్లి
యైన యాపె యాబిడ్డనెత్తి వంటపొయిలో వేసెను - తరువాత వండినయ
న్నము నీభిక్షునకుఁగుడువుమనివడ్డించెను- ౫౨- ఆభిక్షుకుఁడుచూచి హాహా
యని దుఃఖించుచు నిట్లనెను- హా అయ్యో శివశివ నేనిదివఱకిట్టికార్యము నెచ్చ

భుజేతత్కథం శుభే । నాహమన్నమిదందత్తం శిశుఘ్న్యా యత్త్వయామ
మ॥ ౫౪॥ భుంజేయాన్నం సమాగచ్ఛేత్సబాలః పూర్వవత్సునః । ఇత్యేవము
క్తవంతంతం ప్రార్థయామాస సాంగనా॥ ౫౫॥ తస్మిన్న నంగీకుర్వాణే సర్వ
థా ప్రార్థితేపిచ । ఏతస్మిన్నంతరే తస్యా భర్తాగృహముపాగతః॥ ౫౬॥ వివా
దమనయోర్విప్రశ్శ్రుత్వా చాతిథిభార్యయోః । అభిమంత్ర్య జలంఝల్ల్యాం
ప్రోక్షయామాసతత్రసః ॥ ౫౭ ॥ సబాలః ప్రాగ్వమత్థాయ కింకిణీ రవసంకు
లం । కలస్మితోంతికం ప్రాపపితుర్మంత్రప్రభావతః॥౫౮॥ దృష్ట్వాసోతస్యమా
హాత్మ్యం బ్రాహ్మణస్య మహాత్మనః । విస్మయం పరమాపన్నో వాక్యమేతదు
వాచహ ॥ ౫౯ ॥ భగవంస్తంమహామంత్రం మమదేహిదయానిధే । భూయా
సంప్రాప్తకామోహం మంత్రదానేన తేనతే॥ ౬౦॥ ఇత్యేవం యాచితస్తేన భి
క్షుణాసమహీసురః । అబ్రవీత్పరిహాహార తవదేయంనేతివై భృశం॥ ౬౧ ॥ ఆ
పోశనంకరేధృత్వా భిక్షుకః పునరబ్రవీత్ । ఇమంమంత్రంనమేబ్రూయా భుంజే
యయదినేతితం ॥ ౬౨ ॥ విప్రస్సోపరిహార్యత్వాదాతిథావసరేతదా । తథే

---

టంజూడలేదు- ౫౩- ఓపతివ్రతా - బాలుండు నిప్పునందు వేయంబడెను నేనెట్లా
యన్నముభుజింతును- శిశుహత్య చేసిన నీవిచ్చినయీయన్నము నాకుందగిన
దికాదు- ౫౪- ఆబిడ్డ మరల మునుపటివలె వచ్చినపక్షమందు నేనాయన్నము
నుగుడుతును - అని యిట్లుచెప్పిన యాభిక్షుకుని నా బ్రాహ్మణస్త్రీ వేడుకొనె
ను- ౫౫- ఎన్నివిధముల నాపెప్రార్థించిన నతడంగీకరింపకుండంగా నింతలో
నాపెపెనిమిటి యింటికివచ్చెను - ౫౬ - ఆబ్రాహ్మణుండు తనభార్యకు నతిథికిజ
రుగుచున్న వివాదమునువిని యుదకమునభిమంత్రించి యాపొయ్యియందుంజ
ల్లెను- ౫౭ అంత నాబిడ్డ మునుపటివలెం దనతండ్రి మంత్రమహిమచేత నాపొ
య్యిలో నుండిలేచి చిరుగంటలమ్రోతతో నవ్యక్తమధురముగనవ్వుచు దగ్గర
కువచ్చెను - ౫౮ - అంత నాభిక్షుకుండు మహానుభావుండైన యాబ్రాహ్మణు
నిశక్తినిం జూచి యాశ్చర్యపడి యిట్లని యతనితో నొకమాటచెప్పెను- ౫౯-
దయకుగనిమైన షడ్గుణైశ్వర్య సంపన్నుండై యుండెడు నో బ్రాహ్మణుండా -
ఆమహామంత్రమును నాకుపదేశింపుము- ఆమంత్రమును నీవునాకిచ్చుటచేత నా
కోరిక సిద్ధింపగలదు - ౬౦ - ఇట్లనియాభిక్షుకునిచేత నడుగంబడినవాండై యా
బ్రాహ్మణుండు తానా మంత్రమును జెప్పంజాలనని పరిహారముచెప్పెను- ౬౧-
ఆభిక్షుకుండుచేత నాపోశనమునుబట్టుకొని నీవీమంత్రమును నాకుం జెప్పనిపక్ష
మున నేను భోజనముసేయనని మరల నాబ్రాహ్మణునితోం జెప్పెను- ౬౨- ఆ

త్యుపదిదేశైనం మంత్రతస్యమహీపతే॥ ౬౩॥ భిక్షుకస్తు తతోభుక్త్వాశు చిర్భూత్వాప్రయత్నతః। అభిమంత్ర్యజలంప్రోక్షత్పరీక్షార్థంమృతేఖరే॥ ౬౪॥ బభూవనిర్గతప్రాణః ప్రాప్తప్రాణ స్సరాసభః। సభిక్షు రథసం హృష్టో విశాలంపురమాయయౌ॥ ౬౫॥ ఖాత్వాకుండంతతస్తోయమభిమంత్ర్యాభ్యమార్జయత్ ।తదామంత్రప్రభావేనసోత్థితాన్నృపనందనా॥౬౬॥ తయాసహామృతఃకుండేవయోజాయతవైతదా । వీతరాగో మహారాజ ఆగత స్తీర్థయాత్రికః॥ ౬౭॥ సతస్యాఃపుణ్యతీర్థేషు పిండదానాదికాక్రియాః । కృత్వాసౌ దైవయోగేన తత్పురంసముపాగతః॥౬౮॥ సతాంజీవవతీంజ్ఞాత్వామమపత్నీత్యవోచత।కృత్వారామంచపరిత స్తస్యకుండస్యయఃస్థితః॥ ౬౯॥ సమేపత్నీతిజగ్రాహాజీవితాం రాజకన్యకాం । అపరావప్యుభౌరాజ న్నేవం జగృహతుశ్చతాం॥ ౭౦॥ తేషాం చతుర్ణాం కస్యేయం పత్నీస్యాద్రాజకన్యకా। సంశయో జాయతేభూయాం స్తన్నేవదమహామతే॥౭౧॥శ్రీసూతః॥ ఇతిపృష్టస్తతస్తేన భేతాళేనసభూసురాః।వి

---

తిథ్యమిచ్చునపుడు కోరినదాని కభ్యంతరముచెప్పఁగూడదు గనుకనంతనాబ్రాహ్మణుడట్లీయని యామంత్రము నుపదేశించెనయా రాజా - ౬౩ - అంత నాభిక్షుకుఁడుభోజనముచేసి పరిశుద్ధుఁడై యామంత్రమును బరీక్షింపను జచ్చియున్న యొకగాడిదెయందు జలమునుమంత్రించి ప్రోక్షించెను- ౬౪- అంతనదివఱకుఁ బ్రాణముపోయి చచ్చిపడియున్న యాగాడిద యామంత్రము మహిమచేతఁ బ్రాణమునుబొందినదాయెను- తరువాత నాభిక్షుకుఁడు సంతోషించినవాఁడై విశాలపట్టణమునకువచ్చెను- ౬౫- వచ్చి పూర్వమారాజపుత్రిపడిన గుండము ద్రవ్వి జలమునుమంత్రించిప్రోక్షించెను- అప్పుడామంత్రముమహిమచేత నారాజుకూతురాగుండములోనుండిలేచెను- ౬౬- ఆ పెతోఁగూడనాగుండమందుబడిచచ్చినవాఁడు నాపెతోఁ గూడ నాగుండములోఁ బుట్టెను - వైరాగ్యమునుబొంది తీర్థయాత్రలుచేయుచున్నవాఁడు వచ్చెనోయి రాజా - ౬౭ - ఆతీర్థయాత్రకుఁబోయినవాడక్కడిపుణ్యతీర్థములయందా పెకుఁబిండదానము మొదలగుక్రియలుచేసి దైవవశమువలన నా విశాలపురమునకువచ్చెను- ౬౮- అతఁడు చిన్నది బ్రతుకుటనుజూచి నాభార్యయనెను- ఆగుండమునకుఁ జుట్టుతోటవేసికొని యెవఁడుండెనో యతఁడు నప్పుడు బ్రతికిన యారాజపుత్రి నాకు భార్యయని పట్టుకొనెను - తక్కన యిద్దరు నిట్లె యాపెను బట్టుకొనిరి- ౭౦- ఆరాజపుత్రి యానలుగురిలో నెవనికి భార్య కాఁదగునని నాకుఁ బెద్ద సందేహముకలుగుచున్నదోయి మిక్కిలిబుద్ధిశాలియైన విక్రమార్కుఁడా యావిషయ

క్రమార్కో౽బ్రవీద్వాక్యముత్తరంతస్యబుద్ధిమాన్ ॥ ౭౨॥ యోకరోత్సర్వతీర్థేషు తస్యాశ్శైవాపనక్రియాః । తంతస్యాఃపుత్రఇత్యాహు ర్నయోగ్యా తస్యకన్యకా॥ ౭౩॥ మృతామాముత్పాదయామాస యస్తుమంత్రప్రభావతః । సపితేత్యుచ్యతేతస్యాస్తతో౽ర్హోధుం హినార్హతి॥ ౭౪॥ యస్సజాతస్సహతయా సోదరఉదాహృతః । యోవసత్తత్రవై స్నేహం మృతాయా మత్యజన్నధ॥ ౭౫॥ తామేవానుస్మరన్నిత్యం రక్షణ్ తత్ స్థలమాదరాత్ । తస్యైవ రాజపుత్రీసా భవేత్పత్నీనసంశయః॥ ౭౬॥ ఇతిదత్తోత్తరేతస్మి న్విక్రమార్కే మహీపతౌ। అవధూయన్విద్రుద్రావ భేతాళస్తం వటంప్రతి॥ ౭౭ ॥ సరాజా పునరాసాద్య తం వటం సుమహాబలః । భేతాళం పూర్వవద్బధ్వా జటాభిస్తస్య సాహసీ॥ అభిమాన్యుద్వహాన్స్కంధే ప్రయయాయాయత్రయోగిరాట్ । తముద్వహంతం గచ్ఛంతం విక్రమార్కం మహాబలం॥ ౭౮ ॥ పునరేవాబ్రవీద్గాథాం భేతాళోభూతనాయకః । ఏవమేవ కథాదివ్యా బేతాళేన మహాత్మనా॥ ౮౦॥ చతు

---

మును నాకుఁజెప్పుము- ౭౧- ఈప్రకారమాబేతాళునిచేత నడుగఁబడినవాఁడై మిక్కిలి బుద్ధికుశలతగల యావిక్రమార్కుఁ డతనికుత్తరముచెప్పెనోయి బ్రాహ్మణులారా - ౭౨ - వారిలో నెవఁ డన్ని పుణ్యతీర్థములయందు నాపెకుఁ దర్పణక్రియలుచేసెనో వాని నాపెకుఁబుత్రుఁడందురు కావున వానికాపె యోగ్యురాలుగాదు - ౭౩ - చచ్చిన యాకన్యను మంత్రముమహిమచేతఁ బుట్టించినవాఁడాపెకుఁ దండ్రియని చెప్పఁబడును గనుక నతఁడాపెను బెండ్లియాడ నహుఁడుగాఁడు - ౭౪ - ఆపెతోఁగూడ నాగుండమందుఁబుట్టిన వాఁడాపెకు దోడఁబుట్టువని చెప్పఁబడును ఆపె చచ్చిన నాపెయందు స్నేహమును వదలక యక్కడనేయున్న వాఁ డెల్లప్పు డామెనేతలంచుచు నామె యుండు చోటును గాపాడుచుండెను గనుక నారాజుకూతు రతనికే భార్యయగు నీయంశమందు సందేహములేదు - ౭౬ - ఈప్రకార మాబేతాళుఁడడిగిన ప్రశ్నమునకు విక్రమార్కుఁడుత్తరముచెప్పఁగా నాబేతాళుఁడువిదిర్చుకొని మరలఁ దానుండు మఱ్ఱిచెట్టునుగూర్చిపోయెను- ౭౭- మిక్కిలి బలముగలవాఁడగు నారాజు మరల చెట్టుదగ్గిరకుఁబోయి యాబేతాళుని మునుపటివలె వానిజడలచేతఁగట్టి మిక్కిలిసాహసముగలవాఁడై భుజశిరస్సుమీఁదనుంచి మోచుకొనుచుఁ బాటలపట్టణమునకువచ్చెను- తన్ను మోచికొనుచుఁబోవుచున్న మిక్కిలి బలవంతుఁడగు నావిక్రమార్కునిఁగూర్చి భూతములకుఁ బ్రభువగు బేతాళుఁడు మరల నొకకథ చెప్పెను - ఇట్లే యామహానుభావుఁడైన బేతాళుఁడా విక్రమార్కున కిరు

ర్వింశతిసంఖ్యాకా ఉక్తా స్తస్మై మహీభుజే। తాసామదాదుత్తరంతు ససమా ధానపూర్వకం ॥ ౮౧ ॥ విక్రమార్కోతి మేధావీ సర్వశాస్త్ర విశారదః । ద త్తోత్తరం మేదినీశం భేతాళో వాక్యమబ్రవీత్ ॥ ౮౨॥ రాజ స్త్వమసి సర్వజ్ఞ స్త్వం హి సాక్షా ద్బృహస్పతిః । త్వయాహి సదృశః కశ్చి న్నాస్త్యే వాత్ర మహీతలే॥ ౮౩॥ వక్ష్యామ్యహం కథాం దివ్యాం పంచవింశతికాం పునః । త స్యా స్త్వముత్తరం దత్వా కృతకృత్యో భవేర్నృప॥ ౮౪॥ ఇత్యుక్త్వాసకథాం దివ్యాం వక్తుం సముపచక్రమే । అసీచ్చక్రపురం పూర్వం వంగదేశేసుశోభనం॥ తస్మిన్నాస్తాముభేవేశ్యే సురూపేమాతృనందనే । సుందరీరూపవత్యాఖ్యేస్వధ ర్మనిరతేచిరం॥ ౮౬॥ అలాభాత్తేఉభేతత్ర పురేకృఛ్రమవాప్యచ । త్యక్త్వాతత ద్యయతూరాజ న్పురం ప్రతిపురాంతరం॥ ౮౭॥ రాజాతతోపిరామాఖ్యో వీత రాజ్యఃపరైర్యుధి । పరాజితోనష్టభార్య స్సపుత్రస్స్వపురంగతః॥ ౮౮॥ నిర్గ తౌతౌపితాపుత్రౌ తస్మాచ్చక్ర పురాదుభౌ । యేనాధ్వనాగతే వేశ్యే పురాన్మా తృసుతేఉభే॥ ౮౯॥ పితాపుత్రావగమతాం చాధ్వనా తేనతావుభౌ । దృష్ట్వా

---

పదినాలుగు దివ్యములైన కథలనుజెప్పెను - మిక్కిలి బుద్ధిమంతుఁడును సమ స్తశాస్త్రములఁ దెలిసినవాఁడు నగునట్టి యావిక్రమార్కుఁడా కథలకు సమా ధానమగునట్లుత్తరము చెప్పెను - ఇట్లుత్తర మిచ్చిన యావిక్రమార్కుని గూ ర్చి బేతాళుఁ డిట్లనెను- ౮౨- ఓయిరాజా నీవన్నియంశములు తెలిసినవాఁడ వు నీవు బృహస్పతివె ఈభూమియం దెవఁడును నీతోసమానుఁడుకాఁడు- ౮౩- నేను దివ్యమైన యిరువదియైదవ కథను జెప్పెదను దాని కుత్తరముచెప్పిన నీవు కృతకృత్యుఁడవగుదువోయి రాజా - ౮౪ - అనియిట్లుచెప్పి యాబేతాళుఁడు దివ్యమైన కథను జెప్పనారంభించెను . పూర్వము వంగదేశమందుఁ జక్రపుర మనియొకపట్టణము మిక్కిలి యందమగునది యుండెను - ౮౫ - ఆపట్టణమం దు బహుకాలమునుండి మంచిరూపముగలయట్టియుఁ దమ ధర్మమునుదప్ప నియట్టి తల్లి కూతులగు వేశ్య లిద్దరుండిరి - అందు దల్లి పేరు సుందరి కూతుపేరురూపవతి- ౮౬- వారిద్దరు నాపురమందుఁ దమకేలాభము లేకుం డుటవలన మిక్కిలికష్టపడి యాపట్టణమును విడిచి మఱియొక పట్టణమునకుఁ బోను బయలుదేరిబోయిరోయి రాజా - ౮౭ - తరువాత నాపట్టణము రాజు రాముఁడనువాఁడు తనరాజ్యమునుబోఁగొట్టుకొని శత్రువులచేత నోఁడగొట్టఁ బడినవాఁడై తనభార్యచావఁగాదనకొడుకుతోడఁదనపట్టణమునుజేరెను- ౮౮- ఆతండ్రి కొడుకు లిద్దరు నాపట్టణమునుండి బయలు వెడలిరి - ఆపట్టణమునుం

పదాంకితా న్యత్రతయోశ్చ గతయోః పురః॥ ౯౦॥ వేశ్యయోః పితరం వాక్య మితిపుత్రోభ్యభాషత । అస్మిన్నధ్వని భోతాత గతే నార్యావుభావిహ॥ ౯౧॥ నారీం త్వముద్వహ తయోర్యాతాం పృథుపదాంకితా । హ్రిస్వ పాదాంకితాం నారీముద్వహేయమహంతుతాం॥ ౯౨॥ ఏవముక్తః పితాపుత్రేణాబ్రవీత్సతథేతిచ । గచ్ఛంతావితితౌనార్యౌ తే ఉపాగమతామథ ॥ ౯౩ ॥ పితాథ పూర్వసమయాత్పుత్రీంపృథుపదాంకితాం। ఉపయే మేమాతరంతు పుత్రోహ్రిస్వపదాంకితాం ॥ ౯౪ ॥ తతస్తౌతుపితాపుత్రౌ పుత్రీమాత్రో స్తయో స్తథా । స్త్రియశ్చ జనయామాసతుః పుత్రాన్ను నకరాన్నృప॥ ౯౫॥ శాంతా వన్నృధిరేచైవ తేపుత్రా రాజశేఖర । తేషామన్యోన్య సంబంధా హ్వానం కిం వద బుద్ధిమన్ ॥ ౯౬ ॥ శ్రీసూతః॥ ఇతిపృష్టో భూతభర్త్రా విక్రమార్కో ద్విజోత్తమాః । తత్సంబంధమజానన్స సశంక శ్శాస్త్రగర్హితం॥ ౯౭॥ జగామమార్గం స్వం రాజాతూష్ణీం భూత స్తముద్వహన్॥ ఇతిశ్రీ బ్రహ్మాకృతే - బ్రహ్మాం

---

డి బయలుదేరి పోయిన యాతల్లి కూతులగు వేశ్య లేత్రోవను బోయిరో యాత్రోవనే యాతండ్రి కొడుకులును బోయిరి - అప్పుడు ముందుపోయిన యావేశ్యలయడుగులను త్రోవయందుఁజూచి యారాజకొడుకు తండ్రితోనిట్లనెను - ఓనాయనా యీత్రోవ నిద్దరు స్త్రీలు పోయియున్నారు- ౯౦- వారిలో నిద్దఱిలో నెవతె పెద్దయడుగులు గలదో యామెను నీవు పెండ్లి యాడుము చిన్నయడుగులుగల దాని నేను బెండ్లి యాడెదను - ౯౧ - ఇట్లు కొడుకు చెప్పఁగాఁ దండ్రి యట్లే యని యంగీకరించెను - ఇట్లు నిశ్చయముచేసికొని పోవుచు వారిద్దఱు నా ముందు పోయిన స్త్రీలను సమీపించిరి- ౯౩ - అంతనాతండ్రి తొలుతఁ జేసికొన్న నిబంధనము ప్రకారము పెద్దయడుగులదానిని బెండ్లి చేసికొనెను - కొడుకు చిన్న యడుగులుగలదానిని బెండ్లియాడెను- ౯౪- తరువాత నాతండ్రి కొడుకులా ప్రకారము తల్లి కూతురగు నావేశ్యలయందుఁ గూతులను మంచికొడుకులను గలుగఁజేసిరోయిరాజా- ౯౫- ఆబిడ్డలుశాంతిపరులై వృద్ధిఁబొందిరి - ఓయి మిక్కిలి కుశలతగల విక్రమార్కమహారాజా వారొకరొకరికేమిసంబంధముగల వారుగా నుండు రొకరినొకరెట్లు పిలుచుకొందురు చెప్పుము- ౯౬- ఓ బ్రాహ్మణోత్తములారా పిశాచ నాథుఁడగు నాబేతాళునిచేత నీరీతినడుగఁబడి విక్రమార్క మహీపాలుఁడా శాస్త్రనిందితమైనసంబంధమును దెలియకసంశయముతోఁగూడినవాఁడై యతనిమోచికొనుచు నూరకతనత్రోవనుబట్టిపోయెను - ఇది బ్రహ్మస్వరూపమగు బ్రహ్మాండపు

డపురాణే - ఉత్తరఖండే - దేవాంగచరితే - విక్రమార్కోపాఖ్యానే - బేతాళపంచవింశతి కథా కథనంనామ - చతుర్వింశోధ్యాయః.

శ్రీసూతః॥ ఏవంగత్వాశోతిదూరంశుశ్రావమధురస్వనం॥ తంత్రీలయసమాయుక్తం దివ్యగానం మహాద్భుతం॥ ౧॥ శ్రోతౄణాం శ్రోత్రమధురం మనస్తుష్టివివర్ధనం। చింతయామాస సతదా రాజ రాడ్గీతకోవిదః॥ ౨ ॥ అహోగీతస్య మాధుర్యం కేవవాగీయతేత్రవై । కయా వాగీయతేనాహం జానామీతివితర్కయన్॥ ౩॥ తతోద్రుతపదంగత్వా దదర్శ మహతీం శిలాం॥ అధిష్ఠాయమహావీణాం గృహీత్వా మంజుళస్వనాం ॥ ౪ ॥ గాయంతీం సుస్వరంగీత మీశ్వరస్తుతిసంయుతం । శ్యామాం దివ్యాంగనాం కాచిత్ విక్రమార్కమహీపతిః॥ ౫॥ తస్యా స్సమీపమాగత్య తల్లావణ్య విమోహితః । ఉవాచవాక్యం మధురం యుక్తియుక్తం మహీపతిః॥ ౬॥ కాసిత్వం పద్మపత్రాక్షి వీణాగానవిచక్షణే । మాతంగీవావరారోహే వల్లకీ వాదనప్రియా॥ ౭॥ య

---

రాణమునం దుత్తర ఖండము నందు దేవాంగ చరితమందు విక్రమార్కోపాఖ్యానమందు బేతాళుఁ డిరువది యైదు కథలు చెప్పుట యన్నది యిరువది నాలవయధ్యాయము.

ఈ ప్రకారమా విక్రమార్కుఁడు బహు దూరముపోయి వీణతంతుల యలతోఁ గూడినట్టియు మనోహరమైన నాదముగలయట్టియు వినువారికిం జెవులకింపయి మనస్సునకుసంతోషమును వృద్ధిఁబొందించునట్టి యత్యాశ్చర్యకరమైన దివ్యసంగీతమునువినెను - సంగీతవిద్యావేదియైన యారాజప్పు డిట్లని యాలోచించెను - ఔరయేమీ సంగీతము సొగసు - ఇక్కడ నెవ్వఁడుపాడుచున్నాఁడు - ఎవతెపాడుచున్నది నాకుఁదెలియలేదని యాలోచించుచు నక్కడనుండి త్వరత్వరగా మఱి కొంచెముదూరముపోయి యక్కడ నొకపెద్దఱాతిమీఁదఁగూర్చుండి గొప్పవీణనెత్తికొని మంచిస్వరముగలిగి యీశ్వరునిస్తోత్రముతోఁగూడియున్నసంగీతమునుబాడుచు మధురమైనకంఠనాదముగలిగియున్న యౌవనమధ్యస్థురాలగు నొకదివ్యస్త్రీని విక్రమార్కుఁడుచూచెను- ఆపెదగ్గరఁబోయి యాపెసౌందర్యమునకు నాశ్చర్యమునొందినవాఁడై యుక్తితోఁ గూడినదై ప్రియమైయుండు నొకమాటనారాజుచెప్పెను- వీణవాయించుచుబాడుటయందుఁ జతురురాలైన మోకమలములవంటికన్నులుగలదానా నీవెవతెవు వీణవాయించుటయం దిష్టముగల మాతంగియనుదేవతవా - లేక సొగసైన దేహముగల బ్రాహ్మియను దేవతవా గానమందాసక్తురాలైన కచ్ఛపి

ద్వాబ్రాహ్మీ సుందరాంగీ కచ్ఛపీ గానలోలుపా । కమలావావరారోహే క
మనీయ భుజాన్వితే॥ ౮॥ ఇంద్రాణీవా కంబుకంఠీ మత్తమాతంగ గామినీ ।
రంజవాభి తరం భోరు బింబోష్ఠి కమలాననే ॥ ౯ ॥ ఊర్వశీ వా సుందరాంగీ
నృత్తగీతవిశారదా । తవవక్త్రించకోరాక్షి చంద్రంపరిహసత్యము౦॥ ౧౦॥ దా
డిమీఫలబీజాని ధిక్కుర్వంతి రదాస్తవ । తవమధ్యం గగనవత్ అణువచ్ఛవి
భాతిమే॥ ౧౧॥ తవగీతం సమాకర్ణ్య నచలంతిమృగాంగనాః । పదాత్పదంత
థావృక్షాః శుష్కాః పల్లవయంతిహి॥ ౧౨॥ కిన్నామ తేపితాకోవా భర్తా
వామత్తకాశినీ । పుత్రోవావదచార్వంగి పృచ్ఛతో మమసాదరం॥ ౧౩॥ క
స్మాల్లోకాదిమం లోకం ప్రాప్తాసి శఫరేక్షణే । త్వాం సృష్ట్వా పరతం మన్యే
లోకకర్తార మీశ్వరం॥ ౧౪॥ త్వం సౌందర్యనిధిఃకావా సర్వవిద్యా విశార
దా । సత్యం బ్రూహివచోమేద్య సాదరం పరిపృచ్ఛతః॥ ౧౫॥ త్వత్సౌందర్యం
వర్ణయితుం బ్రహ్మణాపి నశక్యతే । శివేన విష్ణునా వాపి కావాత్వ మిహావ
ర్తసే॥ ౧౬॥ ఏవం పృష్టా మహీపేన యక్షిణీసా మహామతిః । ఉవాచవా

---

యసుదేవతనాసుందరమైనభుజములతోగూడినదానాలక్ష్మీవాశంఖమువంటికం
ఠముగలదానామదపుటేనుగువలెనడుచునట్టియింద్రునిభార్యవా-సొగసైనయ
నటికంబములవంటితొడలుగలదానా దొండపండువంటిపెదవిగలదానాకమల
ములవంటిమోముగలదానా రంభవా- ౯- సుందరమైనదేహముగలయట్టియు
నృత్తమందుఁ బాటయందుఁ జతురురాలైనయూర్వశివా- ఓచకోరములవం
టినేత్రములుగలదానానీమొగమీచంద్రునిఁబరిహాసముచేయుచున్నది-౧౦-నీ
పండ్లు దాడిమవిత్తులను దిరస్కరించుచున్నవి - నీ నడుమాకాశమువలె న
ణువువలె నగపడుచున్నది - నీపాటనువిని యాడులేండ్లు కదలక నిలువబడియు
న్నవి - అట్లె యెండినచెట్లు చిగిరించుచున్నవి- ౧౨- ఓసొగసుకత్తియా నీపే
రేమి నీతండ్రియెవఁడు నీపెనిమిటి యెవఁడు - నీకు గొడుకెవఁడైన నున్నాఁడా
యీవయినమంతయుఁ బ్రీతితోనడుగుచున్ననాకుజెప్పుము-౧౩- ఓమీనముల
వంటికన్నులుగలదానా యేలోకముననుండి యీలోకమునకు నీవు వచ్చితివి -
లోకములనుసృజించునట్టిబ్రహ్మ నిన్నుసృజించి యంతట సొగసైనసృష్టినిచా
లించియుండుననిమెంచెదను-సౌందర్యమునకుఁగనియైనట్టియు సమస్తవిద్యలను
దెలిసినట్టినీవెవతెవు ప్రేమతోనడుగుచున్న నాతో నిజమునుజెప్పుము- నీసొగ
సును వర్ణింపను బ్రహ్మకును విష్ణువునకు శివునకును శక్తిలేదు- నీవెవతె విక్కడ

క్యం వాక్యజ్ఞం తం భూపాలశిరోమణిం॥ ౧౭॥ అహం నామ్నా దేవదత్తాపి తామేసింధుభూపతిః । జాయాహం పుష్పదంతస్య భూపతేరమితౌజసః॥ ౧౮॥ శ్రుతకీర్తేస్స్నుషాస్థానం మమ హేమవతీపురం । మద్భర్తాశివశాపేన భేతాళస్సమజాయత॥ ౧౯॥ అహం తస్యావియోగేన పర్యటామి సదాప్రభో । న యాతిమమరాజేంద్ర కాలః కేనాపి హేతునా ॥ ౨౦ ॥ దివామే హరిణీరూపమేతద్రూపంనిశిప్రభో । మద్భర్తుర్వదనాలోకో యదామమభవిష్యతి॥ ౨౧॥ సమాం భర్తాపిశాచేశో వీక్షేతయదిషై కథం । తదావయోశ్శాపముక్తిర్భవిష్యతిదురత్యయా॥ ౨౨॥ యిత్యుక్తంశపతాపూర్వం శంభునానౌ మహాయశః । నాహం శక్నోమిభర్తారం గత్వాతత్ స్థానమీక్షితం॥ ౨౩॥ నైవశక్తోమమపతి ర్జ్ఞాతుంమాం శాపమోహితః । శంకరేణ పురైవోక్తం యువయోశ్శాపమోచనం॥ ౨౪॥ విక్రమాదిత్యభూపేనభవేదితిమహాభుజ । సరాజారాజశార్దూల స్సముదీక్షేతనౌకుతః॥ ౨౫॥ శాపస్య మోక్షణం తేన భవే

---

న్నున్నావుఅనియిట్లుశుగామిక్కిలిబుద్ధిమంతురాలైనయాయక్షకన్యయారాజశ్రేష్ఠుడగు విక్రమార్కునకుత్తరము పలికెను - ౧౭ - నాపేరు దేవదత్త నాతండ్రిసింధురాజు- నేనుమిక్కిలి పరాక్రమముగల పుష్పదంతుడను రాజునకు భార్యను - శ్రుతకీర్తియను రాజునకు గోడలను నాతావు హేమవతీపట్టణము నా పెనిమిటి సాంబశివుని శాపమునుచేత బేతాళుడాయెను - నేనతని విరహముచేత దిరుగుచున్నానోయి రాజా - నాకేవిధముననును గాలము గడవకయున్నది- ౨౦- నాకుఁ బగలులేడిరూపును రాత్రి యీరూపునోయిరాజా- నాపెనిమిటి ముఖమును జూచునట్లు నాకెప్పుడు సంభవిల్లునో పిశాచనాయకుఁడై యున్న యీనాభర్త యెట్లైన నన్నుఁజూచెనా యప్పుడు మాయిద్దఱకు శాపముతీరును- ౨౧-ఓయిమిక్కిలికీర్తిగలవాఁడామాకుశాపమిచ్చునపుడుశివుఁడిట్లు చెప్పియున్నాఁడు నేను నాపెనిమిటి యున్నతావునకుం బోయి యతని జూచుటకు శక్తురాలనుగాను శాపముచేత జ్ఞానహీనుఁడుగా నుండెడి నాపెనిమిటి నన్నెఱుఁగనేచాలడు - సాంబమూర్తి పూర్వమే మాకు శాపవిమోచము విక్రమార్క మహారాజుచేత నగునని చెప్పెను రాజశ్రేష్ఠుఁడైన యీ విక్రమార్క మహారాజు మమ్ము నేవిధమునఁ జూచును అతనిచేత మాశాపమెట్లు తీరును - లేక సర్వేశ్వరునిమాట తప్పునా ఆ విక్రమార్కునిచేతనే మాశాపముతీరును అని యిట్లుచెప్పి మరల నాదేవదత్త యీరాజుతో నిట్లనెను- ౨౭-

న్నుకుతఆవయోః। వై యథ్యర్థమపివాక్యస్యశంకరస్యభవేత్కథం॥ ౨౬॥ తే
నైవ విక్రమార్కేణ గతశాపౌభవేవహి । ఇత్యుక్త్వా దేవదత్తాసా నృపంతం
పునరబ్రవీత్॥ ౨౭॥ కస్త్వం పురుషశార్దూల నామధేయం తుకిం తవ। దే
వోవా బ్రాహ్మణోవా త్వం వేదశాస్త్రార్థ పారగః ॥ ౨౮ ॥ ఇంద్రోవావి
ష్ణురథవా బ్రహ్మావా భారతీపతిః । అథవా విక్రమార్కోవా రాజరాజ శిఖా
మణిః॥ ౨౯॥ కిమర్థమాగతోఽసీహ మహానిశిమహాబల । ఇతిపృష్టస్తయా
రాజా తా మువాచ హసన్ సథ॥ ౩౦॥ అహముజ్జయినీనాథో విక్రమార్కా
మమాభిధా । కాలపూరుషనామ్నాతు చోదితోఽస్మి వరాననే॥ ౩౧॥ భేతాళం
తం సమానేతుం యోగివర్యేణధీమతా । తతోగత్వామహాశాఖ వటవృక్షం
మహోన్నతం॥ ౩౨॥ తత్రస్థితం భూతనాథం దృష్ట్వా భేతాళనాయకం । బ
హ్వీనాం సరసానాంచ దుహూహానాం వరాననే ॥ ౩౩ ॥ ప్రవక్తారం కథా
నాం తం జిత్వాహం బహుమాయినం । యుక్తియుక్తైరుత్తరైశ్చ సమాధా
నాన్వితైస్తతః॥ ౩౪॥ గృహీత్వాద్యహిగచ్ఛామితందేశంయత్రయోగిరాట్।
ఇత్యుక్తవంతం రాజానం దేవదత్తావరాంగనా ॥ ౩౫ ॥ హసన్ముఖీ తదా భూ
త్వా వాక్యమేతదువాచహ । క్వవాద్యమమభర్తాస్తే భూత భేతాళనాయ

---

ఓపురుషశ్రేష్ఠుడా నీవెవడవు నీపేరేమి వేదశాస్త్రముల యర్థమును దెలిసిన
నీవు దేవుడవా బ్రాహ్మణుడవా ఇంద్రుడవా విష్ణువవా సరస్వతీవిభుడైన బ్ర
హ్మవా - లేక రాజశ్రేష్ఠుడవైన విక్రమార్కుడవా - ఓయి మిక్కిలి బలవం
తుడా నగమురాత్రివేళ యప్పు డిక్కడికేలవచ్చితివి - అని యిట్లాపె యడు
గగా నావిక్రమార్కుడు నవ్వుచు నాపె కుత్తరము చెప్పెను- ౩౦- నేనుజ్జ
యినీపట్టణమునకధిపతిని నాపేరు విక్రమార్కుడందురు - ఓ శ్రేష్ఠమైన మొగ
ముగలయక్షిణీ మిక్కిలి బుద్ధిశాలియైన కాలపురుషుడనుయోగిశ్రేష్ఠుడు న
న్నాబేతాళునిదెచ్చి తనకొప్పగింపుమని యడుగగా నంతమిక్కిలి పొడగై
నకొమ్మలు గలిగి యత్యున్నతమైయుండు మఱ్ఱిచెట్టు దగ్గిరికిబోయి యచ్చట
నున్న భూతముల యధిపతియైన బేతాళరాజునుజూచి వినసింపులై యూహింప
ప శక్యములు గాకయుండు కథలు చెప్పునట్టియు ననేక మాయలు నేర్చినట్టి
యాబేతాళుని యుక్తిగలవై యతనికి సమ్మతములుగాగల కథలు చెప్పి జ
యించినప్పుడతనిబట్టుకొనియోగీశ్వరుడున్నచోటికిబోవుచున్నాను అనియిట్లు
చెప్పిన యావిక్రమార్క మహారాజుతో శ్రేష్ఠ స్త్రీయయిన యాదేవదత్త నవ్వు

కః॥ ౩౬॥ గృహీతో యది మే భర్తా యద్యానీతః త్వయాధునా । తం దర్శయ మహీపాల మచ్చిత్తానందదాయినం ॥ ౩౭ ॥ ఇత్యుక్తస్తేన తయా రాజా భేతాళం తమదర్శయత్ । బద్ధం జటాభిః పృష్ఠస్తం మహామాయావిశారదం॥ ౩౮॥ సాదదర్శ తతస్తన్వీ భర్తారమసితేక్షణా । పృష్ఠభాగస్థితం రాజ్ఞః విమానస్థమివామరం ॥ ౩౯ ॥ అపశ్యత్సోపి భేతాళః స్వకాంతాం చారుహాసినీం । సుందరాంగీం దేవదత్తాం ప్రాపచానంతముత్తమం ॥ ౪౦ ॥ తయోః పరస్పరాలోకాత్ యక్షిణీ భూతనాథయోః । విరామాదథశాపస్య త్యక్త్వా రూపేచ పూర్వకే ॥ ౪౧ ॥ దివ్యరూపే ప్రపద్యాశు దేవగంధర్వ సేవితౌ । ఉభౌ దివ్యాంబరధరౌ దివ్యచందనచర్చితౌ॥ ౪౨॥ దివ్యాభరణ సంపన్నౌ దివ్య స్రగ్భిర్విభూషితౌ । దివ్యం విమానమారుహ్య రేజతుః ఖేమహాప్రభం॥ ౪౩॥ దీపయంతౌ స్వభాసా తౌ దిశోదశ మహాప్రభౌ । ఉభావన్యోన్య మాలోక్య నతృప్తి ముపజగ్మతుః॥ ౪౪॥ పరస్పరం సల్లపంతౌ పూర్వ వృత్తం ముదా

---

చునిట్లనిపలికెను- భూతబేతాళురకుఁ బ్రభువైన నాపెనిమిటి యిప్పుడెక్కడను న్నాఁడు - ౩౬ - నాపెనిమిటి పట్టుకొఁబడెనా నీచేతనిప్పుడు దేబడెనా - అతని జూచిననామనస్సునకు సంతోషముకలుగునుగనుక నతనినిప్పుడు నాకగపఱుపుమయ్యారాజా - ౩౭ - ఈప్రకార మాపె యడుగఁగా నంత నావిక్రమార్క మహారాజు జడలచేతఁగట్టఁబడి తనవీపుమీఁదనున్న మిక్కిలిమాయలునేర్చిన యాబేతాళుని నాపెకగపఱిచెను - ౩౮ - అంత నల్లని కన్నులుగల యాదేవదత్త యావిక్రమార్కునివీపుమీఁద విమానమందు దేవతయున్నట్లున్న యాబేతాళునిజూచెను - ౩౯ - ఆబేతాళుఁడును సొగసైన నగవును సొగసైన దేహమునుగల యాతని భార్యనజూచి సంతసమును బొందెను - ౪౦ - వారిద్దఱకు నొండొరులచూపువలన శాపముతీరెనుగనుక నిద్దఱుమునుపటిరూపములవిడిచి దివ్యరూపములనుబొంది దేవతలచేతను గంధర్వులచేతను సేవింపఁబడిన వారై యిద్దఱుశ్రేష్ఠములైన వస్త్రములఁగట్టుకొని దివ్యమైన చందనముపూసికొని సొగసులైనసొమ్ములచేతను బువ్వులచేత నలంకరించుకొన్నవారై యాకాశమందు దివ్యమైనవిమానమునెక్కి ప్రకాశించిరి - ౪౩ - అప్పుడు తమతేజస్సుచేతఁ బదిదిక్కులను వెలిఁగించుచున్న యాయిద్దఱొకరినొకరెంతసేపుచూచినను దనియరైరి- ౪౪- మునుపటితమసమాచారము నొకరితోనొకరుమాటలాడుకొనుచుసంతోషముతోఁగూడినవారై దేవతలచేతనువిద్యాధరులచేతను

న్వితౌ । స్తూయమానౌ తథాదేవైః విద్యాధరగణైస్తథా॥ ౪౫॥ విశ్వావసు ప్రభృతిభిః గంధర్వైర్మధురస్వరైః । గీయమానస్వ చరితౌ రేజతుస్తౌ విమానకే॥ ౪౬॥ తదాన్నృత్తం ప్రవవృతే కృతమప్సరసాంగణైః । దివ్యగాన సమాయుక్తం సర్వలోక మనఃప్రియం ॥ ౪౭ ॥ దేవదుందుభయోనేదుః పుష్పవృష్టిః పపాతచ । కైలాసవాసినః సర్వేముదం ప్రాపుర నుత్తమాం ॥ ౪౮ ॥ మహానందం జగ్మతుస్తౌ పార్వతీ పరమేశ్వరౌ । బ్రహ్మా విష్ణు ర్మహేంద్రశ్చమోదం ప్రాపురనుత్తమం ॥ ౪౯ ॥ విమానస్థం తదాలోక్య దేవదత్తాసమన్వితం। దేవాంగం విక్రమార్క స్తం తేజసాభాస్కరప్రభం॥ ౫౦॥ ఆశ్చర్యయుక్తో నృపతిః కిమేతదితి చింతయన్ । ఆనంద సాగరేమగ్నః బభూవ స్తబ్ధచేతనః॥ ౫౧॥ తథా భూతంతురాజానం వాక్యజ్ఞం వాక్యకోవిదః । దృష్ట్వా ప్రోవాచ దేవాంగః దేవదత్తా సమన్వితః॥ ౫౨॥ రాజేంద్రం విక్రమాదిత్య మహాబలపరాక్రమ । త్వన్నావాసు పవిత్రేణ శాపాబ్ధిమ తరం హ్యహం॥ ౫౩॥ త్వత్కృతస్యోపకారస్య విధాతుం ప్రత్యుప క్రియాం । నశక్నోమి తథాపీహ యత్తేమనసిరోచతే ॥ ౫౪ ॥ తన్మేబ్రూహి మహాభాగ కరవాణి నసంశయః।

---

బాగడఁబడుచు విశ్వావసువు మొదలగు గంధర్వశ్రేష్ఠులు తమచరితలను పాడుచుండఁగా వారు విమానమందుఁ బ్రకాశించిరి- ౪౫ - అప్పుడప్సరలందఱును గానపాటలతోడ నందఱకు సంతోషకరముగా నాడనారంభించిరి- ౪౬ - దేవతల నగారాలు మ్రోగెను - పూలవాన కురిసెను - కైలాసమందున్న వారంద ఱీడులేని సంతోషమునుబొందిరి - ౪౭ - పార్వతీ పరమేశ్వరు లధికసంతోషమునుబొందిరి బ్రహ్మయువిష్ణువునింద్రుడును బరమానందభరితులైరి- ౪౮ - అప్పుడావిక్రమార్క మహారాజు విమానమందు దేవదత్తతోఁగూడఁగూర్చుండి సూర్యునితో సమానమైన తేజస్సుతోఁ బ్రకాశించుచున్న యాదేవాంగునిఁజూచియాశ్చర్యపడియిదియేమనిచింతించుచు సంతోషసముద్రమందుమునిఁగిమందీభవించిన ప్రజ్ఞగలవాఁడాయెను - అట్లున్న యావిక్రమార్క మహారాజును జూచియాదేవదత్తతోఁగూడనున్న దేవాంగుఁడు విక్రమార్క మహారాజు మాటలనేర్పెఱిగినవాఁడుగనుకఁదనమాటలనేర్పు మెరయునట్లుతనితోనిట్లనెను-౫౨ ఓయిరాజరాజవైన విక్రమార్కుఁడా మిక్కిలిబలమును బరాక్రమమునుగలవాఁడా నీవనుపరిశుద్ధమైన యోడచేత నేనీశాపమను సముద్రమును దాటితిని నీవు చేసిన యుపకారమునకు నేనుబదులు చేయఁజాలనైనను నీకేదిష్టముగానుండు

దేవాంగే నైవముక్తస్తు భార్యాయుక్తేన సాదరం ॥ ౫౫ ॥ విక్రమార్కోఽతి మేధావీ విచింత్యచ పునఃపునః । ప్రార్థయామాస తం శూరః నమస్కృ త్యస్వమీప్సితం॥ ౫౬॥ హేదేవాంగ మహాదేవ భక్తబృందాగ్రణీ భవాన్ యదితుష్టోమహాబుద్ధే దేహిమే వరమీదృశం॥ ౫౭॥ యదాస్మరామి దేవాం గత్వాం దేవగణసేవితం । తదా భేతాళరూపీసన్ మత్సంనిధిమవాప్నుహి॥ ౫౮॥ మయాయదుచ్యతేకర్మ తత్కర్తవ్యం త్వయానఘ। ఏషతేద్యవరో మహ్యం దీయతాం యదిరోచతే ॥ ౫౯ ॥ ఏవం సంప్రార్థితస్తేన విక్రమా ర్కేణధీమతా । దేవాంగ స్త్వబ్రవీద్వాక్యం తథాస్త్వితితథాస్త్వితి॥ ౬౦॥ ఏవందత్తవరోభూపః విక్రమార్కోఽముదాన్వితః। గచ్ఛామీతితమామంత్ర్య గంతుం సముపచక్రమే॥ ౬౧॥ తథా భూతంతురాజానం దృష్ట్వా త్రైలోక్య సుందరం । దేవదత్తావోదితస్సన్ దేవాంగః పునరబ్రవీత్ ॥ ౬౨॥ కాలపూ రుషనామానం త్వాం బలిం దాతుముద్యత। విద్ధిరాజేంద్రసుమతే తస్మాజ్జాగృ హిజాగృహి॥ ౬౩॥ యదాత్వాకాలపురుషః రాజన్ స్నాహీతివైవదేత్ ।

---

నోదానినాతోఁజెప్పుము తప్పకచేయుదును- అనియిట్లుభార్యతోఁగూడనున్న యాదేవాంగుఁడాదరణముతోఁ జెప్పఁగా మిక్కిలి బుద్ధిమంతుఁడైన యావి క్రమార్కుఁడు కొంతసేపాలోచించి యాదేవాంగునకుఁ బ్రణమిల్లి తనకోరిక నడిగెను- ౫౬- ఓయిదేవాంగుఁడా నీవుసాంబమూర్తి భక్తులసమూహాము నమొదటివాఁడవు- మిక్కిలి బుద్ధిశాలివైన నీవుసంతోషమును బొందినపక్ష మున నాకిట్టివరమిమ్ము- ౫౭ - దేవాంగుఁడా దేవతా సమూహాములచేతఁ గొలువఁబడెడు నిన్ను నెప్పుడుతలఁతునో యప్పుడు నీవుబేతాళరూపముతో నాయొద్దకురావలయును - ౫౮ - నేనేమిచెప్పెదనో దాని నీవుచేయవలయు ను ఈవరము నీకిష్టముగానున్నపక్షమున నాకీవలయును- అనియిట్లా విక్రమా ర్కుఁడు వేడికొనఁగా నాదేవాంగుఁడట్లేకానిమ్మని యుత్తరముచెప్పెను- ఇట్లు వరమీఁబడినవాఁడై యావిక్రమార్కుఁడు సంతోషించి యాబేతాళునియొద్ద సెలవుతీసికొనిపోనుబయలువెడలెను- అట్లుబయలుదేరియున్న మిక్కిలిసొగసై నయావిక్రమార్కమహారాజునుజూచి యాదేవాంగమహాముని తనభార్యయైన దేవదత్తచేతఁబ్రేరేతుడై మరలనిట్లనిపలికెను-ఓయిమంచిబుద్ధిగలరాజశ్రేష్ఠుఁ డా కాలపురుషుఁడనుయోగీశ్వరుఁడు నిన్నుఁగాళికకుబలియీనుద్యుక్తుఁడని నీవుతెలిసికొమ్ముజాగ్రత్తతోనుండుము- ఓయిరాజాయెప్పుడునిన్నుఁగాలపురు

తదా త్వయాస వ క్తవ్య త్వం స్నాహి ప్రథమం ప్రభో॥ ౬౪॥ యదా త్వాం కాలపురుషః నమస్కుర్విత్తివై వదేత్ । తదాత్వయాసవ క్తవ్యః ప్రథమం త్వం నమస్కురు॥ ౬౫॥ నమస్కుర్వతి తస్మింస్తు కాలపూరుషనామని । చంద్రహాసం సమాదాయ పాణినా నృపసత్తమ ॥ ౬౬ ॥ బల్యర్థం కాళికాదేవ్యాః తచ్ఛిరశ్ఛింధిసత్వరం । తదాసాకాళికాదేవీ ప్రసన్నా తేభవిష్యతి॥ ౬౭॥ తతస్సా శంకరీదేవీ మాంతు భేతాళరూపిణం । వశగం తేసదారాజన్ కరిష్యతినసంశయః॥ ౬౮॥ చక్రవర్తిత్వమపి తే దీర్ఘమాయుశ్చ భూమిప । భక్తచింతామణిః కాళీసాదాస్యతిన సంశయః॥ ౬౯॥ ఇత్యుక్త్వాసతు దేవాంగః దేవదత్తా సమన్వితః । ఆపృచ్ఛ్యతం రాజరాజం యయౌ కైలాసభూధరం ॥ ౭౦॥ తతస్సవిక్రమాదిత్యః తం దేశమగమద్ద్రుతం । కాలపూరుషనామాసౌ యత్రాస్తేయోగివల్లభః॥ ౭౧॥ తం దదర్శతతో యోగీ విక్రమార్కం మహీపతిం । క్వభేతాళః భేతాళః ఇత్య పృచ్ఛత్ససాదరం ॥ ౭౨ ॥ తతస్స విక్రమాదిత్యః పృచ్ఛంతం యోగినంప్రతి । అబ్రవీత్సర్వవృత్తాంతం బేతాళసమ్య మహాత్మనః॥ ౭౩॥ తతస్సకాలపురుషః శ్రుతవృత్తః త్వరాన్వితః । విక్రమా

---

షుండుస్నానముచేయుమని చెప్పనోయప్పుడునీవతనిముందు స్నానముచేయుమనుము-ఎప్పుడుకాలపురుషుడునిన్ను నమస్కరింపుమనునోయప్పుడునీవతనిముందునమస్కరింపుమనుము - ఆకాలపురుషుండు నమస్కరించుచున్నప్పుడు నీవు చంద్రహాసమునెత్తికొని కాళికాదేవికి బలికొఱకు ద్వరితముగా నతని తల నఱకుము - అంతనాకాళికాదేవి నీకనుగ్రహముసేయును - ౬౭ - అంతశుభకరురాలై నయాకాళికాదేవి బేతాళరూపధారియైన నన్ను నీకువశ్యునిఁగాఁజేయునుసందియములేదు - ౬౮ - భక్తులకుఁ జింతామణియగునట్టి యాకాళికాదేవి నీకుఁజక్రవర్తిత్వమును దీర్ఘాయువునీఁగలదు అనియిట్లుచెప్పి యాదేవాంగుఁడు తనభార్యయైన దేవదత్తతోఁ గూడినవాఁడై యావిక్రమార్కుని సెలవడిగికొని కైలాసపర్వతమునకుఁబోయెను - ౭౦ - అంత నావిక్రమార్కుఁడా కాలపురుషయోగీశ్వరుఁడుండు తావునకుఁ బోయెను - ౭౧ - పిమ్మట నాయోగి యావిక్రమార్కునిఁజూచి బేతాళుఁడెక్కడ బేతాళుఁడెక్కడ యని యాదరముతోడనడిగెను - ౭౨ - తరువాత నావిక్రమార్కుఁ డిట్లడుగుచున్న యాకాలపురుషునితో బేతాళునిసమాచారమునంతయు జెప్పెను- 23- అంతట నాకాలపురుషుఁడా సమాచారమునువిని త్వరితముగా నావిక్రమా

కేణ సహితః ప్రాయాద్దివ్యే కాళికాలయం॥ ౨౪॥ ప్రవిశ్య కాళికావేశ్మ కాలపూరుషయోగిరాట్ । విక్రమార్కం బలిం దాతుం కాళ్యాస్స్వకృతనిశ్చయః॥ ౨౫॥ స్వాభీష్టానిచ సంప్రాప్తుం తస్యాస్తు వరదానతః । విక్రమార్కం మహీపాలం స్నాహి స్నాహీతిసోఽబ్రవీత్ ॥ ౨౬ ॥ తతస్స విక్రమాదిత్యః దేవాంగవచనంస్మరన్ । త్వం వాస్నాహి ప్రథమం యోగిన్ ఇతి హోవాచ తం ప్రతి॥ ౨౭॥ తతస్సకాలపురుషః స్నాత శ్శుద్ధః కృతాహ్నికః । బభూవ తేజసాదీప్తః తస్యవాక్యేన చోదితః॥ ౨౮॥ అథాసౌవిక్రమాదిత్యః తస్య వాక్యేన చోదితః । బభూవతేజసాదీప్తః స్నాతశ్శుద్ధః కృతాహ్నికః॥ ౨౯॥ ఏవం సర్వేషు కృత్యేషు విక్రమార్కో మహీపతిః । తమేవ చోదయామాస యోగినం ప్రథమం తదా॥ ౩౦॥ తతస్సకాలపురుషః విక్రమార్కం మహామతిం । నమస్కుర్వితిరాజానం ఖడ్గపాణి రువాచహ॥ ౩౧॥ తదాస విక్రమార్కస్తం కాలపూరుషయోగినం । ప్రోవాచ ప్రథమం దేవ నమస్కుర్వితిసాదరం॥ ౩౨॥ నమస్కుర్వతి తస్మింస్తు కాలపూరుషనామని । చంద్రహాసం సమాదాయ పాణినా నృపసత్తమః॥ ౩౩॥ దాతుకామో బలిం దేవ్యాః కాలికాయాముదాన్వి

---

ర్కునితోడఁ గాళికాదేవి గుడికిఁజోయెను - ౨౪ - ఇట్లాగుడికిఁబోయి యా యోగీశ్వరుఁడు విక్రమార్కుని నాదేవికిబలియియ్యను నామె వరమిచ్చుటవలనఁ దనకోరికలను బొందను నిశ్చయించుకొన్నవాఁడై యావిక్రమార్కుని స్నానముచేయుము స్నానముచేయుమనెను - ౨౬ - అంత నావిక్రమార్కుఁడు దేవాంగుఁడు తనకుఁ జెప్పినమాటను జ్ఞప్తిచేసుకొని యాతనితో నీవుముందు స్నానముచేయుమనెను - ౨౭ - అంత నాకాలపురుషుఁ డతనిమాట ప్రకారము తాను స్నానముచేసి పరిశుద్ధుఁడై యాహ్నికక్రియలుతీర్చుకొని ప్రకాశించుచుండెను - అంతనావిక్రమార్కుఁడు నాయోగిచెప్పినమాటచేత స్నానముచేసి యాహ్నికములఁ జేసికొని ప్రకాశించుచుండెను- ఇట్లు యావిక్రమార్కుఁ డన్నికార్యములయందును ముందా యోగీశ్వరునినే ప్రేరేపించుచు వచ్చెను- ౩౦ - అంత నాకాలపురుషుఁడు ఖడ్గమునుజేతబట్టుకొని మిక్కిలి బుద్ధిమంతుఁడై నయావిక్రమార్కుని మ్రొక్కుమనెను - ౩౧ - అప్పుడా విక్రమార్కుఁడా కాలపురుషయోగిని మీరు ముందుమ్రొక్కుఁడని యాదరముతోఁ జెప్పెను- ౩౨- ఆకాలపురుషయోగి నమస్కారముచేయుచుండఁగా నావిక్రమార్కుఁడుచేతఁ జంద్రహాసమెత్తుకొని కాళికాదేవికి బలియీయ నిచ్ఛగలవాఁడై

తః । కాలపూరుష నామ్నోస్య శిరశ్ఛిచ్ఛేద సత్వరం॥ ౮౪॥ ఖడ్గేన శితధారేణ విక్రమార్కో మహాబలః । దేవదుందుభయో నేదుః పుష్పవృష్టిశ్చఖాచ్చ్యుతా॥ ౮౫॥ ననృతుశ్చాప్సరస్సంఘాః గంధర్వాశ్చ కలం జగుః । రాజన్ జయజయేత్యూచుః విక్రమార్కం దివౌకసః॥ ౮౬॥ తతస్సా కాళికాదేవీ ప్రసన్నా భక్తవత్సలా । విక్రమార్కం మహీపాల అబ్రవీత్కరుణానిధిః॥ ౮౭॥ రాజరాజ మహాబాహో వరదాస్మి తవానఘ । వరం వృణీష్వ భూమీశ ప్రియత్తే మనసికాంక్షితం॥ ౮౮॥ ఏవముక్తో విక్రమార్కః కాళ్యాసంతుష్టమానసః । వృణుతేస్మ వరం రాజా దుష్ప్రాపమితరైర్జనైః॥ ౮౯॥ యదా స్మరామి దేవాంగం శివేభక్తేష్టదాయిని । అసౌ బేతాళరూపీసన్ తదా గచ్ఛతు మేంతికం॥ ౯౦॥ చక్రవర్తి పదం మేద్య దేహి సర్వాంగసుందరి । చిరమాయుశ్చ దేవేశి గిరిజే తేన మోనమః॥ ౯౧॥ ఇతి సంప్రార్థితా దేవీ విక్రమార్కేణ భూభృతా । దదాతస్మై వరాన్ సర్వాన్ ప్రార్థితాన్ భక్తకామధుక్॥ ౯౨॥ అనుజ్ఞాతస్తతో దేవ్యా విక్రమార్కో మహాబలః। అవాపోజ్జయినీం రాజా రాజరాజాధిపో ముదా ॥ ౯౩ ॥ స్వవృత్తాంతమశేషంచ సభాసద్భ్యఃకు

---

సంతోషముతో నీకాలపురుషయోగి తలను ద్వరగానరికెను- ౮౪- ఇట్లతఁడు తీక్ష్ణమైనఖడ్గముతో నతని తలనరుకఁగా నాకాశమున దేవతల నగారాలు మ్రోసెను పుష్పముల వానగురిసెను - అప్సరసలందఱాడిరి - గంధర్వులు మధురముగాఁ బాడిరి - దేవతలందఱా విక్రమార్కుని రాజా గెలువుము గెలువుమనిరి- ౮౬ - అంత దయానిధియైనట్టియు భక్తులయందుఁ బ్రీతిగలయట్టి కాళికాదేవి యనుగ్రహముగలదై విక్రమార్కునితో నిట్లనెను- ౮౭- ఓయి మిక్కిలి భుజబలముగల విక్రమార్కుఁడా నీకు వరమీయవచ్చితిని నీయిష్టమైన వరమునుగోరుము - ౮౮ - ఇట్లా దేవిచెప్పఁగా నావిక్రమార్కుఁడు మనస్సున సంతోషించినవాఁడై యితరులకుఁ బొందఁగూడని వరమును గోరెను - ఎప్పుడునేను దేవాంగుని స్మరింపుదునో యప్పుడతఁడు బేతాళరూపముతో నాయొద్దకువచ్చునట్లు ప్రసాదింపుము - మఱియుఁ జక్రవర్తిత్వమును దీర్ఘమగు నాయువును నాకుఁ గలుగునట్లు దయచేయుమమ్మా సర్వాంగ సుందరివైన పార్వతీ నీకు మ్రొక్కెదననెను- ౯౧- భక్తుల కోరికలనన్నిటి నిచ్చునట్టి యాకాళికాదేవి యాప్రకారముగ తనిచేతఁ బ్రార్థింపఁబడినదై యాతని కాతఁడు కోరినవరములన్ని యిచ్చెను- ౯౨- పిమ్మట నావిక్రమార్కుఁడా మెచేత సెలవు దీసికొని సంతోషముతో నుజ్జయినీపట్టణమునకుఁబోయెను- ౯౩- పోయి బట్టు

తూహలీ । కథయామాసరాజేంద్రః వందిమాగధసంస్తుతః ॥ ౯౪ ॥ ఇంద్రాసనం సమారుహ్య సర్వరాజాభివందితః । శశాస మేదినీం రాజా మహేంద్రో వై దివం యథా॥ ౯౫॥ తస్మిశ్శాసతిభూచక్రం విక్రమార్కే మహీపతౌ । సర్వే స్వధర్మనిరతాః మోదమాపుర్జనాస్తదా॥ ౯౬॥ ఇదం భేతాళరూపస్య దేవాంగస్య మహాత్మనః । తథైవ దేవదత్తాయా శ్శాపమోక్షనిరూపకం ॥ ౯౭॥ చరిత్రం యే పఠంతీహ యే శ్రుణ్వంతిజనాభువి । భూతభేతాళబాధస్తు తేషాం క్వాపినవిద్యతే॥ ౯౮॥ ఏతచ్చరిత్రపఠనాత్ సర్వపవనరాభువి । అణిమాద్యష్టసిద్ధించ ప్రాప్నువంతి నసంశయః॥ ౯౯ ॥ ఇదం చరిత్రం పాపఘ్నం యే శ్రుణ్వంతిపఠంతిచ । సర్వదారక్షితాస్స్యస్తే పార్వత్యాచ శివేనచ॥ ౧౦౦॥ ఇత్యేతచ్చరితం దివ్యం దేవాంగస్య మునీశ్వరాః । నారదాదిమునీంద్రాయ శశంసకమలాసనః॥ ౧౦౧। ఇతిశ్రీబ్రహ్మాండపురాణే - బ్రహ్మానారద సంవాదే - దేవాంగచరితే - బేతాళచరితే - బేతాళశాపమోక్షోనామ పంచవింశోధ్యాయః.

బ్రంహోవాచ॥ అధ కైలాసశిఖరే నానారత్న సమన్వితే । మందా

---

వాండ్రులో నగువారిచేతఁ బొగడఁబడినవాఁడై తనసమాచారమంతయు సభయందుండు వారితోఁ జెప్పెను - ౯౪ - తరువాత నాతఁడు గద్దియనెక్కి యందఱురాజులచేత మ్రొక్కులుగొనుచు దేవేంద్రుండు స్వర్గమునేలినట్లు భూమినేలెను - ఆవిక్రమార్కుఁడు భూమినేలుచుండ అందఱుజనులు తమతమధర్మములుతప్పక సంతోషమునొందియుండిరి - ౯౬ - బేతాళరూపమునుబొందియున్న దేవాంగునియొక్కయు లేడిరూపము నొందియున్న దేవదత్తయొక్కయు శాపమోక్షకథను విన్నవారికిని జదివిన వారికిని నెప్పుడు నెక్కడను భూతబేతాళబాధకలుగదు - ౯౮ - ఈకథను జదివిన మనుజుల కణిమాద్యష్టసిద్ధులును గలుగును సందేహములేదు - సకల పాపములను బోగొట్టునట్టి యీ కథను జదివెడువారిని వినువారి నెల్లప్పుడు పార్వతీ పరమేశ్వరులు ప్రీతితోఁ గాపాడుచుండుదురు - ౧౦౦ - ఈప్రకారమీ దివ్యమైన దేవాంగుని కథను బ్రహ్మదేవుడాదిమునియైన నారదుని కొఱకుఁ జెప్పెనోయి మునులారా - ౧౦౧ - ఇది బ్రహ్మ స్వరూపమయిన బ్రహ్మాండ పురాణమందు బ్రహ్మ నారద సంవాదమున దేవాంగ చరిత్రమందు బేతాళుని శాపవిమోచన మన్నది యిరువదియైదవయధ్యాయము.

బ్రహ్మ పిమ్మట కథను జెప్పుచున్నాఁడు - తరువాత ననేకరత్నములు

రైః పారిజాతైశ్చ సంతానైశ్చ సుపుష్పితైః॥ ౧॥ కల్పవృక్షైః మహాదివ్య ఫలైశ్చ హరిచందనైః। వ్యాప్తే చాన్యైశ్చ బహుళైః వృక్షబృందైః స్సమన్వితే॥ ౨॥ నారదాగస్త్యవాల్మీకి పరాశరనిషేవితే। దివ్యదుందుభి నిర్ఘోషే దివ్యగాన సమన్వితే॥ ౩॥ దివ్యనాట్య సమాయుక్తే దివ్యస్త్రీపరివేష్టితే। దివ్యమంగళ సంయుక్తే దివ్యమంటపరాజితే ॥ ౪ ॥ దివ్యసింహాసనాసీనం దివ్యమంగళవిగ్రహం। బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవబృందైరహర్నిశం ॥ ౫ ॥ సంస్తూయమానమఖిల బ్రహ్మాండేశ్వర మచ్యుతం। ఆదిత్యాది గ్రహైశ్చైవ తథాష్టవసుభిర్ముహుః ॥ ౬ ॥ సంసేవిత పదాంభోజం సర్వాభరణభూషితం। భస్మోద్ధూళిత సర్వాంగం శూలాద్యాయుధధారిణం ॥ ౭ ॥ చంద్రచూడం మహాభాగం సర్వాభరణభాసితం। త్రిపురాణాం ప్రహర్తా-

---

గలయట్టియు మందారవృక్షముల చేతను జక్కఁగాఁ బూచిన సంతాన వృక్షముల చేతను బారిజాతములుచేత గల్ప వృక్షముల చేతను దివ్యములయిన గొప్ప పండ్లు గల హరి చందన వృక్షముల చేతను వ్యాపింపఁ బడి యితరములైన చెట్లుతోనుగూడియున్నట్టియు నారదుఁ డగస్త్యుఁడు వాల్మీకి పరాశరుఁడు వీరిచే సేవింపఁబడినట్టియు దివ్యములైన నగారాల ధ్వనులచేత శబ్దించుచున్నట్టియు శ్రేష్ఠమైన సంగీతనాదముగలయట్టియు శ్రేష్ఠమైన యాటలునుదివ్యస్త్రీలునుగలయట్టిదై యెల్లప్పుడుశుభములుగలిగి యనేకములగు మంటపములచేత నొప్పుచున్న కైలాసపర్వతము శిఖరమందు దివ్యమైన సింహాసనముమీఁదఁగూర్చుండి దివ్యమంగళవిగ్రహముగలవాఁడై బ్రహ్మవిష్ణువు ఇంద్రుఁడు మొదలగు దేవతలచేత రాత్రిఁ పగళ్లు స్తోత్రము చేయఁబడుచున్నట్టియు సర్వబ్రహ్మాండ ప్రభువైనట్టియుఁ జ్యోతిలేనట్టియు - ఆదిత్యుఁడు మొదలగు నవగ్రహములచేత నెనమండ్రువసువులచేతను సేవింపఁబడిన పాదకమలములుగలిగి సమస్తభూషణములను ధరించికొని విభూతి దేహమంతయుఁబూసికొని శూలము మొదలగునాయుధములధరించియున్నట్టియుఁ జంద్రునితలయందుధరించిన మహానుభావుఁడైనట్టియుఁ ద్రిపురములను ధ్వంసము చేసినట్టియు మూఁడుకన్నులుగలయట్టియుమన్మథునకుశత్రువైనట్టియునుభయపార్శ్వములయందు నప్సరస్త్రీలచేత వింజామరలు వేయఁబడుచున్నట్టియుఁ జతుర్వేదస్వరూపమైన దేహమును ధరించినట్టియు దయాసముద్రుఁడైనట్టియు మృత్యుంజయుఁడైనట్టియుమిక్కిలిబలముగలయట్టియుఁ బార్వతీదేవితోఁగూడిన

రం త్రిణేత్రం మదనాంతకం ॥ ౮ ॥ వాలవ్యజనహస్తాభిః అప్సరోభిర్నిషేవితం । ఋగ్యజుస్సామరూపంచ తథాధర్వమయం వపుః ॥ ౯ ॥ దధానం కరుణాంబోధిం కాలకాలం మహాబలం । పార్వత్యా సహితం దేవ్యా భక్తాభీష్టప్రదాయినం॥ ౧౦॥ జటా గంగాధరం దేవం దేవదేవోత్తమం విభుం । ఈశానం సర్వవిద్యానాం అణిమాద్యష్టసిద్ధిదం॥ ౧౧॥ వేదాంతవేద్యమఖిల వేదాంతార్థ స్వరూపిణం । ఆయయౌనారదోద్రష్టుం గాయన్ శివశివేతిచ॥ ౧౨॥ ఉపసృత్య బ్రహ్మమయం ప్రణమ్యచ ముహుర్ముహుః । శివం శివకరం శాంతం స్తోతుం సముపచక్రమే ॥ ౧౩ ॥ నమస్తేదేవదేవేశ నమస్తేభక్తవత్సల । నమస్తే పార్వతీనాథ నమస్తే కాంతవిగ్రహ ॥ ౧౪ ॥ కల్యాణాచలవాసాయ కల్యాణాస్పదమూర్తయే । కల్యాణదాయినేతుభ్యం నమోస్తు మమసర్వద॥ ౧౫ ॥ విశ్వేశ్వర విరూపాక్ష త్రిపురాంతకహేశివ । అణిమాద్యష్టసిద్ధీర్మే శీఘ్రందేహిసదాశివ॥ ౧౬॥ వేదవేదాంతవేద్యాయ విజ్ఞానానందరూపిణే ఋగ్యజుస్సామరూపాయ నిఖిలేశాయతేనమః ॥ ౧౭ ॥ అగస్త్యాది మహాసిద్ధైః

---

ట్టియు భక్తులకోరికలనిచ్చునట్టియు జడలయందుగంగనుధరించినట్టియు దేవతలలోనెల్ల నాదిదేవుఁడైనట్టియు సర్వశక్తిసంపన్నుఁడైనట్టియు సకల విద్యలకు నధికారియయినట్టియు నణిమ మొదలగు నెనిమిది సిద్ధుల నిచ్చునట్టియు వేదాంతములచేతఁ దెలియదగినట్టి సర్వోపనిషదర్థస్వరూపుఁడైనట్టి యీశ్వరునిఁజూడను నారదుఁడు శివశివయని పాడుకొనుచువచ్చెను - ౧౨ - బ్రహ్మస్వరూపుఁడైనట్టియు సర్వమంగళకరుఁడైనట్టి యాసాంబశివుని దగ్గిరకివచ్చియాయనకు నమస్కారములుచేసి పొగడనారంభించెను - ౧౩ - ఓ దేవతలకెల్లనీశ్వరుఁడా నీకుమ్రొక్కెదను భక్తులయందుఁ బ్రీతిగలవాఁడా నీకుమ్రొక్కెదను - పార్వతికిఁ బెనిమిటియైన వాఁడా నీకు మ్రొక్కెదను - సుందరమైన మేను గలవాఁడా నీకుమ్రొక్కెదను - ౧౪ - నాకు సమస్తము నిచ్చువాఁడా శుభకరమైన కొండయందుండునట్టియు శుభముల కాస్పదమైన మూర్తిగలయట్టియు శుభమిచ్చునట్టి నీకు నమస్కారము - ౧౫ - విశ్వమునకుఁ బ్రభువా - మూఁడుకన్నులుగలవాఁడా త్రిపురములను ధ్వంసముచేసినవాఁడా సదాశివుఁడా నాకుఁ ద్వరితముగా నణిమాద్యష్టసిద్ధులనిమ్ము - ౧౬ - వేదములచేతనుపనిషత్తులచేతను దెలియఁ దగినట్టియుఁ జిదానందరూపుఁడైనట్టియు వేదత్రయరూపుఁడైనట్టి సర్వేశ్వరుఁడవైన నీకు నమస్కారము - ౧౭ - అ

వంద్యమాన పదాంబుజ । కురుష్వమాం మహాసిద్ధం సిద్ధానాం సిద్ధిదాయక॥ ౧౮॥ రాజరాజసమం శంభో సంపత్యా కీర్తిమాలయా । కురుష్వమాం కృపాసింధో సాంబతుభ్యంనమోనమః॥ ౧౯॥ దేహి దేహి శ్రియం దేవ చిరమాయుశ్చదేహి మే । కురుమాం మృత్యుహంతారం మృత్యుంజయనమోస్తుతే ॥ ౨౦॥ ఇతిస్తుతో మహాదేవః సదత్వా కాంక్షితా న్ వరాన్ । ఉవాచ నారదం పూజ్యం వేదవాచామగోచరః॥ ౨౧॥ హే నారద మహాప్రాజ్ఞ కోవృత్తాంతో మహీతలే । అస్తిచేద్వదశీఘ్రం మే తం శృణోమిమహామునే॥ ౨౨॥ ఇతి పృష్టశ్శంకరేణ నారదో వినయాన్వితః । ఉవాచ వాక్యం వాక్యజ్ఞః సర్వలోకేశ్వరేశ్వరం ॥ ౨౩ ॥ శ్రుణుదేవ ప్రవక్ష్యామి లోకవృత్తాంత మద్యతే । కలౌయుగే సంప్రవృద్ధే యో భూదానందవిగ్రహ ॥ ౨౪ ॥ అపశబ్ద సమూహాస్స్యాత్ పరిపూర్ణో మహీతలే । నవ్యాకరణవేత్తాస్తి నవేదవిదపిప్రభో ॥ ౨౫ ॥ ఋగ్యజుస్సామవేదానాం సర్వకర్మార్థ దర్శినాం । పద క్రమజ

---

గస్త్యుఁడు మొదలగు నెల్లసిద్ధులచేతను మ్రొక్కఁబడుచున్న పాదకమలములు గలవాఁడా సిద్ధులకు సిద్ధులనిచ్చువాఁడా నన్ను గొప్పసిద్ధునిఁగాఁజేయుము - ౧౮ - శుభకరుఁడవై నట్టియు దయాసముద్రుఁడవైన యో సాంబశివుఁడా నన్ను సంపదచేతను గీర్తిపజ్క్తిచేతను రాజరాజుతో సరిగాఁజేయుము నీకు మ్రొక్కెదను - ౧౯ - స్వామీ నాకు సంపదనిమ్ము దీర్ఘాయువునిమ్ము మృత్యువును గెలిచినస్వామీ నన్నుమృత్యువును గొట్టువానిఁగాఁజేయుము నీకుమ్రొక్కెదను - ౨౦ - వేదవాక్యములకైనను విషయుఁడుగాని యా సాంబశివుఁడీప్రకారముపొగడఁబడినవాఁడై కోరినవరములనెల్లనిచ్చిపూజ్యుఁడైన యానారదమహామునితో నిట్లనెను - ౨౧ - ఓయి మిక్కిలి తెలిసిన నారద మహాముని భూమియందేదైన విశేషము సమాచారమున్న పక్షమునఁజెప్పుము వినియెదను - ౨౨ - ఈప్రకారమా యీశ్వరునిచేత నడుగఁబడి మాటలనేర్పుగల యానారదుఁడు వినయముతో నాసాంబమూర్తికు త్తరముచెప్పనారంభించెను- ౨౩-ఓయానందస్వరూపుడవై నస్వామీ యిప్పుడుకలిముదరఁగా భూమియందుఁగల వృత్తాంతమును జెప్పెద వినుము- ౨౪- ఇఁకభూమియందంతట నపశబ్దములు వ్యాపింపఁబోవును - ఒక్కఁడైన వ్యాకరణము తెలిసిన వాఁడును వేదము తెలిసినవాఁడును లేఁడు - ౨౫ - సర్వకర్మముల విధులను దెలియఁజేయునట్టి ఋగ్యజుస్సామవేదముల పదములను గ్రమముల జడలను జెప్పువారు

టాదీనాం ప్రవక్తారోనసంతిహి ॥ ౨౬ ॥ వేదగ్రంథేచ సర్వత్ర శాస్త్రగ్రంథే తథైవచ । ఆగమేషుపురాణేషు నాస్తివై శబ్దసౌష్ఠవం॥ ౨౭॥ వేదాంగానాం చసర్వేషాం మీమాంసా తర్కయోస్తథా । ఇతిహాసస్య సర్వస్య జ్ఞాతానాస్తిమహీతలే ॥ ౨౮ ॥ లీఢాలీఢ పురాణార్థాః బ్రాహ్మణా స్సంతికేవలం । భోజరాజం వినాకోపి విద్వాన్నాస్తి మహీతలే॥ ౨౯ ॥ ఏవం వదతిశంభోస్తు పురతఃనారదేమునౌ। హాహాకారోమహానాసీత్ ఋషీణాం తత్రశృణ్వతాం॥ ౩౦ ॥ తత్సర్వంచ సమాకర్ణ్య భగవాన్ చంద్రశేఖరః । తస్యాం సదసిదేవాంగం అపశ్యత్పుత్రమీశ్వరః॥ ౩౧॥ దృష్టమాత్రేతు దేవాంగే సమీపముపసర్పతి । తమువాచ మహాప్రాజ్ఞ మీశ్వరః కరుణానిధిః ॥ ౩౨ ॥ భోభోదేవాంగసర్వజ్ఞ వేదశాస్త్రవిశారద । మత్ఫాలనేత్రజాతోసి మత్తుల్య జ్ఞానవానసి॥ ౩౩॥ చతుష్షష్టికలావేత్తా త్వమేవ నహిసంశయః । త్వాం వినా సర్వలోకేషు వేత్తాకోపినవిద్యతే ॥ ౩౪ ॥ నారదోక్త త్వయాసర్వం శ్రుతం ఖలుమహామతే । తస్మాద్గచ్ఛాద్యభూలోకం వివేకజ్ఞానవర్జితం॥ ౩౫॥ తత్రత్వాన్

---

లేనేలేరు- ౨౬- వేదములయందును శాస్త్రములయందును బురాణములయందును శైవములు వైష్ణవములు మొదలగు నాగమములయందును సుశబ్దములులేవు- ౨౭- వేదాంగములనన్నిటిని మీమాంసను దర్కమును మఱియు నితిహాసములను దెలిసినవాఁడు భూమియందులేఁడు - ౨౮ - బ్రాహ్మణులందఱుపురాణార్థములనెఱిఁగియు నెఱుఁగకయున్నారు భూమియందు భోజరాజు తప్ప మఱియెవ్వఁడును బండితుఁడులేఁడు - ౨౯ - ఈప్రకారము నారదముని సాంబశివునియెదుటఁ జెప్పుచున్నప్పుడు వినుచున్న ఋషులందఱు హాహాయనిరి- ౩౦- చంద్రుని దలను ధరించిన యాభగవంతుఁడైన యీశ్వరుఁడు దీనినంతయువిని యాసభయందుఁ దనకొడుకైన దేవాంగునిఁజూచెను- ౩౧- చూచినమాత్రముననే యాతఁడు దగ్గిరకిరాఁగా దయానిధియైన యీశ్వరుఁడు మిక్కిలి తెలిసిన యాదేవాంగునితో నిట్లనెను- ౩౨- ఓయి సమస్తము దెలిసిన దేవాంగుఁడా వేదశాస్త్రములను జక్కఁగాఁదెలిసినవాఁడా నీవు నానొసటికంటఁబుట్టినవాఁడవు గనుక నాయంతజ్ఞానము గలవాఁడవైతివి- ౩౩- చతుష్షష్టికలలను దెలిసినవాఁడవు నీవే నిన్ను విడిచి లోకములయందెల్ల నెవ్వఁడును దెలిసినవాఁడులేఁడు సందేహములేదు - ౩౪ - ఓయి మిక్కిలి బుద్ధిమంతుఁడా యిప్పుడు నారదుఁడుచెప్పిన సమాచారమంతయు నీవు వింటివిగదా కాఁబట్టి

బ్రాహ్మణాన్ సర్వాన్ విముషః కురుపుత్రక । వేదాధ్యయన సంపన్నాన్ శాస్త్రజ్ఞాన సమన్వితాన్ ॥ ౩౬ ॥ అపశబ్ద సమాక్రాంతాః గ్రంథాస్తత్రతు సంతియే । తాన్ సుశబ్దైస్తు సంపూర్ణాన్ కృత్వా లేఖయ సత్వరం ॥ ౩౭ ॥

నవవ్యాకరణానిత్వం శిష్యేభ్యో వదభూతలే । సాంగాన్ వేదాంశ్చ చతురః సర్వశాస్త్రాణివై తథా ॥ ౩౮ ॥ ఇత్యాజ్ఞప్తస్స దేవాంగః శివేన పురుషోత్తమః । ప్రార్థయామాస తం దేవం భక్తకల్పమహీరుహం ॥ ౩౯ ॥ యత్రకుత్రస్థితస్యాపి భూలోకే మనుజాకృతేః । అచంచలాస్తు భక్తిర్మే సదా త్వయి సదాశివ ॥ ౪౦ ॥ ఇతిసంప్రార్థితస్తేన దేవాంగేన శివాపతిః । తథాస్తు గచ్ఛ భూలోకం ఇతిప్రాహస్మతం శివః ॥ ౪౧ ॥ తతో విమానమారుహ్య సూర్యకోటిసమప్రభం । మహీతలం జగామాశు దేవాంగస్సకుతూహలీ ॥ ౪౨ ॥ విమానాదవరుహ్యాథ విప్రరూప ధరస్తుసః । బ్రాహ్మ్యా శ్రియా సమాయుక్తః బభౌ సూర్యఇవాపరః ॥ ౪౩ ॥ దివ్యాంబరధరశ్శ్రీమాన్ దివ్యాభరణ భూషితః ।

---

ఇప్పుడు వివేకములేకయుండెడు భూలోకమునకు నీవతిత్వరితముగాబొమ్ము- ౩౫- ఓయి పుత్రుఁడా నీవుపోయి యక్కడనున్న బ్రాహ్మణులనందఱను వేదములు చదివి శాస్త్రములఁ దెలిసికొని పండితులగునట్లు చేయుము- ౩౬- మఱియు నచ్చటనపశబ్దములుగలిగియుండుగ్రంథములనన్నిటిని శీఘ్రముగాదిద్ది వ్రాయింపుము- ౩౭- నీవుభూలోకమందు వ్యాకరణములను సకల శాస్త్రముల నంగములతోఁగూడిన నాలుగు వేదములను శిష్యులకుఁ జెప్పుము- ౩౮- ఈప్రకారము శివునిచేత నాజ్ఞాపింపఁ బడినవాఁడై పురుషశ్రేష్ఠుఁడైన యాదేవాంగ మహాముని భక్తులపాలిటి కల్పవృక్షమైన యాసాంబశివుని వేడుకొనెను- ౩౯- భూమియందు మనుష్యరూపమునుధరించి నేనెక్కడ నుండినను నాకు నీపాదములయందు భక్తిస్థిరముగా నుండవలయునోయీ సదాశివుఁడా- ౪౦- అని యిట్లా దేవాంగుఁడు ప్రార్థింపఁగా నాపార్వతీ పతి యాతనితో నట్లెయగును నీవు భూలోకమునకుఁ బొమ్మనెను- ౪౧- అంత నా దేవాంగుఁడు కోటిసూర్యులుదయమైనంత కాంతిగల విమానమునెక్కి యుత్సాహము గలవాఁడై భూలోకమునకుఁ బోయెను- ౪౨- పిమ్మట నతఁడు విమానమునుదిగి బ్రాహ్మణరూపమును ధరించినవాఁడై బ్రహ్మ వర్చస్సుచేత సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను- ౪౩- మంచిశ్రేష్ఠములైన వస్త్రములను ధరించినవాఁడై మంచి సొమ్ములఁ దొడిగి నొసటియందు విభూతితో మూఁడురేఖలు దిద్దినవాఁడై

విభూతిరేఖావిలసత్ ఫాలశోభాసమన్వితః ॥ ౪౪ ॥ వజ్రవైడూర్య ఖచిత క
ర్ణకుండలభూషితః । స్వర్ణసూత్ర సమాయుక్త కటీతట విరాజితః ॥ ౪౫ ॥
సర్వాంగ సుందరశ్శ్రీమాన్ స్వర్ణయజ్ఞోపవీతవాన్ । పవిత్ర పాణిస్సత
తం జపన్ పంచాక్షరం వరం॥ ౪౬॥ కటకాంగదశోభాఢ్య భుజద్వయసమన్వి
తః । దదర్శ ధారా నగరీ దేవాంగో బ్రాహ్మణోత్తమః ॥ ౪౭ ॥ హేమప్రా
కారసంపన్నాం హేమగోపురశోభితాం । స్ఫాటిక స్తంభ సంయుక్త చామీక
రగృహైర్యుతాం ॥ ౪౮ ॥ నవరత్న సమాయుక్త చంద్ర శాలా సుశోభి
తాం । సదశ్వకోటిసంయుక్త మందురాభి ర్విరాజితాం ॥ ౪౯ ॥ మత్తవార
ణసంఘాతం మహదాపణ శోభితాం । రథబృంద మహాఘోష బధిరీకృతది
ఙ్ముఖాం॥ ౫౦॥ పత్తిబృందైః సుసంపూర్ణాం పద్మినీశతసంకులాం । పనసాం
ర్రమకపిత్థాది వృక్షరాజ విరాజితైః ॥ ౫౧ ॥ ఉద్యానోపవనైశ్చైవ విరా
జితమహాపథాం । వికసత్ పంకజామోద పద్మాకర శతైర్యుతాం॥ ౫౨ ॥
మల్లికామాలతీజాజికుసుమాలంకృతాపణాం । వజ్రవైడూర్యమాణిక్యపుష్య

---

వజ్రములు వైడూర్యములు చెక్కియున్న కుండలములఁ జెవుల ధరించి
మొలను బంగారు మొలత్రాడు ధరించినవాఁడై సమస్తావయవము
లయందు సొగసు గలవాఁడై శోభతోఁ గూడినవాఁడై బంగారు జన్నిద
ముదాల్చి చేతఁ బవిత్రమును ధరించి యెల్లప్పుడు పంచాక్షరీ మంత్రమును
జపియించుచుఁ జేతులఁ గడియములను భుజకీర్తులను ధరించినవాఁడై బ్రా
హ్మణోత్తముండైన యా దేవాంగముని ధారాపట్టణమును జూచెను - ౪౭ -
ఆపట్టణముకోటలన్నియు బంగారువిగానున్నవి పురద్వారములునట్లేయున్నవి
ఇండ్లన్నియు బంగారుతోఁ గట్టబడి యందలి కంబములు స్ఫటికమణులచేతఁ
జేయఁబడియున్నవి ఇండ్లమీఁదనుండు శిరోగృహములు నవరత్నమయములు
గానున్నవి - గుఱ్ఱాలపాగాలలో నొక్కొకదానియందుఁ గోటిగుఱ్ఱాలు గట్టఁ
బడియున్నవి - ఏవీధినిబట్టినను మదపుటేనుఁగులు నిండిపెద్దపెద్దయంగడివీధు
లుకలిగియున్నవి - రథములనాదములు దిఙ్ముఖములనెల్లవ్యాపించి యచ్చటివా
రిచెవులకుఁ జెవుడుకల్పించునట్లున్నవి - కాలుబలములు వీధులలోనంతటనిం
డియుండురు - తామరకొలఁకులు నూర్లతరబడియుండును - తోఁటలలోనంతట
మామిడిపనస వెలగ మొదలైన శ్రేష్ఠవృక్షములుగల యుద్యానవనములు విల
సిల్లుచుండును - వికసించుచున్న కమలముల వాసనచేత గమగమాయించు

రాగవిరాజితైః॥ ౫౩॥ పణ్యవీధి శతైర్యుక్తాం పణ్యస్త్రీభిర్విరాజితాం । నానాగంధ సమాయుక్త ధూప బృంద సువాసితాం ॥ ౫౪ ॥ పాతాళ గమనోద్యోగపరిఘాత్రయవేష్టితాం । నక్షత్రమార్గసంసేవిగోపురై రుపశోభితాం॥ ౫౫॥ తోరణాలంకృతాం దివ్య దేవాలయసమావృతాం । శివాలయై స్తథావిష్ణోరాలయైశ్చ సుశోభితాం ॥ ౫౬ ॥ తథాలయై శ్చండికాయాః గణేశ స్కందయోర్యుతాం । హంస సారస సంఘుష్టాం శుకకోకిల నాదితాం॥ ౫౭ ॥ కపోతపాలికావాసి పారావత గణై ర్యుతాం । పద్మినీ చింతిణీబృంద నిషేవిత గృహాం గణాం॥ ౫౮॥ శంఖినీ హస్తినీజాల సంసేవిత మహాపథాం । హంస కారండవాకీర్ణ నదీనదసమావృతాం ॥ ౬౦ ॥ చక్రవాకి బృందయుక్త చక్రవాకోప శోభితాం । బ్రాహ్మణానాం క్షత్రియాణాం విట్శూద్రాణాం తథైవచ ॥ ౬౧ ॥ గృహమాలాభిరా బద్ధాం దివ్యమంటప సంయుతాం । సర్వ

---

చుండెడి తటాకములు నూర్లతరబడిగా నుండును అంగళ్లయందు దెక్కడబట్టినను మల్లెలుమొల్లలు విరజాజులవారిగానుండును - వజ్రములు వైడూర్యములు కెంపులు పుష్యరాగములు నిండియుండు నంగడివీధులుకలిగి భోగమువాండ్రుగలిగి యాపట్టణము మిక్కిలియొప్పుచుండును - ఏపక్కబట్టిన దివ్యమైన పరిమళములతోడి ధూపములు వెడలుచుండును - పాతాళము నంటునట్టియగడితలు మూడాపట్టణమును జుట్టుకొనియుండును- ఆపట్టణముపురద్వారములు నక్షత్రమండల మంటుచుండును - తోరణములు గట్టియుండును మనోహరములైన దేవాలయములుండునందు గొన్నిశివునివి కొన్నివిష్ణువువి- అల్లె శక్తిగుళ్లును పిళ్లారిగుళ్లును గుమారస్వామి గుళ్లు నుండును హంసలు బెగ్గురు పక్షులు చిలుకలు కోకిలలు గూయు చుండును పంచల సందులలోఁ బావురా లనేకములుగా నుండును - ఇండ్ల యందు బద్మినీజాతి స్త్రీలును జిత్రిణీ జాతిస్త్రీలును ముంగిళ్ల కలంకారములుగా నుందురు - వీధులలో శంఖినీజాతి హస్తినీజాతి స్త్రీలునిండియుందురు - ఆపట్టణమునకు సమీపమునఁ బడమటికిఁ బారునేళ్లయందును దూర్పునకుఁ బారునేళ్లయందును హంసములు మొదలగు జలపక్షులు నిండియుండును- ౬౦- ఆడు చక్రవాకపక్షులు మగచక్రవాకపక్షులు రాజిల్లుచుండును- బ్రాహ్మణులయిండ్లన్ని యొకవీధిగాను క్షత్రియులయిండ్లొకవీధిగాను వైశ్యులయిండ్లొకవీధిగాను శూద్రుల యిండ్లొక వీధిగాను నేర్పడి యక్కడక్కడ సొగసైన మంటపములు గలిగి

సౌందర్యసంయుక్తాం సర్వవాద్య విఘోషితాం ॥ ౬౨ ॥ వీణాగానాతి నిపు
ణవేశ్యా స్త్రీభిలంకృతాం । తౌర్యత్రికజ్ఞానయుక్త నటబృంద నిషేవితాం ॥
౬౩॥ ఏవం భూతాం శుభాకారాం ధారా పురమనుత్తమాం । ప్రవివేశ సదే
వాంగః దిదృక్షుః భోజభూపతిం ॥ ౬౪ ॥ రాజమార్గేణ గచ్ఛన్సః తత్ర
త్యైశ్చావలోకితః । బ్రాహ్మణైః క్షత్రియై వైశ్యైః తత్రతత్రచ పూజితః॥
౬౫ ॥ ప్రవివేశసభాం రాజ్ఞః సుధర్మామివగీష్పతిః । తతోదదర్శ దేవాం
గః తత్రభోజమహీపతిం॥ ౬౬॥ సింహాసన సమాసీనం బాలసూర్య మివోది
తం । కందర్ప సదృశాకారం కందర్పమివరూపిణం ॥ ౬౭ ॥ సంసేవితం రా
జబృందైః వందిమాగధసంస్తుతం । అష్టానాం లోకపాలానాం అంశసంభూ
తముత్తమం॥ ౬౮॥ వాలవ్యజనహస్తాభిః సుందరీభిశ్చ సేవితం । సామదానా
ద్యుపాయజ్ఞైః చతుర్భిర్మంత్రిభిర్యుతం॥ ౬౯॥ తతోదదర్శ దేవాంగం
ఆగతంభోజభూపతిః । సభాం స్వస్య మహాబాహుం సాక్షాన్మన్మథరూపి

---

యుండును - ఆపట్టణమందు లేని సొగసు మఱియొకచోట నుండదు సమస్త వాద్యములునెల్లప్పుడు మ్రోయుచుండును - అచ్చటవారకాంతలు వీణవాయించుటయందు మిక్కిలి చాతుర్యము గలవారు - నట్టువులందఱు నృత్తగీతవాద్యాభిజ్ఞులు - ఇట్లు సొగసుగానుండి తనకు మిక్కిలి మఱియొకటి లేకయున్న యాధారపట్టణమందుఁ బ్రభుత్వము చేయుచున్న భోజరాజును జూడఁ గోరి దేవాంగముని యాపట్టణము ప్రవేశించెను- ౬౪- రాజవీధి నాదేవాంగమహాముని పోవు చుండఁగా నక్కడ నుండు క్షత్రియులును బ్రాహ్మణులును వైశ్యులునీయననుజూచిపూజింపఁగా వానిఁగొంచుబృహస్పతి యింద్రసభను బ్రవేశించు నట్లాభోజరాజు సభను బ్రవేశించెను - ప్రవేశించి యచ్చట భోజరాజును జూచెను - సింహాసనమందుఁ గూర్చుండి యప్పు డుదయించిన సూర్యునివలెఁ బ్రకాశించుచు మన్మథునితోఁ సరియైన యాకృతిగలవాఁడై రూపముసుధరించినమన్మథుఁడోయనునట్లున్నట్టియు రాజులచేతఁ గొలువఁబడుచున్నట్టియు బట్టువాండ్రు మొదలఁగువారిచేతఁ బొగడఁబడుచున్నట్టియు నష్టదిక్పాలురయంశములఁబుట్టినట్టియు నుత్తముఁడైనట్టియు సౌందర్యవతులయిన స్త్రీలచేత వింజామరలువేయఁబడుచున్నట్టియు సామము మొదలగు నాలుగుపాయములనెఱిఁగిన నలుగురు మంత్రులతోఁ గూడినట్టి యాభోజరాజునొద్దకు దేవాంగుఁడుపోయి యతనిఁజూడఁగానే యంత నాభోజరాజును దన సభకు

ణం॥ ౨౦॥ దృష్టమాత్రే తత స్తస్మిన్ భోజభూప శిఖామణిః । స్వాసనా దుత్థి
తః శీఘ్రం ప్రణమ్యచముహుర్ముహుః॥ ౨౧॥ తస్మై దత్వాసనం రాజా ప
ప్రచ్ఛకుశలంచతం । భోభో విద్వద్వరేణ్యాసి కస్మాద్దేశాదిహాగతః ॥ ౨౨ ॥
కిం నామ తేవద ప్రాజ్ఞ పితుర్మాతుశ్చనామకిం। తేజసాత్వామహం మన్యే సా
క్షాద్బ్రహ్మ కులోద్భవం ॥ ౨౩ ॥ బ్రహ్మావాత్వం శివోవాథ విష్ణుర్వా బ్రా
హ్మణోత్తమ । తేజసాత్వా మహం మన్యే భగవంతం పరాత్పరం॥ ౨౪॥ ఉమా
పతిం మహేశానం సృష్టిస్థిత్యంత కారిణం । వదశీఘ్రం మహాబుద్ధే సాదరం
సముపృచ్ఛతః ॥ ౨౫ ॥ ఇతిపృష్టోథ భోజేన భూపేనామితతేజసా । ఉవాచ
వాక్యం దేవాంగః రాజానం ప్రతిబుద్ధిమాన్ ॥ ౨౬ ॥ అహం వరరుచిర్నామ
కాశీదేశాదిహాగతః । మాతా మే పార్వతీనామ పితావై శంకరాభిధః॥ ౨౭॥
సర్వశాస్త్రార్థతత్వజ్ఞః వేదవేదాంగపారగః । అహం సర్వేతిహాసజ్ఞః సర్వమం
త్రార్థకోవిదః ॥ ౨౮ ॥ అష్టాదశ పురాణజ్ఞః ఆగమజ్ఞానినాం వరః । సర్వ

---

వచ్చియున్న సాక్షాత్తు మన్మథునివలెనున్న యాదేవాంగునిం జూచెను - ౨౦ - చూచుచునే యాభోజరాజు శీఘ్రముగా సింహాసనమునుండిలేచి పలుమారు మ్రొక్కి యాదేవాంగముని కాసనమిచ్చి కూర్చుండఁబెట్టి యతనిక్షేమమును విచారించెను - ఓయి పండితశ్రేష్ఠుఁడా నీవేదేశముననుండి యిక్కడికివచ్చితివి - ఓయి తెలిసినవాఁడా నీపేరేమి - నీతల్లిదండ్రులపేరేమి నీతేజస్సుచూడఁగా బ్రహ్మవంశమునఁ బుట్టినవాఁడవని తోఁచుచున్నది - ఓయిబ్రాహ్మణశ్రేష్ఠుఁడా నీవు బ్రహ్మవా విష్ణువవా శివుఁడవా - నీతేజస్సుచూడఁగా పరమపురుషుఁడవైన భగవంతునివలెనున్నావు పార్వతీపతివై సకలలోకేశ్వరుఁడవై యీ లోకములసృజించి పాలించి ప్రళయమునొందించునట్టివాఁడవు నీవుగానేయుండవచ్చును - నేనింతప్రీతితో నడుగుచున్నానుగనుక త్వరితముగా నాకు త్తరము చెప్పుమోయి మిక్కిలి బుద్ధిమంతుఁడా - ౨౫ - అనియిట్లు మిక్కిలి పరాక్రమవంతుఁడైన యాభోజరాజుచేఁగా నతనికి బుద్ధిమంతుఁడైన యాదేవాంగముని యుత్తరము చెప్పెను - ౨౬ - నేను వరరుచి యనువాఁడను - కాశీదేశమునుండి యిక్కడికి వచ్చితిని నాతల్లిపేరు పార్వతి - మాతండ్రిపేరు శంకరుఁడు ౨౭ - నేను సమస్తశాస్త్రముల యర్థమును నిజముగాఁ దెలిసికొన్నవాఁడను వేదముల వేదాంగములఁ గడవెళ్లఁ జదివినవాఁడను సమస్తేతిహాసముల నెఱుఁగుదును సకలమంత్రముల యర్థము నెఱుఁగుదును- ౨౮- పదునెనిమిది పురా

స్మృతి మహార్థజ్ఞః । సర్వభూసురవందితః ॥ ౭౯ ॥ కావ్యాలంకార తత్వజ్ఞః నాటకగ్రంథకోవిదః । పదక్రమజటాభిజ్ఞః వేదానాం దేశికోత్తమః ॥ ౮౦ ॥ బహునావాకిముక్తేన ఏకం మే వచనం శృణు సర్వజ్ఞ ఇతిలోకో మాం సర్వోవక్తి న సంశయః ॥ ౮౧ ॥ ఉక్తవంతం వరరుచిం సంపూజ్య బహుశో నృపః । ప్రాదాత్తస్మై గృహం భోజః ధనధాన్యసమాకులం ॥ ౮౨ ॥ తథా శతం మత్తగజాన్ సహస్రం తురగాం స్తథా । కర్ణవేష్టన కేయూర కటకాదీని భూపతిః ॥ ౮౩ ॥ ప్రాదాత్తస్మై మహాధైర్యః మహాంత్యాభరణానిచ । వస్త్రాణిచ మహార్హాణి రత్నహారాం స్తథా వచ ॥ ౮౪ ॥ సన్మాన్యైవం వరరుచిం భోజరాజో బహుప్రదః । సభాస్తారాధిపం చక్రే విద్వచ్చూడామణిం తదా ॥ ౮౫ ॥ తతో వరరుచిం ప్రాజ్ఞం భోజం ప్రాహస్మితం నృపః । అహో వరరుచే విద్వన్ వచనం శృణు సాదరం ॥ ౮౬ ॥ అధ్యాపయ బ్రాహ్మణాం స్త్వం వేదాన్ శాస్త్రాణిచాగమాన్ । అష్టాదశ పురాణాని పదక్రమజటా స్తథా ॥ ౮౭ ॥ నిగమానాం మహా

---

ణములఁ దెలిసినవాఁడను ఆగమశాస్త్రములఁ జక్కఁగాఁ దెలిసినవాఁడను సమస్త ధర్మశాస్త్రములఁ దెలిసినవాఁడను గావున బ్రాహ్మణులందఱు నాకు మ్రొక్కుచుందురు - ౭౯ - కావ్యముల యలంకారములను నాటకముల నెఱుఁగుదును వేదముల పదక్రమములనంతయును దెలిసినయాచార్యవర్యుఁడను - ౮౦ - విశేషముగాఁ జెప్పి కార్యమేమి సర్వజనులును నన్ను సర్వజ్ఞుఁడందురు సందేహములేదు - అనియిట్లు చెప్పిన యావరరుచిని భోజరాజు సన్మానించి యితనికి ధనధాన్యములతో నిండియున్న యింటినిచ్చెను - మఱియు నారాజతనికి మూరుమదించిన యేనుఁగులను వేయిగుఱ్ఱములను గుండలములు భుజకీర్తులు కడియములు మొదలగు నాభరణములనిచ్చెను - ౮౩ - ఇంక నారాజాతనికి వెలపొడగు వస్త్రములను రతనాల దండలనొసంగి సన్మానించి రాజరాజైన యాభోజరాజు పండితశ్రేష్ఠుఁడైన యతనిఁ దనసభయందుండు వారికందఱకుఁ బెద్దనుగాఁ జేసెను - పిమ్మటఁ దెలిసిన యావరరుచినిగూర్చి యాభోజరాజిట్లనెను - ఓవరరుచీ నేనొకమాటచెప్పెదను దానిఁ బ్రీతితో వినుము - ౮౬ - నీవు బ్రాహ్మణులచేత వేదములను శాస్త్రములనాగమములను బదునెనిమిది పురాణములను వేదముల పదక్రమ జటలను జదివింపుము - ఓ మహానుభావుఁడా బ్రాహ్మణులకు దొమ్మిది వ్యాకరణములు దెలిసి వేదములు మొదలగువాని సుశబ్దాపశబ్దముల తెలివి యెట్లుకలుగునో యట్లుచేయవోయి పండిత బృందముచేత మ్రొక్కఁబ

భాగసవవ్యాకరణానిచ । శబ్దశాస్త్రవవిజ్ఞానం బ్రాహ్మణానాం యథాభవేత్ ॥
౮౮॥ తథా కురుమహాప్రాజ్ఞ విద్వాన్ మండలవందిత । ఇత్యుక్తో భోజభూ
భూపేన తదా వరరుచి ర్మహాన్ ॥ ౮౯ ॥ వేదాన పాఠ యత్సర్వాన్ వి
ప్రాన్ శాస్త్రాణిచాగమాన్ । నాటకాలంకారతర్కాన్ వేదాంగానితథైవచ॥
౯౦॥ సర్వవిద్యాసు నిపుణాన్ సర్వాం శ్చైవ మహీసురాన్ । తదా వరరు
చిశ్చక్రే భోజోపిముముదేభృశం॥ ౯౧॥ గ్రంథాన్ బహూన్ వరరుచిః విదధే
సర్వ శాస్త్రవిత్ । బ్రాహ్మణానాం చ సర్వేషాం స్వయ మేవోత్తమో
భవత్ ॥ ౯౨॥ అథోజ్జయిన్యామవసత్ భట్టాచార్యో ద్విజోత్తమః । తస్యా
భూత్తనయానామ్నా కలావత్యతిసుందరీ ॥ ౯౩ ॥ సర్వశాస్త్రార్థ తత్వజ్ఞా
వేదవేదాంగపారగా । సంగీత శాస్త్రనిపుణా నాట్యవేదేచకోవిదా ॥ ౯౪ ॥
పతిం కామయమానాసా పంకజాక్షీశుచిస్మితా । ఇత్థం ప్రతిజ్ఞామకరోత్ మ
రాళగమనాతథా॥ ౯౫॥ యోమాం విద్యాప్రసంగేన జయేన్ మన్మథసుందరః
తం కవీంద్రం పతిమహం వృణేత్రనసంశయః॥ ౯౬॥ శ్రుత్వేతి తస్యాశ్శపథం
నానాదేశేభ్యఆగతాః । వేదవేదాంగ తత్వజ్ఞాః సర్వ శాస్త్రార్థకోవిదాః॥

---

డినవాఁడా - ఈప్రకారమప్పుడా మహానుభావుఁడైన వరరుచి యారాజు చేతఁ జెప్పఁబడినవాఁడై బ్రాహ్మణులకు సమస్తవేదముల నాగమములను వేదాంగములను నాటకాలంకారములనుజెప్పి యావరరుచి యప్పుడు బ్రాహ్మణులను సమస్తవిద్యలయందు సమర్థులఁగావించెను - భోజరాజును మిక్కిలిసంతసించెను- ౯౧- సకల శాస్త్రములను దెలిసిన యావరరుచి పెక్కుగ్రంథములురచించి యందఱు బ్రాహ్మణులలో దానే యెక్కుడుగానుండెను - ఇట్లుండఁగా నుజ్జయినీపట్టణమందు భట్టాచార్యుఁడని యొకబ్రాహ్మణోత్తముండు గలఁడతనికిఁ గలావతియని మిక్కిలి సొగసుగలకూతురొక తెగలదు- ఆపె సకలశాస్త్రముల మర్మములు దెలిసినది వేదములనువేదాంగములను గడవెల్లఁ దెలిసినదిసంగీతమందునాట్యమందు మిక్కిలివిద్వాంసురాలు ఇట్టిదియుగమలములవంటికన్నులుగలదియు దెల్లనిచిరునగవుగలదియు నంసవంటినడపుగల యామె తనకు భర్తను గోరుచు నప్పుడొక ప్రతిజ్ఞచేసెను- ౯౫ - ఎవఁడు మన్మథునివలెసౌందర్యము గలవాఁడు నన్ని విద్యల ప్రసంగముచేత గెలుచునో యట్టిబండితోత్తముని నేను బెనిమిటినిఁ గావరింతును సందేహములేదు- ౯౬ - అనియిట్లాపె ప్రతిజ్ఞనువిని యనేకదేశములనుండి వేదములువేదాంగములు చదివినవ

౯౭॥ తాం జేతుం బ్రాహ్మణారామాం అహంకార సమన్వితాః । పరాజితా స్త్ర
యా సర్వే హృద్యయా విద్యయా యయుః ॥ ౯౮ ॥ అథైకదా వరరుచిః
శ్రుత్వావృత్తాంతమీదృశః । జగామోజ్జయినీంవిద్వాన్ ।భోజభూపాజ్ఞయా
మహాన్ । తత్రపుర్యాం వరరుచిః । భట్టాచార్య గృహాంతః దదర్శ తస్య
తనయాం సుందరాంగీం కలావతీం ॥ ౧౦౦ ॥ బింబోష్ఠీం చారువదనాం సా
క్షాద్రమితిమివస్థితాం । పూర్ణచంద్రవదనాం శ్యామాం మత్తకోకిలభాషిణీం॥
౧౦౧॥ కంబుకంఠీం కలాపూర్ణాం కఠినస్తనమండలాం । సర్వాభరణ సం
పన్నాం కరభోరూం సునాసికాం ॥ ౧౦౨ ॥ యష్టిమధ్యాం మహాభాగాం
పీతాంబరావరవృతాం । మందహాసాంమందగతింమంజుళాధరపల్లవాం॥ ౧౦౩॥
ఉవాచతాంవరరుచిః కన్యాముత్పలలోచనాం । అద్యభద్రేవినిర్జేతుం త్వా
మహం సముపాగతః॥ ౧౦౪॥ పరిణేతుం చహేకన్యే కింబ్రవీష్యుత్తరం వద ।
ఏవముక్తా వరారోహా కన్యాతేన మహాత్మనా ॥ ౧౦౫ ॥ ఉవాచవాక్యం
వాక్యజ్ఞాసగర్వం సస్మితం చతం । అహోవిద్వన్ మహావృద్ధ కస్మాద్దేశాది

---

స్త్రశాస్త్రార్థములనుజక్కఁగాఁజదివిన బ్రాహ్మణులాపెను గెలుచనుగర్వముతో
వచ్చిరి - అట్టివారందఱు నాసుందరాంగిచేతవిద్యచేగెలువఁబడి యోడిపోయి
రి - ౯౮ - పిమ్మట నొకకాలమం దీవృత్తాంతమునువిని భోజరాజు వరరుచి
నిబొమ్మనఁగా నావరరుచి యుజ్జయినీపట్టణమునకుఁబోయెను- ౯౯ - పోయి
యాపట్టణమందు వరరుచి భట్టాచార్యులవారియింటికిఁబోయి వారికూతురైన
కలావతినిజూచెను - ౧౦౦ - ఆమె దొండపండువంటి పెదవియును సుందర
మైన మొగమునుగలిగి ప్రత్యక్షరతివలెనున్నది - నిండుచందురునితోసమమైన
మోముగలిగినట్టియు మదించినకోకిలలవలె మాటలాడునట్టియు యౌవనవతి
యైనట్టియు శంఖమువంటికంఠముగలయట్టియు సకలవిద్యలచేతఁపూర్ణురాలై
నట్టియు గట్టిస్తన ప్రదేశముగలయట్టియు సమస్తములైన సొమ్ములను ధరించి
యున్నట్టియు హస్తబహిఃప్రదేశమువంటితొడలుగలయట్టియు సొగసైనము
క్కుగలయట్టియుఁ గడ్డివంటినడుముగలయట్టియు మిక్కిలిసొగసైనట్టియుఁబ
చ్చనివస్త్రముగట్టుకొనియున్నట్టియు కొంచెము నవ్వుగలయట్టియు దిన్ననిన
డుపుగలయట్టియు మనోహరమైన చిగురువంటి పెదవిగలయట్టి వికసించినక
న్నులుగల యాకన్యనుజూచి వరరుచి యిట్లనెను- ఓసుభగురాలా నేనిప్పుడుని
న్నుజయింపను బెండ్లియాడనువచ్చితి నేమియుత్తరము చెప్పెదవో చెప్పుము

హాగతః ॥ ౧౦౬ ॥ కిం నామతేత్వం వదమే కేషు పాండిత్య మస్తితే । వేదేషు వాథశాస్త్రేషు నాటకే ష్వథవాద్విజ ॥ ౧౦౭ ॥ పురాణేషు స్మృతిషువావేదాంగే ష్వథవావద । ఇత్యుక్తోవై వరరుచిః ప్రాహ గంభీరయాగిరాః॥ ౧౦౮॥ వారాణశీతి విఖ్యాతా పురీ భాగీరథీతటే । విశ్వనాథ విశాలాక్ష్యోః యత్రాస్తే స్థానముత్తమం ॥ ౧౦౯ ॥ తత్రమేవ సతిభర్ద్రదే నామ్నా వరరుచిస్త్వహం । సర్వజ్ఞోహం మహాభాగే వాణీ నృత్యతివాచిమే ॥ ౧౧౦ ॥ గ్రంథేషుయేషువాకన్యే తవాస్తివిపులశ్రమః । తేషు గ్రంథేష్వావయోస్తు ప్రసంగోద్య ప్రవర్తతాం॥ ౧౧౧॥ ఇతిబ్రువాణే తస్మింస్తు । ప్రసంగస్సుహాసభూతు । కలావత్యావరరుచేః పరస్పర జిగీషయా ॥ ౧౧౨ ॥ వేదే తర్కే వ్యాకరణే కావ్యనాటకయోస్తథా । అలంకారే త్తథా చందశ్శాస్త్రే వేదాంగ ఏనచ ॥ ౧౧౩ ॥ జయోవాప జయోహాపి తత్రనా భూత్పరస్పరం । కలావత్యాః వరరుచేః వాదే మహాతిసత్యాహ్వయా ॥ ౧౧౪ ॥ విద్వదానంద జననం

---

అనియిట్లామహానుభావుఁడుచెప్పఁగా నుత్తమురాలై నట్టియుమాటలనేర్పెటిఁగినట్టి యాకన్య యతనికి గర్వముతోఁ జెలునగవునగుచు నుత్తరముచెప్పెను- ఓమునలిపండితుఁడా యేదేశమునునుండి యిక్కడికివచ్చితివి - ౧౦౬ - నీపేరేమి నాకుఁజెప్పవయా నీకేవిషయములలోఁ బాండిత్యము వేదములయందా శాస్త్రములయందా నాటకములయందా లేకపురాణములయందా ధర్మశాస్త్రములయందా వేదాంగములయందా చెప్పవయ్యా బ్రాహ్మణుఁడా - అనియిట్లాపెయడుగఁగా నావరరుచి గంభీరమైన వాక్కుతో నామెకుత్తరము చెప్పెను - ౧౦౮ - గంగానది యొడ్డున వారణాసియను పట్టణముగలదు అక్కడ విశ్వనాథస్వామియు విశాలాక్షియునుందురు - నేనక్కడనుండువాఁడనో భాగ్యవతి నాపేరు వరరుచి . నేను సకలముదెలిసినవాఁడను నానోట సరస్వతియాడుచున్నది - ౧౧౦ - ఓకన్యకా నీకేగ్రంథములలో మిక్కిలి పరిచయము గలదో వానియందు మనకుఁ బ్రసంగము జరుగవచ్చును- ౧౧౧- ఇట్లాతఁడుచెప్పఁగా నాకలావతికి నతనికి నొండొరుల గెలువనిచ్ఛచేత గొప్పప్రసంగమాయెను - ౧౧౨ - ఈప్రకారము వారిద్దఱకు వేదమందు వేదాంగములయందుఁ దర్కశాస్త్రమందు వ్యాకరణమందుఁ గావ్యనాటకములయందు నలంకారశాస్త్రమందును ఛందశ్శాస్త్రమందును బ్రసంగము జరుగఁగా నొకరికైనను గెలుపు నోటయును గలుగదాయెను- ౧౧౪- పండితులకానందము

ప్రసంగంతం ప్రశు్రిణ్వతాం । విదుషాం బృందమభవత్ ప్రవృద్ధానందవారిధిః॥ ౧౧౫ ॥ తతోవరరుచిః ప్రాజ్ఞః కలావత్యా జగీషయా । వేదాంత శాస్త్రే కన్యాం తాం ప్రసంగాత్సచకర్షహ ॥ ౧౧౬ ॥ తయో వేదాంత శాస్త్రం తు సమ్యగ్ నాధీత మేవహి । తస్మాజ్జిగాయ తత్త్రీనాం శాస్త్రే వరరుచి స్త్రియం ॥ ౧౧౭ ॥ తతోవరరుచిః ప్రాహ తాం కన్యా మాయతేక్షణాం । వేదాంత శాస్త్రేతు మయాజితాసి కమలావతీ ॥ ౧౧౮ ॥ తస్మాద్ గృహ్ణీష్వ మత్పాణిం కచబృందజితాంబుధే । ఇత్యుక్తవంతతం ప్రాహ భట్టాచార్యస్య నందినీ॥ ౧౧౯॥ పరిహాసోక్తిసహితం వాక్యవాక్య విశారదా । అహో వర రుచే మూఢసత్వం వృద్ధత మోహ్యాసి ॥ ౧౨౦ ॥ జరావలిత కేశోశి దంతహీనోసిసాంప్రతం । నఖైర్వర్జితకరః వర్తసే ద్విజసత్తమ ॥ ౧౨౧ ॥ లోకేత్రకామినీభిస్తు దంతక్షతనఖక్షతే । కాంక్షితే కేళిసమయే హ్యా ధరోష్ఠస్తనేషువై ॥ ౧౨౨॥ త్వయాహం పరిణీతాచేత్ అధరోష్ఠస్తనేషుమే । కోవాకరిష్యతిబ్రూహి దంతక్షత నఖక్షతే॥ ౧౨౩॥ అహో వరరుచే వృద్ధ వృద్ధ

---

నుగలుగంజేయునట్టి యాప్రసంగమును వినుచున్న పండితుల సంఘమానందభరితమాయెను- పిమ్మట నావరరుచి యెట్లైన నాపెనుజయింపవలయుననుకోరికచేతఁ బ్రస్తావవశముగా వేదాంతశాస్త్రములోకిలాగెను - ౧౧౬ - ఆకలావతివేదాంతశాస్త్రము చక్కఁగాఁ జదివినది కాదు గనుక నీవరరుచి యాశాస్త్రమందామెను జయించెను- అంత నావరరుచి యావిశాలములైన కన్నులుగల కన్యతోనిట్లనెను - ఓకలావతీ వేదాంతశాస్త్రమందు నీవు నాచేతజయింపఁబడితివి ఓమేఘములనుజయించునట్టి కురులుగలదానా కాఁబట్టినీవునాచేయిపట్టవలయును - అనియిట్లావరరుచిచెప్పఁగా మాటలయందు నేర్పరియైన యాకలావతి పరియాచకముగా నతని కుత్తరముచెప్పెను - ఓవరరుచీ మూఢుఁడా నీవు మిక్కిలి ముసలివాఁడవైతివి ముసలితనముచేత నీకువెంట్రుకలు నరిసినవి పండ్లురాలినవి చేతులగోళ్లులేవు ఈలోకమందు స్త్రీలు సురతసమయమం దధరోష్ఠములయందు స్తనములయందును దంతక్షత నఖక్షతములను గోరుదురు నీవు నన్నుఁబెండ్లియాడినపక్షమందునాయధరోష్ఠమందును నా స్తనములయందును దంతక్షత నఖక్షతముల నెవడుచేయును చెప్పవయా- ౧౨౩- ఓహో వరరుచీనీవేమివృద్ధులకుయవ్వనవతియగుస్త్రీవిషమనినీతిమెఱిగినవారుచెప్పెడిమాటనువినలేదా యేమిచెప్పవయా- ఇప్పుడు ముసలివాఁడవైన నీకురతియందుఁగ

స్య తరుణీవిషం । ఇతినీతిజ్ఞ వచనం నశ్రుతం కిం త్వయావద॥ ౧౨౪॥ క్వసా మథ్యాం రతౌ విప్రవృద్ధస్య తవసాంప్రతం । క్వసామర్థ్యం రతావస్తి తరుణ్యామమసాంప్రతః ॥ ౧౨౫ ॥ స్త్రీణాం ద్విగుణ ఆహారః బుద్ధిశ్చాపి చతుర్గుణా । సాహసం షడ్గుణం ప్రోక్తం కామస్త్వష్ట గుణస్మృతః॥ ౧౨౬ ॥ ఇతినీతిజ్ఞ వచనం విపశ్చిద్బృందమానితం । శ్రుతపూర్వం నకిం లోకే సర్వజ్ఞేనత్వయాద్విజ॥ ౧౨౭॥ క్వనురంభా సుందరాంగీ ధర్మశూన్య క్వనారకీ । క్వనివింద్రాణీ దివ్యరూపా నహుషః క్వనుమానుషః॥ ౧౨౮॥ ఇతి ధిక్కృతరూపస్య కలావత్యా తయాకృతీ । క్రోధావిష్టోవరరుచిః వాక్యమే తదువాచహ॥ ౧౨౯॥ వాచ్యావాచ్యం నజానీషే మూఢేపండితమానినీ । నసంభాష్యామయా మూర్ఖేత్వం బ్రహ్మకులపాంసులా ॥ ౧౩౦ ॥ క్వశునీ క్వపురోడాశః క్వాసురీక్వనుచామృతం । క్వగర్దభీక్వవాగంధః క్వత్వం స్త్రీ క్వస్వహం పుమాన్॥ ౧౩౧॥ తథాపితవవక్ష్యామి హితం శ్రుణువచోమమ । యదివా రోచతేతుభ్యం తదాంగీ కురుకోపనే॥ ౧౩౨॥ మత్పుత్రవిదుషాం శ్రేష్ఠః సింహాసంహాననోయువా । మత్తోధికస్తు విద్యాసు సర్వ రాజేంద్రపూజితః ॥

---

లసామర్థ్యమెక్కడ యవ్వనియయిననాసామర్థ్యమెక్కడ - ఇదిగాక పురుషులకంటె స్త్రీలకు భోజనము రెండంతలుగా నుండును బుద్ధి నాలుగంతలు సాహసమారంతలుకామమెనిమిదంతలని చెప్పబడియున్నది అనియీప్రకారమునీతిదెలిసినవారు చెప్పుదురు దీని బండితులొప్పికొందురు సర్వముతెలిసిన నీవీసంగతివినలేదాయేమి - ౧౨౭ - ఓయి ధర్మమెఱుగని వాఁడా సుందరరూపముగల రంభయెక్కడ నరకము ననుభవింపవలసిన వాఁడెక్కడ దివ్యమైనరూపముగల శచియెక్కడ మనుష్యుఁడైన నహుషుఁడెక్కడ - అనియీప్రకారమాకలావతి యీవరరుచి రూపమును నిందింపఁగా బుద్ధిమంతుఁడైన వరరుచి కోపావేశముగలవాఁడై యిట్లనిపలికెను - ౧౨౯ - ఓసి నేను పండితురాలననిగర్వించిన మూఢురాలా ఇదిచెప్పఁదగినమాట యిదిచెప్పఁదగనిమాటయనిమెఱుఁగవు నీవుబ్రాహ్మణకులమును జెఱుపనట్టిదానవు నీతోనేనుమాటలాడరాదు - ఆఁడు కుక్క యెక్కడ పురోడాశ మెక్కడ రాక్షస స్త్రీ యెక్కడ నమృతమెక్కడ ఆఁడుగాడిదయెక్కడ వాసనయెక్కడ నీవెక్కడి స్త్రీవి నేనెక్కడి పురుషుఁడను - ఓకోపముగలదానా అట్లైనను నీకుమేలైనమాట చెప్పెదనువినుము నీకు సమ్మతమైన పక్షమున దంగీకరింపుము - నాకొడుకు పం

౧౩౩ ॥ వర్తతే వాదిమత్తేభ పంచాస్యస్తు కలావతి । భవత్పాణిం స గృహ్ణా తుయది తే రోచతే ముదా॥ ౧౩౪॥ ఇత్యుక్తం విదుషా తేన వచనం సా ముదా న్వితా । అంగీచకారవిదుషీ సాధుసాధ్వితిచాబ్రవీత్ ॥ ౧౩౫॥ తతో వరరుచిః ప్రాజ్ఞః అనుజ్ఞాప్య కలావతీం । భట్టాచార్యంచ విద్వాంసం తస్మాద్గేహాద్వి నిర్యయౌ ॥ ౧౩౬ ॥ తతస్స్వవాసమాసాద్య కృతీ వరరుచిస్స్వయం । కలావతీదురుక్త్యాతు సంజాతం క్రోధమాత్మనః ॥ ౧౩౭ ॥ సఫలీ కర్తుకామస్సన్ చింతయామాసమానసే । మత్కోపశాంతిః కేనస్స్యాత్ ఇత్యా లోచ్య పునః పునః॥ ౧౩౮॥ ఖరపాలం బుద్ధిహీనం తస్యాః కుర్యాంపతిం యది । కలావత్యాస్తదామేస్యాత్ క్రోధసాంతిర్నసంశయః ॥ ౧౩౯ ॥ ఏవం ని శ్చిత్యమనసిసవిద్వాన్ తత్రపట్టణే । న్యవసద్వైప్రతిదినం విద్వద్బృంద సమ ర్చితః॥ ౧౪౦॥ ఏకదా వై వరరుచి రుజ్జయిన్యాః పురో బహిః । స్నాతుం స మాయయౌ ప్రాతః మహాంతం కమలాకరం ॥ ౧౪౧ ॥ హంసకారండవా కీర్ణం కహ్లారైః కమలైస్తథా । సుశోభితం మహామీనైః కచ్ఛపైశ్చాతిసంకు

---

డితులలో శ్రేష్ఠుడు మంచిరూపముగలవాఁడు యౌవనముగలవాఁడు విద్యల యందునాకంటె నధికుఁడు సమస్తరాజులు నతనిబూజింతురు ప్రసంగముచే యువారనెడి యేనుగులకు సింహమైన వాఁడున్నాఁడు - ఓకలావతీ నీకిష్టమై నపక్షమందతఁడుసంతోషముగా నిన్నుఁబాణిగ్రహణముచేసికొనును - ౧౩౪ - అనియిట్లు పండితుఁడైన యావరరుచిచెప్పఁగాఁ బండితురాలైన యాకలావ తిసంతోషముతోఁగూడినదై యంగీకరించి లెస్సలెస్సయనెను - అంతఁ బం డితుఁడైనవరరుచి యాకలావతితోను భట్టాచార్యులతోనుబోయివచ్చెదనని చెప్పి యక్కడనుండి బయలువెడలెను - ౧౩౬ - అంతట బుద్ధిశాలియైన యావరరుచి తనయింటికివచ్చి కలావతితన్నాడిన దుర్భాషలచేతఁగలిగిన తన కోపమును సఫలముజేయుటకై మనస్సుననాలోచించెను- నాకోపమెట్లడఁగు ననిపలుమాఱాలోచించి బుద్ధిలేనిగాడిదెలమేపరిని దెచ్చి యాకలావతికి మగ నిఁజేసినపక్షమున నాకోపమడఁగుననినిశ్చయించికొని ప్రత్యహము పండితుల చేత సన్మానింపఁబడినవాఁడై యుండెను- ౧౪౦- ఇట్లుండి యొకానొకప్పు డావరరుచి యుజ్జయినీపట్టణమునకు బయటనుండునట్టి తామరకొలనికి స్నాన ము సేయఁబోయెను- ఆకొలను హంసములచేతను గన్నెటిపక్షులచేతను నిం డియుండును దానియందుఁ దామరపువ్వులునుగలువలును సొగసుగానుండును

లం ॥ ౧౪౨ ॥ జలై రామోదసంయుక్తైః నిర్మలైశ్చ విరాజితం । స్నానార్థం మాగతైర్విప్రైః బ్రహ్మనిష్ఠైశ్చ సేవితం ॥ ౧౪౩ ॥ తత్రస్నాత్వా వరరుచిః ధృతపీతాంబరశ్శుచిః । దదావర్ఘ్యం ద్యుమణయే పుష్పదర్భాగ్రసంయుతం ॥ ౧౪౪ ॥ జజాపేష్టార్థదాం దేవీం గాయత్రీం వేదమాతరం । ఉపస్థానం తతఃకృత్వా దిగ్దేవేభ్యః ప్రణమ్యచ ॥ ౧౪౫ ॥ ఋషిభ్యశ్చ మహాత్మభ్యః స్తుత్వా నత్వాచ భాస్కరం । ఆచమ్యచ పునస్తోయం సమంత్రం సద్విజోత్తమః॥ ౧౪౬ ॥ స్వగృహార్థం గంతు కామస్సః పుష్కరిణ్యాస్సమీపతః । దదర్శ బ్రాహ్మణాకారం అజ గార్దభ పాలకం ॥ ౧౪౭ ॥ తత్సమీపం తతోగత్వా తం పప్రచ్ఛససాదరం । భోభోద్విజా కృతేకస్త్వమజగార్దభపాలక ॥ ౧౪౮ ॥ కింనామతే విప్రచిహ్న పితుర్మాతుశ్చ నామకిం । కుత్రవావసతిస్తేద్య సత్యం ప్రబ్రూహిమాం ప్రతి॥ ౧౪౯॥ ఏవం ద్విజాకృతిః పృష్టః తదావరరుచిం ప్రతి । ఉవాచవాక్యం వాక్యజ్ఞం కుతూహలసమ

---

గొప్పచేపలును దాఁబేళ్లును నిండియుండును - ఉదకము తేటగా గమగమవాసన గలిగియుండును - అచ్చట స్నానముచేయుట కనేకులు బ్రహ్మనిష్ఠులైన బ్రాహ్మణులువచ్చి దానిచుట్టునుందురు అట్టియాకొలనియందు వరరుచిస్నానముచేసి పట్టుదోవతి కట్టుకొని పరిశుద్ధుడై పువ్వులను దర్భకొనలనుబట్టుకొని సూర్యునకర్ఘ్య మిచ్చెను- ౧౪౪- మఱియు నచ్చట సర్వాభీష్టముల నిచ్చునట్టియు వేదమాతయైన గాయత్రీమంత్రమునుజపించి పిమ్మట నుపస్థానముచేసి దిక్పాలురకుఁబ్రణమిల్లి మహానుభావులయినఋషులకు నమస్కారములుచేసి సూర్యుని స్తుతించి నమస్కారముచేసి మరల బ్రాహ్మణోత్తముఁడైన యాదేవాంగుఁడుదకమును మంత్రముతోనాచమనముచేసి తనయింటికిఁబోనుద్యుక్తుఁడై యాపుష్కరిణిదగ్గిర గొఱ్ఱెలను గాడిదెలనుమేపుచు బ్రాహ్మణాకృతితోనున్నవాని నొకనిఁజూచెను- ౧౪౭- చూచి యాదేవాంగుఁ డతనియొద్దకుబోయి యతనిఁబ్రీతితోనిట్లని యడిగెను - ఓ బ్రాహ్మణుని యాకృతిగలిగి గొఱ్ఱెలను గాడిదెలను మేపుచుండువాఁడా నీవెవండవు- ఓయి బ్రాహ్మణుల గుఱుతులుగలవాఁడా నీపేరేమి నీతల్లిదండ్రులపేరేమి- నీకిప్పుడునికి యెక్కడ యీవిషయములన్ని నిజముగానాతోఁజెప్పుము - అనియిట్లా బ్రాహ్మణరూపముతోనున్న పురుషుఁడడుగఁబడినవాఁడై యుత్సాహముతో నామాటల నెఱిఁగిన వరరుచికిట్లనియుత్తరముచెప్పెను - ౧౫౦ - ఓయి తెలిసిన వరరుచీ నేను బ్రా

న్వితః ॥ ౧౫౦ ॥ అహం వరరుచేః ప్రాజ్ఞ విప్రచూడామణే సుతః । మాధవా ఖ్యస్యమేమాతాలక్ష్మీనామ్నీతివిశ్రుతా॥౧౫౧॥కృతోపనయనఃనాలేతేనాహం బ్రహ్మవాదినా । తతఃకాలవశాత్తౌతు పితరౌ స్వర్గమాపతుః॥ ౧౫౨॥ కవి రత్న ఇతిఖ్యాతం మమనామమహాద్విజ । అహం ఖరాణాం ఛాగానాం పాల కోస్మిచసాంప్రతం॥ ౧౫౩॥ నికృష్టమే తత్కర్మాపి ఖరాజపరిపాలనం । ఊ రీకృతం జీవనార్థం మయాభూసురవందిత॥ ౧౫౪॥ ఇతిశ్రుత్వా తస్య వచః తదా వరరుచిస్స్వయం । చింతయిత్వా ముహూర్తంతు కవిరత్నం వచోబ్ర వీత్ ॥ ౧౫౫॥ అజాః ఖరా నద్యసర్వాః సమీపంతు తవప్రభోః । కవిరత్న ప్రాపయిత్వా తస్యానుజ్ఞాం ప్రపద్యచ ॥ ౧౫౬ ॥ ఆగచ్ఛత్వరితం విప్రకార్యం తుమహాదస్తివే । ఇతితస్యవచః శ్రుత్వా యథోక్తమకరోద్ద్విజః॥ ౧౫౭॥ త థాగతం వరరుచిః కవిరత్నమథావదత్ । కవిరత్న వచోమేద్య శ్రుణుస్వావ న్యమానసః॥ ౧౫౮॥ అత్రపుర్యాముజ్జయిన్యాం భట్టాచార్యోహి వర్తతే । కలావతీతస్యపుత్రీ విదుషీమంజుభాషిణీ॥ ౧౫౯॥ తాంతేపత్నీ మహంకుర్యాం సాహాద్వాణీమివస్థితాం। యదిమద్వచవంగుహ్యంధియతేమనసాతవ॥౧౬౦॥

---

హ్మణశ్రేష్ఠుండైన మాధవాచార్యుని కొమరుండను నాయమ్మ లక్ష్మియనుపే రుగలది - బ్రహ్మవాదియైన నాతండ్రి నాకుఁ గాలముననే యుపనయనముచేసె ను - పిమ్మటఁ గాలవశమువలన నాతల్లిదండ్రులిద్దఱు స్వర్గమునొందిరి- ౧౫౨- ఓ బ్రాహ్మణోత్తముండా నాకుఁ గవిరత్నమని పేరు - నేనిప్పుడు గాడిదెలను గొఱ్ఱెలను మేపువాఁడ నయితిని - ఓ బ్రాహ్మణులచేత నమస్కరింపఁబడు వాఁడా యీగాడిదెలను గొఱ్ఱెలను మేపుట నీకిష్టమైనపనియైనను జీవనార్థము నేనవలంబించితిని - ౧౫౪ - ఈప్రకారమా కవిరత్నముచెప్పిన మాటలు విని యప్పుడా వరరుచి తానుగొంతసేపాలోచించి కవిరత్నముతో నిట్లనెను - ఇ ప్పుడు నీవీగాడిదెలను గొఱ్ఱెలను స్వామికొప్పగించి సెలవుదీసికొని త్వరితము గారమ్ము గొప్పకార్యమున్నది - ఇట్లావరరుచిచెప్పిన మాట విని యాబ్రాహ్మ ణుఁడట్లేచేసెను - ౧౫౭ - అట్లువచ్చిన కవిరత్నముతో వరరుచి యిట్లనెను - ఓకవిరత్నమా నామాట నిప్పుడుజ్ఞప్తితో వినుము - ఈయుజ్జయినీపట్టణమందు భట్టాచార్యుఁడున్నాఁడుగదా - ఆయనకుమాతురుకలావతి విద్యలువచ్చినది మ ధురముగా మాటలాడునది నేనుజెప్పెడి రహస్యమైనమాటను నీవు మనస్సున నుంచినతఱిమందు సాక్షా త్సరస్వతివలెనున్న యామెను నీకుఁ బెండ్లాముగు

మానీసన్నుతరం దేహియద్యత్ పృచ్ఛేత్కలావతీ। తస్యాశ్రుత్వం విప్రవటో హ్యాం గుళీనాంతు సంజ్ఞయా॥ ౧౬౧॥ విద్యాః కావాత్వయాధీతాః విద్వన్నితికళావతీ। బ్రూతేయదాదర్శనీయాః చతస్రోంగుళయఃత్వయా॥ ౧౬౨॥ పునః కావాత్వయా ధీతాః విప్రేంద్రేతి కలావతి। బ్రూతే యదా దర్శనీయాః షట్త్వయాంగుళయ స్తదా॥ ౧౬౩॥ పునః కావాత్వయా ధీతాః ద్విజేంద్రేతి కలావతీ। బ్రూతే యదా దర్శనీయాః చతస్రోంగుళయ స్తదా॥ ౧౬౪॥ కేవాస్య జగతోబ్రూహి సృష్టి స్థిత్యంతహేతవః। యదా కలావతీ బ్రూతే తదైకాం దర్శయాంగుళిం॥ ౧౬౫॥ ఏవం వరరుచిం స్వం తమనుశాసం తమబ్రవీత్। తథైవకరవాణీతి వచోవిప్రవటు స్తదా॥ ౧౬౬॥ తతో వరరుచిఃస్వస్య గేహమానీయతంద్విజం। కారయిత్వా వధూబృందైః మంగళస్నానమాదరాత్॥ ౧౬౭॥ కటకాంగద కేయూరైః నవరత్న సుశోభితైః। అన్యైరాభరణై ర్దివ్యైః జ్వలితాంగం మహాజసం॥ ౧౬౮॥ అధ్యారోప్యస్వర్ణమయీం శిబికాం రత్నభూషితాం। తం వటుం వాహయామాస విదుషస్తాన్ మహామతీన్॥ ౧౬౯॥ ఏతయానిర్జితాః పూర్వం కలావత్యాద్విజోత్తమాః। తతఃప్రవవృతేతత్ర మహాన్కోలాహలధ్వనిః॥ ౧౭౦॥ రాజమార్గే పశ్యతాం తం శిబికారూఢమాదరాత్। జనానాం చైవ వద

---

గాఁజేసెదను- ఆకళావతినిన్నే మడిగినను నీవుమానముతో నాపెమాటలువిని వ్రేళ్లసైఁగలచేత నాపెకు త్తరముచెప్పుము - కలావతి నిన్ను నీవేవిద్యలుచదివితివనియడిగిన పక్షమున నీవునాలుగువేళ్లఁజూపుము - మఱియు నేమిచదివితివనియడిగెనాయారువ్రేళ్లఁజూపుము- మరలనేమిచదివితివనియడిగెనానాలుగువ్రేళ్లఁజూపుము - ఈప్రకారము దనకునేర్పుచున్న వరరుచితో నా బ్రాహ్మణవటు వల్లెచేసెదననెను- ౧౬౬- అంత నావరరుచి యాచిన్నవానిఁ దనయింటికిఁబిలుచుకొనివచ్చి ప్రీతితో స్త్రీలచేత నతని కభ్యంజనస్నానముచేయించి నవరత్నఖచితములయిన కడయములచేతను భుజకీర్తులచేతను బాజీబందులచేతను మఱియు సర్వాభరణములచేత నలంకరింపఁబడినవానిఁగాఁజేసి దేదీప్యమానుఁడై యున్న యావటుగును బంగారుపల్లకినెక్కించిపూర్వమీకలావతికోడిపోయిన మిక్కిలిబుద్ధిమంతులైన పండితులచేతనాపల్లకిమోయించెను- అంతనాపట్టణపురాజవీధి నతఁడు పల్లకియెక్కివచ్చుట నాసక్తితోఁజూచుచు జనులందఱితేఁడుగొప్పవిద్వాంసుడని కోలాహలధ్వనిచేసిరి- ౧౭౧- అంత విద్వాం

తాం మహావిద్వాన్ నయం త్వితి॥ ౧౭౧॥ తతో వరరుచిర్విద్వాన్ కలావత్యా గృహోత్తమం । నినాయ తం వటుః విప్రైః వహద్భిః శ్శిబికాం తదా॥ ౧౭౨॥ తథాగతం సమాలోక్య కలావత్యతిసుందరీ । యువానం సూర్య సదృశం సర్వాభరణభూషితం ॥ ౧౭౩ ॥ దివ్యపీతాంబరం దివ్య గంధమాల్యోప శోభితం । పప్రచ్ఛ వై వరరుచిం కోయమిత్యతివిస్మయాత్ ॥ ౧౭౪ ॥ తతో వరరుచిః ప్రాజ్ఞః తామువాచ కలావతీం । మత్పుత్రోయం మహాభాగే సింహాసంహననో యువా ॥ ౧౭౫ ॥ సర్వశాస్త్రేషు నిపుణః వేదవేదాంగపారగః । కిం పునర్బహునోక్తేన సర్వజ్ఞోయం నసంశయః ॥ ౧౭౬ ॥ కవిరత్న ఇతిఖ్యాతః సర్వరాజసుపూజితః । సరస్వత్యాః కశ్చిదయ మవతారో న సంశయః ॥ ౧౭౭॥ అయం ప్రాకృతవిద్వద్భిః ప్రసంగం నకరోతి వై । మానీ సన్నుత్తరం దత్తే తేషాం ప్రశ్నస్య సాదరం ॥ ౧౭౮ ॥ పరిణేతుం మన స్తేద్య త్వరతే యది కామినీ । ఏవం యువానం సుభగే వివాహస్తు ప్రవర్తతాం॥ ౧౭౯॥ ఇతి తస్య వచశ్శ్రుత్వా ప్రాహ గంభీరయాగిరా । కలావతీ మహాప్రజ్ఞా తదా వరరు

---

సుండై నవరరుచి యాపల్లకీని మోచుచున్న పండితులచేత నాబ్రాహ్మణవటువును గలావతి యిల్లుచేర్పించెను - ఆప్రకారము వచ్చినట్టియు సూర్యునివంటి తేజస్సు గలయట్టియు ప్రాయపువాండై నట్టియు సమస్తములైన సొమ్ములు ధరించియున్నట్టియు దివ్యమైన పట్టుదోవతికట్టుకొని మంచివాసనగల చందనము పూసుకొనియున్న యాబ్రాహ్మణునిం జూచి మిక్కిలి సొగసుకత్తెయయిన యాకలావతి యాశ్చర్యమున వరరుచి నితండెవండనియడిగెను - ౧౭౪ - అంతనా తెలిసినవాండైన వరరుచి యాకలావతి కిట్లనెను - మిక్కిలి సొగసైన రూపముగల యీయౌవనవంతుండు నాకొడుకు ఇతండు సమస్తశాస్త్రములయందు నేర్పరి వేదములు వేదాంగములు కడవెళ్లం దెలిసినవాండు మిక్కిలి చెప్పి కార్యమేమి యితండు సర్వము తెలిసినవాండు సందేహములేదు - ఇతని నందఱు కవిరత్నమని చెప్పుదురు రాజులితనికి మిక్కిలిమర్యాదచేయుదురు- ఇతండు సరస్వతియవతారము దీనికి సందేహములేదు- ౧౭౭- ఇతండు సాధారణ పండితులతోం బ్రసంగము చేయండు వారేదైన నడిగిన పక్షమున దానికి మానముతోనె సంజ్ఞ చేసి యుత్తరము చెప్పును - యౌవనవంతుండైన యితని బెండ్లియాడుటకు నీమనస్సు వచ్చెనా పెండ్లి కావచ్చును - ఈప్రకారమా వరరుచి చెప్పిన మాట విని మిక్కిలి తెలిసినదైన యాకలావతి సంతోషముతో నావరరుచినిం గూర్చి గంభీరముగా

చిం ముదా॥ ౧౮౦॥ అయం వరరుచే విద్వా౯ సర్వజ్ఞో యదితేసుతః । మత్ప్రశ్నానాం సమాధానం ప్రబ్రవీ త్వత్రసంసది॥ ౧౮౧॥ ఇత్యుక్త్వాసా వరారోహాతం వటుం సుభగాకృతిం । పప్రచ్ఛచమహాబుద్ధిః విదుషాం శృణ్వంతా తదా॥ ౧౮౨॥ విద్యాః కావాత్వయాధీతా విద్వన్నితికలావతీ । పప్రచ్ఛ దర్శితా స్తేన చతస్రోంగుళయ స్తదా ॥ ౧౮౩ ॥ పునః కావాత్వయాధీతా విప్రేంద్రేతికలావతీ । పప్రచ్ఛ దర్శితా స్తేన షట్ తదాంగుళయోముదా॥ ౧౮౪॥ పునః కావాత్వయాధీతా ద్విజేంద్రేతి కలావతీ । పప్రచ్ఛ దర్శితా స్తేన చతస్రోంగుళయ స్తదా॥ ౧౮౫॥ కేవాస్యజగతో బ్రూహి సృష్టి స్థిత్యంత హేతవః। పప్రచ్ఛసాదర్శయత్స తద్వై కాంగుళి మాదరాత్ ॥ ౧౮౬॥ దర్శితానామంగుళీనామేవం తేనవరేణతు । అభిప్రాయం వరరుచిం అపృచ్ఛత్సా కలావతీ॥ ౧౮౭॥ అథాబ్రవీ ద్వరరుచిః తేనవై వటునాస్వయం । దర్శితానామంగుళీనామభిప్రాయం కలావతీం॥ ౧౮౮॥ వేదా అధీతాశ్చత్వారః విదుషానేనయద్గురోః । తస్మాత్తే దర్శితాస్సుభ్రు చతస్రోంగుళయఃపురా॥ ౧౮౯॥ అధీతా నిగమాంగా షడనేన వటునాగురోః । యత స్తేదర్శితాస్సుభ్రు షట్తతోంగుళయ స్తథ॥ ౧౯౦॥ పురాణం ధర్మశాస్త్రం యత్ మీమాంసా న్యాయవి స్త

---

నిట్లనెను:- ఓయిపండితుడవైనవరరుచీ నీకొడుకైన యితఁడు సర్వజ్ఞుఁడై నపక్షమున నీసభయందు నేనడిగెడు ప్రశ్నలకు త్తరముచెప్పవలయును- ౧౮౧- మిక్కిలిసొగసుకత్తెయు బుద్ధిశాలినియునైన యాకలావతి యిట్లుచెప్పి యాపండితులందఱు వినఁగా నాబ్రాహ్మణవటువు నిట్లడిగెను - ఓయిపండితుఁడా నీవేవిద్యలజదివితివనెను - అంతనాతఁడు నాలుగువ్రేళ్లఁజూపెను - మరలనాకలావతియో బ్రాహ్మణోత్తముఁడా యింక నేమి చదివితివనెను - అంత నతఁడారువ్రేళ్లఁజూపెను - మరల నాకలావతి యింక నేమిచదివితివోయి బ్రాహ్మణుఁడా యనియడిగెను- అతఁడు నాలుగువ్రేళ్లఁజూపెను- అంతనామెయతనిని ప్రపంచమునకు సృష్టిస్థిత్యంతములకుఁ గారణభూతులెవరనియడుగఁగా నతఁడొకవ్రేలినిజూపెను - ౧౮౬ - ఈప్రకారమా పెండ్లికొడుకగపఱిచిన వ్రేళ్లకుఁ దాత్పర్యమేమని యాకలావతి వరరుచి నడిగెను - అంత నావరరుచి యాబ్రాహ్మణుఁడగపఱిచిన వ్రేళ్ల కభిప్రాయమును గలావతికిఁ జెప్పెను - ఇతఁడు తాను గురువువలన నాలుగు వేదములఁజదివితినని మొదట నాలుగువ్రేళ్లఁజూపెను - పిమ్మటనితఁడు గురువువలన నారు వేదాంగములఁజదివెనుగనుక నారువ్రేళ్లఁజూ

రః । అధీతా దర్శితా స్తేన చతస్రోంగుళయ స్తవ॥ ౧౯౧॥ జగతోస్య పరంబ్ర హ్మ సృష్టిస్థిత్యంతకారణం । ఇతినిశ్చిత్య మత్పుత్ర ఏకాంగుళిమదర్శయత్ ॥ ౧౯౨॥ ఏవం వరరుచిప్రోక్తం సమాధానం కలావతీ । శ్రుత్వావాలోచ్యమన సిప్రపేదే హర్షముత్తమం॥ ౧౯౩॥ తతస్సా దర్శయిత్వాతు భిత్తిచిత్రస మన్వితాం । తత్రస్థితాం దశాస్యస్య ప్రతిమాం చ కలావతీ॥ ౧౯౪॥ వర్ణి నం కవిరత్నం తమపృచ్ఛత్కమలేక్షణ । దశాస్యో వింశతిభుజః కోవాయం బ్రూహిమాంవర॥ ౧౯౫॥ ఇతిపృష్ట స్తయావర్ణీ వచోవరరుచే స్తదా । విస్మృ తోస్యవాచతాం కన్యాం రాభణఃఖల్వయంత్వితి॥ ౧౯౬॥ తతస్సావక్రకేశాం తాబభాషేతం మహామతిః । హేసర్వజ్ఞ మహాబుద్ధే వేదశాస్త్రార్థపారగ॥ ౧౯౭ ॥ రాభణఃఖల్వయమితి కథముక్తం త్వయాధునా । ఇతిపృష్టేతయావి ప్రేతదా వరరుచిస్స్వయం ॥ ౧౯౮ ॥ ప్రాహ గంభీరయావాచా సశంకాం తాం కలావతీం । విద్వన్మణి సభామధ్యే వినయేనసమన్వితః॥ ౧౯౯॥ కుంభ కర్ణే భకారోస్తి భకారోస్తి విభీషణే । రాక్షసానాం కులశ్రేష్ఠో రాభణోనచ రావణః ॥ ౨౦౦ ॥ ఇత్యభిప్రాయతఃకన్యే హ్యనేనోక్తం కలావతీ । రాభ

---

పెను - అటుతరువాతఁ బురాణముధర్మశాస్త్రిము మీమాంసయుఁదర్కము చదివెనుగనుక తిరుగ నాలుగువ్రేళ్లనగపఱిచెను- ౧౯౧- కడపట నీవడిగనప్ర శ్నమునకు నాకొడుకీ జగత్తున కంతటికిని సృష్టిస్థిత్యంతములకుఁ గారణము పరబ్రహ్మయొక్కటని నిశ్చయించి యొకవ్రేలిఁజూపెను - ఈప్రకారమా వరరు చిచెప్పిన సమాధానము నాకలావతివిని మనస్సుననాలోచించి మిక్కిలిసంతో షించెను - అంతనాకలావతి చిత్తరువులు వ్రాసియున్న గోడనగపఱిచి బ్రహ్మ చారియైన యాకవిరత్నమును పదితలలునిరువదిభుజములుగల యితఁడెవఁడని యడిగెను - ఈప్రకారమాపెచేత నడుగఁ బడినవాఁడై యా బ్రాహ్మణుఁడు వరరుచిచెప్పినమాటను మఱచియాకన్యతోనితఁడు రాభణుఁడుగదాయనెను - ౧౯౬ - అంత వంకరకురులుగల యాకలావతి యాబ్రాహ్మణునిఁగూర్చి యిట్ల నిపలికెను - ఓయి సర్వము తెలిసినవాఁడా మిక్కిలి బుద్ధిశాలీ వేదములువేదాం గములు దెలిసినవాఁడా ఇతఁడు రావణుఁడనియెట్లుచెప్పితివి - అనియాప్రకార మాకలావతి యాబ్రాహ్మణు నడుగగా నప్పుడు సందేహపడుచున్న కలావతినిఁ గూర్చి వరరుచి వినయముతోఁ గూడినవాఁడై యాపండిత సభనడుమ దాను గంభీరమైనమాటతో నుత్తరముచెప్పెను - కుంభకర్ణునియందు భకారమున్న

ణః ఖల్వయమితి విద్వద్బృందే మహాత్మనా॥ ౨౦౧॥ కర్తుం చాప్యన్యథాకర్తుం సమర్థోఽయం మహామతిః । సర్వాణి శాస్త్రజాలాని నిగమానాగమాంస్తథా ॥ ౨౦౨ ॥ ఏవం వరరుచేర్యుక్తియుక్తం బ్రువతిభాషితం । శంకాం విహాయత్వరితం ఆననందకలావతీ॥ ౨౦౩॥ తతోవరరుచిర్విద్వాన్ భట్టాచార్యం ద్విజోత్తమం । కవిరత్నాయ కన్యాం త్వం ప్రదేహీతివచోబ్రవీత్ ॥ ౨౦౪ ॥ భట్టాచార్యో మహాప్రాజ్ఞః శ్రుత్వా వరరుచేర్వచః । తథైవ కరవాణీతి వాక్యం ప్రోవాచసాదరం ॥ ౨౦౫ ॥ తతః స్తత్రదినేరాత్రౌ శుభనక్షత్రసంయుతే । శుభలగ్నే తయోరాసీత్ వివాహస్య మహోత్సవః ॥ ౨౦౬ ॥ పేఠుః సత్రమహాత్మానో వేదమంత్రాన్ ద్విజోత్తమాః । తౌర్య త్రికం సంప్రవృత్తం భట్టాచార్యస్యవేశ్మని ॥ ౨౦౭ ॥ వధూవరౌ శుభస్నాతౌ సర్వాభరణభూషితౌ । దివ్యాంబరధరౌ తత్ర ప్రాప్య కల్యాణమంటపం॥ ౨౦౮॥ కల్యాణ వేదికాయాం తౌ నవరత్నవిభూషితే । రమణీయే మహాప్రజ్ఞౌ స్థితవం

---

దివిభీషణునియందు భకారమున్నది గనుక రాక్షసవంశశ్రేష్ఠుఁడైన యితఁడును రాభణుఁడుగాని రావణుఁడుగాఁడు - అనియెంచి మహానుభావుఁడైన యితఁడు పండిత సభయందు రాభణుఁడనిచెప్పెనో కలావతి - ౨౦౧ - ఇతఁడు సమస్తములైన శాస్త్రములను వేదములను శైవ వైష్ణవాద్యాగమములను జేయను మఱియొకవిధమునఁ జేయను సమర్థుఁడైన మహాబుద్ధిశాలి - అనియిట్లావరరుచియుక్తితో సమాధానముచెప్పఁగా నాకలావతి శంకనువిడిచి సంతోషించెను - అంత నావిద్వాంసుఁడైన వరరుచి బ్రాహ్మణోత్తముఁడైన భట్టాచార్యునితో నీవు కవిరత్నముకొఱకుఁ గన్యాదానముచేయుమనెను - మిక్కిలి తెలిసిన యాభట్టాచార్యుఁడు వరరుచిచెప్పినమాటవిని ప్రీతితో నట్లేచేసెదననెను - అంతనాదినమురాత్రి మంచినక్షత్రమందు మంచిలగ్నమందు వారిద్దఱికు వేడుకగాఁ బెండ్లియాయెను - అప్పుడా భట్టాచార్యులవారింటిలో మహానుభావులైన బ్రాహ్మణులందఱు వేదమంత్రములఁ జెప్పిరి నృత్తగీతవాద్యములుచెలఁగెను- ౨౦౭- అప్పుడు మిక్కిలి తెలిసిన యావధూవరులు మంగళస్నానముచేసి మంచిసొమ్ములచేత నలంకారములుచేసికొన్నవారై మంచివస్త్రములుగట్టుకొని కల్యాణమంటపమునకువచ్చి యక్కడ పెండ్లియఱుగుమీఁదనవరత్నములచేతఁ జెక్కఁబడిన పెద్దపీటమీఁదఁ గూర్చుండిరి - అంతఁ బురోహితుఁడు శాస్త్రప్రకార మగ్నిప్రతిష్ఠాపనచేసి బ్రాహ్మణులతోఁడ నాయగ్ని

తౌ మహాసనే॥ ౧౦౯॥ తతః పురోహితో విద్వాన్ ప్రతిష్ఠాప్యమహానలం। జుహావాగ్నౌతువిధివత్ విద్వద్భిః బ్రాహ్మణైస్సహ ॥ ౧౧౦ ॥ తతో వరరుచి ర్ధీరః భట్టాచార్యం ద్విజోత్తమం । కన్యాదానం కురుష్వేతి ప్రోవాచద్విజ సంసది ॥ ౧౧౧ ॥ భట్టాచార్య స్తదాగత్య స్థిత్వా చైవ మహాసనే । పత్న్యా సస్సుత యాయుక్తః ప్రోవాచ మధురం వరం ॥ ౧౧౨ ॥ కవిరత్నస మాగచ్ఛ కన్యామ్మె ప్రదదా మితే । మహాప్రాజ్ఞీం మహాప్రాజ్ఞ ప్రతిగృహ్ణీష్వపాణినా ॥ ౧౧౩ ॥ ఇత్యుక్త్వా ప్రాక్షిపత్తోయం భట్టాచార్యస్సమంత్రకం ॥ కవిరత్నస్య హస్తేతు విద్వద్బృందేచ పశ్యతి ॥ ౧౧౪ ॥ తతఃపాణిం ప్రజగ్రాహాకళావత్యా ఉదారధీః । కవిరత్నో మహావిద్వాన్ ముముదేస కుతూహలీ॥ ౧౧౫॥ తదామహాతూర్యనాదః సంభూతో దివమాస్పృశత్ ॥ ఆశీర్వాద స్సమాయుక్తః విప్రాణాంవై మహాత్మనాం ॥ ౧౧౬ ॥ భట్టాచార్య స్తదాప్రాజ్ఞ విద్వద్భ్యో భూరిదక్షిణాం । దదౌ దివ్యానివస్త్రాణి రత్నానివివిధానిచ ॥ ౧౧౭ ॥ కవిరత్నకళావత్యో రేవం పరిణయేద్భుతే । జాతేనాగర సుందర్యఃమంగళానిజగుఃకలం ॥ ౧౧౮ ॥ సర్వే ముముదిరేతస్యా ముజ్జయి

---

యందు హోమమునుజరిపెను- ౧౧౦- అంత ధైర్యశాలియయిన యావరరుచి యా బ్రాహ్మణసభయందు బ్రాహ్మణోత్తముఁడైన భట్టాచార్యునిఁ గన్యాదానము చేయుమనెను అప్పుడు భట్టాచార్యుఁడువచ్చి పీటమీఁదఁగూర్చుండి భార్యతోను గూతుతోను గూడినవాఁడై పెండ్లికొడుకుతో మనోహరముగా నిట్లనిపలికెను - ఓకవిరత్నమారమ్ము మిక్కిలి తెలిసినదైన నాకూతునునీకిచ్చెదన మిక్కిలి తెలిసినవాఁడా చేతగ్రహింపుము - అనియిట్లుచెప్పి పండితులందఱుచూచుచుండఁగా భట్టాచార్యుఁడు కవిరత్నముచేత మంత్రముతో నుదకమునువిడిచెను - అంతగొప్పబుద్ధిగల యాకవిరత్నము కళావతినిబాణిగ్రహణము చేసిసంతోషించెను - ౧౧౫ - అప్పుడు బ్రాహ్మణుల యాశీర్వాద ధ్వనియు మేళములనాదమును గలిసికొని యాకాశమంటెను - అప్పుడు మిక్కిలి తెలిసినవాఁడైన యాభట్టాచార్యుఁడు పండితులకొఱకునానావిధములయినవస్త్రిములనురత్నములను భూరిదక్షిణయిచ్చెను - ఈప్రకార మాశ్చర్యకరముగాఁ గవిరత్నమునకుఁ గళావతికిఁ బెండ్లికాఁగా నాపట్టణపుస్త్రీలు శుభకరములైన పాటలుపాడి యారతులుపట్టిరి - కవిరత్నమునకును గళావతికినయిన యాపెండ్లినిజూచి యాయుజ్జయినీపట్టణమందున్నవారందఱు సంతోషపడిరి - పిమ్మట

న్యామ్మహాజనాః । కవిరత్న కలావత్యోః దృష్ట్వా కల్యాణమద్భుతం॥ ౨౧౯॥ తతఃకతిపయాహస్సు గతేషుచకలావతీ । జాతాపుష్ప వతీమోద మవాపక మలేక్షణా ॥ ౨౨౦ ॥ కవిరత్నస్స్వపత్నీకః గర్భాధానాఖ్య కర్మణే । చకారవిధివత్తత్ర భట్టాచార్యస్య వేశ్మని ॥ ౨౨౧ ॥ స్నాతాయాంతు కలావత్యాం చతుర్థదివసే తతః । శుభనక్షత్రసంయుక్తే శుభలగ్నే ముదాన్వితః॥ ౨౨౨॥ రాత్రౌతు ఫలదానాని దత్వాద్విద్వరాళయే । క్రీడాగృహ మవాప్యాథసుష్వాప నిజభార్యయా॥ ౨౨౩॥ తతః కలావతీవీక్ష్య నిద్రాం ప్రాప్తం నిజం పతిం । బోధయామాసశనకై రంతుం తేనమహాత్మనా॥ ౨౨౪॥ యదానబుబుధేభర్తా తదావీణాం ప్రగృహ్యవై । జగౌగేయం మహాధీరా షడ్జాది స్వరసంయుతం॥ ౨౨౫॥ యదానబుబుధేనాథః గీతేనాపి కలావతీ । తదాసించచ్చతస్యోరశ్శీతైశ్చందనవారిభిః॥ ౨౨౬ ॥ యదానబుబుధేభర్తా తైశ్చసాహికలావతీ । చిక్షేప చర్వితం స్వాసా త్తాంబూలంతనుఖేతదా॥ ౨౨౭॥ అజానాంచ ఖరాణాంచ రవోభూత్ ప్రథమంతతః । పురీష మూత్రమపతత్ మహాంస్యైచోరసిక్రమాత్ ॥ ౨౨౮ ॥ ఇతిభర్తుర్వచశ్శ్రుత్వా స్వపత స్త

---

గొన్ని దినములుగడవఁగానాకలావతిపుష్పిణియైసంతోషించెను- ౨౨౦- అంతనాకలావతి నాలవదినముస్నానము సేయగా శుభనక్షత్రమందుశుభలగ్నముననాకవిరత్నము భట్టాచార్యునియింటభార్యతో గర్భాధానకర్మనుజేసికొనెను- అప్పుడతఁడురాత్రియందు సంతోషముతోఁబండితులకుఫలదానములుచేసిభార్యతోఁబడక యింటికిఁబోయినిద్రపోయెను- అంతనాకలావతి నిద్రపోవుచున్న తనపెనిమిటినిజూచి యతనితోరమింప నతనిఁదిన్నగాలేపెను అటులేపిన నతఁడులేవకుండఁగా నప్పుడు మిక్కిలి ధీరురాలైన యాకలావతి వీణనెత్తికొని షడ్జాదిస్వరములతోఁగూడిన మధురమైన పాటపాడెను - ౨౨౫ - ఆపాటను బాడిననతఁడులేవకుండఁగా నప్పుడా కలావతి చల్లనిగంధముతోడి యుదకము నతనిఱొమ్ముమీఁదఁజల్లెను - అట్లు నతఁడు లేవకుండఁగా నప్పుడా కలావతితానునమలిన తాంబూలమునతనిముఖమున నుమిసెను- ఇట్లుచేయఁగానప్పుడతఁడుమొదట గాడిదెలుగొఱ్ఱెలు నరిచెను పిమ్మట వానిమలము నుచ్చయును నానోటను ఱొమ్మునఁ బడెననఁగా నిట్లునిద్రబోవుచున్న తనపెనిమిటిచెప్పిన మాటవిని యాకలావతి సందేహముతోఁగూడినదై తనచెలికత్తెలచేత నతనిలేపించియప్పుడిట్లనెను - నీవెవఁడవు బ్రాహ్మణపుత్రుఁడవా కావా శీఘ్రిమునఁ జె

స్యభామినీ।బోధయిత్వా సఖిభి స్తం సశంకా వాక్యమబ్రవీత్ ॥కోవాత్వంవిప్ర దాయాదోవాసవా బ్రూహిసత్వరం।త్వంవై వరరుచేః పుత్రోనా స్త్యేవాత్రన సంశయః॥ ౧౩౦॥ అవిద్వానివమేభాసితాదృశంతేవచోయతః । ఖరాజపాలకో వాత్వంతథ్యంబ్రూహి మమప్రభో॥ ౧౩౧॥ ఇతిపృష్ట స్తయాతన్వ్యా కవిరత్న స్స్వయోషితా। స్వవృత్తం సర్వమకథయత్ ఋజుబుద్ధిస్స తాంప్రతి॥ ౧౩౨॥ సర్వం వరరుచేః కర్మ భాతీదమితిభామినీ । నిశ్చిత్యసా స్వమనసి చింతయా మాసవై తదా॥ ౧౩౩॥ గతేజలే సేతుబంధం కర్తుమిచ్ఛతికోభువి । తర్తుం విధిబలంకోవా శక్నోత్యత్రమహీతలే ॥ ౧౩౪ ॥ తథాప్యే తత్సమీకుర్వే ఇతినిశ్చిత్యభామినీ । అబ్రవీత్తం పతిం మూఢం తత్కాల సదృశం వచః ॥ ౧౩౫॥ అస్యాఃపుర్యా ఉజ్జయిన్యాః రక్షిత్రీదేవతాద్యవై । కాళీదేవీ బహిరగాత్ ప్రేక్షితుం నగరీం స్వకాం॥ ౧౩౬॥ అటిత్వా నగరం సర్వం అభితస్సా సముత్సుకా । శక్తిసేనా పరివృతా ప్రాప్నుయాద్దైవ స్వమాలయం ॥ ౧౩౭॥ తస్మాచ్ఛీఘ్రమితోగత్వా ప్రవిశ్యత్వం తదాలయం । కవాటబంధనం

---

ప్పుము నీవు వరరుచికొడుకవు కానేకా వీవిషయమందు సందేహములేదు - నీవుమాటలాడుమాటలవలన నీవు విద్వాంసుడవుకావని నాకుదోచుచున్నది - నీవుగాడిదెలనుగొఱ్ఱెలను మేపువాఁడవా నాతోయథార్థముచెప్పుము - అని యిట్లు తనభార్యయైన కలావతిచేత నాకవిరత్నమడుగఁబడినవాఁడై కపటములేని బుద్ధిగలవాఁడై తనసమాచారమంత నాపెతోఁ జెప్పెను - ౧౩౨ - అప్పుడా సమాచారమంతయువిని యాకలావతి యిదంతయు వరరుచిచేసిన పనిగదాయని నిశ్చయించి యప్పు డిట్లని యాలోచించెను - ప్రపంచమున నెవడు నీళ్లుపోయినపిమ్మట కట్టవేయనిశ్చయించును దైవఘటనమునుమీఱనెవడు శక్తిగలవాఁడు అయినను దీనిఁజక్కఁజేసెదనని నిశ్చయించి యాకలావతి తనపెనిమిటితో నప్పటికిఁ దగినమాట యొకటిచెప్పెను- ౧౩౫- ఈయుజ్జయినీపట్టణమునుగాపాడెడిదేవతయైన కాళికాదేవి యిప్పుడు తనపట్టణమునుజూడ నుబయటఁబోయెను - ఆమె యీపట్టణ మన్నిప్రక్కలను దిరిగి యనేక శక్తులచేతఁజుట్టఁబడినదై తిరిగితనగుడికివచ్చును - కాఁబట్టి నీవిక్కడనుండి త్వరగాఁ బోయియాగుడిచేరితలుపుమూసుకొని నెమ్మదిగానుండుము - అంతనాకాళికాదేవి గుడివాకిటికివచ్చి మిక్కిలి త్వరతోఁగూడినదై నీతో నో బ్రాహ్మణుఁడా తలుపుగడియతీయుమనెనాయప్పుడుభక్తులకుశుభమునుజేయునట్టియాకాళికా

కృత్వాతిష్ఠ తత్ర యథాసుఖం ॥ ౨౩౮ ॥ ఆలయ ద్వారమాగత్య సాకాళీ త్వాం త్వరాన్వితా । అబ్రవీద్యది హేవిప్ర కవాటం మోచయార్గళాత్ ॥ ౨౩౯॥ తదాత్వయాప్రార్థనీయా నమస్కృత్వా పునఃపునః । విద్యాం దేహీతిమేమాతః । సాకాళీ భక్తశంకరీ॥ ౨౪౦॥ అనుశాస్యస్వ భర్తారం ఏవం సాహికలావతీ । కాళ్యాలయం నాథశీఘ్రం గచ్ఛగచ్ఛేత్యువాచహ॥ ౨౪౧॥ తతస్సకవిరత్నస్తు తత్సఖిదర్శితేనవై । పథా ప్రాపమహాదేవ్యాః కాళ్యా ఆలయముత్తమం॥ ౨౪౨॥ కవాట బంధనం కృత్వా యథోక్తం ప్రియయాతథా । కాళీం ధ్యాయన్ భక్త కామధేను మాస్తేస్మ తత్రసః॥ ౨౪౩॥ తతః కాళీసమాసాద్య స్వాలయద్వార మబ్రవీత్ । కవాటం మోచయాశుత్వం అర్గళా దితితం వచః ॥ ౨౪౪ ॥ సహోవాచ తతో విప్రః యోగినీగణసేవితాం । విద్యాం దేహి శివేమేద్య జాడ్యార రవిమోచనే॥ ౨౪౫॥ కవాటం మోచయా మ్యద్యహ్యర్గళా త్కమలాననే । విద్యాం మే దేహిదేవేశి నమామిత్వాం పునఃపునః॥ ౨౪౬॥ ఇతితస్య వచశ్శ్రుత్వా బాలాచపరమేశ్వరీ । ముద్రిణ్యాం బాచవారాహి తిస్రః క్రోధసమన్వితాః॥ ౨౪౭॥ ఊచుఃకాళీం మహేశానీం దేవ్యనుజ్ఞాం ప్రదేహినః । అద్యైవైనం ద్విజం దుష్టం జహ్మో

---

దేవికి మాటిమాటికి నమస్కారముచేసి తల్లీ నాకు విద్యనిమ్మని వేడుకొనుము- అని యిట్లా కలావతి తనభర్తకంతయునేర్పి నాథుఁడా శీఘ్రముగాఁ గాళికాదేవిగుడికిఁ బొమ్మనిచెప్పెను- ౨౪౧- అంత నాకవిరత్నమా కలావతి చెలులచేత జూపఁబడిన త్రోవనుబోయి కాళికాదేవిగుడిచేరెను - చేరి తనభార్యచెప్పినరీతిగాఁ దలుపుమూసికొని భక్తులకుఁ గోరికలన్నిటి నిచ్చునట్టి యాకాళికాశక్తిని ధ్యానముచేయుచు నచ్చటనుండెను - పిమ్మట నా కాళికాదేవి తన వాకిటికివచ్చి యతనితోనీవు త్వరగాఁ దలుపుగడియతీసి తలుపు తెరువుమనెను- అనేకశక్తియుక్తురాలైన యా కాళికాదేవితో నపుడతఁడిట్లనెను - ఓమోహామనెడుతలుపులనెల్ల లేపివేయునట్టి యీశ్వరీనాకిప్పుడువిద్యనిమ్ము ఓకమలమువంటి మోముగలయమ్మా నేనిప్పుడుతలుపు తెరిచెదను నాకువిద్యనీయవమ్మా నీకుమాటిమాటికి మ్రొక్కెదను - అనియిట్లతఁడుచెప్పఁగా నామాటవిని బాలయును బరమేశ్వరియైన ముద్రిణియును వారాహియు ననుముగ్గురుశక్తులుకోపముతోఁ గూడినవారై యాకాళికాదేవితో సూర్యరూపురాలైన యోయమ్మా మాకుత్తరువిమ్ము దుర్మార్గుఁడైన యీబ్రాహ్మణుని నిప్పుడే భక్షించెదమనిరి- ౨౪౭-

మాదిత్యరూపిణి॥ ౨౪౮ ॥ ఇతితాసాం వచః శ్రుత్వా కాళీవచనమబ్రవీత్ ।
మద్భక్తోయం మహాదేవ్యః పూర్వజన్మని మానవః ॥ ౨౪౯ ॥ మత్పూజాం
కృతవాన్నార్యః మన్మంత్ర జపతత్పరః । తస్మా దస్య మనోభీష్టం పూరయామి
మినసంశయః॥ ౨౫౦॥ ఇత్యుక్త్వాతాః తదా కాళీ ద్విజమాలోక్యసావదత్।
ప్రసారయాశుతేజిహ్వా మితివిప్ర స్తథాకరోత్ ॥ ౨౫౧ ॥ ప్రసారితాయాం
జిహ్వాయాం తస్య భక్తస్య సాదరం । లిలేఖ వాగ్భవం బీజం కాళీకల్యాణ
దాయినీ॥ ౨౫౨॥ లిఖితేవాగ్భవేబీజే తత్ క్షణేనద్విజోత్తమః । సర్వజ్ఞోభూత్
తదాదేవీం తుష్టావపరమేశ్వరీం॥ ౨౫౩॥ జయమాతంగతనయే జయనీలోత్ప
లద్యుతే । జయసంగీతరసికే జయలీలాశుకప్రియే॥ ౨౫౪॥ ఇతి స్తుత్వా స్తో
త్రగణైః తాం కాళీం సర్వదాయినీం । ప్రణమ్యచ ముహుర్భక్త్యా కృతాం
జలిరుపస్థితః॥ ౨౫౫॥ తమువాచతతః కాళీస్తోత్ర బృందేనతోషితా । కాళీ
దాసేతినామ్నాత్వం లోకేఖ్యాతింగమిష్యసి॥ ౨౫౬॥ కవిరత్నాభిధానంతుపి
త్రాదత్తం హితేముదా । ఇదానీం సార్థమభవత్ నాత్రకార్యా విచారణా॥

---

అనియిట్లు వారు చెప్పిన మాటలువిని యాకాళికాదేవి వారితో నోదేవతలా
రాయితఁడునాభక్తుఁడు పూర్వజన్మమందు నన్నుఁబూజించినవాఁడు నామంత్ర
మునుజపించుటయందాసక్తుఁడైన పూజ్యుఁడుకాఁబట్టి యితనికోరికను నేనునె
రవేర్చెదను సందేహములేదు - ౨౫౦ - అని కాళిక బాల మొదలగుదే
వతలతో నిట్లు చెప్పి బ్రాహ్మణునితోఁ ద్వరగా నాలుక చాపుమనఁగా నతఁ
డట్లుచేసెను - అంత నతఁడు నాలుక చాపఁగా శుభకరురాలైన కాళికాదేవి
ప్రీతితో నానాలుకయందు వాగ్బీజమును వ్రాసెను - వాగ్బీజము వ్రాయఁగా
నప్పుడే యా బ్రాహ్మణుండు సర్వజ్ఞుఁడై సర్వేశ్వరియైన యా కాళికాదేవిని
స్తోత్రముచేసెను - ఎట్లనఁగా మాతంగకన్యకా జయింపుము నల్లకలువలవంటి
కాంతిగలయమ్మా జయింపుముసంగీతమందిష్టముగలయమ్మా జయింపుమువిలా
సార్థమైన చిలుకయందిష్టముగలయమ్మా జయింపుము - ఈప్రకారమనేకము
లైన స్తోత్రములుచెప్పి సమస్తమునీఁగల యాకాళికాదేవినిఁ బొగడి భక్తితో
మాటిమాటికినమస్కరించియంజలిబంధములచేసికొనికూర్చుండెను- ౨౫౫-
అంత నాకాళికాదేవి యతని స్తోత్రములచేత సంతోషపఱుపఁబడినదై ఓయి
నీవులోకమందుఁ గాళిదాసుఁడను పేరితోఁ బ్రసిద్ధినొందఁగలవు- నీతండ్రి నీకు
బ్రీతితోఁ గవిరత్నమని పెట్టిన పేరిప్పుడర్థముగలదాయె నిఁక విచారమువలదు-

౧౮౭॥ కాళిదాస కవిశ్రేష్ఠ యద్యద్వాంఛసి వై భువి । తత్తత్కరస్థం భవతు
తే సదాసూరివందిత॥ ౧౮౮॥ ఇతిదత్త్వా వరం తస్మై కాళీసపరివారకా । ప్ర
విశ్యస్వాలయం దివ్యం తత్రైవాంతర ధీయత॥ ౧౮౯ ॥ తతస్స కాళిదాసో
పి కాళీదేవ్యాలయాత్స్వనః । వినిర్గతస్స ఝడితి ప్రాపభార్యానికేతనం ॥
౧౯౦ ॥ భార్యాం దృష్ట్వా కాళిదాసః సర్వవృత్తాంతమాదితః । కాళీవరప్ర
దానంచ కథయామాస సర్వవిత్ ॥ ౧౯౧॥ తతః కలావతీదేవీ సర్వజ్ఞం స్వ
పతింముదా।ఆలోక్యముముదేశీఘ్రంమాలిలింగేముహుర్ముహుః॥ ౧౯౨॥
రేమేథ సుచిరం కాలం తయాదేవ్యామహామతిః । కాళిదాస కవిశ్రేష్ఠః య
థేంద్రాణ్యాదివస్పతిః॥ ౧౯౩॥ అథసా సుషువే దేవీ పుత్రమేకం కలావతీ ॥
తేజసాదిత్యసంకాశం స్వభర్త్రా సదృశం గుణైః ॥ ౧౯౪ ॥ జాతకర్మాది
కం సర్వం పుత్రస్యస మహామతిః । పురోహితం పురస్కృత్య కాళిదాస స్త
దాకరోత్ ॥ ౧౯౫ ॥ నామకృత్వా స్వపుత్రస్య కాళిదాస ఉదారధీః । కవీం
ద్ర ఇతివిప్రేంద్రాన్ దక్షిణాభిరతోషయత్ ॥ ౧౯౬ ॥ కృతోపనయనోబా

---

ఓయి కవిశ్రేష్ఠుడవైన కాళిదాసుఁడా నీవు భూమిలో దేనిదేనిఁగోరెదవో య
దియంతయు నీకరచేత నున్నదగునోయి పండితులచేత మ్రొక్కఁబడినవాఁడా
ఈప్రకార మతనికివరమిచ్చి యాకాళి తనపరివారముతో దివ్యమైన తనయా
లయముచొచ్చి యక్కడనే యంతర్ధానమునొందెను- అంత నాకాళిదాసు
డునుగాళికాదేవిగుడినుండి బయలువెడలి త్వరగాఁ తనభార్యయున్న యింటికి
వచ్చెను- ౧౯౦- వచ్చి యాకాళిదాసుఁడు భార్యనుజూచి యామెతో మొదట
నుండిజరిగిన సమస్తసమాచారమును గాళికాదేవి తనకువరమిచ్చుటనుజెప్పె
ను- అంతనాకలావతిసర్వము దెలిసినతన పెనిమిటిని సంతోషముతోఁజూచిపలు
మాఱతనిఁగౌఁగిలించుకొని సంతోషించెను - పిమ్మటఁ గవిశ్రేష్ఠుఁడైన యా
కాళిదాసుఁడు తనభార్యయైన యాకలావతితో నింద్రుడు శచితోరమించినట్లు
బహుకాలమురమించెను - పిమ్మట నాకలావతి సూర్యునివంటి తేజస్సుగలయ
టియుఁ దనభర్తవంటిగుణములుగల కొమారునొకనిఁగనెను- అప్పుడు మిక్కి
లిబుద్ధిశాలియైనయాకాళిదాసుఁడు పురోహితునిఁగూడఁబెట్టుకొని యాపుట్టిన
కొడుకునకు జాతకర్మము మొదలైనవానినెల్లఁ జేసెను - ౧౯౫ - గొప్పబు
ద్ధిగలయాకాళిదాసుఁడు తనకొడుకునకుఁ గవీంద్రుఁడని నామకరణముచేసి బ్రా
హ్మణోత్తములకు దక్షిణలిచ్చి సంతోషము గలుగఁజేసెను - పిమ్మట నాకవీం

లఃకవీంద్రస్తుమహామతిః । స్వపిత్రా కాళిదాసేన వేదాభ్యాస రతోభవత్ ॥
౨౬౭ ॥ కాళ్యాలయం సమాసాద్య కవీంద్రో దేవనందితం । వేదప్రోక్తేనవి
ధినా కాళీం సంపూజ్యసాదరం ॥ ౨౬౮ ॥ భక్తాభీష్ట ప్రదాం దేవీం ప్రణమ్య
చముహుర్ముహుః । తుష్టావశ్రుతిగీతాభిఃస్తుతిభిస్తాందయాంబుధిం ॥ ౨౬౯ ॥
తతస్తుష్టాచసాదేవీ కాళీదాసాత్మజాయవై । కవీంద్రాయ దదౌ విద్యాః చ
తుష్షష్టి కలాత్మికాః ॥ ౨౭౦ ॥ తతస్స గేహమాగత్య పిత్రేమాత్రేన్య వే
దయత్ । కాళీవరప్రదానం వై కుతూహల సమన్వితః ॥ ౨౭౧ ॥ ఏకదాకాళి
దాసస్య కళావత్యాశ్చ యోషితః । ప్రసంగ కలహోజాతః మహాన్ వై
పుత్రసన్నిధౌ ॥ ౨౭౨ ॥ నజానాసీతిశాస్త్రాణి కాళిదాసోవదత్ స్త్రియం । న
జానాసీతిశాస్త్రాణి సావదత్ స్వపతిం తదా ॥ ౨౭౩ ॥ తతోరుష్టః కాళిదాసః
త్వం మాతాత్వం గురుర్మమ । ఇతిభార్యాం ప్రణమ్యాశు నిర్జగామ గృ
హాద్బహిః ॥ ౨౭౪ ॥ ప్రణమ్య నిర్గతం నాథం సాశశాపకలావతీ । స్త్రీవై
వతే మృతి భూయాదకార్యం కృతవాన్ యతః ॥ ౨౭౫ ॥ తతస్స క్వాదా

---

ద్రుఁడు తనతండ్రియైన కాళిదాసునిచేత నుపనయనముచేయఁబడినవాఁడై వేద
ముచదువుటయం దాసక్తుఁడాయెను - ఆ కవీంద్రుఁడు కాళికాదేవిగుడికిఁబో
యి దేవతలచేత నమస్కరింపఁబడినట్టియు భక్తుల కోరికలనిచ్చునట్టియు నా
యాసముద్రమైన యాకాళికాదేవి నావరణముతో వేదోక్తవిధిచేతఁ బూజచే
సి మాటిమాటికిమ్రొక్కి వేదములలోఁ జెప్పఁబడిన స్తుతులచేత స్తోత్రము చే
సెను - అంతనీప్రకారము స్తోత్రముచేయఁబడినదై యాకాళికాదేవి కాళిదా
సునికొడుకైన యతనికిఁ జతుష్షష్టి కలాస్వరూపములైన విద్యల నిచ్చెను -
౨౭౦- అంతనతఁడు సంతోషముతోనింటికి వచ్చి తనకుఁ గాళికవరమిచ్చినస
మాచారముదల్లికినిదండ్రికిని దెలిపెను- ఇట్లుకొంతకాలమైనపిమ్మట నొకప్పు
డుకాళిదాసునకును గలావతికిని బుత్రునెదుట ప్రసంగ కలహమాయెను - అ
ప్పుడాకాళిదాసుఁడు తనభార్యయైన కలావతిని నీకుశాస్త్రమును దెలియవనె
నప్పుడాపెయు నాకాళిదాసుని నీకు శాస్త్రములు దెలియవనెను - అనాకా
ళిదాసుఁడు కోపగించుకొన్నవాఁడై తనభార్యనునీవునాకుఁదల్లివి నీవుగురువవ
నిచెప్పి నమస్కారముచేసి యింటినుండి బయలువెడలెను - అంతనాకలావతి
తనకు నమస్కారముజేసి బయలుదేరిన తనపెనిమిటిని నీవుచేయరానిపనిచేసి
తివి గనుక నీకు స్త్రీచేతఁ జావగుననిశపించెను- ౨౭౫- అంత బండితసమూ

సన్తు విద్వద్బృందసమస్కృతః । వేశ్యాసక్తో వసద్ధీరః తత్రైవో జ్జయినీపురే॥ ౨౭౬॥ తతో వరరుచిర్విద్వాన్ ధారా పురమవాప్యసః । అవసద్భోజభూపేన ధనై రత్నైశ్చపూజితః ॥ ౨౭౭ ॥ పూజ్యమానం ప్రతిదినం భోజభూపేనమానినా। తదావరరుచింవీక్ష్యవిద్వాంసోసూయయాన్వితాః॥ ౨౭౮॥ సర్వేచ మిళితా భూత్వా మంత్రయామాసు రేకదా । అయం వరరుచి ర్విద్వాన్ అస్మాన్ధిక్కృత్యసాదరం॥ ౨౭౯॥ రాజ్ఞా ప్రపూజ్యతే నిత్యం ధనై రత్నైశ్చ పుష్కలైః । కథం వరరుచేరస్య భోజస్యచ మహీభృతః॥ ౨౮౦॥ విరోధస్తు భవేద్భూయాత్ అస్మద్దుఃఖ వినాశకృత్ । ఏవమాలోచ్య మంత్రస్య నిర్ణయం చక్రురేవ తే॥ ౨౮౧॥ తతస్సర్వేచ విద్వాంసః సక్రోధా రహసిస్థితాః । ఏకం శూద్రం సమానీయ సన్మాన్య బహుభిర్ధనైః ॥ ౨౮౨ ॥ తే తం ప్రోచుః త్వయాశూద్ర కర్తవ్యం కార్యమస్తిహి । అస్మిన్పురే భోజభూపమానితో స్తిహికశ్చన॥ ౨౮౩॥ నామ్నా వరరుచిర్నామ నకిం తే శ్రోత్రమాగతః । తం మమాగ్రజ ఇత్యేవ బ్రూహిభూపస్య సంనిధౌ॥ ౨౮౪॥ ఇతః పరం చ తేస్మాభిః దియ్యతేచ ధనం బహు । ఏవం తమనుశాస్యైవ ప్రేషయా

---

హముచేత నమస్కరింపఁబడిన యాకాళిదాసుఁడా యుజ్జయినీపట్టణమునవేశ్యాలోలుఁడై యుండెను- అంత నావిద్వాంసుఁడైనవరరుచి మరల ధారాపట్టణమునకువచ్చి భోజరాజుచేత ధనములతోనురత్నములతోనుసన్మానింపఁబడుచుండెను - అప్పుడా మానవంతుఁడైన భోజరాజుచేత నిత్యముసన్మానింపఁబడుచున్న వరరుచినిఁజూచి పండితులందఱునసూయతోఁగూడినవారై యొకప్పుడందఱొక తావునఁజేరి యాలోచించిరి- విద్వాంసుఁడైనయీవరరుచి మనలనందఱఁదిరస్కరించి రాజుచేత నెల్లప్పుడు ధనములచేతను రత్నములచేతను సన్మానింపఁబడుచున్నాఁడు - మనదుఃఖము పోవునట్లీభోజరాజునకునువరరుచికినెట్లు విరోధముకలుగును అని వారందఱాలోచించి యప్పుడొక విధముగానిశ్చయించుకొనిరి - ౨౮౧ - ఈప్రకారముచేరి రహస్యముగా నాలోచించి నవిద్వాంసులందఱొక శూద్రునిఁదోడ్కొనివచ్చి యతనికిమిక్కిలిద్రవ్యములిచ్చిసన్మానించి యతనితోనిట్లనిరి ఓయిశూద్రుఁడా నీవు చేయవలసిన గొప్పపనియొకటియున్నది యీపట్టణమందు భోజరాజుచేత గౌరవింపఁబడిన వాఁడొకఁడున్నాఁడతనిపేరువరరుచి నీవువినలేదా నీవు రాజుదగ్గిర నతనినాయన్నయనుమునీకిప్పుడిచ్చిన ధనముగాక యింకమిక్కిలి ధనమిచ్చెదమనిచెప్పి వారందరత

మాసు రేవతే॥ ౨౮౫॥ తతో రాత్ర్యాం వ్యతీతాయాం ఉదితేచ దివాకరే। సశూద్రో భోజభూపస్య ప్రవివేశ మహాసభాం॥ ౨౮౬॥ విద్వద్భిస్తైః సుసంపూర్ణాం రాజభిశ్చ మహాప్రభైః। అలం కృతాంచ భోజేన భూమిమాంద్రేణ విపశ్చితా॥ ౨౮౭॥ తాం సభాం ప్రాప్య శూద్రస్సభోజభూపం ప్రణమ్యచ। విజ్ఞాపయామాస తదా విదుషాం తత్ర శృణ్వతాం॥ ౨౮౮॥ భోభోభోజమహాప్రాజ్ఞ శృణుష్వ వచనం మమ। శ్రుత్వాచ వ్యవహారం మే పరిష్కర్తుం త్వమర్హసి॥ ౨౮౯॥ ఇతి విజ్ఞాపితో భోజః బ్రూహీతి త మథాబ్రవీత్। అనుజ్ఞాతస్తతో రాజ్ఞా స నిశ్శంక ఉవాచహ॥ ౨౯౦॥ అయం వరరుచి ర్విద్వాన్ అగ్రజో మే మహీపతే। విభక్తశ్చ మయాసార్ధం తత్రవై నాస్తిసంశయః॥ ౨౯౧॥ అపహృత్యచమే ద్రవ్యం కించిద్దేశాంతరంగతః। అన్విష్టోపి మయాయంవై నవిజ్ఞాతశ్చకుత్రచిత్॥ ౨౯౨॥ ఇదానీం త్వత్సభాయాంతు విద్యమానం మమాగ్రజం। విజ్ఞాయాహం త్వాగతవాంస్తతో దాపయమేధనం॥ ౨౯౩॥ ఇత్యుక్త్వా భోజభూపం తం సశూద్రో నిర్భయస్స్వయం। చేలాంచలం వరరుచేః గృహీత్వాతంచకర్షహ॥ ౨౯౪॥ త్వం దేహ్యగ్రజమేద్రవ్యం యత్త్వయాపహృతంపురా। నాహం ముంచామితావత్త్వాం

---

నినంపిరి - ౨౮౫ - అంత నారాత్రి గడచి సూర్యోదయము కాగానే యాశూద్రుఁడు భోజరాజు సభను జేరెను - ఆసభయందాపండితులందఱు నిండియున్నారుమఱియుననేకులైన రాజులు ప్రకాశించుచున్నారుపండితుఁడైన భోజరాజుకొలువుతీరియున్నాఁడు - అట్టిసభను బ్రవేశించి యాశూద్రుఁడు భోజరాజునకుమ్రొక్కి యాపండితులందఱు వినుచుండఁగా నిట్లనివిన్నవించెను - ఓ సర్వము తెలిసిన భోజరాజా నామాటనువినుము విని నావ్యవహారమును నీవుతీర్పవలయును - అని యిట్లతఁడు విన్నవింపఁగా నాభోజరాజుచెప్పుమనెను - రాజుత్తరువీఁగానే యతఁడు నిస్సందేహముగాఁ జెప్పెను - ౨౯౦ - ఓయి రాజా పండితుఁడైన యీవరరుచి నాకన్న నాతోఁబంచుకొన్నాఁడావిషయమందు సందేహములేదు - నాద్రవ్యమును గొంతనపహరించుకొని దేశమువిడిచివచ్చెను నేనువెదకుచున్నాను నాకితఁడెక్కడ నగపడలేదు - ఇప్పుడుమీసభయందున్నాఁడని తెలిసికొనివచ్చితిని గనుక నాద్రవ్యమును నాకిప్పింపుము - అని యిట్లాభోజరాజుతోఁజెప్పి యంతనాశూద్రుఁడు భయములేక తానువరరుచికొంగుపట్టియీడ్చెను - ఓయన్నా నీవపహరించిన నాద్రవ్యమునునాకిమ్ము

యావన్మే సదదాసితత్ ॥ ౨౯౫ ॥ ఏవముక్త్వా వరరుచిం కర్షంతం వీక్ష్య శూద్రకం । సభాసదస్తే విద్వాంసః మోదమాపురనుత్తమం ॥ ౨౯౬ ॥ రాజాత శూద్రమాలోక్య వాక్యమే తమువాచహ । శ్వస్తే విచార్యతే శూద్ర వ్యవహారో మహాన్మయా ॥ ౨౯౭ ॥ ఇత్యుక్త్వా ప్రేషయిత్వా చతం శూద్రం స్వగృహం ప్రతి । భోజభూపస్సభాస్తాన్ విదుషస్తానువాచసః ॥ ౨౯౮ ॥ భోభో విపశ్చిత స్సర్వే శ్రుణుధ్వం వచనం మమ । ఈదృశో వ్యవహారోన శ్రుతపూర్వో మయాభువి ॥ ౨౯౯ ॥ శ్వః కథం సంభవేదస్య వ్యవహారస్య నిర్ణయః । వ్యవహారో మహాన్ భాతి భవద్భిశ్చైష చింత్యతాం ॥ ౩౦౦ ॥ ఇతి శ్రుత్వా రాజవచః విద్వాంసస్తే సభాసదః । కాపట్యం మానసే కృత్వా ఏవముత్తర మబ్రువన్ ॥ ౩౦౧ ॥ నజానీమో వయం సర్వే ఏవం వరరుచిం ప్రభో । నాస్యాపి సంతతిం రాజన్ పితరం మాతరం తథా ॥ ౩౦౨ ॥ అయం శూద్రోయదిభవేత్ బహిష్కార్యో నసంశయః । ప్రాయశ్చిత్తంచ కర్తవ్యం అస్మాభిః భూరిదక్షిణైః ॥ ౩౦౩ ॥ యస్మాదయం గురురితి అస్మాభి రభివందితః । కోవావిప్రో నమస్కుర్యాత్ శూద్రజాతి సముద్భవం ॥ ౩౦౪ ॥ ఇతి తేషాం

---

ద్రవ్యమునునాకిచ్చునంతవఱకు నిన్ను విడువను - ౨౯౫ - అనిచెప్పియావరరుచినీడ్చుచున్న యాశూద్రునిఁజూచి యాసభయందున్న పండితులందఱుమిక్కిలిసంతోషమునొందిరి - అప్పుడు రాజాశూద్రునిఁజూచి యోశూద్రుఁడా నీవ్యవహారము గొప్పదిగా నున్నదిగనుక రేపువిచారించెదననెను - ఇట్లు చెప్పియా భోజరాజా శూద్రు నతనింటికిఁబంపి సభయందున్న పండితులతో నిట్లనెను - ఓపండితులారా మీరందఱునామాటయాలకింపవలయును నేనుభూమియందిట్టివ్యవహారము నిదివఱకెప్పుడు విననైతిని రేపీవ్యవహారముయొక్క నిశ్చయమెట్లు తెలియును గొప్పవ్యవహారముగానున్నది కాఁబట్టిమీరును దీనినాలోచింప వలయును - ౩౦౦ - అని యిట్లు రాజుచెప్పఁగా నామాటవిని యాపండితులందఱుమనస్సునఁగపటముపెట్టుకొని యొకయుత్తరము పలికిరి - ఓరాజా మేమెవ్వరమీవరరుచినిగాని యితనిసంతతినిగాని తల్లిదండ్రులనుగాని మెఱుఁగము - ఇతఁడుశూద్రుఁడైన పక్షమున నేమితని వెలివేసి యధికమైన దక్షిణములతోఁ బ్రాయశ్చిత్తముచేసికోవలయును- మేమందఱమితఁడుగురువని నమస్కారములు చేయుచుంటిమి బ్రాహ్మణుఁ డెవఁడు శూద్రునకు మ్రొక్కును - ఇట్లాపండితులుచెప్పిన మాటవిని యాభోజరాజుచింతపడుచు నాపండి

వచః శ్రుత్వా భోజశ్చింతాపరాయణః। ప్రేషయామాస విదుషః తాన్సైవ స్వస్వ గృహంప్రతి ॥ ౩౦౫ ॥ తతస్సభోజ భూపాలః దృష్ట్వా వరరుచిం తదా। ఉవాచవాక్యంవాక్యజ్ఞంవిద్వద్రత్నంమహామతిం॥ ౩౦౬॥ గచ్ఛశీఘ్రమితో విద్వన్ గేహం వరరుచేతవ। ఆగంతవ్యంత్వమైషాశ్వ స్సభా విద్వత్సమాకులా॥ ౩౦౭॥ ఇత్యుక్త్వాతం మహాబాహుః వందిమాగధ సేవితః। సభాయా స్సవినిర్గత్య భోజఃప్రాపస్వ మందిరం॥ ౩౦౮॥ తతో వరరుచిః ప్రాజ్ఞః చింతాకులితచేతనః। విద్వత్కృతమిదం సర్వం ఇతినిశ్చిత్య మానసే॥ ౩౦౯॥ నిశీథేససముత్థాయ నిర్గతస్స్వగృహాద్బహిః। గంగాస్నానం చికీర్షుస్సర్ అపవాదవినాశనం ॥ ౩౧౦ ॥ సర్వపాప హరాం పుణ్యాం సర్వైశ్వర్య ప్రదాయినీం। వారాణసీ పురీం ప్రాప బ్రహ్మేంద్రాదినమస్కృతాం ॥ ౩౧౧ ॥ తతో వరరుచి ర్విద్వాన్ ఆసాద్య మణికర్ణికాం। సంకల్పం విధివత్కృత్వా విద్వద్బృంద సమన్వితః ॥ ౩౧౨ ॥ అవగాహ్యతతోగంగాం సజజాపాఘమర్షణం। వేదప్రోక్తేనవిధినా స్నాత్వా తత్రకృతాహ్నికః ॥ ౩౧౩ ॥ విశ్వనాథం విశాలాక్షీం తథాదుండివినాయకం। సర్వాశ్చ దేవతా అన్యాః దృష్ట్వా

---

తులనందఱను వారివారి యిండ్లకుఁబంపెను - ౩౦౫ - పిమ్మట మిక్కిలి బుద్ధిశాలియైన యాభోజరాజు మాటల పొందెఱిఁగినట్టియుఁ బండితశ్రేష్ఠుడయినవరరుచినిఁజూచియిట్లనెను- ఓవరరుచీ నీవుత్వరితముగా నీయింటికి బోయి రేపటిదినమీసభకుఁ బండితులందఱు వచ్చినప్పుడు రమ్ము- ౩౦౭- అనియిట్లా వరరుచితోఁజెప్పి మిక్కిలిభుజబలముగల యాభోజరాజు బిరుదావళులుచదువువారిచేతఁబొగడఁబడుచు సభ వెలువడి తనయింటికిఁబోయెను- అంతఁదెలిసినవాఁడై నయావరరుచి మనస్సునఁజింతగలవాఁడై యిదియంతయు నీపండితులుచేసినపనియని మనస్సున నిశ్చయించి సమస్తాపవాదములను బోగొట్టునట్టి గంగాస్నానముచేయనుద్దేశించి సగమురాత్రివేళయప్పుడులేచి పట్టణముననుండిబయలువెడలినవాఁడై సమస్తపాపములను బోఁగొట్టునట్టియు సకలైశ్వర్యమునిచ్చునట్టియునింద్రుఁడుమొదలగు దేవతలచేతమ్రొక్కఁబడునట్టి కాశినిజేరెను- ౩౧౧ - పండిత సమూహముచేత నమస్కరింపఁబడిన యావరరుచి యక్కడచేరినపిమ్మట మణికర్ణికాఘట్టమునఁజేరి శాస్త్రోక్తరీతిని సంకల్పముచేసి గంగస్నానముచేసి యఘమర్షణ మంత్రములను జపించెను - ఈప్రకారమువేదోక్తవిధిని స్నానముచేసి యాహ్నికములన్నితీర్చుకొని యక్కడనుండు విశ్వ

స్తుత్వా ప్రణమ్యచ॥ ౩౧౪॥ కృతోపవాసో విధివత్ శ్రాద్ధం కృత్వా యథా విధి । గయాయాం పిండదానంచ పితృభ్యః సదదాద్విజః॥ ౩౧౫॥ త్రివేణ్యాం చతతస్నాతః పునఃకాశీం ప్రవిశ్యచ । ఉవాస వత్సరం త్వేకం తత్ర బ్రాహ్మణ పూజితః॥ ౩౧౬॥ స ఏకదా మహాబుద్ధిః అవాప్య మణికర్ణికాం । అవగా హ్యచతాందేవీం తుష్టావపరమేశ్వరీం ॥ ౩౧౭ ॥ అహో భాగీరథీదేవి సాగ రస్వర్గదాయిని । జహ్నుపుత్రిమహాదేవ జటాజూటవిలాసిని॥ ౩౧౮॥ అంబ త్వద్దర్శనాన్ముక్తిః నజానే స్నానజంఫలం । ఇతివ్యాస వచస్సత్యం యదిచే త్కమలేక్షణే॥ ౩౧౯॥ మహాపవాదగ్రస్తం మాం పవిత్రయసుమధ్యమే । విష్ణు పాదోద్భవేదేవి బ్రహ్మేంద్రాదిసుపూజితే ॥ ౩౨౦ ॥ ఇతిస్తుతా జాహ్నవీసా హ స్తాభరణముత్తమం । కంకణం నవరత్నాఢ్యం దదౌతస్మైవిపశ్చితే॥ ౩౨౧॥ త తోవరరుచిం ప్రాహ సర్వజ్ఞాసా సరిద్వరా । అహో వరరుచే విద్వన్ తవనా స్త్యేవపాతకం ॥ ౩౨౨ ॥ కుతోపవాదస్తే బ్రహ్మన్ విద్వద్బృంద ప్రకల్పితః ।

---

నాథస్వామినివిశాలాక్షిని దుండివినాయకునినింక నితరదేవతలసందఱనుజూచి స్తోత్రములుచేసి మ్రొక్కి శాస్త్రప్రకార మొక్క ప్రొద్దుండి విధిప్రకారము శ్రాద్ధముచేసి గయయందుఁ దనపితృదేవతలకుఁ బిండము నిచ్చెను - ౩౧౫ - పిమ్మటనతఁడు ప్రయాగకుఁబోయి మూడుప్రవాహముల కూడికయందు స్నానముచేసి తిరిగికాశికివచ్చి యక్కడ బ్రాహ్మణులచేతఁ బూజింపఁబడినవాఁడై యొక సంవత్సరముండెను - అధిక బుద్ధిగల యావరరుచి యొకప్పుడు మణికర్ణికాఘట్టమునందుస్నానముచేసి యాగంగనిట్లుస్తుతించెను - ఓగంగాదేవి నీవు భగీరథునిచేతఁ దేఁబడి సగరచక్రవర్తికొడుకులకు స్వర్గముల నిచ్చితివిగదా జహ్నువుచేతఁద్రాఁగబడి మరలఁబుట్టితివిగదా శివునిజటాజూటమందుఁ బ్రకాశించితివిగదా అమ్మా నిన్నుఁ జూచినమాత్రముచేతనే సంసారమునుండి మోక్షము గలుగును స్నానమువలనఁ గలిగెడు ఫలమును నేనెఱుఁగను - అనెడి వ్యాసులమాట నిజమాయెనా - విష్ణువుపాదమందుఁబుట్టి బ్రహ్మయింద్రుఁడు మొదలగు వారిచేతఁ బూజింపఁబడిన యోగంగాదేవీ గొప్పయపవాదమును బొందియున్న నన్నుఁ బరిశుద్ధునిగాఁజేయుము - ౩౨౦ - ఇట్లు స్తోత్రముచేయఁబడినదై యాగంగ యావరరుచికి నవరత్నఖచితమై శ్రేష్ఠమైయున్న కంకణమునొకదాని హస్తాభరణముగా నిచ్చెను - ఇచ్చి యావరరుచితో నాగంగ యిట్లనెను- ఓయివరరుచీ నీకుఁబాపమేలేదు- పండితులు కల్పించినయపవాద

తస్మాదితశ్శీఘ్రమేవ గచ్ఛభోజమహీపతిం ॥ ౩౨౩ ॥ దర్శయిత్వా కంకణం మే బ్రూహితం రాజపుంగవం । అహోభోజ మహీపాల శూద్రోయదిమ మానుజః॥ ౩౨౪॥ అన్యత్కంకణ మేతాదృక్ ఆనయేతివదాద్యతం। ఆనయే ద్యదిశూద్రస్తదనుజో మేనసంశయః॥ ౩౨౫ ॥ ఇతిభాగీరథీ దేవీ అనుశాస్య ద్విజోత్తమం । ప్రేషయిత్వాభోజపురం అథసాంతర్దధౌముదా॥ ౩౨౬॥ తతోవరరుచిర్విప్రః ప్రాప్యభోజ మహీపతిం । ఉవాచవాక్యంగంగోక్తం సర్వమేవ యథార్థతః॥ ౩౨౭॥ అథభోజ మహీపాలః సభాం ప్రాప్యస శీఘ్రతః। ఆనినాయచతం శూద్రం అబ్రవీత్కఠినం వచః॥ ౩౨౮॥ హేశూద్రత్వం వరరుచేః అనుజో యదివాస్తవాత్ । హస్తకంకణ మేతాదృక్ దర్శయాద్య చదేహిమే॥ ౩౨౯॥ ఏతద్వరరుచేః ప్రాప్తం మయాహ్యై హస్తకంకణం । తస్యానుజే త్వయ్యేతా దృగ్భవేన్నై వనసంశయః॥ ౩౩౦॥ యదినా నీయతేత త్తుశిరశ్ఛేదం కరోమితే । ఇతిభోజవచశ్శ్రుత్వా అబ్రవీత్తం ప్రణమ్యచ॥ ౩౩౧॥ అహోభోజ మహీపాల విద్వద్భిస్తే సభాస్థితైః । బహుద్రవ్యంచ దత్వా

---

మునీకిక్కడిది - కాబట్టి నీవిక్కడనుండి త్వరగా భోజరాజుదగ్గిరికిఁబొమ్ము - పోయి నేనిచ్చినకంకణమునుజూపి యారాజశ్రేష్ఠునితో నిట్లుచెప్పుము- ఓభోజ రాజా శూద్రుఁడు నాతమ్ముఁడైనపక్షమున నిట్టికంకణమింక నొకటి యుండవ లెగదాదానిఁదెమ్మని యతనితోఁజెప్పుము- అతఁడు దానిఁదెచ్చెనా నాతమ్ముఁ డనందేహములేదు - అనియిట్లు గంగాదేవి వరరుచికాజ్ఞచేసి భోజరాజు పట్ట ణమునకతనిఁబంపి తానుసంతోషముతో నంతర్ధానమునొందెను- ౩౨౬ - అంతనా బ్రాహ్మణుఁడైన వరరుచి భోజరాజుతావునకువచ్చి గంగచెప్పినమా ట నదేరీతిని జెప్పెను- పిమ్మట నాభోజరాజు శీఘ్రముగా సభకువచ్చి యాశూ ద్రునిఁ బిలిపించి కఠినముగా నిట్లనిచెప్పెను- ఓశూద్రుఁడా నీవీ వరరుచితమ్ము డవైనపక్షమున నిట్టి చేతికడియమునుజూపుము తెమ్ము - ఈకడియము నేనువ రరుచిదగ్గిర తీసికొంటిని నీవతనితమ్ముడైన పక్షమున నీదగ్గిర నిట్టిది యుండవల యును సందేహములేదు- దానిఁదేనిపక్షముననీతలనరికింతును- అనియిట్లాభో జరాజు చెప్పఁగాశూద్రుఁడామాటవిని యతనికిమ్రొక్కియిట్లనెను- ఓభోజరా జా నీసభయందున్న పండితులు నాకు పెక్కుధనములిచ్చి బోధించిరి- ౩౩౨- అందువలనఁ బండితులచేత నమస్కరింపఁబడుచున్న వరరుచి సభయందు నేన నరానితప్పుమాటచెప్పితిని - ఇది నిజము ముమ్మాటికినిజము నేనుదెలియకచే

హం బోధితస్త్వయం నసంశయః॥ ౩౩౨॥ తస్మాద్వైకుత్సితం వాక్యం అబ్రువం జనసంసది । అవాచ్యం తం వరరుచిం విద్వద్బృంద నిషేవితం॥ ౩౩౩॥ ఇతిమే వచనం సత్యంసత్యంసత్యంపునఃపునః । అజ్ఞానతఃకృతమిమం అపరాధం క్షమ స్వమే॥ ౩౩౪॥ రక్షమాం త్వం మహీపాల శూద్రజాతి సముద్భవం । ఇతిసం ప్రార్థ్య పతితం పాదయో శ్శరణాగతం ॥ ౩౩౫ ॥ తాడయిత్వాక శాభి స్తం బహుధాలోచ్యశాస్త్రతః । కారాగృహే మహాఘోరే స్థాపయామాస భోజరాట్॥ ౩౩౬॥ తతోభోజ మహీపాలః విదుషస్తాన్ భయాన్వితాన్ । స భాస్తారాన్ పాపకృతః నినిందబహుధాభృశం ॥ ౩౩౭ ॥ అథభోజ మహీపాలఃఉత్థాయ స్వాసనాద్ద్రుతం । ఆలిలింగమహాప్రాజ్ఞం తదావరరుచింముదా॥ ౩౩౮॥ ప్రణమ్యసోథ భక్త్యాచ స్తుత్వాచ బహుశోనృపః । వాక్యమే తద్వ రరుచిం త మువాచ కృతాంజలిః॥ ౩౩౯॥ భోభో వరరుచేవిద్వన్ వేదశాస్త్రార్థపారగః । త్వమేవ శబ్దశాస్త్రాణాం వేత్తానాస్త్యత్రసంశయః ॥ ౩౪౦ ॥ అపశబ్దేన జటిలం సర్వగ్రంథ కదంబకం । సుశబ్దజాలరత్నేన శోభితం కృతవానసి॥ ౩౪౧॥ సర్వేద్విజా మూఢధియః విద్వాంసశ్చ కృతాస్త్వయా । త్వత్తోధికః పండితోపి త్వత్సమోనాస్తిభూతలే॥ ౩౪౨॥ త్వత్తోమయా వేదశాస్త్రా

---

సినయిూతప్పును మన్నింపవలయును ఓరాజా శూద్రకులమందుఁబుట్టిన నన్నునీవు రక్షింపుము- అనియిట్లువేడుకొని రక్షణార్థమై యడుగులఁబడిన యాశూద్రు నాభోజరాజు జాటీలచేతఁగొట్టించి యనేకవిధముల శాస్త్రప్రకారమాలోచించి మిగులభయంకరమైన బందిఖానాలోఁ బెట్టించెను - పిమ్మటనాభోజరాజు పాపముచేసి భయపడుచున్న యా సభయందుండు వారి ననేకవిధముల మిక్కిలినిందించెను - తరువాత నాభోజరాజు త్వరితముగాఁ దనపీఠముననుండిలేచిమిక్కిలి తెలిసినవాఁడైన యావరరుచిని సంతోషముతోఁ గౌఁగిలించుకొనెనుమఱియునాభోజరాజు భక్తితోనావరరుచికిమ్రొక్కి యనేకవిధములఁబొగడి చేతులుగూర్చుకొనియిట్లనెను - ఓవిద్వాంసుఁడవైన వరరుచీ నీవేవేదములనువేదాంగములనుశాస్త్రములనర్థముతోఁదెలిసినవాఁడవీవిషయమునసందియములేదు - ౩౪౦ - అపశబ్దములతో నిండియున్న గ్రంథములనన్నిటిని సుశబ్దములుగలవానిఁగాఁ జేసితివి - ఏమియుఁ దెలియనివారుగానున్న బ్రాహ్మణులనందఱను బండితులఁజేసితివి-భూమండలమందునీకంటేనధికుఁడైన పండితుఁడుగాని నీకుసమానుఁడైన పండితుఁడుగానిలేఁడు - మహానుభావుఁడవైన నీ

ణ్యధీశాని మహాత్మనః । వేదాంత శాస్త్రమధునో పదిశత్వం మమప్రభో ॥ ౩౪౩॥ ఇతిభోజ మహీపేన ప్రార్థితో విదుషాం వరః । సరహస్యం వరరుచిః బోధయామాసతం నృపం॥ ౩౪౪॥ సర్వోప నిషదా మర్థం తస్మై భోజాయభూభృతే । కథయామాస విప్రేంద్రః తదా వరరుచిస్స్వయం ॥ ౩౪౫ ॥ యజ్జ్యోతిః కాశతేదివ్యం జాగ్రత్ స్వప్నసుషుప్తిషు । తదేవహి పరం బ్రహ్మ విద్ధిభోజమహీపతే॥ ౩౪౬॥ ఆబ్రహ్మ స్తంబ పర్యంతం యత్తేజోవ్యాప్యతిష్ఠతి । తదేవేతి పరం బ్రహ్మ విద్ధిభోజ మహీపతే॥ ౩౪౭॥ అణో రణీయో యద్వస్తు మహీయో మహతశ్చయత్ । తదేవేతి పరం బ్రహ్మ విద్ధిభోజ మహీపతే॥ ౩౪౮॥ సర్వేషాం చైవ జగతాం సాక్షిభూతం విభాతియత్ । తదేవేతి పరం బ్రహ్మ విద్ధిభోజ మహీపతే॥ ౩౪౯॥ తత్త్వమస్యాది వాక్యార్థైః యద్గమ్యం వస్తుయోగిభిః । తదేవేతి పరం బ్రహ్మ విద్ధిభోజమహీపతే॥ ౩౫౦॥ సర్వేషాం జగతాంయత్తు సృష్టిస్థిత్యంతకారణం । తదేవేతి పరంబ్రహ్మ విద్ధిభోజమహీపతే ॥ ౩౫౧ ॥ యద్భాసమనుసృత్యైవ భాసతేర విరంబరే । తదేవే

---

యొద్దనేనువేదములను శాస్త్రములనుజదివితిని - ఇప్పుడు నాకువేదాంతశాస్త్రము నుపదేశింపుమయా మహానుభావా - అనియిట్లాభోజరాజు ప్రార్థింపఁగా నావరరుచి రహస్యమైన యావేదాంతశాస్త్రము సతనికిబోధించెను - అప్పుడావరరుచి సమస్తములైన యుపనిషత్తులయర్థము నాభోజరాజునకుజెప్పెను- ౩౪౫ - జాగ్రత్స్వప్న సుషుప్తులయందేకరూపముగాఁ బ్రకాశించు వస్తువేదో యదే పరబ్రహ్మమని తెలిసికొనుమయా భోజరాజా బ్రహ్మ మొదలుకొని తృణమువఱకు సమస్తసృష్టిజాలమును వ్యాపించియుండునట్టి తేజస్సేదికలదో యదేపరబ్రహ్మమని తెలిసికొనుము - అణువుకంటె సూక్ష్మమును మహత్తుకంటె గొప్పదియు నేదో యదే పరబ్రహ్మమని నీవు తెలియుము సమస్తలోకములకు సాక్షిగాఁ బ్రకాశించునదే పరబ్రహ్మమని తెలిసికొనవయా రాజా తత్త్వమసి మొదలైన మహావాక్యములచేత యోగులే వస్తువును బొందుదురో యదేబ్రహ్మమని తెలిసికొనుమయా రాజా - ౩౫౦ - సమస్త ప్రపంచమునకు సృష్టిస్థితిలయములకుఁ గారణమైన వస్తువే పరబ్రహ్మమని యెఱుఁగుమయా - దేని ప్రకాశమునననుసరించి యేసూర్యుఁడాకాశమందు వెలుఁగుచున్నాఁడో యదే పరబ్రహ్మమని తెలిసికొమ్ము దేనియాజ్ఞచేత నింద్రుడుమొదలగువారు తమతమ పనులయందుఁ బ్రవర్తించుచున్నారో యదే పరబ్రహ్మమని తెలిసికొనుము -

తి పరం బ్రహ్మ విద్ధిభోజ మహీపతే॥ ౩౫౨॥ యదాజ్ఞయా మహేంద్రాద్యాః వర్తంతే స్వస్వకర్మసు । తదేవేతి పరం బ్రహ్మ విద్ధిభోజ మహీపతే॥ ౩౫౩॥ బ్రహ్మ విష్ణు శివానాంచ యద్ధ్యేయం వస్తుసర్వదా । తదేవేతి పరం బ్రహ్మ విద్ధి భోజమహీపతే॥ ౩౫౪॥ ఇతిభోజ మహీపాలం బోధయిత్వా ముహుర్ముహుః తదా వరరుచి ర్వాక్యం సస్మితం పునరబ్రవీత్॥ ౩౫౫॥ ఏతేభోజ మహీపాలసభాస్తారా బుధాస్తవ । కృతఘ్నానాస్తి సందేహః కోపం కురునతాన్ప్రతి॥ ౩౫౬॥ ఉపకారమహం మన్యే విప్రాణాం విషయేకృతం । తథా భస్మహుతం సర్వం వసాజ్యాది హవిర్యథా॥ ౩౫౭॥ తేషాం సహజ శత్రుత్వం విప్రాణాం హి పరస్పరం । యథాశునాంచసింహానాం గజానాంచమహీతలే॥ ౩౫౮॥ పూర్వం పితృవధా మర్షీజామదగ్న్యః ప్రతాపవాన్ । నిఃక్షత్రాం వసుధాం కృత్వారామః పరశునా తదా ॥ ౩౫౯ ॥ పితౄణాం తర్పణం కృత్వా రుధిరాణాంతుధారయా । తేషాంచసాంత్వవచనేః పునశ్శాంతి మవాప్యసః॥ ౩౬౦॥ కాశ్యపాయ దదౌ శ్రీమాన్ సర్వామేవ వసుంధరాం । తతస్తు కాస్యపశ్శ్రీమాన్ భార్గవం రామమబ్రవీత్॥ ౩౬౧॥ భోభో భార్గవ రామత్వం సర్వ

---

బ్రహ్మ- విష్ణువు- ఈశ్వరుఁడు- వీరికినిధ్యేయమైనవస్తువేదో యదేపరబ్రహ్మమని తెలిసికొనుము - అనియీప్రకారముగా భోజరాజునకుఁ బెక్కుమారులు బోధించి యప్పుడావరరుచి యాభోజరాజుతోఁ జిరునగవునగుచు నొకమాటచెప్పెను- ౩౫౫- ఓభోజరాజా నీసభయందుండెడు వీరుకృతఘ్నులు ఆవిషయమందుసందేహములేదు నీవు వారిమీఁదఁ గోపముసేయవలదు - నేనీబ్రాహ్మణులకుజేసినయుపకారమును బూడిదెలో హోమముచేయబడినవప - నేయి మొదలగుహవిస్సునువలెఁ దలఁచెదను - కుక్కలకు సింహములకు నేనుఁగుల కెట్లో యామాదిరిగా నా బ్రాహ్మణులకుఁ బరస్పరము సహజ శత్రుత్వము ప్రసిద్ధమైయుండును - పూర్వము ప్రతాపవంతుఁడైన పరశురాముఁడు తనతండ్రినిఁ జంపుటవలనఁ గోపముగలవాఁడై తనచేతి గండ్రగొడ్డలిచేత భూమియందున్న క్షత్రియులనందఱఁజంపి వారినెత్తుటి ధారచేత బితృదేవతలకుఁ దర్పణముచేసి పిమ్మట నా పితృదేవతలు చెప్పెడి మంచిమాటలచేతఁ గోపముమాని యీభూమినంతయును గాశ్యపఋషి కొసఁగెను - అంత నా మహానుభావుఁడైన యాకాశ్యపుఁడాపరశురామునితో నిట్లనెను - ఓ పరశురాముఁడా నీవు సమస్త క్షత్రియవంశమును జంపినవాఁడవు - ఓయి బ్రాహ్మణ శ్రేష్ఠుఁడా నీవీ

క్షత్ర వినాశకృత్ । త్వయాఖిలు ప్రదత్తామే వసుధా విప్రపుంగవ॥ ౩౬౨॥ త్వయాతపశ్చర్యతేచేత్ మమభూమౌ మహామునే । తస్యార్థం మేప్రదాతవ్యం తపసో విప్రపుంగవ॥ ౩౬౩॥ యదిచేన్నిర్ణయ స్తేస్తి నివసాత్ర యథాసుఖం । నచేదన్యత్ర గచ్ఛత్వం మాభూత్కాలస్యపర్యయః॥ ౩౬౪॥ అభూతపూర్వం తద్వాక్యం ఇదం శ్రుత్వా సభార్గవః । రుషావిష్టోమహాతేజాః శశాపాథ ద్విజాన్ ప్రతి॥ ౩౬౫॥ బ్రాహ్మణానాం తు సర్వేషాం ఆధిపత్యం కదాచన । భూమే మాభూదితియత స్తే సూయాతత్పరామతాః॥ ౩౬౬॥ నైకమత్యంచ తేషాం వై భవే దేవకదాచన । ఇతిశప్త్వా సవారాశిం యయాచే వసుధాంప్రభుః ॥ ౩౬౭ ॥ యాచిత స్తేనరామేణ సముద్రోవాక్యమబ్రవీత్ । యావతీతేమహాదేవ కాంక్షితా తాం వదాద్యమే॥ ౩౬౮॥ ఇతిబ్రువాణే వారాశౌ పరశు స్తేన వేగతః । యావద్దూరం విసృష్టస్సన్ జగామ రిపుసూదనః॥ ౩౬౯ ॥ సతావద్దూరపర్యంతం భార్గవాయ మహాత్మనే । దత్వాభూమిమపాసరత్ సముద్రస్సకుతూహలః ॥ ౩౭౦ ॥ తత్రాభూత్ కేరళోదేశః కల్పి

---

భూమిని నాకిచ్చితివిగదా - ౩౬౨ - ఓబ్రాహ్మణోత్తముఁడవైన మహామునీ నీవు నాభూమియందుండి తపస్సుచేసినపక్షమందా తపస్సులో సగము నాకీవలయును- ౩౬౩- అట్లు నిర్ణయము నీకున్నపక్షమున నిక్కడనుండుము లేనిపక్షమునమఱియొకచోటికిఁబొమ్ము కాలహరణముకూడదు- ౩౬౪- అనగానదివఱకెన్నఁడు నెవ్వఁడు చెప్పనియట్టిమాట నాపరశురాముఁడు వినికోపగించుకొని యా బ్రాహ్మణుల నిట్లుశపించెను - బ్రాహ్మణులసూయగలవారగుటవలన వారికందఱకు నెప్పుడును భూమికి బ్రభుత్వము లేకపోవుగాక వారికెప్పుడు నైకమత్యమునులేకపోవును - అనియిట్లుశపియించి యంతట మహానుభావుఁడైన యాపరశురాముడు సముద్రమును నేలను యాచించెను - ౩౬౭ - ఈప్రకారమాపరశురామునిచేత యాచింపఁబడినదై సముద్రమాపరశురామునితోనిట్లనెను - ఓయి పరశురాముఁడా నీకెంత నేలకావలయును దానినాకుఁజెప్పుము - అని యాసముద్రుఁ డడుగఁగా నా పరశురాముఁడు శత్రువులనందఱ ధ్వంసముచేసిన తనగండ్రగొడ్డలిని విసరివేసెను - అంతనాగండ్రగొడ్డలి యెంతదూరమునఁ బోయిపడెనో యంతదూరము నేలను బరశురామునకు విడిచి సముద్రము సంతోషముతో నావలికిఁటొలఁగిపోయెను- ౩౭౦- అక్కడనీవిధముగా నా పరశురామునిచేత నేరుపరుపఁ బడిన యా కేరళదేశము బ్రాహ్మణులచేతను క్ష

తో భార్గవేణవై । బ్రాహ్మణైః క్షత్రియైః వైశ్యైః శూద్రైశ్చైవ సమన్వితః ॥ ౩౭౧ ॥ స్వర్గస్త్రీ సుందరాకార యోషిద్బృంద సుసంయుతః । యత్రసాం నిధ్యమకరోత్ పద్మనాభోజగత్పతిః॥ ౩౭౨॥ శేషాంకశాయీ భగవాన్ భక్తానాం కల్పభూరుహః । రాజతేద్యాపివాణీశ నమస్కృత పదాంబుజః ॥ ౩౭౩ ॥ పురాభార్గవశస్తానాం బ్రాహ్మణానా మితఃపరం । అస్తిప్రచ్ఛన్నపాపానాం శాస్తా వై వస్వతోయమః ॥ ౩౭౪ ॥ తస్మాద్భోజ మహీపాల కోపం మా కురుమాకురు । విదుషాంచకుమార్గాణాం విషయేరాజపూజితః॥ ౩౭౫॥ ఏవముక్త్వావరరుచిః పునర్భూపతిమబ్రవీత్ । భోజభూప శ్రుణువచః రహస్యం తేవదామ్యహం ॥ ౩౭౬ ॥ పురాకైలాసనాథేన శంకరేణ ప్రచోదితః । దేవాంగస్తస్య పుత్రోహం ఆగమం ధరణీతలం॥ ౩౭౭॥ తేనోక్తమఖిలం కార్యం మయారాజన్ననుష్ఠితం । ఇతఃపరంతుకైలాసం గంతుమిచ్ఛామ్యహంముదా॥ ౩౭౮॥ ఇత్యుక్త్వాభోజ భూపాయ ఆశీర్వాదం మహాద్భుతం । దత్త్వావైరుచిః సుఖీభవజయీభవ॥ ౩౭౯॥ తతోదివ్యాని వస్త్రాణి శుభదాని మహీభృతే । యజ్ఞసూత్రాణి పూజ్యాని తథాతస్మైసదత్త

---

త్రియులచేతను వైశ్యులచేతను శూద్రులచేతనునిండినదాయెను- మఱియునాదేశమందలి స్త్రీలప్సరస్త్రీలవలె నుందురు - జగదీశ్వరుఁడైన పద్మనాభస్వామి యాదేశమందుఁ బ్రత్యక్షముగానుండును - ఆదిశేషునిమీఁద శయనించునట్టియు భక్తులకోరికలన్నిటిని నిండించునట్టియు బ్రహ్మదేవునిచేతఁ బూజింపఁబడినట్టి యాభగవంతుఁ డిప్పుడు నచ్చోట వెలుగుచున్నాఁడు - పూర్వము పరశురామునిచేత శపింపఁబడిన యాబ్రాహ్మణులు గూఢముగాఁ బాపములు చేయుదురు వారికిశిక్షకుఁడు యముఁడున్నాఁడు- కాఁబట్టిరాజులచేతఁబూజింపఁబడిన యోభోజరాజాయాపండితుల విషయమున నీవెంతమాత్రమును గోపముచేయవలదు - ౩౭౫ - ఇట్లుచెప్పి యావరరుచి మరల నారాజుతోనిట్లనెను - ఓభోజరాజా నీకు నేనురహస్యమైన మాట యొకటిచెప్పెదను వినుము - నేనుకైలాసపతియైన యీశ్వరునికుమారుఁడను దేవాంగుఁడనువాఁడను- ఆయనచేతఁ బ్రేరేపింపఁబడినవాఁడనై భూమిమీఁదికి వచ్చితిని - ఆయన చెప్పినకార్యమంతయు నేనుజెప్పితిని కాఁబట్టియోరాజా యింకనునేనుసంతోషముగాఁ గైలాసపర్వతమునకుఁ బోవలయుననియెంచెదను - అనియిట్లాభోజరాజుతోఁజెప్పి యతని కత్యాశ్చర్యము కలుగునట్లు సుఖముగలవాఁడవు జ

వాక్ ॥ ౩౮౦ ॥ తతోవరరుచిః ప్రాజ్ఞః కైలాసం ప్రాప్తముత్తమం । దధ్యౌ సాంబం స్వపితరం విష్ణుబ్రహ్మాదివందితం ॥ ౩౮౧ ॥ ధ్యాతమాత్రస్తతః శంభుః విమానం సూర్యవర్చసం । ప్రేషయామాస పుత్రాయ దేవాంగాయమహాత్మనే॥ ౩౮౨॥ తతోవిమానమాయాతం ఘంటానాద సమన్వితం । అన్వితం శివభక్తైశ్చ తథైవాప్సరసాంగణైః॥ ౩౮౩ ॥ నృత్యద్భిః గాయమానైశ్చగంధర్వాణాం కదంబకైః । వజ్రవైడూర్య మాణిక్య పుష్యరాగాది శోభితం ॥ ౩౮౪ ॥ వాసితం మల్లికాజాతి పుష్పాణాం నికరైస్తథా । ధూపేనవాసితం సర్వ ఫలభక్ష్య సమన్వితం॥ ౩౮౫॥ ప్రాప్య భోజస్య నగరీం దేవాంగస్యసమీపతః । అతిమాత్రభయాస్వస్య భాసయచ్చ దిశోదశ ॥ ౩౮౬ ॥ తద్విమానం సమాలోక్య సర్వేనగరవాసినః । జనా ముముదిరేభోజః ప్రాపచానందముత్తమం॥ ౩౮౭॥ తతోవరరుచింభోజః సంపూజ్య విధివద్గురుం । వస్త్రైర్మాల్యైర్భూషణైశ్చ తస్థౌ బద్ధాంజలిస్తదా॥ ౩౮౮॥ తతో వరరుచిర్భోజం సదారం భక్తిసంయుతం । ఆమంత్ర్యచవిమానం తత్ ఆరురోహకుతూహ

---

యముగలవాఁడవుగమ్మని యాశీర్వాదముచేసి యంతట మఱియునారాజునకు శుభకరములైన దివ్యములైనవస్త్రములను యజ్ఞోపవీతమునిచ్చెను- ౩౮౦-౧ సర్వవిషయములు దెలిసిన ఋషులారా అంతనావరరుచియుత్తమమైనకైలాసపర్వతమునుగూర్చిపోవుటకై విష్ణువు బ్రహ్మ మొదలగువారిచేతఁ బూజింపఁబడిన తనతండ్రియైన సాంబమూర్తిని ధ్యానముచేసెను - ధ్యానముచేయఁగానే యాసాంబశివుఁడు తనకొడుకైన యాదేవాంగుని కొఱకు సూర్యునివలె బ్రకాశించునట్టి విమానమునంపెను - అంతట విశాలమైనట్టియు ఘంటలచేత శబ్దించుచున్నట్టియు శివభక్తులతోను నాడుచున్న యప్సరస్సంఘములతోడను బాడుచున్న గంధర్వులతోడను గూడినట్టియు - వజ్రములుమొదలగునవరత్నములచేత నలంకరింపఁబడియున్నట్టియు మల్లెజాజిమొదలగు పువ్వులచేతఁ బరిమళించుచున్నట్టియు ధూపముచేత వాసనగలిగినటియు సమస్తములైన పండ్లతోనుభక్ష్యములతోనుగూడినట్టి యావిమానము భోజరాజుపట్టణమునకువచ్చితనకాంతిచేతఁ బదిదిక్కులను బ్రకాశింపఁజేయుచు దేవాంగుని దగ్గిరనిలిచెను- ౩౮౬- ఆవిమానమునుజూచి యాపట్టణమందు జనులును భోజరాజునందఱు సంతోషించిరి - ఆపిమ్మట నాభోజరాజుగురువైన వరరుచిని వస్త్రములుపూలదండలు మొదలైనవియిచ్చి యథావిధిగాఁబూజచేసి చేతులుగట్టు

లీ ॥ ౩౮౯ ॥ వవృషుః పుష్పవర్షాణి తదా దేవాముదాన్వితాః । జగుఃకలం చగంధర్వాః ననృతుశ్చాప్సరోగణాః॥ ౩౯౦॥ దేవదుందుభయోనేదుః తదా విప్రాభువిస్థితాః । క్షత్రియావైశ్యశూద్రాశ్చ ప్రణేముస్తంవిమానగం॥ ౩౯౧॥ ఆరూఢవ్యోమయాన స్సదేవాంగ స్సుందరాకృతిః । స్తూయమాన స్సురర్షిభిఃస్వభాసా భాసయన్ దిశః॥ ౩౯౨॥ సిద్ధచారణ గంధర్వైః సేవ్యమానపదాంబుజః । వినానేనయయౌ శ్రీమాన్ కైలాసస్థానముత్తమం॥ ౩౯౩॥ తదా శంభుస్తమాలోక్యస్వపుత్రంపునరాగతం। ఆగచ్ఛాగచ్ఛపుత్రేతివాక్యమేతన్ముదావదత్ ॥ ౩౯౪ ॥ తతోదేవాంగ ఆగత్య పార్వతీపరమేశ్వరౌ । ప్రణనామముదాభక్త్యా సాదరం వాక్యమబ్రవీత్ ॥ ౩౯౫॥ శివశంభో మహాదేవా దేవ త్వదాజ్ఞాం కృతవానహం । పాహిపాహి సదాభక్తం పుత్రంతవ దయానిధే ॥ ౩౯౬॥ ఇత్యుక్తవంతం దేవాంగం సమీపేసం నివేశ్యసః । ముముదేభగవాన్ శ్రీమాన్ సాంబో విష్ణుస్సనాతనః ॥ ౩౯౭ ॥ ఏవం వరరుచౌ ప్రాప్తే కైలాసం

---

కొనినిలిచెను - అంతనావరరుచి యీప్రకారము భక్తితోఁ దానును దనభార్యయును జేతులుగట్టుకొని నిలిచియున్న యాభోజరాజుతోఁ బోయివచ్చెదనని చెప్పినసంతోషముగలవాఁడై విమానమునెక్కెను - అప్పుడు దేవతలు సంతోషముతోఁగూడినవారై పూలవానలుగురిసిరి గంధర్వులుమధురముగాఁ బాడిరి- అప్సరసలాడిరి - దేవతల నగారాలు శబ్దించెను - అప్పుడు భూమియందున్న నాలుగువర్ణములవారును విమానమందున్న యాదేవాంగునకు నమస్కారములుచేసిరి - ౩౯౧ - సొగసైన యాకారముగల యాదేవాంగుఁడా విమానమునెక్కి దేవఋషులచేతఁ బొగడఁబడుచుఁ దనతేజస్సుచేత దిక్కులనెల్ల వెలిగించుచుసిద్ధులచేతనుజారణులజేతను గంధర్వులచేతను గొలువఁబడుచున్న పాదకమలములుగలవాఁడై యుత్తమమైన కైలాసపర్వతమున కావిమానముతోఁ బోయెను - అప్పుడీప్రకారము భూలోకమునసుండి మగిడివచ్చిన తనకొడుకునుజూచి శివుఁడుసంతోషము పుత్రుఁడా రమ్మురమ్మని సంతోషముతోఁ జెప్పెను - అంత నాదేవాంగుఁడు దగ్గిరికిఁబోయి యాపార్వతీ పరమేశ్వరులకు భక్తితోనమస్కారముచేసి యిట్లనెను- ౩౯౫- శుభమునుగలుగఁజేయునట్టియుదొడ్డదేవుఁడవైనయోస్వామీ యెల్లప్పుడునీయందుభక్తిగల నీకొడుకనై ననన్నుఁగాపాడవయాదయానిధీ - అని యిట్లుచెప్పిన యా దేవాంగమునిని దగ్గిరఁ గూర్చుండఁబెట్టుకొని మహానుభావుఁడై నట్టియు నాదిపురుషుఁడయిన యాసాంబ

తుశివాలయం । కాళిదాసకవిః శ్రేష్ఠః యయౌ భోజ సభాం ప్రతి॥ ౯౮॥ భో
జరాజేన బహుశః పూజ్యమానో ముదాన్వితః । న్యవస త్తత్ర నగరే కవిబృం
దనమస్కృతః॥ ౯౯॥ ఏవం వరరుచేర్భూమ్యాం అవతారం మహాద్భుతం।
యేపఠంతి మహాప్రజ్ఞాః యే శృణ్వంతి ద్విజోత్తమాః॥ ౧౦౦॥ పుత్రపౌత్రైః
పరివృతాః ధనైర్ధాన్యైశ్చ పుష్కలైః । సహితాస్తే మహాభాగాః । సం
ప్రాప్య సుఖముత్తమం॥ ౧౦౧॥ అంతే కైలాసమావాసం శివస్య పరమాత్మ
నః । ప్రాప్నుయుర్వై ముదాయుక్తాః మహేంద్రాదిసుపూజితాః॥ ౧౦౨॥
ఇతిశ్రీ బ్రహ్మకృతే - బ్రహ్మాండ పురాణే - బ్రహ్మనారద సంవాదే - ఉత్తరఖండే
దేవాంగచరితే - వరరుచ్యవతారోనామ షడ్వింశోధ్యాయః.

అథామోదపురేశస్య దివ్యాంగస్వామితేజసః । నందినామ సుతో
జాతో నీలకంఠ స్తదాత్మజః॥ ౧॥ నీలకంఠాత్మజశ్శంభు దేవస్సత్య పరాక్రమః।
శంభోస్సుతస్తు హేమాంగ శ్చంద్రాంగ స్తత్తనూభవః॥ ౨॥ చంద్రాంగజో
భద్రబాహు ర్వీరభద్రస్తు తత్సుతః । వీరభద్రస్యవిఖ్యాత స్తనయో విందసం
జ్ఞకః॥ ౩॥ వీరభద్రస్య తనయా శూలపాణి రరిందమః । శూలపాణి సుతశ్శ్రీ)

---

మూర్తి మిక్కిలి సంతోషించెను - వరరుచి యీప్రకారము శివస్థానమైన కై
లాసమునకుఁగాఁగా నంతఁ గవిశ్రేష్ఠుఁడయిన కాళిదాసుఁడు భోజరాజుసభకుఁ
బోయెను - పోయి యాభోజరాజుచేత ననేకవిధముల సన్మానింపఁబడుచు నచ్చ
టికవులచేత నెల్ల మ్రొక్కులుగొనుచు నాభోజరాజు పట్టణముననుండెను - ఈ
ప్రకార మాశ్చర్యకరమైన యీవరరుచి భూమియం దవతరించిన కథను జదివి
నను విన్నను గొడుకులతోను మనుమండ్రతోను గూడినవారై మిక్కిలి యదృ
ష్టముగలవారై ధనములుధాన్యములుగలవారై యీలోకమున సకలసుఖము
లననుభవించి దేహాంతమందు సంతోషముతో నింద్రుఁడు మొదలగువారిచేతఁ
బూజింపఁబడినవారై మహానుభావుఁడైన శివునకు వాసస్థానమైన కైలాస
మునుబొందుదురు - ౧౦౨ - ఇది బ్రహ్మస్వరూపమైన బ్రహ్మాండపురాణము
నందు బ్రహ్మనారదసంవాదమున నుత్తరఖండమున దేవాంగచరితమున వరరుచి
యవతారమన్నది యిరువదియారవ యధ్యాయము.

పిమ్మట నామోదపట్టణమునకుఁ బ్రభువైన మితిలేనితేజస్సుగల దివ్యాంగు
నకు నందియనుకొడుకుపుట్టెను వానికొడుకునీలకంఠుఁడు- నీలకంఠుని కొడుకు
సత్యమైన పరాక్రమముగల శంభుదేవుఁడు శంభుదేవునికొడుకు హేమాంగు

మార్గ జయసేనో మహాబలః॥ ౪॥ జయసేనా శ్చిత్రసేన శ్చిత్రసేనాత్సువిక్ర మః । సువిక్రమస్యతనయో గంగాధర ఉదాహృతః॥ ౫॥ విద్యావిలాస ఇతిచ తస్యనామ బభూవహ । విద్యావాణీ తస్య భార్యా పతిభక్తిపరాయణా॥ ౬॥ తౌ దంపతీపుత్రహీనౌ బహుదుఃఖసమన్వితౌ । పరస్పరం వ్యాహరతాం ఏకాం తేతుకదాచన॥ ౭॥ కిం ఫలం పుత్రహీనస్య ధనైర్ధాన్యైర్మహత్తరైః । అ పుత్రస్యగతిర్నాస్తిఇతిహిశ్రూయతేశ్రుతిః॥ ౮॥ ఏవంతయోఃప్రవదతోఃవా గభూదంతరిక్షగా । యువయోః పుత్రసంపత్తిః భవితేతి పునఃపునః ॥ ౯॥ ఇ త్యాకాశగతాం వాణీం శ్రుత్వాహర్ష సమన్వితః । విద్యావిలాసోభార్యాం స్వాం అబ్రవీద్వచనం తదా॥ ౧౦ ॥ విద్యావాణినభేతవ్యం త్వయాకమలలో చనే । ఆవయోరాత్మజశ్శ్రీమాన్ భవిష్యతినసంశయః॥ ౧౧ ॥ అంతరిక్షగతా వాణీ వ్యర్థానస్యాత్కదాచన । ఇత్యాశ్వాస్య స్వకాం భార్యాం ఆమం

---

డు - అతనికొడుకుచంద్రాంగుఁడు చంద్రాంగునికొడుకు భద్రబాహువు - అ తనికొడుకు వీరభద్రుఁడు - వీరభద్రునికొడుకు విందుఁడని ప్రసిద్ధిఁజెందినవాఁ డు- ౩- మఱియు నావీరభద్రునకు శూలపాణి యరిందముండని యిద్దఱుకొడు కులు వారిలో శూలపాణియనువానికొడుకు శ్రీమంతుఁడై మిక్కిలిబలముగ లజయసేనుఁడనువాఁడు - జయసేనునివలనఁ జిత్రసేనుండు పుట్టెను చిత్రసే నునికి సువిక్రముఁడు పుట్టెను సువిక్రముని కొడుకు గంగాధరుఁడని చెప్పఁబడె ను - అతనికే మఱియొకపేరు విద్యావిలాసుఁడనియుఁగలదు - అతనిభార్య వి ద్యావాణియనునది పెనిమిటియందు మిక్కిలిభక్తిగలది- వారుదంపతులు బిడ్డ లులేరని దుఃఖముతోఁగూడినవారై యొకానొకప్పుడు రహస్యముగానిట్లుమా టలాడిరి - బిడ్డలు లేనివారి కెంతధనములుండిన నెంత ధాన్యములుండినను ఫలమేమి- ఆపుత్రునకుఁ గతిలేదనిగదా వేదమువినఁబడుచున్నది- అనియిట్లు వారిరువురు మాటలాడుచుండఁగా మీకుఁ బుత్రసంపత్తికలుగునని యంతరిక్ష మున నొకమాట మాటిమాటికివినఁబడెను- ఈప్రకార మాకాశమునుండి వి నఁబడినమాటనువిని యావిద్యావిలాసుఁడు సంతోషించినవాఁడై యప్పుడుత నభార్యతో నిట్లనెను- ౧౦- ఓ విద్యావాణీ నీవు భయపడకుము ఓ కమలముల వంటికన్నులుగలదానా మనకు బిడ్డకలుగును సందేహములేదు ఆకాశమునుం డి వినఁబడినమాట యెప్పుడును వ్యర్థముకాదు- అనియాప్రకారముచెప్పితన భార్యనూరడించి యాపెతోఁ బోయివచ్చెదనని చెప్పి తీర్థయాత్రకొఱకు బ

త్యక్త్వాచపునఃపునః॥ ౧౨॥ ప్రయయౌ తీర్థయాత్రార్థం విదుషాం అగ్రణీస్తు
సః । బహుద్రవ్యైస్తుసహితః ఉష్ట్రబృందేన వాహితైః॥ ౧౩॥ విద్యా విలా
సనామాసౌ దాసీదాస సమావృతః । వారాణసీ పురీం ప్రాప సర్వాభీష్టప్ర
దాయినీం ॥ ౧౪ ॥ పురోహితేనసహితః సంప్రాప్య మణికర్ణికాం । విధివత్
స్నానమకరోత్ తత్రవై భూరిదక్షిణాం ॥ ౧౫ ॥ పురోహితాయవిప్రేభ్యః వి
ద్వద్భ్యశ్చముదాన్వితః । ప్రదదౌతీర్థవాసిభ్యః వస్త్రాణి వివిధానిచ॥ ౧౬ ॥
విశ్వనాథం విశాలాక్షీం మన్యాన్ దేవాంశ్చ భక్తితః । సంపూజ్య నత్వాస్తు
త్వాచదత్వాచాభరణాన్యథ ॥ ౧౭ ॥ గయాక్షేత్రం సమాసాద్య శ్రాద్ధం కృ
త్వావిధానతః । పితృభ్యః పిండమదదాత్ వటవృక్షస్యమూలతః ॥ ౧౮ ॥ త
తో బదరికారణ్యం సర్వదేవ నమస్కృతం । ఆసాద్యస దదర్శాథ నారాయ
ణమభీష్టదం ॥ ౧౯ ॥ నత్వాస్తుత్వాచ దేవేశం సహేంద్రాదిభిరర్చితం । ది
వ్యంపశుపతీశస్యక్షేత్రం సంప్రయయౌముదా ॥ ౨౦ ॥ తత్రదృష్ట్వా మహాదే
వం సవై పశుపతీశ్వరం। సంపూజ్యవిధివద్భక్త్యా తతోజ్వాలాముఖం యయౌ॥

---

యలువెడలెను - ఇట్లుతర్లి పండితోత్తముఁడైన యావిద్యావిలాసుఁడపరిమిత
మైనద్రవ్యముల నొంటెలమీఁదనెత్తించుకొని కూడదాసికలను దాసులనుదో
డ్కొనిపోయి సమస్తములైన కోరికలనిచ్చునట్టి కాశిచేరెను- ౧౪- చేరి పురో
హితునితోడ మణికర్ణికాఘట్టమునకుఁబోయి యక్కడశాస్త్రోక్తరీతిగా స్నా
నముచేసి సంతోషముతోఁగూడినవాఁడై పురోహితునికొఱకుఁ బండితులైన
బ్రాహ్మణులకొఱకును దీర్థవాసులకొఱకును నానావిధములైన వస్త్రములను
భూరిదక్షిణనిచ్చెను- ౧౬- విశ్వనాథస్వామిని విశాలాక్షిని మఱియు నితర దేవ
తలను దర్శనముచేసికొని భక్తితో నమస్కరించి స్తోత్రములుచేసి యనేకము
లైన యాభరణములనుసమర్పించి గయకుఁబోయి శాస్త్రప్రకారము శ్రా
ద్ధముచేసియక్షయవటముక్రిందఁ బితృదేవతలకుఁ బిండదానముచేసెను - ౧౮ -
అంతనాతఁడు బదరికారణ్యమునకుఁబోయి సకల దేవతలచేత నమస్కరిం
పఁబడినట్టియు సమస్తములైన కోరికలనిచ్చునట్టి నారాయణస్వామిని దర్శ
నముచేసికొనెను - ఇంద్రుడు మొదలగువారిచేతఁ బూజింపఁబడిన యాస్వా
మి వారి నతఁడునమస్కరించి స్తోత్రముచేసినవాఁడై సంతోషముతో దివ్య
మైన పశుపతీశ్వరునిక్షేత్రమునకుఁబోయెను - అక్కడ నతఁడు దొడ్డదేవుఁడై
న యాపశుపతీశ్వరునిఁజూచి భక్తితో శాస్త్రప్రకారము పూజఁజేసి యక్క

౨౧॥ తత్రజ్వాలామయం దేవం సంపూజ్యవిధివత్తతః। శ్రీశైలం సర్వతోభద్రంఆససాదసబుద్ధిమాన్॥ ౨౨॥ భ్రమరాంబాసమాయుక్తం తత్రవై మల్లికార్జునం। సర్వాభీష్టప్రదం దేవం సిద్ధచారణ సేవితం॥ ౨౩॥ విష్ణు బ్రహ్మమహేంద్రాది దేవసంఘై స్సమర్చితం। నారదాద్యైశ్చ గంధర్వైః గీయమానం సవీణకైః॥ ౨౪॥ అప్సరోభిశ్చనాట్యేన తోషయిత్వాముహుర్ముహుః। ప్రార్థితం సర్వజగతాం సృష్టిస్థిత్యంతకారణం ॥ ౨౫ ॥ విద్యావిలాసో విధివత్ సమభ్యర్చ్య ప్రణమ్యచ। స్తుత్వాచ బహుభిఃస్తోత్రైః వెంకటాద్రిమవాపసః॥ ౨౬॥ తత్రచ శ్రీనివాసం సః ఆదిమధ్యాంతవర్జితం। శ్రీదేవ్యాసహితం దేవం మహేంద్రాదిభిరర్చితం ॥ ౨౭ ॥ సంపూజ్య విధివద్భక్త్యా నత్వాస్తుత్వాముదాన్వితః। కాంచీక్షేత్రం యయౌశ్రీమాన్ దేవగంధర్వసేవితం॥ ౨౮॥ ఏకామ్రేశంచ కామాక్షీం తత్రదృష్ట్వాముదాన్వితః। సంపూజ్య విధివద్దేవం నత్వాస్తుత్వాచ భక్తితః॥ ౨౯॥ తథా వరదరాజంచ శ్రీ

---

డనుండి జ్వాలాముఖికిఁబోయెను - ౨౧- అచ్చట జ్వాలారూపుఁడైన దేవునిఁ బూజించి యచ్చటనుండి బుద్ధిమంతుఁడై నయావిద్యావిలాసుఁ డంతటమంగళకరమైన శ్రీశైలమునకుఁబోయెను - అక్కడ భ్రమరాంబతోఁగూడికొన్నట్టియు సమస్తములైన కోరికలనొసంగునట్టియు సిద్ధులచేతను జారణులచేతను సేవింపఁబడినట్టియు విష్ణువు- బ్రహ్మ- ఇంద్రుఁడు మొదలుగాఁగల దేవతలచేతఁ బూజింపఁ బడినట్టియు - నారదులు మొదలగువారిచేతను గంధర్వులచేతను వీణలెత్తుకొని పాడఁబడుచున్నట్టియు - అప్సరసలచేతఁ బలుమాఱాటచేత సంతోషపఱిచి ప్రార్థింపఁబడినట్టియు- సమస్తలోకముల సృష్టిస్థితిలయములకుఁ గారణమైనట్టి మల్లికార్జునస్వామి నావిద్యావిలాసుఁడు శాస్త్రోక్తరీతిగాఁ బూజించినమస్కరించి యనేకములయిన స్తోత్రములతోఁబొగడి యక్కడనుండి వెంకటాద్రికిఁబోయెను- ౨౬- పోయి యచ్చట నాదిమధ్యాంతములులేని యట్టియు మహాలక్ష్మితోఁగూడినవాఁడై మహేంద్రుఁడు మొదలగువారిచేతఁ బూజింపఁబడిన శ్రీనివాసుని భక్తితో యథాశాస్త్రీయముగాఁ బూజించి నమస్కారముచేసి స్తోత్రముచేసి సంతోషముతోఁ గూడినవాఁడై దేవతలచేతను గంధర్వులచేతను గొలువఁబడిన కాంచీక్షేత్రమునకుఁబోయి యక్కడ నేకామ్రేశ్వరునిఁగామాక్షినిఁజూచి సంతోషించి క్రమప్రకారము బూజించి భక్తితోనమస్కారముచేసి స్తోత్రముచేసినవాఁడై యట్లే మహాలక్ష్మితోఁగూడిన వరదరాజ

దేవ్యా సహితం విభుం । సంపూజ్య విధివద్దేవం స్తుత్వాసత్వా ముహుర్ముహుః ॥ ౩౦ ॥ చిదంబరం మహాక్షేత్రం సర్వదేవ నమస్కృతం । యత్రదృష్టం సమభవత్ శివస్య గిరిజాపతేః॥ ౩౧॥ ఆకాశరూపిణం దేవం శివం భక్తార్తిభంజనం । తత్రదృష్ట్వాతు సంపూజ్య నత్వాస్తుత్వాచభక్తితః॥ ౩౨॥ అరుణాద్రింయయావిద్వాన్ సర్వేషాం మోక్షదాయకం । తత్రదృష్ట్వామహేశానం సంపూజ్య విధివత్తతః॥ ౩౩॥ వైద్యనాథ మహాక్షేత్రం మాయూరక్షేత్రమేవచ । కుంభకోణం మహాక్షేత్రం సర్వక్షేత్రోత్తమం పునః॥ ౩౪॥ తత్రతత్రస్థితాన్ దేవాన్ సంపూజ్యవిధివత్ తతః । శ్రీరంగక్షేత్ర మతులం ఆససాదమనోహరం॥ ౩౫॥ విమానం ప్రణవాకారం వేదశృంగం మహాద్భుతం । తత్ర దృష్ట్వా నమస్కృత్య సంపూజ్య విధివత్తతః ॥ ౩౬ ॥ పరవాసుదేవ మమలం శ్రీభూనీలా సమన్వితం । శ్రీరంగేశం సమాలోక్య సంపూజ్య విధివత్పునః॥ ౩౭॥ స్తుత్వాచ బహుభిఃస్తోత్రైః నత్వాచైవ ముహుర్ముహుః । కావేరీం చైవ సంపూజ్య యయౌ పాండ్యకవాటకం॥ ౩౮॥ మధురా తత్రనగరీ

---

స్వామిని యథావిధిగా బూజించి నమస్కరించి స్తోత్రముచేసి యక్కడనుండి సకల దేవతల చేతను సేవింపఁబడిన పార్వతీపతియొక్క క్షేత్రమైనచిదంబరమునకుఁబోయి యక్కడ భక్తుల కష్టములనన్నిటిని బాపునట్టి యాకాశరూపుఁడైన స్వామివారిని యథావిధిగాఁబూజించి భక్తితో నమస్కరించిస్తోత్రములుచేసి యక్కడనుండి యరుణాచలస్వామి క్షేత్రమునకుఁబోయెను పోయిపండితుఁడైన యావిద్యావిలాసుఁడు సమస్తజనులకు మోక్షమిచ్చునట్టి యక్కడనున్న సాంబశివునిఁజూచి యథావిధిగాఁ బూజించి యక్కడనుండి వైద్యనాథక్షేత్రమునకు మాయూరక్షేత్రమునకు సకల క్షేత్రములలో నుత్తమమైన కుంభకోణక్షేత్రమునకుఁ బోయి యక్కడక్కడనుండు స్వాములను బూజించియంతటనీడులేనియట్టియు మనోహరమైన శ్రీరంగక్షేత్రమునుబొందెను - ౩౫ - పొంది యక్కడ నోంకారరూపమైన విమానమును వేదస్వరూపమైన శిఖరమునుజూచి నమస్కరించి శాస్త్రోక్త ప్రకారము పూజించి యక్కడ శ్రీదేవి భూదేవి నీలాదేవి యీముగ్గురితోఁ గూడుకొనియున్న నిర్మలస్వరూపుఁడైన పరవాసుదేవమూర్తి దర్శనముచేసి క్రమప్రకారము పూజచేసి యనేకములైన స్తోత్రములుచెప్పిపొగడి పెక్కుమారులుమ్రొక్కి కావేరీనదినిఁ బూజించి పాండ్యరాజుపట్టణము కోటతలుపును జూడఁబోయెను- ౩౭ - అక్కడ

దివ్యమంటపశోభితా । దివ్యగోపుర సంయుక్తా సప్త ప్రాకార వేష్టితా॥ ౩౯॥
తత్రదృష్ట్వా సుందరేశం ప్రణతార్తిహరం విభుం । మీనాక్షీరమణం శంభుం
కదంబవననాయకం॥ ౪౦॥ సంపూజ్య విధివద్భక్త్యా ప్రణమ్యచ ముహుర్ముహుః । విద్యావిలాస స్తుష్టావ స్తోత్రైః సర్వ వరప్రదం॥ ౪౧॥ నమశ్శివాయ
సాంబాయ సర్వపాపహరాయచ । నమోవేదాంత వాచ్యాయ నమస్తే దేవ
సత్తమ ॥ ౪౨ ॥ నమో భగవతే దేవ నమస్త్రైలోక్యపావన । నమోవే
దాంతవేద్యాయ నమస్తే భక్తవత్సల॥ ౪౩॥ మీనాక్షీ పతయేతుభ్యం నమో
స్తుశివసర్వదా । మృత్యుంజయాయ రుద్రాయ కాలకాలాయతేనమః॥ ౪౪॥
విశ్వేశ్వర విరూపాక్ష సర్వజ్ఞ పరమేశ్వర । సుందరేశ మహాభాగ భక్తపాల
నమోస్తుతే॥ ౪౫॥ నీలకంఠ దయాసింధో భక్తం మాం పాలయప్రభో । ఇతి
స్తుత్వా సుందరేశం యయౌ రామేశ్వరం తతః॥ ౪౬॥ తత్ర స్నాత్వా ధను

---

మధురాపట్టణము దివ్యములైన మంటపముల చేతనొప్పెడిది యాపట్టణపుద్వారములు మిక్కిలి సొగసుగా నుండును దానిచుట్టు నేడుప్రాకారములుండును - అక్కడఁ గదంబవనమునకునాయకుఁడై యావిర్భవించి భక్తుల బాధలనెల్లఁ బోగొట్టుచునుండెడి మీనాక్షీపతియైన సుందరేశస్వామినిఁజూచి విధ్యుక్తప్రకారముపూజించి భక్తితోఁ బెక్కుమాఱులునమస్కరించి యావిద్యావిలాసుఁడు సమస్తవరములనిచ్చునట్టి యాసుందరేశ్వరుని స్తోత్రములతోఁ బొగడెను- సమస్తపాపములఁ బోఁగొట్టునట్టి సాంబశివునికొఱకు నమస్కారము - వేదాంతముల కర్థమైన వానికొఱకు నమస్కారము - దేవతలలో శ్రేష్ఠుఁడా నీకొఱకు నమస్కారము - దేవరా భగవంతుఁడవైన నీకొఱకునమస్కారము- మూఁడు లోకములఁ బరిశుద్ధములుగాఁ జేయునట్టిస్వామీ నీకొఱకునమస్కారము - వేదాంతములచేత నెఱుఁగఁదగిన నీకొఱకునమస్కారము - భక్తులయందుఁ బ్రేమగల స్వామి నీకొఱకునమస్కారము- ౪౩- శివుఁడా మీనాక్షికిఁ బెనిమిటివైన నీకొఱకెల్లపుడునమస్కారమగుగాక మృత్యువునుజయించినట్టియుఁ గాలమునకుఁ గాలమైనట్టి రుద్రుఁడవైన నీకొఱకు నమస్కారము - ౪౪ - సర్వమునకీశ్వరుఁడా మూఁడు కన్నులుగలవాఁడా అన్నియుఁ దెలిసినవాఁడా పరమేశ్వరుఁడా మహానుభావుఁడవయిన సుందరేశ్వరుఁడా భక్తులను గాపాడువాఁడా నీకొఱకు నమస్కారమగుఁగాక నల్లని కంఠముగలయట్టియు దయాసముద్రుఁడవైన నమోస్వామీ భక్తుఁడనైన నన్నుఁ బాలింపుము- అనియిట్లాసుందరే

ష్కోట్యాం రామలింగం మహేశ్వరం । సంపూజ్య విధివద్భక్త్యా తథా పర్వ వర్ధనీం॥ ౪౭ ॥ దేవీంప్రణమ్యస్తుత్వాచ రామాంశంభోరభీష్టదాం । సర్వ లోకస్య జననీంతతోనంతపురంయయౌ ॥ ౪౮ ॥ తత్ర నారాయణం దేవం శ్రీభూనీలాదిసంయుతం । శయానం శేషపర్యంకే పద్మనాభం చతుర్భుజం । ౪౯ ॥ స్వనాభి కమలోత్పన్న చతురాననసేవితం । సంపూజ్య విధివద్భక్త్యా స్తుత్వానత్వా ముహుర్ముహుః॥ ౫౦॥ తతఃకల్యాణ నిలయం ఆమోదపుర మాత్మనః । పునర్విద్యా విలాసస్స ఆససాదసమృద్ధిమత్ ॥ ౫౧॥ తతోవేశ్మ సమాసాద్య స్వకీయం విప్రపుంగవః । ధనధాన్యసమాకీర్ణం ముముదే శ్రాంతిహారకం॥ ౫౨ ॥ సమాగతంతు సంప్రేక్ష్య పతిం పద్మాయతేక్షణా । విద్యావాణీ ముదాయుక్తా వవందే మందహాసినీ॥ ౫౩॥ పప్రచ్ఛకుశలందేవీ భర్తారం మత్తకాశినీ । అహోపతే స్వాగతంతే కుశలం హ్యపితేప్రభో॥ ౫౪॥ కా

---

శ్వరుని స్తోత్రముచేసి రామేశ్వరమునకుఁ బోయెను - ౪౭ - పోయి యక్కడ ధనుష్కోటియందు స్నానముచేసి రామలింగస్వామినిఁ బర్వత వర్ధనిని యథావిధిగాఁ భక్తితోఁ బూజించి సాంబమూర్తి కిష్టముల నెల్లఁదీర్చునట్టియు సమస్త లోకములను బుట్టించునదియైన యాయమ్మవారికి భక్తితో నమస్కారముచేసి యామెనుబొగడి యక్కడనుండి యనంతశయనమునకుఁబోయెను - ౪౮- పోయి యక్కడ శ్రీదేవిభూదేవినీలాదేవి మొదలగువారితోడ సంనిధానముచేసి యాదిశేషునిమీఁదఁ బరుండి యున్నట్టియు నాలుగు భుజములుగల యట్టియుఁ దననాభికమలమందుఁబుట్టిన బ్రహ్మచేతఁ గొలువఁబడినట్టి పద్మనాభస్వామిని శాస్త్ర ప్రకారము పూజచేసి పలుమాఱు స్తుతులును నమస్కారములునుజేసి యక్కడనుండి సమస్తములైన శుభముల కాస్పదమైనట్టియు సమస్త వస్తుసమృద్ధిగలదైన తన యామోదపట్టణమున కావిద్యావిలాసుఁడు మరలవచ్చెను - ౫౧ - వచ్చి యాబ్రాహ్మణోత్తముఁడు ధనములచేతను ధాన్యములచేతను నిండి యున్నట్టియు శ్రమనివారకమైనట్టి తనయింటినిబొంది సంతోషించెను- అప్పుడు కమలములవంటి విశాలములైనకన్నులుగల విద్యావాణితీర్థయాత్రచేసివచ్చిన తనపెనిమిటినిజూచి సంతోషముతోఁగూడినదై చిరునగవునగుచు నమస్కారముచేసెను ఉత్తమస్త్రీయైన యావిద్యావాణి తనపెనిమిటిని క్షేమ సమాచారముల నడిగెను - మీరుచక్కఁగాఁ దీర్థయాత్రలుచేసివచ్చితిరా పోయినతావులలోమీకు క్షేమమా తామేయేక్షేత్రముల నే

నిక్షేత్రాణిదృష్టాని కానితీర్థానిహేపతే । సేవితానిత్వయావిద్వన్ కింఫలం తేభవత్ప్రియ॥ ౫౫॥ బ్రూహిహి సర్వాణి తాన్యద్య సాదరం కరుణానిధే । ఇతి పృష్టస్తయాదేవ్యా భార్యయా ప్రీతిపూర్వకం॥ ౫౬॥ విద్యావిలాసస్తాం ప్రాజ్ఞాం అబ్రవీన్మధురంవచః । పతివ్రతేమహాభాగే సావధాన మనాశ్శృణు॥ ౫౭॥ యానియానీహదృష్టాని సేవితానిమయాప్రియే । భూతలేతానిసర్వాణి వదామితవసాం ప్రతం॥ ౫౮॥ గంగాద్యాః సరితస్సర్వాః మయా స్నాతా మహామతే । శివక్షేత్రాణి సర్వాణి కాశ్యాదీని చయానివై॥ ౫౯॥ విష్ణుక్షేత్రాణిసర్వాణి శ్రీరంగాద్యానియానివై । తానిసర్వాణ్యపిమయా దృష్టానికమలేక్షణే॥ ౬౦॥ ఇతిబ్రువంతం భర్తారం మాలిలింగే ముహుర్ముహుః । విద్యావాణీతదోవాచ పతివ్రతపరాయణా॥ ౬౧॥ కపిలేశో మహాదేవః భక్తసంతాసదాయకః । సంపూజ్యతాం ప్రతిదినం త్వయాస కరుణానిధిః॥ ౬౨॥ ఇత్యుక్తం వచనం పత్న్యాశ్రుత్వాసా బ్రాహ్మణోత్తమః । తథైవపూజయామాస కపిలేశ్వరమిష్టదం ॥ ౬౩ ॥ ఋతుస్నాతాం సతీభార్యాం ఏకదా బ్రాహ్మణోత్తమః । కపిలేశం హృదిధ్యాయన్ అవాపానంద మూర్ఛితః॥ ౬౪॥ విద్యా

---

యేతీర్థములనుజూచి సేవించితిరి - మీకేమిఫలములభించెను దయానిధీ వాని నన్నిటిని దయతో నాకుఁ జెప్పుమయా అనియిట్లాభార్యచేతఁ బ్రేమముతో నడుగఁబడినవాఁడై విద్యావిలాసుఁడు తెలిసినదైన యాభార్యనుగూర్చి మనస్సున కిష్టమైనమాటచెప్పెను మిక్కిలి యదృష్టవంతురాలైన యోపతివ్రతాపరాకులేకవినుము నేనీ భూమియం దేయేక్షేత్రములఁజూచి సేవించితినో వానినన్నిటినిప్పుడు నీకుఁ జెప్పెదను- ౫౮- ఓ మిక్కిలి బుద్ధిగలదానా గంగమొదలైన నదులేవియున్నవో వానియందంతట నేను స్నానముచేసితిని కాశిమొదలైన శివక్షేత్రములను శ్రీరంగముమొదలైన విష్ణుక్షేత్రములనన్నిటినిజూచితినో కమలములవంటి కన్నులుగలదానా - ౬౦ - ఈప్రకారము చెప్పుచున్న తనపెనిమిటినిఁ బెక్కుమాఱులాలింగనముచేసికొని పతివ్రతయైన యావిద్యావాణి యప్పుడిట్లనెను- భక్తులకు సంతానమునిచ్చునట్టియు దయానిధియునైన కపిలేశ్వరుని నీవు నిత్యము పూజింపుము - అని యిట్లు తనభార్యచెప్పిన మాటవిని బ్రాహ్మణశ్రేష్ఠుఁడైన యతఁడు నిత్యమట్లే కోరిన కోరికల నిచ్చునట్టి యాకపిలేశ్వరు నర్చించుచువచ్చెను - తరువాత నొకకొన్నిదినములకు నాబ్రాహ్మణుఁడు ఋతుస్నానముచేసిన తన భార్యను గపిలేశ్వరుని ధ్యానముచేయు

వాణీత తో దేవీ కపిలేశ ప్రసాదతః । అవాప్యగర్భం భర్తారం హర్షయు
క్తంచకారసా॥ ౬౫॥ ఉదరే వవృధే తస్యాః గర్భో నవవయోదయః । క్రమశః
పూర్ణతాం ప్రాపశుక్లపక్ష ఇవోడురాట్॥ ౬౬॥ తతస్సా సుషువే దేవీ కుమా
రం సూర్యవర్చసం । దశమేమాసి సంజాతే స్వభర్త్రా సదృశం గుణైః॥ ౬౭॥
తతోవిద్యా విలాసస్సః స్నాతో హర్ష సమన్వితః । పురోహితం పురస్కృ
త్య శంభుదేవం మహామతిం ॥ ౬౮ ॥ పుత్రజన్మోత్సవదినే ధనానిసు బహూని
చ । తథైవ దివ్యరత్నాని బ్రాహ్మణేభ్యో దదౌ భృశం॥ ౬౯॥ స్వబంధుభ్యః
తథా ప్రాదాత్ ధనరత్నానిసాదరం ।అనర్ఘాణి తథాతేభ్యః వస్త్రాణివివిధా
నిచ॥ ౭౦॥ తత ఏకాదశదినే ఆహూయ ద్విజపుంగవాన్ । పుణ్యాహం వాచ
యిత్వాసః పుత్రదార సమన్వితః ॥ ౭౧ ॥ సుతస్య నామకరణం చక్రే వేదో
క్తమార్గతః । విప్రేభ్యః ప్రదదౌతేభ్యః ధనరత్నానివై తదా॥ ౭౨॥ స్వ
బంధుభ్యః తథా ప్రాదాత్ క్షౌమాణి వివిధానిచ । గాయంతీభ్యశ్చ కల్యా
ణం యోషిద్భ్యఃప్రీతిపూర్వకం॥ ౭౩॥ దదౌదివ్యానివస్త్రాణి భూషణానితథై

---

చు నానందముతోఁ బొందెను- అంతనావిద్యావాణి కపిలేశ్వరుని యనుగ్రహ
మువలన గర్భముధరించి భర్తకానందము కలుగఁజేసెను- ౬౫- ఆగర్భ మా
పెకడుపున నప్పటప్పటికి వృద్ధినొందుచు శుక్లపక్షచంద్రుఁడువలెఁ గ్రమక్రమ
ముగాఁ బూర్ణమాయెను - పిమ్మటఁ బదవనెలరాఁగానే యామెసూర్యునితో
సమమైన వర్చస్సుగలయట్టియుఁ దనపెనిమిటివంటి గుణములుగల కొడుకు
నుగనెను - అంతనావిద్యావిలాసుఁడుస్నానముచేసిసంతోషముతోఁ దనపురో
హితుఁడైన మిక్కిలి బుద్ధిశాలియగు శంభుదేవునిఁ బురస్కరించుకొని పుత్ర
జన్మోత్సవమందుఁ బ్రాహ్మణులకు మిక్కిలి ద్రవ్యములను రత్నముల నిచ్చె
ను - తనబంధువులకందఱకు నెలపొడుగుపుట్టములును కనకములును రత్నము
లునిచ్చెను - ౭౦ - పిమ్మట నతఁడు పదునొకండవ దినమందు బ్రాహ్మణోత్త
ములనుబిలిచి కొడుకుతోను భార్యతోనుగూడినవాఁడై పుణ్యాహవాచనము
చేయించి వేదోక్త ప్రకారము కొడుకునకు నామకరణము చేసెను అప్పుడా
బ్రాహ్మణులకు ధనములు రత్నములు నిచ్చెను - అప్పుడతఁడు తనబంధువులకు
ను మంగళములుపాడుచున్న ముత్తైదువలకును బ్రీతితోఁ బలుతెఱఁగులవస్త్ర
ములనిచ్చెను - మఱియునాముత్తైదువలకు సొమ్ములును బండ్లును బువ్వులును
దాంబూలములునిచ్చెను - తామరరేకులవంటి కన్నులుగల యాబిడ్డఁడు తన

వచ । తాంబూల ఫలపుష్పాది సర్వం తాభ్యః ప్రదత్తవాన్ ॥ ౨౪॥ పిత్రా కృతేననామ్నా సా దేవశాలీతి వై భువి । విఖ్యాతః శిశురత్యంతం వవృధే కమలేక్షణః॥ ౨౫॥ ఏవం ప్రవర్ధమానస్య స్వపుత్రస్య మహామతేః । విద్యావిలాసః సంవీక్ష్య గర్భాష్టమముపాగతం ॥ ౨౬ ॥ సచకారోపనయనం వేదోక్త విధినాతదా । కారయామాస పుత్రస్య శివదీక్షా మనంతరం॥ ౨౭॥ పంచాక్షరీమహామంత్రస్యోపదేశంచ తస్య వై । చకార విధివత్ప్రాజ్ఞః స్వపుత్రస్య ససాదరం॥ ౨౮॥ విద్యావిలాసో వ్యతిమాన్ తత స్తత్రహ్యనేహసి । స్వపుత్రస్యాభివృద్ధ్యర్థం దానానిబహుధాకరోత్ ॥ ౨౯ ॥ గోదానం భూమిదానంచ కన్యాదానమనుత్తమం । గజదానంచాశ్వదానం అన్యానివివిధానిచ॥ ౩౦॥ విద్వద్భ్యశ్చైవ విప్రేభ్యః బంధుభ్యశ్చ ముదాన్వితః । నానా దేశ నివాసిభ్యః బ్రహ్మవిద్భ్య స్తథై వచ॥ ౩౧॥ ఏవం కృత్వోపనయనం శివదీక్షాంచ తస్య వై । పంచాక్షరోపదేశంచ స్వసుతస్యదయాన్వితః॥ ౩౨॥ విద్యావిలాస స్స్వాత్మానం కృతకృత్యమమన్యత । భార్యయా సహితశ్చాసౌ వవాప సుఖముత్తమం॥

---

తండ్రి పెట్టిన పేరుచేత దేవశాలియని భూమియందుఁ బ్రసిద్ధికెక్కి వృద్ధిఁబొందెను - ౨౫ - ఇట్లు పెరుగుచున్నట్టియు మిక్కిలిబుద్ధిశాలియైన తనకొడుకునకు గర్భాష్టమము వచ్చిన దాని నావిద్యావిలాసుఁడుచూచి యప్పుడువేదమందుఁ జెప్పినరీతిగా నుపనయనముచేసెను - పిమ్మటనాకొడుకునకు శివదీక్షను జేయించెను - ౨౭ - అప్పుడతఁడు తనకొడుకైన యాదేవశాలికిఁ బ్రీతితో శాస్త్రవిధి ప్రకారము పంచాక్షరీ మంత్రోపదేశముచేసెను - ఆసమయమునఁ దేజస్సంపన్నుఁడైన యావిద్యావిలాసుఁడు తనకొడుకున కభివృద్ధికొఱకు ననేక విధముల దానములుచేసెను- గోదానమును భూదానమును మిక్కిలియుత్తమమైనకన్యాదానమునుగజదానము నశ్వదానమును మఱియునేకములైన దానములు పండితులైన బ్రాహ్మణులకొఱకును బంధువులకొఱకును బలుదేశములలో సంచరించువారికొఱకును బ్రహ్మవేత్తలకొఱకును సంతోషముతోనిచ్చెను - ౩౧ - ఈప్రకారమా విద్యావిలాసుఁడు తనకొడుకునకు దయతో నుపనయనమును బంచాక్షరోపదేశమునుజేసి తాను గృతకృత్యుఁడనైతినని భార్యతో మిక్కిలి సుఖమును బొందుచుండెను - పిమ్మట మిక్కిలి బుద్ధిశాలియైన యావిద్యావిలాసునికొడుకు దేవశాలి బహుకాలము గురుకులమందుండెను - నాలుగువేదములను వానియంగములను మీమాంసనున్యాయశాస్త్రమునుధ

౮౩॥ తతోవిద్యావిలాసస్య తనయస్తుమహామతిః । దేవశాలీచిరంకాలం అవస త్సగురోఃకులే॥ ౮౪॥ జగ్రాహ చతురోవేదాన్ సాంగాన్ గురుముఖాత్తథా। మీమాంసాం న్యాయశాస్త్రంచ ధర్మశాస్త్రాణి సాదరం॥ ౮౫॥ అష్టాదశపు రాణాని తథోపనిషదస్సుధీః । విద్యాశ్చాన్యా మహాభాగః సజగ్రాహగురోర్ము ఖాత్ ॥ ౮౬॥ ఏవం గురుముఖాత్సర్వాః విద్యాః ప్రాప్య మహామతిః । గురో రనుజ్ఞాం సంప్రాప్య విరక్తః సంచచారసః॥ ౮౭॥ శైవానిచ పురాణాని దేవశా లీమహామతిః । సచకారాగమాంశ్చైవ లోకానాం హితకారణాత్ ॥ ౮౮॥ ససంచరన్ మహీధ్రాణాం గుహాసుచ వనేషుచ । కందమూల ఫలాహారః వాయుభక్షోజితేంద్రియః ॥ ౮౯ ॥ అష్టాంగయోగ మభ్యస్యన్ శివం ధ్యా యన్ సవాహృది । ఋషీంద్రైః యోగమార్గజ్ఞైః పూజ్యమానో ముహు ర్ముహుః॥ ౯౦॥ ఏవం నివసతస్తస్య నిర్వైరస్య మహాత్మనః । తపసాజ్వలి తస్యాభూత్ లోకేకీర్తిర్మహత్తరా ॥ ౯౧ ॥ ఏకదా దేవశాలీస యయౌ కల్యాణపట్టణం । యత్రరాజా శూరమానీ వర్తతే వీరవల్లభః॥ ౯౨॥ కృష్ణా జినధర శ్రీమాన్ స్వర్ణ యజ్ఞోపవీతవాన్ । దివ్య కౌపీన విలసత్ కటీతట

---

ర్మశాస్త్రమును బ్రీతితోగురుముఖమువలన గ్రహించెను - మిక్కిలి యదృష్ట శాలియయిన యతఁడష్టాదశపురాణముల నుపనిషత్తులను మఱియుఁ బెక్కు విద్యలను గురుముఖమువలన గ్రహించెను - ౮౬ - ఈప్రకారము గురుముఖ మువలననెల్లవిద్యలనుగ్రహించి మిక్కిలిబుద్ధిమంతుఁడైన యాదేవశాలి గురు వు ననుజ్ఞనొంది విరక్తుడై సంచరించుచుండెను - తరువాత నాదేవశాలి లో కముల క్షేమమున కనేకములైన శైవపురాణములను శైవాగమములను జే సెను- అతఁడుకొండగుహలలోను వనములలోనుసంచరించుచుఁ గందములను వేళ్లనుభక్షించుచునింద్రియములనిగ్రహించియష్టాంగయోగమభ్యసించుచు శివునిమనస్సున ధ్యానముచేయుచు యోగమార్గము నెఱిఁగిన ఋషిశ్రేష్ఠుల చేతఁ బలుమాఱు బూజింపఁబడుచుండెను- ౯౦- ఈప్రకారము కామక్రోధా దులనెల్లవిడిచియున్నట్టియుఁ దపస్సుచేతఁ బ్రకాశించుచున్న యామహానుభా వునకు లోకమందు మిక్కిలి కీర్తిగలిగెను - ఒకానొకప్పు డాదేవశాలి వీరశ్రే ష్ఠుఁడైన శూరమానియను రాజుండునట్టి కల్యాణపట్టణమునకుఁబోయెను- కృ ష్ణాజినమును ధరించినట్టియు సకల సంపదలుగలయట్టియు బంగారుజన్నిదము గలయట్టియు మంచిగోచితోఁగూడిన మొలగలయట్టియు రెండుకాళ్లకుబావు

సుశోభితః॥ ౯౩॥ పాదుకాద్వయసంశోభి పాదపద్మ విరాజితః । పంకజాక్షో
దధానస్స్రక్ పుస్తకం హస్తభూషణం॥ ౯౪॥ భస్మోద్ధూళితసర్వాంగః రుద్రాక్షా
భరణాన్వితః । కర్ణద్వయ ప్రోల్లసద్భ్యాం కుండలాభ్యాం సుశోభితః॥ ౯౫॥
యస్య దర్శన మాత్రేణ సర్వే స్థావరజంగమాః । అపాసర్పన్ భీత భీతా
బ్రాహ్మణస్య మహౌజసః॥ ౯౬॥ స కల్యాణపురం ప్రాప్య జైన బృందసమా
కులం । భూపం జైన మతస్థంచసమాలోక్య వ్యచింతయత్ ॥ ౯౭ ॥ కథ
మేతజ్జైనమతం నాశయేయం మహీతలే । ప్రవృద్ధమితి సంచింత్య వదన్ శివ
కథాముహుః॥ ౯౮॥ జైనానాం బోధయామాస శివతత్వ ముదారధీః । సర్వ
సౌఖ్య ప్రదం నౄణాం సర్వ సంపత్ప్రదాయకం ॥ ౯౯ ॥ తేన సంబోధితా
స్సర్వే జైనాస్తే దేవశాలినా । స్వమతం సంపరిత్యజ్య శివదీక్షాపరాయణాః॥
౧౦౦॥ తమేవ సద్గురుం ప్రాప్య తత్కటాక్ష పవిత్రితాః । తేనోపదిష్టం విధి
వత్ జపంతో మంత్రరాజకం ॥ ౧౦౧ ॥ పంచాక్షరం శంభుపూజా తత్పరా
అభవన్ భువి । ఏవం జైనాః కృతాస్తేన శివభక్తామహీతలే॥ ౧౦౨॥ సర్వే

---

కోళ్లు దొడిగినట్టియుఁ గమలములవంటి కన్నులుగలయట్టియు హస్తాలంకార
మయినపుస్తకమునుజేతఁబూనినట్టియు భస్మమునుసర్వాంగములయందుఁబూ
సికొన్నట్టియు రుద్రాక్షులదండలు ధరించినట్టియుఁ జెవులయందుఁ గుండలము
లుధరించియున్నట్టి యాదేవశాలిని జూడఁగానే యతఁడు మహా తేజస్సంప
న్నుఁడుగనుక స్థావరములునుజంగమములును భయపడిదొలఁగిపోవుచుండెను-
౯౬-అట్టియాదేవశాలి జైనులునిండియున్న కల్యాణపురమునఁబ్రవేశించి జై
నమతమందున్న యాపట్టణపురాజునుజూచి యిట్లనియాలోచించెను - భూమి
యందుఁ బెరిగిన యీజైనమతము నెట్లు నశింపఁజేయుదునని చింతించి మాటి
మాటికి శివకథను జెప్పుచు నరులకు సకలసౌఖ్యములను సకలసంపదలనుగలు
గఁజేయునట్టి శివతత్వము నాజైనుల కుపదేశించెను - అప్పుడా జైనులందఱు
నాదేవశాలిచేత బోధింపఁబడినవారై తమ మతమువిడిచి శైవదీక్షయందాస
క్తులై యా దేవశాలినె శ్రేష్ఠగురువునుగాఁబొంది యతని కటాక్షముచేతఁ బ
రిశుద్ధులై యతనిచేత నుపదేశింపఁబడిన మంత్రరాజమైన పంచాక్షరీమంత్రము
ను విధిప్రకారము జపముచేయుచు శివపూజయందాసక్తులైరి - ఈ ప్రకార
మాదేవశాలి భూమియందున్న జైనుల నందఱను శివభక్తులుగాఁ జేసెను -
౧౦౨- ఆపట్టణముననున్న వారందఱా దేవశాలి నితఁడు సాక్షాత్ శంకరా

జనా స్తత్రపురే ప్రావర్తన్ దేవశాలినం । అయం హి శంకరస్సాక్షాత్ అవతీ ర్ణోఽమహీతలే॥ ౧౦౩॥ ఏకదారాజపుత్రోఽపి జగద్దేవః ప్రతాపవాన్ । తపోని ష్ఠైస్సేవ్యమానం ప్రాప్యతం దేవశాలినం ॥ ౧౦౪ ॥ ప్రణమ్యచ ముహుర్భ క్త్యా ప్రార్థయామాస సాదరం । యీశ్వరః సర్వలోకానాం గురుస్త్వం పరమోమతః॥ ౧౦౫॥ పంచాక్షరం మంత్రరాజం మమోపదిశసాదరం । ఇ తిసంప్రార్థితస్తేన రాజపుత్రేణధీమతా ॥ ౧౦౬ ॥ దేవశాలీ మహాజ్ఞానీ శివ దీక్షాం విధాయవై । తస్య పంచాక్షరం మంత్ర ముపాదిశదభీష్టదం॥ ౧౦౭॥ తేనోపదిష్టం మతంతం జగద్దేవస్సదాజపన్ । శివధ్యానపరో భూత్వా బభూ వవిజితేంద్రియః ॥ ౧౦౮ ॥ జైనసంఘం పరిత్యజ్య శివభక్త సమన్వితః । శివ పూజాసమాసక్తః బభూవ భువిసర్వదా ॥ ౧౦౯ ॥ తథాభూతం రాజపుత్రం విలోక్యసచివాస్తదా । రాజ్ఞే నివేదయామాసుః తస్యపుత్రస్యచేష్టితం॥ ౧౧౦॥ అహోరాజన్ జగద్దేవః తవపుత్రో మహామతిః । అస్మన్మతం పరిత్యజ్య మతం శైవముపాశ్రితః ॥ ౧౧౧ ॥ ఉపదేశంస సంప్రాప్య దేవశాలి సకాశ

---

వతారమేయని చెప్పుచుండిరి - ఇట్లుండఁగా నొకప్పుడారాజుకొడుకు ప్రతా పవంతుఁడైన జగద్దేవుఁడనువాఁడు తపోనిష్ఠులచేత సేవింపఁబడుచున్న యాదే వశాలిదగ్గిరికివచ్చి పలుమారులు భక్తితో మ్రొక్కి ప్రీతితో నిట్లడిగెను - నీవు స మస్తజనులకు నీశ్వరుడవును శ్రేష్ఠుఁడవైన గురువునుగా నంగీకృతుఁడవు - ౧౦౫- మంత్రరాజమైన పంచాక్షరీమంత్రమును నాకుఁబ్రీతితో నుపదేశింపు ము - అనియిట్లుబుద్ధిశాలియైన యారాజుకొడుకుచేతఁ బ్రార్థింపఁబడిన వా డై మిక్కిలిజ్ఞానవంతుఁడైన యాదేవశాలి యతనికిశివదీక్షచేయించి కోరికల నెల్ల సిద్ధింపఁజేసెడి పంచాక్షరీమంత్రము నతనికుపదేశించెను - అతనిచేత ను పదేశింపఁబడిన యా మంత్రమును జగద్దేవుఁ డెల్లప్పుడు జపముచేయుచు శివ ధ్యానమం దాసక్తుఁడై జితేంద్రియుఁ డాయెను - జైనమతమందుఁ బ్రవేశిం చియున్నవారి నందఱినువిడిచి శివభక్తులతోఁ గూడినవాఁడై భూమియందెల్ల ప్పుడుశివపూజలను వృద్ధిబొందించుచు వచ్చెను - అప్పుడారాజు మంత్రులత నినడవడిచూచి యాసమాచారమునంతను రాజుకొడుకుఁజెప్పిరి - ౧౧౦ - ఓ హోరాజామిక్కిలిబుద్ధిశాలియయిన మీకొడుకుజగద్దేవుడు మనమతమును విడిచి శైవమతమునుబట్టెను - అతఁడు దేవశాలిదగ్గిరఁ బంచాక్షరమంత్రము నుపదేశముచేయించుకొని దాని జపించుచు శివపూజయం దాసక్తుఁడై యెల్ల

తః । జపన్ పంచాక్షరంమంత్రం శివపూజా పరాయణః॥ ౧౧౨॥ శివధ్యానప రోనిత్యం శివభక్తైశ్చసంగతః । ఇత్థంహివర్తతేనిత్యం పిబన్ శివకథామృతం॥ ౧౧౩ ॥ ఇత్యుక్తం మంత్రిభీరాజా శ్రుత్వా పుత్రస్యచేష్టితం । ఉత్సారయామాసత దా నగరాద్దేవశాలినం॥ ౧౧౪॥ తతస్స్వపుత్రమానీయ మంత్రిణాంప్రవరైస్సభాం । ఉవాచవచనం రాజా దుఃఖశోక సమన్వితః॥ ౧౧౫॥ అహోహో పుత్రమహాప్రాజ్ఞశృణుష్వవచనంమమ । అస్మజ్జైనమతాల్లోకేకోప్యుత్కృష్టో మతోనహి॥ ౧౧౬॥ కోవాస్వమతముత్సృజ్యమతాంతరముపాశ్రయేత్ । పిశాచైస్సహసంక్రీడా స్మశానే యస్యమందిరం॥ ౧౧౭॥ భిక్షాపాత్రం బ్రహ్మశిరః తం రుద్రం కో హ్యుపాశ్రయేత్ । తస్మాల్లోకోత్తరేవీరస్వమతే తిష్ఠపుత్రక॥ ౧౧౮॥ అనుశాస్యసుతం త్వేవం భూపాలోవీరవల్లభః । స్వగృహం ప్రేషయామాస సజైనానాం గురుణాసహ॥ ౧౧౯॥ తతోజైన గురుః ప్రాజ్ఞః రాజపుత్రం మహామతిం । జైనశాస్త్రాణి సర్వాణి బోధయామాసతం ప్రతి ॥ ౧౨౦॥ బోధితోపిజగద్దేవః నాత్యజత్ శైవముత్తమం । మతంచ శివపూజాం

---

ప్పుడు శివధ్యానముచేసికొనుచు శివభక్తులతోఁగూడి యాశివునికథనమృతము వలెగ్రహించుచునిట్లున్నాఁడు - ఈప్రకారమామంత్రులుచెప్పినఁ దనకొడుకు సమాచారమునువిని యారాజు దేవశాలిని దనపట్టణమునుండిబయటవెళ్లఁగొట్టించెను- పిమ్మట నారాజు మంత్రిశ్రేష్ఠులచేతఁ దనకొడుకును సభకురావించి దుఃఖముతోఁగూడినవాఁడై యాకొడుతోనిట్లనెను - ౧౧౫ - ఓహోకొడుకామిక్కిలితెలిసినవాఁడా నామాటవినుము - లోకమునమనజైనమతముకంటె నెక్కువైన మతమొక్కటియులేదు - ఎవఁడు తనమతమునువిడిచి యితరమతమునాశ్రయించును - పిశాచములతోఁ గ్రీడించునట్టియు శ్మశానమందు వసించునట్టియు బ్రహ్మశిరస్సును భిక్షాపాత్రముగా నుంచుకొన్న రుద్రుని నెవఁడాశ్రయించును- కాఁబట్టికొడుకాలోకమందంతటను శ్రేష్ఠమైన స్వమతమునే యుండుము - అనియిట్లా వీరవల్లభ మహారాజు తనకొడుకున కాజ్ఞాపించి జైనగురువుతోగూడ నతనింటికిఁబంపెను - పిమ్మట మిక్కిలితెలిసిన యాజైనగురువు బుద్ధిశాలియయిన యారాజుకొడుకునకు జైనశాస్త్రములనన్నిటిని బోధించెను- ౧౨౦- బోధించిన నాజగద్దేవుఁడుత్తమమైన శైవమతమును శివపూజను బంచాక్షరీమంత్రమును విడువఁడాయెను- రాజుచేతఁ దఱుమఁగొట్టఁబడిన యాదేవశాలి యేప్రక్కఁబట్టినను దటాకములు గలిగియున్నట్టి యొకవనము

చమంత్రం పంచాక్షరం తథా॥ ౧౨౧॥ నిష్క్రాన్తో దేవశాలీ రాజ్ఞా శ్రుత్వేన ప
ట్టణాత్ । ప్రవివేశ వనం శీఘ్రం తటాకై రుపశోభితం॥ ౧౨౨॥ సాలైస్తమా
లైః హింతాలైః కదళీభిశ్చ శోభితం । పనసైః సఫలైశ్చైవ కపిత్థైః సపలైస్త
థా॥ ౧౨౩ ॥ జంబూభిః లికుచైశ్చైవ సారంగైః కోవిదారకైః । తథైవ బ
దరీవృక్షైః అన్యైః ఫలసమన్వితైః॥ ౧౨౪॥ మల్లికాజాతిపున్నాగ పుష్పగం
ధసువాసితం । లతాగృహై స్సమాయుక్తం హంససారససేవితం ॥ ౧౨౫ ॥
తద్వనం ప్రాప్య ధృతిమాన్ దేవశాలీద్విజోత్తమః । పుష్కరిణ్యాం తతస్స్నా
తః ధృతచర్మాంబరశ్శుచిః॥ ౧౨౬ ॥ భస్మోద్ధూళితసర్వాంగః రుద్రాక్షాభర
ణోజ్వలః । సంధ్యాముపాస్యవిధివత్ రాజయోగముపాశ్రితః॥ ౧౨౭॥ జపన్
పంచాక్షరం మంత్రం ధర్మాది పురుషార్థదం । ధ్యాయన్ హృదిసదాసాం
బం జ్యోతిర్మయమభీష్టదం॥ ౧౨౮॥ తతః క్రమేణధృతిమాన్ దేవశాలీ మహా
ద్యుతిః । సహస్రారే మనస్థాప్య చిద్రూపం పరమేశ్వరం॥ ౧౨౯॥ ఈశానం
సర్వవిద్యానాం జగతామీశ్వరం విభుం । పరాత్పరం బ్రహ్మవిష్ణు మహేంద్రా

---

నుబ్రవేశించెను - ఆవనమందేపిచెట్టులును చీకటిమ్రాకులును హింతాళవృక్ష
ములునటిచెట్లునతిమనోహరములై యుండును - మఱియు నావనమునఁబన
సచెట్లును నేరేడుచెట్లును వెలగచెట్లును నిమ్మచెట్లును గిచ్చలిచెట్లును గోవిదా
రవృక్షములును రేఁగుచెట్లు నింకననేకవృక్షములును బండి గమగమాయించు
చుండును మల్లెలు జాజులు పొన్నలు పూచి పరిమళించుచుండును- పొదరిండ్లు
తెఱచుగనుండును - అక్కడితటాకములయందు నంచలు సారసపక్షులు కిల
కిలమనుచుండును- ౧౨౫- ఇట్టియావనమునుబొంది ధైర్యవంతుఁడైన యా
దేవశాలి యక్కడ నొకతటాకమందు స్నానముచేసి చర్మాంబరమును ధరించి
పరిశుద్ధుఁడై దేహమందంతయు విభూతిఁబూసికొని రుద్రాక్షమాలికలనుభూ
షణములుగాధరించి క్రమప్రకారము సంధ్యోపాసనఁ జేసి రాజయోగమునా
శ్రయించినవాఁడై ధర్మము మొదలయిన పురుషార్థములనిచ్చునట్టి పంచాక్షర
మంత్రమును జపముచేయుచు జ్యోతిస్స్వరూపుఁడై నట్టియుఁ కోరికలనిచ్చు
నట్టి సాంబమూర్తి నెల్లప్పుడుమనస్సునధ్యానముచేయుచు ధైర్యవంతుఁడును
మిక్కిలి తేజస్సంపన్నుఁడునగు నా దేవశాలి పిమ్మటఁ గ్రమముగా సహస్రార
మందు మనస్సునిలిపి చిద్రూపుఁడైన యాపరమేశ్వరుఁడై నట్టియు సమస్తవి
ద్యలకు నీశానుఁడైనట్టియు జగత్తులకెల్ల నీశ్వరుఁడైనట్టియు విశ్వవ్యాపకుఁ

దిసమర్చితం॥ ౧౩౦॥ అజం మహాంతం మహతాం ఏకమవ్యక్తమచ్యుతం। అ
నంతరూపమాత్మానం సృష్టిస్థిత్యంతకారణం॥ ౧౩౧॥ అచక్షుర్విషయం దేవం
ఆదిమధ్యాంతవర్జితం। ధధ్యాసవేద వచసాం అగోచరమరూపిణం॥ ౧౩౨॥
ఏవం నిధ్యాయతస్తస్య శంకరం దేవశాలినః । చరాచరాత్మకం సర్వం జగ
ద్వ్యాప్తం తపోగ్నినా॥ ౧౩౩॥ తథా భూతం మహాత్మానం జగద్దేవో మహా
మతిః। ఇయేష స్వగురుం ద్రష్టుం దేవశాలినమాదరాత్॥ ౧౩౪॥ తథాభూ
తం జగద్దేవం ప్రేక్ష్యతస్యసుహృజ్జనాః। రాజ్ఞేనివేదయామాసుః తస్యవృత్తమ
శేషకం॥ ౧౩౫॥ రాజా స్వసుత వృత్తాంతం సమాకర్ణ్య భయాకులః। స
మానీయ సభాం పుత్రం ఉవాచక్రోధమూర్ఛితః॥ ౧౩౬॥ రెరె దురాత్మన్ దు
ర్బుద్ధే త్యజ శైవమతం సుత। నచేత్త్వాం ఘాతయిష్యామి సగురుం నాత్రసం
శయః॥ ౧౩౭॥ ఇత్యుక్తవంతం పితరం జగద్దేవోతి బుద్ధిమాన్। అవాదీన్ మ
ధురం వాక్యం శివభక్తిసమన్వితం॥ ౧౩౮॥ నిషిద్ధం బహుభిఃశాస్త్రైః తాత

---

డైనట్టియుఁ బరముకంటెఁ బరుఁడైనట్టియు బ్రహ్మ- విష్ణువు- ఇంద్రుడు మొద
లగువారిచేతఁ బూజింపఁబడినట్టియుఁ బుట్టుకలేనియట్టియు గొప్పవాని కన్న
టికంటె గొప్పవాఁడైనట్టియు నొక్కరూపైనట్టియు వ్యక్తుఁడుగానట్టియు న
చ్యుతుఁడైనట్టియు నంతములేని రూపముగలయట్టియు సర్వమున కాత్మరూ
పుఁడైనట్టియు సృష్టిస్థిత్యంతములకుఁ గారణమైనట్టియుఁ గంటికి గోచరుఁడు
గానట్టియు నాదిమధ్యాంతమును లేనియట్టియు వేదవాక్యములకుఁగూడఁ గో
చరుఁడుగానట్టియు రూపములేనియట్టి దేవునిధ్యానముచేసెను - ౧౩౨ - ఈ
ప్రకారము శంకరుని ధ్యానము చేయుచున్న యాదేవశాలియొక్క తపస్సనె
డియగ్నిచరాచరరూపమైన ప్రపంచమంతయు వ్యాపించెను - ఇట్లుండఁగానా
జగద్దేవుఁడట్టి తనగురువైన దేవశాలినిఁ బ్రీతివలనఁ జూడఁగోరెను - అట్లుకో
రినయాజగద్దేవునిఁజూచి యతనిస్నేహితులాసమాచారమంతయు రాజుతోఁ
జెప్పిరి - ౧౩౫ - రాజు తనకొడుకు సమాచారమునువిని భయపడి కొడుకును
సభకుఁ బిలిపించి కోపముతో నిట్లనెను - ఓరోరి దురాత్ముఁడా దుష్టబుద్ధిగల
వాఁడా కొడుకా శైవమతమును విడువుము- అట్లువిడువనిపక్షమున నిన్నునీగు
రువునుగూడఁ జంపించెద నీవిషయమందు సందేహములేదు- ఇట్లుచెప్పిన తం
డ్రితో మిక్కిలి బుద్ధిమంతుఁడైన యాజగద్దేవుండు మధురమై శివభక్తితోఁ
గూడియున్న మాటయొకటి చెప్పెను - ఓనాయనా భూమియందుఁ బెక్కు

జైనమతం భువి। శృతిస్మృతి విరుద్ధం తత్ నికృష్టం ప్రతిభాతిమే॥ ౧౩౯॥ త
స్మాచ్ఛైవమతం శ్రేష్ఠం శ్రుతిస్మృతి సుపూజితం। సర్వాగమ పురాణానాం
సమ్మతంచ సతాం నృప॥ ౧౪౦॥ శివాత్పరతరం దైవం నాస్తివై భువనత్రయే।
ఇతి బుధ్యస్వ రాజేంద్ర సత్యం సత్యం వదామ్యహం॥ ౧౪౧॥ శివ ఏవ పరం
బ్రహ్మ శివఏవ పరాయణం। శివఏవ పరంజ్యోతిః శివఏవాఖిలం జగత్॥ ౧౪౨॥
తస్మాత్పంచాక్షరం శైవం మంత్రం ముక్తిప్రదం శుభం। జపేద్విద్వాన్ సదా
యోగీయ ఇచ్ఛేన్ ముక్తిమాత్మనః॥ ౧౪౩॥ శివ ఏవ సదాపూజ్యః బ్రహ్మ
విష్ణ్వాదిదైవతైః। సనకాద్యైర్వందనీయః మునీంద్రైః మోక్షకాంక్షిభిః॥
౧౪౪॥ తస్మాత్వమపిరాజేంద్ర శివపూజా పరాయణః। శివ పంచాక్షరజపా
సక్తచిత్తోభవాధునా॥ ౧౪౫॥ ఇత్యుదీరితమాకర్ణ్య పుత్రేణ పృథివీపతిః।
ఆజ్ఞాపయత్తదాదూతాన్ క్రోధసంరక్తలోచనః॥ ౧౪౬॥ కారాగృహం ప్రా

---

శాస్త్రములచేతనిషేధింపఁబడినది యీజైనమతము శృతులకుస్మృతులకు విరుద్ధమైనదికాఁబట్టియీమతమునికృష్టమనినాకుఁదోఁచుచున్నది - ఆజైనమతముకంటె శైవమతముశ్రేష్ఠము శ్రుతులుస్మృతులు నీశైవమతముఁగొప్పగాఁజెప్పును సమస్తములైన యాగమములకుఁ బురాణములకును సత్పురుషులకు నీశైవమతము సమ్మతమైనదోయిరాజా - ౧౪౦ - ఓరాజశ్రేష్ఠుఁడా మూఁడు లోకములయందును శివునికంటె నెక్కుడైన పదార్థమొకటియులేదని తెలిసికొనుము నేను సత్యముగాఁ జెప్పెదను - శివుఁడె పరబ్రహ్మమని శివుఁడేగతి శివుఁడె జ్యోతులలో నెక్కుడైనజ్యోతి శివుఁడే సకల ప్రపంచము - కాఁబట్టి తనకుమోక్షమునుగోరిన విద్వాంసుఁడైనయోగిమోక్షమునిచ్చునట్టియు శుభకరమైనట్టి శివపంచాక్షరీమంత్రము నెల్లపుడు జపముచేయవలయును - బ్రహ్మవిష్ణువు మొదలయిన దేవతలచేత నెల్లప్పుడు పూజింపఁదగిన వాఁడు శివుఁడె మోక్షమును గోరుచున్న సనకాది మునిశ్రేష్ఠులచేత నమస్కరింపఁ దగినవాఁడును శివుఁడే కాఁబట్టి యోరాజరాజా నీవు నిపుడు శివపూజయందు దాసక్తుఁడై శివపంచాక్షరమంత్రమును జపించుటయందు దాసక్తమైన బుద్ధిగలవాఁడవగుము - ౧౪౫ - ఈప్రకారము కొడుకుచెప్పిన మాటలువిని యారాజు కోపముచేత నెఱ్ఱనైన కన్నులుగలవాఁడై యప్పుడుదూతలతోనాజ్ఞ చేసెను- నాకొడుకైనయితనిఁగట్టి బందిఖానాలో వేయుండు - అనిదూతలతోఁజెప్పి యారాజు తనయింటికిఁబోయెను- ఆదూతలు రాజునాజ్ఞను దలనువహించికొనిత్వ

పయతబధ్వాచైనం మమాత్మజం। ఇత్యుక్త్వా తతో మహీపాలః స్వగృహం ప్రావిశత్ తతః॥ ౧౪౭॥ రాజాజ్ఞాం శిరసా ధృత్వా తే దూతాః సంభ్రమాన్వితాః। కారాగృహం జగద్దేవం రాజపుత్రమనీనయన్॥ ౧౪౮॥ బందీకృతో జగద్దేవః తతో దుఃఖ సమన్వితః। సదధ్యౌ స్వగురుం దేవశాలినం దుఃఖముక్తయే॥ ౧౪౯॥ తెనచింతితమాత్రస్సన్ దేవశాలీ మహాతపాః। జగద్దేవస్య శిష్యస్య వృత్తాంతమఖిలం తతః॥ ౧౫౦॥ జ్ఞాత్వాజ్ఞాన దృశాయోగీ క్రోధసంరక్తలోచనః। హంతుం సతస్య పితరం దుష్టాత్మానం వీరవల్లభం॥ ౧౫౧॥ ఆరణ్యజంతునికరం శివమంత్రప్రభావతః। చతురంగబలం ధీమానసృజత్తపతాంవరః॥ ౧౫౨॥ సింహాబభూవుర్యోద్ధారః శార్దూలాశ్చ మహాబలాః। ఋక్షాబభూవుర్మాతంగాః ఏణాస్త్వాసన్ తురంగమాః॥ ౧౫౩॥ రథాంగ పక్షిణస్త్వాసన్ రథావాయు మనోజవాః। వృక్షాః కంటకినః సర్వే ఆయుధత్వం ప్రపేదిరే॥ ౧౫౪॥ అశ్వత్థ వృక్షా ఇషవః కీచకాశ్చాపతాం యయుః। చణవృక్షా ధృఢతరా శ్శింజాస్థానం సమాయయుః॥ ౧౫౫॥ లతా సంఘా ఇషుధయః బభూవుస్తస్య వైమునే। బ్రహ్మోద్యస్త్ర సమూహాత్వం బ్రహ్మావృ

---

రతో గూడినవారై రాజుకొడుకైన జగద్దేవుని బందిఖానాయింటిలో బెట్టిరి ఈ ప్రకారము బందిఖానాలో వేయబడినవాడై యాజగద్దేవుడు దుఃఖముతో గూడుకొన్నవాడై యంతట నాదుఃఖమువిడుచుటకు దనగురువైన దేవశాలిని ధ్యానముచేసెను - ౧౪౯ - అప్పుడా మహాతపసంపన్నుడైన దేవశాలి యతనిచేత దలపబడినవాడై యేయోగసిద్ధుడు గనుక శిష్యుడైన యాజగద్దేవుని సమాచారమంతయు జ్ఞానదృష్టిచేత దెలిసికొని కోపముచేత నెఱ్ఱనైనకన్నులుగలవాడై దుర్మారుడైన యతనితండ్రియగు వీరవల్లభ భూపాలుని జంపనాయడవియందున్న జంతువులనన్నిటిని దన తపోమహిమచేతనుశివమంత్రము మహిమచేతను భయంకరమైన చతురంగసేనగా సృజించెను సింహములును బులులును మిక్కిలిబలముగల యోధులుగా నేర్పడెను- ఎలుగుగొడ్లుగజములాయెను లేండ్లు గుఱ్ఱములాయెను - చక్రవాకపక్షులు వాయువేగము మనోవేగముగల రథములుగానాయెను - ముండ్లుగలచెట్లన్నియు నాయుధములాయెను - రాగిచెట్లు బాణములుగాను వెదుళ్లు ధనుస్సులుగా నాయెను దృఢములైన జనుప చెట్లల్లెత్రాళ్లాయెను - ౧౫౫ - అప్పుడామునికి ద్రాటిమాకు లంబులపొదులాయెను - బ్రహ్మమేడిచెట్లు బ్రహ్మాస్త్రముమొద

తాః ప్రవేదిరే ॥ ౧౫౬ ॥ ఏవమాయుధ సంపూర్ణం చాపబాణాస్త్ర రాజి
తం । చతురంగబలం దృష్ట్వా దేవశాల్యానినందసః ॥ ౧౫౭ ॥ తత స్తేసముపా
గమ్యసైనికా దేవశాలినం । ఊచుః ప్రాంజలయస్సర్వే వినయేన సమన్వితాః॥
౧౫౮ ॥ కిమర్థ మస్మానసృజః కిం వా కర్తవ్యమీశ్వర । అస్మాభిస్తు మహా
ప్రాజ్ఞ బ్రూహిత్వం కరవామతత్ ॥ ౧౫౯ ॥ ఇతిసైన్య వచశ్శ్రుత్వా దే
వశాలీ మహాద్యుతిః । మేఘ గంభీరయావాచా భాణీత్తాన్ సైనికాన్ ప్రతి॥
౧౬౦॥ యూయం కల్యాణనగరం సమాసాద్య మహాబలాః । వీరవల్లభ భూపా
లం హత్వా శీఘ్రం ససైనికం॥ ౧౬౧॥ కారాగృహాత్ మోచయిత్వా జగ
ద్దేవంతదాత్మజం। మచ్ఛిష్యమతులప్రజ్ఞం నివర్తధ్వంముదాన్వితః॥ ౧౬౨॥
ఇత్యాజ్ఞాం శిరసా ధృత్వా సాదరం దేవశాలినః । వినిర్యయూ వనాత్తస్మాత్
తేసైన్యా శ్శస్త్రపాణయః॥ ౧౬౩॥ సింహనాదాన్ విముంచంతః శత్రుబృం
ద భయంకరాన్ । చాపాన్ విస్ఫారయం తశ్చ యమదూత భయంకరాః॥

---

లగు నస్త్రములుగా నాయెను - ఈప్రకార మాయుధములచేత నిండినట్టి
యుధనుస్సులచేతను బాణములచేత నస్త్రములచేతను బ్రకాశించినయాచతు
రంగసేననుజూచి యాదేవశాలి యానందించెను - అంత నా సేనాజనులు దే
వశాలిదగ్గిరికివచ్చి చేతులుమోడ్చుకొని వినయముతోఁగూడినవారై యిట్లని
పలికిరి - ఓ సర్వము తెలిసినస్వామీ మమ్మునేల సృజించితివి మేమేమిచేయవ
లయునో చెప్పుము దానిఁజేసెదము - అనియిట్లా సైనికులుచెప్పఁగా నామా
టవిని మహాతేజస్సుగలయాదేవశాలి మేఘములయురుమువలె గంభీరమయిన
వాక్కుతో నాసైనికులఁగూర్చి యిట్లనెను- ౧౬౦- ఓ మిక్కిలిబలముగలసై
నికులారా మీరుకల్యాణనగరమునకుఁబోయి వీరవల్లభ మహారాజు నతనిసేన
లతోఁజంపియతనికిఁగొడుకై నట్టియు నాకుశిష్యుఁడై నట్టి మిక్కిలిబుద్ధిమంతుఁ
డైన జగద్దేవుని బంధిఖానాలోనుండివిడిపించి సంతోషముతో మరలిరండు- అ
నియిట్లాదేవశాలి యాజ్ఞాపింపఁగా నాయాజ్ఞనుదలనువహించి యాసైనికులు
శస్త్రములను జేతులయందుఁబూని యాయడవినుండిబయలు వెడలిరి మిక్కిలి
బలవంతులై నట్టియుఁ బెక్కువిధములయిన సొమ్ములుధరించినట్టియు ననేకవిధ
ములయిన యుద్ధములునేర్చిన యాసైనికులు సింహనాదములుచేయుచు శత్రు
సమూహములకు భయమును గలుగఁజేయునట్టి విండ్లనీడ్చి టంకారముచేయుం
చుచుయమదూతలవలె భయమును గలుగఁజేయువారై వచ్చి యాకల్యాణన

౧౬౪॥ నానాభరణ సంయుక్తా నానాయుద్ధ విశారదాః । ప్రాప్య కల్యాణనగరం రురుధుస్తే మహాబలాః॥ ౧౬౫॥ దేవశాలి తపస్సృష్టైః సైన్యైరుద్ధం విలోక్యతత్ । కల్యాణ పట్టణం దూతాః అట్టద్వార నివాసినః॥ ౧౬౬॥ శీఘ్రం రాజా నమాసాద్య సంభ్రమేణ సమన్వితాః । నమస్కృత్వాంజలిం బధ్వావచః సర్వే వ్యజిజ్ఞపన్॥ ౧౬౭॥ వీరవల్లభ రాజేంద్ర మహాబలపరాక్రమ । కల్యాణపట్టణం తేద్యరిపుసైన్యైస్సమావృతం॥ ౧౬౮॥ సముద్రమివదుష్పారం వీరాణాం భయవర్ధనం । సర్వాయుధ ధరం రాజన్ బాణబాణాసనోజ్వలం॥ ౧౬౯॥ హేషారవైశ్చసంపూర్ణంబృంహితైశ్చమహత్తరైః । సింహనాదైశ్చ యోధానాం బధిరీకృతదిగ్గజం॥ ౧౭౦॥ కుతోవా తత్సమాయాతం కేనవాప్రేషితం ప్రభో । నజానీమోవయం సర్వే శత్రుసైన్యవినాశన॥ ౧౭౧॥ ఇతిదూతవచశ్శ్రుత్వా రాజారోషసమన్వితః । అబ్రవిన్మంత్రిణస్సర్వాన్ దంతాన్ కటకటాపయన్ ॥ ౧౭౨॥ అహోమంత్రివరాః సర్వైర్వః యుష్మాభిః శ్రుతమేవహి । దూతైరుక్తం వచఃసర్వం భయసంభ్రమసంయుతైః॥ ౧౭౩॥

---

గరముసడ్డగించిరి- ౧౬౪- ఆపట్టణముగవనివాకిళ్లయందున్న దూతలు దేవశాలితపస్సుచేత సృజింపఁబడిన యాసైనికులువచ్చి యీప్రకారము పట్టణమడ్డగించుటనుజూచి త్వరితముగ రాజుదగ్గిరికిఁబోయి తొట్రుపాటుతోఁ గూడినవారై మ్రొక్కి చేతులుగట్టుకొని యిట్లనివిన్నవించిరి- ఓయిమిక్కిలి బలముపరాక్రమముగల వీరవల్లభా రాజశ్రేష్ఠుఁడా నీపటణమునిప్పుడు శత్రుసేనలుచుట్టుకొనెను ఓరాజా యిప్పుడు పట్టణముచుట్టునుండెడి యాసేనసముద్రమువలె కడతెలియరాకయున్నది- వీరులందఱు దానిజూడఁగానే మిక్కిలి భయపడునట్లున్నది - సమస్తాయుధములనుబూని బాణములచేతను విండ్లచేతను ప్రకాశించియున్నది ఏప్రక్కఁ బట్టెనను గుఱ్ఱముల యొక్కయు నేనుగులయొక్కయు నార్పులునిండియున్నవి భటులసింహనాదములచేత దిగ్గజములకుఁ జెవుడుపట్టుచున్నది - ౧౭౦ - శత్రువుల సేనలనెల్ల ధ్వంసము చేయునట్టి యోరాజా ఆసేన యేప్రక్కనుండివచ్చినదో ఎవఁడుపంపినదో మేమందఱుమెఱుఁగము- అనియిట్లుదూతలుచెప్పిన మాటవిని రాజుకోపముతోఁగూడినవాఁడై పండ్లుకొఱుకుచుమంత్రులతోనిట్లనెను- ఓమంత్రిశ్రేష్ఠులారా భయముతోను తొట్రుపాటుతోనుగూడుకొన్నదూతలువచ్చిచెప్పినమాటమీరందఱువింటిరిగదా. ఓశత్రుసైన్యములనెల్లనశింపఁజేయువారా నిర్హేతుకముగావచ్చినసైన్యమునుజంపను

అకస్మాదాగతం సైన్యం హంతుం శత్రునిషూదనాః । అస్మదీయంబలంసర్వం నిర్గచ్ఛతుమమాజ్ఞయా॥ ౧౭౪॥ ఇతిరాజ్ఞో వచశ్శ్రుత్వా మంత్రిణస్తే త్వరాన్వితాః । ఆనిన్యుః సకలాం సేనాం రథాశ్వగజపత్తిభిః ॥ ౧౭౫ ॥ భీకరాంశత్రుదుర్వారాం సర్వాయుధసమన్వితాం । సాగర ప్రతిమాం సర్వకాలేషు విజయోజ్వలాం॥ ౧౭౬॥ తతస్తు మంత్రిప్రవరాః సర్వసేనాగమం తదా । రాజ్ఞేనివేదయామాసుః యుద్ధోద్యుక్తా మహాబలాః॥ ౧౭౭॥ తతః కల్యాణనగరీ నాయకోవీరవల్లభః । సర్వసైన్యైశ్చ సంయుక్తః మంత్రిభి ర్యుద్ధకాంక్షిభిః॥ ౧౭౮॥ ఆరురోహ రథం దివ్యం సర్వ శస్త్రాస్త్రసంయుతం । సదశ్వసాది సంయుక్తం సముచ్ఛ్రితపతాకినం॥ ౧౭౯ ॥ ధనుర్బాణ ధరశ్శూరః కవచీ వీరవల్లభః । నిర్యయౌనగరాత్ స్వీయాత్ నిహంతుం శత్రుసైనికాన్॥ ౧౮౦॥ తస్యయోధవరావీరాః శంఖాన్ దధ్ముర్ముదాతదా । భేరీమవాదయన్ కేచిత్ క్ష్వేళామన్యే ప్రచక్రిరే॥ ౧౮౧॥ చాపనాదాన్వితత్రుశ్చ కేచిచ్ఛత్రుభయంకరాన్ । తథాభూతాన్ యోద్ధుకామాన్ వీరవల్లభసైనికాన్॥ ౧౮౨॥ రథ

---

నాయాజ్ఞచేత మనసేన బయలు వెడలవలయును- ౧౭౪- ఇట్లా రాజుచెప్పిన మాటవినియామంత్రులు త్వరలోగూడినవారై రథములచేతను గుఱ్ఱములచేత నేనుగులచేతను గా బలములచేతను భయంకరమైనట్టియు పగతురచేతనడ్డగింపగూడనియట్టియు సమస్తాయుధములతోఁగూడినట్టియుసముద్రమువలెనున్నట్టియునెల్లప్పుడుగెలుపుచేనొప్పుచున్న సేననంతనుదెచ్చిరి- ౧౭౬- తెచ్చి మిక్కిలిబలముగల యామంత్రిశ్రేష్ఠులు యుద్ధసన్నద్ధులై దండంతయువచ్చిన సమాచారమునురాజుతోఁజెప్పిరి-అంతనాకల్యాణపురమునకుఁబ్రభువైన యావీరవల్లభమహారాజు సేనలతోను యుద్ధమునుగోరుచున్న మంత్రులతోనుగూడినవాఁడై సమస్తములైన శస్త్రములతోను అస్త్రములతోనుగూడుకొన్నట్టియుమంచిగుఱ్ఱములతోను సారథితోనుగూడినట్టియు పొడవైన టెక్కెముగలదివ్యమైనరథమునెక్కి కవచముదొడిగి వింటెనమ్ములనుధరించినవాఁడై శత్రుసేనయందుండువారినిసంహరింపను దనపట్టణమునుండి బయలువెడలెను- ౧౮౦- అప్పుడతని వీరభటులు కొందఱుసంతోషముచేత సంకులూదిరి కొందఱు నగారాలువాయించిరి మఱికొందఱు సింహనాదములుచేసిరి కొందఱు శత్రువులకు భయమును గలుగఁజేయునట్టి ధనుష్టంకారములనుజేసిరి - ఆప్రకారమై పోట్లాడగోరెడు వీరవల్లభుని సేనాజనులను రథమందున్నట్టియు వింటెనమ్ములనుధరించి

స్థంచ సమాలోక్య జారానమతితేజసం। చాపబాణ ధరం శూరం విఖ్యాత బలపౌరుషం॥ ౧౮౩॥ దేవశాలిమహాసైన్యం రిపుసంఘవిమర్దనం। యుద్ధోద్యుక్తం సమభవత్ దేవతుల్య పరాక్రమం॥ ౧౮౪॥ ఉభయోస్సేనయోర్యుద్ధం ద్రష్టుకామాదివౌకసః। ఆరుహ్యాసూర్యసంకాశంవిమానమతిసుందరం॥౧౮౫॥ తస్థురాకాశమావృత్య ఋషయశ్చ తపోధనాః నారదాద్యాశ్చ గంధర్వాః సిద్ధాశ్చారణ సంయుతాః॥ ౧౮౬॥ కుబేరో వరుణశ్చైవ వాయురీశానఏవచ। వైశ్వానరో యమశ్చైవ రక్షోరాణ్ణిర్ ఋతిస్తథా॥ ౧౮౭॥ ప్రాసాదం వైజతాఖ్యం ఆరుహ్యాత్యం తభాస్వరం। దేవరాజం పురస్కృత్య సర్వేచాజగ్మురంబరం ॥ ౧౮౮ ॥ తతఃప్రవవృతే యుద్ధం కలహానందినోదదం। ఉభయోస్సేనయోర్భీమం యమరాష్ట్రవివర్ధనం॥ ౧౮౯॥ పరస్పరంనిజఘ్నుస్తేహ్యుభయస్తేనికాస్తదా। ముసలైర్ముద్గరైర్ఘోరైర్భిండివాలైఃపరశ్వధైః॥ ౧౯౦॥ శక్తిభిశ్చ గదాభిశ్చ శతఘ్నీభిః రుషాన్వితైః। క్రోధ ప్రముక్తైరిషుభిః నిస్సరద్భిశ్శరాసనాత్॥ ౧౯౧॥ రథికో రథినం ప్రాప తురగీ చతురంగిణం।

---

నట్టియుప్రసిద్ధినొందినబలపౌరుషములుగలయట్టియు శూరుఁడైనట్టియుమిక్కిలితేజస్సంపన్నుఁడైన యారాజునుజూచి శత్రుసేసలనెల్లనూరునట్టియుదేవతలతోసరియైన పరాక్రమముగల దేవశాలి సేనయుద్ధమునకుద్యమించినదాయెను- ౧౮౪ - రెండుసేనలయుద్ధమును జూడఁగోరినవారై దేవతలు సూర్యునితోసమానమైనట్టి మిక్కిలిసొగసైన విమానమునెక్కి యాకాశమునావరించి నిలిచిరి-తపస్సేధనముగాఁగల నారదులు మొదలైనఋషులును గంధర్వులును సిద్ధులునుచారణులునుకుబేరుఁడును వరుణుఁడును వాయువునీశానుఁడు నగ్నియు యముఁడును రాక్షసరాజగు నిర్‌ఋతియు వీరందఱు మిక్కిలిప్రకాశించునట్టి వైజయంతమను మేడనెక్కి దేవేంద్రుని ముందుంచుకొని యాకాశమునకు వచ్చిరి అంతనట రెండుసేనలకు జగడముచేత సంతసించు వారికానందమునిచ్చునట్టియు యమునిరాష్ట్రమును బెంచునట్టి భయంకరమైన యుద్ధమాయెను- ౧౮౯- అప్పుడా రెండుసేనలవారును రోషముతోఁగూడినవారై రోకళ్లచేత నినుపగుదియలచేతను భిండివాలములచేతను గండ్రగొడ్డండ్లచేతను శక్తులచేతనుగదలచేతను పిరంగిలచేతను కోపముతోఁబ్రయోగింపఁబడి వింటినుండి వెడలుచున్న-బాణములచేత నొకరొకరిని గొట్టుకొనిరి - రథముమీఁదివాఁడు రథముమీఁది వానిని గుఱ్ఱము మీఁది వాఁడు గుఱ్ఱము మీఁది వానిని కాలి నడవాఁడు కా

పదాతిశ్చ పదాతింతు హస్తిహస్తిసాదినం॥ ౧౯౨॥ ఏవం యుయుధిరే వీరా
ఉభయే స్వర్గకాంక్షిణః । సింహా ఇవ జగర్జుస్తే వీరవాదాన్ బభాషిరే ॥
౧౯౩ ॥ కియాంస్త్వంరే కియాంస్త్వంరే జితపూర్వోహి రేమయా । సదృశో
నమయాయుద్ధే గచ్ఛతస్మాత్పరాఙ్ముఖః॥ ౧౯౪॥ ఏవం ప్రవర్తమానంతు సం
గ్రామం రోమహర్షణం । మహేంద్రాద్యాస్సురాదృష్ట్వా విస్మయం ప్రతిపే
దిరే॥ ౧౯౫॥ సాధుసాధ్వితిదిక్పాలాః మహేంద్ర వరుణాదయః । అపూజయం
శ్చతద్యుద్ధం శూరాణాం హర్షవర్ధనం॥ ౧౯౬॥ ననృతుశ్చ కబంధాని బ
హూని సమరక్షితౌ । రుధిరౌఘ మహానద్యాంకేశశైవాలభాజిచ॥ ౧౯౭॥
దేవశాలి మహాసైన్యం శివమంత్ర ప్రభావతః । శౌర్య ప్రవృద్ధమభవత్ య
థాపర్వణివారిధిః॥ ౧౯౮॥ వీరవల్లభ సైన్యం తత్ సంక్షీణ బలపౌరుషం । ఆ
సీద్భృశం కృశతరం కృష్ణపక్షే శశీయథా॥ ౧౯౯॥ దేవశాలి మహాసైన్యైః
యుద్ధోన్మత్తైరుదాయుధైః । వీరవల్లభ సైన్యాస్తు హన్యమానాముహుర్ముహుః॥ ౨౦౦॥ కేచిన్మూర్ఛాః పేతుశ్చ ధరణ్యాం క్షీణజీవితాః । ప్రాణా

---

లి నడ వానిని నేనుఁగు మీఁది వాఁడేనుఁగు మీఁది వానిని దాకిరి -
ఈప్రకారమా రెండుసేనల వీరులును స్వర్గమునుగోరుచు యుద్ధముచేసిరి - అ
ప్పుడువారలు సింహములవలెబొబ్బలిడుచు వీరవాదములు పలుకుచుండిరి - ఓరి నీ
వెంతమాత్రపువాఁడవోరి నీవెంతమాత్రపువాఁడవు ముందునాచేతఁ గెలువఁబ
డినవాఁడవుగదా - నాతో సరియైనవాఁడవుకావు కాఁబట్టి యుద్ధమందు విము
ఖుఁడవై పొమ్ము - ఈప్రకారము జరుగుచున్న రోమహర్షణమైన యుద్ధమును
జూచి యింద్రుఁడు మొదలైన వారాశ్చర్యపడిరి- ౧౯౫. దేవేంద్రుఁడు వరు
ణుఁడు మొదలైన దిక్పాలురందఱు నాయుద్ధమును మిక్కిలిచక్కఁగానున్నదని
నుతించిరి- యుద్ధభూమియందు బెక్కు-మొండెములాడెను తలవెండ్రుకలనునా
చుపాచికలిగియున్న నెత్తుటివరదయను గొప్పనదియందుఁ బర్వమునసముద్రము
పెరిగినట్లా దేవశాలిదండు శివమంత్రముమహిమచేత శౌర్యాధికమాయెను -
ఆ వీరవల్లభునిదండు కృష్ణపక్షమందుఁ జంద్రునివలె బలపౌరుషములుతగ్గినదై
మిక్కిలియుడిగినదాయెను - యుద్ధమందు మదించినట్టియు నాయుధములనెత్తి
యున్న దేవశాలిదండు వారిచేత వీరవల్లభునిదండు వారు మాటిమాటికిఁ గొట్ట
బడుచు గొందఱుమూర్ఛనొందిరి కొందఱుక్షీణమైనబ్రతుకుగలవారై భూమి
మీఁదఁబడిరి - మఱికొందఱకుఁ బ్రాణములుపోయెను కొందఱు మాత్రమును

న్విజహురన్యేచ కేచిన్మాత్రంప్రసుస్రువుః॥ ౨౦౧॥ తతోరాజాసమగమన్ వీర
వల్లభసైనికాః । శరణంముక్తకేశాస్తే త్యక్తచాపాయుధాఃక్షితౌ॥ ౨౦౨॥ త
థాగతాన్ స్వస్యసైన్యాన్ శత్రుసైన్యైర్విమర్దితాన్ । వీరవల్లభ ఆలో
క్యరోషద్వేషసమన్వితః ॥ ౨౦౩ ॥ సరథో ధన్వినాంశ్రేష్ఠః ప్రాప్య సంగ్రా
మమేదినీం । దేవశాలి మహాసైన్యాన్ దిధక్షన్నివచక్షుషా॥ ౨౦౪॥ ఆలో
క్యధనురాదాయ సజ్యమాశు విధాయచ । బాణాన్ సంధాయసుబహూన్
ముమోచ రిపుఘాతినః॥ ౨౦౫॥ శతం సహస్రమయుతం నియుతం ప్రయుతం
తథా । నిశ్చక్రముస్తదా బాణాఃవీరవల్లభచాపతః॥ ౨౦౬॥ తైర్వధ్యమానాః
స్సమరే సైన్యాస్తే దేవశాలినః । ముమూర్చ్ఛుశ్చగజర్జుశ్చసింహవచ్చము
హుర్ముహుః॥ ౨౦౭॥ దేవశాలి మహాసైన్య ప్రయుక్తైర్బాణజాలకైః ।
ప్రాహన్యత తథా వీర వల్లభశ్చాయుధై భృశం ॥ ౨౦౮ ॥ కోపసంరక్తన
యనః తదా సోవీరవల్లభః । ప్రాదుశ్చక్రే మహాతేజా ఆగ్నేయాస్త్రమనుత్త
మం ॥ ౨౦౯ ॥ దేవశాలి మహాసేనా పతిశ్శంకరనామకః । దహ్యమానాన్

---

విడిచిరి- ౨౦౧- పిమ్మట నావీరవల్లభుని సైనికులు తలలువిరఁబోసికొని వింటినా
యుధములను భూమిమీఁద వేసి తమ రాజును శరణుఁజొచ్చిరి - శత్రుసేనలోని
వారిచేతఁగొట్టఁబడి యాతీరునవచ్చి నతన సైనికులను ధనుర్ధరులలో శ్రేష్ఠు
డైనవీరవల్లభరాజు చూచికోపముతోను బగతోనుగూడినవాఁడై రథమునెక్కి
యుద్ధభూమికివచ్చి దేవశాలి దండువారిని గంటితో దహింపఁ గోరువానివలెఁ
జూచి ధనుస్సునెత్తికొని త్వరగా నెక్కుపెట్టి శత్రువులను ధ్వంసముచేయునట్టి
పెక్కుబాణములను సంధించివిడిచెను - ౨౦౫ - అప్పుడా వీరవల్లభునిధనుస్సు
వలననుండి నూరు వేయి పదివేలు లక్ష కోటిబాణములు బయలువెడలెను - ఆ
బాణములచేత యుద్ధమందుఁగొట్టఁబడుచున్న యాదేవశాలిదండువారు కొంద
ఱుమూర్ఛనొందిరి కొందఱుమాటిమాటికి సింహములవలెఱొప్పిరి- ఆప్రకార
మా దేవశాలి దండువారిచేతఁ బ్రయోగింపఁబడిన బాణసమూహములచేతను
నాయుధములచేతను నావీరవల్లభరాజు మిక్కిలికొట్టఁబడెను - అప్పుడు మిక్కి
లిపరాక్రమవంతుఁడైన వీరవల్లభరాజు కోపముచేత నెఱ్ఱనికన్నులుగలవాఁడై
సర్వోత్తమమైన యాగ్నేయాస్త్రమును బ్రయోగించెను అప్పుడా దేవశా
లి సేనానాయకుఁడు శంకరుఁ డనువాఁడా యస్త్రముచేత దహింపఁ బడుచు
న్న తనసైనికులనుజూచి తానస్త్రముల నెఱిఁగిన వారిలో శ్రేష్ఠుఁడుగనుక వా

తదాస్త్రేణ తేనాలోక్యస్వసైనికాన్॥ ౨౧౦॥ ప్రాయుంక్తవారుణం దివ్య మస్త్రమస్త్ర విదాం వరః । తేన ప్రశాంతమభవత్ ఆగ్నేయం గతవిక్రమం ॥ ౨౧౧ ॥ తతః ప్రాయుంక్త దివ్యాస్త్రం వారుణం వీరవల్లభః । శంకరోత్సృష్ట వాయవ్యాస్త్రేణ శాంతం బభూవతత్ ॥ ౨౧౨ ॥ తతః ప్రాయుంక్త దివ్యాస్త్రం సయామ్యం వీరవల్లభః । శంకరోత్సృష్ట కౌ[బే]రాస్త్రేణాహతం తదభూత్తదా ॥ ౨౧౩ ॥ నారాయణాస్త్రం ప్రాయుంక్త తతో సౌవీరవల్లభః । శంకరోత్సృష్ట మాహేశాస్త్రేణ శాంతం బభూవ తత్ ॥ ౨౧౪ ॥ తతశ్శంకరనామాసౌ క్రోధసంరక్తలోచనః । ప్రాయుంక్త బ్రాహ్మమస్త్రం తత్ సర్వలోక భయంకరం॥ ౨౧౫॥ తేనాస్త్రేణ శిరశ్ఛిన్నం పపాత ధరణీతలే । వీరవల్లభభూపస్య సకిరీటం సకుండలం॥ ౨౧౬॥ జయభేరీంత [దా]జఘ్నుః సైన్యాస్తే దేవశాలినః । దధ్ముః శంఖాన్ తథా సర్వే మోదమాపుశ్చ పుష్కలం॥ ౨౧౭॥ దేవదుందుభయో నేదుః పుష్పవృష్టిశ్చ ఖాచ్చ్యుతా । ననృతుశ్చాప్సరస్సంఘాః గంధర్వాశ్చ కలం జగుః॥ ౨౧౮॥ దేవశాలి మహాసైన్యాః సేనాపతి పురస్సరాః । ప్రవిశ్య కల్యాణపురం నిరానందజనైర్యుతం॥ ౨౧౯॥ కారాగృహాన్

---

రుణాస్త్రమును బ్రయోగించెను - దానిచేత నాయాగ్నేయాస్త్రము ప్ర[శ]మముహూనినదై యడఁగినదాయను- ౨౧౧- పిమ్మట నావీరవల్లభుఁడు దివ్యమైనవారుణాస్త్రమును బ్రయోగించెను - అది శంకరుఁడు ప్రయోగించిన వాయవ్యాస్త్రముచేత నడఁగిపోయెను - తరువాత నావీరవల్లభుఁడు యామ్యాస్త్రమును బ్రయోగించెను- అది శంకరుఁడు ప్రయోగించిన కౌ[బే]రాస్త్రమునకులోఁబడెను- అంత నావీరవల్లభుఁడు నారాయణాస్త్రమును బ్రయోగించెను- అది శంకరుఁడేసిన మాహేశాస్త్రముచేత నడఁగిపోయెను - అంత నాశంకరుఁడు కోపముచేత నెఱ్ఱనికన్నులుగలవాఁడై సమస్తలోకములకు భయమునుగలుగఁజేయునట్టి బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను - ఆయస్త్రముచేతఁ గిరీటకుండలములతోఁడ వీరవల్లభరాజు తలతెగిభూమిమీఁదఁబడెను- ౨౧౬- అప్పుడా దేవశాలి దండువారు జయభేరివాయించిరి శంఖములనూదిరి యందఱు నిండు సంతోషమును బొందిరి - దేవతల దుందుభులుశబ్దించెను ఆకాశమువలననుండి పుష్పలవానగురిసెను - అప్సరసలాడిరి - గంధర్వులు మధురముగఁ బాడిరి- దేవశాలిదండువారు సేనానాయకునిముందిడికొని సంతసములేనిజనులతోఁగూడియున్న కల్యాణపట్టణమును బ్రవేశించి మిక్కిలిబుద్ధిశాలియైన జగద్గురునిబం

మోచయిత్వా జగద్దేవం మహామతిం । అధ్యారోప్యగజశ్రేష్ఠం సర్వాలంకార సంయుతం॥ ౨౦॥ దేవశాలి సమీపంతం సమానిన్యు ర్ముదాన్వితాః । జగద్దేవ స్సమాలోక్య స్వగురుం దేవశాలినం॥ ౨౧॥ గజాదవాతరత్ శీఘ్రం ప్రణనామచతం ముహుః । తుష్టావచ తదా స్తోత్రైః శ్రుతిస్మృత్యాగమోదితైః॥ ౨౨॥ ఫాలనేత్రసముద్భూతశివస్యపరమాత్మనః। దేవశాలిన్నమస్తేస్తు ప్రణతార్థ ప్రదాయక॥ ౨౩॥ విద్యావిలాస తనయ భక్తాభీష్ట ప్రదాయక । సద్గురోమాం సదా పాహి భక్తం సంసారసాగరాత్॥ ౨౪॥ దురాచారం జైనమతం అశిష్ట జనసేవితం । శ్రుతిస్మృతి విరుద్ధంచ చ్ఛింధి శాంకర సాంప్రతం॥ ౨౫॥ అహం త్వదుపదిష్టేన శైవ పంచాక్షరేణవై । మహామంత్రేణ సర్వజ్ఞ ధూతపాపోభవం సదా॥ ౨౬॥ త్వన్నామస్మరణా దేవపాలితోస్మి దయానిధే। కారాగృహాన్ మోచితశ్చ త్వయాద్యజగతీపతే॥ ౨౭॥ ఇతిస్తువంతం ప్రణతం శిష్యం బద్ధాంజలిం గురుః । దేవశాలీతదోవాచపాణినా పరిమృజ్యతం॥ ౨౮ ॥ జగద్దేవ మహాబుద్ధే భక్తమే వచనం శృణు। శివాత్మ

---

దిఖానాలోనుండి విడిపించి సమస్తవిధముల శృంగారింపఁబడిన శ్రేష్ఠమయిన యేనుఁగుమీఁదఁగూర్చుండఁబెట్టి సంతోషముతో దేవశాలియొద్దకుఁ దెచ్చిరి- అప్పుడు జగద్దేవుఁడుతమగురువైన దేవశాలినిజూచి త్వరితముగా నేనుఁగుమీఁదనుండిదిగి యతనికి పెక్కుమాఱులుమ్రొక్కెను - మఱియు వేదములయందు స్మృతులయందు నాగమములయందుఁజెప్పఁబడిన స్తోత్రములచేతనుతించెను- ౨౨ - ఓదేవశాలీ నొసటికంటియందుఁబుట్టిన యగ్నిగల నీకునమస్కారము - నమస్కరించినవారి కోరికల నిచ్చువాఁడా విద్యావిలాసుని కుమారుఁడా భక్తులకోరికలనిచ్చువాఁడా శ్రేష్ఠగురువా భక్తుఁడైన నన్ను సంసారసముద్రమునసుండియెల్లప్పుడురక్షింపుము- ఓశివునిసంబంధియైనవాఁడా - దుష్టములైన నడవళ్లుగలయట్టియు దుష్టులచేత నాదరింపఁబడినట్టియు శృతులకు ధర్మశాస్త్రములకు విరుద్ధమైన జైనమతమును ఖండింపుము- ౨౫- ఓ సమస్తముఁదెలిసినవాఁడా నేను మీరుపదేశించిన పంచాక్షరీ మహామంత్రమును జపముచేసి పాపమును బోఁగొట్టుకొంటిని - ఓదయానిధీ నీపేరు దలఁచుటచేత నే పాలింపఁబడినవాఁడనైతిని - ఓ సర్వప్రపంచనాయకా నీచేత నిప్పుడు బందిఖానావలననుండి విడిపింపనుబడితిని - ఈప్రకారము స్తోత్రముచేయుచు నమస్కరించినట్టియుఁ జేతులమోడ్చుకొన్నట్టి యాశిష్యునినప్పుడు దేవశాలి తనహస్త

రతరం వస్తునాస్త్యేవ భువనత్రయే ॥ ౨౨౯ ॥ తస్మాత్ జైనా నదయ్యసర్వాన్ హన్మ్యాహం శాపాగ్ని తేజసా । ఇత్యుక్త్వావర్తాన్ యదాశప్తు పాణినా జలమ గ్రహీత్ ॥ ౨౩౦॥ తదా నందీశ్వరశ్శ్రీమాన్ శివభక్తాగ్రగణ్యకః । భస్మోద్ధూళితసర్వాంగః రుద్రాక్షాలంకృతో మహాన్ ॥ ౨౩౧ ॥ దేవశాలి సమీపంతు సమాగత్యాతివేగతః । ఉవాచ వచనం దేవః సర్వలోకనమస్కృతః॥ ౨౩౨॥ శాపం మా దేహిమాదేహి జైనాన్ హంతుం మహామతే । ఇతఃపరం జైనమతం శైవమేవ భవిష్యతి॥ ౨౩౩॥ ఇత్థం శివస్య హృదయం మయాస్పష్టీకృతం తుతే । శివస్యాజ్ఞా లంఘనీయా న కేనాపి మహామతే ॥ ౨౩౪ ॥ ఇత్యాజ్ఞప్తశ్శివేనాహం కైలాసాత్ పర్వతోత్తమాత్ । శీఘ్రమాగతవానస్మి తవాంతిక మహామునే॥ ౨౩౫॥ శివాజ్ఞప్తం సమస్తంచ కార్యం నిర్వర్తితం త్వయా । ద్రష్టుమాగచ్ఛ కైలాసం పార్వతీపరమేశ్వరౌ॥ ౨౩౬ ॥ ఇత్యుక్తో నందికేశేన దేవశాలీ మహాతపాః । కల్యాణపురరాజంతం జగద్దేవంచ కారసః॥ ౨౩౭॥ ఆశిషంచ ప్రయుజ్యాథ జగద్దేవాయ భూభృతే । దేవశాలీ మహాప్రాజ్ఞః దే

---

ముచేత స్పృశించి యిట్లనెను - ఓమిక్కిలి బుద్ధిమంతుడై నట్టియు భక్తుడైన జగద్దేవుడా నామాటవినుము - శివునికంటె నెక్కుడైన వస్తువు మూడులోకములయందునులేనేలేదు - కాఁబట్టి యిప్పుడు జైనులనందఱను శాపాగ్ని తేజస్సుచేతఁ జంపెదను అని చెప్పి వారిని శపింప నా దేవశాలిచేత నుదకమునెత్తికోఁగానె శివభక్తులలో మొదటివాఁడై నట్టియు సమస్త లోకములయందు నమస్కృతుడై దొడ్డవాడైన శ్రీమన్నందీశ్వరుఁడు దేహమంతయు విభూతిఁ బూసికొని రుద్రాక్షమాలికలను ధరించినవాఁడై మిక్కిలివడిగా దేవశాలిదగ్గరికివచ్చి యొకమాటచెప్పెను- ౨౩౨- ఓ మిక్కిలి బుద్ధిశాలీ జైనులజంపను శాపమీవలదు ఇఁకమీఁదజైనమతము శైవమతముగానేయగును- ఇట్లు శివుని తాత్పర్యము నేనీవిషయమునీకుఁ దేటపఱిచితి- ఓబుద్ధికుశలతగలవాఁడా శివుని యాజ్ఞ యెవ్వనిచేతను దాఁటఁగూడనిది- ఓమునీ యీప్రకారముశివునిచేతనే నానతీఁబడి పర్వతశ్రేష్ఠమైన కైలాసముననుండి నీయొద్దకు వచ్చితిని- ౨౩౫- నీవు శివునిచేత నియోగింపఁబడిన కార్యమంతయు నెఱవేర్చితివి గనుకఁ బార్వతీపరమేశ్వరులనుజూడఁ గైలాసమునకు రమ్ము - ఈప్రకారము నందికేశ్వరుఁడుచెప్పఁగా మహాతపస్సంపన్నుఁడైన యీ దేవశాలి మాజగద్దేవునిఁ గల్యాణపట్టణమునకుఁ బ్రభువుఁగాఁ జేసెను - తరువాత నా మిక్కిలి తెలిసిన దేవ

వాంగోభూత్ క్షణాత్తదా ॥ ౨౩౮ ॥ దేవదుందుభయోనేదుః పుష్పవృష్టిః పపాతహ । ననృతుఃదేవసుందర్యః గంధర్వా మధురం జగుః॥ ౨౩౯॥ తదాగతం శంకరేణ ప్రేషితం రవిసన్నిభం । శివభక్తగణాకీర్ణం ఘంటామణి మహాస్వనం॥ ౨౪౦॥ నృత్తైర్గీతైశ్చ వాద్యైశ్చ సంయుతం సర్వతశ్చరత్ । అశ్వైర్గజైశ్చ భూతైశ్చ సంయుతం రత్నభూషితం ॥ ౨౪౧ ॥ తద్విమానం సమాలోక్య దేవాంగోనందినాసహ । ఆరురోహజగద్దేవం శిష్యమామంత్ర్య సాదరం॥ ౨౪౨॥ వ్యోమయానం సమారూఢే దేవాంగే నందినాసహ । తద్విమానం క్షణాదేవ కైలాస మగమద్ధరం ॥ ౨౪౩ ॥ విమానాదవరుహ్యాథ దేవాంగస్తుశివాత్మజః । ననామసాంబమీశానంతుష్టావచముహుర్ముహుః॥ ౨౪౪॥ తథాభూతం సమీక్ష్యాథ స్వసుతం పార్వతీపతిః । అంకే నిధాయశిరసి చాఘ్రాయముముదేభృశం॥ ౨౪౫॥ ఇతిశ్రీ బ్రహ్మకృతే - బ్రహ్మాండపురాణే - ఉత్తరఖండే - దేవశాలి అవతార పరిపూర్తిర్నామ - సప్తవింశోధ్యాయః.

సూతః॥ అథైకదా మహావృద్ధః నారదస్తపతాం వరః । మహాదేవస్య

---

శాలి యాజగద్దేవరాజున కాశీర్వాదముచేసి క్షణములోపల దేవాంగుఁడాయెను- అప్పుడు దేవతలదుందుభులుమ్రోసెను- పుష్పవానగురిసెను- అప్సరసలాడిరి గంధర్వులు మనోహరముగఁ బాడిరి- అప్పుడు శివునిచేతఁ బంపఁబడి వచ్చినట్టియుసూర్యునితో సమానమైనట్టియు శివభక్తసమూహములతోఁగూడినట్టియు ఘంటలచేత మిక్కిలి నాదముగలయట్టియు ఆటలతోను బాటలతోనువాద్యములతోనుగూడినట్టియుసంతతసంచరించునట్టియుగుఱ్ఱములతోడనేనుఁగులతోడనుభూతములతోడనుగూడినట్టియు రత్నములచేత నలంకరింపఁబడినవిమానమునుజూచి దేవాంగుఁడుశిష్యుఁడైనజగద్దేవునితోఁదనపయినమును జెప్పనందీశ్వరునితోఁగూడ నావిమానమునెక్కెను- ౨౪౨- దేవాంగుడు నందితోఁగూడనెక్కఁగానె యప్పుడా విమానము క్షణములో కైలాసపర్వతమునకు బోయెను - అంత నాశివునికొడుకైన దేవాంగుఁడు విమానముదిగి పార్వతీసహితుఁడైన యీశ్వరుని నమస్కరించి పెక్కుమారులు స్తోత్రముచేసెను- అంతనాసాంబశివుఁ డట్టిననకొడుకునుజూచి తొడమీఁద గూర్చుండఁబెట్టుకొని తలముద్దుపెట్టుకొని మిక్కిలి సంతోషించెను- ౨౪౫- ఇది బ్రహ్మస్వరూపమైన బ్రహ్మాండపురాణమునం దుత్తరభాగమందు దేవశాలి యవతారపరిపూర్తియన్నది యిరువది యేడవ యధ్యాయము.

సూతపౌరాణికుఁడు పిమ్మటికథ నాఋషులకుఁ జెప్పుచున్నాఁడు - ఓబ్రాహ్మ

సేవార్థం కైలాస మగమద్ద్విజాః॥ ౧॥ నత్వాస్తుత్వాచ బహుధా స్థితంతం ప్రాంజలింమునిం। అబ్రవీచ్ఛంకరోవాక్యం నారదంతాపసోత్తమాః॥ ౨॥ సంగచ్ఛతేమమాచారో లోకేనారదతద్వద। ఇతిపృష్టశ్శంకరేణ ప్రత్యువాచతపోనిధిః॥ ౩॥ భగవన్ దేవదేవేశ చంద్రమౌళే మహేశ్వర। పర్యటామ్యఖిలాన్లోకాన్ క్వసపశ్యామితేవ్రతం॥ ౪॥ యత్రయత్రచ దేవేశ దృశ్యంతే వైష్ణవాభృశం। అటతోమమ సర్వత్ర శైవస్తు ప్రియదర్శనః॥ ౫॥ తేనోక్తమేవం వచనంశ్రుత్వా శంభుర్మహేశ్వరః। దేవాంగంతం సమాలోక్య వచనంచేదమబ్రవీత్॥ ౬॥ హేదేవాంగభవాన్ భూమౌ శైవోభూత్వా మమవ్రతం। విస్తారయతు మద్భక్త స్సర్వ సంపత్ప్రదాయకం॥ ౭॥ శంభునేతి సమాదిష్టో సదేవాంగోథభూసురాః। ఉత్థాయ ప్రాంజలరితి కరిష్యామితథాబ్రవీత్॥ ౮॥ తదావతర్తుం భూలోకం గంతుమున్ముఖమాత్మజం। అబ్రవీత్ పార్వతీదేవీ దేవాంగం సస్మితం వచః॥ ౯॥ పురా చౌడేశ్వరీ భూత్వా తవశత్రూన్నిహత్య

---

ణులారా పిమ్మట మిక్కిలి ముసలివాఁడైనట్టియు ఋషిశ్రేష్ఠుఁడైన నారదుఁడు శివసేవార్థము కైలాసపర్వతమునకుఁ బోయెను - ఓఋషిశ్రేష్ఠులారా యీ ప్రకారముపోయినమస్కరించి బహుభంగులస్తోత్రములుచేసి చేతులుమోడ్చుకొనినిలిచియున్న యీ నారదమహామునితో సాంబమూర్తియిట్లనెను- ఓనారదమునీ లోకమున నాయాచారము చక్కఁగా నున్నదాచెప్పుము - అనియిట్లాసాంబమూర్తిచేత నడుగఁబడి నారదముని యుత్తరము చెప్పుచున్నాఁడు - ఓషడ్గుణైశ్వర్య సంపన్నుఁడవైనట్టియు దేవదేవులకెల్ల నీశ్వరుఁడవైనట్టియుఁ జంద్రునిఁతలను ధరించినట్టి మహేశ్వరుఁడా నేనెల్లలోకములు తిరుగుచున్నానొక్కచోటను నీవ్రతమునుజూడను- అంతట నేనుదిరుగుచున్నప్పుడు నాకక్కడక్కడ వైష్ణవులు మెండుగాఁ గానఁబడుచున్నారు శైవునిఁజూడవలెనన్న కోరిక నాకధికమైయుండును - ౫ - అనియిట్లా నారదమహాముని చెప్పఁగా నామాటవిని సాంబశివుడు దేవాంగునిఁజూచి యొకమాట చెప్పెను- ఓదేవాంగుఁడా నీవునాభక్తుడవుగనుక భూమియందు శైవుఁడవై సకలసంపదలనిచ్చునట్టి నావ్రతమును విస్తరింపఁజేయుము - అనియిట్లాసాంబమూర్తిచేత నాజ్ఞాపింపబడి యీదేవాంగుఁడులేచి చేతులు కట్టుకొని యట్లే చేసెదననె నో బ్రాహ్మణులారా - అప్పుడు భూలోకమున నవతరింపఁబోనుద్యుక్తుఁడై తనకొడుకైన దేవాంగునిఁగూర్చి పార్వతీదేవి చిరునగవుతో నొకమాటచెప్పెను - పూర్వ

చ । దత్తవత్యఖిలానిష్టాన్ వరాన్ ఖలు మహామతే ॥ ౧౦ ॥ తస్మాత్తవకుల
స్థానాం సర్వేషామిష్టదేవతా । చౌడేశ్వరీ పూజనీయా సర్వదుఃఖ నివారణీ॥
౧౧ ॥ పురా రామేశ్వరక్షేత్రే పూజితో రావణారిణా । రామలింగాభిధః శం
భుః పూజనీయస్సదా త్వయా ॥ ౧౨ ॥ ధర్మార్థ కామమోక్షాణాం దాతా
బ్రహ్మాదిపూజితః । త్వద్వంశ్యైః సాదరం పూజ్యః సశివః పరమేశ్వరః॥ ౧౩॥
రామలింగస్య దేవస్య చౌడేశ్వర్యాశ్చ పూజనాత్ । సర్వాన్ కామాన్
ప్రాప్నువంతి త్వద్వంశ్యా నాత్రసంశయః॥ ౧౪॥ ఇత్యుక్త్వా పార్వతీదేవీ దే
వాంగం కమలేక్షణా । ప్రాహిణోదాత్మజం శంభోః ఫాలనేత్ర సముద్భవం॥
౧౫॥ అథ గంగాధరాఖ్యస్య ఆమోద పురభూభృతః । పుత్రస్య వీరరుద్రస్య
దేవాంగోభవదాత్మజః॥ ౧౬॥ తతఏకాదశదినే వీరరుద్రో మహీపతిః । జాత
కర్మ ప్రారభత కర్తుం పుత్రస్య వైదికం॥ ౧౭॥ తదాగౌరీపతిర్గేహం కుమా
రస్వామిసంయుతః । ఆగచ్ఛద్వీరరుద్రస్య వృద్ధ బ్రాహ్మణ రూపధృత్ ॥
౧౮॥ తమాగతం దేవదేవం వృద్ధబ్రాహ్మణరూపిణం । వీరరుద్రో మహాప్రాజ్ఞః

---

ము చౌడేశ్వరిగా నవతరించి నీశత్రువుల నెల్ల సంహారించి నీకు గోరినవరముల నెల్లనిచ్చితిని గనుక నో మిక్కిలి బుద్ధిశాలీ నీకులమువారి కందఱకు సమస్తదుఃఖములను బోఁగొట్టునట్టి చౌడేశ్వరీ యిష్టదేవతగాఁ బూజచేయందగినది- ౧౧- మును పురావణునిఁ జంపిన శ్రీరామునిచేత రామేశ్వరక్షేత్రమందు బూజింపఁబడిన రామలింగస్వామిని నీవు పూజజేయవలయును - ధర్మార్థ కామమోక్షములనిచ్చునట్టియు బ్రహ్మ మొదలగువారిచేతఁ బూజింపఁబడిన యాశివుఁడు నీవంశమువారిచేతఁ బ్రీతితోఁ బూజింపఁ దగినవాఁడు - నీవంశమువారు రామలింగస్వామినిఁ చౌడేశ్వరినిఁ బూజించుటవలన నెల్లకోరికలనుబొందుదురు సందేహములేదు - అనిచెప్పి యాపార్వతీదేవి సాంబమూర్తి నొసటికంటఁబుట్టినకొడుకైన దేవాంగునిఁ బంపెను- ౧౫- అంత నాదేవాంగుఁడా మోదపట్టణమునకురాజైన గంగాధరునికొడుకగు వీరరుద్రునికిఁ బుత్రుఁడుగాఁబుట్టెను - తరువాతఁ బదునొకండవదినమందు వీరరుద్రరాజు కొడుకునకు వైదికమైన జాతకర్మముచేయనారంభించెను - అప్పుడు పార్వతీపతి కుమారస్వామితోఁ గూడినవాఁడై వృద్ధబ్రాహ్మణవేషము ధరించి వీరరుద్రరాజు నింటికి వచ్చెను వృద్ధబ్రాహ్మణరూపమును ధరించి వచ్చిన దేవదేవుఁడైన సాంబశివునిఁ జూచి మిక్కిలి తెలిసినయావీరరుద్రుఁడు సంతోషించినవాఁడై శాస్త్రోక్తరీతిని షోడశోపచా

దృష్ట్వానంద సమన్వితః॥ ౧౯॥ ఉపచారై ష్షోడశభిః అర్చయిత్వా యథావిధి। రమణీయె హేమపీఠె రత్నదీప్తే నివేశయత్ ॥ ౨౦ ॥ తతస్స భగవాన్ సాక్షాత్ వీరరుద్రతనూభువః। లింగదీక్షా మాగమోక్తాం చకార విధివద్విభుః॥ ౨౧ ॥ నామచక్రేచ తస్యాపి దేవదాస ఇతీశ్వరః। దేవదుందుభయోనేదుః పుష్పవృష్టి స్తదాపతత్ ॥ ౨౨ ॥ తతకుమార సహితః బ్రహ్మరూపీ పరాత్పరః। అంతర్ధానం చకారాశు సర్వేషాం పశ్యతాంసతాం॥ ౨౩॥ తదాకోలాహలోజజ్ఞె క్వాసౌ బ్రాహ్మణపుంగవః। గతవాన్ పుత్ర సహితః ఇతిబ్రాహ్మణసంసది॥ ౨౪॥ తతః ప్రాదురభూత్ దివ్యావాగానందప్రదాయినీ। వీరరుద్ర మహీపాల తవపుత్రస్య శంకరః॥ ౨౫॥ రామలింగేశ్వర స్సాక్షాత్ ఆగత్యస్వయమేవహి। లింగదీక్షాం నామకృత్వా ఝుడిత్యంతరధాచ్ఛసః॥ ౨౬॥ తస్మాత్తవసుతో విద్వాన్ రామలింగేశ భక్తిమాన్ చౌడేశ్వరీ దేవతాయా స్సమారాధనతత్పరః॥ ౨౭॥ ఉద్ధరిష్యతిలోకేస్మిన్ వీరశైవమతం సుధీః। ఇతి శ్రుత్వాకాశగతాం వాణీం ముముదిరేజనాః॥ ౨౮॥ తతశ్శ్రీమాన్ వీరరుద్రః

---

రములచేతఁబూజించి రత్నములచేతఁబ్రకాశించి సొగసైయున్న బంగారపుపీట యందుఁగూర్చుండఁబెట్టెను- ౨౦- అంతనాసర్వవ్యాపకుఁడైన భగవంతుఁడు సాంతముగా నావీరరుద్రునికుమారున కాగమమందుఁ జెప్పఁబడిన లింగదీక్షను విధిప్రకారముచేసెను - మఱియు నాయీశ్వరుఁ డతనికి దేవదాసుఁడని పేరుపెట్టెను అప్పుడు దేవతల నగారాలుశబ్దించెను పుష్పములవానగురిసెను - అంతనా పరబ్రహ్మస్వరూపుఁడైన యీశ్వరుఁ డందఱు చూచుచుండఁగానే కుమారస్వామితోఁగూడినవాఁడై యంతర్ధానమునొందెను - అప్పుడక్కడి బ్రాహ్మణసభయందు దీకొడుకుతోఁగూడవచ్చిన బ్రాహ్మణోత్తముఁ డెక్కడఁబోయెనని కోలాహలముకలిగెను - అంత నానందమునుగలుగఁజేయునట్టి యాకాశవాణి వినవచ్చెను - ఓవీరరుద్రమహారాజా సమస్త శుభములనుజేయునట్టి రామలింగేశ్వరుఁడు తాను సాంతముగావచ్చి నీకొడుకునకు లింగదీక్షను నామకరణమునుజేసి తిరిగి యంతర్ధానమునొందెను- ౨౬- కాఁబట్టి నీకొడుకుపండితుఁడును రామలింగస్వామియందు భక్తిగలవాఁడును చౌడేశ్వరీదేవత పూజయందాసక్తుఁడునై యీలోకమునందు వీరశైవమతము నుద్ధరింపఁగలఁడు అనియిట్లాకాశమునవినఁబడ్డమాటనువిని జనులందఱుసంతోషించిరి- అంతశ్రీమంతుడైన వీరరుద్రరాజా మహోత్సవసమయమందుఁ దనకొడుకు నభివృద్ధికొఱ

రాజాతస్మిన్ మహోత్సవే । ఆత్మజస్యాభి వృధ్యర్థం దానాని బహుధా కరోత్ ॥ ౨౯ ॥ కన్యాదానం భూమిదానం వస్త్రదానం తథైవచ । గజదానం చాశ్వదానం వృషదానమనుత్తమం॥ ౩౦॥ దాసీదానం దాసదానం గృహదానం సుపుణ్యదం । తిలదానం కుంభదానం మాషదానమతఃపరం॥ ౩౧॥ ఘృతదానం తక్రదానం క్షీరదానం తథైవచ । గుడదానం పాపహరం శర్కరాదానమేవచ॥ ౩౨॥ కదళీఫలదానం చరసాల ఫలదానకం । మాషాపూప ప్రదానంచ రత్నదానం తథైవచ॥ ౩౩॥ పానసానాం ఫలానాంచ దానం సౌఖ్యప్రదం సదా। ఛత్రదానం స్వర్ణధానం పాదుకాదానమేవచ॥ ౩౪॥ బహూన్యన్యానిదానాని వీరరుద్రో మహీపతిః । బ్రాహ్మణేభ్యో దదౌ ప్రీత్యా స్వపుత్రస్యాభి వృధయె॥ ౩౫॥ తతః ప్రవవృధేబాలః బాలసూర్యసమప్రభః । దేవదాస ఇతిఖ్యాతః శుక్లపక్షే శశీయథా ॥ ౩౬ ॥ తదా కైలాస శిఖరే రత్నసింహాసనేస్థితః । సాంబః ప్రోవాచ మహిషీం దేవాంగస్య శుచిస్మితాం॥ ౩౭॥ హే దేవదత్తే హే వత్సే బంగాళాధీశ్వరస్యవై । సులక్షణాయాం భార్యాయాం జన్మప్రాప్నుహి సాంప్రతం॥ ౩౮॥ ఇత్యుక్తాసా దేవదత్తా శివాజ్ఞాం ప్రాప్య సాదరం । బంగా

---

కుఁ బెక్కువిధముల దానములుచేసెను- ౨౯ - కన్యకలదానమును భూదానమును దోవతులయీవియు నేనుఁగులయీవియు గుఱ్ఱములయీవియు మిక్కిలిశ్రేష్ఠమైనయెద్దులయీవియు దాసీజనులనిచ్చుటయు దాసజనులనిచ్చుటయుమంచిపుణ్యమునుగలుగఁజేయుగృహదానమునునువ్వులయీవియుఁగడవలయీవియుమినుములయీవియు నేతిదానమును మజ్జిగదానము నల్లె పాలదానమును బెల్లముదానమునుదురితనాశకరమైన చక్కెరయీవియు నఱటిపండ్లదానమును మామిడిపండ్లయీవియు వడలయీవియు మణులయీవియు నెల్లప్పుడు సౌఖ్యమునిచ్చునట్టి పనసపండ్లదానమును గొడుగుల దానము బంగారము నీవియుఁ బాపుకోళ్లయీవియు మఱియు ననేకము నావీరరుద్రుఁడు తనకొడుకుయొక్కయభివృద్ధికొఱకుఁ బ్రీతితో బ్రాహ్మణులకిచ్చెను - ౩౫ - లేత సూర్యునివంటి కాంతిగల యాచిన్నవాఁడు దేవదాసుఁడని ప్రసిద్ధివహించి శుక్లపక్షమునఁ జంద్రుఁడు వృద్ధిఁ బొందునట్లు వృద్ధిబొందెను - అప్పుడు కైలాసపర్వతము శిఖరమున రత్నసింహాసన మందున్న సాంబమూర్తి స్వచ్ఛమైన చిఱునగవుగల దేవాంగునిభార్యనుగూర్చియిట్లనెను- ఓదేవదత్తా నీవిప్పుడు బంగాళదేశపురాజుభార్యయైన సులక్షణయందుజన్మమునొందుము- అని చెప్పఁబడినదై యాదేవ

ళేశ్వర భార్యాయాః గర్భం ప్రావిశదుత్తమం ॥ ౩౯ ॥ తతస్సా దశమేమాసి
సర్వలక్షణలక్షితా । బంగాళేశ్వర భార్యాయాః అజాయత శుభాకృతిః ॥ ౪౦॥
తతః పుత్ర్యాం సుజాతాయాం చంద్రశేఖరనామకః । బంగాళరాజో ముముదే
సర్వబంధు సమన్వితః ॥ ౪౧ ॥ జాతకర్మాదికం తస్యాః యథావిధి చకారసః ।
బ్రాహ్మణేభ్యశ్చ విద్వద్భ్యః ప్రదదౌ భూరిదక్షిణాం ॥ ౪౨ ॥ అశరీరః పుమాన్
కశ్చిత్ తదా బంగాళభూపతిం । ప్రోవాచరాజన్ త్వత్పుత్ర్యాః నామధేయం
కురుష్వవై ॥ ౪౩॥ దేవదత్తేతి భూపాల దేహ్యేనాం తనయాం ముదా । పుత్రా
య వీరరుద్రస్య దేవదాసాయ సాదరం॥ ౪౪॥ ఇత్యుక్త్వాసౌ తిరోధధే దివ్యః
పుమాన్ శ్రుత్వా సతద్వచః । తథైవ కరవాణీతి నిశ్చిత్య స్థితవాన్నృపః॥ ౪౫॥
తదాతు వీరరుద్రస్య తనయః పంచవర్షకః । దేవదాసో మహాప్రాజ్ఞః లోకానం
దకరోభవత్ ॥ ౪౬॥ కృతోపనయనః పిత్రా దేవదాసో మహాద్యుతిః । వీరరు
ద్రేణ సకలాః విద్యాశ్చాధీతవాన్ గురోః ॥ ౪౭ ॥ అధీత సర్వవిద్యాయ సర్వ
జ్ఞాయ మహాత్మనే । తవపుత్రాయ హేరాజన్ వీరరుద్ర మహామతే॥ ౪౮ ॥ దే

---

దత్త శివునాజ్ఞ నాదరణముతోఁ బొంది యుత్తమమైన బంగాళేశ్వరుని పెండ్లాము
కడుపు వొచ్చెను- పిమ్మటఁ బదవమాసమందా దేవదత్త యాబంగాళేశ్వరుని భా
ర్య కెల్ల లక్షణములతోఁ గూడినదై మనోహరమైనయాకారముతోఁ జన్మించెను-
౪౧ - అంతఁ గొమార్తె పుట్టఁగానే బంగాళదేశపు రాజైన చంద్రశేఖరుఁడు
బంధువులతోఁ గూడినవాఁడై సంతోషించెను- అప్పుడాబంగాళరాజు పుట్టిన
కూతునకు జాతకర్మము మొదలగు సంస్కారములనువిధిప్రకారముచేసి పండితు
లైన బ్రాహ్మణులకు భూరిదక్షిణయిచ్చెను- అప్పుడుశరీరములేని యొకానొకపు
రుషుఁడు బంగాళరాజుతోఁ జెప్పుచున్నాఁడు - ఓయిరాజా నీకూతునకు దేవద
త్తయని పేరుపెట్టుము- ఈపెను వీరరుద్రునికొడుకైన దేవదాసునికొఱకుఁ బ్రీ
తితోనిమ్ము- అనిచెప్పి యాయశరీరపురుషుఁ డంతర్ధానమునొందెను ఆబంగాళ
రాజామాటవిని యట్లెచేయుదునని నిశ్చయించికొనియుండెను- ౪౫- అప్పుడు
వీరరుద్రునికొడుకైన దేవదాసుఁడయిదేండ్లవాఁడై జగత్తునకానందమునుగలు
గఁజేయువాఁడాయెను మిక్కిలిబుద్ధిశాలియయిన యాదేవదాసుఁడుతండ్రియైన
వీరరుద్రునిచేత నుపనయనముచేయఁబడి గురువువలన నెల్లవిద్యలను జదివెను
అప్పుడు మిక్కిలి బుద్ధిమంతుఁడవైన యో వీరరుద్రమహారాజా సకల విద్యలు
చదివినట్టియు సమస్తము తెలిసినట్టియు మహానుభావుఁడైనట్టియు నీకొడుకైన

వదాసాయ మే కన్యాం దేవదత్తాభిధాం శుభాం । దదాని నాత్రసందేహః ఇతిబంగాళభూపతిః॥ ౪౯॥ పత్రికాం ప్రేషయామాస వీరరుద్రాయ భూభృతే । తతస్స వీరరుద్రోపి భార్యా పుత్ర సమన్వితః ॥ ౫౦ ॥ చతురంగ బలోపేతః పురోహిత సమన్వితః । బంగాళ రాజసదనం అగమత్సుకుతూహలీ॥ ౫౧॥ తం దృష్ట్వా రాజశార్దూలం వీరరుద్రం సపుత్రకం । బంగాళరాజోముముదే చాలిలింగ ముహుర్ముహుః॥ ౫౨॥ తతఆజ్ఞాపయామాస సానందం చంద్ర శేఖరః। అలంకర్తుం స్వభవనం పట్టణం చ్చస్వ సేవకాన్ ॥ ౫౩ ॥ సేవకా స్త్వరితా భూత్వా తెలం చక్రుః పురం మహత్ । తదా భాతిస్మ నగరం రాజసద్మ సమన్వితం॥ ౫౪॥ వజ్రవైడూర్యఖచితైః స్వర్ణ స్తంభై ర్విరాజితం । వితానై శ్చిత్ర సంయుక్తైః నానాలంకార సంయుతైః॥ ౫౫॥ సఫలైః కదళీ స్తంభైః తోరణై శ్చ ప్రకాశితం । వేదికాభిః ప్రపాభిశ్చ తత్రతత్రసుశోభితం॥ ౫౬॥ మహేంద్రలోక సదృశం కుబేర నగరోపమం । తద్దృష్ట్వాలంకృతం సర్వం స్వవేశ్మ చమహీపతిః॥ ౫౭॥ చంద్ర శేఖర నామాసౌ తౌర్యత్రిక సమన్వితః । ఆహూ

---

దేవదాసునికొఱకునాకూతురైన శుభలక్షణములతోఁగూడిన దేవదత్తనిచ్చెదనుసందియమువలదని వీరరుద్రమహారాజునకు బంగాళరాజు జాబు పంపెను - అంతనావీరరుద్రమహారాజు తనభార్యనుగొడుకునుబిలుచుకొని నాలుగంగములుగలదండును వెంటఁబెట్టుకొని పురోహితులతోఁ గూడినవాఁడై మిక్కిలి యుత్సాహముతో బంగాళరాజింటికిఁబోయెను- ౫౧- ఈప్రకారముకొడుకుతో వచ్చిన యా వీరరుద్రరాజును జూచి బంగాళరాజు సంతోషించి యాలింగనముచేసికొనెను - అంతట నాచంద్ర శేఖరుఁడానందముతోఁ దనయింటిని బట్టణమునలంకరింపను సేవకులకాజ్ఞ చేసెను - సేవకులు త్వరపడినవారై గొప్పదైన యాపట్టణమునలంకరించిరిఅప్పుడారాజునిల్లు నాపట్టణమునువజ్రములు వైడూర్యములుచెక్కిన బంగారు కంబములచేతఁ బ్రకాశింపఁ జేయఁబడి చిత్రములతోఁగూడి యనేకశృంగారములుగలిగియున్న చందువలతోఁగూడినదై పండ్లగొలలతోనున్న యఁటిచెట్లచేతనుదోరములచేతను విలసిల్లుచున్నదై యక్కడనక్కడఁదిన్నెలచేతను జలివింద్రలచేతను మనోహరమై యొప్పెను- ౫౬ - ఇట్లలంకరింపఁబడి దేవేంద్రునిలోకముతో సమానముగాను గుబేరునింటితో సరిగానున్న తనపట్టణమును నింటినాచంద్ర శేఖరరాజుచూచి నృత్తగీతవాద్యములతో గూడినవాఁడై తల్లిదండ్రులు మొదలగువారితోఁగూడిన దేవద సునిఁబిలి

తదా దేవదాసం మాతాపిత్రాదిసంయుతం॥ ౫౮॥ ఆహూతో దేవదాసస్తు మాతాపితృ సమన్వితః। చతురంగ బలోపేతః తౌర్యత్రిక సమన్వితః॥ ౫౯॥ బంగాళరాజస్య తదాకల్యాణ భవనోత్తమం। తౌర్యత్రికేణ సహితం పురోహితయుతో యయౌ॥ ౬౦॥ తతః పురోహితో విద్వాన్ ప్రాప్య కల్యాణ వేదికాం। వధూవరౌ సమానీయ తత్రవేద్యాం న్యవేశయత్॥ ౬౧॥ తతస్సవిప్రైస్సహితః ప్రతిష్ఠాప్య హుతాశనం। జుహావ వేదమంత్రేణ వైవాహిక విధానతః॥ ౬౨॥ తతో బంగాళ రాడ్విద్వాన్ స్వకం వ్యాం సమలంకృతాం। ప్రదదౌ దేవదాసాయ మంత్రోదక పురస్సరం॥ ౬౩॥ తత్ర భేర్యాది వాద్యానాం తౌర్యత్రిక సమన్వితః। ధ్వనిః ప్రాదురభూదుచ్చైః సంవ్యాప్త భువనత్రయః॥ ౬౪॥ దేవదుందుభయో నేదుః పుష్పవృష్టిశ్చ ఖాచ్చ్యుతా। ననృతుశ్చాప్సరస్సంఘాః గంధర్వాశ్చ కలం జగుః॥ ౬౫॥ అస్తువంశ్చ తదా హృష్టాః సూతమాగధవందినః। గౌరీకల్యాణమిత్యాదిగానంచక్రుః పురాంగనాః॥ ౬౬॥ తదా బంగాళదేశేశః స్వపుత్ర్యై స్త్రీధనం దదౌ। దాసీదాస జనాం శ్చైవ గ్రామాణాంచ శతు శ్శతం॥ ౬౭॥ జామాత్రే దేవదాసాయ చంద్ర శేఖర భూ

---

చెను- పిలువఁగానే యా దేవదాసుఁడు తల్లిదండ్రులతోను నాలుగంగములుగల దండుతోను బురోహితులతోను గూడినవాఁడై నృత్తగీతవాద్యములతో నొప్పుచున్న యా బంగాళ రాజు యొక్క మంగళ యుక్తమైన యింటిని గౌర్యత్రికముతోఁ బ్రవేశించెను - ౬౦ - అంత విద్వాంసుఁడైన పురోహితుఁడు పెండ్లి యరుగు మీదికిఁ బోయి వధూవరులను బిలిచి యా పెండ్లి యరుగు మీఁదఁ గూర్చుండఁ బెట్టెను - కూర్చుండఁబెట్టి యతఁడు బ్రాహ్మణులతోఁ గూడినవాఁడై యగ్నిప్రతిష్ఠాపనచేసి వైదికమంత్రములతోఁ బెండ్లిక్రమముప్రకారము హోమముచేసెను అంతట విద్వాంసుడైన బంగాళరాజుసింగారింపఁబడిన తనకొమార్తెను దేవదాసునికొఱకు మంత్రోదకపూర్వకముగానిచ్చెను- ౬౩- అక్కడ నృత్తగీత వాద్యములతోఁ గూడినదై భేరి మొదలగువాని ధ్వని మూఁడులోకములనువ్యాపించినదై గట్టిగమ్రోసెను- దేవతల నగారాలుశబ్దించెను పుష్పలవాన యాకసమువలననుండి కురిసెను- అప్సరసలసమూహములాడెను గంధర్వులుమధురముగఁ బాడిరి- అప్పుడుసూతులుమాగధులువందులు సంతోషించినవారై పొగడిరి- పట్టణమందలి స్త్రీలు గౌరీకల్యాణము మొదలైన పాటలు పాడిరి - అప్పుడు బంగాళదేశపురాజు

మిపః । ముక్తాహారాన్ రత్నహారాన్ కిరీటం చాంగదేతథా॥ ౧౮ ॥ స్వర్ణ సూత్రం చాంగుళీయం నానారత్న సమన్వితం । వస్త్రాణిచ మహార్హాణి ప్రదదౌ ప్రీతిసంయుతః॥ ౧౯ ॥ తత్రైవ వీరరుద్రంచ భార్యాబంధుసమన్వితం । సన్మాన్య బహుధారాజా ససైన్యం స పురోహితం॥ ౨౦॥ ప్రేషయామాస ముదితం ఆమోదనగరం ప్రతి । వీరరుద్రో మహీపాలః భార్యా పుత్రాదిసంయుతః॥ ౨౧ ॥ చతురంగబలోపేతః సదశ్వైః సమలంకృతం । దివ్యం రథమధిష్ఠాయ ప్రాపస్వనగరంముదా॥ ౨౨॥ తస్యపుత్రో దేవదాసోరమమాణస్స్వభార్యయా। వ్యరోచత మహాబాహుః రత్యేవ మకరధ్వజః ॥ ౨౩ ॥ శివపూజా పరశ్చైవ పురాణ శ్రవణోత్సుకః । శివధ్యాన పరోనిత్యం శివభక్తాన్న దానదః॥ ౨౪॥ వర్తతే శైవగోష్ఠ్యైవ వీరరుద్ర తనూభవః । అకల్పయ ల్లింగదీక్షాం దేవదాసః శివప్రియః॥ ౨౫॥ నిరీశ్వరాణాం సర్వేషాం నోరీ చక్రేమతం సుధీః । జఘన్యజానా మర్యాణాం క్షత్రియాణా మనేకశః ॥ ౨౬ ॥ బోధయిత్వా వ్రతం శైవం వీరశైవాన్ సతాన్ సుధీః । కృత్వా ప్రకాశయామాస వీరమా

---

తనకూతుకొఅకు స్త్రీధనముగా నన్నూరు గ్రామములను దాసీదాసజనులను నిచ్చెను- మఱియునాచంద్రశేఖరుఁడు ప్రేమముతోఁగూడినవాఁడై యల్లుని కొఅకుముత్యాలదండలనురత్నాలసరములనుగిరీటమునుభుజకీర్తులనుబంగారు మొలత్రాటి ననేకరత్నములుచెక్కిన యుంగరమును శ్రేష్ఠములైన దోవతుల నిచ్చెను- ౧౯- అట్లెభార్యతోను బంధువులతోనుగూడిన యావీరరుద్రరాజు నునతనిసేనలతోడను బురోహితులతోడనుసన్మానించి సంతోషపఱిచి యతని పట్టణమును గూర్చిపంపెను - వీరరుద్రరాజును భార్యకొడుకు మొదలయినవారితోఁగూడుకొన్నవాఁడై నాలుగంగములుగలదండుతోఁ గూడుకొన్నవాఁడై మంచిగుఱ్ఱములచేతనొప్పుచున్నరథమునెక్కి సంతోషముతోఁదనపట్టణమున కుఁబోయెను - అతనికొడుకుదేవదాసుఁడుతనభార్యతోఁగ్రీడించుచురతితోఁగ్రీడించుమన్మథునివలె నొప్పియుండెను- ౨౩- మఱియు నతఁడు శివపూజ యందాసక్తుఁడై పురాణములవినికియందుత్సాహముకలిగి యెల్లప్పుడు శివునిధ్యానముచేయుచు శివభక్తులకన్న దానముచేయుచు శైవగోష్ఠితోనేయుండెను- మఱియుశివునకిష్టుఁడైన యాదేవదాసుఁడు పెక్కండ్రకు లింగదీక్షనుజేయించెను - పండితుఁడైన యతఁడు నిరీశ్వరులుగానుండువారిమతము నొకదానినైన నంగీకరింపఁడాయెను - శూద్రులకును వైశ్యులకును బెక్కండ్రుక్షత్రియుల

హేశ్వరవ్రతం ॥ ౭౭ ॥ శివభక్తియుతాలోకే భస్మరుద్రాక్షధారిణః । శై
వా విరేజిరే నేన కారితా బహవో జనాః॥ ౭౮॥ ఏవం బహూనుపదిశ్య శైవ
వ్రతమనుత్తమం । జనాంశ్చకారయిత్వా శైవాన్ దేవదాసశ్శివప్రియః॥ ౭౯॥
ఏవం ప్రవర్తమానస్య తస్య శంభో రనుగ్రహాత్ । ఏకో రామ ఇతిఖ్యాతః
ఆత్మజస్సమజాయత ॥ ౮౦ ॥ విరూపాక్షాభిధానంచ యస్యా భూల్లోక విశ్రు
తం । సబాలో వవృధే శ్రీమాన్ లాలితో దేవదత్తయా॥ ౮౧॥ స దేవదాసో
నుదినం మతం శైవం ప్రకాశయన్ । రామలింగేశ పూజాయాం అభూత్ సం
సక్తమానసః॥ ౮౨॥ తథాభూతం దేవదాసం బౌద్ధా దృష్ట్వా రుషాన్వితాః ।
మంత్రయామాసు రన్యోన్యం శైవమార్గ జిఘాంసయా ॥ ౮౩ ॥ మంత్ర
యిత్వా తతస్సర్వే కర్తవ్యస్యచ నిశ్చయం । కృత్వా సర్వే దేవదాసస్య రం
ధ్రాన్వేషణతత్పరాః ॥ ౮౪ ॥ ఏకదా రామలింగేశం పూజయిత్వా యథా
విధి । దేవదాసో నివవృతే గృహం గంతుం సముత్సుకః॥ ౮౫॥ తదా బౌద్ధాస్స
ర్వే వసరుధ్వా మార్గంతు తస్యవై । అబ్రువం స్తం దేవదాసం శివః కో వాక్వ
వర్తతే॥ ౮౬ ॥ శైవమేవ మతం శ్రేష్ఠ మితిలోకే త్వయాధునా । ప్రశస్యతే దే

---

కు నతఁడు శైవ వ్రతమునుబోధించి వారినందఱును శైవులఁగాఁజేసి వీరమా
హేశ్వరవ్రతమును వెలయించెను - ౭౭ - అతనిచేత శైవులుగాఁజేయఁబడిన
వారు పెక్కండ్రు శివభక్తిగలవారై విభూతిని రుద్రాక్షలనుధరించి ప్రకాశించి
రి- శివునకుఁబ్రియుఁడైన యా దేవదాసుఁ డీప్రకార మనేకులకు శైవవ్రతమును
పదేశించుచు వారినందఱను శైవులనుగాఁజేసెను - ఈ ప్రకారము ప్రవర్తించు
చున్న యతనికి శివుని యనుగ్రహమువలన రావని యొక కొడుకు పుట్టెను - ఆకొడుకు
నకు విరూపాక్షుఁడను పేరు లోకమునఁ బ్రసిద్ధముగా నుండును - అతఁడు తల్లి
యైన దేవదత్తచేత బుజ్జగింపఁబడుచుఁ బెరిగెను - ౮౧ - ఆ దేవదాసుఁడు నిత్య
ము శైవమతమును వెలయించుచు రామలింగేశ్వర పూజయం దాసక్తుఁడై
యుండెను- అట్లున్న దేవదాసుని బౌద్ధులు చూచి కోపముతోఁ గూడినవారై శై
వమతమునాశముచేయనిచ్ఛచేత నందఱునొకటిగాగూడి యాలోచించిరి - ఆ
లోచించి చేయదగినదానిని నిశ్చయించుకొని దేవదాసుని సందుకట్టు వెదకుటయం
దాసక్తులైరి - ఒకానొకప్పుడు దేవదాసుఁడు రామలింగేశ్వరపూజచేసి యిం
టికి బోనిచ్ఛగలవాఁడై మరలెను- ౮౫- అప్పుడు బౌద్ధులందఱును తనిత్రోవనడ్డ
గించియతనితో నిట్లనిరి శివుఁడెవఁ డెక్కడనున్నాఁడు - ఓ దేవదాసుఁడా నీవి

వదాస సశివః క్వనువర్తతే॥ ౮౭॥ యస్యమంత్రశ్చ పూజాచ దీక్షాచైవతథై
యాధునా । సన్న్యాస్యతే దేవదాస సశివః క్వనువర్తతే ॥ ౮౮ ॥ ఇత్యాక
ర్ణ్యవచస్తేషాం దేవదాస స్తదాబ్రవీత్ । సశివః సర్వగోనిత్యః విభురాత్మా
పరాత్పరః॥ ౮౯॥ ఇతితస్య వచశ్శ్రుత్వా బౌద్ధావచనమబ్రువన్ । సశివఃప
రమాత్మాచ సర్వగశ్చేత్పరాత్పరః ॥ ౯౦ ॥ పిపీలికాం తద్వర్తీసన్ బ్రవీత్వే
వంవచోద్యనః । సర్వగోహ మనంతోహం శివోహం పరమేశ్వరః॥ ౯౧॥ ఇ
త్యుక్త్వావచనం యాంతీం బౌద్ధాస్తత్ర పిపీలికాం । దర్శయామాసు రేకాం
తేదేవదాసాయసాదరం ॥ ౯౨ ॥ దేవదాసో వచస్తేషాం శ్రుత్వాలోక్యపిపీలి
కాం । శివసంప్రార్థయామాస భక్తశంకరమీశ్వరం ॥ ౯౩ ॥ శివశంభోద
యాసింధో యదిత్వంసర్వగోహ్యసి । బౌద్ధోక్తవాక్యరీత్యాత్వం బ్రూహ్యద్య
వచనంవిభో॥ ౯౪॥ పిపీలికాం తద్వర్తీసన్ భక్తాభీష్టప్రదాయక । ఇతిసంప్రా
ర్థిత స్తేన భగవాన్ పరమేశ్వరః॥ ౯౫॥ పిపీలికాంతర్వర్తీసన్ వాచమూ
చేమహాద్భుతాం । లోకాశ్శృణుతమే వాక్యం యూయం భక్తిసమన్వితాః॥

---

ప్పుడు లోకమందు శైవమతమేశ్రేష్ఠమని నుతించుచున్నావు ఆశివుఁడెక్కడ
నున్నాఁడు ఓదేవదాసుఁడా నీవే శివునిపూజను మంత్రమును దీక్షనుసన్న్యాసిం
చుచుందువో యాశివుఁడెక్కడనున్నాఁడు - అనివారడుగఁగా నామాట దేవ
దాసుఁడువినియుత్తరముచెప్పుచున్నాఁడు - ఆశివుఁడుసర్వత్రయున్నాఁడునిత్యు
డువిభుడుపరముకంటెఁబరుఁడు- అనియాదేవదాసుఁడుచెప్పిననామాటవినిబౌ
ద్ధులిట్లనిరి - ఆశివుఁడుపరమాత్మయు నంతటనుండువాఁడునైన పక్షమునఁ జీమ
లోపలనుండి యిప్పుడుమాతోనే నంతటనుండువాఁడను బరమేశ్వరుడనని యి
ట్లుమాటలాడవలయును - అనిచెప్పిబౌద్ధులక్కడఁబోవుచున్నచీమను దేవదా
సునికొఱకుఁజూపిరి- ౯౨- దేవదాసుఁడు వారిమాటవిని చీమనుజూచి భక్తుల
కు శుభమునుజేయునట్టి సర్వశక్తిసంపన్నుఁడైన శివునిఁబ్రార్థించెను - ఓశివుఁ
డా మంగళాస్పదుఁడా దయాసముద్రుఁడా నీవు సర్వగుఁడవైతివా యిప్పుడు
బౌద్ధులడిగినరీతిని చీమలోపలనుండిమాటలాడవలయును- అనియిట్లతనిచేతఁ
బ్రార్థింపఁబడి పరమేశ్వరుఁడైన యాసాంబశివుఁడు చీమలోనుండి యాశ్చ
ర్యకరమైన మాటచెప్పెను - ఓజనులారా మీరుభక్తితోనామాటవినుఁడు-నే
నెప్రత్యక్షశివుఁడనుసర్వమును బొందియుండు వాఁడను పరముకంటెఁబరుఁడ
ను పరమాత్మను లోకములఁ జేయువాఁడను సర్వరూపములు గలవాఁడను సం

౯౬ ॥ అహమేవ శివస్సాక్షాత్ సర్వగోహం పరాత్పరః । పరమాత్మాజగత్క
ర్తా సర్వరూపీ నసంశయః॥ ౯౭॥ ఇత్యుక్తం భగవద్వాక్యం బౌద్ధాస్సర్వేనిశ
మ్య తే । అబ్రువన్ దేవదాసంతం సమాలోచ్య పరస్పరం॥ ౯౮॥ దేవ ౩ స
మహాబుద్ధే శృణుష్వవచనం తునః । తవమంత్ర ప్రభావేనా వదదిత్థం పిపీలికా॥
౯౯ ॥ రామలింగేశ్వర శ్చైవం బ్రూయాద్య దివచస్తదా । శైవాభూత్వా
వయంస ర్వేతవశిష్యాభ వేమవై ॥ ౧౦౦॥ ఇతిబౌద్ధ వచశ్శ్రుత్వా రామలింగేశ
సన్నిధిం । సంప్రాప్యబౌద్ధై స్తైస్సార్థం ప్రార్థయామాసతం శివం॥ ౧౦౧॥
రామలింగేశచిద్రూప వేదవేదాంత సంస్తుత । ప్రకటీకురు బౌద్ధానాం సర్వగ
త్వంశివాద్య తే॥ ౧౦౨॥ పిపీలికాం తర్వర్తిన్ సన్ యథా వచనమబ్రవీః । తథా
బ్రూహ్యద్య విశ్వాత్మన్ నమస్తేస్తు సదాశివ॥ ౧౦౩॥ ఇతి సంప్రార్థిత స్తేన
రామలింగేశ్వరోహరః । సింహవద్విసదన్ వాక్యం ప్రోవాచ మధురాక్షరం ॥
౧౦౪॥ బౌద్ధాశ్శృణుత మేవాక్యం యూయం మద్భక్తిసంయుతాః । అహమే

---

దేహమువలదు- ఇట్లు చెప్పఁబడినయాశివునిమాటనువిని యాబౌద్ధులందఱునొక
రితోనొకరాలోచించుకొని దేవదాసునితోనిట్లనిరి- ౯౮- ఓమిక్కిలిబుద్ధిశాలి
యయిన దేవదాసుఁడా నీమంత్రమహిమచేతఁ జీమలిట్లు మాటలాడెను- రా
మలింగేశ్వరుఁడు నీప్రకారము మాటలాడిన పక్షమున మేమందఱము శైవుల
మై నీకుశిష్యులమయ్యెదము- ౧౦౦- ఇట్లా బౌద్ధులు చెప్పినమాటవిని యాబౌ
ద్ధులతోఁగూడ రామలింగస్వామి సన్నిధానమునకుఁబోయి యాస్వామినిఁబ్రా
ర్థించెను - ఓరామలింగేశ్వరుఁడా జ్ఞానస్వరూపుఁడా వేదములయందు వేదాం
తములయందు స్తోత్రముచేయఁబడినవాఁడా యిప్పుడు నీవు సర్వమునందుండు
వాఁడౌటను బౌద్ధులకుఁ బ్రకటింపుము - ఓ ప్రపంచస్వరూపుఁడా చీమలోపల
నుండి యెట్లుమాటలాడితివో అట్లిప్పుడును మాటలాడవలయును ఓసదాశివు
డా నీకుమ్రొక్కుఁగాత అనియిట్లాతనిచేతఁ బ్రార్థింపఁబడినవాఁడై యారా
మలింగేశ్వరుఁడు సింహమువలెగర్జించుచు సొగసైనయక్షరములుగలమాట
నుబలికెను- ౧౦౪- ఓబౌద్ధులారామీరు నాయందుభక్తితోఁగూడినవారై నా
మాటవినుండు నేనేయపరోక్షశివుఁడను సర్వమున నుండువాఁడను బరముకంటె
బరుండను సర్వవ్యాపకుఁడను మోక్షమునిచ్చువాఁడను జ్ఞానమువిజ్ఞానముస్వ
రూపముగాఁగలవాఁడను పరమాత్మను జగత్తును జేయువాఁడను సర్వస్వరూ
పుఁడనుమీరీవిషయమున సంశయింపఁబనిలేదు- అనియిట్లా రామలింగేశ్వరుఁ

వశివస్మాత్సాత్ సర్వగోహం పరాత్పరః ॥ ౧౦౫ ॥ సర్వవ్యాపీ మోక్షదాతా జ్ఞానవిజ్ఞానవిగ్రహః । పరమాత్మా జగత్కర్తా సర్వరూపీ నసంశయః॥ ౧౦౬॥ ఇత్యుక్తం వాక్యమాకర్ణ్య రామలింగేశ్వరేణ తే । బౌద్ధాశ్శిష్యాస్సంబభూవుః దేవదాసస్య వై తదా ॥ ౧౦౭ ॥ తతోసౌ దేవదాసస్తు తత్రత్యానాం యథావిధి । శివదీక్షాంచకారాశు బౌద్ధానాంనమతాంతదా॥ ౧౦౮॥ తతోసౌ దేవదాసస్తు బంధుపోషణ తత్పరః అన్నదానరతో నిత్యం అవస త్తత్రపట్టణే ॥ ౧౦౯॥ ఏకదా దేవదాసంతం బ్రాహ్మణాః కోటి సంఖ్యకాః । అన్నం దేహీత్యయాచంత ఘృతభక్ష్యాది సంయుతం॥ ౧౧౦॥ తదాస దేవదాసస్తు వైశ్య శ్రేష్ఠస్య మందిరం । గంగాధరస్య సంప్రాప్య కథయామాసతం ప్రతి॥ ౧౧౧॥ విప్రాగమనమన్నార్థం ద్రవ్యాభావం చవేశ్మని । తతస్తం తండులాదీని దాతవ్యానీత్యువాచసః॥ ౧౧౨॥ తదా వైశ్య వరఃక్రుద్ధః ఊచేవాచం మహాస్వనః। త్వం ద్వాదశాబ్ద ప్రభృతినమెకిమపి దత్తవాన్ ॥ ౧౧౩ ॥ ద్రవ్యం తస్మాత్ దేవదాస గచ్ఛగచ్ఛ యథాగతం । తండులాదికసామగ్రీ నాస్తినాస్తిగృహేమమ॥ ౧౧౪॥ ఇతిశ్రుత్వా వచస్తస్య భార్యామాగత్యసోబ్రవీత్ । కిం వా కుర్యాం క్వగచ్ఛేయం బ్రాహ్మణా వై బుభుక్షితాః ।। ౧౧౫ ॥ తండులాది సమస్తంచ నేతి

---

డు చెప్పినమాటనువినియాబౌద్ధులప్పుడు దేవదాసునకు శిష్యులైరి- అంతనాదేవదాసుఁ డక్కడనున్నట్టియు దనకుమ్రొక్కుచున్నట్టి యాబౌద్ధులకుఁ ద్వరితముగావిధిప్రకారము శైవదీక్షను జేసెను - పిమ్మట నా దేవదాసుఁడు చుట్టములఁగాపాడుటయందునన్నదానముచేయుటయందు నాసక్తుఁడై యాపట్టణమున నుండెను - ఒకానొకప్పుడా దేవదాసునిఁ గోటిబ్రాహ్మణులు నేతితోను బిండివంటలతోను గూడినయన్నమును బెట్టుమని యాచించిరి- ౧౧౦- అప్పుడా దేవదాసుఁడు పెద్దసెట్టియైన గంగాధరసెట్టి యింటికిఁ బోయి యతనితో నప్పుడు బ్రాహ్మణు లన్నముకొఱకు వచ్చుటను దనయింట ద్రవ్యములేమినిఁ జెప్పి యతనినిబియ్యము మొదలగునవి యీవలయుననియడిగెను - అప్పుడా పెద్దసెట్టి కోపించుకొని గట్టిగానొకమాట చెప్పెను నీవుపండ్రెండేండ్లు మొదలుకొని నాకేవస్తువునిచ్చినవాఁడవుకావు కాబట్టియో దేవదాసుఁడా వచ్చినత్రోవనుబొమ్ము బియ్యము మొదలయిన సామగ్రి నాయింటలేదు- అనియిట్లతఁడుచెప్పిన మాటవిని యాదేవదాసుఁడు తనయింటికివచ్చి తనభార్యతో నిట్లని చెప్పుచున్నాఁడు బ్రాహ్మణు లాఁకలిగొనియున్నారు ఏమిచేయుదు నెక్కడబోదును- ౧౧౫-

వైశ్య వరో(బ్రవీత్ । ఇతిశ్రుత్వా వచస్తస్య దేవదత్తావదత్పతిం॥ ౧౧౬॥ ఏ
కోరామ ఇతిఖ్యాతః పుత్రోనో వర్తతేఖలు । సశంఖచక్ర పద్మాది రేఖాంకి
త కరోమహాన్ ॥ ౧౧౭ ॥ నిదధాతుస వల్మీకె ఈప్సితార్థాయతం కరం ।
దద్యాద్దేవ న సందేహః కంకణం భగవాన్ హరః॥ ౧౧౮॥ ఇత్యుక్తో భార్యయా
శీఘ్రం పుత్రమాహూయ సాదరం । ప్రోవాచ దేవదాసస్తు విరూపాక్ష మహా
మతే॥ ౧౧౯॥ నిధేహి తె కరం వత్స వల్మీకె పరమేశ్వరః । ప్రదద్యాత్కంక
ణం దేవః శివస్తుభ్యం నసంశయః ॥ ౧౨౦ ॥ ఇత్యుక్తో జనకేనాథ విరూపాక్ష
స్త్వరాన్వితః । స్వకరం నిదధాతిస్మ వల్మీకేతాదృశంయదా॥ ౧౨౧॥ తదాశివ
స్సభగవాన్ వలయీ కృతసర్పరాట్ । కంకణం ప్రదదౌతస్మై అమూల్యమ
తులం విభుః॥ ౧౨౨॥ తద్గృహీత్వా స్వపిత్రేస దత్తవాన్ పరయాముదా । ఆ
దాయ దేవదాసస్తత్ వైశ్యహస్తే నిధాయచ॥ ౧౨౩॥ జగ్రాహ సకలాం స్తస్మా
త్ సామగ్రీ స్తండులాదికాః । గంగాధరాత్ దేవదాసః ప్రాపయామాసతా గృ
హం॥ ౧౨౪॥ భార్యాదృష్ట్వాథతాస్సర్వాః సామగ్రీ స్తండులాదికాః । పాకం

---

పెద్దసెట్టి తాపునకుఁ బోయినందునకు నతఁడు బియ్యము మొదలగునవి యన్ని
యు లేదనెను అనియా దేవదాసుఁడు చెప్పఁగా నామాటవిని యతనిభార్యయైన
దేవదత్త యతనితో నిట్లనెను - మనకు రాముఁడను కొడుకున్నాఁడుగదా అ
తఁడు శంఖముచక్రము పద్మము మొదలగు రేఖలుగల హస్తముతోఁ గూడినవా
ఁడు దొడ్డవాఁడు అతఁడు కోరికను బొందుటకుఁ బుట్టయందుఁ జేతినుంచు
గాత అట్లు చేసినపక్షమున భగవంతుఁడైన సాంబమూర్తి కంకణము నిచ్చును
సందియములేదు - అని భార్యచేతఁ జెప్పఁబడినవాఁడై దేవదాసుఁడు త్వర
గాఁ బుత్రుని బిలిచి ప్రీతితో నిట్లనెను ఓ మిక్కిలిబుద్ధిశాలియైన విరూపాక్షుఁ
డా నీ చేతిని బుట్టయందుంచుము పరమేశ్వరుఁడైన సాంబశివుఁడు నీకొఱకుఁ గంక
ణము నిచ్చును సందేహము లేదు - ఇట్లు తండ్రిచేతఁ జెప్పఁబడి యా విరూపా
క్షుఁడట్టితన హస్తమును బుట్టలోనుంచఁగానే సర్పములను గడియములుగా
ధరించియున్న యా భగవంతుఁడైన శివుఁడు వెలనిర్ణయింపఁగూడనియట్టియు స
రిలేనిదైన కంకణము నతనికొఱకిచ్చెను - ౧౨౨ - దానిఁదీసికొని యతఁడు మి
క్కిలిసంతోషముతోఁ దనతండ్రికొఱకిచ్చెను దేవదాసుఁడు దానిఁదీసికొనిపోయి
సెట్టిచేతనుంచి యతని తావున బియ్యము మొదలైన సమస్తసామగ్రియుఁ దీసి
కొనెను - అంత సామగ్రులనన్నిటి నిలుచేర్చెను అప్పు డతనిభార్య బియ్యము

చకార విధివత్ సా బ్రాహ్మణ కృతేముదా ॥ ౧౨౫ ॥ దేవదాస స్తథాహూ
య బ్రాహ్మణాన్ కోటిసంఖ్యకాన్ । అన్నం దదౌస విధివత్ తేభ్యో భక్ష్యాజ్య
సంయుతం॥ ౧౨౬॥ తేతృప్తా బ్రాహ్మణాస్సర్వే భక్ష్యభోజ్యాజ్యపాయసైః ।
చతుర్భద్రతరోభూయా ఇతిచక్రుర్మహాశిషం॥ ౧౨౭॥ తస్యైవం వర్తమా
నస్య దేవదాసస్య కంకణం । హర్తుకామో వైశ్య వరః చింతయామాస మా
నసే॥ ౧౨౮॥ తదా తత్కంకణం సర్పః భూత్వాతస్య నికేతనే। మహాధ్వ
నించకారాశు తం శ్రుత్వా భయమోహితః॥ ౧౨౯॥ వైశ్యః ప్రాప్య తదాగే
హం దేవదాసస్య సత్వరం । ఉవాచతం దేవదాస త్వద్దత్తం కంకణం గృహే॥
౧౩౦ ॥ సర్పోభూత్వా మదీయేతు ప్రగర్జతి ముహుర్ముహుః । తస్మాద్గ్ర
హీత్వా శీఘ్రం తత్ ఆనయ స్వస్వమందిరం॥ ౧౩౧॥ యదా తు హస్తగంద్ర
వ్యసంజాతం తేభవిష్యతి । తదాప్రదేయం మేద్రవ్యమిత్యుక్త్వా సగృహం య
యౌ ॥ ౧౩౨ ॥ దేవదాస స్తతోవేశ్మ వైశ్యశ్య ప్రాప్య సత్వరం । ఆదాయ
కంకణం శైవం స్వగృహం ప్రయయౌపునః॥ ౧౩౩॥ సతతః ప్రకటీకర్తుం దే

---

మొదలయిన యీసామగ్రులనన్నిటినిజూచి సంతోషముతో నాసామగ్రులను
బ్రాహ్మణులకొఱకుయథావిధిగా వంటచేసెను-అంతనా దేవదాసుఁడా కోటిబ్రా
హ్మణులను బిలిచి వారి కొఱకు భక్ష్యములతోను నేతితోనుగూడిన యన్నము
నిచ్చెను - ౧౨౬ - ఆబ్రాహ్మణులు భక్ష్యములచేత నన్నముచేతను నేతిచేతను
బరమాన్నముచేతను దృప్తినొందినవారై యతని కొఱకు జతుర్భద్రతరుఁడ
వగుమని యాశీర్వచనము చేసిరి - ఇట్లుండిన యీ దేవదాసుని కంకణము నప
హరింపఁగోరి యీ పెద్దసెట్టి తనమనస్సున నాలోచించెను - ౧౨౮ - అప్పుడా
కంకణముసర్పమై యతనింటబుసకొట్టనారంభించెను ఆధ్వనినివిని యీ వైశ్యుఁ
డుభయముచేత భ్రిమపడి త్వరితముగా దేవదాసునింటికివచ్చి యీ దేవదాసు
నితోనిట్లనెను- ఓ దేవదాసుఁడా నీవిచ్చినకంకణముమాయింటసర్పమైపలుమా
ఱుబుసపెట్టుచున్నది - కాఁబట్టి దానిఁద్వరితముగా మీాయింటికిఁదెచ్చుకొమ్ము-
౧౩౧- నీకెప్పుడుధనముచేతికివచ్చునో యప్పుడునాద్రవ్యమునీవచ్చును అనిచె
ప్పియతడింటికిఁబోయెనుఅంత దేవదాసుఁడుత్వరగావైశ్యునింటికిఁబోయిఁ శివుఁ
డిచ్చిన కంకణమునెత్తికొని తిరిగి తనయింటికి వచ్చెను తరువాత నా దేవదా
సుఁడు తననేర్పును బ్రసిద్ధిఁబొందింపను వెలలేకయు సదృశమై మిక్కిలి సొగసు
గా నుండునట్టి యొకవస్త్రమును నేసెను - మిక్కిలి సొగసైనట్టియు జిత్రమై

వదాసస్స్వకౌశలం । అనర్ఘ్యం చిత్రమతులం వయతిస్మాంబరంశుభం॥ ౧౩౪॥
తద్దివ్యమంబరం చిత్రంరాజ్ఞే దేశింగవల్లభే । విక్రేతుం స్థాపయామాసః దేవదా
సస్తపోధనాః॥ ౧౩౫॥ షష్ఠ్యుత్తరై స్తథా హస్తైః త్రిశతై రున్నతం చతత్
హస్తై ద్వాదశభి ర్వస్త్రమాయామం సు మనోహరం ॥ ౧౩౬ ॥ దృష్ట్వా
హి వణిజస్స ర్వే తస్య వస్త్రస్య భూసురాః । క్రయం ననిర్ణేయు రపియో
గ్యత్వా త్పరమైశితుః॥ ౧౩౭॥ ప్రాదర్శయ ద్వైశ్యవరః కశ్చిత్ త్రిస్రోంగుళీ
ర్ముదా । లోకత్రయం సువస్త్రస్య మూల్యమిత్యాశయాత్ యదా॥ ౧౩౮॥
విష్ణుచక్రం తదాగత్య జ్వలత్కాలానలోపమం । తస్య వైశ్యవరస్యాశు తచ్ఛి
చ్ఛేదాం గుళిత్రయం॥ ౧౩౯॥ ఏతద్వస్త్రం శివేనైవ ధార్యం నాన్యేనభూత
లే । తస్యా నర్ఘత్వమాలక్ష్య ప్రోచుస్స ర్వే వణిగ్వరాః ॥ ౧౪౦ ॥ ఇతితే
షాంవచశ్శ్రుత్వా దేవదాస స్తతస్సుధీః । ఇచ్ఛచ్ఛివార్పణం కర్తుం తద్వ
స్త్రమతికోమలం ॥ ౧౪౧ ॥ సదేవ దాసోమృదులం మనోహరం స్నిగ్ధం విశా
లంతదనర్ఘమంబరం । శ్రీశైలనాథాయమహాధ్వజాయ సమర్పయామా
సశివాయభక్తితః ॥ ౧౪౨ ॥ తతశ్శ్రీశైలనాథస్తుతేన వస్త్రేణతోషితః । ద
త్వాతులాం సంపదం సదేవదాసాయసాదరం ॥ ౧౪౩ ॥ ప్రోవాచ భగవాన్

---

నయావస్త్రము నా దేవదాసుఁడు దేశింగ వల్లభుఁడను రాజునొద్ద విక్రయింప నుంచునో ఋషులారా ఆదోవతి మున్నూటయిరువదిమూర నిడివియుఁ బండ్రెండుమూరల వెడలుపునుగలది- వర్తకులందఱుదానిఁజూచి యదిపరమేశ్వరునకుఁ దగినదిగనుక దానికి వెలనునిర్ణయింపరైరి- ఒకానొక వైశ్యుఁడావస్త్రమునకుమూఁడులోకములుక్రయముగానుండునన్న యభిప్రాయమువలనమూఁడు వ్రేళ్లనగపఱిచెను - అప్పుడుమండుచున్న కాలాగ్నివంటి కాంతిగల విష్ణుచక్రమువచ్చి యావైశ్యశ్రేష్ఠుని యా మూఁడువ్రేళ్లనునరికెను - ౧౩౯ - ఆవస్త్రమునకు వెల నిర్ణయింపఁగూడకుండుటనుజూచి వర్తకులందఱీవస్త్రము శివుఁడు ధరింపఁ దగినదేగాని మఱియొకఁడు ధరింపఁ దగినదిగాదనిరి - ఇట్లు వారందరు చెప్పినమాటవిని బుద్ధిశాలియయిన యాదేవదాసుఁడు మిక్కిలి కోమలమైన యావస్త్రమును శివున కర్పణము చేయఁగోరెను - ౧౪౧ - ఆ దేవదాసుఁడు మృదువైనట్టియుసొగసైనట్టియు నాజూకైనట్టియువిశాలమైనట్టియు వెలలేని యట్టి యావస్త్రమును శ్రీశైలక్షేత్రమున కధిపతియైన శివునికొఱకు ధ్వజపటముగా భక్తితోసమర్పించెను - అంత నాశ్రీశైలేశ్వరుఁ డావస్త్రముచేతసం

నీశః ప్రణతంతం పురస్థితం । దేహ్యాన్నం మమభక్తేభ్యః యథేచ్ఛం దేవదా
సక ॥ ౧౪౪ ॥ స్థాపయిత్వా శైవమతం లోకే సర్వమతోత్తమం । కైలా
సం త్వం సమాగచ్ఛ మమలోకమనుత్తమం॥ ౧౪౫॥ ఇత్యుక్త్వాం తర్దధా
శ్రీమాన్ భగవాన్ పార్వతీపతిః । దేవదాసస్తతశ్శ్రీమాన్ గృహమాగత్య
సత్వరం॥ ౧౪౬॥ వైశ్యాయ ప్రదదౌద్రవ్యం సర్వం దాతవ్యమేవయత్ । అ
న్నంముదాప్రతిదినం శైవేభ్యఃప్రదదౌభృశం॥౧౪౭॥ అనృణస్సన్ మహాయో
గీవస్త్రదానమనుత్తమం । యజ్ఞోపవీతదానంచశైవేభ్యఃసచకారహ॥ ౧౪౮॥
ప్రకాశయామాస సలోకే శైవం మతమనుత్తమం । శైవమంత్రం శైవదీక్షాం
శైవపూజాం తథైవచ॥ ౧౪౯॥ ఏవం లోకం శైవభూతం దృష్ట్వాబౌద్ధగురు
స్తదా । దేశింగవల్లభం శిష్యం ప్రాపభూపాలశేఖరం॥ ౧౫౦॥ దేశింగవల్లభ
శ్శ్రీమాన్ స్వగురుంగృహమాగతం । దృష్ట్వా సంపూజ్యవిధివత్ పప్రచ్ఛకు
శలంగురోః॥ ౧౫౧॥ తతోబౌద్ధగురుస్స్వస్య కుశలం వినివేద్యసః । రాజానం
పరిపప్రచ్ఛ కుశలం ప్రీతిపూర్వకం॥ ౧౫౨॥ తతోరాజాస్వకుశలం గురవేవిని

---

తోషపఱుపఁబడినవాఁడై ప్రీతితో నా దేవదాసునికొఱకు సరిలేనిసంపదనిచ్చి
నమస్కరించి యెదుటనున్న యీదేవదాసునిట్లనెను- ఓ దేవదాసుఁడా నాభక్తు
లకుయథేచ్ఛముగా నన్నదానముచేయుము - లోకమున సమస్తమతములలో
నెక్కుడైన శైవమతమును నిలుకడపఱిచి నీవు సర్వోత్తమమైన కైలాసము
నకురమ్ము - ౧౪౫ - ఇట్లుచెప్పి భగవంతుఁడైన పార్వతీపతి యంతర్ధాన
మునొందెను - అంత శ్రీమంతుఁడైన దేవదాసుఁడు త్వరితముగా నింటికివ
చ్చి వైశ్యునికొఱకీవలసిన ధనమంతయునిచ్చెను- నిత్యము శైవులకొఱకు సం
తోషముతో నన్న దానముచేయుచుండెను - పిమ్మట నాయోగసంపన్నుఁడైన
దేవదాసుఁడు ఋణములఁ దీర్చికొన్నవాఁడై శైవులకొఱకుత్తమమైన య
న్నదానమును యజ్ఞోపవీతదానమును జేసెను - లోకమునను త్తమమైన శైవ
మతమును శైవపూజను శైవమంత్రమును శైవదీక్షను బ్రకాశింపఁజేసెను - ఈ
ప్రకారము లోకమంతయు శైవమయమవుటనుజూచి యప్పుడు బౌద్ధగురువు
తనకుశిష్యుఁడై నట్టియు రాజశ్రేష్ఠుఁడైన దేశింగవల్లభుని తావునకువచ్చెను -
౧౫౦- అప్పుడు శ్రీమంతుఁడైన దేశింగవల్లభుఁడు తమయింటికివచ్చిన తమగు
రువునుజూచి శాస్త్రరీతిగాఁ బూజచేసి యాయన క్షేమమునడిగెను - అంత
నాబౌద్ధగురువు తనకుశలమును రాజునకుఁజెప్పి ప్రీతితో నతనిక్షేమమునడి

వేద్యచ । అబ్రవీత్తం మహాప్రజ్ఞం మధురంవచనంతదా॥ ౧౫౩॥ అహంబౌద్ధ గురోర్బౌద్ధః పత్నీ శ్శైవీమమప్రియా । తాంగత్వాబోధయాశుత్వంబౌద్ధాచార మనుత్తమం॥ ౧౫౪॥ తథేత్యుక్త్వా బౌద్ధగురుః తాంరాజ మహిషీంతదా । ప్రాప్యాసౌబోధయామాస బౌద్ధాచారమనుత్తమం ॥ ౧౫౫ ॥ సంగమాంబా రాజపత్నీబౌద్ధాచారంనిశమ్యతం । తదాబౌద్ధగురుంప్రోచే సాపహాసంశుచిస్మి తా॥ ౧౫౬॥ అహోహాస్మద్గురుణా దేవదాసేనతుమహాత్మనా । బౌద్ధాః ఖలు జితాఃపూర్వం రామలింగేశ సన్నిధౌ ॥ ౧౫౭॥ తద్దైవ బౌద్ధాస్సర్వేపి శైవా భూతా ఇతిధ్వనిః । నగతఃకిం బౌద్ధగురో తవకర్ణౌమహామనసా॥ ౧౫౮॥ త దానీంమహదాశ్చర్య మభూత్ బౌద్ధగురోశ్శృణు । రామలింగేశ్వరస్సాక్షాత్ ప్రోవాచమధురంవచః ॥ ౧౫౯ ॥ శృణ్వత్సు బౌద్ధబృందేషు శివోహం సర్వ గోమహాన్ । పరమాత్మాముక్తిదాతా జ్ఞానరూపీతిచాసకృత్ ॥ ౧౬౦ ॥ ఇ త్యద్భుతంమహావాక్యంశివస్యానందరూపిణః । నగతంకింబౌద్ధగురోతవశ్శ్రోత్ర పథంభువి ॥ ౧౬౧ ॥ ఇత్యుక్తంరాజపత్న్యాసశ్రుత్వాబౌద్ధగురుర్వచః ।

---

గెను - అంతరాజుతనకుశలమును గురువుకొఱకుఁదెలిపి మిక్కిలితెలిసిన యా గురువుతో నప్పుడు మధురమైనమాట యొకటిచెప్పెను - ఓబౌద్ధగురుఁడా నే నబౌద్ధుఁడను నాప్రియభార్య శైవురాలు నీవు త్వరితముగాఁబోయి యాపె కుత్తమమైన యీబౌద్ధాచారము నుపదేశింపుము - అనిరాజుచెప్పఁగానాబౌ ద్ధగురువప్లెకానిమ్మని యతనిభార్య దగ్గరికిఁబోయి యాపెకాబౌద్ధాచారమును బోధించెను - ౧౫౫ - అప్పుడా రాజుభార్యయైన సంగమ్మ యతఁడు చెప్పిన బౌద్ధాచారమునువిని తెల్లనిచిరునగవుగలదై పరిహాసముతోఁగూడనాబౌద్ధగు రువుతోనిట్లనెనుఓహోపూర్వము మాగురువైన దేవదాసుఁడు రామలింగస్వా మిసన్నిధానమందు బౌద్ధులనుజయించెనుగదా- అప్పుడే బౌద్ధులందఱు శైవు లైరనిప్రసిద్ధి ఈప్రసిద్ధి నీచెవునఁబడలేదా యేమి - అప్పుడు మిక్కిలివింతకలిగె నుచెప్పెదనువినుమో బౌద్ధగురువా రామలింగేశ్వరుఁడు తానై బౌద్ధులందఱు వినుచుండఁగా నేను పరమాత్మను సర్వమును బొందియుండు శివుడనుముక్తిని చ్చువాడఁనుజ్ఞానస్వరూపుఁడననియిట్లుపలుమాఱుమధురముగమాటలాడెను- ౧౬౦ - ఈప్రకార మానందరూపుఁడైన శివుడుచెప్పినమాట నీచెవియందుఁ బడలేదా యేమి బౌద్ధగురూ- అని యారాజుభార్యచెప్పఁగా నామాటవినియా బౌద్ధగురువా సమాచారమంతయు నారాజుదగ్గిరికిఁబోయి యతనికిఁదెలిపెను-

రాజ్ఞస్సమీపమాగత్యసర్వంతస్మైన్యవేదయత్ ॥ ౧౬౨॥ తతస్సరాజాగురుణా సాకం దేశింగవల్లభః । ఆలోచ్యభార్యా మానీయ్య ప్రోవాచ మధురంవచః ॥ ౧౬౩ ॥ త్వద్గురోర్మద్గురోశ్చాపి పరీక్షాక్రియతేమయా । సర్వజ్ఞత్వే ప్రియేపత్ని యదిజేతా గురుస్తవ ॥ ౧౬౪ ॥ తదానీం మద్గురుశ్శైవో భవిష్యతినసంశయః । యదిజేతా మమగురుః బౌద్ధోభవతుతేగురుః॥ ౧౬౫॥ ఇతి రాజ్ఞోవచశ్శ్రుత్వా సర్వలోక సుసంమతం । తథేత్యంగీచకారాశు సారాజమహిషీ తదా ॥ ౧౬౬ ॥ తతోరాజా దేవదాసం ఆహూయ సమహామతిం । సంమాన్యవిధివద్భక్త్యా వాచమూచే చతంప్రతి॥ ౧౬౭॥ అయంబౌద్ధ గురుర్విద్వాన్ ఆగతోస్తిమమాంతికం । త్వంతు శైవగురుః ప్రాజ్ఞః ఆహూతోసిమయా తతః॥ ౧౬౮॥ త్వం గురుర్మమభార్యాయాః మమబౌద్ధగురుర్గురుః। సర్వజ్ఞత్వేపియువయోః పరీక్షాక్రియతేమయా॥ ౧౬౯॥ త్వం వైతత్ర పరీక్షాయాం యదిజేతాసిమద్గురుం । తదాసశైవోభవతు నాత్రకార్యా విచారణా॥ ౧౭౦ ॥ యదిత్వాం మద్గురుర్జేతా పరీక్షాయాంతు తత్రసః । భౌద్ధోభవ తదానీం త్వం నాత్రకార్యావిచారణా ॥ ౧౭౧ ॥ ఇతిరాజ్ఞో వచస్త్వంగీ చక్రతుస్తావుభావపి । దేవదాసోబౌద్ధగురుః పరస్పరజిగీషయా ॥ ౧౭౨ ॥ తతోరాజా సమా

---

అంతనా దేశింగవల్లభుఁడనురాజు గురువుతోఁడ నాలోచించి పెండ్లమును బిలిపించి మధురమైనమాట యొకటి చెప్పెను - ఓనాప్రియురాలైన పెండ్లామా నను నీగురువును సర్వజ్ఞుఁ డెవఁడోయని పరీక్ష చేసెదను నీగురువు జయించెనా నాగురువు శైవుఁడు కాఁగలఁడు నాగురువుజయించెనా నీగురువు బౌద్ధుఁడు కావలయును - ౧౬౫ - ఈప్రకార మందఱొప్పఁదగిన యారాజు మాటనువిని యతనిపెండ్లము త్వరితముగా నట్లెయనియంగీకరించెను - అంతనారాజు మిక్కిలిబుద్ధిమంతుఁడైన దేవదాసునిరప్పించి విధిప్రకారము మర్యాదచేసి యతనితోనిట్లనెను- ఇతఁడుబౌద్ధగురువు నాదగ్గిరికి వచ్చియున్నాఁడు నీవుశైవగురువును తెలిసినవాఁడవునుగనుక నిన్నుఁ బిలిపించితిని - నీవునాభార్యకు గురుఁడవు నాకు బౌద్ధగురువు గురువు మీయిద్దఱిలో సర్వజ్ఞుఁ డెవ్వఁడోయని నేనుపరీక్ష చేసెదను - నీవాపరీక్షయందు జయించితివా యంతట నాగురువు శైవుఁడగును సందేహింపఁబనిలేదు - ౧౭౦ - ఆపరీక్షయందు నిన్ను నాగురువుజయించెనా యప్పుడు నీవుతప్పక బౌద్ధుఁడవు కావలయును - అనియిట్లారాజు చెప్పఁగా నామాటను వారిద్దరు నొకనినొకఁడు గెలువవలయునను కోరికచేత నంగీకరిం

నీయఘటమంతర్బిలేశయం। నిధాయచ్ఛాదితముఖం సభాయాం వాక్యమ
బ్రవీత్ ॥ ౧౭౩॥ హేదేవదాస హేబౌద్ధగురోపూజ్యౌ యువాం సతాం। కో
వాఘటాం తర్వర్త్యస్తే బ్రూతం సర్వజ్ఞమానినౌ ॥ ౧౭౪ ॥ ఇతిభూపాల
వచనం శ్రుత్వా బౌద్ధగురుస్తదా। సర్పోఘటాం తర్వర్త్యస్తే ఇత్యువాచ
మహీపతిం॥ ౧౭౫॥ అథబౌద్ధగురోర్వాక్యం తిరస్కృత్య మహామతిః। దేవ
దాసోమహీపాలం ఊచేవచనమద్భుతం॥ ౧౭౬॥ శివోఘటాం తర్వర్త్యస్తే
నాగాభరణభూషితః। సర్వవ్యాపీసర్వరూపీ సర్వేషాం ముక్తిదాయకః॥ ౧౭౭॥
తస్య తద్వచనం శ్రుత్వా దేవదాసస్య భూమిపః। ముఖం నిర్భిద్య తస్యాశు
ఘటస్యసకుతూహలః॥ ౧౭౮॥ తదంతర్వర్తినం దేవం నాగాభరణభూషితం।
శివమాలోకయామాస మహాశ్చర్యసమన్వితః ॥ ౧౭౯ ॥ తతోబౌద్ధగురుం
రాజా శిష్యవర్గసమన్వితం। ఊవాచతాం తం సభయం గర్వశూన్య మధో
ముఖం॥ ౧౮౦॥ జితోసిత్వం బౌద్ధగురో దేవదాసేన సాంప్రతం। శివదీక్షాం
లింగదీక్షాం తస్మాత్సం ప్రాప్తు మర్హసి ॥ ౧౮౧ ॥ ఇత్యుక్తో భూభృతాతే

---

చిరి - అంతనారాజొక కుండనుదెప్పించి దానిలోపల పామునుంచి యాకుండ
మూతికప్పిపెట్టి సభయందొక మాట చెప్పెను - ఓదేవదాసుఁడా ఓబౌద్ధగు
రుఁడా మీరిద్దఱుసత్పురుషులకుఁ బూజ్యులరు సర్వజ్ఞులని తలచుకొనియెడివా
మరలు - ఈకుండలోపల నేదియున్నదిచెప్పుఁడు - ౧౭౪ - ఈప్రకారము రా
జుచెప్పినమాటవిని యప్పుడుబౌద్ధగురుఁడు రాజుతో ఘటములోపల నున్నది స
ర్పమని చెప్పెను - అంతట మిక్కిలి బుద్ధిమంతుఁడైన దేవదాసుఁడా బౌద్ధగు
రుపుమాటను దిరస్కరించి రాజుతోనాశ్చర్యకరమైన మాట యొకటిచెప్పెను-
సర్వమును వ్యాపించియుండునట్టియు సర్వస్వరూపుఁడైనట్టియు నందఱకుఁ ము
క్తినిచ్చువాఁడైన శివుఁడు సర్పరూపములైన భూషణములచేత నలంకరింపఁ
బడినవాఁడై ఘటములోపల నున్నాఁడు - ఇట్లా దేవదాసుఁడుచెప్పినమాట
వినిరాజు కౌతూహలముతోఁగూడినవాఁడై త్వరితముగా నాకుండమూతికట్టు
నువిడిచి దానిలోపల నాగాభరణములచేత నలంకరింపఁబడినవాఁడై శివుని
మిక్కిలి యాశ్చర్యముతోఁజూచెను- అంతనారాజు శిష్యసమూహముతోఁ
గూడియున్నట్టియు మోముువాడినట్టియు భయముతోఁగూడినట్టియుఁదలవంచి
కొన్నట్టి బౌద్ధగురుపునుగూర్చియిట్లనెను - ౧౮౦ - ఓబౌద్ధగురువా నీవిప్పుడు
దేవదాసునిచేత గెలువఁబడినవాఁడవైతివి గనుక శివదీక్షనులింగదీక్షను బొం

న తదాబౌద్ధగురుస్స్వయం । ప్రణమ్య దేవదాసంతం భక్తిపూర్వమయాచత॥ ౧౮౨॥ భోదేవదాస సర్వజ్ఞ సర్వలోక సుపూజిత । విధేహిమేలింగదీక్షాం శివదీక్షాంచ సాంప్రతం॥ ౧౮౩ ॥ మచ్ఛిష్యాణాంచ సర్వేషాం రాజ్ఞశ్చాస్య మహాత్మనః । వేదాగమోక్తవిధినా ముక్తికాంతా ప్రదాయినీం ॥ ౧౮౪ ॥ ఇతిసంప్రార్థితస్తేన దేవదాసశ్శివప్రియః । శివదీక్షాం లింగదీక్షాం సర్వేషామకరోత్తదా ॥ ౧౮౫ ॥ శైవపంచాక్షరంమంత్రం సర్వేషాముపదిశ్యచ। శివపూజాంచదివిధివత్ బోధయిత్వాతతఃపరం॥ ౧౮౬ ॥ సద్యోజాతంమహాదేవం ఘటాంతస్థం శివంహరం । ఆమోదపురమానీయ స్థాపయిత్వా యథావిధి॥ ౧౮౭॥ పూజయామాసవేదోక్తైః మంత్రైర్భక్తిసమన్వితః । దేవదాసో మహాప్రాజ్ఞః శిష్యవర్గ నమస్కృతః॥ ౧౮౮ ॥ తతఃకల్యాణనగరం దేవదాసఃపపద్యసః । తత్రభూపంజగద్దేవం దదర్శ తపతాంవరం॥ ౧౮౯॥ జగద్దేవస్సమాలోక్య స్వగురుంగృహమాగతం । సంపూజ్య విధివత్ ధీమాన్ ఆసనేసన్న్యవేశయత్॥ ౧౯౦॥ యథావత్పూజితస్తేన దేవదాసోమహామతిః। జగద్దే

---

దివలయును - ఈప్రకారము రాజుచెప్పఁగానే యాబౌద్ధగురు వప్పుడు తాను భక్తిపూర్వకముగా నా దేవదాసునకుమ్రొక్కి యతనిని యాచించెను - ఓ సర్వము తెలిసిన దేవదాసుఁడా సమస్తలోకములయందుఁ బూజింపఁ బడినవాఁడా యిప్పుడు నాకును నాశిష్యులకును మహానుభావుఁడైన యీరాజునకును మోక్షమునిచ్చునట్టి శివదీక్షనులింగదీక్షను వేదములయందునాగమములయందునుజెప్పఁబడిన ప్రకారము చేయుము - అనియితఁడు ప్రార్థింపఁగా నప్పుడు శివునకుఁ బ్రియుఁడైన దేవదాసుఁ డందఱకు శివదీక్షను లింగదీక్షనుజేసెను - ౧౮౫- శివపంచాక్షరీమంత్రము నందఱకుపదేశించి పిమ్మట శివపూజను విధిప్రకారముబోధించి యప్పుడా ఘటములో నవతరించియున్న యామహాదేవస్వామి నామోద పట్టణమునకుఁ దెచ్చి విధి ప్రకారము ప్రతిష్ఠ చేయించి శిష్యబృందములచేత మ్రొక్కులు గొనుచున్న యా దేవ దాసుఁడు భక్తితో వేదోక్తములైన మంత్రములు చెప్పి పూజ చేసెను - ౧౮౮ - అంత నాదేవదాసుఁడు కల్యాణపట్టణమునకువచ్చి యక్కడ తపము చేయువారిలో శ్రేష్ఠుఁడైన జగద్దేవరాజునుజూచెను - అంతనాబుద్ధిమంతుఁడైన యాజగద్దేవుఁడు తన యింటికి వచ్చిన తనగురువునుజూచి శాస్త్రప్రకారము పూజచేసి పీటమీఁదఁగూర్చుండబెట్టెను- ౧౯౦- అతనిచేత విధిప్రకారముపూజింప

వస్యసర్వేషాం పౌరాణాంచయథావిధి ॥ ౧౯౧ ॥ శివదీక్షాం లింగదీక్షాంచ కారవిధివత్తదా। శైవపంచాక్షరంమంత్రంధర్మకామార్థ-మోక్షదం॥ ౧౯౨॥ శివపూజాంచమహతీం ముక్తిసాంరాజ్యదాయినీం । ఉపాదిశత్ససర్వేషాం పౌరాణాంచయథావిధి ॥ ౧౯౩ ॥ అథామోదపురంప్రాప్య భార్యయాపూజితస్సుధీః । స్వపుత్రస్యోపనయనం ఏకోరామస్య ధీమతః ॥ ౧౯౪ ॥ అకరోద్దేవదాసస్సః బంధువర సమన్వితః । అంనంచ ప్రదదౌభూరి దక్షిణాంచముదాన్వితః॥ ౧౯౫ ॥ వస్త్రయజ్ఞోపవీతాని క్షౌమాణివివిధానిచ । విద్వద్భిశ్చైవవిప్రేభ్యః శైవేభ్యశ్చయథామతి ॥ ౧౯౬ ॥ అనంతరంస్వపుత్రస్య ఏకోరామస్య ధీమతః । వివాహంకారయామాస దేవదాసోమహాసుధీః ॥ ౧౯౭ ॥ తదాకైలాసవాసీశః శివసాక్షాదుమాపతిః । ఆయయౌ దేవదాసస్య గృహం పరమశోభనం॥౧౯౮॥ శివందృష్ట్వాదేవదాసఃభార్యయాస్సహితశ్శుచిః। ఆపూజయన్మహాదేవం యథావిధిమహేశ్వరం ॥ ౧౯౯ ॥ పూజతోదేవదాసేన శివభక్తార్తిభంజనః । ఉవాచ మధురం వాక్యం ఆదిమధ్యాంతవర్జితః ॥ ౨౦౦ ॥ దేవదాసత్వయా సర్వం జగచ్ఛైవమతం కృతం । ఇతఃపరం జనిష్యంతే యేజనా

---

బడినయీ దేవదాసుఁడు జగద్దేవరాజునకు నతనిపట్టణమందుండు జను లకును విధిప్రకారము శివదీక్షనులింగదీక్షను చేయించెను - మఱియు నతఁడువారికి ధర్మార్థకామమోక్షములనిచ్చునట్టిశివపంచాక్షరీమంత్రమును మోక్షసామ్రాజ్యము నిచ్చునట్టి శివపూజనుపదేశించెను - అంత నా దేవదాసుఁడామోదపట్టణము నకువచ్చిభార్యచేతఁబూజింపఁబడినవాఁడై తనబంధువులతోఁగూడుకొని తన పుత్రుఁడైన రామునకుపనయనముచేసి బ్రాహ్మణులకన్నమునుభూరిదక్షిణనిచ్చెను- మఱియుఁ బండితులుగానున్న శైవబ్రాహ్మణులకొఱకును శైవులకొఱకును మంచిశ్రేష్ఠములైనవస్త్రములనుయజ్ఞోపవీతములనిచ్చెను- ౧౯౬- తరువాత మిక్కిలిబుద్ధిశాలియైనదేవదాసుఁడుతనకొడుకైన యారామునకువివాహముచే యించెను - అప్పుడు కైలాసమున నున్నట్టి పార్వతీపతియైన శివుఁడు మిక్కిలి మంగళమైన యీ దేవదాసునింటికివచ్చెను - అప్పుడు దేవదాసుఁడా శివునిజూచి తనభార్యతోఁగూడినవాఁడై యామహేశ్వరుని విధిప్రకారముపూజించెను - ఆదిమధ్యాంతములులేనట్టియు భక్తులయార్తులనుబోఁగొట్టునట్టియాశివుఁడ తనిచేతఁబూజింపఁబడినవాఁడై మధురమైనమాట యొకటిచెప్పెను- ౨౦౦- ఓ దేవదాసుఁడా నీవుజగత్తంతయు శైవమతము వ్యాపింపంజేసితివి - ఓయి

భువిపుత్రక ॥ ౨౦౧ ॥ తేషాంజనానాంసర్వేషాం గురుస్థానేభిషేచయ । తవ పుత్రంమహాభాగం యేకోరామం దయానిధిః ॥ ౨౦౨ ॥ ఏకోరామస్య తనయో రుద్రాఖ్య స్సంభవిష్యతి ॥ రుద్రస్య తనయశ్శ్రీమాన్ కాలసేనో భవిష్యతి ॥ ౨౦౩ ॥ రుద్రస్య కాలసేనస్య చోభయోర్బ్రహ్మనిర్మితాః । కంన్యాభార్యా భవిష్యంతీ త్యుక్త్వాసోంతరధాత్ శివః ॥ ౨౦౪ ॥ తతస్స దేవదాసస్తు పుత్రం సర్వగుణాన్వితం । వీక్ష్య శైవగురుస్థానే హ్యభిషిక్తంచకారవై ॥ ౨౦౫ ॥ ఈశ్వరోక్త ప్రకారేణ సర్వం కృత్వామహీతలే । భార్యయా సహితశ్శ్రీమాన్ దేవదాసో మహామతిః ॥ ౨౦౬ ॥ శివంహృదిసదాధ్యాయన్ శివంహృదిసమర్చయన్ । శివంసంకీర్తయన్ దేవం శివసాయుజ్యమానసః ॥ ౨౦౭ ॥ శ్రీదేవదాసమాహాత్మ్యం యేశృణ్వంతిపఠంతిచ । తేషాంచేటీభవేన్నూనం మహాలక్ష్మీస్సదాగృహే ॥ ౨౦౮ ॥ ఇతిశ్రీ బ్రహ్మకృతే - బ్రహ్మాండపురాణే - ఉత్తరఖండే - దేవాంగచరితే - దేవదాసావతారకథాపరిపూర్తిర్నామాష్టావింశోధ్యాయః.

అథామోదపురేశస్య దేవదాసతనూభువః । విరూపాక్షస్యతనయో రుద్రోభూదుగ్రవిక్రమః ॥ ౧ ॥ విరూపాక్షో మహాబాహు స్స్వపుత్రం రుద్రమా

---

కుమారుఁడా ఇఁకమీఁదనెవరుజగత్తునందు పుట్టుదురో వారికందఱకుగురువుగానుండునట్లు దయానిధియైన యీనీకొడుకగు నేకోరాముని నభిషేకముచేయుముఏకోరామునకురుద్రుఁడనుకొడుకుపుట్టును రుద్రునకుశ్రీమంతుఁడైనకాలసేనుఁడుపుట్టును- రుద్రునకు కాలసేనునకును బ్రహ్మనిర్మితకన్యలుభార్యలగుదురుఅనిచెప్పియాశివుఁడంతర్ధానమునొందెను . అంతనాదేవదాసుఁడన్నిగుణములతోనొప్పియున్నతనకొడుకునుజూచిశైవగురుస్థానాభిషిక్తునిఁజేసెను- ౨౦౫- ఆదేవదాసుఁడుభూలోకమందంతయునీశ్వరుఁడుచెప్పినప్రకారముచేసితనభార్యతోఁగూడుకొనిమనస్సుననెల్లప్పుడుశివునిధ్యానముచేయుచు మనస్సుననేయతనింబూజించుచు నోటను శివనామకీర్తనముచేయుచు శివసాయుజ్యము నొందెను - ఈ దేవదాసుని మాహాత్మ్యమును జదివినవారికి విన్నవారికి మహాలక్ష్మివారింటి పనికత్తెగా నుండును - ఇది బ్రహ్మస్వరూపమైన బ్రహ్మాండ పురాణమునను త్తరఖండమున దేవాంగచరితమున దేవదాసావతారకథాపరిపూర్తి యన్నది యిరువదియెనిమిదవ యధ్యాయము.

సూతుఁడుపిమ్మటికథనాఋషులకుఁజెప్పుచున్నాఁడు- తరువాతనాయామోదపట్టణమునకుప్రభువైన దేవదాసునికొడుకగు విరూపాక్షునకు మిక్కిలి

దరాత్ । అభిషిచ్య గురోః పీఠే సయయౌ త్రిదశాలయం॥ ౨॥ అథరుద్రో మహాబాహుః పాలయన్ శిష్యబృందకం । వేత్వా వస్త్రాణి రమ్యాణి వితరన్నాస్తభూతలే ॥ ౩ ॥ ఈశ్వరాజ్ఞానుసారేణ సకన్యాం బ్రహ్మనిర్మితాం ఉపయేమే విధానేన రుద్ర ఆమోదరాట్స్వయం॥ ౪॥ సతస్యాం జనయామాస తనయం దీప్తవర్చసం కాలసేనాభిధం పుత్రం సర్వలక్షణసంయుతం॥ ౫ ॥ త్రిలింగా వింశతేః పుత్రం దుర్గళాం నామనామతః । సోమనాథస్య శైవస్య సురూపాం సత్యవాదినః॥ ౬॥ రుద్రో వివాహమకరో త్కాలసేనస్య వై తతః రుద్రాత్మజః కాలసేన ఆమోద పాలయన్ పురం॥ ౭॥ వస్త్రాణి కల్పయిత్వా చ సర్వేషాం వ్యతరత్ప్రభుః । తస్య పాల యతః పృథ్వీం వస్త్ర దాతుః పరౌజసః॥ ౮॥ కాలసేనస్య చింతాభూ దత్యర్థ మనపత్యతః । పుత్రకామో మహాతేజాః కాలసేనో మహాబలః॥ ౯॥ బ్రహ్మకన్యాం నిర్మితాయా నారీః దశశతం ద్విజాః । తథాపి తస్య భార్యాయాం నైకస్యాం నితనయో భవత్ ॥ ౧౦॥ అపనత్యత్వ

---

పరాక్రమము గల రుద్రుఁడను కొడుకు కలిగెను- ౧- మిక్కిలి భుజబలము గలయా విరూపాక్షుఁడు తన కొడుకగు రుద్రుని బ్రీతితోఁ దన రాజ్యమందు గురువుగాఁ బట్టాభిషేకము చేసి తాను స్వర్గము బొందెను - ౨ - పిమ్మట మిక్కిలి భుజబలము గలయారుద్రుఁడు తమ మయిన శిష్యసమూహమును బాలించుచు సుందరములగు వస్త్రములను నేసి భూమియందలి జనులకందఱకిచ్చుచుండెను- ౩- ఆమోదపట్టణమునకుఁ బ్రభువైన యారుద్రుఁడు ఈశ్వరాజ్ఞచేత బ్రహ్మ నిర్మించిన కన్యను దాను శాస్త్రోక్తవిధిప్రకారము పెండ్లియాడెను - ౪ - అతఁడా పెయందుఁ బ్రకాశించిన వర్చస్సు గలిగి సమస్త శుభలక్షణములతోఁ గూడియున్న కాళసేనుఁడను కొడుకును బుట్టించెను - ౫ - త్రిలింగదేశమునకుఁ బ్రభువై నట్టియు నిజము పలుకునట్టి సోమనాథుఁడను శైవుని యొక్క కూతురగునట్టియు మంచిరూపము గలయట్టి దుర్గళియను కన్యకను దీసి యారుద్రుఁడు కాళసేనునకు వివాహము చేయించెను అంతనా రుద్రుని కొడుక గునట్టియుఁ బ్రభువగునట్టి కాళసేనుఁ డామోదపట్టణమును బాలించుచు వస్త్రములనేసి యందఱకునిచ్చెను. వస్త్రములనిచ్చునట్టియు మిక్కిలి పరాక్రమము గలయట్టియు భూమినిఁ బాలించుచున్నట్టి యా కాళసేనునకు బిడ్డలు లేమివలన మిక్కిలి చింతగలిగెను - మిక్కిలి బలవంతుఁడైన యా కాళసేనుఁడు పుత్రులఁ గోరువాడై పూనికతో బ్రహ్మకొమార్తెలు నేనూరు స్త్రీలను బెండ్లియాడెనోయి బ్రాహ్మణులారా - అట్లైనన త

దుఃఖేన జాయాసుచబహుష్వపి । కాలసేనశ్శివందేవ మర్చయామాసయత్న తః॥౧౧॥ శివధ్యానపరోనిత్యంశివభక్తిపరాయణః। నిశ్చలోనియతాహారఃపూజయామాసశంకరం॥ ౧౨॥ తతస్తుష్టో మహాదేవ శివస్తద్దృఢపూజయా । దదా దశసహస్రాణి పుత్రానస్య ద్విజోత్తమాః ॥ ౧౩ ॥ ప్రసాదేన తతశ్శంభోస్స కాళ స్సగరేశ్వరః । పుత్రాంశ్చ దశసాహస్రాన్ ప్రాప్యహర్ష ముపాగమత్ ॥ ౧౪॥ కాళసేనస్య పుత్రాణాం తేషాం నామాని కానిచిత్ । మయోచ్యతే యథాసంఖ్యం శ్రుణుధ్వ మృషిపుంగవాః ॥ ౧౫ ॥ ప్రథమో రూపసేనశ్చ భద్రసేన స్త్వనంతరః । సత్యసేన శ్చిత్రసేన స్సుషేణో యజ్ఞసేనకః॥ ౧౬॥ సేనాబిందు ర్యజ్ఞబిందు స్తృణబిందు జటాధరః । జయవాన్ జయశీలశ్చ జయబిందు జితేంద్రియః॥ ౧౭॥ సత్యవ్రత స్సత్యవాదీ సుందరాంగ స్త్రిలోచనః । సాంబస్సార స్వత శ్చైత్ర స్సర్వజ్ఞ స్సర్వభావకః ॥ ౧౮ ॥ సంవిదాన స్సంప్రహార స్సమగ్రస్సత్యభాషణః । సరసస్సాహసీ చైవ సహస్వాన్ సుముఖ స్తథా॥ ౧౯॥ సురానందశ్చ సులభ స్సుందర స్సుందరీప్రియః । శతానంద శ్శంభుదేవ శ్శంకర

---

నికొకభార్యయందైనను కొడుకుపుట్టఁడాయెను-౧౦- పెక్కు భార్యలయందును బిడ్డలలేమివలనఁగలిగిన దుఃఖముతో నాకాళసేనుఁడు మిక్కిలియత్నముచేత సాంబశివునిఁబూజించెను- ౧౧- ఎల్లప్పుడుశివునిధ్యానముచేయుటయందాసక్తుఁడై శివభక్తియందుదృఢభక్తిగలవాఁడై స్థిరమైనమనస్సుగలవాఁడై యాహారనియమముచేసికొని శివునిఁబూజించెను- ౧౨- తరువాత దొడ్డదేవుడగు నాసాంబశివుఁడతనిదృఢభక్తితోడిపూజచేత సంతోషపడినవాఁడై యతనికిఁబదివేలకొడుకుల నిచ్చెనోయి బ్రాహ్మణోత్తములారా - ౧౩ - తరువాత నాసగరనాథుఁడగుకాళుఁడు సాంబశివుని యనుగ్రహమువలనఁ బదివేలకొడుకులును బొందిసంతోషపడెను - ౧౪ - ఆకాళసేనునికొడుకులపేళ్లలోఁ గొన్నిటి నేనువరుసగాఁ జెప్పెదను వినుండోయి ఋషులారా - ౧౫ - మొదటివాఁడు రూపసేనుఁ డతనిపిమ్మటివాఁడు భద్రసేనుఁడు - మఱియు సత్యసేనుఁడు చిత్రసేనుఁడు సుషేనుఁడు యజ్ఞసేనుఁడు - సేనాబిందువు యజ్ఞబిందువు తృణబిందువు జటాధరుఁడు - జయవంతుఁడు జయశీలుఁడు జయబిందువు జితేంద్రియుఁడు సత్యవ్రతుఁడు సత్యవాదిసుందరాంగుడు త్రిలోచనుఁడు సాంబుఁడు శారస్వతుఁడుచైత్రుఁడు సర్వజ్ఞుడు సర్వభావకుఁడు - సంవిదానుఁడు సంప్రహారుఁడు సమగ్రుఁడు సత్యభాషణుఁడు సరసుఁడు సాహసి సహస్వంతుఁడు సుముఖుఁడు సు

శ్శివదర్శనః॥ ౨౦॥ ఇత్యాద్యాద్యాదశ సాహసాః కాలసేనస్య నందనాః । తత
స్తేషాం కాలసేనః పుత్రాణా మృషిపుంగవై ః॥ ౨౧॥ కారయిత్వోప నయనం
విద్యాశ్చాధ్యాపయ త్తతః। తేషాం వివాహ మకరో త్సురూపా బ్రహ్మకన్యకాః॥
౨౨॥ కాలసేనస్తుసర్వేషాంపుత్రాణాంకాలపవచ। కాళసేనస్తు పుత్రాణాం ద్వై
స్సంస్కార మకారయత్ ॥ ౨౩ ॥ మన్వాదయస్తుతేతేషాం కూటస్థాశ్చాభవ న్
ద్విజాః । తేపుత్రాశ్చాపి మన్వాది ఋషిగోత్ర ప్రభేదతః ॥ ౨౪ ॥ అన్యోన్యం
పుత్రికాదాన స్వీకారార్హత్వమాయయుః । కాళసేనోమహాబాహుః స్వ
పుత్రం జ్యేష్ఠమాదరాత్ ॥ ౨౫ ॥ రూపసేనంగురోస్థానే స్థాపయామాసవై త
తః । రూపసేనోతి వీర్యశ్చ పాలయ న్గురుపీఠకం ॥ ౨౬ ॥ సభ్రాతృకశ్చ వ
స్త్రాణి వితతారజనాలయే । కాళసేనశ్చిరంపుత్రై ర్నామోదం పాలయన్పురం॥
౨౭॥ వస్త్రాణిదాపయ న్రాజా సుఖమాపద్విజోత్తమాః । పురేథపరిత్రాణాఖ్యే
శాలివాహననందనః॥ ౨౮॥ అవనవ్వసుంధరామా స్త శక్తినామమహాబలః।

---

రానందుఁడు సులభుఁడు సుందరుఁడు సుందరీప్రియుఁడు శతానందుఁడు శంభుదే
వుఁడు శంకరుఁడు శివదర్శనుఁడు- ౨౦- వీరుమొదలగువారుపదివేవురాకాలసే
నునకుఁ గొడుకులు- తరువాతఁ గాలసేనుఁ డాకొడుకులకు ఋషిశ్రేష్ఠులచేత
నుపనయనముచేయించి యంతవారి సకలవిద్యలఁ జదివించెను బ్రహ్మచేనిర్మింప
బడినకన్యకలనుదెచ్చి యాకాలసేనుఁడు యోగ్యమైనకాలమందేకొడుకులకువి
వాహముచేసెను - ఆకాళసేనుఁడు కొడుకుల కెవరిచేత నుపనయనముచేయిం
చెనో - ౨౩ - మనువుమొదలగువారందరు నాకొడుకులకుఁగూటస్థులైరోయి
బ్రాహ్మణులారా ఆకొడుకులును మనువుమొదలగుఋషుల గోత్రభేదమువలన
నొకరొకరికిఁగూతులనిచ్చుటకునుబుచ్చికొనుటకునుయోగ్యతనుబొందిరి- అం
తనాకాలసేనమహారాజుతనపెద్దకొడుకగురూపసేనునిఁబ్రీతివలన వీరశైవులకు
గురువై యుండమని పట్టాభిషేకముచేసి స్థాపించెను అంత మిక్కిలిపరాక్రమ
ముగలయారూపసేనుఁడు తనభూమినిబాలించుచుఁ దనతమ్ములతోఁగూడినవా
డై వస్త్రములనునేసి జనప్రపంచమం దిచ్చుచుండెను - కాళసేనుఁడు బహు
కాలముకొడుకులతోనామోదపట్టణమునుబాలించుచువస్త్రములనిప్పించుచు
సుఖమును బొందెనోయి బ్రాహ్మణోత్తములారా - ౨౭ - పిమ్మటఁబరిత్రాణమ
నుపట్టణమందు శాలివాహనునికొడుకు మిక్కిలిబలవంతుఁడు శక్తియనువాఁడు
భూమిని బాలించుచుండెను - ఆపట్టణమందు సోమశర్మయనివేదములఁ గడవ

తత్పురే సోమశర్మాఖ్యో బ్రాహ్మణో వేదపారగః ॥ ౨౯ ॥ జగామసోనపత్య త్వాత్కులసిద్ధవటంతతః । తత్రసర్వైః పూజ్యమాన శ్చంద్రమౌళీశ్వరాఖ్యయా ॥ ౩౦ ॥ వరాన్దదానస్సర్వేషాం వర్తంతే శంకరస్స్వయం । భిక్షాశనః పురేతస్మిన్ సోమశర్మాద్విజోత్తమః॥ ౩౧॥ పుత్రార్థీ సేవతేనిత్యం చంద్రమౌళీశ్వరంద్విజాః । అనిశం చంద్రమౌళీశ స్యాలయే పూజయన్ శివం॥ ౩౨॥ వర్తతే తం సోమశర్మా శేతే తత్రైవవై నిశి । పుత్రార్థీ ధనపాలాఖ్యో వణిస్సిద్ధవటంతతః॥ ౩౩॥ ఆగత బహుభీరత్నై శ్చంద్రమౌళీ మపూపుజత్ । చంద్రమౌళీశ్వరోదేవ స్తుష్ట స్తద్రత్నపూజయాం॥ ౩౪॥ జగాదవణిజం వాక్యం గథ పుత్రమదామితి । ధనపాలోవచశ్శ్రుత్వా తచ్ఛివస్యాశరీరజం ॥ ౩౫ ॥ హృష్టోగాయన్నృత్యతిస్మ తత్రతశ్చ శివాలయే । నిద్రాణ స్సోమశర్మాసౌ జాగృత్వాధ్వనినాసవై । ౩౬॥ ఆనందభరితం వైశ్యం నృత్యంతత మువాచహ । భో వైశ్యనృత్యసికుతః ప్రహృష్ట ఇవలక్ష్యసే॥ ౩౭॥ హర్షస్య తవకోహేతుర్మ

---

అరు౯ జదివినబ్రాహ్మణు౯ డొక౯డుండెను - ఆబ్రాహ్మణు౯డు బహుదినముల వఱకుబిడ్డలులేనివా౯డై యుండి యటుపిమ్మట కులసిద్ధవటమునుగూర్చిపోయెను అచ్చటవందఱచేత౯బూజింప౯బడుచు నందఱకు వరములనిచ్చుచు సాంబమూర్తి చంద్రమౌళీశ్వరుడ౯ను నామముతో వర్తించుచుండెను - బ్రాహ్మణశ్రేష్ఠు౯డైన యాసోమశర్మ యాపట్టణమందు బిక్షమెత్తిన యన్నమునుభుజించుచు౯ బుత్రుని౯గోరినవా౯డై నిత్యమునాచంద్రమౌళీశ్వరుని సేవించుచుండెనయా బ్రాహ్మణులారా - ఎల్లప్పుడు నాసోమశర్మ చంద్రమౌళీశ్వరుని గుడియందా యీశ్వరుని౯ బూజించుచు నచ్చటనేయుండును రాత్రియక్కడనే పండుకొనును- తరువాతధనపాలుండను వైశ్యుడొక౯డు పుత్రునిగోరినవా౯డై యాసిద్ధవటమునకువచ్చి యనేకములైన రత్నములచేత నాచంద్రమౌళీశ్వరుని౯బూజించెను- ౩౩ - ఆచంద్రమౌళీశ్వరు౯ డత౯డుచేసిన రత్నములపూజచేత సంతోషపడినవా౯డై యావర్తకుని౯గూర్చి యోయీ వర్తకు౯డా నీకుబుత్రునిచ్చితినిబొమ్మని పలికెను - సాంబశివుడు శరీరమును జూపక చెప్పినయామాటనువిని యాధనపాలుడు సంతోషించినవా౯డై పాడుచు నాశివాలయమందీప్రక్క నాప్రక్క నునృత్యముచేసెను - ఆధ్వనిచేత నిద్రపోవుచున్న యాసోమశర్మ మేలుకొని యానందపూర్ణు౯డై నట్టియు నాడుచున్నట్టియు వైశ్యునిగూర్చి యిట్లని పలికెను - ఓయివైశ్యు౯డా యాడుచున్నావు నీసంతుటకు౯ గారణమేమి మిక్కిలి

మత్రత్కథ్యతామితి । ఇతిపృష్టస్తేనవైశ్యః ప్రత్యువాచద్విజన్మనా॥ ౩౮॥ చం
ద్రమౌళీశ్వరమహం బహురత్నైరపూజయం । తుష్టస్తత్సపుత్రం మెదత్త
వాన్కరుణానిధిః॥ ౩౯॥ తతోనపత్యస్సాపత్య మోదోభూవమితిద్విజ। ఇత్యు
క్త్వాసతతోవైశ్య శ్శివం న త్వ వినిర్యయౌ॥ ౪౦॥ వణిజోవర న నంత చ్ఛ్రు
త్వా విప్రస్తతోద్విజః । స్పర్థాళురతిసంశోచ్య రపతిస్మశివంప్రతి॥ ౪౧॥ హా
హంత చంద్రమౌళీశ పక్షపాతః కృతస్త్వయా । కియాన్న దత్వామే పుత్రం వ
ణిజో త్ కథం భవా॥ ౪౨॥ ప్రాగేవాగత్య సేవేహి చిరం తే నుగ్రహేచ్ఛ
యా । తాదృశం మాం కథం త్యక్త్వా వణిజో ః కథంసుతం॥ ౪౩॥ నిర్దయోసి
కృతఘ్నోసి త దేవమకరోశ్శివ । మయాసకృద్ధికృతయా నానందఃపుష్పపూజ
యా ॥ ౪౪ ॥ తవసత్కృతయానందో వైశ్యప్రస్తరపూజయా । తవై వేష్టాశి
లాపూజాయతస్తుష్టో ధునాఖలు॥ ౪౫॥ హస్తః కిణాం కితశ్చాసీ త్పుష్పాపహా
పచయేనమే । అభవత్ఖలటీమూర్ధా పత్రాణాం భరణేనమే॥ ౪౬॥ ఏవం కృచ్ఛ్రే

---

సంతోషపడినవానివలె నగపడుచున్నావు - ౩౭ - నీసంతోషమునకుఁ గారణ
మేమో దానినాకుఁ జెప్పవలయును - అనియిట్లా బ్రాహ్మణుఁడడుగగా నావై
శ్యుఁడుత్తరముచెప్పెను - ౩౮ - నేనుజంద్రమౌళీశ్వరుని ననేకములగు మణుల
చేతఁబూజించితిని - దానివలన సంతోషించినవాఁడై దయానిధియైన యాచం
ద్రమౌళీశ్వరుఁడు నాకుఁ బుత్రునిచ్చెను- ౩౯- దానివలన బిడ్డలులేని నేనుబిడ్డ
లుగలుగుటవలని సంతోషముగలవాఁడనైతినోయి బ్రాహ్మణుఁడా - అనిచె
ప్పి యావైశ్యుఁడంతసాంబశివునకుఁ బ్రణమిల్లియరిగెను- ౪౦- అంత నాబ్రా
హ్మణుఁడావర్తకునకు శివుఁడు వరమిచ్చుటను విని యసూయగలవాఁడై మి
క్కిలి దుఃఖపడి శివునిఁగూర్చి మొరపెట్టుకొనెనోయి బ్రాహ్మణులారా - ౪౧ -
హా అయ్యో చంద్రమౌళీశ్వరుఁడా నీవెంత పక్షపాతముచేసితివి - నీవునాకుఁ
బుత్రునీకవైశ్యునకెట్లీవచ్చును- ౪౨- ముందే వచ్చి బహుదినములనుండి నీ
యనుగ్రహమునుగోరి సేవించుచున్నానుగదా- అట్టినన్నువిడిచివర్తకునకుమా
త్రముపుందెట్లుకొడుకునిచ్చితివి- ౪౩- దయలేనివాఁడవైతివి కృతఘ్నుఁడవై
తివికాఁబట్టి యిట్లుచేసితివోయి శివుఁడా - నేనెల్లప్పుడుచేసినపువ్వులపూజచేత
నీకానందములేదు- ౪౪- నీకావైశ్యుఁడుచేసిన రాలపూజచేత నానందము -
నీకురాలపూజయే మిక్కిలిసమ్మతము - కాఁబట్టి యిప్పుడుదానిచేత సంతోష
పడితివి- ౪౫- పువ్వులగొత్తులఁగోయుటచేతనాచేయికాయలుకాచినది- నీపూ

ణకృతయామయా పుష్పాదిపూజయా । అతుష్టోవై శ్యకృతయా తుష్టఃపాషాణపూజయా॥ ౪౭ ॥ అహం విధాస్యేతామేవ శిలాపూజాం ముదేతవ । ప్రీతస్య సూక్ష్మపాషాణ పూజయా తవశంకర ॥ ౪౮ ॥ పృథుపాషాణ పూజాచేద్భృశం ప్రీతి స్తతోభవేత్ । ఇత్యుక్త్వాహృత్యమహతీం శిలాం విప్రస్స దుర్మతిః॥ ౪౯॥ తుష్టోభవేతిలింగస్య వ్యాక్షిప త్తస్యమ స్తకే । తస్యాః పాతేనమహతా తల్లింగం పర్యభిద్యత॥ ౫౦॥ తతఃక్రుద్ధో మహాదేవ శ్చంద్రమౌళీశ్వరఃప్రభుః । అంతర్హితో బ్రవీద్విప్రమ శరీరేణ భారతం॥ ౫౧॥ శ్రీశివః॥ సాహసిక్యం దురాత్మంస్తే హానిరేవా భవత్తవ । తవేదృశస్యతుష్టస్స్యాం కథం ... చపలాత్మనః॥ ౫౨॥ పాప్మనోయం తవక్రోధ స్త్వామేవా త్స్యత్య సంశయం । కృతాయామమపూజాయా స్త్వయారే చంచలాత్మనా॥ ౫౩॥ తవపుత్రమపై తథ్యం సభవిష్యత్యదాం మహాం । యథాభిన్నం త్వయానీచశిలాప్రక్షేపణేనమే॥ ౫౪॥ శిర స్తవతథై వాపి పుత్రేజాతే భవిష్యతి । యస్మాదీ దృగ్విధం పాపం కృతవాన్పూర్వ దుర్మతే॥ ౫౫॥ తస్మాద్భావీ భవత్పుత్రో వర్ణహీనో భవిష్యతి । ఇత్యు

---

జనుబిల్వము మొదలగుపత్రములమూటలనుమోసి తలబట్టగట్టినది- ౪౬- ఇట్లు కష్టపడి నేనుచేసినపువ్వులపూజచేత నీవు సంతోషమునుబొందక వైశ్యుడుచేసిన రాలపూజచేత సంతోషపడితివి - ౪౭ - నేనునీసంతోషము కొఱకాతాలపూజనేచేసెదను - చిన్న రాలపూజచేత సంతోషపడి నీకుఁ బెద్దరాలతోడిపూజచేత మిక్కిలిసంతోషముగలుగునుగదాశంకరుడా - అనిచెప్పిదుష్టబుద్ధిగలయాబ్రాహ్మణుడు పెద్దరాతినెత్తి సంతోషించినవాఁడవగుమని యాలింగముతలనువైచెను - ఆపెద్దరాతిదెబ్బచేత నాలింగము పగిలెను- ౫౦- అంతసర్వశక్తిసంపన్నుఁడైన యాచంద్రమౌళీశ్వరుఁడు కోపగించుకొన్నవాఁడై తానతనికగపడక యశరీరవాక్కుతో నాబ్రాహ్మణునిఁగూర్చిపలికెను - ౫౧ - ఓరిదుర్మార్గుఁడా నీసాహసకృత్యము నీకే హానియాయెను - ఇట్టి చంచలచిత్తుఁడైన నీకునేనెట్లు సంతోషించినవాఁడగుదును- ౫౨- పాపాత్ముఁడవైన యీనీకోపమునిన్నే భక్షింపఁగలదుసందేహములేదు - ఓరీచపలచిత్తుఁడవైన నీవు నాకుఁజేసినపూజకు నీకుఁ బుత్రునియుక్తుండైనవానినిచ్చితి నతఁడుపొడ్డవాఁడు కాఁగలఁడు- ఓరినీచుఁడా రాతినివేయుటచేత నీవేరీతిని నాతలనుబగల్చితివో- నీకుఁగొడుకుపుట్టినపిమ్మట నీతలయునట్లగును - ఓరిదుష్టబుద్ధిగలవాఁడా నీవేల యిట్టిపాపకృత్యమునుజేసితివో యందువలన నీకుఁ గలుగఁగలకొడుకు వర్ణహీ

త్వా చంద్రమౌళీశ స్తూష్ణీమాస్త తపోధనాః॥ ౫౬॥ సోమశర్మా తతో విప్రశ్చిం తాహర్షసమన్వితః। ఆగత్య పరితాణంచ తత్సవపత్నై న్యసమబ్రవీత్॥ ౫౭॥ సుశీలాశీలసంపన్నా పత్నీ సా సోమశర్మణః। తతః ప్రసుషువే పుత్రం ధృత్వాగ ర్భం ద్విజోత్తమాః॥ ౫౮॥ జాతమాత్రే తతః పుత్రే బహుధాభిన్నమస్తకః। మ మారసోమశర్మావై శివశాపాదమోఘతః॥ ౫౯॥ మమారతేనవై సాకం సోమ శీలా పతివ్రతా। అవిద్యమాన పితృకంతం బాలం మాతులోద్విజాః॥ ౬౦॥ స్వ దారహస్తే విన్యస్య యజ్ఞశర్మా పుపోషహ। సరత్న్యమానో వవృధే మాతులే నశిశుస్తతః॥ ౬౧॥ ఉపనీతోథ్యాపితశ్చ ద్రుమళశ్చేతి విశ్రుతః। అథైకదాసౌ ద్రుమళో మాతులస్యనియోగతః॥ ౬౨॥ ఆహర్తుం సమిధోరణ్యామేక ఏవ యయావటుః। తత్రదృష్ట్వా వనేశున్యా క్రీడంతం సింహమాదరాత్॥ ౬౩॥ ద్రు మళో విస్మయావిష్టః పశ్యన్నేవ తదాస్తసః। సాశునీ గ్రామనిలయా పరితాణ పురంతతః॥ ౬౪॥ ఆగత్యాశక్తిరాజస్య సదనం సముపావిశత్। ద్రుమళోను పదంతస్యాః పరితాణం ప్రవిశ్యచ॥ ౬౫॥ శునీం రాజాలయగతాం తాం దృష్ట్వా

---

నుండై పోవును అనియిట్లుచెప్పి యాచంద్రమౌళీశ్వరుఁ డూరక యుండెనోయి ఋషులారా - పిమ్మటనాసోమశర్మయనుబ్రాహ్మణుఁడు వ్యసనముతోను సంతో షముతోనుగూడినవాఁడై పరితాణపట్టణమునకువచ్చియాసమాచారమునుదన భార్యకొఱకుఁజెప్పెను - పిమ్మటమంచిమనస్సుగలయట్టియు సదాచారసంపన్ను రాలైనట్టి యతనిభార్య గర్భమునుధరించి కొడుకునుగనెనోయి బ్రాహ్మణోత్త ములారా- ౫౮- అంతగొడుకుపుట్టఁగానేయాసోమశర్మయమోఘమయినశివ శాపమువలన ననేకవిధములఁబగిలిన శిరస్సుగలవాఁడై చచ్చెను- ౫౯- అతని భార్యయగు సోమశీల మహాపతివ్రతగనుక నతనితో సహగమనముచేసెను- ఇ ట్లుతల్లిదండ్రులులేని యాబాలుని నతని మేనమామయయిన యజ్ఞశర్మయను వాఁడు తనభార్యచేత నిచ్చిపోషించెను - అంత నాశిశువు మేనమామచేతఁ గా పాడఁబడుచుఁబెరిగెను- ౬౧- తరువాత నామేనమామ యతనికుపనయనము చేసి విద్యలఁ జదివించెను - అతఁడు ద్రుమళుఁడని ప్రసిద్ధినొందెను - పిమ్మటనొక ప్పుడు ద్రుమళుఁడు మేనమామ యాజ్ఞవలన సమిధలను దేనొక్కడే యడవికిఁ బోయెను- ఆయడవియందునాఁడుకుక్కతోఁగ్రీడించుచున్న సింహమునుజూచి యాద్రుమళుఁడాశ్చర్యమునొందినవాఁడై యాదరముతోఁ దానిజూచుచునుం డెను - గ్రామమందునికిగల యాకుక్క- యంతట నాపరితాణపురమునకువచ్చి

స్వగృహం యయౌ। తస్యాశ్శునాస్తతో జాతాద్వౌపోతౌసింహవర్ణకౌ॥ ౬౬॥ ఉచ్ఛ్రితభాదినౌతత్ర వర్ధేతే పట్టణే ఉభౌ। తతఃశక్తిఃకదారాజా గతోప్యుపవన మధ్యమం॥ ౬౭॥ ఉద్దిశ్యబహులక్ష్యాణి పాతయామాససాయకైః। లక్షీకృతతస్తాళం శక్తిరాజో మహాబలః॥ ౬౮॥ ఏకేషుణా శిరస్తస్య ఛిత్వోర్వ్యాం సమపాతయత్। దృష్ట్వా తదద్భుతంకర్మ పౌరాస్తస్యనృపస్యతు॥ నమస్కుర్వన్భృశం వాగ్భిస్తం శాలీవాహనాత్మజం। తదావిలోక్యద్రుమళో బహుమానం నృపస్యతం॥ ౭౦॥ లఘూకరిష్యన్రాజానం శక్తిమిత్యబ్రవీద్వచః। యదిఛింత్వాస్తాలమూలం త్వయ్యస్త్వం జగతీపతే॥ ౭౧॥ ఛిత్వాతాళశిరోమాభూత్పాత్రంస్తోత్రస్యవై భవాన్। సఏవముక్తో విప్రేణ ద్రుమళేన మహీపతిః॥ ౭౨॥ రుషాకులస్తం ప్రత్యూచే బిభ్రాణ స్సశరం ధనుః। తూష్ణీం ప్రలపస్యగచ్ఛేయ మితిచేత్త్వాం ద్విజాధునా॥ ౭౩॥ ససపర్యయామిసశరం గృహాణ ధనురుత్తమం। పశ్యైతతాళ మూలం త్వం భింధీహ బలవాన్హ్యవై॥ ౭౪॥ ఇత్యుక్తశ్శక్తినాతేన

---

శక్తిరాజునింటఁ బ్రవేశించెను - ద్రుమళుఁడు దనివెంటనే పరిణామమునుబ్రవేశించి యాకుక్కరాజునింటఁజొచ్చుటనుజూచి తానుదనయింటికిఁబోయెను- తరువాత నాకుక్కకు సింహమువంటివర్ణముగల రెండుపిల్లలుకలిగెను- ౬౬- ఆ పిల్లలురెండు నాపట్టణమందెంగిల్లనుదినుచు బెరిగెను- తరువాతనొకానొకప్పుడాశక్తిరాజుద్యానవనమునడిమికిబోయి యనేకలక్ష్యములనుద్దేశించి బాణములనుబ్రయోగించి యాలక్ష్యములఁ బడవేయుచుండెను- అంతమిక్కిలిబలముగలయాశక్తి రాజొకతాటిచెట్టునుగురిపెట్టి యొకబాణముచేత దానితలనుదెగనరికిభూమియందుఁబడవైచెను- పట్టణమందుండు జనులారా రాజుయొక్క యాయాశ్చర్యకరమైన పనినిజూచి శాలీవాహను కొడుకైన యారాజును మిక్కిలి స్తోత్రములుచేసిరి . అప్పుడు ద్రుముళుఁడారాజునకువచ్చిన గొప్పదనమునుజూచి యాశక్తిరాజును జులకనగాఁజేయుచు నతనితోనిట్లనెను - ఓయిరాజా నీవీత్రాటిచెట్టుమొదలును నరికినపక్షమందు స్తోత్రముచేయదగినవాఁడవు- ౭౧- త్రాటిచెట్టుకొనను నరికినమాత్రము చేతనే స్తోత్రమునకు నీవు పాత్రుఁడవు కావు బ్రాహ్మణుఁడైన ద్రుమళునిచేత నిట్లుచెప్పబడినవాఁడై రాజుకోపముతోఁగూడినవాఁడై బాణముతోడిధనుస్సునుధరించుచునాబ్రాహ్మణునిఁగూర్చియుత్తరము చెప్పెను - ఊరకయొకమాటచెప్పి పోయెదననియెంచిన నిప్పుడు నిన్నుఁ గదలనీనోయి బ్రాహ్మణుఁడా బాణముతోఁగూడిన యుత్తమమైన ధనస్సును గైకొను

ద్రుమళస్సత్వరస్థితః । ధనురాదాయ వేగేన పశ్యత్సు సకలేష్వథ॥ ౨౫॥ ఏకేన నేషుణాభిత్వా తాలమూలాన్య పాతయత్ । తతో విస్మయమాపన్నో మహాహర్షసమన్వితః॥ ౨౬॥ శక్తిస్తుద్రుమళం ప్రాహయదిష్టం ప్రియతామితి । అథాత్మని ప్రీతిమంతం శక్తిరాజం నృపర్షభం ॥ ౨౭ ॥ శున్యాస్తస్యా ద్విజః పోతౌ యయాచే సింహసంభవౌ । దత్వాస్మై సహసారమేయౌ తౌ వస్మైసన్నృపో ముదా ॥ ౨౮ ॥ గ్రామాణ్యప్యుపభోజ్యాని భూషణాన్యప్యనేకశః । రాజాసఖిత్వమాపద్య ద్రుమళం పర్యతోషయత్ ॥ ౨౯ ॥ తతస్తౌ పరమస్నేహౌ వాస్తాం ద్రుమళభూపతీ । ఏకదేహా వివాత్యాప్తౌ మహాబల పరాక్రమౌ॥ ౩౦॥ తౌ సారమేయౌ స్వగృహే ద్రుమళః పర్యపోషయత్ । స్వయం యదత్తి తత్తాభ్యాం దదాత్యేవ సమాదరాత్ ॥ ౩౧॥ కల్పయిత్వా తయోరమ్యే తల్పే స్వస్య సమీపతః । కౌశేయకంచుకే శేతే ద్రుమళ స్సారమేయయోః॥ ౩౨॥ తత స్తన్మాతులో విప్రో యజ్ఞశర్మా మహాతపాః । ఆచారహీనం ద్రుమళం జ్ఞాత్వా కోపసమన్వితః॥ ౩౩॥ శూద్రికాస్మద్గృహమితో మావిశేతి నిరాకరోత్ । ఉక్తమాత్రే

---

ము - ఇప్పుడు చూతము నీవు త్రాటిచెట్టుమొదలును నరికితివా బలవంతుఁడవే- ౨౫ - ఇట్లాశక్తిచేతఁ జెప్పఁబడి యాద్రుమళుఁడందఱు చూచుచుండ ధనస్సు నెత్తికొని వేగముతో నిలిచి యొకబాణముచేతఁ బెక్కు త్రాటిచెట్ల మొదళ్లను బడవైచెను - తరువాత నాశక్తి యాశ్చర్యపడి మిక్కిలి సంతోషించినవాఁడై యాద్రుమళునితో నీకేదిష్టమో దానిం గోరుమనెను - అంత నాబ్రాహ్మణుఁడు తనయందుఁ బ్రీతిగలరాజశ్రేష్ఠుఁడైన యాశక్తిరాజును సింహమువలనఁబుట్టిన యాకుక్కపిల్లలను యాచించెను - ఆరాజు మోదముతో నీ బ్రాహ్మణుని కొఱకాకుక్కపిల్లలను ననుభవయోగ్యములైన గ్రామములను భూషణములు మొదలగువాని నధికముగానిచ్చి యతనికిఁ దానుస్నేహితుఁడై రాజాద్రుమళుని సంతోషపఱిచెను - ౨౯ - పిమ్మట మిక్కిలి పరాక్రమముగల యాద్రుమళుఁడును రాజును బరస్పరము మిక్కిలి స్నేహము గలవారై యొకదేహము కలవారి వలెనుండిరి- ౩౦- ఆకుక్కలను ద్రుమళుఁడు దనయింటఁ బోషించెను తానుదేనిఁదినునో దాని మిక్కిలి ప్రీతివలన వానికిచ్చుచుండెను - ౩౧ - ద్రుమళుఁడాకుక్కలకుఁ బట్టువస్త్రములచేత మనోజ్ఞములైన పడకలను గవచముల నేరుపఱిచియుంచెను- ౩౨- పిమ్మటనతని మేనమామయగునట్టి మహాతపస్సంపన్నుడైన యజ్ఞశర్మయను బ్రాహ్మణుఁడాచారములేని యాద్రుమళునిఁజూచి కోప

ణతేనైవం ద్రుమళో యజ్ఞశర్మణా ॥ ౮౪ ॥ త్యక్త బ్రాహ్మణ వేషో భూద్ద్రు
మళశ్శూద్రతాంగతః । తదాదిశూద్రిక ఇతినామాజాయతతస్యవై ॥ ౮౫ ॥ శూ
ద్రిక స్తేనభూపేన శాలివాహన సూనునా । సఖ్యమాపాదయ న్నేవ ప్రావర్త
తమహాబలః॥ ౮౬ ॥ తతోనేపాళభూపాలో బౌద్ధోనామ్నా సుదారకః । సేవా
ర్థం శక్తిరాజస్య పరిత్రాణ ముపాగమత్ ॥ ౮౭ ॥ స నేపాళేశ్వరో బౌద్ధో గత్వా
శూద్రికమందిరం । తేనసత్కారితశ్చాస్య నిమిత్తమిదమబ్రవీత్ ॥ ౮౮ ॥ శూ
ద్రికత్వం మహాబాహో శక్తేః ప్రియసఖః ఖలు । షణ్మాసానంతరమితో విరో
ధోయువయోర్భవేత్ ॥ ౮౯ ॥ తదా యాతుభవాన్ శీఘ్రం వైజయంతీపురం
మమ । అస్మదుక్తం నిమిత్తంస్యాద్వితథం నమహామతే॥ ౯౦॥ యదాభవేద్వి
రోధశ్చశక్తేస్సహమహాబల । మాంగమోనాన్యాంపురంవీరమమాగచ్ఛపురంతదా ॥
౯౧ ॥ తేనేత్యుక్తశ్శూద్రికోపి బాఢమిత్యబ్రవీత్తతః । బౌద్ధశ్శక్త్యభ్యనుజ్ఞాత
స్స్వయయౌ స్వపురంప్రతి॥ ౯౨॥ తతఃకతిపయేకాలే రాజాశక్తిర్మహాబలః। స
శూద్రిణాబహుబలైర్మృగయార్థం వనంయయౌ॥ ౯౩॥ పర్యటయ్యవనం స

---

ముతోఁ గూడినవాఁడై శూద్రికుఁడా యిఁకమీద మాయింటిలోపలరాకుమని
తిరస్కరించెను - యజ్ఞశర్మ యిట్లుచెప్పినమాత్రమున నాద్రుమళుఁడు బ్రాహ్మ
ణవేషమువిడిచి శూద్రుఁడౌటనుబొందెను - అదిమొదలుకొని యతనికి శూద్రి
కుఁడని పేరుగలిగెను- ౮౫- మిక్కిలి బలముగల శూద్రికుఁడా శాలివాహనుని
కొడుకైన రాజుతో స్నేహముచేయుచునేయుండెను- ౮౬- పిమ్మట నేపాళదే
శమునకుఁబ్రభువైనట్టియు బౌద్ధమతస్థుఁడైన సుదారకుఁడనువాఁడీశక్తిరాజు
ను సేవింపఁ బరిత్రాణపట్టణమునకువచ్చెను - ౮౭ - ఆనేపాళదేశమునకధిపతి
యైన సుదారకుఁడనుబౌద్ధుఁడు శూద్రికునింటికివచ్చి యతనిచేత సన్మానింపఁబడి
నవాఁడై యతనికి శకునముచెప్పెను- ౮౮- మిక్కిలిభుజబలముగల యోశూ
ద్రికుఁడా నీవుశక్తిరాజునకుఁ బ్రియుడైన స్నేహితుఁడవుగదా యిఁక నారునె
లలలోపలమీకిద్దఱకువిరోధముగలుగును- ౮౯- అప్పుడునీవువైజయంతియను
నాపట్టణమునకు రావలయును- ఓమిక్కిలిబుద్ధిగలశూద్రికుడా నేనుజెప్పినశకున
ముతప్పదు-ఓయిమిక్కిలిబలముగలవాఁడా నీకునుశక్తిరాజునకునెప్పుడువిరోధ
ముకలుగుచున్నదో యప్పుడునీవుమఱియొకపట్టణమునకుబోవలదునాపట్టణము
నకురావలయును- ఇట్లతనిచేతజెప్పబడి యాశూద్రికుడు సరేయనియొప్పికొనె
నుఅంతనాబౌద్ధుఁడు శక్తిరాజుచేత సెలవీఁబడినవాఁడై తనపట్టణమునకుఁబో
యెను- ౯౨- పిమ్మటఁ గొన్నాళ్లకు మిక్కిలిబలముగలయాశక్తిరాజు శూద్రికు
నితోఁగూడ వనమునకు వేటాడబోయెను- ౯౩- ఆశక్తిరాజును శూద్రికుఁడు

ర్వం నిహత్య శ్వాపదాన్ బహూన్ । రాజా శక్తిశూద్రికశ్చ సమేయాతాం చ కుత్రచిత్ ॥ ౯౪॥ అనాసన్నబలావేకౌ తావుభౌ శక్తిశూద్రికౌ । నిఘ్నంతౌ చ బహూన్ క్రూరాన్ శ్వాపదాన్ చేరతుర్వనం ॥ ౯౫॥ తతస్సింహం మహాఘోరం సర్వశ్వాపదభీకరం । గర్జంతం పాతయామాస శూద్రికః ఖడ్గధారయా ॥ ౯౬ ॥ సహత్వా మృగరాజం తం శూద్రికశ్శక్తిభూపతేః । సింహం సంహననోపేతం నిఖాతం వ్యతరత్ప్రియాత్ ॥ ౯౭॥ సంహారజనితం శౌర్యం తస్య శక్తిర్ధాత్మనః । అవాచయత్సూతపుత్రైః పేషయిత్వా పురేస్వకే॥ ౯౮॥ పౌరాస్సర్వేపి విజ్ఞాయ స్వరాజస్య పరాక్రమం । అలంచక్రుః పురం సర్వం నృపం ప్రత్యుద్యయుశ్చ తం ॥ ౯౯ ॥ మహిషీ కేశినీశక్తేః భర్తృప్రత్యుద్గమోద్యతా । భూషాదిభిరలంకృత్య పుష్పదాగమనం ప్రతి॥ ౧౦౦॥ నిరీక్షమాణా వసరం తస్థౌ కించిత్త్వరాకులా । అథాగత్య బహూన్హారాన్పుష్పాన్పుష్పదా దదౌ॥ ౧౦౧॥ తాం సకోపా రాజపత్నీ భర్త్సయామాస పుష్పదాం । అయి దుష్టే సమాహూతా ప్యేతావత్త్వం కుతస్థితా ॥ ౧౦౨ ॥ రాజ్ఞా స్సింహప్రహర్తుస్తే ప్రతి

---

నడవియందంతటఁదిరిగి యనేకక్షుద్రమృగములనుజంపి యొకచోట నిద్దఱును జేరిరి- ౯౪- ఆశక్తిరాజునుశూద్రికుఁడును దండంతయు వెనుకఁజిక్కియున్నప్పు డనేకములయినక్రూరమృగములనుఁగొట్టుచు వనమందుసంచరించిరి- ౯౫- పిమ్మటమిక్కిలిభయంకరమై యెట్టిమృగములైనను దగ్గరఁజేరరానిదై గర్జించుచుండు సింహము నొకదాని శూద్రికుఁడు ఖడ్గము నంచుచేతఁ బడవేసెను - ౯౬ - ఆశూద్రికుఁడాసింహమునుజంపి యాఖడ్గముతోఁ గ్రుచ్చియెత్తి ప్రియమువలనరాజునకిచ్చెను-౯౭- అంతనాశక్తిసూతపుత్రులనుబంపి యాసింహమును దానుజంపినట్లు తనపట్టణమున దండోరావేయించెను- ౯౮- అట్లుదండోరావేయుటనువినిపట్టణమందుంగుజనులందఱు నాపట్టణమునలంకరించి రాజునకెదురై వచ్చిరి- ౯౯- శక్తిరాజునకుఁ బట్టపుదేవియయినకేశిని తనభర్తకెదురుగాఁ బోనుద్యుక్తురాలై సొమ్ములుమొదలగువానితో నలంకారముచేశికొని పువ్వులనిచ్చుదానిరాకను నిరీక్షణముసేయుచుఁ ద్వరతోఁగూడినదై కొంతసేపుండెను పిమ్మటనాపువ్వులనిచ్చునదివచ్చియనేకములైనపువ్వులదండలనిచ్చెను-౧౦౧- రాజుభార్య కోపముతోఁగూడినదై యాపువ్వులనిచ్చునదానిబెదిరించెను- ఓసి దుర్మార్గురాలా యింతసేపు పిలిపించిననురాక నీవెక్కడికిఁబోతివి- సింహమును గొట్టినరాజునకెదురుగా నేనుబోవలసిన సమాచారము నీకుఁ దెలియదాయేమి అని యారీతినిఁజెప్పుచున్న యారాజభార్యనుఁగూర్చి యాపె మెగతాళితోఁ గూడినట్లుత్తరము చెప్పెను - ౧౦౩ - ఓరాజు పెండ్లామా చాలును నిలుపుము

యానం నవేత్సికిం । ఇతిబ్రువాణాం రాజ్ఞీం తాం సాపహాసం జగాదసా॥ ౧౦౩॥ అలంవిరమభోరాజ్ఞి విజ్ఞాతమఖిలంమయా । సత్యంతవపతిస్సింహంనిహన్యాద్యది కేశిని॥ ౧౦౪॥ పునరస్తు విలేపస్తే తూష్ణీమేవ మదర్పితః । వక్ష్యామి శృణువృత్తాంతం వనే సింహస్య సంహృతేః॥ ౧౦౫॥ హత్వా సింహం శూద్రికస్తే నిఖాతం ప్రేయసేదదా । మమభర్తాగతస్తత్ర పుష్పాపచయహేతునా॥ ౧౦౬॥ దృష్ట్వాసర్వం తదధునా మమాకథయదాదరాత్ । తతస్త్వయానతిక్రాంత స్సమయోద్యవరాననే ॥ ౧౦౭ ॥ ఇత్యుక్త్వా పుష్పదారాజ్ఞ్యా ప్రేషితా స్వగృహం యయౌ । మహిషీ కేశినీశక్తేరాగతం స్వపతింతతః॥ ౧౦౮॥ అకృత్వాస్వాభిగమనంవర్తతేస్నానమందిరే । తతోరాజాపురం శక్తిర్బహుమానేనసంవృతః॥ ౧౦౯॥ మహిష్యానాభిగమనం చింతయన్ప్రవివేశహ । పప్రచ్ఛ నాభిగమనం రాజాస్వ మహిషీం తతః॥ ౧౧౦॥ సా పృష్టా కృత్రిమం సింహసంహార జపరాక్రమం । సర్వముక్త్వా స్వభర్తారం ప్రణినింద భృశం ద్విజాః॥ ౧౧౧॥ సశక్తిర్లజ్జితస్తేనాహ్వాయిత్వాశూద్రికంతతః । అవిచార్యాబ్రవీత్క్రుద్ధఇతీదంవచనం

నాకుయావత్సంగతియుఁదెలియును - ఓ కేశిని యథార్థముగా నీపెనిమిటి సింహమునుఁజంపెనా నేనువెలదీసికోకయే యింకొకమాఱు నీకుఁ బుష్పహారములనుదెచ్చియిచ్చెదను-వనమందుసింహముచావు సమాచారమునుఁజెప్పెదనువినుము - శూద్రికుఁడుసింహమునుజంపి ఖడ్గమునఁగ్రుచ్చి నీప్రియుఁడైనరాజుకొలకిచ్చెను - పుష్పలగోయనచ్చటికిఁబోయిన నాపెనిమిటి యాసమాచారమునుయావత్తుచూచివచ్చి ప్రీతివలన నాకుఁజెప్పెను- కాఁబట్టియింతకాలమైనదమ్మాసుందరమైనముఖముగల కేశిని- ౧౦౭- అనియిట్లుచెప్పి యాపుష్పలనిచ్చునది రాజభార్యచేత సెలవుదీసికొని తనయింటికిఁబోయెను - పిమ్మట నాశక్తిరాజు భార్యయయిన యాకేశిని తనపెనిమిటిరాఁగానే యతనికెదురుగాఁబోకస్నానగృహమందుండెను- అంతబహుమానముతోఁగూడినవాఁడై యాశక్తిరాజుతనపట్టణమునుఁజొచ్చునపుడుతనభార్యయేలయెదురుగారాకున్నదోయనిచింతించుచుఁ బట్టణమునుఁబ్రవేశించెను- పిమ్మటనతఁడుతనభార్యనునీవేలనాకెదురుగా రాలేదనియడిగెను- ౧౧౦- ఇట్లుపెనిమిటిచేత నడుగఁబడిన యాకేశినిసింహమును మఱియొకఁడుచంపఁగా నాపరాక్రమము తనదిగా రాజుప్రసిద్ధిచేసికొన్న విధమునుఁజెప్పి యతని మిక్కిలి నిందించెనోయి బ్రాహ్మణులారా - ౧౧౧ - ఆశక్తిరాజు దానిచేతసిగ్గుపడినవాఁడై యంత శూద్రికునిఁబిలిపించి విచారింపకయే కోపగించుకొన్నవాఁడై యిట్లనిచెప్పెనోయి బ్రాహ్మణులారా- ౧౧౨- ఓరిశూద్రికుఁడా దుష్టుఁడా నిన్ను స్నేహితుఁడని యెట్లుతలవవచ్చును-

ద్విజాః॥ ౧౧౨॥ అయిశూద్రికమన్యేత సఖాయం త్వాం కథం ఖలు । మమప
త్న్యాశ్చతేపాప సమయో స్తి నసంశయః ॥ ౧౧౩ ॥ భవానే వావద త్తస్యై
సింహసంహారవిక్రమం । త్వయాను క్తేతు తత్సర్వం విజ్ఞాయేత కథం తయా॥
౧౧౪॥ పూర్వేద్యు ర్మమజాయాయా ఉక్త్వా సర్వమిదం భవాన్ । మాం
హ్రేపయిష్యన్న శ్వేషు జనేషుకృతవానిదం ॥ ౧౧౫ ॥ అన్యోన్యం యువయో
స్స్నేహో భవత్యేవనసంశయః । యతస్సఖానహంతవ్య స్తతో వ్రజపురాన్మమ॥
౧౧౬ ॥ ఇత్యుక్త్వా శూద్రికంశక్తి శ్చ్యావయామాసకింకరైః । సతతశ్చ్యావి
త స్తేన నిర్దోష శ్శూద్రికోద్విజాః॥ ౧౧౭॥ మాత్సర్యపూరితశ్శూరో వైజయం
తీపురంయయౌ । సుదారకోపిభూపాలశ్శూద్రికంతం మహాబలం॥ ౧౧౮॥ ఉప
చారా న్ప్రకుర్వాణో స్థాపయ త్ప్రీతిపూర్వకం । మాత్సర్యం శూద్రికశ్శక్తౌ
స్మరన్ దతవమాసతః॥ ౧౧౯॥ సుదారకేణసహితో మంత్ర యిత్వా మునాస
హ । చతురంగబలోపేత శ్శూద్రికోమితవిక్రమః॥ ౧౨౦॥ శక్తినా యోద్ధుకా
మోస్య రురోధపురమా త్తరుట్ । తతశ్శక్తి సమాలోచ్య మంత్రిభిస్సహబుద్ధి
మాన్ ॥ ౧౨౧॥ అశక్తో యోద్ధుమమునా శూద్రికేణ మహౌజసా । ఆహ్వాయా
మాససచివం కాలసేనం మహామతిం ॥ ౧౨౨ ॥ తేనాహూతః కాలసేనః శక్తి

---

ఓరిపాపాత్ముఁడా నాభార్యకును నీకును సంకేతమున్నది సందేహము లేదు -
౧౧౩ - నీవేయాపెకొఱకు సింహమునుజంపిన పరాక్రమమునుఁజెప్పితివి- నీవు
చెప్పనిపక్షమందదియంతయు నాపెచేత నెట్లు తెలియఁబడును- ౧౧౪- ముం
దుదినముదీనినంతనునాపెండ్లాముతోఁజెప్పి నీవునన్ను నెల్లజనులయందుసిగ్గుప
ఱుపవలయునని యిట్లుచేసితివి- ౧౧౫. మీయిద్దఱికొకరిమీఁదనొకరికిఁబ్రీతియు
న్నదిసందేహములేదు - స్నేహితుఁడవుగనుక నిన్నుఁజంపరాదు- కాఁబట్టినా
పట్టణమునువిడిచిపొమ్ము- ౧౧౬- ఇట్లుచెప్పి యాశక్తిరాజు శూద్రికుని బంట్రౌ
తులచేత నెట్టించెను - తప్పులేని యాశూద్రికుఁడతనిచేత నెట్టింపబడినవాఁడై
శూరుఁడుగనుక మచ్చరముగలవాఁడై వైజయంతీపురమునకుఁబోయెనోయి
బ్రాహ్మణులారా - అంతనాసుదారకరాజు మిక్కిలిబలశాలియగు నాశూద్రకు
నకు సకలోపచారములుసేయుచుఁ బ్రీతితోఁ దనపట్టణమందు నిలిపెను - శక్తి
చేతనవమానపఱుపఁబడినయాశూద్రికుఁడు శక్తియందుమాత్సర్యమును మఱు
వక యాసుదారకునితోఁగూడుకొన్నవాఁడై యాలోచనచేసి చతురంగసేనతో
గూడుకొనిమితిలేని పరాక్రమముగలయాశూద్రికుఁడు శక్తితో యుద్ధముచేయ
నిచ్ఛగలవాఁడై కోపమునుబొంది యతనిపట్టణమునడ్డగించెను- పిమ్మట బుద్ధి
మంతుఁడైన యా శక్తిమంత్రులతోడ నాలోచించి మిక్కిలిపరాక్రమముగల

నోపకృతేతతః। రథపత్త్యశ్వమాతంగై ర్బహుభిః స్సంవృతోముదా॥ ౧౨౩॥
పరిత్రాణముపాగచ్ఛ ద్యుద్ధకాంక్షీ మహాబలః। తస్యా గమనమాజ్ఞాయ కాళ
సేనస్య భూపతేః॥ ౧౨౪॥ శూద్రికస్తు విత్రాస తేనయోద్ధుం తతోద్విజాః।
సుదారకశ్శూద్రికోపి చింతయా మాసతు స్తతః॥ ౧౨౫॥ కథం కాళం విజేష్యా
మో మహాబలపరాక్రమం। కథం సహా మహేయుద్ధే సపుత్రం శక్తిసంయుతం॥
౧౨౬॥ ఏవం చింతయతో స్తత్ర తదాశూద్రికబౌద్ధయోః। వ్యశ్రూయతాశరీ
రావాగ్ద్వ వయోగేనభూసురాః॥ ౧౨౭॥ మాభైష్టకాలసేనస్య శ్రూయతాం
వచనంమమ। సహ్యాపచపుటోనామ్నా బౌద్ధో ద్రావర్తతేబలీ॥ ౧౨౮॥
సమాంత్రికశ్చమాయావీ దక్షఃకాళేనసంగరే। తమానయధ్వంసహసా జయ
స్తేనభవిష్యతి॥ ౧౨౯॥ ఇత్యాకాశగిరం శ్రుత్వా శూద్రికోహర్షపూరితః। స
హ్యాంగత్వా ప్రార్థయిత్వాతం జైనం వినయేనసః॥ ౧౩౦॥ తేనసాకం శక్తిపురం
పరిత్రాణమథాగమత్। తతఃపంచపుటోరాత్రౌమాయావీపటువిక్రమః॥ ౧౩౧॥

---

యీశూద్రికునితోయుద్ధముచేయ శత్రుండుకాండు గనుక మిక్కిలిబుద్ధిశాలియ యినమంత్రియగు కాలసేనునింబిలిపించెను- ౧౨౩- ఆశక్తిచేతం దనకుపకారముచేయంబిలువంబడినవాండై యీకాలసేను డు సంతోషముతోం దేరులచేతనుగాలుబలముచేతనుగుఱ్ఱములచేతనేనుగులచేతనుబరివేష్టింపంబడినవాండై యుద్ధమునుగోరినవాండై పరిత్రాణపట్టణమునకువచ్చెను - ఆకాలసేనరాజు రాకనువిని యీశూద్రికుండతనితో యుద్ధముచేయను భయపడెనోయి బ్రాహ్మణులారా - అంతనాసుదారకుండును శూద్రికుండునాలోచించిరి- ౧౨౫- మిక్కిలి బలమునుబరాక్రమమునుగలకాళునినెట్లుజయింపంగలము- పుత్రునితోనుశక్తి రాజుతోనుగూడుకొన్న కాళునెట్లు యుద్ధమందుసహింతుము- ౧౨౬- ఇట్లువిచారపడుచున్న యీశూద్రికునకునుబౌద్ధునకు నప్పుడక్కడ దైవవశమువలన నశరీరవాక్కు వినంబడెనోయి బ్రాహ్మణులారా- ౧౨౭- కాళసేనునకు భయపడవలదునామాటవినుండు - సహ్యాపర్వతమందుబలవంతుడైన పంచపుటుండనుబౌద్ధుండున్నాండు- ౧౨౮ - అతండు మంత్రములం దెలిసినవాండును మాయలునేర్చినవాండును గాలునితోడి యుద్ధమందు సమర్థుండు శీఘ్రముగా నతనిం బిలుపింపుండతనిచేతజయముకలుగంగలదు- ౧౨౯- ఇట్లని యీకాశవాక్కు కలుగంగాదానివినియీశూద్రికుండు సంతోషభరితుండై సహ్యాపర్వతమునకు బోయివినయముతోనాబౌద్ధునిం బ్రార్థించియంతనతనితోంగూడశక్తిపురమునకువచ్చెను - పిమ్మట మాయలుగలయట్టియు మంచి పరాక్రమముగలయట్టి యీపంచపుటుండు రాత్రియందుం గాలసేనునకుం బూర్వముశివునిచేతనీంబడిన

కాళసేనస్యాయుధాని శివదత్తానిపూర్వతః । అపహృత్యాగతస్సర్వే సంతుష్టా
శ్శూద్రికాదయః॥ ౧౩౨॥ తతస్సమ భవద్యుద్ధం శక్తిశూద్రికయోర్మహత్ ।
కాళసేనఃపంచపుటో యుయుధాతే పరస్పరం ॥ ౧౩౩ ॥ అన్యోన్య మభ్యధా
వేతాం రూపసేనస్సుదారకః । శక్తిశ్చశూద్రికోరాజా జఘ్నతుశ్చ పరస్పరం॥
౧౩౪॥ సింహావివనేదృష్టౌ శరదంష్ట్రౌమహాబలౌ । తేషాం షణ్ణాం మహాఘో
రం శూరాణామభవద్రణం ॥ ౧౩౫ ॥ యోధాశ్చ బహవస్తత్ర హతాయుద్ధే
జయేషిణః । మమ్రుర్గతాశ్చరథినో నిహతా బహుళాహయాః॥ ౧౩౬॥ వీత
దివ్యాయుధః కాళసేనః పంచపుటేనసః । విక్రమ్యత్యాజితోదేహం కృత్వా
కర్మసుదుష్కరం॥ ౧౩౭॥ రూపసేనస్తతస్పుత్ర శోకక్రోధ సమన్వితః । అభి
ద్రుత్య ప్రబవీద్వాక్యం తతఃపంచ పుటం బలీ॥ ౧౩౮॥ అతేదురాత్మన్ జేతవ్యం
చౌర్యేణకిముకర్మణా । కాళసేనస్యాయుధాని పితుస్సర్వాణ్యపాహరః॥ ౧౩౯॥
క్వగమిష్యసిలగ్నోసిమిషుణాంతిష్ఠమమాగ్రతః । మత్సాయకైర్వజ్రతుల్యైర్భి
త్వామర్మాణితేదునా ॥ ౧౪౦ ॥ ప్రాణానుత్పాట్య వేగేన నేష్యామి యమసాద

---

యాయుధములనెల్ల నపహరించుకొనివచ్చెను - దానిచేతనాశూద్రికుఁడు మొ
దలగువారందఱు సంతోషించిరి- ౧౩౨- పిమ్మట శక్తికిని శూద్రికునకును గొ
ప్పజగడమాయెను- కాలసేనుఁడును బంచపుటుఁడు నొండొరులుపోరిరి- ౧౩౩-
రూపసేనుఁడును సుదారకుఁడు నొకరినొకరెదిరించితరిమిరి - శక్తిరాజును శూ
ద్రికుఁడు నొకరినొకరు కొట్టుకొనిరి- ౧౩౪- వారిద్దఱు కొట్టుకొనునపు డడవి
యందుఁ గోపగించిన మిక్కిలిబలముగల రెండు సింహములవలెనుండిరి వారి
బాణములు సింహముల కోరలవలె నుండెను - శూరులైన యాయారుగురికి
మిక్కిలిభయంకరమైనయుద్ధమాయెను- ౧౩౫- ఆయుద్ధమందనేకులు యోధు
లుజయమునుగోరినవారై చచ్చిరి- రథికులునుబరుగెత్తిరి గుఱ్ఱములు పెక్కులు
చచ్చినవి - ౧౩౬ - పంచపుటునిచేత నపహరింపఁబడిన దివ్యములయిన యా
యుధములుగల యాకాలసేనుఁడు పరాక్రమించి యసాధ్యమైన కార్యము
చేసి పిమ్మట దేహమునువిడిచెను - ౧౩౭ - అతని కొడుకయిన బలవంతుఁడగు
రూపసేనుఁడు దుఃఖముతోను గోపముతోనుగూడినవాఁడై యంతటబంచపు
టునెదురించి యిట్లనిపలికెను - ఓరిదుర్మార్గుఁడా దొంగతనముచేతనా జయింపవ
లయును - నాతండ్రియైనకాలసేనునియాయుధములనెల్లదొంగిలితివి - ఎక్కడఁ
బోఁగలవు చిక్కితివి నిమిషమునాయెదుటనిలువుము- ఇప్పుడువజ్రాయుధముల
కుసరియైన నాబాణములచేత నీమర్మములను భేదించి శీఘ్రముగాఁబ్రాణముల
బెల్లగించియమునింటికిఁ బంపెదను - ఇట్లురూపసేనునిచేతఁ జెప్పబడి యంతనా

నం । ఇత్యుక్తో రూపసేనేన క్రుద్ధః పంచపుట స్తతః॥ ౧౪౧॥ రూపసేనం రణశ్లా
ఘీ శరవర్షైరవాకిరత్ । సచ్ఛాద్యమానస్సమరై రూపసేనోంబకవ్రజైః॥
౧౪౨॥ సం నివార్యక్షణేనైవం కృత్వా విరథమాహవే । క్షురప్రేణసుతీక్ష్ణేన
పూర్ణకృష్టేనసత్వరం॥ ౧౪౩॥ సకుండలం తద్బాద్ధస్య శిరఃకాయాదపాతయత్॥
హత్వాతం పితృహంతారం రూపఃపంచపుటంబలీ॥ ౧౪౪॥ విశోకో ద్రావయా
మాస తతఃప్రతిబలం బలీ । శూద్రికస్తు మహాశూరశ్శక్తిం హత్వా రణాజిరే॥
౧౪౫॥ తత్సేనాంద్రావయామాసవృత్రమింద్రఇవాసురీం। శక్తింహత్వాశూద్రి
కోపి స్వావమానస్యకారణం॥ ౧౪౬॥ తత్పుత్రం చిత్రవర్మాణ మభిషిచ్య తదాస
నే । రూపస్యహస్తే విన్యస్య వై జయంతీపురం యయౌ॥ ౧౪౭॥ రూపసేనో
మహాబాహుశ్చిత్రవర్మ కృతేతతః । పరిత్రాణ పురేస్థిత్వా కంచిత్కాలం మహా
మతిః॥ ౧౪౮॥ ఆమోదపురమాసాద్య పైతృకం ప్రాప్యచాసనం। భ్రాతృభిస్స
హధర్మాత్మా పాలయామాసమేదినీం॥ ౧౪౯॥ దేవాంగవంశజా ఏతే కాళసే
నతనూభవాః । వ్యవర్ధంత భృశం లోకే సముద్రస్యేవవీచయః॥ ౧౫౦॥ కా
ళసేన తనూజానా మృషికల్పిత కర్మణాం । తేషాం ద్వ్యధి దశాంతేన గో

---

పంచపుటుఁడు కోపగించుకొన్నవాడై యుద్ధమును శ్లాఘించువాడై రూపసే
నుని బాణవర్షములచేతముంచెను - ఆరూపసేనుఁడు యుద్ధమందు బాణసమూ
హములచేతఁ గప్పఁబడుచు క్షణములోవానినెల్ల దొలఁగించుకొని యుద్ధమం
దతని రథములేనివానిఁగాఁజేసి మిక్కిలి చురుకైనకత్తినిఁ జక్కఁగా నీడ్చివి
డిచిత్వరితముగాఁగుండలములతోఁగూడియున్న యాబొద్దునితలనతనిశరీరము
వలననుండిపడవైచెను - బలవంతుడైన యారూపసేనుఁడు దనతండ్రినిజంపిన
యాపంచపుటునిఁజంపి యింద్రుఁడు వృత్రాసురునిజంపి రాక్షసులసేననుదరిమి
నట్లుతని సేననుదరిమెను - శూద్రికుఁడు తన్నవమానపఱిచిన యాశక్తినిజంపి
యతనికొడుకగు చిత్రవర్మనతనిసింహాసనమందుఁ బ్రభువుగాఁ బట్టాభిషేకము
చేసి రూపసేనునిచేత నప్పగించి తానువై జయంతీ పట్టణమునకుఁ బోయెను -
౧౪౭- మిక్కిలి భుజబలముగలయట్టియు నధికమైనబుద్ధిగలయట్టి యారూప
సేనుఁడు చిత్రవర్మనిమిత్తము కొన్నాళ్లు పరిత్రాణ పట్టణమందుండి యంత నా
మోదపట్టణమునకుఁబోయి తండ్రిసింహాసనమునుబొంది ధర్మబుద్ధిగలవాఁడై
తమ్ములతో భూమినిబాలించెను - ౧౪౯ - ఈకాళసేనునికొడుకులందఱు నీప్ర
కారము దేవాంగవంశమందు జన్మించినవారై సముద్రముయొక్క యలలవ
లెభూమియందు మిక్కిలి వృద్ధిబొందిరి- ౧౫౦- ఋషులచేత నుపనయనము
చేయఁబడిన యాకాళసేనునికొడుకుల గోత్రములు మొదట నూటరెండై లె

త్రాణిగణితానిచ॥ ౧౫౧॥ తేషాం సంఖ్యా సహస్రంస్యా త్పునఃపంచశతోత్త రం । పంచాశదుత్తరశతత్రి సహస్రిగేహా దేవాంగవంశ భవకాశితనూభవానాం । స్వైర్వైష్ణవాస్సురమునీంద్ర కృతోపదేశా శ్శైవాభవేయురఖిలాః పరిశుద్ధశైవాః॥ ౧౫౨॥ శ్రీసూతః॥ ఇదం వస్సర్వమాఖ్యాతం పవిత్రం పాపనాశనం । చారిత్రం పరమం రమ్యం దేవాంగ స్యామితౌజసః॥ ౧౫౩॥ యఇదం శ్రుణుయాన్నిత్యం శ్రావయేద్వాసమాహితః । సిధ్యంతిసర్వ కార్యాణి దీర్ఘమాయుశ్చవర్ధతే॥ ౧౫౪॥ పౌరాణికం సమభ్యర్చ్య శ్రుణుయాదాదరాదిదం । సర్వకామాంశ్చలభతే మహాదేవ ప్రసాదతః॥ ౧౫౫ ॥ యస్తుకౌశేయకం సూత్రం పుస్తకాయదదాతిచ । విమలజ్ఞాన సంపన్నో బ్రహ్మలోకే మహీయతే ॥ ౧౫౬॥ ఇదం పవిత్రం పరమం పురాణం దేవాంగనామ్నీశశిఖామణేర్యః। శ్రుణోతిచారిత్ర ముమాప్రసాదా త్ప్రాప్నోతి సర్వాణి సవాంఛితాని॥ ౧౫౭॥ ఇతీరితం పుణ్యమిదం పురాణంబ్రహ్మాండజం దేవలనామవృత్తం। తేవ్యాసశిష్యేననిశమ్యసర్వే హృష్యన్ద్విజేంద్రా బహుశౌనకాద్యాః॥౧౫౮॥ఇతిశ్రీబ్రహ్మాండపురాణే-సూతశౌనకాదిసంవాదే- దేవాంగవంశకథనంనామ - నవింశోధ్యాయః.

---

క్కింపఁబడినవి- ౧౫౧- పిమ్మట వారిసంఖ్యవేయును నేనూరారాయెను - మూఁడులక్షలయేఁబదివేల యిండ్లవాండ్రగు నీకాశునివలన జన్మించిన దేవాంగవంశమువారిలోనారదమునిచేత నుపదేశముచేయఁబడినవారు వైష్ణవులగుదురు తక్కినవారందఱును బరిశుద్ధులైన శైవులై యుందురు- ౧౫౨- అనిసూతుఁడా ఋషులకుఁజెప్పి వారితోమరల నిట్లనియె- మిక్కిలి తేజోవంతుఁడగు దేవాంగునిచరితమునంతను మీకుసవిస్తరముగాఁ జెప్పితి నిది పరిశుద్ధము పాపములఁ బోఁగొట్టునట్టిది శ్రేష్ఠమైనది సొగసైనది- ౧౫౩- ఎవఁడు ప్రతిదినమునియమముగలవాఁడై దీనివినునో - వినుపించునో - వాని కన్ని కార్యములు కూడివచ్చునాయుప్పువెరుగును - ౧౫౪ - ఎవఁడీ పుస్తకమునకుఁ బట్టుత్రాటినిచ్చునో యతఁడు నిర్మలమైన జ్ఞానముగలవాఁడై బ్రహ్మలోకమందు సన్మానింపఁబడును దేవాంగమహర్షి శ్రేష్ఠుని యీపరిశుద్ధమైయున్న పురాణకథ నెవఁడు వినుచున్నాఁడో వాఁడు పార్వతీయనుగ్రహమువలనఁ గోరికలనెల్లఁబొందును- ౧౫౭- బ్రహ్మాండపురాణములోనిదైన మిక్కిలి పుణ్యకరమైన యనాదియైన యీదేవలమునికథను వ్యాసులశిష్యుఁడగు సూతుఁడు చెప్పఁగా నాశౌనకాదిమహామునులువిని మిక్కిలిసంతోషించిరి- ౧౫౮- ఇది బ్రహ్మాండపురాణంబునసూతశౌనకాది సంవాదంబున దేవాంగవంశ కథనమన్నది యిరువదితొమ్మిదవ యధ్యాయము.

దేవాంగపురాణము సంపూర్ణము.